# కాశీ మజిలీ కథలు

## 7 & 8వ భాగములు

(ఒకే సంపుటముగా)

ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

**బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే**

రచించబడినది

సరళ సుందర వచనం

**శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం**


© 2473444

**రోహిణి పబ్లికేషన్స్**

పాత కూరగాయల మార్కెట్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 533 101

# కాశీ మజిలీ కథలు

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం



ప్రథమ ముద్రణ :
జనవరి, 2005

"పురుషులలో
పుణ్యపురుషులు వేరయా"
అన్నట్లే పుస్తకాలలో కూడా
పుణ్యం - పురుషార్థం కలిగించే
పుస్తకాలు వేరే వుంటాయి.
అటువంటి పుస్తకాల ప్రచురణే
ధ్యేయంగా నడుస్తున్న సంస్థ
మా
రోహిణి పబ్లికేషన్స్

సాధారణ ప్రతి
రూ : 125/-

లైబ్రరీ ప్రతి
రూ: 200/-



ప్రకాశకులు :
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

ముద్రణ: స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3. ఫోన్స్: 2578211, 2572832

# నాటికి - నేడు

**శ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవి** విరచిత **"కాశీమజిలీ కథలు"** చదవని పాఠకులు అరుదుగా వుంటారు. వ్యాకరణ సమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణంగా, పఠితలకు పరవోత్సాహం కలగచేసేటట్లు, పూర్తిగా చదివిన తర్వాత వెంటనే మర్చిపోకుండా గుర్తుండేలా వ్రాయగల సమర్ధుడు శ్రీ సుబ్బన్న దీక్షితులు. ఆనాటి **కాశీమజిలీ కథల** సంపుటాల్లో రచయిత కథాకథన శైలినీ, వ్యాకరణాలంకారశాస్త్ర పాండిత్యాన్నీ కొనియాడుతూ, వాగ్దేవీ నందనులైన శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శతావధాని శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శ్రీ మానవల్లి రామకృష్ణ కవి తమ తమ అమూల్య అభిప్రాయాలను తెలియజేసారు.

ఆ రోజుల్లో కావ్య భాషలో రచన చెయ్యగలిగిన వారికే కవిశబ్ద గౌరవం. ఆ విధంగా సంఘంలో కవిగా గౌరవింపబడాలంటే రచయిత తప్పనిసరిగా శబ్దగాంభీర్యాన్ని ఆశ్రయించవలసి వచ్చేది. తత్కారణంగా ఎంత సామాన్యమైన కథని వ్రాయాలన్నా గ్రాంధికాంధ్రాన్ని ఆశ్రయించే వాళ్ళు ఆనాటి రచయితలు.

కాని రోజులు మారాయి, కాలంమారింది, సంఘంపట్ల రచయితల అభిప్రాయం మారింది. ఇప్పుడు అందరు రచయితలూ వాడుక భాషలోనే తమ భావాల్ని వ్యక్త పరుస్తున్నారు. అయితే రచన ఎల్లప్పుడూ ఆలోచనామృతమేకాని సంగీతంలా ఆపాతమధురం కాదు. రచన మాటల్లో వుండదు. మాటల కూర్పులోనే వుంటుంది అంటారు పేరుమోసిన రచయితలు.

అరటిపండుని సులువుగా నోట్లో వేసుకోవచ్చు. కాని పనసతొనని సాధించుకోవడంలో ఎంతో శ్రమ వుంది. ఇంకా ఆధునికంగా చెప్పాలంటే - పాతకాలంనాటి మోటు నగల్ని చెరిపించి, నాజూకైన నగల్ని చేయించుకున్నట్లే మేంకూడా **కాశీమజిలీ కథల్ని** నేటి కాలపు వాడుక భాషలోనికి పరివర్తన చేసి పెట్టమని **శ్రీఇచ్ఛాపురపు రామచంద్రం** గారిని కోరాం. వారుకూడా ఎంతో ఉత్సాహంగా మా ప్రతిపాదనని అంగీకరించారు. వెనువెంటనే కార్యరంగంలోకిదూకారు. తత్ఫలితమే వాడుక భాషలో **"కాశీమజిలీ కథలు"** మీ ముందుకు వచ్చి నిల్చాయి. మీరు ఏమాత్రం శ్రమపడకుండా ఈ **"కాశీమజిలీ కథల్ని"** అరటి పండు తిన్నంత సులువుగా చదువుకుంటూ సాగిపోతారు.

మహాకవి కాళిదాసు కావ్యాలకు సంజీవనీ వ్యాఖ్యనం వ్రాసిన మల్లినాథసూరి అంటారు - **"నా మూలం లిఖ్యతేకించిత్త"**ని. తత్సమానంగానే శ్రీ రామచంద్రంగారు కూడా! ఏది ఎలా వున్నా ఏకదేశ వికృత న్యాయాన్ని అనుసరించి ఆనాటి **కాశీమజిలీ కథలే** నేటి ఈ **కాశీమజిలీ కథలు**. రసజ్ఞ పాఠకులైన మీరు మా శ్రమకు పట్టివర్ధనాలు దిద్దుతారనే మా విశ్వాసమూ, ఆకాంక్షా.

ప్రకాశకులు.

# కథల వెనుక కథ

మిత్రులూ, రోహిణి పబ్లికేషన్స్ అధినేతా, శ్రీ అప్పారావు గారు మధిర సుబ్బన్న దీక్షితకవి విరచిత కాశీ మజిలీ కథలకు నేటి పాఠకులకు తేలికగా అర్ధమయ్యే రూపం ఇవ్వవలసిన గురుతర బాధ్యతని నామీద ఉంచినప్పుడు నేను కొంచెం భయపడ్డాను. ఎందుకంటే-స్వతంత్రంగా కథో నవలో రాయడం వేరు, సుప్రసిద్ధ రచనని సరళతరం చేసి తిరుగ రాయడం వేరు-కాశీ మజిలీ కథలలాటి ప్రఖ్యాత రచనను ఆధునిక రూపంలోకి మార్చడం-నా బోటివానికి కత్తిమీద సామే.

భాషాపరంగా క్లిష్టం. రాశిపరంగా చాల పెద్దది. పురాణాలు, చరిత్ర, భూగోళం, ఖగోళ శాస్త్రం, వేదాంతం... తత్వం, వైరాగ్యం.. శృంగారం,ప్రేమ కామం...భక్తి... ఎన్నిటిని స్పర్శించారో మధిర సుబ్బన్న దీక్షితకవి తమ రచనలో! అద్భుతమైన కల్పన... అమోఘమైన కథా శిల్పం. ఏ దృష్టితో చూసినా "కాశీ మజిలీ కథలు" అనర్ఘరత్నమే. అలాంటి రచనని ప్రస్తుత పాఠకులకు-వేగంగా కథను పరుగెత్తిస్తూ మూలానికి ద్రోహం జరగకుండా తిరిగి రాయగలనా! అని నేను ఆలోచిస్తున్న సమయంలో....

నా రచనల వెనకే నా జీవితంతో పాటే ఉండే నా నిరంతర సన్నిహితులు శ్రీ జి. రంగబాబుగారు "మీరు రాయగలరు. కచ్చితంగా రాయగలరు." అని ఆత్మవిశ్వాసం కలిగించారు.

" మీకు ఏ పుస్తకాలు ఎప్పుడు తెచ్చియిమ్మంటే అప్పుడే తెచ్చియిచ్చేపూచీనాది. గురువుగారూ! కాశీ మజిలీ కథల తిరుగ రాతకి వేగంగా శ్రీకారం చుట్టండి-"అని ధైర్యం చెప్పి తొందర చేశారు శ్రీ యిమ్మిడి శెట్టి చక్రపాణి (లెక్చరర్) గారు.

" మీరు రాయగలరండీ.....రాస్తారు" అని ఎనభై దాటిన శ్రీగణపతిరాజు చంద్ర శేఖరరాజు (అడ్వకేట్) గారు వెన్నుతట్టి ఆశీర్వదించారు. ఒక్కసారి మానాన్న గారూ, తెలుగు పండితులూ అయిన కీ.శే. ఇచ్ఛాపురపు వైద్యనాధంగారిని ఒక్కమారు తలుచుకున్నాను. అంతే పన్నెండు భాగాలు పన్నెండు నెలలలో తిరిగి రాయగలిగాను.

ఈ గ్రంథమునకు సరళ సుందర వచనముకు సహకరించిన శ్రీ పానుగంటి కృష్ణరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

వ్రాశాక అర్థమైంది నేనెంత మంచిపనిచేశానో! ఈ కథలు శ్రద్ధగా చదువుతూ రాయడం వలన ఎన్నెన్ని విషయాలు తెలిశాయని! ఎంతగా కథా కథనకౌశలం అర్థమైందని! కల్పనాచాతుర్యం ఎంతగా చూడగలిగానని !

అంతే కాదు. నాపట్టుదలమీదా, ఓపిక మీదా నాకు విశ్వాసం కలిగించింది ఈ ప్రక్రియ. ఇతరుల రచనలను కూడా నేటి పఠితలకు అనుకూలంగాను మార్చగలనని నమ్మకం కలిగించిందీ మహత్తర కార్యం. ఈ రచన వెనుక ఎందరో మహానుభావులున్నారు అందరికీ నా మన: పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

ఇచ్ఛాపురపు రామచంద్రరావు

# కాశీ మజిలీ కథలు

ఏడవ భాగము

# విషయ సూచిక

94 వ మజిలీ నుండి - 135 వ మజిలీ వరకు

ఎనిమిదవ భాగము

# విషయ సూచిక

136 వ మజిలీ నుండి - 165 వ మజిలీ వరకు

# కాశీ మజిలీ కథలు

## 7. వ భాగం

## 94. వ మజిలీ

కం. శ్రీ కాశీనగరాధీ
 శాకారుణ్యాంబుధీ నిశాకరవరలే
ఖాకల్ప భక్త కల్ప శు
 భాకార గౌరీశ పాపహర విశ్వేశా.

మణిసిద్ధుడు కార్యకలాపాలను పూర్తిచేసుకుని, ఊళ్లో కెళ్ళి విశేషాలు చూసొస్తానన్న శిష్యుడి కోసం ఎదురు చూస్తూంటే గోపాలుడు రానేవచ్చాడు. పరుగు పరుగున వస్తూనే అతని పాదాలమీద పడి - "గురువుగారూ! ఒకనాడు పండితరాయలు లవంగితో గంగలో ఐక్యమై పూర్వ దేహం ధరించాడని చెప్పారు. వారి పూర్వవృత్తాంత మేమిటని నేనడిగితే - 'ఇప్పుడు చెప్పడానికి వీలులేదు. శివాలయం కనపడిన చోట చెప్పు. దానికి అలాటి కారణముంది." అన్నారు. అలాటి శివాలయం ఇక్కడుంది. పంచముఖాలు కలిగిన ఆ దేవుణ్ని ఆరాధించి వచ్చాను. అందుచేత పండితరాయల వృత్తాంతం చెప్పి తీరవలసిందే." అని బతిమాలాడు. మణిసిద్ధుడు చిరునవ్వు నవ్వి, మణిని ప్రార్థించి - "వత్సా! కృతజ్ఞతాగుణం వలన కలిగే సుకృతమూ, భీష్ముడి వృత్తాంతమూ చక్కగా తెలుస్తాయి. జాగ్రత్తగా విను" అని ప్రారంభించాడు.

# జితవతి కథ

ప్రసిద్ధి చెందిన విశాలపురాన్ని ఉశీనరుడనే మహారాజు పరిపాలించేవాడు. అతనికి జితవతి అనే కూతురుండేది. ఆమె సౌందర్యఖని, సుగుణలరాశి, కళకు నిలయం. ఆమె అన్నివిధాలా అత్యధికురాలు.

ఒకవెన్నెల రాత్రి జితమతి సఖులతో సంగీతం పాడుకుంటూ మేడపైన కాలక్షేపం చేస్తూండగా..రోహిణి అనే ప్రియసఖి - "చందమామని చూస్తూ, చల్లని వెన్నెల్లో సంగీతం పాడుకుంటూంటే మనకి వేళతెలియలేదు. ఇప్పుడు అర్ధరాత్రి అయింది. ఇంక సంగీతం కట్టిపెట్టి నిద్రపోవడం మంచిది" అంది.

"ఔను. సకలలోకాలకూ ఆహ్లాదం కలిగించే చంద్రుణ్ని స్తుతించి వెళ్ళిపోదాం" అంటూ జితవతి భక్తిపూర్వకంగా చేతులు జోడించి కళ్ళు మూసుకుని ... ప్రార్థిస్తూంటే కాంతులు చిమ్ముతున్న ఒకమణి ఆకాశంలోంచి జారిపడింది. ఆమె మృదువైన చేతులు దానిని ఒడుపుగా పట్టుకోలేక జారవిడిచాయి. ఆమె అదిరిపడడాన్ని గమనించిన స్నేహితురాళ్ళు ఏమైందని అడగగా - ఆమె జారిపడిన ఆ మణిని వేలితో చూపించింది.

రోహిణి దానిని చేతిలోకి తీసుకుని- పరిశీలించి... "ఇది దివ్యమణి మండనం. ఈమె స్తోత్ర గీతాలకు సంతోషించి చంద్రుడు దీని నీమెకు కానుకగా జారవిడచి ఉంటాడు. ఈ రత్నాలెంత వింతగా ఉన్నాయి!" అనేసరికి మిగిలిన వాళ్ళందరూ ఏది ఏదంటూ దానిని చూశారు.

రాజపుత్రిక వారు చూశాక తీసుకుని పరీక్షగా చూసి - "ఆహా! ఇది శిరస్సుమీద ధరించవలసిన నగలా ఉంది. దీనిని చంద్రుడిచ్చాడంటారా? అలా అయినా అవచ్చు. లేదా ... దేవతలు విమానాలెక్కి ఆకాశంలో విహరిస్తూంటారు. అలటప్పుడు ఏదేవతాస్త్రీ శిరోభూషణమో

జారిపడినాపడి ఉండవచ్చు ఏదయినా దీనిని దైవంలా భావించి పూజించాలి" అంటూ ఆకాశంవేపు చూసింది.

ఆకాశంనుంచి ప్రకాశిస్తున్న మెరుపుతీగ కిందకి వస్తున్నట్లు కనిపించింది. జితవతి – "అటుచూడండి. మనకి వింతలమీద వింతలు కనిపిస్తున్నాయి. ఆ కాంతి ఏమిటో ఆలోచించండి. అది మనవేపే వొస్తున్నట్లుంది" అనే సరికి వాళ్ళు ఆశ్చర్యంగా అటుచూసి – "దేవకాంత! దేవకాంత!" అని అరిచారు. రాజకుమార్తె సఖులతో చేతులెత్తి మొక్కుతూంటే ఒకస్త్రీ వారి మేడ మీదకు దిగింది. వాళ్ళు ఆశ్చర్యపోతూ ఆమెకు ఉపచారాలు చేశారు. జితవతి ఆమె ననేక విధాలుగా స్తుతించింది.

ఆ దేవత చాలా సంతోషించి – "నువ్వు వయసులో చిన్నదానివైనా నాకెంతో చక్కని సత్కారాలు చేశావు. నాకెంతో సంతోషంగా ఉంది. నీపేరేమిటి? ఎవరికూతురివి? నీభర్త ఎవరు? ఇది ఏవూరు"? అంటూ ప్రశ్నించింది. "దేవీ! నా పేరు జితమతి. ఇది భోజనగరం. ఉశీనరుడనే మహారాజు ఈ పురాన్ని పాలిస్తున్నాడు. నేను ఆ రాజు కూతురిని. నాకింకా వివాహం కాలేదు. వీళ్ళందరూ నా సఖులూ, బంధువులూ, పరిచారికలూ, వెన్నెల్లో సంగీతకాలక్షేపం చేస్తూంటే ఈ నగ నా చేతిలో పడింది. దేవతాప్రసాదంగా స్వీకరించి మురిసిపోతూంటే ఇంతలో నువ్వు సాక్షాత్కరించావు. ఇదే మా వృత్తాంతం. మాకు దర్శనమిచ్చి బంధువైన నీ గురించి తెలుసుకుందుకు మేము తగిన వారమే అనిపిస్తే – దయతో నీ వృత్తాంతం చెప్పమని ప్రార్థిస్తున్నాను" అంది జితవతి వినయ పూర్వకంగా. ఆ దేవత చిరునవ్వు నవ్వి ఇలా చెప్పసాగింది.

# యోగసక కథ

దేవలోకంలో వసులని ఒకజాతి దేవత లున్నారు. వాళ్ళు ఎనమండుగురు అన్నదమ్ములు. విమానాలెక్కి స్వేచ్ఛావిహారం చేస్తూంటారు. ఇంద్రుడు వారి మాటల నెంతగానో మన్నిస్తాడు. ఆ ఎనమండుగురిలోనూ చివరివాడైన ప్రభాసుని భార్యని నేను. నా పేరు యోగసక అంటారు.

ఇక్ష్వాకులంవాడైన మహాభిషుడు ఒకనాడు ఇంద్రుడు మొదలయిన వారందరితోనూ కలసి బ్రహ్మసభలో కూర్చుని ఉండగా గంగా మహాదేవి దేవతా స్త్రీ రూపంలో ప్రవేశిస్తూంటే గాలికి ఆమె వస్త్రం కొంచెం తొలగింది. మిగిలన వాళ్ళందరూ పాపభీతితో తలలువంచు కున్నారు. కాని మహాభిషుడు ఆమె సుందర శరీరాన్ని కుతూహలంగా చూశాడు. అది గమనించిన బ్రహ్మ "రాజా! పుణ్యాత్ముడివై ఉత్తమలోకం పొందినా మా ఎదుటే తప్పుపని చేశావు. నువ్విక్కడ ఉండదగిన వాడివికావు. మానవలోకంలో జన్మించు–" అని శపించాడు.

అందుకు విచారిస్తున్న ఆ రాజు మనశ్శాంతి కోసం ఇంద్రుడు సభ చేయబోతూంటే వసువు లందరూ ఆ సభకి వెళ్తూ, వాతావరణం వేడిగా ఉండడంతో విమానాలను సముద్రం మీదుగా నడిపించ సాగారు. సూర్యుడు సముద్రంలో మునిగి సముద్ర జలాలని వేడెక్కించాడు. కాని అంతలోనే చంద్రుడు ఉదయించి అంతా చల్లబడింది. మేము విమానాల మీద కూర్చుని చల్లగాలి సేవిస్తూ సముద్ర విశేషాలను చూస్తున్నాం. మా విమానం వెళ్తూండగా ఎంతో అందంగా ఈ నగరం కనిపించింది. నేను నా ప్రియుని కౌగలించుకుని తలవొంచి చూస్తూండగా నా శిరోరత్నం జారిపడిపోయింది. నా ప్రియుడు నన్ను విచారించవద్దన్నాడు.

"మనోహరా! ఈ శిరోమణిని నా తండ్రి నా పెళ్ళప్పుడు యిచ్చాడు. అందుచేత ఇది పోవడం అశుభంగా భావించి భయపడు తున్నాను. ఎలాగేనా వెదికి తీసుకురారూ?" అని బతిమాలాను. విమానం

నిలబెట్టి అతను వెళ్ళి వచ్చి - "నీ శిరోమణి మేడమీద గుమిగూడి వున్న స్త్రీల మధ్య పడింది. నేను ఆడవాళ్ళ మధ్యకు ఎలా పోగలను? నువ్వేవెళ్ళి వారినడిగి తెచ్చుకో. నేనిక్కడే ఉంటాను" అన్నాడు.

ఇదే నా కథ. సఖీ! నీ భక్తి నాకు ముచ్చట గొలిపింది. నీ కేదెనా కోరికుంటే చెప్పు. వీలయితే తీరుస్తాను" - అంది యోగసక.

అప్పుడు జితవతి-? దేవీ! త్రిలోక పూజ్యులయిన వసువులలో ఒకనికి పత్నివయిన నీ దర్శనం మాకు లభించడం చాలా పుణ్యం. నువ్వు నన్ను సఖీ అని పిలిచావు. అది నాకు మరింత అదృష్టం. నన్ను నీ దాసురాలిగా స్వీకరించి నీ వెంట తీసుకుపో. నీ పాదసేవ చేసుకుంటూ బతుకుతాను. రోగాలు, ముసిలితనం, మరణం కల యీ మనుష్య లోకంలో ఉండడంకంటె కష్టం మరొకటి ఉండదు. దేవతల కలాటి యిక్కట్లు లేవు కదా. ఇదే నాకోరిక" అంది జితవతి. యోగసక ఆమె మాటలు విని - "జరామరణ రోగాలనే పేర్లు మాత్రమే విన్నాను. అవి ఎలా ఉంటాయి? వాటివల్ల కలిగే బాధలెలా ఉంటాయి?" అని అడిగింది

రాజకుమార్తె నవ్వుతూ "ఏమదృష్టం! విచారమనేదే లేకుండా ఎప్పుడూ హాయిగా ఉంటారు. దేవీ! ఈమె నాకు తల్లి. యౌవనంలో ఈమెను మించిన అందగెత్తె మరొకరు లేరట. ఇప్పుడెలా ఉందో చూడు. జుత్తుఊడి, పళ్ళు రాలి, చర్మం ముడతలు పడి, కాళ్ళు చేతులు ఎండు కట్టెల్లా మారి, నడుమువంగి, ఆశకతకు లొంగిపోవడమే వార్ధక్యం" అని అనగానే "ఎంత ఆశ్చర్యం! ఆమె మానవకాంతేనా! ఐతే నువ్వూ కొన్నాళ్ళకి ఇలాగే ఔతావా? అబ్బా! ముసిలితనం చాలా చెడ్డదే" అందామె. "వ్యాధుల సంగతి వింటే నీ మనసు మరీ చెదిరిపోతుంది. మృత్యుదేవత ఒకనాడు బ్రహ్మదగ్గర కొచ్చి - ' ఈ జీవజాలాన్ని నేను చంపలేకపోతున్నాను" అంటూ మొరపెట్టుకుందట. అప్పుడు బ్రహ్మ ఆవిడ కన్నీళ్ళని దోసిట్లో పట్టి విరజిమ్మాడు. -ఆ కన్నీటి బిందువులు నాలుగు మూలలా కోట్లకొద్దీ వ్యాపించాయి. 'అవే మహావ్యాధులౌతాయి. నీకు

దూతలలా పని చేస్తాయి" అని చెప్పి ఆమెను ఊరడించి పంపించాడట" అంటూ రోగాలెలా బాధిస్తాయో తెలియజేసే శ్లోకాలు చదివింది.

"ఛీఛీ! ఇలాంటి అసహ్యాలోకంలో ఎందుకు పుట్టావు? మహాభిషుడు భూమిమీద పుట్టడాని కంతగా దుఃఖించా డెందుకా అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది. జితవతీ! నువ్వు కోరిన కోరిక ఎంతయినా సమంజసమే. కాని ఇంద్రుడి అనుమతి లేకుండా నిన్ను తీసుకెడితే నేరమౌతుంది. నువ్వు నాకు ప్రాణసమానరాలి వయ్యావు. ఇక్కడున్నా యిలాటి కష్టాలు లేకుండా చేస్తాను. నేను నీకు దూరంగా ఉన్నా సదా నీ క్షేమం చూస్తాను. నా ఆజ్ఞలేకుండా ఏ వరుణ్ని వరింపకు" - అంది యోగసక "దేవీ! నీ మాటలే నాకు వరాలు. ఇక నాకు ఏ కొదవాలేదు. నువ్వు మళ్ళీ వచ్చి ఆజ్ఞయిచ్చేవరకూ ఎవరినీ పెళ్ళాడను. కాని నువ్వు ఆలస్యం చేశావంటే జరారోగాలచేత నేనూ బాధించబడతాను సుమా!" అంది. తరవాత యోగసక ఆకాశయానంతో తన భర్తదగ్గరకి వెళ్ళిపోయింది."

కథను అంతవరకూ చెప్పి అప్పటికాపాడు మణిసిద్ధుడు. ఇద్దరూ మరుసటి మజిలీకి బయలుదేరారు.

# కాశీ మజిలీ కథలు

## 95. వ మజిలీ

### వసువుల కథ

**ధరుడు** : సోదరులారా! నిన్నటి సభలో మహాభిషుడికి సంతోషం కలిగించాలని దేవేంద్రుడు ఎన్ని ఉత్సవాలు చేసిన అతని మనసు వికసించలేదు సుమండీ.

**ధ్రువుడు** : ఎంతో సుకృతంతో అత్యంత దుర్లభమైన అమరలోక నివాససౌఖ్యం అనుభవిస్తూ చిన్నపొరపాటు వల్ల మళ్ళీ మానవలోకంలో పుట్ట బోతున్నాడు. ఆ మహారాజుకు దుఃఖంకాక సంతోషం ఎలా కలుగుతుంది?

**సోముడు** : దేవ మహర్షు లందరూ ఉండే బ్రహ్మ సభలో – ఆడదాని వస్త్రం తొలగితే అపరాధిగా చూడడం అల్పమైన అపరాధం ఎలా ఔతుంది.

**అహ్నుడు** : దయాహృదయుడు కనకనే ఆ పాటి నెపంతో వదలి పెట్టాడు బ్రహ్మ.

**అనలుడు** : బ్రహ్మ గంగాదేవిని కూడా శపించాడా?

**అనిలుడు** : జరిగిన దానిలో ఆమె తప్పేముంది?

**ప్రత్యూషుడు** : తప్పుందని భావించబట్టే బ్రహ్మ ఆమెని కూడా మనుష్యజన్మెత్తమని శపించాడు.

**ప్రభాసుడు** : మానవలోకంలో ఎలాటి వారికీ సుఖం ఉండదని యోగసక ద్వారా విన్నాను. బ్రహ్మగారు వాళ్ళకి కఠినమైన శిక్షే విధించాడు.

**ప్రత్యూషుడు** : మహాభిషుడు భూమిమీద ఎవరై పుడతాడో? మళ్ళీ తిరిగి స్వర్గానికి వస్తాడా?

దూతలలా పని చేస్తాయి" అని చెప్పి ఆమెను ఊరడించి పంపించాడట" అంటూ రోగాలెలా బాధిస్తాయో తెలియజేసే శ్లోకాలు చదివింది.

"ఛీఛీ! ఇలాంటి అసహ్యలోకంలో ఎందుకు పుట్టావు? మహాభిషుడు భూమిమీద పుట్టడాని కంతగా దుఃఖించా డెందుకా అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది. జితవతీ! నువ్వు కోరిన కోరిక ఎంతయినా సమంజసమే. కాని ఇంద్రుడి అనుమతి లేకుండా నిన్ను తీసుకెడితే నేరమౌతుంది. నువ్వు నాకు ప్రాణసమానరాలి వయ్యావు. ఇక్కడున్నా యిలాటి కష్టాలు లేకుండా చేస్తాను. నేను నీకు దూరంగా ఉన్నా సదా నీ క్షేమం చూస్తాను. నా ఆజ్ఞలేకుండా ఏ వరుణ్ని వరింపకు" – అంది యోగసక "దేవీ! నీ మాటలే నాకు వరాలు. ఇక నాకు ఏ కొదవాలేదు. నువ్వు మళ్ళీ వచ్చి ఆజ్ఞయిచ్చేవరకూ ఎవరినీ పెళ్ళాడను. కాని నువ్వు ఆలస్యం చేశావంటే జరారోగాలచేత నేనూ బాధించబడతాను సుమా!" అంది. తరవాత యోగసక ఆకాశయానంతో తన భర్తదగ్గరకి వెళ్ళిపోయింది."

కథను అంతవరకూ చెప్పి అప్పటికాపాడు మణిసిద్ధుడు. ఇద్దరూ మరుసటి మజిలీకి బయలుదేరారు.

# కాశీ మజిలీ కథలు

## 95. వ మజిలీ

### వసువుల కథ

**ధరుడు** : సోదరులారా! నిన్నటి సభలో మహాభిషుడికి సంతోషం కలిగించాలని దేవేంద్రుడు ఎన్ని ఉత్సవాలు చేసిన అతని మనసు వికసించలేదు సుమండీ.

**ధ్రువుడు** : ఎంతో సుకృతంతో అత్యంత దుర్లభమైన అమరలోక నివాససౌఖ్యం అనుభవిస్తూ చిన్నపొరపాటు వల్ల మళ్ళీ మానవలోకంలో పుట్ట బోతున్నాడు. ఆ మహారాజుకు దుఃఖంకాక సంతోషం ఎలా కలుగుతుంది?

**సోముడు** : దేవ మహర్షు లందరూ ఉండే బ్రహ్మ సభలో – ఆడదాని వస్త్రం తొలగితే అపరాధిగా చూడడం అల్పమైన అపరాధం ఎలా ఔతుంది.

**అహ్నుడు** : దయాహృదయుడు కనకనే ఆ పాటి నెపంతో వదలి పెట్టాడు బ్రహ్మ.

**అనలుడు** : బ్రహ్మ గంగాదేవిని కూడా శపించాడా?

**అనిలుడు** : జరిగిన దానిలో ఆమె తప్పేముంది?

**ప్రత్యూషుడు** : తప్పుందని భావించబట్టే బ్రహ్మ ఆమెని కూడా మనుష్యజన్మెత్తమని శపించాడు.

**ప్రభాసుడు** : మానవలోకంలో ఎలాటి వారికీ సుఖం ఉండదని యోగసక ద్వారా విన్నాను. బ్రహ్మగారు వాళ్ళకి కఠినమైన శిక్షే విధించాడు.

**ప్రత్యూషుడు** : మహాభిషుడు భూమిమీద ఎవరై పుడతాడో? మళ్ళీ తిరిగి స్వర్గానికి వస్తాడా?

ధరుడు : ప్రతీపుడనే మహారాజుకి కొడుకై శంతనుడనే పేరుతో చాలాకాలం రాజ్యాన్ని పాలించి మళ్ళీ స్వర్గలోకం వొస్తాడని నారదుడి వలన తెలిసింది.

అహ్నుడు : పోన్లెండి. కొన్నాళ్ళు మరోలోకం చూసివస్తారు.

అనిలుడు : మన విమానాలు ఎంతదూరంలో ఉన్నాయో చూశారా? కళ్ళు మిరుమిట్లుకొల్పే ఆ పర్వతం మేరుపర్వతం. చాలా గొప్ప పర్వతం. శివుడు దీనిమీదే ఎంతోకాలం తపస్సు చేశాడు.

ధ్రువుడు : మన మనోరథాల ననుసరించకుండానే యిక్కడికి తీసుకొచ్చా యెందుకో?

ధరుడు : నేనలా తలుచుకున్నాను. ఈ ప్రాంతం అతిచక్కనిదట! కనులారా చూద్దాం.

సోముడు : ఇది ఏలోకం?

ధరుడు : భూలోకం అనే చెప్పాలి.

అనలుడు : ఆ వనం ఒక మహర్షిదిలా ఉంది. అక్కడతిరుగుతున్న గోవు హోమధేనువు కావచ్చును.

ప్రత్యూషుడు : తపోవన ప్రభావం వలన జాతి వైరాలు మరచి అన్ని జంతువులు స్నేహంతో తిరుగుతున్నాయి. ఇది ఏ మహర్షి ఆశ్రమమో!

ప్రభాసుడు : ఎవరిదైతే ఏం? కొంతసేపు ఇక్కడ విహరించి పోదాం.

ధ్రువుడు : ఔను. ఇది చాలా చక్కగా ఉంది. చూసి తీరవలసిందే.

ధరుడు : మహర్షి ఆశ్రమం అని తెలిసికూడా విహరించాలనుకుంటున్నారా! తాపసులకి కోపం వస్తుందేమో.

ప్రభాసుడు : సర్వసంగ పరిత్యాగులయిన యోగుల కిలాటి సుందర ప్రదేశాలా! నిజంగా ఇదంతా వైరాగ్యమే? మన విహారాలు వారికి కోపం ఎందుకు కలిగాస్తాయి?

ప్రత్యూషుడు : వీరు మనని ఆశ్రయిస్తారు కాని ఆగ్రహింపరు.

ధరుడు : పువ్వులు కోయడం లాటి పనులు చెయ్యక ఊరికే చూసివొచ్చెయ్యాలి. అలా ఐతే పదండి.

వాళ్ళు అలా ఆలోచించుకుని - విమానాలు నిలిపి - భార్యలతో సహా ఆ ఆశ్రమంలో ప్రవేశించారు. కొంచెంసేపట్లోనే వాళ్ళు అన్నీ మరచి...దాన్నొక ఉద్యానవనంలా భావించి పువ్వులు కోసీ, కొమ్మలు విరిచీ, సరస్సును అల్లకల్లోలం చేశారు. పళ్ళు కోశారు. అప్పుడ పెద్ద గంగడోలు వేలాడుతున్న ఆవు అక్కడ తిరుగుతూ కనిపించింది. వారు దానిని కామధేనువని పొరపడ్డారు. కాని ధరుడు "సోదరులారా! ఇది వశిష్ఠుని హోమధేనువు. కశ్యపుడి వలన సురభి అనే భార్యకు జన్మించింది. దీని పాలు తాగిన వారికి ఆకలి, దాహం, రోగం, ముసలితనం లేకుండా అనేక సంవత్సరాలు జీవిస్తారు. ఈ గోవువలన ఇది వశిష్ఠుని ఆశ్రమం అని తెలుస్తూంది. ఆ మహాత్మునికి కాని కోపం వస్తే ముల్లోకాలూ క్షణంలో భస్మమై పోతాయి. మనమింక ఇక్కడ ఉండకూడదు. త్వరగా పోదాం, పదండి" అన్నాడు. వాళ్ళు తిరుగుముఖం పట్టడానికి సిద్ధమౌతుంటే - యోగసక అతనిని "ప్రాణేశ్వరా! నా సఖి జితవతి గుర్రించి ఇంతకు ముందు మీకు చెప్పాను కదా. ఆ మానవ కన్యకు దేవత్వం కలిగించడానికి అమృతం మీచే దొంగిలింపజేసి ఇవ్వాలను కున్నాను. కాని ఇప్పుడా అవసరం లేకుండా ఈ గోవుపాలు అమృత సమానమే అని తెలిసింది కనుక దీనిని పట్టుకుని ఇంటికి తీసుకొస్తే పాలు పితికి జితవతికి పంపుతాను. ఇదే నా కోరిక" - అని ఎంతో వినయంగా ప్రార్థించింది.

అప్పుడు ప్రభాసుడు - "అన్నా! ఈమె మాటలు విన్నావు కదా. ఈమె వ్యర్థంగా మాట్లాడేదికాదు. దీని కోరిక తీర్చక తప్పదు. కనక ఆవుని పట్టుకు తీసుకుపోదాం" అన్నాడు. "తమ్ముడా! వసిష్టుని హోమధేనువని తెలిసికూడా అలా అంటున్నావా? బ్రాహ్మణవిత్తం అపహరించడం మహాపాపం. వనాన్ని భంగపరచినందుకే ఏమౌతుందో అని భయపడుతున్నాను. దీనిని తీసుకుపోయి ఆముని కోపానికి గురయితే మనల నెవరూ రక్షించలేరు. పోదాం, రా" అని ధరుడు మందలించాడు.

"పిరికితనం వదులు. రుషులు తపస్సు చేసేది దేవతలను ప్రసన్నులను చేసుకుందుకే. మనం వచ్చినందుకూ, ఈ గోవుని స్వీకరించినందుకూ వసిష్టుడు కృతార్థుడైనట్లు సంతోషిస్తాడు. అతనంతగా ఆగ్రహిస్తే నేను అడ్డుపడతాను. యోగసక కోరింది మాట నిలుపుకుందుకు తప్ప తనకోసం కాదు. ఈ చిన్నవాడి మాట మన్నించండి. కార్యం సఫల చేయండి" అని ప్రభాసుడు బతిమాలేసరికి వానియందు ఇష్టంతో ధరుడు మౌనం దాల్చాడు.

వసువులు గోవుకి నాలుగువేపులా కాసి మెల్లగా సమీపించి గంగడోలు దువ్వుతూ మచ్చిక చేసుకుని దానిని బంధించారు. తనవారే అని కాబోలు అది సులభంగా వారికి వశమైంది. అప్పుడు వశిష్టుడి శిష్యుడొకడు అడ్డంవచ్చాడు.

**శిష్యుడు** : ఆ! మా గోవుని తీసుకు పోతున్నారేం? మీ రెవరు? ఆగండి. ఇది వశిష్ఠమహర్షికి ప్రాణం.

**ప్రభాసుడు** : వసువులంటే చోరులు కారు. దేవసభవారు. మీ గురువు మా గురించే జపం చేస్తుంటాడు. మేం దీనిని తీసుకు వెళ్తే ఆయన కృతార్థు డౌతాడు.

**శిష్యుడు** : మీరు వసువులయితే వారు వచ్చాక పూజలందుకుని గోవుని తీసుకెళ్ళండి. మాయావుల్లా వచ్చి మా ఆవుని తీసుకుపోతూ వేల్పులమంటే ఎవరు గౌరవిస్తారు?

**ప్రభాసుడు** : బాలకా! దేవతల ప్రభావం తెలిస్తే ఇలా అనవు. ఇలాటి పనులు మనుషులకే కాని దేవతలకు తప్పుకాదు. అదీకాక ఈ గోవు కశ్యపుడి సంతతి లోనిది. అందుచేత దీనిమీద మాకు అధికారం ఉంది.

**శిష్యుడు** : ఇంతకు ముందు దీనిని అపహరించబోయే కౌశికుడు భ్రష్టుడైపోయాడు వసువులకిది పద్ధతికాదు. అంటూ చెబుతున్నా వినకుండా వారాగోవుని తీసుకుని తమలోకం పోయారు.

# కాశీ మజిలీ కథలు

## 96. వ మజిలీ

"సఖీ! జితవతీ! దివ్యరూప సంపన్నుడయిన వరుడు లభించి నీ పుణ్యం ఫలించబోతూంటే వివాహం అక్కరలేదన్నావట! ఏమిటి సంగతి?" అడిగింది రోహిణి.

"ఆనాడు మనం మేడమీద సంగీతం పాడుకుంటూంటే యోగసక అనే దేవకాంత అక్కడికి రావడం, ఆమె చెప్పిన మాటలూ నువ్వు మరచి పోయావు కాబోలు. నాకు దేవత్వం ప్రసాదిస్తాననీ, తాను వచ్చే వరకూ పెళ్ళాడొద్దనీ చెప్పి పోయింది కదా. ఆమె నన్ను మరచి పోకుండా ఎప్పుడో వచ్చి తన మాట నిలబెట్టుకు తీరుతుంది. ఆమె ఆజ్ఞలేకుండా నేను వివాహమాడను" అంది జితవతి.

అంతలో జితవతి తల్లి అక్కడికి వచ్చి – "రోహిణీ! అమ్మాయితో పెళ్ళిమాట చెప్పావా? వరుడి చిత్రపటం చూశావా? ఇతని పేరు ప్రభాకరుడు. ఇంతకంటె అందగాడు భూమ్మీద లేడు" అంది.

"అమ్మా! ఆమె సంకల్పం వేరుగా ఉంది. యోగసక్తి కథ మీకూ తెలుసుకదా. ఆమె ఆజ్ఞ అయ్యేవరకూ పెళ్ళాడదట" అని ఆమెకు చెప్పి – జితవతితో – "నీమాట కాదంటే నీకు కోపం వస్తుంది కాని ఆవేళ జరిగింది కలే అని మనసఖు లందరూ తీర్మానించారు. మనమందరమూ భ్రాంతి చెందాం. మనుషులెప్పటికీ దేవతలు కాజాలరు. ఆ మాటలు నమ్మి ఈ వివాహం భంగం చేసుకోకు. మనుషులు మరణించాక తప్ప దేవతలు కాలేరు" అంది రోహిణి. "అది కలకాదు. సత్యం. అలా జరిగి తీరుతుంది. నా కిప్పుడు పెళ్ళక్కర్లేదు – " అనేసింది జితవతి.

రాజపత్ని నవ్వుతూ – "బిడ్డా! కొన్ని కలలు నిజంగా జరిగినట్లే అనిపిస్తాయి. మొన్ననాకూ ఒక కల వచ్చింది. నేను దేవ లోకానికి వెళ్ళానట. శచీదేవి నాకెదురొచ్చి నాచెయ్యి ముద్దుపెట్టుకుని తీసుకుపోయి

తన ఆసనంమీద పక్కన కూర్చో బెట్టుకుంది. నిన్ను స్నేహితురాలిగా స్వీకరించాను, ప్రతిరోజూ వొచ్చి వెళ్తూండు - అందట. మేలుకున్నాక కూడా ఆకల నిజమే అనిపించింది. నేనిప్పుడు స్వర్గానికి వెళ్ళాలనుకోడం లాటిదే నీకలకూడా. అందుచేత భ్రాంతి వదులు-" అంది. ఆ దేవతకు నీమీద కనికరం కలిగితే నీ భర్తకు మాత్రం దేవత్వం ప్రసాదించలేదా? నువ్వు ఇప్పుడు పెళ్ళాడితే తప్పేమిటి? ఈ సంబంధం వదులుకుంటే ఇలాటి వీరుడు దొరకడం కష్టం. ఆమే గడువేదీ పెట్టలేదు. ఎంతకాలం యిలా ఉంటావు?-" అంది. జితవతి ఏదో చెప్పబోయేంతలో ఒక పరిచారిక వచ్చి - "దేవీ! ఆ మేడమీద దేవకాంత రాకను గమనిస్తూ ఉండమని నన్ను నియోగించావు కదా. ఈ ఉదయం ఆ వేళకి ఆమె మేడమీదకు వచ్చి జితవతీ అంటూ పిలవసాగింది. మా రాజపుత్రిక ఇప్పుడే కిందకి వెళ్ళింది. పిలుచుకొస్తాను' అన్నాను నేను. అందుకామె - 'నేనిక్కడ ఉండకూడదు. ఈ కలశాన్నీ చీటినీ ఆమెకు యివ్వు. అంతా ఆమేకే అర్థమౌతుంది' అని వాటినిచ్చి ఆమె వెళ్ళిపోయింది. అవి యివిగో" కలశాన్నీ చీటినీ అందించింది. జితవతి ఆరాటపడుతూ ఆ చీటీ చదివింది.

'సఖీ'! జితవతీ! నీ కిచ్చిన వరం చెల్లించుకుందుకు చాలా ప్రయత్నం చేయవలసి వచ్చింది. నీకు పంపినపాలు చాలా మహిమకలవి. అవి తాగినవారు ముసలితనం, రోగాలూ లేక చక్కనిరూపంతో చిరకాలం జీవిస్తారు. శుభముహూర్తంలో వాటిని తాగు. నేను తొందరలోనే మళ్ళీ వచ్చి కర్తవ్యం చెబుతాను' నీ ప్రాణసఖి...యోగసక.

ఆ ఉత్తరాన్ని చాలాసార్లు చదువుకుని కళ్ళకద్దుకుంది. ఆ దేవికి నామీద ఎంత అనురాగం! ఆ నాటి మాటమరచి పోకుండా స్వయంగా యీపాలు తెచ్చి అందించింది. అయ్యో! ఆమెను చూసే భాగ్యం నాకు లేకపోయిందే. అంటూ విచారించి - "అమ్మా! ఇప్పటి కేనా నామాట నమ్ముతావా? ఆమెకు నా పెళ్ళి విషయం చెప్పి అనుజ్ఞ ఇచ్చేవరకూ నేనీపాలు కూడా తాగను." అని భద్రపరచమని ఆ కలశాన్ని రోహిణి కిచ్చింది. రాజపత్ని మరేమీ మాట్లాడలేక లోపలికి వెళ్ళిపోయింది.

# కాశీ మజిలీ కథలు

## 97. వ మజిలీ

### నారదుడి కథ

"అయ్యో! నేను భూలోకానికెందుకు వెళ్ళాను? ఆ చెడువార్త నా చెవిన ఎందుకుపడాలి? చెప్పకుండా పోదామన్నా మనసు అటే లాగుతూంది. ఎప్పుడేనా శాపం అనుభవించితీరవలసిందే. ముందుగా చెబితే ప్రతీకారం ఏదేనా చేసుకుంటారేమో" అనుకుంటూ నారదమహర్షి వసులోకానికి వెళ్ళాడు.

వసువు లాయనకు స్వాగతం పలికి, సత్కారాలు చేసి, ఎక్కడినుంచి వొస్తున్నదీ అడిగారు. విశేషా లడిగారు "భూలోకం నుంచి" - అని నారదుడనగానే - "అయ్యా! భూలోకం చాలా శోకమయం అని మా ప్రభాసుడి భార్య చెప్పింది. అక్కడి కష్టాలెలాటివి? ముసలితనం అంటే ఏమిటి? ఎన్నేళ్ళకు వస్తుంది? రోగాల స్వభావం ఏమిటి? మనకీ వారికీ కల తేడా ఏమిటి? దయచేసి చెప్పండి" అన్నారు. "అయ్యో! వీళ్ళకి తమ శాపం గురించీ, తాము మానవలోకంలో ఉండాలనీ తెలియదు. కొంత మాట్లాడాక ఆ విషయం చెబుతాను" అని మనసులో అనుకుని - జరామరణ రోగాలగురించి కొంత చెప్పి "మానవ జన్మలో ఒక విశేషం మాత్రం ఉంది. మనంకూడా పొందలేని ఉత్తమ లోకాలని వారు తపస్సు ద్వారా సాధించగలరు" అన్నాడు. అందుకు ధరుడు - "స్వామీ! వాళ్ళు ఉత్తమ లోకాలని పొందినా మనలా స్థిరంగా ఉండరు. అందుకు మహాభిషుడే సాక్షి. మహాత్మా! మీరేమిటో ఆలోచిస్తున్నట్లున్నారు" అన్నాడు. అప్పుడు నారదుడు మెల్లగా - "మీరు దేవతలమని గర్వించి బ్రహ్మర్షి అయిన వసిష్ఠమహాముని ఆశ్రమానికి వెళ్ళి ఆ వనాన్ని భగ్నంచేశారట. నిజమేనా? అంతటితో ఆగక ఆమునికి ప్రాణ సమానమైన

హోమధేనువుని ఆయన శిష్యుడు వద్దంటున్నా వినకుండా తీసుకు పోయారట. ఇదేం పని? మీ దేవభాం రుషులమీదా చూపుతారు? హాయిగా విమానాలెక్కి ఆకాశంలో సంచరించే సుఖం పోగొట్టుకున్నారు కదా?" అన్నాడు.

"ఆయనకు మామీద కోపం వచ్చిందా? భార్యాలోలుడైన ప్రభాసుడి మూలంగానే అలా జరిగింది. అక్కడేం జరిగిందో చెప్పండి-" అని అడిగాడు ధరుడు భయపడుతూ.

"ఏం చెప్పేది? ఇంతవరకూ మీరు దుఃఖభాజకమని తెలుసుకున్న మానవలోకంలో మీరు పుట్టాలని వసిష్ఠుడు మిమ్మల్ని శపించాడు" అని నారదు డనేసరికి వసువులందరూ మూర్ఛపోయారు. అతను వారినోదార్చి..."మునీంద్రా! భూలోక వాసుల కష్టాలు తలుచుకుంటేనే గుండెలు పగిలిపోతున్నాయే. మేము వేల్పుల మనయినా చూశాడు కాదు వసిష్ఠుడు. మేము తప్పు చేయడం నిజమే. ఇప్పుడు మేమేం చెయ్యాలో చెప్పండి" అని అతడ్ని శరణు జొచ్చారు. "వసూత్తమా! ఊరుకో. జరిగిన దానిలో ప్రభాసుని అపరాధమే ఎక్కువగా కనపడుతూంది. మీరు వెళ్లి ఆ ముని పాదాలమీద పడి ప్రార్థిస్తే ఏదేనా సదుపాయం చేయకమానడు. శాపం ఫలించే సమయం సమీపిస్తూంది. తొందరగా వెళ్ళండి" అని తాను ఎక్కడికో పోయాడు. వసువులు హోమధేనువుతో సహా వసిష్ఠముని ఆశ్రమానికి వెళ్ళారు.

# కాశీ మజిలీ కథలు

## 98 వ మజిలీ

### జితవతి ప్రవాసం కథ

"రోహిణి! మిన్ను విరిగి మీద పడ్డట్లు ఇప్పుడే ఒక వార్త వచ్చింది. నా కోసం ఆ వసుపత్ని వశిష్ఠుని హెూమధేనువుని తెమ్మని భర్తను ప్రోత్సహించగా అతను అన్నలతో కూడి ఆ ధేనువు పాలు పితికించాడట. యోగసక్త సాకాపాలే పంపిందట. ఆ వసువుల ఆపరాధాని కలిగి వసిష్ఠుడు వారందరినీ శపించాడట. వాళ్ళంతా దుఃఖిస్తూ ఆ ముని ఆశ్రమానికి వెళ్తున్నారట. యోగసక్త ఈ కథ కల పత్రికను పరిచారికచేత మేడమీద వేయించింది తనయోగక్షేమాలేమీ వ్రాయలేదు. అయ్యో! నా వల్ల వారందరూ శపించబడ్డారు నేనెంత పాపాత్మురాలిని. ఏమని శపించబడారో వ్రాయలేదు. యోగసక్త లాటి సఖులెక్కడా ఉండరు. ఆమె రుణం ఎలా తీర్చుకునేది? వశిష్ఠ మహర్షి ఆశ్రమం ఎక్కడుందో తెలుసుకురా. నేనతని పాదాలమీద పడి, వారికిచ్చిన శాపాన్ని నా మీదకు మరల్చమని ప్రార్థిస్తాను. అంతకంటె మరోవిధంగా నాకు నిష్కృతి కలగదు. నువ్వు ఇంకేమీ చెప్పకు. ఈ ప్రయాణం ఎవరికీ తెలియకూడదు. ఇంక నాకు భోగాలక్కరలేదు. కాషాయ వస్త్రాలు ధరించి, యోగిని వేషంలో ఆ తాపసి నా శ్రయించి వసువుల శాపం ఉపసంహరింప జేసి దానిని నేను భరిస్తాను" అంది జితవతి.

ఆ మాటలు విన్న రోహిణి నివ్వెరపోయి–."జితవతీ! నీ కృతజ్ఞత చాలా మెచ్చదగినది. కాని.... దీనివలన ప్రయోజన మేమిటో ఆలోచించవలసి ఉంది. వసువులు వసిష్ఠాశ్రమానికి వెళ్ళారుకదా. అతను ప్రసన్నుడైతే వారు శాపవిముక్తు లౌతారు. లేదా శాప ఫలం అనుభవిస్తారు.

ఈపాటికి ఏదో ఒకటి జరిగిపోయే ఉంటుంది. వశిష్టాశ్రమం భూమిమీద ఎక్కడుందో? తెలుసుకుని, కష్టపడి మనం వెళ్ళగలిగినా లాభమే ముంటుంది? బాగా ఆలోచించు"- అంది మెల్లగా "రోహిణీ! నేనడగని మాట లెందుకు చెబుతావు? వసిష్ఠముని ఆశ్రమం ఎక్కడుంది? ఎలా వెళ్ళాలి? ఇది తెలుసుకోడమే నీ పని ఇష్టమో కాదో చెప్పు. నాకు తోచినట్లు చేసుకుంటాను." ఆ నిష్టురానికి ఉలిక్కిపడింది రోహిణి. "జితవతీ! నువ్వుసుకుమారివని అందులోని కష్టాలను ఆలోచించి అలా చెప్పాను. పోనీలే. నువ్వు చెప్పినట్లే చేస్తాను. వెళ్ళి తెలుసుకుని వస్తాను." అని అప్పుడే వెళ్ళి నాలుగురోజులు ఊరిలో కనుక్కొని వచ్చి జితవతితో యిలా చెప్పింది. "రాజపుత్రీ! ఆ మహర్షి ఆశ్రమం హిమగిరి పరిసరాల్లో ఉందని కొందరూ, మరొకచోట అని కొందరూ, అయోధ్య దగ్గర అని కొందరూ చెప్పారు. ఏదేమైనా ఉత్తరదేశానికి పోవాలి. అదంతా అరణ్యమయమట" అని ఏం చేద్దామో చెప్పమన్నట్లు చూసింది రోహిణి ఆమె వేపు. మర్నాడు అర్ధరాత్రి, కావలసిన వస్తువులతో, వారిద్దరూ గుర్రంమీద ఉత్తరదిక్కుగా బయలుదేరారు. తన నిశ్చయంలో - తాను కన్యకననీ, రాజపుత్రిననీ, ఇల్లు కదలకూడదనీ జితవతి ఆలోచించనేలేదు. శాప శాపవిముక్తి చేయించేవరకూ నిద్రాహారాలను నూనెయ్యాలను కుందామె.

తెల్లవారే సరికి వాళ్ళు చాలా దూరమే వచ్చారు.

**జితవతి** : రోహిణీ! మనం చాలా దూరమే వచ్చాం. వశిష్ఠుడి ఆశ్రమం ఇంకా ఎంత దూరమో? ఎన్ని రోజులకి చేరుకుంటామో? అతను నామాట మన్నిస్తాడా? మహర్షులకు దయ ఉండదూ? ఆ ముని భార్య అరుంధతి దొడ్డ ఇల్లా లంటారు. ఆమేనా నన్ను అనుగ్రహించదా? వసువులు పరోపకారం కోసం చేసిన పనికి శపించడం వసిష్ఠుని తప్పు; దయలేకపోతే ఎన్ని సుగుణాలున్నా వ్యర్ధమే. మునులు ముక్కోపులు. చిన్న తప్పుకే ఎక్కువ కోపం చూపుతారు. అతను కోపగించినా అరుంధతి వారించొద్దూ? భూతదయ అన్ని గుణాలలోకి ఉత్తమమైనది. భర్త శాపం అరుంధతి వినలేదేమో లేక మరేదేనా కారణముందో.

రోహిణి : నీ మాటలు నిజమేకాని వసువులు చేసింది చోరకృత్యం కదా. మనం ఆవగింజంత ప్రయాణమయినా చెయ్యలేదు. అప్పుడే నీ మోహం ఎంత వాడిపోయింది. పరదేశవాసం చాలాకష్టం.

మధ్యాహ్నం వరకూ కూడా వాళ్ళకి ఏ గ్రామం కనిపించ లేదు. పోగా పోగా ఒక సరస్సు కనిపించింది. వాళ్ళు ఆ అందమైన సరోవరం దగ్గర ఆగి స్నానాలు అవీ చేశారు. తనకి ఆకలికాని అలసట కాని కలగక పోడం విచిత్రమని జితవతి అనగానే – రోహిణి నవ్వుతూ – "నిన్న నీకు చెప్పకుండానే దివ్యక్షీరం ఇచ్చాను. ప్రయాణ కష్టం కలగకూడదని అలా చేశాను. నన్ను క్షమించు." అంది. "ఆహా! ఆ క్షీరమహాత్యం ఎంత గొప్పది! పంచభక్ష్య పరమాన్నాలు తిన్నంత తృప్తిగా, బలంగా ఉంది. యోగాసక్తా! నాకోసం ఎలాటి అమృతం తెచ్చి యిచ్చావు! ఇప్పుడు ఏం కష్టాలు పడుతున్నావో. నాకు రెక్కలు లేకపోయాయి. ఎంత త్వరగా మీ శాపం తీర్చ గలనో.. రోహిణీ! నువ్వు మంచిపనే చేశావు. ఆ పాలుతాగడం ప్రయాణానికి పని కొచ్చింది. మరి – నువ్వు కూడా తాగావా?" అని అడిగింది. "అమ్మా! నువ్వు వదలివేసిన పాలు నేను తాగాను. నీలాగే నాకూ సంతృప్తిగా ఉంది" అందామె. అప్పుడు జితవతి ఆమెను కౌగలించుకుని – "అమ్మయ్య! ఇక మన ప్రయత్నం సక్రమంగా సాగుతుంది. ఆకలి, దాహం వంటి బాధలతో అరణ్యప్రయాణం ఎంత కష్టం! అవి మనకి లేదు" అంది.

వాళ్ళిద్దరూ యోగిని వేషాలు ధరించి ఉత్తరంగా పోయి పోయి ప్రయాగనగరం చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 99. వ మజిలి

### చిదానంద రమానందుల కథ

**ర**మానందుడు : చిదానందూ! త్రివేణిలో స్నానం చేస్తూంటే చూశాను, ఆ యోగిని జగన్మోహినిలా ఉంది. ఆమె అందం కళ్ళకి మిరుమిట్లు కొల్పింది. నారచీర కట్టుకుని విభూతి పూసుకుని రుద్రాక్షమాలలు ధరించినా ఎంత అందంగా ఉందో! అలాటి సుందరిని చూస్తేనే చాలు. త్రిలోకాధిపత్యం అక్కరలేదు.

చిదానందుడు : ఔనౌను. రెండో యోగినీ అందమైనదే కాని సామాన్యమయిన అందం.

రమానందుడు : వీళ్ళిద్దరూ చిన్న వయసులోనే విరక్తి చెందడానికి కారణమేమిటో? వారి వివరాలు తెలుసుకుని రాగలవా? ఆహా! ఆయోగిని దేమి అందం! ఎటువంటి సౌందర్యం!

చిదానందుడు : వాళ్ళు కళ్ళెత్తి ఎవరినీ చూడరు, మాట్లాడరు, వినిపించుకోరు. నేను వెంటతిరిగి చూశాను కదా.

రమానందుడు : ఐతే వీరిని మానవతంత్రంతో జయించలేము. మనోహరదాసుని నువ్వెరుగుదువా!

చిదానందుడు : తెలియకేం? అతనికెన్నో మంత్రతంత్రాలు తెలుసునంటారు.

రమానందుడు : అతని చేతిలో పదిమాడలు ఉంచితే మంచి మంత్రం ఒకటి ఉపదేశిస్తాడు. మనం దాన్ని జపించామో ఆ యోగిను లిద్దరూ కుక్కల్లా మన పాదాల దగ్గరకు పరుగెత్తుకొస్తారు.

చిదానందుడు : నీ ఆలోచన బాగుంది. పద. ఇప్పుడే పోదాం. శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు.

ఆ యోగినులను ప్రయాగలో చూసి మోహించిన ఆ యిద్దరూ మనోహరదాసువద్దకి వెళ్ళారు. మనోహరదాసు ఏభయ్యేళ్ళవాడు. జడలు పెంచుకుని, రుద్రాక్షమాలలు శరీరం నిండా ధరించి కుంకుమ బొట్టు నుదుటి మీద దిద్దుకున్నాడు. ఆ తంత్రజ్ఞుడి పాదాలమీద పడి, రక్షించమన్నారు. "స్వామీ! మా కోరిక చెప్పుకుందుకు సిగ్గేస్తూంది. మా వేషాలకు ఆ కోరిక తగదని నిందించకండి. ఈ పదిమాడలు స్వీకరించి మమ్మల్ని ఆక్షేపించకుండా మా కోరికని సఫలం చేయండి. త్రివేణీ తీరంలో ఇద్దరు స్త్రీలు యోగినీ వేషాలలో తిరుగుతున్నారు. వారి వివరాలు ఏమీ తెలియవు. ఎవరినీ కన్నెత్తి చూడరు. మీ మంత్ర ప్రభావంతో వారు మా కాళ్ళ దగ్గర కొచ్చేలా చెయ్యాలి" అంటూ ప్రార్థించారు.

అతను కొంచెం ఆలోచించి – "మీ కోరిక అసాధ్యమైనదే అయినా సాధిస్తాను" అంటూ కొన్ని శాస్త్రగ్రంధాలు తిరగేసి – "నేనోమంత్రం ఉపదేశిస్తాను. మీరు కోరుకున్న స్త్రీని హృదయంలో నింపుకుని రెండు లక్షల జంపం చేస్తూ కదంబ పుష్పాలతో లక్షహోమాలు చేస్తే మహాపతివ్రత అయినా మీ వద్దకు వొచ్చేస్తుంది" అంటూ ఓ మంత్రం ఉపదేశించాడు.

వాళ్ళు యమునానదీ తీరంలో మూడు రోజులలో ఆ కార్యక్రమం ముగించి – నాలుగోరాత్రి ఆమె తప్పకుండా వొస్తుందని మారుమూలనున్న ఒక పర్ణశాలలో మంచి శయ్య ఏర్పాటు చేసికొని ఎదురు చూడసాగారు.

*చిదానందుడు* : ఆమె వొచ్చే వేళయింది. ముందు నేనా నువ్వా?

*రమానందుడు* : ఆ చిన్నది మొదట ఎవరిని పిలిస్తేవారు. ఎవరో వస్తున్నట్లుంది. ఈ గాఢాంధకారంలో ఏమీ కనిపించడం లేదు.

*చిదానందుడు* : ఔను. ఎవరో వస్తున్నట్లే వుంది.

*రమానందుడు* : రాక? మనం చేసిన జపం సామాన్యమా? మనోహర దాసు మంచి తంత్రవేత్త సుమా!

*చిదానందుడు* : అదుగో ... వచ్చేసింది. ఇటురా ... మా పర్ణశాల ఇక్కడుంది. ఇటురా.

*రమానందుడు* : రమానందుడు ఇక్కడున్నాడు, ఇటురా.

*చిదానందుడు* : చిదానందుడు ఇక్కడున్నాడు. ఇటురా.

చీకట్లో ఆమె అటురాగానే వాళ్ళిద్దరూ చెరొక పక్కా చేరి - "నీకు నచ్చినవాడు చిదానందుడా? రమానందుడా?" అని అడిగారు, వచ్చినామె చెయ్యి పట్టుకుని.

అప్పు డామె భయపడుతూ "అయ్యా! మీ రెవరు? నేనెవరి ననుకుంటున్నారు? మాది దక్షిణదేశం. నేను వితంతువుని. కాశీ యాత్రకు వొస్తూ యీ త్రివేణిలో జలంపట్టుకుందుకు నిన్నరాత్రి ఇక్కడికి వచ్చి చావడిలో పడుకున్నా. దేహబాధ తీర్చుకుందుకు యిలా వచ్చాను. నన్నెందుకు ముట్టుకున్నారు?" అంటూ అవతలికి పోయింది.

వాళ్ళిద్దరూ సిగ్గుపడి నవ్వుకుంటూ - "నయమే. అది భయపడి కేకలువెయ్యలేదు. గొడవయ్యేది. అయినా - పద్మినీ జాతి స్త్రీకి చివరి యామంత ఇష్టమయినదని శాస్త్ర వచనం. అంచేత తెల్లవారు ఝామున వస్తుంది" అంటూ తెల్లవారే వరకూ ఎదురు చూశారు. కాని ఆ యోగిని రాలేదు. తెల్లవారాక వాళ్ళు మనోహరదాసు వద్దకు పరుగెత్తి జరిగినదంతా చెప్పుకున్నారు.

" ఆమె పేరు కులం తెలియకుండా చేసే జపం ఫలించదు. పరిచయం ఉన్నవారితోనే అలాటి తంత్రం ఫలిస్తుంది. మీరాయోగినితో పరిచయం చేసుకురండి. కార్యసాఫల్యం నేను చేస్తాను. వెళ్ళండి" అని మనోహరదాసు వాళ్ళని పంపించేశాడు.

" ఈ వంచకుడు ఊరకే మనసొమ్ము తినేయడమేనా? అది అడక్కుండా వచ్చేశాం. రెండింటికీ చెడ్డాం. గట్టిగా అడిగితే ఏం ప్రయోగం చేసి సాధిస్తాడో అనిభయం. పరిచయం చేసుకుని వొస్తే చూస్తానన్నాడుగా? అదీ చూద్దాం. నువ్వు రహస్యంగా వారి వెంట తిరుగుతూ ఉండు" అని చిదానందుడు బోధించాడు. రమానందుడు అలాగే చేసి ఒకనాడు చిదానందుడితో - "మిత్రమా! రెండవ యోగిని నిన్న బ్రహ్మానందయోగి దగ్గరకొచ్చి - వశిష్ఠమహర్షి ఆశ్రమానికి ఎలా పోవాలి? దారిచూపేవారికి కొంతధనసహాయం చేస్తాను - అని చెప్పింది. ఆ యోగి వృద్ధుడయినా టక్కరికనుక - రెండు మూడు రోజుల్లో మళ్ళీరా చెబుతాను - అన్నాడు. ఇదీ మంచి అవకాశమని నేనొక వ్యూహం పన్నదలుచుకున్నాను. నువ్వు అంగీకరిస్తే కార్యం సఫలమౌతుంది" అన్నాడు. చిదానందుడు - "దీనికెంత ఖర్చయినా సగం నేను భరిస్తాను" అని అంగీకారం తెలిపాడు.

# కాశీ మజిలీ కథలు

## 100. వ మజిలీ

### బ్రహ్మానందయోగి కథ

"రోహిణీ! మనం ప్రయాగవచ్చి పదిరోజులయింది. తీర్థసేవ సరే. ప్రయాణం సంగతి ఏం చేశావ్? ఇక్కడ యోగులు చాలామందే ఉన్నారు. వాళ్ళు దేశసంచారం చేస్తూంటారు కదా?" "జితవతీ! ఇక్కడున్న యోగులు మంచి వాళ్ళలా కనిపించడం లేదు. శివరాత్రి కని వేలకొద్దీ యోగు లిక్కడ చేరారు. నిన్న నేను మఠంలోకి వెళ్ళాను. అందరూ కామ దృష్టితో చూసినవారే. ఒకడు మాత్రం నన్ను ఆ దృష్టితో చూడలేదు. అతను వృద్ధుడు. గోచీమాత్రమే ధరించి శరీరం నిండా విబూది పూసుకుని రుద్రాక్షలు దరించి అపర శంకరుడిలా కనిపించాడు. వేషానికి తగిన చిత్తశుద్ధి ఉందో లేదో అని అనుకుంటూనే నేనతని పాదాలకి నమస్కరించాను.

"స్వామీ! మాది దక్షిణదేశం. అక్కడ వసిష్ఠమతమని ఒకటుంది. మేమామతానికి చెందినవాళ్ళం. మేము వసిష్ఠుని ఆశ్రమం చూడాలన్న వేడుకతో వచ్చాం. మార్గం చెబితే కృతజ్ఞులమై ఉంటాం" అన్నాను. అతను కళ్ళు తెరిచి నన్ను చూసి "ఆలోచించి చెబుతాను. రేపురా" అన్నాడు. రేపు పోయి తెలుసుకు వస్తాను" అంది రోహిణి.

మర్నాడు ఆమె ప్రాతః కాలంలోనే త్రివేణీ స్నానం చేసి ఆ వృద్ధ యోగి వద్దకు వెళ్ళింది. అతను కళ్ళు తెరిచే వరకూ నిరీక్షిస్తూంటే – రమానందుడు వొళ్ళంతా విభూతి, రుద్రాక్షలతో విరాగి వేషంలో వచ్చి – "స్వామీ! నేను రమానందుడిని. మీ ప్రియశిష్యుణ్ని. చాలాకాలానికి మిమ్మల్ని చూడగలుగుతున్నాను" అంటూ ఆ వృద్ధ యోగికి నమస్కారం చేశాడు. అతను కళ్ళు తెరిచిచూసి, "నాకు గుర్తు రావడం లేదు. నువ్వెప్పుడెక్కడున్నావు? ఎక్కడనుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

"నన్నే మరచి పోయారా స్వామీ? నేను మీ మిత్రులయిన బ్రహ్మానందయోగి శిష్యుడిని. మునుపు మా గురువుగారితో వొచ్చి కొన్నాళ్ళున్నాను. మీరు వారూ అద్వైతం గురించి ప్రసంగించలేదా" అన్నాడా శిష్యుడు.

అందుకాయోగి "ఆ జ్ఞాపకం వచ్చింది. బుద్ధిమంతుడివి. నీకు తొందరలోనే ఆత్మజ్ఞానం కలుగుతుందని అనుకున్నాను. సంతోషం మీ గురువు బ్రహ్మానందయోగి – బదరికారణ్యానికో మరెక్కడికో వెళ్ళాడని విన్నాను. ఆయన కుశలమేనా!" అని అడిగాడు.

"స్వామీ! మీ దయవల్ల మా ఆచార్యుడు బాగానే ఉన్నాను. నేను ఆయనతోనే తిరుగుతున్నాను. కిందటేడు బదరికారణ్యంలో ఉండి వశిష్టాశ్రమానికి బయలుదేర బోతూంటే వశిష్ఠులే అక్కడికి వచ్చారు. వారిద్దరూ ఆత్మజ్ఞాన తత్వం గురించి చర్చిస్తూ – కొన్నాళ్ళయ్యాక చంపకారణ్యానికి వచ్చారు. మొన్నటి శివరాత్రికి యిక్కడికి రావలసిన వారే కాని జనసంచారం అధికంగా ఉంటుందని మానేశారు. మా గురువుగారు బ్రహ్మానందయోగీ, నేనూ మాత్రం వచ్చాం. మా గురువుగారు పడమటి వేపు యమునా నదీ తీరంలో ఉన్నారు. ఒకటి రెండు రోజుల్లో మళ్ళీ చంపకారణ్యం వెళ్ళిపోతారు. ఇదే మా వృత్తాంతం" అని వివరించాడు రమానందుడు.

అప్పుడా వృద్ధయోగి – "వసిష్ఠులవారు చంపకారణ్యానికి వచ్చారా! అది ఇక్కడకు దగ్గరేకదా. అయ్యో! పాపం, నిన్న ఎవరోవచ్చి వశిష్ఠమహర్షి ఆశ్రమానికి మార్గం అడిగారు" అంటూంటే,

రోహిణి వారి ఎదుటికి వచ్చి నమస్కరించి – "నేనే మిమ్మల్ని ఆ మార్గం అడిగాడు. మీ దర్శనం వల్ల కార్యసిద్ధి అయింది. మహాత్ములదర్శనం ఊరికేపోదు" అంటూ వారిని స్తుతించింది. "స్వామీ! ఈ బాలయోగిని ఎవరు? వసిష్ఠుని ఆ శ్రమాని కెందుకు వెళ్తూంది?" అని రమానందుడు అడిగాడు.

అందుకాయోగి – "అద్వైత తత్వవేత్త వయివుండీ అలా అడుగుతావేం? అంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆత్మకు స్త్రీ పురుష వివక్షా,

కుల శీల నామాలూ ఉండవు. ఏ జీవుడు ఎప్పుడు ఎక్కడ ఏది చేయాలో ఆ జీవు లాకాలానికి అక్కడే ఉంటాయి. నా కోసం నువ్వొక ఉపకారం చెయ్యి. వీరిని చంపకారణ్యానికి తీసుకెళ్ళి – వీరికి వశిష్ఠమహర్షి దర్శనం చేయించమని మీ గురువుగారికి నామాటగా చెప్పు. చెంత చేరిన వారికోరిక తీర్చనిదే నా మనసు సంతోషించదు. అమ్మా! యోగినీ! ఇతను వయసుకి చిన్నవాడైనా సకల దర్మాలూ తెలిసినవాడు. ఇతని వెంట బ్రహ్మానందయోగి వద్దకు వెళ్ళండి. అతను మిమ్మల్ని వశిష్ఠాశ్రమానికి తీసుకువెళ్తాడు" అన్నాడు.

రోహిణి ప్రశ్నకు సమాధానంగా – "మా గురువుగారు కోసెడు దూరంలో ఉన్నారు. ఇప్పుడే పోయి చూడవచ్చు" అన్నాడు రమానందుడు. "ఆర్యా! మీ గురువుగారు చంపకారణ్యాని కెప్పుడు వెళ్తారో, మా రాకకి అనుమతిస్తారో లేదో కనుక్కుని వచ్చి చెబితే మీకు కృతజ్ఞులమై ఉంటాము. ఇప్పట్నించీ వచ్చి ఏం చేస్తాం?" అంది రోహిణి. "మీకా సందేహం అక్కర్లేదు. వారు సహజంగానే ఉపకార స్వభావులు. ఆ పైన వీరి ఆజ్ఞ. మీ రెప్పుడు వొస్తే అప్పుడే బయలు దేరవచ్చు. మీ బంధువులని తీసుకురండి పోదాం" అన్నాడతను. ఆమె జితవతి దగ్గరకు వెళ్ళి జరిగిన దంతా చెప్పింది. అది విని – "రోహిణీ! పట్టుదల కలవారికి దైవం సాయం చేస్తాడు. ఇది కల్పనలా నువ్వనుమానిస్తున్నావు. అలా కుత్రపన్నడం వల్ల వాళ్ళకేం లాభం? మనదగ్గర ధనంలేదు. బూడిద పూసుకు తిరిగే మనని వలచేవా రెవరు? పద, పోదాం" అని ఆమెను తొందర చేసింది. వాళ్ళిద్దరూ వృద్ధ యోగి వద్దకు వెళ్ళి నమస్కరించారు.

అతను వాళ్ళని చూసి – "మీ రిద్దరేనా వెళ్ళాలను కుంటున్నవారు? శుభం. ఇతని వెంట వెళ్ళండి. బ్రహ్మానంద యోగి దగ్గరకు తీసుకెళ్తాడు. తరవాత అతనన్నీ చెబుతాడు" అని దీవించి రమానందునితో వెళ్ళమన్నాడు.

వాళ్ళు రెండు గడియలలో బ్రహ్మానంద యోగిని చేరుకున్నారు. యమున వొడ్డునకల తోటలో మర్రిచెట్టు కింద పులితోలు మీద కూర్చుని కళ్ళుమూసుకుని జపంచేసుకుంటున్నా డతను. అతని జడలు సగం సగం తెల్లబడి ఉన్నాయి. దేహం దృఢంగా ఉంది. విభూతి, రుద్రాక్షలు,

ధరించి మహానుభావుడిలా వున్న అతను ఏభైఏళ్ళు దాటిన వాడిలా కనిపిస్తున్నాడు. ఆ యోగి పక్క ఒక శిష్యుడు కూర్చుని జపమాల తిప్పుతున్నాడు. చెట్లకొమ్మలకు వస్త్రాలు ఆరవేసి ఉన్నాయి. వాళ్ళిద్దరూ అతనికి భయభక్తులతో నమస్కరించి వినయంగా నిలబడ్డారు. ఆ శిష్యుడు రమానందుణ్ణి చూసి – 'మిత్రమా ఈ స్త్రీ లెవరు? ఇక్కడి కెందుకొచ్చారు? స్త్రీ ప్రసంగమంటేనే మనగురువు మండిపడతారుకదా, వీరినెందుకు వెంటతీసుకొచ్చావ్?" అని అడిగాడు. అతను జరిగింది చెప్పి – "వీరికుపకారం చేయమని మనగురువుగారికి చెప్పు" అని కోరాడు.

అంతలో ఆ యోగి కళ్ళు తెరచి – జపమాల చెవులకు తగుల్చుకుని కమండలంలోని నీళ్ళతో కళ్ళు తుడుచుకుని శిష్యుడివేపు చూస్తూ – "రమానందా! త్రివేణికి వెళ్ళి ఇంత ఆలస్యం చేశావేం? నా మిత్రుడు ప్రద్యుమ్నయోగి కనిపించేడా?" అని ప్రశ్నించాడు.

అతను జరిగినవి చెప్పి – "మీరు చంపకారణ్యం వెళ్తారని విని ఈ యోగినులను మీ వద్దకు పంపారు. వీరిని వసిష్ఠమహర్షి వద్దకు తీసుకు వెళ్ళమని మరీ మరీ చెప్పమన్నారు. వీరివల్ల కొంచెం ఆలస్యం అయింది" అన్నాడు. ఆ యోగి వీరి మీద చూపులు ప్రసంరింప జేసేసరికి వీరాయన పాదాలమీదపడి – "మహాత్మా! రక్షించండి. మేము మీ శిష్యురాళ్ళ మయ్యాం. వసిష్ఠదర్శనం చేయించండి" అని ప్రార్థించాడు. ఆ సమయంలో శిష్యు లక్కడినుంచి వెళ్ళిపోయారు.

అప్పుడు బ్రహ్మానంద యోగి – "లెండి లెండి మీ ధృఢసంకల్పాన్ని మీ వేషాలే చెబుతున్నాయి. విరక్తితో యోగినులయిన మీ పూర్వ వృత్తాంతం అడగకూడదుకదా. మీరు వషిష్ఠుణ్ణి తత్వం తెలిసికోవాలని చూడబోతున్నారా, లేక మరేదయినా కారణముందా?" అని మెల్లగా అడిగాడు. జితవతి తనవేపు చూడగా – రోహిణి ఇలా అంది. "స్వామీ! మీతో యదార్థం చెప్పకతప్పదు" అంటూ యోగసక గురించి చెప్పింది. అదివిని అతను తలపంకిస్తూ – "నీ కృతజ్ఞత ఎంతో కొనియాడదగింది. ఆ ముని దయాహృదయుడు. మీ కోరిక తీర్చవచ్చును. ఇప్పుడే పోదాం పదండి" అనేసరికి జితవతి పొంగిపోతూ – "స్వామీ! ఆ మహర్షితో మీరు కొన్నాళ్ళు సహవాసం చేశారటకదా? మనం వెళ్ళేవరకూ వీరు చంపకారణ్యంలో ఉంటారా? అరుంధతీ మహాదేవి

కూడా వొచ్చిందా? వాళ్ళు మమ్మల్ని కనికరిస్తారా?" అంటూ ప్రశ్నలు వేసేస్తూంటే - రోహిణి ఆమెను వారించింది. "వీరినెందుకు శ్రమపెడతావు? అక్కడికి వెళ్ళాక అన్నీ తెలుస్తాయి కదా. ఓపికపట్టు" అంది. బ్రహ్మానందయోగి -"మీరెంతో శ్రమపడి నిద్రాహారాలు మాని, అడవులుదాటి తనవద్దకు వచ్చారని తప్పకుండా జాలిపడతాడు. లేకపోతే వశిష్ఠ మహర్షికి లోకనింద రాదా? అతిధికోరికతీర్చకపోతే తనపుణ్యం అతనికి పోయి అతనిపాపం గృహస్థునికి వొస్తుందని శాస్త్రం" అని, శిష్యులని పిలిచి ప్రయాణానికి సిద్ధం చేయమన్నాడు. శిష్యులు - శాటీలు, కమండలాలు, నాగబెత్తాలు మొదలైనవి మూటలు కట్టారు.

యోగదండం పట్టుకుని అతను ముందు నడుస్తూంటే వాళ్ళతని వెనుక నడవసాగారు. అప్పుడు రోహిణి 'విధి ఎంత చిత్రమయింది! అంతఃపురాలలో నివసించే కన్య యిలా మహారణ్యంలో ముళ్ళతోవలలో కాలినడకతో ప్రయాణిస్తూంది! ఈ పడుచు బైరాగులిద్దరూ ఎక్కడికో తీసుకుపోతున్నారు! చిదానందుడు, బ్రహ్మానందయోగిని కలుపుకుని యిలా కుట్ర చేయడంలేదుకద? నేనెంత ఆలోచించి చెప్పినా జితవతి వినదు. వసిష్ఠుడీ అడవిలో ఎందుకుంటాడు. తమమీది మోహంతో వీళ్ళు ఇలాటి పగ్గాగం పన్నారేమో. ఏం జరుగుతుందో చూడవలసిందే తప్ప విధినతిక్రమించలేం కదా! అనుకుంటూ కొంచెం ఎడంగా నడవసాగింది.

నడుస్తూ - బ్రహ్మానందయోగి శిష్యులడగగా తత్వవిశేషాలు వివరించసాగాడు. ' ఈ ప్రపంచమంతా అసత్యం ఇంద్రజాలం. అలాటప్పుడు శరీరం సంగతి వేరే చెప్పడమెందుకు? ఇంద్రియ వ్యామోహం వల్లనే యీ అజ్ఞానం కలుగుతూంది" అంటూ తనమాటలు ఆ స్త్రీలు వింటున్నారో లేదో అని చూసి - విద్వాంసు లెప్పుడూ మోహం చెందరు. లోకప్రవృత్తి తెలుసుకుని దుర్గుణాలు వదిలి శమదమాదిసంపత్తి కలిగినవాడు ముక్తుడౌతాడు." అన్నాడు. ఆ మాటలు జితవతి కెంతో నచ్చాయి. రెండుమూడు రోజులు ప్రయాణం చేశాక వారు చంపకారణ్యం చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 101. వ మజిలీ

### మాయా వసిష్ఠుని కథ

యాభైయ్యేళ్ళు పైబడిన వయసు. నల్లని శరీరం పళ్ళు ఊడిపోయాయి. చప్పిదవడలు, లోతుకుపోయిన కళ్ళు, శరీరం ముడతలు పడిపోయింది. ఒంటినిండా విభూతీ, రుద్రాక్షలు. ఆవేషం కృత్రిమంగా ఉంది. అది వేసుకున్న వేషమని యిట్టే తెలిసిపోతూంది. అరణ్యంలో ఒకచెట్టుకింద పులితోలు మీద కూర్చుని అతను జపం చేసుకుంటున్నాడు. వీళ్ళు రావడం చూసి –

"ఓహో! బ్రహ్మానందుడా! ఇంత ఆలస్యం చేశావేం! నీకోసం ఎదురు చూస్తున్నాను" అన్నా డతను. "మహాత్మా! వెళ్ళింది పుణ్యక్షేత్రం. అదలా ఉండనీండి. ఇప్పుడు మీకు మరొక విషయం చెప్పాలి. ఈ బాలయోగినులు సకలభోగాలూ విడచి ఎంతో దూరం నుంచి మీ దర్శనం కోసం వచ్చారు. నన్ను ఆశ్రయించడం వల్ల యిక్కడికి తీసుకొచ్చాను. వీరి కోరికేమిటో తెలుసుకుని సఫలం చెయ్యండి" అని అత ననగానే వారిద్దరినీ రప్పించాడు.

జితవతి అతని పాదాలమీద వాలి – "మహాత్మా! కరుణించి నా విన్నపం ఆలకించండి" అంటూ అతన్ని స్తుతించి యోగసక తనకి వరమివ్వడం, పరోపకారం కోసం వసువులచేత హెూమధేనువుని తెప్పించడం, అందుకు వశిష్ఠుడు వసువులని శపించడం అంతా చెప్పి –" ఆ శాపమెలాటిదో చెప్పండి. వారిని కనికరించి శాప విముక్తులని చేయడం ఉచితం. అలాకాదంటే – వారి నేరానికి మూలకారణమయిన

నా మీదకు ఆ శాపాన్ని మరలించండి. అంతవరకూ నా హృదయం శాంతించదు. మీ పాదాల మీంచి లేవను. ఇక్కడే ప్రాణాలు వదులుతాను-" అని గొల్లున ఏడుస్తూ మొరపెట్టుకుంది.

అప్పుడా యోగి - "అబలా! వసువులు చేసిన అపరాధం క్షమించదగినది కాదు. వారిపేరు చెబుతేనో నాకు ఆగ్రహం వొస్తూంది. కొన్నాళ్ళిక్కడ ఉండు. మనసు స్థిమితపడ్డాక అంతా చెబుతాను. విచారించకు" అన్నాడు.

"స్వామీ! వారిప్పు డెక్కడున్నారు? యోగసక కూడా వారితో ఉందా! ఏమని శపించారు? ఆమెను నేను చూడగలనా?" అని జితవతి అడిగినా అతను మాట్లాడకుండా కళ్ళు మూసేసుకున్నాడు.

బ్రహ్మానందయోగి కలగజేసుకుని - "నువ్విప్పుడు ఎక్కువ మాట్లాడితే వారికి కోపం వస్తుంది. కొన్నాళ్ళిక్కడ ఉండి శుశ్రూష చెయ్యి. అల్పసంతోషులయిన వారికి దయకలిగి నువ్వు చెప్పినట్లు చెయ్యగలరు." అన్నారు. అందర్నీ కూర్చోమన్నాడు. రోహిణి మాత్రం కొంచెం పక్కగా ఉండి ఆ యోగిముఖమే చూస్తూంది. జితవతి మెల్లగా - " యోగీంద్రా! అరుంధతీ దేవి వీరితో రాలేదా?" అని అడిగింది.

"ఆ దేవి వారి ఆశ్రమంలోనే ఉంది. వీరు విలాసంగా తీర్థాటనం చేయడానికి వచ్చారు. నీ పుణ్యం కొద్దీ వచ్చారు. కొద్దిరోజుల్లో వారి ఆశ్రమానికి వెళ్ళిపోతారు. ఇది వారి స్థానంకాదు" అంటూ ఏవేవో చెప్పాడు కాని ఆ స్త్రీలకు అనుమానం పోలేదు.

అతను వారిద్దరికీ కొంచెం దూరంలో పర్ణశాల వేయించి దానిలో ఉండమన్నాడు. అక్కడకు వచ్చి ఏకాంతంలో వాళ్ళిద్దరూ తమ అనుమాలని ఒకరికొకరు బయట పెట్టుకున్నారు. ఆ యోగి ముఖంలో తేజస్సు లేకపోవడం, ఎప్పుడూ భర్తని అంటిపెట్టుకునే ఉండే అరుంధతి లేకపోడం...గురించి మాట్లాడుకున్నారు. వారిని రహస్యంగా పరీక్షించి

రమ్మని జితవతి రోహిణికి చెప్పింది. ఒకనాటి రాత్రి వారి సంభాషణ వినపడింది.

రమానందుడు : ఏమిరా! దిట్టంగా మాట్లాడవేం వాళ్ళముందు? నువ్వు వశిష్ఠుడివి కావని వాళ్ళకి అనుమానం వచ్చేసి నట్లుంది.

యోగి : నేనేం చేసేది? నాది బోసినోరు. వాళ్ళు చాలా గండ్రలు. మాట్లాడితే తప్పుపడతారు.

చిదానందుడు : వీడు ఈ వేషానికి తగడు. ఈ వేషం బ్రహ్మానందుడికి వెయ్యవలసింది.

రమానందుడు : మొదట అంత బాగా నటించకపోతే వాళ్ళు నమ్మి యింత దూరం రావొద్దూ? ఇప్పుడెలాగయినా మన చేతిలోని వారే. ఎక్కడికి పోగలరు?

బ్రహ్మానందుడు : వీణ్ని చూస్తే మనకే అసహ్యం వేస్తోంది. నిజంగా వసిష్ఠుడొచ్చినట్లు మాట్లాడొద్దూ?

రమానందుడు : మరెవరూ దొరకలేదు. ఈవెధవయినా పదిమాడా లిచ్చాక కానీ రాలేదు.

చిదానందుడు : పోన్లెండి. ఇప్పుడేమనుకుంటే ఏంలాభం? మా చేతి సొమ్మొదిలిందే తప్ప ఇవాళ వాళ్ళు ఇక్కడికి రానేలేదు. జితవతికి మొదటున్న భక్తి ఇప్పుడు లేదు.

రమానందుడు : బ్రహ్మానందా! మేము వేకువ జామునే లేచి ప్రయాగ వెళ్ళి మనోహరదాసుతో మాట్లాడి వస్తాం. మీరీలోగా వాళ్ళకి చెప్పవలసిన మాటలు చెప్పండి. ఒప్పుకుంటే సరే, లేకపోతే బలాత్కారమే చేస్తాం.

బ్రహ్మానందుడు : మనోహర దాసుతో మాట్లడవలసిన అగత్యమే మొచ్చింది.

రమానందుడు : వాడు కూడా మానుంచి సొమ్ము తిని కపటం చేసినవాడే. కలిసిమెలిసి తిరుగుతూంటే వొస్తే ఏవో తంత్రాలు చెబుతాన్నాడు. ఇప్పుడు అలాటి అవకాశం వచ్చింది. వానిదగ్గర వశీకరణ ఔషధాలు తీసుకుని వస్తాం.

అని అతనూ చిదానందుడూ వెళ్ళి మనోహరదాసుని కలుసుకుని - "నీ అవసరం మళ్ళీ కలిగింది. వాళ్ళు మాతో తిరుగుతున్నారు. కాని మాట్లాడరు. వాళ్ళ నెలావశం చేసుకోవాలో తంత్రం చెప్పు. మీద మందు చల్లినంతనే మోహంతో వశం అవాలి." అన్నారు. అతను మళ్ళీ కొంత డబ్బు తీసుకుని - "మీమీద ప్రేమతో సిద్ధౌషధం ఇస్తున్నాను. ఈ ఆకు నీటిలో ముంచి పసరు తీసి కోరిన స్త్రీ శిరోభాగం మీద రుద్దాలి. అది శరీరం కలవడమేమిటి, ఆమె అతనికి వశమై, అతను మన్మథుడిలా కనిపిస్తూ అతనివెంటే కుక్కలా తిరుగుతుంది" అని ఒక ఆకు ఇచ్చి పంపాడు.

వాళ్ళు ఆనందంగా చంపకారణ్యానికి పోతూ యిలా వాదు లాడుకున్నారు.

*చిదానందుడు* : ఆ మందు నాకిస్తూంటే నువ్వు అడ్డం వొచ్చి అందుకున్నావేం? నా దగ్గర అది ఉండకూడదనా?

*రమానందుడు* : అంత కచ్చితంగా అడుగుతున్నావే! మొగం చిట్లించి మరీని. అడగడాని కదాపద్ధతి?

*చిదానందుడు* : సరే! ఇంతకీ ఆమె మీద పసరు పిండేవారు ఎవరు?

*రమానందుడు* : నేను నీ కంటే చిన్నవాడిని కనుక నేను పిండుతాను. వశమయ్యాక నీకిస్తాను.

*చిదానందుడు* : కపటం చెయ్యకు. పసరుపిండిన వాడికే అది తగులుకుంటుంది. రెండోవాడిని కన్నెత్తి చూడదు.

*రమానందుడు* : మనోహరదాసు అలా చెప్పినా, నేను బలవంతం చేసి దాన్ని ఒప్పించనా?

*చిదానందుడు* : ఆ మాటలు నేను నమ్మను. నేను పిండితే నాకే వశమౌతుంది. నీకు అలాటి నమ్మకముంటే నన్నే పిండనీ.

*రమానందుడు* : నీ పాటి తెలివి తేటలు నాకూ ఉన్నాయి. నువ్వు నాకంటె బలవంతుడివి కావు. నామాట నమ్మితే నమ్ము. అంతే తప్ప ఆకుమాత్రం నీకివ్వను.

చిదానందుడు : చేతిలో పడిందని పసరాకు ఇవ్వకపోడం మోసం. కానియ్, నాకంఠంలో ప్రాణమున్నంత వరకూ నిన్ను పసరు పిండనివ్వను. చూడు.

రమానందుడు : నీ బలమెంతో చూస్తాను, రా.

అంటూ వేగంగా పరుగెత్తాడు. చిదానందుడు అతని వెనక అరుస్తూ పరుగెత్తసాగాడు. ఇద్దరూ పర్ణశాల చేరుకున్నారు. అక్కడెవరూ లేరు. కపట వసిష్ఠుడూ లేడు. ఆ ప్రాంతంలో యోగినులతో సహా ఎవరూ లేరు. అప్పుడు చిదానందుడు

"దైవం లేడా? మిత్రద్రోహం చేసేవాడికి విఘ్నం కలగజెయ్యడా? ఆ పసరు నువ్వే రాసి ఆమెను పొందు. నేను విచారిస్తూ పోతాను" అని చిదానందుడు నిందించేసరికి రమానందుడు -

"ఊరికే అలా అన్నాను కాని నీకుద్రోహం చేస్తానా? మన స్నేహం యీనాటిదా? ఇదుగో,పసరు నీ దగ్గరే ఉంచు. ఆమె కనపడగానే నువ్వే పిండు" అంటూ అతని చేతిలో పెట్టాడు.

చిదానందుడు తల ఆడిస్తూ "పిట్టలపోరు పిల్లితీర్చినట్లు బ్రహ్మానందయోగి దాన్ని ఎక్కడికో తీసుకుపోయాడు. అది కనపడదనే నువ్వు నాకు పసరిచ్చావు. కాని నాకు దెలియననుకోకు. ఎలాగేనా మంచిదే" అంటూ దానిని మూట కట్టుకున్నాడు. బ్రహ్మానందయోగి ఆ స్త్రీలను తీసుకు పోయాడని నిశ్చయించుకుని అడవి వెదుకుతూ వాళ్ళు ప్రయాగ వచ్చారు. అక్కడ ప్రద్యుమ్నయోగితో - "మహాత్మా! బ్రహ్మానందయోగి ఎలాటి పనిచేశాడో చూశారా! మీకు కొంచెం ధనం సమర్పించి మీ మూలంగా ఆ యోగినులను అతనివశం చేశాం. అతనికి ఏభైమాడ లిచ్చాం. మా సొమ్ము తీసుకొని మాకే ఎసరు పెట్టాడు" అని దీనంగా మొరపెట్టుకున్నారు. మీ పని కాలేదా? బ్రహ్మానందయోగీ ముసిలాడూ పొద్దుట కనపడినా ఏమీ చెప్పలేదే! అతను వృద్ధుడు కాడా? అలా చేస్తే అతనికేం లాభం? అన్నాడతను.

"బ్రహ్మానందు డిక్కడే ఉన్నాడా! అతన్ని వెదికిపట్టుకుని ఇక్కడికి తీసుకొస్తాం. న్యాయం విచారించి మా సొమ్ము మాకిప్పించండి. అనవసరంగా అప్పుల పాలైపోయాం" అని వారు వెళ్ళి వెదికి ఒకచోట అతనూ కటపయోగీ పడుకుని ఉండగా పట్టుకున్నారు.

"వత్సలారా! మీ కోసమే చూస్తున్నాం. మీరు వెళ్ళగానే వాళ్ళని పిలుద్దామని నేను వారి పర్ణశాలకి వెళ్ళాను. వాళ్ళు లేరు. తెల్లవారకముందే ఎక్కడికో పారిపోయారు. అడివంతా వెదికి, ఎక్కడా వారు కనపడక, చివరికిక్కడికి చేరుకున్నాం. వాళ్ళకి మనకపటం తెలిసి పోయినట్లుంది. ఈ బోసినోటి వాడివల్లే గ్రహించేసి ఉంటారు" అన్నాడు బ్రహ్మానందుడు. "అదంతా నిజమే కావొచ్చు. కాని మేము వొచ్చేవరకూ అక్కడ ఉండకుండా ఎందుకొచ్చేశారు? వాళ్ళని మేము మీకు అప్పగించాం. మీకు తెలియకుండా పారిపోడానికి వాళ్ళకు రెక్క లున్నాయా? చీకటిలో పోలేరు కదా? మీరే వాళ్ళని దాటించేశారు. కనక మేం మీ కిచ్చిన లంచం. సొమ్ము మాకిచ్చేయండి లేదా వాళ్ళ నప్పగించండి. ఈ రెండింటిలో ఏది చేస్తారో చెప్పండి" అని అడిగారు. అందుకు బ్రహ్మానందుడు "మీరు వేయించిన వేషాలు వేశాం. చేయవలసిన నటన చేశాం వాళ్ళని కాపలా కాసేపని మాది కాదు. మేము పెద్దవాళ్ళం. అడవులలో వేగంగా తిరగలేం. దైవసాక్షిగా మేం మిమ్మల్ని మోసం చెయ్యలేదు. అందుచేత మీకు సొమ్మివ్వవలసిన అవసరం లేదు." అనేశాడు. "మా నుంచి మీరు చాలా సొమ్ము లంచం తిన్నారు. ఫలం మాకు దక్కలేదు. ఇది చాలా అన్యాయం. ప్రద్యుమ్నయోగి దగ్గరకు పదండి. అతను చెప్పినట్లు చేద్దాం" అంటూ చిదానందుడు వారిని అతనివద్దకు తీసుకుపోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 102. వ మజిలీ

యమునా నదీ తీరంలో ప్రద్యోతన నగరం ఉంది. అకస్మాత్తుగా పొంగిన యమునని చూడడానికి పొద్దుటే గ్రామప్రజలు తీరానికి వచ్చారు. ఆ నది సుడులతో, కెరటాలతో అల్లకల్లోలంగా ఉంది. మహావృక్షాలు కొట్టుకుపోతున్నాయి. ఈతగాళ్ళు పెద్ద పెద్ద మానులని ఒడ్డుకు చేర్చడానికి వరద నీటిలో ఈదుతున్నారు. ఒక పెద్ద మాను కొట్టుకు వస్తూంటే యివతలి వొడ్డునుంచి కొందరూ, అవతలి వొడ్డునుంచి కొందరూ యీతగాళ్ళు దానికోసం యీదసాగారు. ప్రజలు ఎవరికామాను అంకుతుందా అని పందాలు వేసుకుంటున్నారు.

ఆ మానుమీద అలసట తీర్చుకుంటూ పడుకున్న పులి ఒక్కసారి గాండ్రించేసరికి వాళ్ళు - "బాబోయ్ పులి" అంటూ దూరంగా ఉండిపోయారు. ఆ పులి మానుమీంచి నీటిలోదిగి వొడ్డువేపు ఈదుకుంటూ రాసాగింది. ప్రజలు దానినదిలించడానికి అరుస్తూ చప్పట్లు కొట్టసాగారు. ఆ గోలకి - పులిమీద పడుకున్న యువతి అదిరిపడి లేచి తీరం వేపు చూడసాగింది. పులి ఆమెను వొడ్డు చేర్చేసరికి జనం అటూ యిటూ పారిపోయారు. ఆమె పులిమీంచి దిగి తన బట్టలు పిండుకుని పులికి వొళ్ళు తుడిచింది. దానిని ముద్దు పెట్టుకుని - "మృగరాజమా! నేను నీకేం ఉపకారం చేశానని నన్ను చంపకుండా యీ వొడ్డు చేర్చావు? నేను వొట్టి కృతఘ్నురాలిని. అందరి నుంచీ ఉపకారాలు పొందడమే తప్ప బదులుగా ఏమీ చేయలేని దాన్ని. నీతోటి పులీ, నీ సఖీ కొట్టుకు పోయారు. వాళ్ళని కలుసుకుందాం, పద." అంటూ నడవసాగింది. ఆ పులి తోకాడిస్తూ ఆమె వెనక నడవసాగింది.

అదిచూసి ప్రజలు "ఓహో! ఇది పెంపుడు పులి కాబోలు. అనవసరంగా బెదిరిపోయాం" అంటూ దానిదగ్గరనుంచే నడవడం

మొదలు పెట్టారు. ఒక కొంటెవాడు దానిమీద రాయి విసిరేసరికది కోపంతో గాండ్రుమని అరుస్తూ వాడిని తరుముకుని వెళ్ళి పొట్ట చీల్చ బోయింది. ఆ యువతి ఆ ఆపదను తప్పించింది. ప్రజలు - "కాళిందీ ప్రవాహంలో ఒకయోగిని పులితో కొట్టుకువచ్చి గట్టెక్కింది. ఆ పులి కనిపించిన వారందరినీ చంపేస్తూంది. యమున కెవరూ పోకండి" అని చెప్పుకోసాగారు. ఆమె నదివొడ్డున కొంతదూరం దక్షిణంగా పోయింది. ఆమె వెంట కుక్కలా వొస్తున్న పులిని చూసి పశువులూ, బళ్ళను లాగే ఎద్దులూ, గుర్రాలూ మొదలయినవి పగ్గాలు తెంపుకుని పారిపోసాగాయి. అప్పుడు భటులు కొందరు ఆయుధాలు ధరించి వచ్చి - "నువ్వెవరివి? క్రూరమృగాన్ని ఎందుకు తీసుకొస్తున్నావు? దీనిని చూసి పౌరులు బెదిరి పోతున్నారు. నువ్వు నగరంలోకి రావద్దు. మేము దీనిని చంపేస్తాం" అంటూంటే అది వాళ్ళమీద పడి వాళ్ళని చెల్లాచెదరు చేసింది.

అప్పు డామె దానివీపు నిమురుతూ - "శార్దూలమా! నువ్వు ఇలా చేస్తూంటే ప్రజలు నిన్ను బతకనిస్తారా? ప్రాణ బంధువువైన నువ్వు చనిపోతే నాగతేమిటి? ముందు నన్ను చంపెయ్. వాళ్ళు నీ జోలికి రాకపోతే నువ్వు ఎవరి జోలికి వెళ్ళవు. అది తెలియక వాళ్ళు నిన్ను చూసి భయపడుతున్నారు. చూడు, వీధంతా నిర్జనమయింది. ప్రజలు ఇళ్ళల్లో దూరి తలుపులు మూసుకున్నారు. వీళ్ళని బాధ పెట్టడం దేనికి? అంటూ మరోదారిని పోతూంటే ఎత్తయిన ప్రాకారంతో ఒక చక్కని దేవాలయం కనిపించింది. అక్కడ ఉంటే ఎవరికీ ఇబ్బంది కలగదని ఆమె ఆ ఆలయంలోకి నడిచింది.

# రాజయోగి కథ

ఆ ఆలయంలో ఉత్తర దిక్కుచావడిలో రాజయోగి అనే సన్యాసి నివసిస్తున్నాడు. వయసులో చిన్న వాడే కాని ప్రగల్భాలలో, చాలా పెద్ద. తన మాటలతో మహానుభావుడని తోపించి ప్రజలను మంత్రాలకీ, తంత్రాలకీ, సంతతికీ, సంపదలకీ తనచుట్టూ తిప్పించుకుంటూ ఉంటాడు.

పౌరులు కొంద రతని వద్దకు వెళ్ళి పులి గురించీ చెప్పి ఆ యోగిని గురించీ వర్ణించి చెప్పి ఆ ఉపద్రవాన్ని తప్పించమని కోరారు. అందు కతను – "యోగిని పులితో వచ్చిందా! మీరు భయపడకండి పులినీ, చెలినీ కూడా మంత్రంతో బంధించి యిక్కడికి రప్పిస్తాను" అంటూండగానే ఆ యోగిని పులితో సహా గుడికి ప్రదక్షిణం చేస్తూ ఉత్తర దిక్కుకి వచ్చింది. పౌరులు – "పులిబాబోయ్!" అంటూ కేకలు వేసి స్థంబాల చాటునా తలుపు వెనకా దాగున్నారు. రాజయోగి అందరికంటే ముందుగానే గదిలో దూరి కిటికీ లోంచి చూడసాగాడు.

పులి ఎవరివేపూ చూడకుండా ఆమె వెనుకే వెళ్ళిపోయింది. ప్రజలు బతుకు జీవిడా అనుకుని – "స్వామీ! మీరు అన్ని చెప్పి పులిని చూసి లోపలికి దూరారేం? పులి అవతలకి వెళ్ళిపోయింది. తలుపు తియ్యండి" అన్నారు. అతను తలుపులు తెరిచి – "లోపలికి రండి. అది మళ్ళీ యిటొస్తుంది. భస్మంజల్లి వశపరుచుకుంటాను. నామహిమ వల్లే ఇటు వచ్చింది" అంటూ లోపలికి రమ్మని తలుపువేసి మంత్రించ సాగాడు.

అంతలో రెండో ప్రదక్షిణం చేస్తూ యోగిని పులితో, అటు వచ్చింది. ఆ మంత్ర భస్మం పులిమీద చల్లుతూ ఆ యోగిని దేహ సౌందర్యం చూస్తూ రాజయోగి పరవశంలో మునిగిపోయాడు.

"స్వామీ! మంత్రభస్మం చల్లారుకదా? ఇక మేం పోవచ్చునా?" అని వాళ్ళు అడిగారు. "వెళ్ళండి. అది మీ జోలికి రాదు" అన్నాడతను.

మూడో ప్రదక్షిణంలో ఒక మొండివాడు చొరవజేసి దాని వెంట నడిచాడు. అది ఏమీ అనకపోడంతో వాళ్ళంతా అతను దానిని మంత్రం చేత బంధించాడనుకుని మెల్లగా నడవసాగారు. ఆమె దేవుణ్ని ధ్యానిస్తూంటే పులి ఆమె దగ్గర గద్దె వేసుకుని కూర్చుంది. ప్రజలు ఆ దృశ్యాన్ని వింతగా చూడసాగారు.

కొందరతని వద్దకు వచ్చి – "మహాత్మా! మీ మంత్రమహిమ పొగడదగింది. చూసినంతనే మీదపడి చంపుతుందని చెప్పుకున్న ఆ

పులి ఎవరి జోలికీ పోక దూడలా దేవుని ముందు గద్దె వేసుకుని కూర్చుంది. మీరు కూడా వచ్చి చూడండి" అన్నారు.

"ఇదో పెద్ద అద్భుతమా? పులినేకాదు ఆ చెలిని కూడా శిష్యురాలిని చేసుకుంటాను, చూడండి" అంటూ ఆమె వద్దకు నడిచాడు. ఆమెను ఎగాదిగా చూసి – "యోగినీ! ఇటుచూడు. నీ కంటె పెద్దలమైన యోగులం యిక్కడ ఉండగా నమస్కరించక పోవడం తిరస్కార భావం కదా? ఉత్తర దేశ అరణ్యాలలో చాలా కాలం తపస్సు చేసి లోకోపకారానికై దేశాటనం చేస్తున్నాను. నాపేరు రాజయోగి. నా నివాసానికిరా. మంత్ర రహస్యాలు ఉపదేశిస్తాను" అన్నాడు.

ఆమె ఒక్కసా రతన్ని చూసి కపటి యోగి అని నిశ్చయించుకుని ఏమీ మాట్లాడకుండా కళ్ళు మూసుకుంది. అతను కోపంగా – "మంచి యోగనివే! నా మహిమ తెలియక నన్నవమానిస్తున్నావు. నీ పులిని లొంగదీసినట్లే నిన్నూ నీ గర్వాన్నీ అణుస్తాను సుమా. నా పాదాలు పట్టుకుని శరణు వేడకపోయావో నిన్ను కుక్కని చేసేస్తాను" అంటూ అరచేతిలో భస్మం పట్టుకుని ఊదుతూ ఏవో మంత్రాలు పలికాడు. ఆమె ముఖం చిట్లించడం చూసి ఆ పులి అతని తొడ పట్టుకుని అవతలికి ఈడ్చుకుపోయింది. అప్పుడామె – "అయ్యో! చంపకు. మృగరాజా! వదులు" అంటూ అరుస్తూ ఆమె వెంటపడింది. అంతటితో పులి అతన్ని వదిలి ఆమె వద్దకు వచ్చింది. "పులి సన్యాసిని చంపేసింది. మనని కూడా చంపుతుంది" అంటూ జనం పారిపోయారు.

# కాశీ మజిలీ కథలు

## 103. వ మజిలీ

## ప్రభాకరుని కథ

**ప్రద్యోతనుడు** : తరవాతేం జరిగింది.

**అర్చకులు** : దేవా! రాజయోగి వట్టి డాంబికుడు. అతనికి మంత్ర శక్తేమీ లేదు. ఆ చిన్నది అడ్డుపడకుండా ఉంటే ఈ పాటి కా రాజయోగి స్మశానంలో చితిపై ఉండేవాడు.

**రాజు** : రాజయోగి బతికే ఉన్నాడా?

**అర్చకులు** : చావయితే తప్పింది కాని గాయా లింతట్లో మానవు. గోపురం వేదిక మీద పడి మూలుగుతున్నాడు. అది అలా ఉండనివ్వండి. ఇవాళ స్వామికి నిత్య నైవేద్యం లేదు. గుడిలోకి పోడానికి భయం వేస్తోంది. ఏం చెయ్యాలో చెప్పండి.

**రాజు** : కుమారా! ప్రభాకరా! యోగిని కథ విన్నావుకదా. నువ్వు పోయి ఆ ఉపద్రవం ఆపి ప్రజలను కాపాడు. పులి దగ్గరకు వెళ్ళక వినయంగా ఆ యోగినిని ప్రార్థించి అవతలికి పంపు.

**ప్రభాకరుడు** : ఏమిటీ! ఆ పులి యీ వూళ్ళో యింత క్రూరంగా చంపుతూంటే నా కెందుకు చెప్పారుకారు? రాజయోగినే కరిచిందా! అతను బహుతంత్రవేత్త నని నాతో చెప్పాడే! ఆ యోగిని అతనికంటె గొప్పది కాబోలు.

**రాజు** : బాబూ! జాగ్రత్త మహాత్ముల ప్రభావం మన ఊహ కందదు. శాంతంగా ఉపద్రవం తొలగించు.

ప్రభాకరుడు తగిన పరివారంతో అర్చకుడి వెంట ఆలయానికి వెళ్ళి రాజయోగిని పలకరించి - ఇది ప్రారబ్ధం. ... అంటూ ఊరడించి

– వేరొక మందిరానికి పంపాడు. అతను గుడి లోపలికి వెళ్ళాలనుకుంటే అర్చకులు వారించారు. అందుచేత అతను ప్రహరీ గోడమీదుగా లోనికి చూడసాగాడు.

అప్పటి కాయోగిని రెండు చేతులతోనూ ఆ పులినోరు పెకలించి పళ్ళు తినిపిస్తూ "మృగేంద్రమా! నన్నెందుకిలా వేధిస్తావు? ఆహారం తినకుండా ఎన్నాళ్ళు ఉపవాసం చేస్తావు? ఈ పళ్ళు తిను. నీ డొక్కలు ఎండిపోయాయి. నీ సహవాసం నా కెందుకొచ్చింది? నీ వల్లనే యోగసక శాపగ్రస్తురాలయింది. నువ్వుకూడా నిరాహారంగా మరణిస్తే నాకు మరింత విచారం" అంది. ఆమె చేతిని నోట్లోంచి తీసేసరి కది పళ్ళను కక్కేసింది. ఆ వింతను చూసి ఆశ్చర్యపోతూ – "ఈమె యోగిని కాదు. జగన్మోహిని. ఇదెక్కడి అందం! ఎక్కడిపులి? ఆమె పులినోట్లో చెయ్యి పెట్టినా కరవలేదే! రాజయోగిని ఎందుకు కరచింది! ఈ యోగినిని చూస్తూంటే వాకు మన్మథ భావం కలుగుతూందే! ఈమె నెక్కడో చూసినట్లుందే! ఇలాటి శాంతమూర్తి పులిచేత ప్రజలని బాధిస్తుందా? పులి చంపితే చంపనీ, దగ్గరకెళ్ళి ఆమె వృత్తాంతం తెలుసుకుంటాను' అనుకుంటూ తటాలున గోడ దూకాడు. పులి ముఖాన్ని తొడమీద పెట్టుకుని లాలిస్తున్న ఆమె ఎదుటకు పోయి – వినయంగా మొక్కి "నీవు త్రిభువన పూజ్యురాలివి. నీ దర్శనం వల్ల నేను ధన్యుడి నయ్యాను. నేనీ నగరం రాజు ప్రద్యోతనుడి కుమారుడిని. ప్రభాకరుడు నాపేరు.

ఈ పులి ప్రజలని బాధిస్తుందనీ,

రాజయోగిని కరచిందనీ పౌరులు చెప్పగా రాజు నన్ను మీ వద్దకు పంపాడు. నిన్ను చూశాక నేను విన్నదంతా అబద్ధమనిపించింది. మాంసంతినే పెద్దపులి పళ్ళు తినడానికి నీలాగ యోగిని కాదుకదా. దీనికి నేను మాంసం తెప్పించి పెడతాను. నువ్వింత సుందరివై ఉండి చిన్నతనంలోనే యిలాటి వ్రతం పూనడానికి కారణమేమిటో...నీ వృత్తాంతం తెలుసుకోవాలని ఉంది. నేను అర్హుడిననుకుంటే నీ వృత్తాంతం చెప్పు" అని ప్రార్థించాడు.

ఆమె అతన్ని చూసీ చూడనట్లు చూసి – "మా దల్లితండ్రు లితనికిచ్చే నా పెళ్ళిచెయ్యబోయారు. నా చిత్రపటం చూసే యిలా అని

ఉంటాడు. ఇన్ని దేశాలుండగా నేనిక్కడికే రావాలా? విధి..' అని మనసులో అనుకుని - "మేము సర్వం త్యజించిన యోగులం. మా చరిత్రతో మీకేంపని? ఈ పులి తనకపకారం చేయని వారిజోలికి పోదు. నేడోరేపో చనిపోయేటట్లుంది. దీని బాధ మీకుండదు. వెళ్ళండి" అని కళ్ళు మూసుకుంది. ఆమెతో ఆపాటి మాట్లాడినందుకే తన జన్మ ధన్యమైందని పొంగిపోయాడు ప్రభాకరుడు.

ప్రభాకరుడు గోడదూకి ఆలయంలోకి పోయాడని, అతన్ని పులికరిచిందనీ రాజుకెవరో చెప్పగా అతను పరివారంతో ఆలయానికి వచ్చాడు. పులి ఇవతలికి వొస్తుందేమో అని తలుపులు మూసివేయబడి ఉండడంతో కొందరు వీరులు గోడలెక్కి లోపలికి చూడసాగారు. ఒకడు పులిని చూసి బాణం వేసేసరికి అది పులికాలికి తగిలి గాయం చేసింది. అది బాధతోనూ, కోపంతోనూ వాడిని పట్టుకుని నేలమీద పడదోసేసరికి మిగిలినవీరులు పారిపోయారు.

జితవతి ఆ పులిని పిలిచింది. అది ఆమె వద్దకు వచ్చి నిలుచుంది. దాని గాయాం చూసి ఆమె దుఃఖిస్తూ - "నువ్వు సాధువువే అయినా ప్రజలు నిన్ను బతకనివ్వరు. అది నీకర్మ. నేనేం చెయ్యగలను?" అంటూ గాయానికి కట్టుకట్టి మంటతగ్గడానికి నోటితో గాలి ఊదసాగింది.

అదంతా చూస్తున్న ప్రభాకరుడు "నువ్వికవిచారింపకు. దీనిజోలి కెవరూ రాకుండా చూస్తాను. ఆహారం పెట్టిస్తాను. నీవు యోగినివి. నీది మమత్వం కాదు. నేను వెళ్తాను" అని ఆమె అనుమతి తీసుకుని వెళ్ళాడు. రాజు కొడుకుని కౌగలించుకుని - "పులి నిన్ను కరిచిందట. ఎలా తప్పించుకున్నావు?" అని అడిగాడు. అతను - "ఆ పులి అత్యంత సాధువు" అంటూ జరిగినదంతా చెప్పాడు.

ప్రద్యోతనుడు అక్కడి కెవరినీ వెళ్ళొద్దని, "కుమారా! నువ్వే స్వయంగా ఆమెకు కావలసిన వస్తువులు తీసుకెళ్ళి అర్పించు" అన్నాడు. ఆ సాయంత్రం అతను మాంసం, పళ్ళు పట్టుకుని అక్కడికి వెళ్ళేసరికి పులి చచ్చిపోయి పడుంది. దాని మృత కళేబరం మీద పడి యోగిని ఎన్నోవిధాలుగా విచారిస్తూంది. కన్నీటితో దాని శరీరం తడుపుతోంది.

# కాశీ మజిలీ కథలు

## 104. వ మజిలీ

### పెద్దపులుల కథ

"తండ్రీ! ఎంత ఆప్త బంధువులయినా అంతలా విచారించరు. ఆమె దుఃఖం చూసి నాకు కూడా శోకం ఆగలేదు. నే నెన్నో సముదాయింపు మాటలు చెప్పాను. కాని ఆమె వాటిని వినిపించుకోలేదు. అప్పుడు నేను – "దేవీ! నేను దీని చర్మం తీయించి యిస్తాను. వస్త్రంగా ధరించు" అన్నాను. అందుకు ఆమె అంగీకారంగా తలఊపింది.

నేను చర్మం తీయించి పరిశుభ్రం చేయించి ఇవ్వగా ఆమె దానిని మడత పెట్టి దేవుని పెట్టిలా పూజించసాగింది. తరవాత నేను రెండు మూడుసార్లు పాలు, ఫలాలు పట్టుకెళ్ళినా ఆమె నాతో ఏమీ మాట్లాడలేదు. నారాక ఇష్టంలేనట్లు గ్రహించి నేను వెళ్ళడం మానేశాను. ఇవాళవెళ్ళగా ఆమె అక్కడ లేదు. జనసంపర్కం నచ్చక ఎక్కడికో వెళ్ళిపోయింది. ఇదే ఆమె వృత్తాంతం" అన్నాడు ప్రభాకరుడు.

"మహాత్ముల చరిత్రలు విచిత్రంగానే ఉంటాయి. యమున పొంగడం వల్ల ఉత్తరదేశం నుంచి కొట్టుకు వచ్చి ఉంటుంది. పోనీలే. ఎవరినీ శపించకుండా శాంతంగా ఊరువదిలింది. అది చాలు" అని రాజు అంటూంటే

ద్వారపాలుడు వచ్చి – "రాజభటులు ఒక యోగినిని పట్టుకుని వేచి ఉన్నారు. ప్రవేశానికి సెలవా?" అన్నాడు.

"వెంటనే తీసుకురమ్మను" అన్నాడు రాజు.

చేతులకు సంకెళ్ళు తగిలించబడిన ఆ యోగినిని ప్రబాకరుడు పరిశీలనగా చూసి – "తండ్రీ! వేషం అలాటిదేకాని ఈమె ఆమె కాదు" అన్నాడు.

రాజు ఆమె సంకెళ్ళను తొలగించమని - ఆమె చేసిన నేర మేమిటని అడిగాడు. అందుకు - "ఇది వేషానికే యోగిని కాని గజదొంగలను మించినది. కొన్ని రోజుల కిందట మత్స్యపురిలో ఒక భాగ్యవంతుడి యింట్లో పడుకుందుకు చోటు అడిగిందట. సన్యాసి అని పూజించి యింట్లో పడుకోబెడితే - అందరూ నిద్ర బోతుండగా దొంగలకు తలుపుతీసి, జాడలు చెప్పి యిల్లు కొల్లగొట్టించింది. తెల్లవారాక యింటి యజమానులకంటె ఎక్కువ ఏడుపు నటించిందట. మేము పోయి నిజం తెలుసుకుని దీనిని పట్టుకుని తీసుకొచ్చాం. ఎంత కొట్టినా మాట్లాడదు. మొండిఘటం. అన్నం తినకుండా, నీళ్ళు తాగకుండా ఎన్నాళ్ళైనా ఉండిపోగలదు. ఇది ఎక్కడో దొంగతనం చేసి యోగినీ వేషం వేసుకుని రాత్రికి రాత్రి యమునానదిని ఈదుకుని మత్స్యపురి చేరిందట. సాక్షులను విచారించి దీనిని శిక్షించండి" అన్నాడు దండనాధుడు.

రాజా మిగిలిన వారిని అవతలకి పొమ్మని మత్స్యముఖు డనే సాక్షిని - "నువ్వేం చూశావో చెప్పు" అన్నాడు. మత్స్యముఖుడు రాజుకి నమస్కరించి "స్వామీ! ఏటికి వరద వచ్చిందని విని తెల్లారుజామున నేనూ, జాలహస్తుడూ యమునకి పోయాం. ప్రవాహంలో మానులు కొట్టుకుపోతూంటే మేమొక మంచి దారువుని తెప్పలమీద పోయి పట్టుకున్నాం. కాని అది మాకు కాదు. పెద్దపులి! దానిమీద ఈమె పడుకుని ఉంది. ఆ పులి చచ్చి పోయిందని తెలుసుకుని ఈమెను మెల్లగానూ తెప్పలమీద ఒడ్డుకు చేర్చాం. ఈమె ఒడ్డునచేరి, కళ్ళు తెరచి, "జితవతీ! జితవతీ!" అంటూ పిలిచింది. కాని ఎవరూ పలకలేదు. మేము ఎవరని అడిగినా యీమె జవాబు చెప్పలేదు" అన్నాడు. జాలహస్తుడు కూడా అదే చెప్పాడు.

దండనాధుడు - "దేవా! వీళ్ళు దీని నుంచి లంచం తిని అబద్ధం చెబుతున్నారు. మరికొందరు సాక్షులని తెస్తాను. గడువివ్వండి" అన్నాడు. "కల్పనలు వారివికావు, మీవే.సాధువుల మీద అసత్యాలు పలికితే నాశనమైపోగలరు సుమా! పొండి" అని వాళ్ళని మందలించి, కొడుకు

వేపు చూశాడు. అప్పుడు ప్రభాకరుడు – ఈ యోగినికీ మొన్న వచ్చిన యోగినికీ ఏదో సంబంధ ముంది. ఇద్దరు కట్టిన వస్త్రాలూ ఒకేలాగ ఉన్నాయి. ఇద్దరూ పెద్దపులుల మీద యమునా నదిలో కొట్టుకు వచ్చినవారే. వీళ్ళకేదో అమానుషప్రభావం ఉంది. తెలుసుకుంటాను" అని – సభ ముగిశాక ఆ యోగినికి నమస్కరించి –

"దేవీ! నీ పట్ల మా కింకరులు చేసి అపచారాన్ని మన్నించు. నీలాగే పెద్దపులితో ఆ మధ్య ఒకయోగిని వచ్చి కొన్నాళ్ళు ఈ వూరిలో ఉంది. ఆ పులి చనిపోయింది. ఆమె కూడా నీలాగే చిన్న వయసులోనే వైరాగ్యం పూనింది. నీ కామె తెలిసే ఉంటుంది. మీవృత్తాంతం చెప్పి మమ్మల్ని కృతార్ధులను చెయ్యి. గట్టెక్కగానే జితవతీ అని పిలిచావట. ఆ జితవతి ఎవరు? నేను ప్రద్యోతన మహారాజుగారి కొడుకుని. ప్రభాకరుడు అంటారు" అని అతి వినయంగా ప్రార్థించాడు. ఆమె తలెత్తి అతన్ని చూసి – "రాజపుత్రా! విచిత్రమయిన నా వృత్తాంతం తరవాత చెబుతాను. దయచేసి ఆ యోగిని వివరాలు చెప్పు" అని ప్రార్థించింది. అతను అంతా చెప్పాడు.

అదివిని – "ఆమె జితవతే. ఆహా! ఆమెను ఈ ప్రభాకరుడి కివ్వాలనే నిశ్చయించారు. మేం ఇక్కడికే రావాలా! ఆమె యోగినీత్వాన్ని శంకించి తరవాత ఇత నామెను పెళ్ళి చేసుకుందుకు ఆక్షేపిస్తాడేమో. దైవమహిమ! కానియ్. ఇతనికి మా వృత్తాంతం చెప్పి, నా సఖురాలిని వెదకి తెప్పించి, ఇంటికి పోయే ప్రయత్నం చేస్తాను" అని నిశ్చయించుకుని – "రాజపుత్రా! మమ్మల్ని నువ్వెరగకపోయినా మీరు మాకు తెలుసు. మా వృత్తాంతం హాస్యాస్పదమే. మీరిదివరకు చూసిన యోగినే జితవతి. ఉశీనరుడి కూతురు. నేనామె సఖురాలిని. నాపేరు రోహిణి" అంటూ యోగసక్త గురించీ, వారిశాపం విరమించుకోమని తాము వశిష్ఠుని వద్దకు ప్రయాణం కావడమూ, కపట యోగులుచేసి పన్నాగమూ వివరించి – "వారినుంచి తప్పించుకుందుకు మేం అరణ్యంలో నడవసాగాం. ఆసుకుమారి పడిన బాధలు నేను చెప్పలేను. మార్గంలో ముళ్ళు ఎముకలు

కోరికేచలి, కన్ను పొడుచుకున్నా కనిపించని దారి, క్రూరమృగాల అరుపులు వినపడుతూంటే – మాకు అంత్యకాలం సమీపించినట్లే భావించి... జితవతి తలను నా తొడల మీద ఉంచుకుని దేవుణ్ని ప్రార్థించుకోసాగాం.

కొంతసేపటికి ఒక పులి ఏదో జంతువుని నోట కరుచుకుని పొదలని అదరగొడుతూ మేము కూర్చున్నచోటుకి వచ్చింది. నేను జితవతిని కప్పేశాను. ఆ పులి మమ్మల్ని మింగేసిందనే అనుకున్నాం. ఎందుచేతనో అది మామీదకిరాక సగం ప్రాణంతో కొట్టుకుంటున్న తననోటిలోని జంతువు వికృతంగా అరుస్తూంటే దానిని తినసాగింది. అంతలోనే మరోపులి గాండ్రిస్తూ అక్కడి కొచ్చి మొదటి పులిమీద పడి రక్కుతూ దాని నోట్లో ఉన్న ఆహారం లాక్కుంది. ఆ రెండింటికీ పెద్ద యుద్ధం జరిగింది. చివరకొకటి బలం తరిగి వెనుకంజ వేసేసరికి రెండవది దానిని తరుముకుంటూ పోయింది.

అంతలో తెల్లవారింది. మేం బతికున్నందుకు మాకే ఆశ్చర్యం వేసింది. పులులు తమలో తాము కాట్లాడుకుంటూ మమ్మల్ని చూడలేదు కాబోలనుకున్నాం.

"మనం ఇంకా చిక్కులు పడవలసిన యోగం ఉండబట్టే దైవం మనని పులులకి ఆహారం చెయ్యకుండా ఉంచాడు. వాటి నోటిలో తలపెట్టినా అవి మనని మింగవు. పద. అవి మనకి దారిచేశాయి." అందామె.

ఇద్దరం లేచినడవసాగాం. కొంతదూరం వెళ్ళేసరికి ఆ పులుల అరుపులు వినపడ్డాయి. అవి మావేపే రాసాగాయి" అయ్యో! అవిగోరాత్రి, పులులు. ఇప్పుడు మనల్ని వదలవు. చంపేస్తాయి" అని నేను భయంతో అరిచాను.

"ఎందుకు భయపడతావ్? క్షణంసేపు ఓర్చుకున్నామంటే కష్టాలన్నీ గట్టెక్కుతాయి. ఆడబోయిన తీర్థం ఎదురయినట్లే వచ్చాయవి. సంతోషించక విచారిస్తావేం?" అంటూ వాటికెదురుగా తీసుకుపోయింది. అవి రెండూ మా దగ్గరకు వచ్చి మచ్చికయినట్లు తోకలాడిస్తూ మా పాదాలు నాకడం మొదలుపెట్టాయి. మమ్మల్ని తినెయ్యమని కోరినా అవి అలా సాధువుల్లా ప్రవర్తిస్తున్నందుకు ఆమె ఆశ్చర్యపోతూంటే – "సఖీ! ఇవి నీ శీలానికి మెచ్చి ఇలావశమయ్యాయి. మహర్షుల సాన్నిధ్యంలో జాతి వైరా లుండవుకదా? ఇక మృత్యువు నిన్నేమీ చెయ్యలేదు. నీ కోరిక నెరవేరుతుంది" అన్నాను నేను.

కాని ఆమె వాటివీపుమీద చేతితో నిమురుతూ – మెడ దువ్వుతూ ...ముద్దుపెట్టుకుంటూ – "కృతఘ్నురాలినని కదా మా మాంసం ఆరగించలేదు?" అంది. అవి మాముందు పిల్లికూనల్లా పడుకున్నాయి. తరవాత అవి మా ముందుగా నడుస్తూ దారిలేకపోతే దారిచేస్తూ సేవకుల్లా సేవలు చేస్తూంటే పడమరదిశగా ప్రయాణం చేశాం. అప్పుడు ఒకనది మాకు అడ్డం వచ్చింది. అది యమున అని తెలిసి మేము ఆనందంతో నదిలో మునకలు వేస్తూంటే ఆ పులులు కూడా మాతో పాటే స్నానాలు చేయసాగాయి. అంతలో చీకట్లు కమ్ముకుని, మబ్బులు ఆవరించి పెద్ద వర్షం కుండపోతగా కురుస్తూ క్రమంగా ప్రవాహానికి కొత్త నీరు తగిలి ఆ నది పొంగడం ప్రారంభించింది. మేం మా పాదాలు తేలిపోయి నీటిలో మునిగిపోతూ దగ్గరున్న పులుల్ని పట్టుకున్నాం. అవి మమ్మల్ని తమ వీపుమీద కెక్కించుకుని పడవల్లా ప్రవాహంలో ఈదసాగాయి. ప్రమాదం రాకుండా యీది అవతలివొడ్డు చేర్చాలని ప్రయత్నించాయి. కాని వీలు పడక రెండుపులూ విడిపోయాయి. నే నెక్కినపులి బలహీనమై నీళ్ళు మింగి చచ్చిపోయింది. ఐనా నేను దాన్ని వదలక ఆ కళేబరం మీద ఉండిపోయాను. తెల్లవారు జామున ఈ పల్లెవాళ్ళు నన్ను తీరం చేర్చారు. ఆ రాత్రి నేను పల్లెలోని ఒక గృహస్థుడి ఇంట్లో పడుకున్నాను. ఆ రాత్రి దొంగలు ఆ యింటిని కొల్ల గొట్టడం నిజమే. నేరం నామీద మోపి రాజభటులు యిలా తీసుకువచ్చారు" అంటూ తమ వృత్తాంతం ముగించింది.

అది విని రాజపుత్రుడు చాలా ఆశ్చర్యపోయాడు. 'అలాటి కృతజ్ఞురాలికి దైవం సహాయపడి తీరతాడు. ఎక్కడి అంతఃపురం, ఎక్కడి వసిష్ఠాశ్రమం!' అనుకుని – " జితమతికి తెలియకపోతే నువ్వేనా చెప్పొద్దూ? పెద్దవాళ్ళకి తెలియకుండా ఇల్లు వదలవొచ్చునా? ఆమె కోసం తల్లితండ్రులెంత చింతిస్తున్నారో? సరే. ఆమె ఉత్తరదిశగా అరణ్య మార్గంలో వెళ్ళినట్లు జాడలు తెలిశాయి. మనం వెళ్ళి పట్టుకుని ఇంటికి తీసుకుపోదాం. జితవతి అనితెలిస్తే నేనప్పుడే ఆపేవాడిని" అంటూ ప్రభాకరుడు తగిన పరివారాన్ని వెంట బెట్టుకుని రోహిణితో కలసి దేశాలూ అరణ్యాలూ తిరుగుతూ వెదక సాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 105. వ మజిలీ

### సన్యాసుల కథ

"అమ్మా! లే ఎన్నాళ్ళు ఇలా ఆహారం తినకుండా కృశించి పోతావ్? జితవతీ, రోహిణీ ప్రయాగ కవతల అరణ్యాలలో తిరుగుతున్నట్లు తెలిసిందట. ప్రయాగ రాజు కొందరు సన్యాసులని మన రాజ్యానికి పంపాడు. వారి నేరం విచారిస్తూ అయ్యగారు మీకీ వార్త చెప్పమన్నారు" అని తిలక అనే పెద్ద దాసి చెప్పగా జితవతి తల్లి లేచి కూర్చుని – "అరణ్యాలలో తిరగవలసిన అగత్యం దానికేమొచ్చింది? నా కూతురు బతికే ఉందా? ఎవరు చెప్పారు? ఏమని చెప్పారు?" అని ఆదుర్దాగా అడిగింది. తిలకవెళ్ళి–ద్వారం వద్దనున్న పరిచరుణ్ని తీసుకురాగా, వాడు... "అమ్మా! ప్రయాగనుంచి సన్యాసులు కొందరు సంకెళ్ళు వేసి తీసుకు రాబడ్డారు. వాళ్ళేం నేరం చేశారో తెలియదు కాని వారినుంచి అమ్మాయిగారూ రోహిణీ ఆదేశంలో తిరుగుతున్నట్లు తెలిసింది. ప్రయాగ రాజుగారు రాసిన ఉత్తరంలో ఏముందో తెలియదు. అది చదవగానే మీకీ వార్త చెప్పమన్నారు" అన్నాడు వాడు.

అప్పుడు "తిలకా! నువ్వు సభకి వెళ్ళి సన్యాసులేం చెప్పారో విని నాకు చెప్పు" అని ఆమెను రాజపత్ని పంపింది.

రాజు నువ్వెవరివి?

మఠాధిపతి : ప్రయాగలోని మాధవ మఠానికి ధర్మకర్తని.

రాజు : మఠంలో సన్యాసు లెందరుంటారు.

మఠాధిపతి : వెయ్యికి తక్కువమంది ఉండరు.

రాజు : వాళ్ళకి భోజనం ఎలా?

రాజు : ప్రద్యుమ్నయోగి ఎవరు?

ప్రద్యుమ్నయోగి : (ముందుకొచ్చి) నేనే దేవా.

మఠాధిపతి : మఠానికి రాజు యిచ్చిన అగ్రహారాలు చాలా ఉన్నాయి. వాటి ఆదాయం వల్ల సన్యాసులకు జీవనోపాధి జరుగుతుంది.

రాజు : మీలో మీకు కలహా లెందుకు వచ్చాయి?

మఠాధిపతి : దేవా. కొందరు కపటులు మాలో చేరడం వల్ల మాకూ మఠానికీ కూడా చాలా అపకీర్తి వచ్చింది. (అంటూ బాలయోగినులు రావడం, చిదానంద రమానందులు వారిని మోహించి వసిష్ఠాశ్రమానికి వెళ్ళేవారిని చంపకారణ్యం తీసుకుపోడం మొదలైన వృత్తాంతం సాంతం చెప్పి) చిదానంద రమానందయోగులు తమ లంచాన్ని తమకిచ్చెయ్యమని తగవు పెట్టారు. వాళ్ళు ఇవ్వకపోడంతో రమానందుడు దుడ్డుకర్రతో ముసిలివాణ్ని కొట్టాడు. బ్రహ్మానందుడు అడ్డుపడగా వాడిని కొట్టాడు. వృద్ధయోగులు దెబ్బతినడంతో అక్కడున్న సన్యాసులు రెండు పక్షాలై పెద్ద యుద్ధం చేశారు. రాజభటులు వచ్చి అందరినీ పట్టుకుని కారాగారంలో పడవేసి కొన్నాళ్ళుంచి చివరకు మీవద్దకు పంపారు.

రాజు : ప్రద్యున్నయోగి ఎవరు?

ప్రద్యుమ్నయోగి : (ముందుకొచ్చి) నేనే దేవా.

రాజు : నువ్వు ఆయోగినులను బ్రహ్మానందుడి వద్దకు పంపావు కదా. బాలసన్యాసులు నీకెంత లంచమిచ్చారు.

ప్రద్యుమ్నయోగి : నాకు లంచం ఇవ్వలేదు దేవా, జ్ఞానపత్రి నిమిత్తం అప్పుడప్పుడు ఏదేనా ఇస్తారు అంతే.

రాజు : నువ్వు చేసింది వారి కుపయోగపడలేదు కాబోలు పాపం

ప్రద్యుమ్నయోగి : చిత్తం, చిత్తం, నేనేమీ చెయ్యలేదు.

రాజు . సరే, చిదానంద రమానందు లెవరు?... మీరా యోగినులను ఎక్కడ చూశారు?

రమానందుడు . ప్రయాగలో గంగాస్నానం చేస్తూండగా చూశాం.

రాజు : వాళ్ళకోసం ఎంతధనం వెచ్చించారు?

రమానందుడు · దేవా? దాచడమెందుకు వెయ్యి మాడలు వ్యయం అయ్యాయి. మా దగ్గరనుంచి లంచాలు తిననివాడు లేడు. మఠాధిపతికి పది మాడలిచ్చాం.

రాజు . తరవాత బాలయోగిను లేమయ్యారో వెదికారా?

రమానందుడు · లేదు దేవా. తరవాత చెరసాల్లో బంధించబడ్డాం. వారేమయ్యారో తెలియదు.

రాజు : దురాత్ములారా! మీరు సన్యాసులమని పేరు పెట్టుకుని మఠంలో కూర్చుని తింటూ నీచపుపనులు చేస్తూ మీరేకాక మఠానికి కూడా చెడ్డపేరు తెచ్చారు. మీకేం శిక్ష వెయ్యాలో తోచడం లేదు. తరవాత చూస్తాను-

అని వాళ్ళని చెరసాలకి పంపి తాను అంతఃపురానికి వచ్చి భార్యతో ఆ వృత్తాంతం చెప్పసాగాడు. అంతలో ప్రద్యోతన నగరం నుంచి రోహిణి రాజదూతలతో వచ్చిందన్న వార్త ఎవరో చెప్పేసరికి రాజపత్ని ఆత్రంగా లేచి – "నా బిడ్డ కూడా వొచ్చిందా?" అని అడుగుతూంటే రోహిణి వచ్చి ఆమె పాదాలమీదపడి గొల్లున ఏడవసాగింది.

ఉశీనరుడు ఆమెను ఊరడించి – "లేలే ఏడిచి ప్రయోజనం ఏముంది? నువ్వెక్కడి నుంచి వొచ్చావు? జితవతి ఏమైంది? వసిష్ఠాశ్రమానికి వెళ్ళారా? తరవాత ఏం జరిగిందో చెప్పు" అన్నాడు ఆమె, సన్యాసులను విడచిన యమునలో కొట్టుకుపోవడం, విడిపోవడం, తానూ పులులతో సహా వద్దకు తీసుకు వెళ్ళడం, తనని దొంగగా ప్రభాకరుడి అక్కడ అతనినుంచి జితవతి గురించి కొంతసమాచారం తెలియడం, అతను తనను వెంట బెట్టుకుని

దేశారణ్యాలు తిరగడం చెప్పి - "ఎక్కడా ఆమె కనిపించలేదు. కాని కొన్ని జాడలు మాత్రం తెలిశాయి. వాటినిబట్టిపోతుంటే యమునానది పరిసరాల్లో దట్టంగా పెరిగిన చెట్ల మధ్య చెట్టుకొమ్మకి పాదాలు తగిలించి తలకిందులుగా తపస్సు చేస్తున్న ఒక యోగి మాకు కనిపించాడు. అతన్ని ప్రార్ధిస్తూ మేం నిలబడ్డాం. సాయంకాలం అతను తపస్సు చాలించి చెట్టుదిగి యమునకి పోబోతూంటే మేమతని పాదాలమీదపడి జితవతి గురించి వివరించి - 'ఆమెకనపడిందా?' అని అడిగాం.

అందు కతను - "ఆమె నా వద్దకు వచ్చింది. ఆమె చిత్తశుద్ధి గ్రహించి వసిష్ఠుని ఆశ్రమానికి పంపాను. ఇంతకీ మీరెవరు?" అని అడిగాడు.

"మహాత్మా! నే నామె సఖురాలిని. నన్నుకూడా అక్కడికి పంపరా?" అని ప్రార్థించాను.

"చాలు చాలు మాకు ఇదేపనా? నువ్వు అందు కర్హురాలివి కావు" అని అతను విస విసా స్నానానికి వెళ్ళిపోయాడు. అతను మళ్ళీ వొచ్చేవరకూ వేచి ఉండి, వారి పాదాలమీదపడి నమస్కరిస్తూ. ... "ఆమె మళ్ళీ ఎప్పటికేనా ఇంటికి తిరిగి వొస్తుందా? ఇదొక్కటీ చెప్పండి చాలు, అని దీర్ఘంగా వేడుకున్నాను. అతను కొంచెం సమయం ఆలోచించి - "రా కేమౌతుంది? పొండి పొండి " అని తపస్సుకోసం చెట్టుమీదకి వెళ్ళిపోయాడు. మేం కొంత సంతోషంగా ప్రద్యోతనగరానికి వచ్చి ఆ వార్త మీకు పంపాం.

మణిసిద్ధుడు తరవాత మజిలీలో ఇలా చెప్పాడు

# కాశీ మజిలీ కథలు

## 106 వ మజిలీ

### వసిష్ఠుని కథ

ఆహా! ఆ మహర్షి ప్రభావం ఎంత గొప్పది! కళ్ళు మూసి- తెరచిచూసేసరికి ఎంత సంతోషం కలిగింది! ఇది వసిష్ఠుని ఆశ్రమం అయి వుండాలి. రెప్పపాటులో ఎన్నోయోజనాల దూరం నన్ను చేర్చిన ఆ తాపసి ఎంత గొప్పవాడో! మామూలుగా ఇక్కడికి రావడం ఎవరికి శక్యం? ఇది దేవతా భూమిలా ఉంది. భూమి అంతా రత్నాలతో నిండి ఉంది. చెట్లు బంగారు రంగులో మెరుస్తున్నాయి. మృగాలు జాతివైరం లేకుండా కలిసి మెలసి తిరుగుతున్నాయి ఇది తప్పకుండా వసిష్ఠాశ్రమమే. అదిగో! మునిబాలు డెవరో నావేపు వస్తున్నాడు. వాని నడిగి యీ ప్రదేశం గురించి తెలుసుకుంటాను - అని నిశ్చయించుకుని జితవతి లేచి నిలబడింది. ఆ మునికుమారుడు చేత దండం పట్టుకుని అక్కడికి వచ్చాడు. ఆ శిష్యుడు ఆమెను నిశితంగా చూశాడు.

**శిష్యుడు** : అమ్మా! నువ్వేముని కన్యకవు? పులితోలు మడతబెట్టి తలమీద పెట్టుకున్నావెందుకు! నీ పేరేమిటి?

**జితవతి** : ఋషిపుత్రా నేను ముని కన్యకను కాను రాజపుత్రికను. నాపేరు జితవతి ఈ పులి బతికి వున్నప్పుడు నాకెంతో ఉపకారం చేసింది. నాకోసమే చనిపోయింది. అందుకని భక్తితో యిలా పూజిస్తున్నారు.

**శిష్యుడు** : తపస్సు యొక్క ప్రభావం వల్ల జంతువులు మునులకు సేవచేయడం ఆచారమే. నీకు దీనిపట్ల యిలా కృతజ్ఞత ఉండడం చాలా ప్రశంసించ తగినది.

**జితవతి** : బాలకా! నువ్వెవరి కుమారుడివి? ఈ తపోవనం ఎవరిది?

**శిష్యుడు** : తల్లీ! ఇది వసిష్ఠమహాముని ఆశ్రమం నేనాయన హెూమధేనువుని కాసే శిష్యుడిని.

**జితవతి** : హెూమధేనువంటే నందినీధేనువేనా? ఈ మధ్య వసువులు దానిని తీసుకుపోయారని విన్నాను.

**శిష్యుడు** : నిజమే. అందుకు వాళ్ళకి ప్రాయశ్చిత్తమయింది కదా.

**జితవతి** : ఏమైంది? చెప్పు.

**శిష్యుడు** : వాళ్ళందరినీ మనుష్య జాతిలో పుట్టామని వసిష్ఠులవారు శపించారు.

**జితవతి** : వారు వచ్చి పాదాక్రాంతు లయ్యారట కదా. ఆ ముని వారిని కనికరించి శాపవిముక్తులని చెయ్యలేదా?

**శిష్యుడు** : తల్లీ! ఎనిమిదవ వసువు ప్రభాసుడిని తప్ప తక్కిన ఏడుగురునీ జన్మమాత్రముునే విముక్తులయ్యేటట్లు కనికరించారు. ప్రభాసుడే ఆ అపరాధానికి కారకుడు కనుక అతను భూమిమీద మనుష్యుడై పుట్టి, భార్యాపుత్రులు లేక దరిద్రుడై, వ్యాధులచే బాధింపబడుతూ పరమమూర్ఖుడై క్రూరకృత్యాలు చేస్తూ చాలాకాలం బతకాలని శపించాడు.

**జితవతి** : హా! పరమేశ్వరా! ఎలాటి మాట వినవలసి వచ్చింది! యోగసక్తా! నావల్లనేకదా మీకు ఇలాటి కష్టం వచ్చింది.

అంటూ నేలమీదపడి మూర్ఛపోయింది. ఆముని బాలకు డామెను లేవనెత్తి – "తల్లీ! వసువులు నీకు బంధువులా! వాళ్ళకోసం దుఃఖిస్తావేం?" అని అడిగాడు. ఆమె కళ్ళు తుడుచుకుని తన కథంతా చెప్పి – "బాబూ! వారి ముప్పుకి నేనే మూలకారణాన్ని. యోగసక్తనుకూడా ఏమైనా శపించారా? ఆమె ఏమైంది?" అని దీనంగా అడిగింది. "సాధ్వీ! మా గురువు భర్తను అలా శపించేసరికి యోగసక దుఃఖించి తననికూడా మనుష్యజాతిలో పుట్టునట్లూ, అతనికి భార్య అయ్యేటట్లూ చేయమని కోరింది. ఆయన అందుకంగీకరించలేదు. అప్పుడామె అతనివేపు

చురచురచూస్తూ "నీ భార్య నీకెలాగో నేనాయనకు అలాగ కానా? మీ వియోగానికి మీ భార్య తపించేటట్లు నేనాయన వియోగానికి తపించనా? మమ్మల్ని విడదీస్తావా!" అంటూ నోటికి వచ్చినట్లు నిందించింది

వశిష్ఠ మహాముని యిక సహించలేక – స్త్రీవని సహించి నందుకు చిన్నాపెద్దా తారతమ్యం లేకుండా పేలుతున్నావు. ఈ తప్పంతా నీలోనే ఉంది. నువ్వు గోమాంసం తినే అధమజాతిలో పుట్టి అనేకకష్టాలు అనుభవిస్తావు పో" అని ఆమెను కూడా శపించాడు.

వాళ్ళు శాపఫలం అనుభవించడానికి వెళ్ళిపోయారు. పూర్వజన్మకృతాన్ని అనుభవించక ఎవరికీ తప్పదు కదా" అన్నాడు శిష్యుడు. అది విని జితవతి తనమూలంగా యోగిచేత నిందింపబడిందని యోగసక గురించి మరింత దుఃఖించింది. మునిబాలుడు – "తల్లీ! నీ గుణాలెంతో ప్రశంసించదగినవి. మా అయ్యవారిప్పుడు భార్యతో వినోదంగా మాట్లాడుతున్నారు. వేగం వెళ్ళు. నీకేదేనా సదుపాయం చెయ్యొచ్చు" అని అవతలికి పోయాడు.

జితవతి తలమీద పులి చర్మపు మడతను పెట్టుకుని వసిష్ఠుని వద్దకు నడిచింది. దూరం నుంచే ఆమెను చూసిన అరుంధతి – "నాథా! ఆమె ఎవరు? యోగిని వేషంలోని జగన్మోహిని కాదుకద? తలమీద పులితో లుందేమిటి?" అని ఆశ్చర్యంగా అడిగింది. అప్పటికి జితవతి వారివద్దకు వచ్చి సాష్టాంగ నమస్కారాలు చేసి – "మహాత్ములారా! పుణ్య దంపతు లయిన మిమ్మల్ని చూడడంతోనే నాపాపాలు పటాపంచలై నేను కృతార్థురాలి నయ్యాను. మీ దర్శనం కోసం ఎన్నో కష్టాలు పడి వచ్చాను." అని విన్నవించుకుంది.

అప్పుడు అరుంధతీ దేవి ఆమె నాదరిస్తూ ఆమె వృత్తాంత మంతా చెప్పమంది. పులితోలును శిరస్సుమీద పెట్టుకున్న కారణం కూడా చెప్పమంది. అప్పుడు జితవతి తన కథ అంతా వివరంగా చెప్పింది. అది విని అరుంధతి భర్తముఖం చూసింది. వసిష్ఠుడు దివ్యదృష్టితో చూసి "ఆమె చెప్పినదంతా నిజమే" అని ధ్రువపరిచాడు. అప్పు డామె జితవతిని కౌగలించుకుని –

"నీలాటి కృతజ్ఞురాలిని ఏ పురాణంలోనూ వినలేదు. నీ సుగుణాలకు మేమెంతో సంతోషిస్తున్నాం. హోమధేనువు ఈ మహర్షికి ప్రాణం లాటిది. దానిని వసువులు తీసుకుపోయారని కోపించి శపించారు. మిగిలిన వారికి శాపవిమోచనం సులభమే. కాని ప్రభాసుడు భూమిమీద పుట్టక తప్పదు. మునిమీద కోపించి యోగసక శపించబడింది. మ్లేచ్ఛురాలై పుట్టక తప్పదు. ఇప్పుడు మేమేం చెయ్యాలి? నీ కోరికేమిటో చెప్పు. నిన్ను సంతోషపరచాలని మాకుంది" అంది దయగా. "దేవీ! నాకు మానవజన్మవలన కలిగే ఇక్కట్లు తొలగించడానికే కదా యోగసక శాపానికి గురయింది? ఆమె కష్టాలు పడుతూంటే నాకు సంతోషం ఎలా కలుగుతుంది? నాకు ఉపకారం చేసిన వాళ్ళకి ఆపదలు సంభవిస్తే ఇక నా బతు కెందుకు? ఆ దంపతుల శాపం నేను అనుభవిస్తాను. వారిని విముక్తులని చెయ్యమని నీ భర్తను ప్రార్థించు. నన్ను ఏ జాతిలో పుట్టించినా సరే. ఎలాటి కష్టాలు పెట్టినాసరే. యోగసకలాటి ఉత్తమురాలిని నేను కష్టపెట్టలేను. నేను మహాపాపాత్మురాలిని. నావల్ల యోగసక్త శాపగ్రస్త అయింది. రాజభోగా లనుభవించవలసిన రోహిణి అడవులపాలయింది. పులిరాజు తిండిలేక మరణించాడు. ఇందరిని దుఃఖింపజేసిన నేను పుట్టకపోతేనే బాగుండేది. అందుచేత – వారిని శాపవిముక్తులను చెయ్యి. లేదా మీ పాదాల దగ్గర తలబద్దలు కొట్టుకుని చచ్చిపోతాను" అని జితవతి గొల్లున ఏడ్చింది.

అరుంధతి భర్తని ప్రార్థించింది. అప్పుడు వసిష్ఠుడు – "పుత్రీ! నీ శీలం ఎన్నతగినది. నీ అభీష్టం ఒకలా తీర్చగలను. విను. వారికి మనుష్య జన్మం తప్పదు. కాని అందులో మేలు జరిగేలా అనుగ్రహిస్తాను. ప్రభాసుడు ఉత్తమ క్షత్రియుడిగా పుట్టి అస్త్రశస్త్రాలలోనూ తేజోబల పరాక్రమాలలోనూ సాటిలేని వాడని ప్రసిద్ధి చెందుతాడు. మహర్షులే అతని వద్ద నేర్చుకునే బృహస్పతి ఔతాడు. జితేంద్రియుడు, పరమ భక్తాగ్రేసరుడు అయ్యి చాలాకాలం తరవాత స్వచ్ఛందమరణం పొందుతాడు. భార్యాపుత్రులు లేకపోయినా బలగం అధికంగా ఉంటుంది. అతనికి వసువుగా ఉన్నప్పటికంటె మానవుడిగా ఉన్నప్పుడే ఎక్కువకీర్తి

వొస్తుంది. వసువుల ప్పుడప్పుడు పోయి అతనితో మాట్లాడుతూంటారు. నీ కోసం అతనికి ఇన్ని వరాలిచ్చాను" అన్నాడు జితవతితో.

అప్పుడామె - "తండ్రీ! ప్రభాసుని అనుగ్రహించావు. యోగసక్తనుకూడా ఉత్తమ జన్మగా చేయవా?" అని ప్రార్థించింది.

వసిష్ఠుడు కొంచెం ఆలోచించి - "నీ సఖురాలు యవనపుత్రిక అని పేరుపడినా బ్రాహ్మణుడికే జన్మిస్తుంది. విద్యలకు సరస్వతి, రూపానికి రతి, ఐశ్వర్యానికి లక్ష్మి, ప్రాభావానికి గౌరిని మించి రెండవజన్మఎత్తి, పండితరాయలను బిరుదు వహించిన ప్రభాసుడినే పెళ్ళాడుతుంది. కష్టాలు ఎక్కువకాలం ఉండవు. చివరకి భార్యాభర్తలిద్దరూ గంగానదిలో ప్రవేశించి పూర్వరూపాలు దాల్చుతారు. వాళ్ళకి ఈ వరాలు చాలా?" అని అడిగారు. "తండ్రీ! ప్రభాసుడు ఎక్కువకాలం భార్యలేకుండా ఉంటాడు కదా? అతను మరోజన్మ ఎత్తేవరకూ యోగసక ఏంచేస్తూంటుంది?" అని జితవతి అడిగింది.

వసిష్ఠుడు చిరునవ్వుతూ "తనపేరు సార్థకమయ్యేలా తపస్సు చేసుకుంటుంది" అన్నాడు.

"నా నిమిత్తం మరణించిన పులికి ఉత్తమలోకం ప్రసాదించండి. ఇదే నా కడపటికోరిక" అందామె. "నీలాటి పుణ్యాత్మురాలికి ఉపకారం చేసిన పులి ఊరికేపోతుందా? అది చక్రవర్తిగా జన్మిస్తుంది. క్రౌర్య స్వభావం వల్ల యవనుడు ఔతుంది. అతనికి యోగసక్త కూతురని వాడుక వస్తుంది" రోహిణి గురించి అడగబోయి సందేహించిందామె. అది గ్రహించి వసిష్ఠుడే - "నీ సఖురాలు రోహిణి ఇంటికి చేరుకుంది. సుఖంగా ఉంది. మీరిద్దరూ సుఖంగా కలుసుకుంటారు" అన్నాడు. "మహాత్మా ! మీ దయవల్ల మిత్రులందరూ కృతార్థులయ్యారు. రోహిణిని ఎక్కించుకుని యమునలో ఈదుకుపోయిన పులిమాట అడగడం మరచిపోయాను. దానికి కూడా ఉత్తమగతులురాకపోతే నేను కృతఘ్నురాలిగా మిగలనా? స్త్రీచాపల్యం కొద్దీ అడుగుతున్నాననుకోక దానికి కూడ ముక్తి ప్రసాదించండి, యిక మిమ్మల్ని ఏమీ అడగను" అని జితవతి ప్రార్థించింది.

అందుకతను నవ్వుతూ – "పుత్రీ! నువ్వెన్నివరాలడిగిన నాకు మురిపెమే కలుగుతూంది. నీ కృతజ్ఞత ముల్లోకాలలోనూ ప్రసిద్ధి చెందుతుంది. నీకు సంతోషమేకదా? ఇంటికి పోయి సుఖంగా ఉండు" అన్నాడు.

ఆమె చేతులు జోడించి – "స్వామీ! మీ అనుగ్రహం వల్ల నేను ఉత్తమురాలి నయ్యాను. ఇక నాకే కోరికాలేదు. మీ పుత్రికనై ఇక్కడే మీ పాదసేవ చేసుకుంటూ కాలంగడిపేస్తాను. ఏ పుణ్యాత్మురాలి మూలంగా నాకు మీదర్శన భాగ్యం కలిగిందో ఆ యోగసక్త నొకసారి నా కన్నులలో పడేలా చెయ్యండి. ఇకనాకు స్వర్గసౌఖ్యం కూడా అక్కరలేదు" అంది.

వసిష్ఠుడు అరుంధతి ముఖం చూశాడు. అరుంధతి ఆమెను బుజ్జగిస్తూ – "పుత్రీ! నీ శీలమహిమచేత పుణ్యలోకాలన్నీ గుత్తగొన్నావు. నువ్వుపడిన కష్టాలుచాలు. నీ సౌందర్యానికి తగిన వరుణ్ని వివాహం చేసుకుని గృహస్థధర్మాలు పాటించి ముక్తిపొందుతావు. ఇప్పటికి ఇంటికి వెళ్ళు" అంది.

జితవతి అందుకంగీకరించక అక్కడే ఉండి ముక్తురాలి నౌతానని ప్రార్థించింది. ఆమె మాటల కనుగుణంగా అరుంధతి చెప్పి – "యోగసక్తను చూబిస్తాను. కళ్ళుమూసుకో" అంది. జితవతి తన చేతులతో కళ్ళుమూసుకుంది.

# కాశీ మజిలీ కథలు

## 107. వ మజిలీ

కళ్ళు తెరిచేసరికి – జితవతి ఆశ్చర్యపోయింది. 'కళ్ళుమూసి తెరిచేంతలో ఆ తపోవనం అంతర్ధానమయిందే! ఈ నవరత్న ఖచితమైన భవనం ఎవరిది? నాదికాదే దేవలోకభవనంలా ఉంది. ఆ నా సఖురాలిని చూపించమని మునిపత్నిని కోరాను కదా. ఇది యోగసక మందిరం కావచ్చు. సందడి కనిపించదే లోపలికి పోయి చూస్తాను' అనుకుంటూ మెల్లగా తలుపులు తెరచుకుని లోపల అడుగుపెట్టింది.

గదిలో మంచంమీద పడుకుని ధ్యానిస్తున్న యోగసక్త – "ఎవరు వారు?" అని అడిగింది. జితవతి ఆమె దగ్గరకుపోయి నమస్కరించింది. ఆమె లేచి – "అమ్మా! నువ్వెవరివి? ఇక్కడి కెందుకువచ్చావు? ఈ వయసులోనే యోగిని వెందుకయ్యావు?" అని అడిగేసరికి జితవతి – "నీ కష్టాలన్నిటికి కారణమయిన నన్నే మరచిపోయావా? నేను జితవతిని. తల్లీ! కుశలంగా ఉన్నావా?" అంది.

అప్పుడు యోగసక్త ఆమెను ఆప్యాయంగా కౌగలించుకుని – "ఈ వేష మేమిటి? ఇక్కడి కెలా వచ్చావు? మా దేవత్వం భ్రష్టమయింది. విన్నావా? నీకు వార్త పంపానే" అని కన్నీరు పెట్టుకుంది. జితవతి ఆమెను ఓదార్చుతూ జరిగినదంతా చెప్పింది. అది విని ఆమె – "ఎంత సాహసం చేశావు! ఎన్ని కష్టాలు పడ్డావు! ఎంత కృతజ్ఞురాలివి! రాజపుత్రీ! ముల్లోకాలలోనూ నీవంటి కృతజ్ఞురాలు లేదు. నీ స్నేహం వల్ల నేను కూడా చరితార్థురాలినయ్యాను" అంటూ పొగిడింది.

"చాలు చాలు. నీ సుగుణాలలో వెయ్యోవంతు నాలో లేవు. మనం ఇద్దరం యిక్కడ తపస్సు చేసుకుంటూ ఉందాం" అంది జితవతి.

"ప్రపంచాన్ని చూసి చూసి మేం విరక్తి చెందాం. ఏమీ చూడకుండానే నువ్వు విరక్తి చెందుతున్నావు. అయినా ఆ పురాణ

దంపతులు నిన్ను ఇంటికిపోయి పెళ్ళాడమని చెప్పారు కదా. ఆ వైభవం కొన్నాళ్ళనుభవించాక తపస్సు చేసుకోవచ్చు. నువ్వు పులికి చేసిన సేవ తపస్సుకంటే గొప్పదే. ఇంటికి వెళ్ళి ప్రభాకరుణ్ని పెళ్ళి చేసుకో"అంది యోగసక.

జితవతి మౌనంగా ఆలోచించుకుంటూంటే - పెద్ద వసువు భార్య అక్కడికి వచ్చింది. జితవతిని చూసి ఎవరని అడిగింది. "ముందు నువ్వు తెచ్చిన శుభవార్తేమిటో చెప్పు" అంది యోగసక్తి.

అందుకు తేజోవతి, "వసువులందరూ శపించబడి భూలోకంలో తమ తల్లితండ్రు లెవరా అని ఆలోచిస్తూపోతూంటే దారిలో బ్రహ్మచేత శపింపబడిన గంగాదేవి ఎదురై వారి శాపం విని వారందరినీ తనకి జన్మించమని నియోగించిందట. ఆ దేవి శంతనుడనే మహారాజును భర్తగా స్వీకరించి - వసువు లందరినీ కొడుకులుగా కని పుట్టీ పుట్టగానే శాపవిమోచనం చేసింది. నీ భర్తకిచ్చిన శాపం గురించి విచారిస్తూంటే ఆకాశవాణి - "వసువులారా! మీరు ప్రభాసుని గురించి విచారించక్కర లేదు. అతను భీష్ముడనే పేరుతో భూమిమీద చాలాకాలం బతికి దేవతలకన్న ఎక్కువ కీర్తి పొందుతాడు. సర్వధర్మాలూ అతనికే తెలుసు. స్వచ్ఛంద మరణం పొందుతాడు" అని చెప్పింది. వసువులు ఇది నీకు చెప్పి రమ్మన్నారు" అందామె.

అప్పుడు యోగసక "అతిక్రూరమైన యతిశాపం ఇలా మారడానికి కారణం తెలుసా?" అంటూ జితవతి వృత్తాంతం చెప్పింది. తేజోవతి జితవతిని పొగుడుతూ కౌగలించుకుంది. తరవాత యోగసక్త, తేజోవతి ఆమెకు ఎన్నోవిధాలుగా బోధించి ఆమె యోగినీ వేషాన్ని వదల్చి మణిభూషణాలతో అలంకరించి ఆమెను వారిమేడమీద దింపి రమ్మని పరిచారకులను నియమించారు.

ఆ మేడమీద ఉన్న పరిజనం రాజపుత్రిక రావడం చూసి - "జితవతి, జితవతి.." అంటూ కేకవేస్తూ పదిమందికీ తెలియజేసారు. ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ రాజపత్నీ, రోహిణీ, అంతఃపురకాంతలూ

ఆ మేడమీదకు వచ్చి ఆమెను కౌగలించుకున్నారు. జితవతి ముందుగా రోహిణిని కౌగలించుకుని – "ప్రియసఖీ! ఇంటికెలా చేరావు? ప్రవాహంలో కొట్టుకుపోయి ఎక్కడ గట్టెక్కావు? ఆ పులి ఏమయింది?" అని అడగ్గా – ఆమె ఆ వృత్తాంతమంతా చెప్పింది తరవాత జితవతి కూడా తన వృత్తాంతమంతా వారికి తెలిపింది. తరవాత జితవతిని చూడడానికి వచ్చిపోయే బంధువులతో ఆ యిల్లు నిండిపోయింది. ఉశీనరుడు వచ్చి కుమార్తెను కౌగలించుకుని ఆనందాశ్రువులతో ఆమె శిరస్సు తడుపుతూంటే – "నేను మీకు చెప్పకుండా యిల్లు దాటడం తప్పేమో" అంటూ సిగ్గుపడింది. అందుకతను – "తల్లీ! నీ సౌశీల్యం తెలిసింది నువ్వు విచారించకు. నీవల్ల మన వంశానికే పేరొచ్చింది. కృతజ్ఞురాలిగా నువ్వు ఎంతో ప్రసిద్ధి సంపాదించావు" అని ప్రశంసించాడు.

రోహిణి తన వృత్తాంతం చెబుతూ ప్రభాకరుడి గుణగణాలను విశేషంగా పొగిడి జితవతి మనసు అతనిమీద లగ్నమయ్యేలా ప్రయత్నించింది.

తనకోసం అతను పడిన కష్టాలూ, తనగురించి అతను చెప్పిన మాటల తెలుసుకుని – "అయ్యో! నా గురించి ఆ రాజపుత్రుడు అంత పరితపించడం దేనికి? నా పాటి జోగురాలు ఆయనకు దొరకదా? నేనెందరిని కష్టపెట్టానో కదా" అంది. జితవతి అందుకు రోహిణి – " "జితవతీ! ప్రభాకరుడు నీ రూపం గురించి అంతగా పొగడడు. కాని, నీ కృతజ్ఞతా గుణానికి అతని మనసునీరై పోతుంది" అని చెప్పింది. తాను యోగినిగా అతనితో మాట్లాడడం అతను తనని పెళ్ళాడడానికి విరోధమౌతుందేమో అని జితవతి సందేహం వ్యక్తపరచగా – "నీ వైరాగ్యమే అతనికి నచ్చిందట. నాతో నీ గురించి ఎన్ని మంచిమాటలు చెప్పాడో! నీ తల్లి తండ్రులు కూడా అతన్నే నీ భర్తగా నిర్ణయించారు. దేవతలూ అతన్నే నిశ్చయించారు. అందుచేత మరొక ఆలోచన పెట్టుకోకు. వివాహ సన్నాహాలు కూడా జరిగిపోతున్నాయి." అని ఆమెచేత ఔననిపించి, ఆ విషయం ఉశీనరుడికి తెలిపింది.

ఉశీనరుడు ప్రభాకరుణ్ని బంధుమిత్ర పరివారంగా రప్పించి, శుభముహూర్తంలో జితవతినిచ్చి వివాహం చేశాడు. అరుంధతీ మహాదేవి నందినీ ధేనువు పాలను స్వయంగా పితికి ఇచ్చింది. వివాహం అయ్యాక ఆ పాలను జాగ్రత్తగా భర్తకిప్పించింది జితవతి.

ప్రభాకరుడు జితవతితో చాలాకాలం ఇంద్రవైభవం అనుభవిస్తూ రాజ్యపాలన చేశాడు.

గోపా! ఆ ప్రభాసుడు శంతనుడి వలన గంగాదేవి గర్భంలో జన్మించి భీష్ముడనే పేరుతో ప్రసిద్ధిపొంది రెండవజన్మలో పండిత రాయలై జన్మించాడు. ఆ యోగసక లవంగి అయింది. బ్రాహ్మణపుత్రికే అయినా పాదుషా కూతురిగా పేరు పడింది. జితవతికి ఉపకారం చేసిన పెద్దపులే పాదుషా అయింది. రెండవపులి మంత్రి అయింది. పండితరాయలు, లవంగి కొన్ని0 కష్టాలుపడి చివరకు గంగలో ప్రవేశించి వసురూపాలు దాల్చి వారిలోకానికి వెళ్ళిపోయారు. తెలిసింది కదా?" అన్నాడు మణిసిద్ధుడు.

ఆ కథ విని ఆనందంతో గోపాలుడు తన గురువు గారికి అనేక వందనాలు చేశాడు.

# కాశీ మజిలీ కథలు

## 108. వ మజిలీ

"మహాత్మా! ఈ వూరిలో విశేషాలేవీ కనపడలేదు. విక్రమాదిత్యుని మనవడు విజయభాస్కరుడి చరిత్ర విన్నది మొదలు అతను కలభాషిణీ హేమప్రభలతో ఉజ్జయినీ నగరంలో పట్టాభిషిక్తు డయ్యాక ఏం జరిగిందో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. అతను లోకోపకారంగా ఏం చేశాడో... మణి ప్రభావంతో తెలుసుకుని నాకు చెబుతారా?" అని ప్రార్థించాడు. గోపాలుడు మణిసిద్ధుడు రత్నాన్ని పూజించి – "గోపా! నువ్వడిగావంటే ఆ కథలో ఏదో చమత్కారం ఉండకమానదు. అకథ విను" అని ఇలా చెప్పసాగాడు.

## వీరసింహుడి కథ

ఉజ్జయినీ నగరాన్ని విజయభాస్కరుడు పరిపాలిస్తూండగా ఒకనాడు ప్రతీహారి వచ్చి – "దేవా! దూరదేశవాసి అయిన ఒక బ్రాహ్మణుడు ఇద్దరు శిష్యులతో వచ్చి మీ దర్శనం కోరుతున్నాడు" అన్నాడు. "వెంటనే ప్రవేశపెట్టు" అన్నాడు రాజు. అతను వెళ్ళి వచ్చి – "అతనిక్కడికి రాడట. తమరినే అక్కడికి దయచేసిమని ప్రార్థిస్తున్నాడు" అన్నాడు. రాజు లేచి అతని వద్దకుపోయి – నమస్కరించి – "ఆర్యా! మీరేంపనిమీద ఈ దేశం వచ్చారు? సభకు ఎందుకు రారు?" అని వినయంగా అడిగాడు.

ఆ విప్రుడు రాజు నాశీర్వదించి – "దేవా! మాది దక్షిణదేశం. నాపేరు సుముఖుడు. వాస్తుదేవతా భూయిష్టమైన కోటలోకి వాస్తే వాస్తుదేవతలు ముందరికార్యానికి విఘ్నం కలగజేస్తారని రాలేదు. నేను ఎన్నో విద్యలు నేర్చాను. అంజన ప్రభావంతో నిధినిక్షేపాలు ఎక్కడున్నాయో

చెప్పగలను. ఈ నగరానికి దక్షిణంగా ఉన్న అరణ్యంలోని పర్వతం వద్ద మఱ్ఱిచెట్టుకింద పెద్దనిక్షేపముంది. దానిని పరిశీలించవచ్చును. ఆ నిక్షేపాన్ని భూత భేతాళాలు కాచుకుని ఉన్నాయి. దేవరవారు పట్టమహిషితో వచ్చి తవ్వడం ప్రారంభిస్తే నిక్షేపం లభిస్తుంది. మంత్రబలంతో నేను భూతాలను కట్టివేస్తాను. నిక్షేపంలో సగబాగం దేవరకిస్తాను" అని ప్రార్థించాడు.

విజయభాస్కరుడు నవ్వుతూ – "నాకేమీ యివ్వక్కర్లేదు. అంతా మీరే తీసుకోండి. మేం ఎప్పుడు అక్కడికి రావాలో చెప్పండి" అన్నాడు. బ్రాహ్మణుడు చాలా సంతోషించాడు.

అనుకున్ననాడు కలభాషిణిని పల్లకీ ఎక్కించి, తను గుఱ్ఱం మీద ఆ కొండవద్దకు వెళ్ళాడు. వారికోసమే ఎదురు చూస్తున్న శిష్యులు పరివారాన్ని అక్కడే ఉండమని రాజునీ, వారి భార్యనీ శిఖరానికి తీసుకుపోయారు. ఆ బ్రాహ్మణుడు మఱ్ఱిచెట్టు కింద అగ్నిని రగుల్చుతూ అందరినీ దూరంగా పంపేశాడు. రాజు, పత్ని, శిష్యులు, సుముఖుడు మాత్రమే అక్కడున్నారు. అప్పుడు సుముఖుడు వాళ్ళిద్దరినీ కళ్ళు మూసుకోమని, హఠాత్తుగా తన దేహం పెంచుకుని వారిద్దరినీ చెరో భుజం మీదా పెట్టుకుని శిష్యులు వెంటరాగా ఆకాశమార్గంలలో దక్షిణంగా ఎక్కడికో పోయాడు.

పర్వతం దిగువ నిరీక్షిస్తున్న పరిజనులు రాజదంపతులను తీసుకువెళ్ళడానికి కొండమీదకి రాగా అక్కడ ఎవరి జాడా కనపడలేదు. మఱ్ఱిచెట్టుకింద – వేదికమీద అగ్నిప్రజ్వరిల్లుతోంది. వాళ్ళెంతగా రాజు కోసం అరిచినా....వెదికినా...ప్రయోజనం లేక...నగరానికి వెళ్ళి ఆ విషయం మంత్రులకి చెప్పారు.

అప్పటికి రెండు రోజుల కిందట హేమప్రభ మగ శిశువును ప్రసవించింది. పదిరోజులు అయ్యేవరకూ ఆ దుర్వార్త చెప్పకూడదని ఆమెవద్ద దాచారు. రాజదంపతులను వెదకడానికి సమర్థులయిన మంత్రులని పంపాడు.

పదకొండవ రోజున ఆ విషాదవార్త విన్నహేమప్రభ మూర్ఛ పోయింది. విజయభాస్కరుడి తల్లి ఆ వార్తవిని బెదిరిపోయినా, అతను

దైవబలసంపన్నుడనీ, శత్రువులబారినుంచి రాగలడనీ కోడలిని ఊరడించి, దేశం అరాజకం కాకుండా హేమప్రభ అనుమతితో మంత్రులు చూసేటట్లు నియమించి, వారిని వెదకడానికి ఎంతో డబ్బు ఖర్చుపెట్ట సాగింది.

హేమప్రభ కొడుకు వీరసింహుడు దినదిన ప్రవర్ధమానుడౌతూ కాలంరాగానే ఉపాధ్యాయుల వద్ద విద్యలను నేర్చుకుని, కొద్దికాలంలోనే అఖండ కళానిపుణుడయ్యాడు హేమప్రభ మంత్రుల కార్యాలను పరికిస్తూ ప్రజలు మెచ్చుకునేలా రాజ్యపాలన చేస్తూ - వారిని వెదికించడానికి ఎన్నో విధాల ప్రయత్నించసాగింది. కుమారుడికి మాత్రం ఈ విషయం తెలియకుండా కట్టడిచేసింది.

ఒకనాడు మంత్రుల వద్దనుంచి ఆమెకు ఒక ఉత్తరం వచ్చింది. "రాణీ! వీరసింహుడికి తండ్రి గురించి ఏమీ తెలియకూడదనీ, చెప్పిన వారిని శిక్షిస్తామనీ ప్రకటన కూడా చేశాం. కాని ఇవాళ ఒక విదేశీ విప్రుడు వీరసింహుడిని చూస్తానని విద్యాశాలకు వెళ్ళి అతనితో చర్చిస్తూ . చదివిన పద్యాలనుండి తన తండ్రి విజయభాస్కరుడనీ, అతను ప్రవాసంలో ఉన్నాడనీ, తనతల్లి హేమప్రభ అనీ గ్రహించి విప్రుడినుండి ఆవృత్తాంత మంతా రాబట్టేశాడు. గురువులని చూసి - "ఇదంతా నిజమేనా?" అని అడిగితే వాళ్ళు మౌనంగా ఉండిపోయారు.

అంతలో కొందరు భటులు ఆ విప్రుణ్ని కట్టి తీసుకు పోతూండగా రాజపుత్రుడు అడ్డంపడి వారికట్లు విప్పించాడు. అతను చేసిన నేరమేమిటని రాజపుత్రుడు అడగ్గా వారు - "మంత్రి శాసనం" అన్నారు.

"చేసిన తప్పు చెప్పకుండా తీసుకెళ్ళ నివ్వను" అని రాజపుత్రుడు నిర్బంధించగా ఉపాధ్యాయులు నిజమంతా చెప్పేశారట. అప్పుడు మీ బిడ్డడు - "ఛీ! మా మంత్రులు ఇంత అవివేకులా? దేశాంతరం వెళ్ళిన రాజుని తీసుకురాలేక తమ పట్నంలోని సాధుజనం మీద ప్రతాపాలు చూపుతారా? గొప్ప రాజ తంత్రమే. ఈ విషయం ఇన్నాళ్ళుగా నాకు చెప్పనందుకు వారే శిక్షార్హులు" అని ఆ బ్రాహ్మణునకు కానుక లిప్పించి పంపి - మమ్మల్ని శిక్షించడానికి కాబోలు తన వద్దకు తీసుకు రమ్మన్నాడట.

మీ కుమారుడు ఇప్పుడు సర్వసమర్థుడు అతను ఏం తలుచుకున్నా సాగుతుంది. దేవిగారు అనుగ్రహించి మీ కుమారుని కోపం ఉపశమింపజేయండి. ఆ శాసనం మీ ఆజ్ఞమేరకే తప్ప మేము స్వతంత్రించి చేయలేదుకదా."

అది చదివిన హేమప్రభ మంత్రులకు అభయపత్రిక రాసి పంపిస్తూండగా రాజపుత్రుడే ఆమె వద్దకు విషాద వదనంతో వచ్చి నమస్కరించాడు. ఆమె అతన్ని కౌగలించుకుని కన్నీటితో శిరస్సు తడిపింది.

"అయ్యో! తల్లీ! నాకు బుద్ధి వచ్చి ఎనిమిదేళ్ళు అయింది. అప్పుడే ఈ కథ చెబితే ఈ పాటికి మా తండ్రిని తీసుకురాకపోదునా? ఎవరిని అడిగినా మా తండ్రి లేడనే చెప్పారు కాని ప్రవాసానికి తీసుకుపోబడ్డాడని ఒక్కరూ చెప్పలేదు. పైగా చెప్పిన వారిని శిక్షిస్తామని శాసనం చేశారట. ఏం చోద్యం!" "నాయనా! నీకు తెలిస్తే మాత్రం విచారించడం కంటె ఏం చేయగలవు. ఇందులో మంత్రుల తప్పులేదు ఎవడో మాయావి బ్రాహ్మణవేషంలో వచ్చి నిక్షేపముందని తీసుకుపోయాడు. వాడు... మా అవ్వకు సోదరుడు రక్షాక్షుడై ఉంటాడు. వాడినివాసం పాతాళలోకానికి అడుగున ఉన్న తలాతలం. నేను రావడం విని - కోపించి మీ తండ్రి నెత్తుకు పోయి ఉంటాడు వాడికి మీ తల్లితండ్రులని చంపగలిగే సామర్థ్యం లేదు. ఎప్పటికేనా మీ తండ్రి, కలభాషిణీ తప్పించుకు వస్తారని నాకు స్వప్నం చెప్పింది. నువ్వు విచారించకు" అంది హేమప్రభ విచారంగా. "అమ్మా! ఆమె ప్రసవించిన వాడు నాకు అన్న ఔతాడా? తమ్ముడౌతాడా?" అని అత నడగగా అన్నే ఔతాడు" అందామె.

అప్పుడతను - "అమ్మా! గతానికి వగచి ఏం ప్రయోజనం? వాళ్ళు ఎక్కడునా వెదికి తీసుకువొస్తాను, అనుజ్ఞయివ్వు" అన్నాడు అందుకామె కలవరపడుతూ "చాలుచాలు. అలాటి ఊహ లెప్పుడూ పెట్టుకోకు. వాళ్ళే వస్తారు పాతాళానికి మనుషులు పోలేరు. రాజ్యభారం చూసుకో" అని మందలించింది.

చెబితే వెళ్ళనివ్వదని, అతనామె మాటకంగీకరించినట్లు తలూపాడు. కాని అది మొదలు పాతాళానికి వెళ్ళే మార్గం గురించి ఆలోచిస్తూ, గ్రందాలు చదువుతూ పండితుల నడగసాగేడు. నారదుడు

వరుణలోకం మీదుగా పాతాళలోకానికి వెళ్ళినప్పటి విశేషాలను మహాభారతంలో చదివి - సముద్ర మధ్యంలో దుమికితే పాతాళం చేరవచ్చునని భావించి - ఒకనాటి వేకువ జామున ఎవరికీ తెలియకుండా పోయి - కొన్నాళ్ళకి సముద్రతీరం చేరాడు. అప్పటికి అట్టే పొద్దులేదు. సముద్రాన్ని చూసి అతను ఆశ్చర్యపోయాడు ఓడ ఏదీ కనపడక సముద్రంలోకి ఎలా వెళ్ళాలా అని ఆలోచిస్తూ ఒడ్డు వెంబడే నడవసాగాడు. చిన్నచిన్న కెరటాలు పాదాలు తడిపిపోతూంటే పెద్ద కెరటాలు అతన్ని స్నానం చేయించేశాయి. అంతలో మెరిసిపోతున్న చేప చచ్చి అతని ముందు పడింది తన చేతిలో ఉన్న కత్తితో దానిపొట్ట కోసేసరికి అద్భుతంగా మెరిసిపోతున్న రత్నం ఒకటి బయటపడింది దానిని నీళ్ళతో కడిగి చూసేసరికి దేవతా మాణిక్యమేమో అనిపించింది. నాగకన్యలు ధరించేదని గ్రహించి, శుభసూచకమని తలచి రంధ్రమున్న ఆ మణిని తాడుగుచ్చి మెడలో వేసుకున్నాడు. అది అతని వక్షస్థలం మీద ప్రకాశించింది. ప్రమాదవశాత్తు అది జారిపడిపోడంతో అది కనిపించలేదు దేవతా మణిని దరించడం పొరపాటేమో అని - చేతులతో తడమగా అది చేతికి తగిలి మళ్ళీ కనిపించింది. అతను దాని మహత్యం గుర్తించాడు. అది శరీరానికి తగులుతూంటే అది కనపడుతుంది, కాని తను ఎవరికీ కనపడడని తెలిసింది ఇది మంచి సాదనమే అనుకుంటూ దానిని గట్టిగా కట్టి మెడలో వేసుకుని - తీరం వెంబడే నడవసాగాడు.

కొంతదూరం వెళ్ళాక, సముద్రంలోకి చొచ్చుకుపోయిన తిన్నె ఒకటి కనిపించింది. అది గట్టిగా రాయిలా ఉంది అతను నడుస్తూంటే నేల కదిలింది. భూకంపం అనుకున్నాడు. కాని ..అది వేగంగా నీటిలో పోతుంటే తాబేలు కాబోలనుకున్నాడు. 'ఇది సముద్రం మధ్యకి పోయి మునుగుతుంది. నేనూ మునిగి పాతాళానికి పోతాను. ఇది దైవానుగ్రహమే కాకుంటే దివ్యమణి ఎలా లభిస్తుంది?' అని సంతోషించాడు. దేవుణ్ణి ధ్యానించుకుంటూ నిర్భయంగా తిరగసాగాడు. అంతలో చీకటిపడింది. అతను నిద్రపోయి ఉదయం కళ్ళు తెరచి చూసేసరికి అ తాబేలు ఒడ్డు చేరి ఉంది. ఆ ప్రాంతం వృక్షాలు, తీగెలతో చాలా అందంగా ఉంది. ఒడ్డు గోడలా ఉండడంతో ఎక్కడానికి వీలవలేదు. పైకి ఎలా పోవాలా అని అతను ఆలోచిస్తూంటే -

ఒక అడవిపంది గట్టుమీద నుంచి నీటిలోకి తొంగిచూసింది. దిగడానికి అనువుగా తన కోరలతో గట్టుని పొడిచి మెట్లు చేసుకుని నీటిలోకిదిగి జలక్రీడ లాడసాగింది. అతను చాలా ఆనందించి ఆ మెట్ల మీదుగానే గట్టెక్కాడు. అంతలో ఆ తాబేలు నీటిలో మునిగిపోయింది. ఆ తాబేలు కూడా తనకి సహాయపడిన దైవమే అని దానిని స్తోత్రం చేసి ముందుకి నడిచాడు. అక్కడ సింహాలూ పెద్దపులులూ కల భయంకరమైన అరణ్యం ఎదురయింది. అతనొక చెట్టు నీడలో విశ్రమించేసరికి ఒక సింహం కూడా అక్కడికి వచ్చి అతన్ని చూసి కూడా బెదరకుండా పడుకుంది. అతను మొదటి ఆశ్చర్యపోయినా, అంతలో తన మణివలన దానికి తాను కనపడడం లేదని గ్రహించాడు.

దీనిమీద ఎక్కి చూస్తాను, గుర్రంలా ప్రవర్తించిందా సరే. లేకపోతే చంపేస్తాను – అనుకుని అది లేచి నిలబడి ఎక్కడికో పోబోతూంటే దానిమీదకు ఎగిరి జూలుని గట్టిగా పట్టుకున్నాడు. అది – ఆకాశం విరిగి తనమీద పడ్డట్లు శరవేగంతో దూకుతూ ఎన్నో అడవులు దాటి ఒక కొండ దగ్గర నేలమీద పడిపోయింది. అతను పునర్జన్మ ఎత్తినట్లే నిట్టూర్చి, దానిమీంచి దిగి దాని పాదాలొత్తి సేవచేశాడు. అంతలో అదిలేచి పారిపోయింది.

నడిస్తే సంవత్సరానికయినా దాటలేని అడవుల్ని అంత త్వరగా దాటించినందుకు ఆ సింహానికి కృతజ్ఞతలు తెలుపుకుని ఆ అందమైన ప్రదేశాన్ని చూసి – 'రాజధానికి ఈ కొండ క్రీడా శైలం కాబోలు. ఇక్కడి భవనాలు చాలా చిత్రంగా ఉన్నాయి. ఈ పట్నం చూద్దాం' అంటూ క్రీడాసౌధపు అరుగుమీద కూర్చుని చుట్టూ చూడసాగాడు.

అంతలో చీకటి పడింది. రత్నం కాంతులను వెదజల్లుతూంటే బట్టలలో చుట్టి పడుకున్నాడు. అతనికి మాటలు వినపడసాగాయి.

*నరాంతకుడు* : దుర్ముఖా! నేను రానంటూంటే బలవంతంగా ఏదో చెబుతానని ఈ త్రికూటానికి తీసుకు వచ్చావు కదా. అదేమిటో చెప్పు.

*దుర్ముఖుడు* : మిత్రమా! మన ప్రభువు విద్యుజ్జిహ్వుడు విభీషణ మహారాజుగారి పుత్రికను వరించి పిచ్చివాడై తిరుగుతున్నాడన్న వార్త నువ్వు విన్నావా?

**నరాంతకుడు** : వినలేదు. ఆ దుష్టుడి కామెనివ్వరు. రావణుడితోనే ఆ బాంధవ్యం తెగిపోయింది.

**దుర్ముఖుడు** : నిజమే. పెద్దవిభీషణుడికి శూర్పణఖ సంతతి పేరు చెబితేనే కోపం. కాని ఇతని కోరికలకేం? ఫలించినా మానినా కోరుకోడాని కడ్డంలేదు కదా. ఇవాళ పుణ్యదినం అవడంతో విభీషణుడు మనవడితో కూడి శ్రీరంగనాథుణ్ని అర్చించడానికి భూలోకంలోని శ్రీరంగానికి వెళ్ళాడు.

**నరాంతకుడు** : అలా పోవడం వారికి వాడుకే. శ్రీరాముడిచ్చిన రంగనాథుని విమానాన్ని విభీషణుడు లంకాపురం తెస్తుంటే కావేరి కోరిక తీర్చడానికి శ్రీరంగంలో స్థాపితమయ్యాడు కాని లేకపోతే శ్రీరంగం లంకాపురిలోనే ఉండేది.

**దుర్ముఖుడు** : ఈ అవకాశం చూసుకుని ఇవాళ రాత్రి విద్యుజ్జిహ్వుడు ఆమెను శాంబరీవిద్యతో అంతఃపురంనుంచి తెచ్చేస్తాడట కామాంధులకు యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం ఉండదు కదా. పెద్ద విభీషణుడి శాసనం తెలియదు కాబోలు, పులిమీసాలు లాగడానికి ప్రయత్నిస్తున్నాడు! సరే, మనం పెందలకడనే పోయి మందిరం శుభ్రం చేయాలి. నాకు వేరే పనుంది. అతనొచ్చే వేళయింది. లోపలికి పోయి బాగుచేద్దాం రా. అందుకే పిలిచాను.

**నరాంతకుడు** : నేను లోపలికి రాలేను. బాగుచేశామని చెప్పెయ్యి. అలా మాట్లాడుకుంటూ వాళ్ళు విద్యుజ్జిహ్వుడి రాకకోసం ఎదురు చూడసాగారు. వారి మాటలు విన్న వీరసింహుడు – 'ఇది లంకా పట్టణమా' వీళ్ళు రాక్షసులా! విభీషణుడి మనవడిపేరు కూడా విభీషణుడే కాబోలు. నేను లంకా పట్నం వచ్చేశానన్న మాట!' అని ఆశ్చర్యపోతూ నిశ్శబ్దంగా కళ్ళుమూసుకుని ఉండిపోయాడు.

అంతవరకూ చెప్పేసరికి వేళదాటిపోతూంటే తరవాత మజిలీకి సిద్ధమయ్యారు గురుశిష్యులు.

# కాశీ మజిలీ కథలు

## 109. వ మజిలీ

## అశోకవనం కథ

**ఏ**కాక్షి : అక్కా! నీకెన్నేళ్ళు? నాకంటె పెద్దదానివా, చిన్నదానివా? సీతాపహరణానికి నీ వయసెంత? ఛీ! రామరామ.

ఏకకర్ణ : నాకెన్నేళ్ళో తెలియదు కాని నీకంటె పెద్దదాన్నే. దేవాసుర యుద్ధం నాటికి ఈడేరాను. అందులోనే నా భర్త పోయాడు. సీతాపహరణం మొన్న మొన్ననే కదా జరిగింది. ఛీ! రామరామ.

ఏకాక్షి : నువ్వు తాటికి ఈడుదానివా!

ఏకకర్ణ : తాటికి నాకంటె చాలా చిన్నది. తాటికీ సుందుల పెళ్ళికి నేను పేరంటానికి వెళ్ళాను. సుందోపసుందులు నాకు మేనత్త కొడుకులు. ఛీ! రామరామ

ఏకాక్షి : నాకుమాత్రం తక్కువ వయసుందా? సముచిశంబరులు నాకంటె చిన్నవాళ్ళు. దేవాసురులు అమృతం కోసం కలహించడం నేను బాగా ఎరుగుదును. ఛీ! రామరామ. రాక్షసస్త్రీల కెప్పుడూ యిలాటి నిర్బంధం కలగలేదు. ఈ పాడు రామనామం జపం చెయ్యలేక పాడుతావళం తిప్పలేకా విసుగొస్తుంది. దీర్ఘాయువు వల్ల మరింత కష్టం వొచ్చిపడింది. ఛీ! రామరామ.

దీర్ఘ జిహ్వాక : మనశత్రువు నామం జపించమని విభీషణుడు దిక్కులేని వాళ్ళమైన మనని నియమించాడు. రావణబ్రహ్మ సితను ఇక్కడికి తీసుకు రాకపోయినా బాగుండేది. ఛీ!రామరామ.

లంబోదరి : రావణుడి కాలంలో మనమే వీరభటుల్లా తిరుగుతూ అందరినీ బెదిరించే వాళ్ళం.

అలాటిది యిప్పుడు రండాపుత్రులకి భయపడవలసి వస్తూంది. ఛీ! రామరామ.

**అజాముఖి** : మనపాదాలకు సంకెళ్ళు వేసి యీ పాడు రామ మందిరంలో కూర్చోబెట్టి రామనామం జపించమన్న విభీషణుడెంత పాపాత్ముడో! వాడికి మన ఉసురుతగలక పోతుందా? ఛీ! రామరామ.

**వ్యాఘ్రముఖి** : ఆ మహారాజు రావణుడి కాలంలో రోజూ తిన్న మాంసం తలుచుకుంటూంటే గుండె పగిలిపోతూంది. ఈ లంకలో రోజుకి పది మణుగుల నరమాంసం తినని రాక్షసి ఉండేదికాదు. ఛీ! రామరామ.

**ఉష్ట్రనఖి** : మనకి నరమాంసం ఆకాశకుసుమం అయింది. మాంసం తినడమే తప్పట! శాకాహారంతో మనకడుపు లెలా నిండుతాయి? మనని ఇలా వేధిస్తున్న విభీషణుడు తొందరగా చావడా! ఛీరామరామ.

**పాదచూళిత** : మనుష్య మాంసమంటే నానోరు ఊరుతూంది. రావణబ్రహ్మ! నువ్వు చనిపోడం మా పాపమే.

**లంబకర్ణి** : ఈ విభీషణు డెందుకు చావడో? పాపీచిరాయువు అన్నది నిజమే. ఛీ! రామరామ.

**హంసపాదిక** : మనం ఆవేళే సీతను మింగేసి ఉంటే మనకివాళ యీ కష్టాలుండకపోనేమో. ఛీ! రామరామ.

**గోముఖి** : చిన్నవిభీషణుడు తాతకంటే క్రూరుడు. మద్య మాంసాలిస్తే లొంగమని అల్లాహారాలిస్తున్నాడు.

**అనాసిక** : పది ఏనుగులను తిన గలిగే మన కీస్వల్ప ఆహారం ఏమూలకి? ఛీ రామ రామ.

**గోముఖి** : చచ్చినట్లు పడి ఉందామన్నా - తులసి తావళం తిప్పాలి, నోరు నొప్పెట్టేటట్లు రోజుకి లక్షసార్లు శత్రునామం జపించాలి. ఆకలితో చస్తూంటే అవి ఎలా సాగుతాయి? ఛీ! రామరామ.

**దీర్ఘనాసిక** : పూర్వం - ప్రహ్లాదుడి రాజ్యంలో రాక్షసులందరినీ నారాయణ మంత్రం జపించమని నిర్బంధించారట. మా అమ్మమ్మ తల్లి చెప్పింది. ఇప్పుడు మనకీ అదేకష్టం వొచ్చింది. ఛీరామరామ.

*లంబోదరి* : రాజభటులు వొస్తున్నారు. జపం నటించండి. ఛీ! రామరామ.

**రాజభటులు** : రండల్లారా! జపం మాని కబుర్లు చెప్పుకుంటున్నారా! మేం చూస్తున్నాం. ఇప్పటికి ఎన్నివేలు జపించావో చెప్పు.

అంటూ వారిని గద్దించి శ్రీరామ నామజపం చేయించసాగారు. రాక్షసస్త్రీలు మహామునుల్లా కళ్ళుమూసుకుని తారకమంత్రం జపించసాగారు. అప్పుడు దీర్ఘనాసికలేచి – "ఆహా మనిషి వాసన! ఎన్నాళ్ళకి ముక్కుకి తగిలింది" అంటూ లేచేసరికి మిగిలిన వాళ్ళుకూడా లేచి ఔను. నరవాసన ..." అంటూ చిందులు తొక్కసాగారు. రాజభటులు వాళ్ళని అదుపులో పెట్టారు.

అదంతా చూస్తున్న వీరసింహుడు "విభీషణు డెంత కృతజ్ఞుడో! వీళ్ళందరికీ సంకెళ్ళు వేసి రామమందిరం చుట్టూ కూర్చుండ బెట్టి రామనామ జపం చేయిస్తున్నాడు! ఆహా! ఎక్కడి లంకాపట్నం! ఎక్కడి ఉజ్జయిని! మాముత్తాత విక్రమార్కుడి సుకృతమే నాకీ ఫలం ప్రసాదించింది. నేను అదృశ్యంగా ఉండబట్టి కాని లేకపోతే యీ రాక్షసి ముండలు నన్ను నోట్లో వేసుకునేవారే!

ఇది పాతలంకకి మార్గమట. దక్షిణంగా కొత్త పట్నాన్ని నిర్మించుకున్నట్లు వాళ్ళ మాటలవల్ల తెలిసింది. ఈ దారి వెంటపోయి అశోకవనం చూస్తాను. అనుకుంటూ ఆ వనానికి వెళ్ళి కన్నుల పండగ చేసే చెట్లనీ పూలనీ వింత పళ్ళనీ చూసి సీతామహాదేవి వసించిన శింశుపావృక్షాన్ని దర్శించాడు. ఆ వృక్షం చాలా పాతదయినా విభీషణుడు దానిని చక్కగా అలంకరింపజేశాడు. అక్కడ అనేక రాక్షస వృద్ధులు వేదశాస్త్రపురాణాలు చదువుతున్నారు. అతి చక్కని ఆవనమంతా తిరిగి, పళ్ళతో ఆకలి తీర్చుకుని కొంతదూరం వెళ్ళేసరికి ఒకపూలతోట కనిపించింది. దాని సౌందర్యానికీ ప్రత్యేకతకీ పరవశించిపోయి అక్కడే ఉందామనుకుని ఆ తోటలో తిరగసాగాడు.

# చంపక కథ

అంతలో ... ఒక మూలనుంచి మనోహరమైన గానం వినపడింది. 'విభీషణపుత్రిక చంపక విహరించే కేళీవనం అని ప్రకటన ఫలకం వల్ల తెలుస్తోంది. ఆమెను చూస్తాను' అని అతను అదృశ్యంగానే వెళ్ళాడు. సంగీతం పాడుకుంటున్న ఒక చిన్నది కనిపించింది. ఆమె సౌందర్యాని కతను పరవశించి పోయాడు. రెప్పవేయకుండా చూశాడా సౌందర్యరాశిని. ఆ సంగీతమూ సౌందర్యమూ అతనికి మోహం కలిగించినా – 'వివాహిత ఏమో!' అని తనని తాను మందలించుకున్నాడు.

ఆమె సంగీతం కట్టిపెట్టేసరికి మరొకామె వచ్చి కూర్చోగా – "చామరికా! ఇంత ఆలస్యం చేశావేం?" అని అడిగింది. అప్పుడామె – "రాజపుత్రీ! నిన్నరాత్రి నేను నీ అంతఃపురంలో అలవాటుగా సంగీత సాధన చేసి ఎంతకీ నువ్వు రాకపోడంతో నీ మంచం మీద పడుకుని గాఢనిద్రలో మునిగిపోయాను. కొంతసేపటికి లేచి చూస్తే – త్రికూట నగరంలోని చీకటింట్లో ఉన్నాను. అప్పుడు శూర్పణఖ మనవడు విద్యుజ్జిహ్వుడు – "చంపకా! చంపకా!" అంటూ నన్ను లేపుతూ ఏదో చెప్పసాగాడు.

అప్పుడు నేను – "నేను చంపకను కాను. ఆమె సఖురాలు చామరికను. నన్నెందుకు తీసుకొచ్చావ్?" అని ధైర్యం తెచ్చుకుని అడిగాను.

అతను విచారిస్తూ – "అయ్యో! నిన్ను రాజపుత్రిక అనుకుని తీసుకువచ్చాను. నువ్వు ఆమె మంచంమీద పడుకున్నావు కాబోలు. సర్లే. నువ్వు నాకొక ఉపకారం చేస్తానంటే నిన్ను వదిలిపెడతాను. లేదా నీ పనిపడతాను" అన్నాడు. "మేము పరిచారికలం. ఎవరేం చెబితే అది చెయ్యవలసిన వాళ్ళం నాకు చేతనైనంత ఉపకారం చేసి నీ నుంచి కానుక లందుకుంటాను. చెప్పు" అన్నాను.

"చిన్నవిభీషణుడి కూతురు చంపకను పెళ్ళాడాలని నాకెప్పటి నుంచో అభిలాష. రాక్షసులని నానాబాధలూ పెట్టే విబీషణుడు నాకు పిల్లనివ్వడు. దానినెత్తుకొచ్చి వివాహం చేసుకోదలుచుకున్నాను. ఆమెకు

నామీద మోహం కలిగేటట్లు చెయ్యి. నీకు మంచి పారితోషికం యిప్పిస్తాను" అన్నాడు. అతన్ని తప్పించుకుందుకు అనుకూలంగా మాట్లాడి - వచ్చేశాను" అంది.

చంపక చాలా కోపంతో ..."ఆ పాపాత్ముడలా చేశాడా! ఈ వార్త మా తండ్రికి చెప్పావా? .." అంది. "చెప్పాను. అయ్యగారేదో తొందరలో ఉన్నారు. పాతాళలోకంలో కర్కోటక కులం వారికీ వాసుకి కులంవారికీ పెద్దయుద్ధం జరగబోతూందట. మనవారిని సాయానికి రమ్మన్నారట. అందుచేత తరవాత చూద్దాంలే అన్నారు" అంది చామరిక.

"వాళ్ళకి యుద్ధం ఎందుకు వచ్చిందో తెలుసుకోవాలి. అంతః పురానికి పద-" అంటూ ఆమె వెళ్ళింది.

వారి సంభాషణ నుంచి చంపక అవివాహిత అని అర్థం చేసుకున్న వీరసింహుడు తాను ఆమెని వరించడం తప్పు కాదనుకున్నాడు. ఇక్కడినుండి పాతాళానికి దారి ఉంది కనక ఆ యుద్ధంలో సాయం చేసే రాక్షసులు వెనకపోయి తన తల్లితండ్రుల జాడ తెలుసుకోవాలని నిశ్చయించుకుని వారి వెంట కొంత దూరం వెళ్ళాడు. అంతలో వాళ్ళు అదృశ్యమయ్యేసరి కతను ఆశ్చర్యపోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 110. వ మజిలీ

### విభీషణుడి కథ

అయ్యో! సుడిగుండంలో పడ్డవాడిలా పదిరోజుల నుంచీ ఈ పట్నంలో తిరుగుతున్నా విభీషణుడి ఇల్లేదో తెలుసుకోలేక పోతున్నాను. చంపక ఇక నాకు కనపడదేమో ఎన్నాళ్ళు ఇలా తిరిగేది? అన్ని మేడలూ చూసినట్లే అనిపిస్తాయి. ఈ పాటికి రాక్షససేనలు యుద్ధానికి వెళ్ళిపోయే ఉంటాయి. కనపడుతున్న మేడ ప్రహస్తునిదని రాయబడి ఉంది. ఈ రాత్రి అక్కడుంటాను" అని దానిలోకి వెళ్ళాడు. ఆ శయన గృహంలో భార్యభర్తలు మాట్లాడుకోడం వీరసింహుడు విన్నాడు.

భర్త : ఈ మధ్య విద్యుజ్జిహ్వుడు మాయా బలంతో చంపక అంతఃపురానికి వెళ్ళి ఆమె చెలికత్తెను అపహరించుకు పోయాడట. అది నా తప్పు అన్నట్లు అతడిని పరాభవించకపోతే నన్ను మన్నించనని చిన్న విభీషణుడు నా మీద కోపగించాడు. వాడు ఎక్కడికో పారిపోయాడని దూతలు చెప్పారు. వాడింట్లో ఉన్న మాయలపుస్తకాలు లాక్కుని రాజవశం చేశాను. అందుకే ఆలస్యమయింది.

భార్య : పూర్వం లంకలో రక్కసుల మాయాశక్తి అంతా ఏమైంది?

భర్త : విభీషణుడి శాసనంతో ఆ విద్యలన్నీ దాచివేయబడ్డాయి. నన్ను నిద్రపోనీ. రేపు పెద్ద విభీషణుడు సభకువస్తాడు. నేను పెందరాళే వెళ్ళాలి.

ఆ సంభాషణ విన్న వీరసింహుడు పుణ్యాత్ముడైన విభీషణుణ్ని మర్నాడు దర్శించుకోవా లనుకున్నాడు.

అతను ప్రహస్తుని వదలకుండా అతనివెంటే వెళ్ళి రాజసభ చేరుకున్నాడు. ఆ సభ పౌరులతోనూ, మంత్రి, సామంత, పురోహిత,

స్త్రీ, బాల, వృద్ధ రాక్షసులతోనూ కిక్కిరిసి నిలబడడానికి కూడా చోటు లేకపోడంతో రాజసింహాసనానికి దగ్గరగా మంటప స్థంబాని కానుకుని నిలబడి ఆ సభలోని వింతలు చూడసాగాడు.

అంతలో భేరీ మోగింది. విభీషణుడు సభలోకి ప్రవేశించాడు. సభాసదులు విజయధ్వానాలతో చప్పట్లు కొట్టారు. వీరసింహుడు ఆ పరమ భాగవతోత్తముణ్ని చూసి - కృతార్థుడి నయ్యాననుకున్నాడు. విభీషణుడు శ్రీరామమంత్రం జపిస్తూ రామనామప్రభావాన్ని పద్యాలలో సభ్యులకు వివరించాడు. "రాక్షసులను రామమంత్రం జపించేటట్లు చూస్తున్నారా? సాధువులకు బాధ కలగకుండా కాపాడుతున్నారా? పాతాళంలోని రాక్షసులను అదుపులో ఉంచుతున్నారా? మాయాగ్రంథాలు ఎవరూ చదవకుండా దాచారా?" అంటూ అడిగాడు.

అప్పుడు ప్రహస్తుడు లేచి పరిస్థితిని చెప్పి - "సముద్రమధ్యంలో గృహంలో నివసిస్తూ జీవహింస చేసే జ్వాలాముఖిని విక్రమాదిత్యుని మనవడు విజయభాస్కరుడు చంపగా ఆ గృహాన్ని మనవశం చేసుకున్నాం" అని చెప్పాడు. విభీషణుడు ఆ దుర్మార్గురాలు చంపబడినందుకు చాలా సంతోషించి విక్రమార్కుని మనవడిని చాలా ప్రశంసించాడు.

"దేవా! ఆ రహస్యగృహాన్ని మనభటులు కాపలా కాస్తూనే ఉన్నారు. జ్వాలాముఖి సోదరుడు రక్తాక్షుడు గర్భవతి అయిన ఒక యువతిని ఆమె భర్తతో తీసుకొచ్చి అందులో దాచాడట. కింకరులు ఆ వార్త చెప్పగా యువరాజు గారు ఆ రాక్షసుణ్ని తీసుకు రమ్మని భటులని పంపారు. వాడు బెదిరి ఆ పురుషుని ఎత్తుకుని ఎక్కడికోపోయాడు. అంతలో ఆ స్త్రీ మగశిశువుని ప్రసవించింది. అది విని - నెలదాటగానే ఆ మాత శిశువులను ఇక్కడికి తీసుకురమ్మని, ఉపచారాలకు కొందరు పరిచారికలను నియమించాం. ఆలోపలే ఆ రాక్షసుడు మళ్ళీ వచ్చి మాతా శిశువులని ఎత్తుకుని, భటులు వెంటతరుముతూండగా పాతాళానికి పోతూంటే నగరం పైభాగంలో మనవాళ్ళు పట్టుకున్నారు. కాని, వాడు ఆ మాతా శిశువులను కిందకి పడేశాడు. వారు చనిపోయారు. వాడిని

పట్టుకుని మన నగరానికి తీసుకొస్తూంటే ఎలాగో తప్పించుకుని పారిపోయాడు. అంటూ ప్రహస్తు డా కథ చెప్పాడు.

విభీషణుడు చాలా విచారిస్తూ – మనవడితో – “నువ్వెందుకు ఊరుకున్నావు? ఇదా నీ పాలన? ఆ మాతాశిశువులనిలా ఆ రక్తాక్షుడు మరెందరిని చంపుతాడో! నువ్వు వాడినెందుకు వెదికి చంపలేదు! పాతాళంలో రాక్షసులు మన ఆజ్ఞలు ధిక్కరిస్తున్నారా?” అని ఆక్షేపించాడు. బాల విభీషణు డేదో చెప్పబోయేంతలో – ప్రహస్తుడు – “దేవా! ఏలినవారు వృద్ధులవడం, లంకరాక్షసులు మాయాబలం లేనివారవడంతో రసాతలం లోని దానవులు మన ఆజ్ఞలను మన్నించడంలేదు. తలాతలం కవచంలా వారిని కాపాడుతోంది” అన్నాడు.“అంతేకాదు. ఇప్పుడు మరో ఉపద్రవం వచ్చి పడింది. రసాతలాధిపతి అయిన కౌరవ్యుడికీ, ఏలాపుత్రుడికీ కన్యకమూలంగా తగవొచ్చి పెద్ద యుద్ధం జరుగుతూంది. తక్షక వంశస్థులకు అక్కడకల రాక్షసులు స్నేహితులవడంతో ఆ వంశంలోని వాడైన ఏలాపుత్రుడు వాసుకి వంశానికి చెందిన కౌరవ్యుడి కూతురు తేజోవతిని, తనకొడుకు పారిజాతుడి కిమ్మని అడిగాడు. అతను అంగీకరించక పోవడంతో రాక్షససాయంతో రాయబారం పంపాడు. కౌరవ్యుడు మన సహాయం కోరాడ అందుకు – “యుద్ధం వద్దు. సంధి చేసుకోవలసింది” అంటూ నీతులు చెబూతూ నీమనమడు పంపిన సందేశానికి ఏలాపుత్రుడు నిందిస్తూనూ, హేళన చేస్తూనూ మళ్ళీ పత్రిక పంపాడు. అని కూడా చెప్పాడు.

అది విని విభీషణుడు – “మనకి దాసుడై ఉండే ఏలాపుత్రుడికి ఇంత కొవ్వెక్కిందా! సరే. తరవాత ఏం చేశారు?” అని ప్రశ్నించాడు. “మనలంకలో ఉన్న వీరభటులందరినీ కౌరవ్యుడికి సహాయంగా పంపాం. యుద్ధం ఘోరంగా జరుగుతూందట. మనవాళ్ళు ఓడిపోయేటట్లుందని గాలివార్త తెలిసి, శాంబరీ గ్రంధాలయం తెరిపించి మాయా విద్య నేర్పించి చాలామంది రాక్షసులని పంపాం” అని చెప్పాడు.

అంతలోనే రాక్షస వీరుల హాహాకారాలు వినపడ్డాయి. రాక్షసులు పరాజితులై పాతాళంనుంచి పారిపోయి వస్తున్నారని వార్త

వ్యాపించింది. కొద్ది సేపట్లోనే రాక్షసబలాలతో ఆ ప్రదేశం నిండిపోయింది. సేనాధిపతి దుర్దముడు దీనవదనంతో రాజుకి నమస్కరించాడు. రాజు యుద్ధంగురించి అడగగా -

"దేవా! బలాలతో నేను రహస్య బిలం ద్వారా రసాబలానికి వెళ్ళి కౌరవ్యుడికి తమ సందేశం అందించాను. అతనెంతో సంతోషిస్తూ తన బలంతో మమ్మల్ని కలిపి వ్యూహంగా నిలబెట్టాడు. అప్పటికి భోగవతి నగరానికి దక్షిణంగా రెండు క్రోసుల దూరంలో శత్రుబలాలు వ్యూహం పన్ని ఉన్నాయని తెలిసింది. ఒక్కసారిగా పట్నాన్ని ముట్టడించాలని వారి సంకల్పమట. మారాక విని వాళ్ళు బెదిరి మూడు రోజులవరకూ మీదికి రాలేకపోయారు. మేం వారిపైకి వెళ్ళి శత్రుసైన్యాలని పీనుగుపెంటలని చేశాం. వారందరినీ తరిమికోట్టి కౌరవ్యుడికి సంతోషం కలగజేశాం.

తెల్లవారేసరికి శత్రువీరుల సింహనాదాలు మాకు వినవచ్చాయి. మళ్ళీ ఉభయులకూ ఘోరమయిన పోరు మొదలయింది. శత్రుసేనలో ఒక మహావీరుడు గుర్రంమీద ఎక్కడ చూసినా తానే కనవడుతూ శస్త్రాలూ, అస్త్రాలూ వర్షిస్తూ కొంతసేపటిలోనే మమ్మల్నందరినీ పలాయనం చేయించాడు. మనలో ఒక్కడు కూడా అతన్నెదిర్కించిన వాడు లేకపోయాడు. అతను ప్రళయకాల రుద్రుడిలాగే గోచరించాడు. మేమేకాదు, ముప్పయిమూడుకోట్ల వేల్పులు వచ్చినా అతనితో యుద్ధం చేయలేరని నేను చెబితే అది అతిశయోక్తి కాదు.

శత్రుబలాలు మమ్మల్ని తరుముకుని వచ్చి భోగవతీ పురం ముట్టడించాయి. స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, నగరం వదలి అడవుల పాలవగా మేము కోటలోకి వెళ్ళి తలుపులు మూసి బురుజుల పైనుండి పోరాడాం. కాని ఆ మహావీరుడి ముందు కోటలు, అగడ్తలు ఆగుతాయా!

ఏలాపుత్రుడు కౌరవ్యుని పుత్రిక తేజోవతిని బలవంతంగా తీసుకుపోయి తన కొడుకయిన పారిజాతుడి కిచ్చి పెళ్ళి చేయడానికి నిశ్చయించి కోటలో ప్రవేశించాడు. ఏం చేయాలో తోచక మేం తేజోవతితో సహా అంతపురకాంత లందరినీ పల్లకీలమీద రహస్య ద్వారం గుండా యిక్కడికి తీసుకొచ్చాం. కౌరవ్యుడు శత్రువులకు చిక్కిపోయాడని తరవాత

వార్తలు వచ్చాయి. నాగకాంతలందరినీ ఇప్పుడే అంత:పురానికి పంపివచ్చాను" అని ఆ వృత్తాంతమంతా వివరించాడు.

విభీషణుడికి విచారం కోపం కూడా కలిగాయి. "ప్రహస్తా! శత్రువులకు చిక్కి మన మిత్రుడు కౌరవ్యుడు ఎంత చింతిస్తున్నాడో! పరులసాయం లేకుండా ఏలాపుత్రుడికి తనబలగంతో మనల్ని ఎదిరించే పరాక్రమంలేదు. ఆ వీరుడెవరో తెలుసుకోవాలి. నాగకాంతలను సురక్షితంగా తీసుకువచ్చారు కదా. మనం కౌరవ్యుణ్ని మళ్ళీ సింహాసనం మీద కూర్చో బెట్టాలి. సేనలన్నిటినీ సిద్ధం చేసి ఉంచు. ఈ రాత్రి ఇష్టదైవాన్ని ప్రార్థించి శుభాశుభ ఫలాల్ని తెలుసుకుంటాను" అని సభ చాలించాడు. అంతఃపురానికి వెళ్ళి నాగకాంతలను ఊరడించాలని అనుకున్నాడు.

అంతవరకూ చెప్పి, వేళకావడంతో తరవాత మజిలీకి బయలుదేరాడు మణిసిద్ధుడు. గోపాలుడు అతన్ని అనుసరించాడు.

# కాశీ మజిలీ కథలు

## 111. వ మజిలీ

### తేజోవతి కథ

"అమ్మా! ఊరడిల్లు. కౌరవ్యుడి కేమీ కొదవరాదు. మాతాతగారు రెండు మూడు రోజులలో వెళ్ళి ఏలాపుత్రుణ్ని పుత్రమిత్రులతో సహా చెరసాలలో పెట్టిస్తానని శపథం చేశారట. విన్నావా? మా తాత ఎదుట నిలబడగలిగిన వీరుడు ఎక్కడా లేడు. నువ్వు కంటతడి పెడితే మా గుండెలు పగిలిపోతాయి. నీ కేలోపమూ లేదు. అసలు, వారికీ మీకు తగువు ఎలా వచ్చింది? ఆ వృత్తాంతం చెప్పు" అని తేజోవతి తల్లి అయిన పద్మావతిని చంపక అడిగింది.

"అమ్మాయీ! మీ యిల్లు నాకు కొత్త కాదు. మీ తల్లీ నేనూ దగ్గర చుట్టాలం. మునుపు ఒకసా రామెతో ఈ లంకాపురానికి వచ్చాను. నన్ను ప్రాణంలాగే చూసుకుంది. మా వృత్తాంతం చెబుతాను. విను.

పాతాళలోకం భూలోకానికి అడుగున ఉంది. ఈ భూమేదానికి ఆకాశం. సూర్యుడు లేక చీకటిలో మునిగే ఆ లోకానికి వెలుగుకోసం ప్రతి సర్పానికీ శిరసుమీద రత్నం ప్రకాశించేటట్లు బ్రహ్మఏర్పాటు చేశాడు. పర్వతాలమీదా ఎత్తైన ప్రశేశాలమీదా గొప్పరత్నాలు వెలుగుతూ ఉంటాయి. కనక అక్కడ రాత్రి, పగలు అనే విచక్షణ ఉండదు. నాగకన్యలు అతి చక్కనివారు. నందనవనం లాటి వనాలు ఎన్నో ఉన్నాయి. స్వర్గవాసులకి లాగే పాతాళ లోకం వారికీ ముసిలితనమూ, రోగాలూ లేవు. భోగానికి స్వర్గం తరవాత పాతాళమే. అందుకే వారికి భోగులని పేరు వచ్చింది.

రసాతలం నాలుగు రాజ్యాలుగా విభజించబడింది. వాటిలో మా రాజ్యామే పెద్దది. నాగులలో వాసుకి వంశస్థులే సాత్వికులు. మిగిలిన

వారు రాక్షసకృత్యాలు చేస్తుంటారు. తక్షకవంశస్తులకి మాతో ఎప్పుడూ విరోధమే. వాళ్ళని పట్టించుకోకుండా నా భర్త కౌరవ్యుడు రాజ్యం చేస్తున్నాడు.

ఒకనాడు రేవతి అనే దాసి వచ్చి – "అమ్మా! మనమేడ మీదున్న హంసతూలికా తల్పం మీద ఒక స్త్రీ శిశువుతో కూడా పడుకుని ఉంది. ఎంత పిలిచినా పలకడం లేదు" అని చెప్పేసరికి నేను ఆశ్చర్యంతో వెళ్ళి చూశాను. పందిరిలేని ఆ మంచంమీద పడుకున్న ఆమె చాలా అందంగా ఉంది. శిశువు ఆమె గుండెలమీద పడుకుని పాలు తాగుగున్నాడు. ఎంత పిలిచినా ఆ బాలెంతరాలు మేలుకోలేదు.

రేవతి ఆ పిల్లవాడి నెత్తుకుని ముద్దాడుతూ – "వీడు చాలా చక్కనివాడు. నాగశిశువులాకాక మనుష్యబాలుడిలా ఉన్నాడు. మీకు ఇలాటి చక్కని కొడుకు పుట్టాలి" అంది. ఆ స్త్రీకి ఉపచారాలు చేయించగా నాలుగోనాటికి కళ్ళు తెరిచింది. ఆమెకు విశ్రాంతినీ ఆహారాన్నీ ఇచ్చి ఆమె వృత్తాంతం అడిగాను. "దేవీ! నేనొక నిర్భాగ్యురాలిని నాపేరు కళావతి అని జ్ఞాపకం. ఇక్కడికి ఎలా వచ్చానో తెలియదు. నిన్ను చూస్తుంటే పుణ్యాత్మురాలిలా అనిపిస్తున్నావు. నా పుత్రుణ్నీ, నన్నూ కాపాడిన నీ ఉపకారం ఎప్పటికీ మరవను. వీడిని మీవాడిగా భావించి పెంచుకోండి. నేను బతికినా లాభంలేదు." అందామె. "తల్లీ! విచారించకు. నువ్వూ, నీ కొడుకూ యధేచ్ఛగా ఇక్కడ ఉండవచ్చు. ఇది నీ పుట్టిల్లే అనుకో. నాకు సంతతి లేదు" అని ఆమెను ఓదార్చాను. ఆమె మాతోపాటు మా యింట్లో ఉండసాగింది.

కొద్ది కాలంలోనే నాకు ఒక కూతురు జన్మించడంతో నా భర్తకి కళావతి మీదా, ఆమె కొడుకు మీదా అనురాగం కలిగింది. మిక్కిలి చక్కదనం కలిగిన నా కూతురు తేజోవతిని చూసి నాగలోకమంతా ఆశ్చర్యపడింది. నాకూతురుకు ఐదేళ్ళు వచ్చాక కళావతి కొడుకుతో జతపరచి చదివించసాగాం. ఆ పిల్లవాడికి జయసింహుడని మేమే పేరు పెట్టాం.

కళావతికీ, జయ సింహుడికీ గాఢమైన స్నేహం. ఇద్దరూకలిసే బడికి పోయి చదువుకుని వస్తారు. జయసింహుడికి పదేళ్ళు వచ్చేసరికి బడిలోని నాగబాలురకు వాడిమీద అసూయ కలిగి – "వీడు మానవుడు. కళావతికి పుస్తకాలు మోసే కూలివాడు" అని ఆక్షేపించడం మొదలు పెట్టారు. అతను – వారిని మందలించమని ఉపాధ్యాయుల్ని కోరాడు. కాని వారు కూడా – "నువ్వు మానిసివీ, కూలివాడివీ కాక మరెవడివి?" అని ఆక్షేపించేసరికి ఆ దన్ను చూసుకుని బడి పిల్లలు మరీ ఎగతాళి చేయడం మొదలు పెట్టారు. అది సహించలేక వాడు వాళ్ళని చేతులతో కొట్టీ కర్రతో తన్నీ చిందరవందర చేశాడు. వాడి నెదుర్కోలేక వాళ్ళు పారిపోయారు.

మర్నాడు ఉపాధ్యాయుడు పిల్లలని తీసుకుని వచ్చి కౌరవ్యుడితో – "దేవా! మీ యింటిలోని దాసీపుత్రుడు బడికి వాస్తే నేను చదువు చెప్పలేను. నిన్నవాడు బడిలో పిల్లలనందరినీ చావకొట్టాడు. మీ యింట్లో తిని పిడుగులా తయారయ్యాడు. వాడినెవరూ కొట్టలేరు" అని ఫిర్యాదు చేశాడు. కౌరవ్యుడు జయసింహుణ్ని రప్పించి నిజం చెప్పమని గద్దించాడు.

అప్పుడు వాడు – "దేవా! ఇందులో నా తప్పులేదు. నిజం తేజోవతికి తెలుసు. ఆమెనాది తప్పంటే మీరేంశిక్ష వేసినా భరిస్తాను" అన్నాడు. రాజు తేజోవతిని తీసుకురమ్మని పరిచారికలను అంతఃపురానికి పంపాడు. సరిగ్గా అప్పటికి అది ఆ సంగతే నాకు చెబుతోంది. పరిచారిక రాగానే ఆమె తండ్రివద్దకు వెళ్ళింది. తండ్రి అడగ్గా ఆమె – "తండ్రీ! అందులో జయసింహుడి తప్పేమీ లేదు. ఎంత శాంతమైన సింహమయినా జూలు పట్టుకు లాగితే ఊరుకుంటుందా? మా పిల్లలూ, గురువులూ ఎప్పుడూ యితన్ని కూలివాడనీ మనిషనీ నిందిస్తూంటారు. ఆ ఆక్షేపణలు భరించలేక నిన్న వీళ్ళందరినీ తన్నాడు. అది నిజమే" అంటూ ఆ విషయమంతా చెప్పింది.

రాజు ఆమెను పదే పదే అడిగి నిజం ధ్రువపరచుకుని ఆ పిల్లలనీ, ఉపాధ్యాయులనీ మందలించి రాజు మరొక గురువుని ఏర్పాటు చేశాడు. జయసింహుడూ, తేజోవతీ సంగీతం, సాహిత్యం మొదలయిన

విద్యలను మూడు సంవత్సరాలకాలంలోనే పూర్తిగా గ్రహించారు. తేజోవతికి యౌవన చిహ్నాలు కనపడుతూంటే ఆమెను బడికి పంపడం మాని మిగిలిన విద్యలు ఇంట్లోనే నేర్పించాం.

జయసింహుడికి పాతాళలోకం ధనుర్వేదాన్ని తగిన గురువు వద్ద నేర్పించగా అతను శస్త్రాస్త్రాలలో నిపుణుడై అందరిచేతా పొగడ్తలు అందుకునేవాడు. ఒకనాడు తేజోవతి సఖులతో ఉద్యానవనంలో సంగీతం పాడుకుంటూంటే ఏలాపుత్రుని కొడుకు పారిజాతుడనే వాడు స్నేహితులతో కలసి ఎక్కడికో పోతూ ఆ గానం విని మోహపరవశుడై అక్కడ నిలబడి దీని వృత్తాంతం తెలుసుకుని ఇంటికిపోయి హంసిక అనే దాసిని తేజోవతి వద్దకు పంపాడు. ఆమె తేజోవతితో పారిజాతుడి గుణగణాలు, ధైర్య సాహసాలూ పొగిడి, "అతను నిన్ను వరించాడు. పెళ్ళి చేసుకో" అని బోధించింది. కాని తేజోవతి ఆమాటలు వినక మరొక ప్రస్తావన తెచ్చింది. రేవతి అనే సఖి తేజోవతి విముఖత గ్రహించి – "తేజోవతి ఒక సుందరుని పెళ్ళాడాలని నిశ్చయించుకుంది. కనక అతను ఈమె గురించి విరహం చెందడం సమంజసం కాదు. వెళ్ళు" అనేసరికి హంసిక చిన్నబోయి వెళ్ళి ఆ మాటలను యధాతధంగా అతనికి తెలియజేసింది.

విరహంకంటె అవమానం ఎక్కువగా బాధిస్తూండడంతో అతను ఏమీతోచక దుఃఖిస్తూంటే తండ్రికి తెలిసి అతన్ని రక్షించుకుని ఒక్కడే కొడుకవడం వల్ల ఊరడిస్తూ – "కుమారా! నువ్వు పాతాళలోక చక్రవర్తికి కొడుకువి నీకేమిటిలోటు? నీకు దుఃఖ మెందుకు?" అంటూ లాలనగా అడిగాడు.

" నా అవమానం చెబుతాను విను తండ్రీ! కౌరవ్యుడి కూతురు తేజోవతి చక్కనిదని, హంసిక వెళ్ళి తేజోవతి వద్ద నారూపం, వైభవాన్ని పొగిడినన్ను పెళ్ళాడమందట. ఇష్టంలేకపోతే ఆ మాట చెప్పేస్తే సమంజసంగా ఉండేది. కాని – ' పారిజాతుడి సిరి మాకు తెలియనిదా? ఏలాపుత్రుడి రాజ్యమెలాటిదో అదీ మాకు తెలుసు. పారిజాతుడు గుణహీనుడు, విద్యాశూన్యుడు, దరిద్రుడు, కులం తక్కువవాడు, మా రాజపుత్రికను వరించదగినవాడు కాదు. ఇలాటి అవమాన సంబంధం

తెస్తావా?" అని దాసిచేత నోటికి రాని దుర్భాషలాడించిందట. పరిచారికల చేత కొట్టించ బోయిందట. హంసిక నడగండి" అంటూ వెక్కివెక్కి ఏడవసాగాడు..

అప్పుడు ఏలాపుత్రుడు రోషంతో హంసికను రప్పించి - "ఏమే? పెద్దవాళ్ళకి చెప్పకుండా నువ్వు పోయి పిల్లనెందుకు అడిగావ్? ఆ నీచురాలేమందో చెప్పు" అని గద్దించాడు. ఆమె గజగజ వణుకుతూనే లేనిపోని మాటలెన్నో చెప్పి అతని కోపాన్ని మరింత ప్రజ్వరిల్ల జేసింది.

ఏలాపుత్రుడు మంత్రులను రప్పించి ఆ వృత్తాంతం చెప్పి కౌరవ్యుణ్ని పరాభవించే ఉపాయం చెప్పమన్నాడు. "దేవా! చిన్నతనం కొద్దీ ఆమె ఏదో అందని, మనం పెద్ద సన్నాహం చేయదగదు. కౌరవ్యుడు ఉత్తమగుణ సంపన్నుడు. మనల్ని నిందించేవాడు కాడు. వీళ్ళ మాటల్లో నిజమెంతో ముందు గ్రహించాలి. తొందర పడకూడదు. అదీకాక కౌరవ్యుడు విభీషణుడికి ప్రాణ బంధువు. మనం కౌరవ్యుడి మీదకు వెళ్తే విభీషణు డతనికి సాయం రాకమానడు. ఆ రాక్షస వీరులతో పోరడం ఎవరి తరం కాదు. కాబట్టి మంచిగానే అతనికి తెలియజేసి ఆక్షేపించ వచ్చు" అని కొందరు మంత్రులన్నారు.

కాని...శిశ్రుమారుడనే మంత్రి మాత్రం - "చాలుచాలు. రాజపుత్రుడే చెప్పాక అబద్ధముంటుందా? కౌరవ్యుడికి విభీషణుడి సాయం ఉందని మనం భయపడక్కర్లేదు. విభీషణుడు రాక్షసజాతి అంతటకీ శత్రువే! అతని పేరు చెబితే రాక్షసులకి కోపం వచ్చేలాటి పనులు చేస్తున్నాడు. అందువల్ల పాతాళంలోని రాక్షసులందరూ విభీషణుడిని వంచించే అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. వాళ్ళంతా మనకి సాయం చేస్తారు. అదీకాక లంకలోని రాక్షసులకి మాయాపాటవం లేదు. అది అతను చేసి శాసన పలితమే. కనక మనం వాళ్ళని సులభంగా జయంచ వచ్చు" అంటూ బీరాలు పలికాడు.

వేణీస్కంధు డనేమంత్రి అతని మాటలను తిరస్కరించి - "యుద్ధంవద్దు. పిల్లనివ్వమని కౌరవుడికి వార్త పంపండి. అతనివ్వనంటే

అప్పుడు కర్తవ్యం ఆలోచిద్దాం." అని నొక్కి వక్కాణించడంతో ఏలాపుత్రుడు శింశుమారుడి కా పని అప్పగించాడు. అతను వేణీస్కంధుడి సూచనల మేరకు "కౌరవ్యా! నీ వంశం పవిత్ర మయింది. కొంతదేశం నీ అధికారంలో ఉండడం వల్ల ధనధాన్యాల విషయం ఆలోచించనక్కరలేదు. విద్యా శీలాలున్నవాడివి. కనుక మాతో సంబంధం చేయడానికి అర్హుడివే. నీ కూతురు తేజోవతికి వివాహ వయస్సు వచ్చిందనీ మా పారిజాతుడిని వివాహం చేసుకోదగిందనీ తెలిసి, అంగీకరించి యీ శుభపత్రిక రాయిస్తున్నాం. అనుకూలమైన ప్రత్యుత్తరం పంపగలవు–" అని రాయించి పంపాడు.

అది అందుకుని చదివిన కౌరవ్యుడు నా దగ్గరకు వచ్చి – "ఏలాపుత్రుడు స్వాతిశయం ప్రకటిస్తూ ఎంత గర్వంగా రాశాడో చూశావా! ఎంత కావరం! పిల్లనడగక గర్వపు మాటలెందుకు?" అంటూ జాబుని నేలపారేసి – "నీ శుభలేఖని చూసి చాలా సంతోషించాను. నీతో సంబంధం చేయడానికి నాకు కల అర్హతను పండితుల ద్వారా తెలుసు కోవాలి. అంతవరకూ ఇదే ప్రత్యుత్తరం" అని జవాబు రాయించాడు. అంతకుముందు జరిగినదే మీ అతనికి తెలియదు.

ఇలాగ ఉత్తర ప్రత్యుత్తరాలతో ఆరుమాసాలు గడిచాయి. గూఢచారులు ఒకనాడు వచ్చి ఏలాపుత్రుడి సభలో జరిగిన చర్చ అంతా మాకు తెలియజేశారు. అప్పుడు నేను రేవతిని పిలిచి – "పారిజాతు డెప్పుడో తనని పెళ్ళాడమని తేజోవతిని కోరగా అవమాన పరిచారట. ఎందుకు?" అని అడిగాను. ఆమె జరిగినదంతా చెప్పింది. "అమ్మాయి ఎవరిని వరించింది? మేమెరుగమే" అని ప్రశ్నించాను. అది భయపడింది. నేనెక్కువగా ఒత్తిడి చేయడంతో – "తల్లీ! మనయింట పెరుగుతున్న జయసింహుణ్ని త్రికరణ శుద్ధిగా వరించింది. మరొకరిని పెళ్ళాడదు. సిగ్గుపడి మీకు చెప్పలేదు" అంది.

మాకు కూడా లోలోపల అదే అభిప్రాయం ఉండడంవల్ల సంతోషించినా ఆ మాట బయటకు చెప్పక నేను అదంతా నా భర్తకి చెప్పాను. ఆయన చిరునవ్వుతో – "తేజోవతి అభిలాష యుక్తంగా ఉంది.

నీ యిష్టం ప్రకారమే చేద్దాం. కాని అతని కులశీలాలను గట్టిగా నిర్బంధించి అతని తల్లి నుంచి తెలుసుకో. అన్నట్లు వాడీ మధ్య కనపడడంలేదు. ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"ఔను. కొన్ని నెలలనుండి నాకూ వాడి జాడ తెలియదు. తెలుసుకోండి" అన్నాను. వారు అప్పుడే పరిజనులని పాఠశాలకి పంపారు. నాలుగు నెలలనుండి వాడు పాఠశాలకి రావడం లేదట. ఎంత వెదికినా ఎక్కడా కనపడలేదని చెప్పారు. తల్లికి చెబితే శోకిస్తుందని ఆమెకి చెప్పకుండా వెదికించసాగాం. ఇంతలో "తేజోవతిని తీసుకొచ్చి పారిజాతుడి పాదాలమీద పడవేసి శరణు కోరాలి. ఇందుకు పదిరోజులు గడువిచ్చాం. లేకపోతే పదకొండవ రోజున చతురంగ బలాల తోటి మీ పురంమీదపడి మిమ్మల్ని పరాభవించి మీ పుత్రికని తీసుకుపోతాం" అని అని వాళ్ళు మా మీద యుద్ధం ప్రకటించారు.

దానికి - శత్రువులకు జవాబు పంపక యుద్ధానికి సిద్ధపడి నా భర్త నీ తండ్రికి తెలిపి సాయంకోరాడు. రాక్షసబలాలు అపారంగా మా పురం చేరాయి. మొదట మన వారే గెలిచారు. ఎవడో మహావీరుడు వారికి సాయం వచ్చాడని తెలిసింది. వాడి సహాయంతో కోటముట్టడించి శత్రువులుకోటలోకి చొరబడగా నాగకాంతలను రహస్య మార్గంలో రాక్షససేనాధిపతి ఇక్కడికి తీసుకువచ్చాడు. నాభర్తని తప్పించుకు రమ్మంటే ఒప్పుకోక అక్కడే యుద్ధం చేస్తున్నాడు.ఇదే మా వృత్తాంతం" అంది పద్మావతి.

ఆ కథవిని ఆశ్చర్యపోయి చంపక తేజోవతిని చూసి - "చెల్లీ! నువ్వు బెంగపడకు. నీ మనోహరుడైన జయసింహుడ్ని వెదికించి తెప్పించి నీకు పెళ్ళి చేస్తాను. మా తాత అంతా చేస్తారు" అని ఓదార్చింది. తేజోవతికి కన్నీరు కారుస్తూ - "అక్కా! ఈ ముప్పుకి కారణంనేనే. నేను పుట్టి ఉండకపోతే మా వాళ్ళు సుఖపడి ఉండేవారు. మా కులపెద్దఅయిన వాసుకి శిరోమణిని మాతల్లి నా చిన్నతనంలో అలంకరించింది.

సముద్రంలో ఈదుతూ పారేశాను. ఆ మణి ఉంటే మా తండ్రికి అవమానం కలగకపోను. దానిని ధరించినవారికి ఆకలి, దాహం ఉండవు.

అంతా తనకి కనపడుతుంది. తానెవరికీ కనపడరు. ఆ మణి ఉంటే పరాభవమే సంభవింపదు. నా పెళ్ళి మాటకేం, మా తండ్రిని చెరవిడిపిస్తే చాలు" అంది. "జయసింహుడి కులశీలాలు తెలుసా?" అని చంపక అడగ్గా – పద్మావతి "లేదు. ఆమెకూడా మా తోనే వచ్చింది. ఇక్కడే ఉంది. ఈ ముప్పుదాటాక తెలుసుకోవచ్చు" అంది.

వారికి కొంచెందూరంలో ఉన్న వీరసింహుడికి కొన్ని మాటలు వినపడ్డాయి. కొన్ని వినపడలేదు. తేజోవతి, చంపకలు ఒకచోట కూర్చోగా వారి సౌందర్యాన్ని బేరీజు వేయసాగాడు. 'ఇద్దరికిద్దరూ అద్భుత సౌందర్యరాశులే. పార్థిజాతుడు తేజోవతి కోసం విరహం చెదడం ఆశ్చర్యం కాదు. జయసింహుడు ఎవరో? తేజోవతి వరించింది కనక అదృష్ట వంతుడే. తేజోవతి చక్కదనంతో నాకు నిమిత్తంలేదు – చంపకనే వరిస్తాను. చంపక నన్ను వరిస్తే నా ప్రయాణం సార్ధకమౌతుంది. పాతాళలోక మంతా కౌరవ్యుడికి పట్టంకడతాను. అదృశ్యంగా యిలా తిరగడం వల్ల ఏం లాభం? ఇక్కడ తేజోవతి, చంపక, రేవతి, చామరిక తప్ప ఎవరూ లేరు. వీళ్ళకి కనపడతాను–' అని అనుకుని ఆ మణిని గుర్తుగా ఒక గోడకొయ్యకు తగిలించి – కత్తి చేతపట్టుకుని వారి ఎదుట నిలబడ్డాడు.

అతనిని మొదట చూసిన తేజోవతి – "అదిగో జయసింహుడు–" అని కేకపెట్టింది. దాంతో మిగిలిన వారు కూడా అతన్ని చూశారు. రేవతి అతని వద్దకు పోయి – "జయసింహా! ఇక్కడికెలా వచ్చావు? నాలుగునెలలుగా కనపడడం లేదు. ఏమై పోయావు? యుద్ధంలోంచి ఎలా తప్పించుకొచ్చావు? ఇలారా. మీ తల్లి ఇక్కడే ఉంది" అంది. అతను ఆశ్చర్యపోయి – ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు.

చంపక అతన్ని ఎగాదిగా చూసి – "చెల్లీ! మంచి వాడినే వరించావు. నీ పూర్వపుణ్యం మంచిది. రాజ్యం పోయినా వీనితో ఎక్కడికేనా వెళ్ళిపోయి సుఖపడవచ్చు. ఇతనికి మాయలు కూడా తెలుసా? అంతఃపురంలోకి ఎలా వచ్చాడు? కావలివాళ్ళు రానివ్వరు కదా.

చామరికా! సువ్రతనికి ఆతిధ్యం ఇవ్వు. అతిధి పూజనీయుడు" అనే సరికి చామరిక అతను కూర్చుందుకు పీఠంవేసి బలవంతంగా కూర్చోబెట్టింది.

చంపక - సిగ్గుతో మాట్లాడలేకపోతున్న తేజోవతితో - "చెల్లీ! నీకు సహాధ్యాయుడే కదా. పెళ్ళయ్యాక సిగ్గుపడుదువుగానిలే. ఎలా వచ్చాడో అడుగు. మేమూ వింటాం" అని ప్రోత్సహించింది. తేజోవతి - "జయసింహా! మమ్మల్ని వదిలి ఎక్కడికి వెళ్ళిపోయావు? మేము ఆపదలో ఉంటే చూడడానికి వచ్చావా! నీ పరాక్రమమంతా ఎక్కడ దాచావు? ఇంత నిర్దయుడి వయ్యావేం?" అంటూ దుఃఖించింది.

అందు కతను - "నేను జయసింహుడినో, వీరసింహుడినో... ఎవరైతే ఏం? మీ ఆపద తొలగిస్తానని శపథం చేస్తున్నాను. పదిరోజుల్లో శత్రువులందరినీ తరిమివేసి పాతాళమంతా ఏకచ్ఛత్రంగా మీ తండ్రిచేత పాలించబడేలా చేయకపోతే నాపేరే మార్చుకుంటాను. అభయహస్తం యిస్తున్నాను" అన్నాడు.

తేజోవతి - 'అయ్యో! ఇతని కఠధ్వని వేరుగా ఉందే. ఇతను జయసింహుడా?, మరొకడా? మరెవడేనా అయితే ఇలాటి ప్రతిజ్ఞ పూనుతాడా?' అనుకుంటూంటే కింకరులు వచ్చి - 'విభీషణ మహారాజుగారు వస్తున్నారు. పీఠాలు సరిగా ఉంచండి" అన్నారు. వయసువల్ల కంఠస్వరం మారి ఉంటుందిలే అని మనసులో సరిపెట్టుకుంది తేజోవతి. అందరూ హడావిడి పడుతున్నారు, మహారాజుగారు వస్తున్నారని ఆ సందడిలో వీరసింహుడు లేచి తన హారాన్ని మెడలో వేసుకుని అదృశ్యుడై విభీషనుడి రాకకోసం ఎదురుచూడసాగాడు. ఎవరికి వారు తమ స్థానాల్లో ఉండి రాజుగారికోసం చూడసాగారు.

అని చెప్పి - "గోపా! వేళయింది. మనం మరో మజిలీకి బయలుదేరాలి. మిగిలిన కథ అక్కడ చెబుతాను" అన్నాడు మణిసిద్ధుడు. గోపాలుడు గురువు వెంట కావడితో బయలుదేరాడు.

# కాశీ మజిలీ కథలు

## 112. వ మజిలీ

### హరిదాసు కథ

"చామరికా! అతనితో కొంత సేపు మాట్లాడడానికి వీలుకాలేదు. అయ్యో! మా తాత అప్పుడే రావాలా? తేజోవతి నిజంగా అతన్ని వరించిందా? అతన్ని చూసినప్పటినుంచీ నా హృదయం తొణుకుతూందెమో! అతను జయసింహుడేనా? స్వరభేదం ఉందని తేజోవతి చెప్పినమాట నిజమయితే బాగుండును. నేను కూడా ఇతన్ని వరించవచ్చునా? తేజోవతి ఒప్పుకోదేమో? అది ఎంత అదృష్ట వంతురాలు!" అంటూ వెర్రిదానిలా మాట్లాడుతున్న చంపకని చూసి చామరిక నవ్వుతూ -

"వానిని చూసింది మొదలు నీమనసు మనసులో లేదు. మీ తాత వచ్చి పద్మావతితో ఏం ముచ్చటించాడో నువ్వు వినలేదు. ఆ వీరుడి వృత్తాంతం తెలుసుకు రావడానికి చారులను పంపాడట. అది తెలిశాక మీతాత స్వయంగా యుద్ధానికి వెళ్తాడట. జయసింహుడి మాట అతనికి చెప్పలేదు. ఇవాళ మీతాత యుద్ధ విషయమై ఒకసభ చేస్తాడట. దానిలో జయసింహుడి ప్రసక్తి ఏమయినా వస్తుందేమో తెలుసుకుంటాను. వెళ్ళివస్తాను." అంటూ ఆమె రాజసభకు వెళ్ళింది. అక్కడ - ప్రహస్తుడు పురికొల్పగా మర్మజ్ఞుడు అనే వేగులవాడులేచి నమస్కరించి ఇలా అన్నాడు.

"విభీషణ మహారాజా! దేవరవారి ఆజ్ఞతో మేం శత్రుదేశాల్లో తిరిగాం. పాతాళంలో ఆ విషయం అస్పష్టంగా తెలిసింది. అప్పుడు నేను కోతి రూపంలో తలాతలానికి వెళ్ళాను. బలి చక్రవర్తి కొన్ని ఏళ్ళ నుంచీ యోగంలో ఉండడంవల్ల రసాతలంలోని రాక్షసులు తలాతలానికి

నిరాటంకంగా రాకపోకలు జరిపిస్తున్నారు. బలిచక్రవర్తి భటులు ఒక్కరేనా ముఖద్వారం దగ్గరలేరు. నేను నిర్భయంగా గుమ్మందాటి లోపలికి పోయాను. తలాతలాన్ని నేనెప్పుడూ చూడక, చీకటిగా ఉంటుందంటున్నాను. కాని నాగలోకంలోని రత్నాలన్నీ దొంగిలించి రాక్షసులు తలాతలంలో దాచుకున్నారు. అందుచేత అది పాతాళం కంటే ఎక్కువ ప్రకాశిస్తూంది. దానిని వజ్రకంఠుడు పాలిస్తున్నాడు. రాక్షస కృత్యాలన్నీ అక్కడే ఉన్నాయి. దయ, సత్యం, శౌచం అనేవే లేవు. పచ్చిమాంసం తింటూ రక్తంతాగుతారు. ఆకలేస్తే తండ్రినీ బిడ్డనీ ఐనా తినేస్తారట.

అలాటి దుష్టలోకంలో ఎలాగో ఒక యోగి జీవిస్తూ ఉన్నాడు. అతనొక మంటపం మీద కూర్చుని జపం చేసుకుంటూఉంటాడు. అతని జోలి కెవరూ వెళ్ళారు. వజ్రకంఠుడు ఆ యోగి మాట శిరసావహిస్తాడు. ఆయోగికి కల భూత దయ ఎవరికీ ఉండదు. ఎన్నోసార్లు రాక్షసు లతనిని తినడానికి తీసుకుపోతే తినమని తన శరీరం ఇచ్చాడట. వేడి యినుప కమ్మిలా ఉండడంతో వాళ్ళు ముట్టుకోలేకపోయారట.

అక్కడున్న వారు ఎంత క్రూరులైనా ఆ యోగి తన స్వంత పుత్రులలాగే చూసుకుంటాడు. ఎప్పుడు ఏం తింటాడో తెలియదు. అతని మహిమ సామాన్యం కాదు.

కొన్నాళ్ళ కిందట ఒక మనుష్యకుమారుడు శరీరం కట్టబడి పట్నంలో పడున్నాడు. నరమాంసం దొరికిందని రాక్షసులు ఆనందంతో వాడిచుట్టూ మూగి కట్లు విప్పి నాదంటే నాదంటూ పెనగులాడసాగారు. అప్పటి కతనికి తెలివివొచ్చి వాళ్ళందరినీ పిడికిలితో గుద్ది పరుగెత్తించాడు. మరికొందరు కత్తులతో ఎదుర్కోగా వారి ఆయుధాలని లాక్కుని వారిని చంపేశాడు. దాంతో రాక్షసులు పులిని చూసిన మేకల్ల పరుగెత్తసాగారు. వజ్రకంఠుడు వాడి గురించి విని వాడిని పట్టి కట్టి తెమ్మని దానవ వీరుల నెందరినో పంపాడు. వాళ్ళంధరినీ ఆ వీరుడు సునాయాసంగా చంపేశాడు. అతన్ని ఓడించగలవాడు ఒక్కరూ లేకపోయాడు.

అప్పుడు వజ్రకంఠుడు యోగి పాదాలమీద పడి – "మహాత్మా! ఈ మానుష యువకుడు ఎవడో తెలియడం లేదు. మానవుడికింత బలం

ఉంటుందా? మమ్మల్ని పరాభవించడానికి విష్ణువే యిలా వచ్చాడేమో? మిమ్మల్ని శరణుజొచ్చాను. వాడి ఉపద్రవం తప్పించి మమ్మల్ని రక్షించండి? అని ప్రార్థించాడు. "దానవోత్తమా. ఆ వీరుడెవరో నాకు తెలియదు. నామాట వింటే మీకు ఉపకారం చెప్తాను అతనిని నా దగ్గరకు పంపండి" అన్నాడు యోగి.

ఆ రాక్షసరాజు ఆలోచించి కొందరు వీరులనతని మీదకు పంపాడు. వాళ్ళు అతన్ని కవ్వించి ఆ మఠం దారిన పోయారు. ఆ వీరుడు యోగిని చూసి ఆశ్చర్యపడి - ఆతనితో సంభాషించాలని, మఠంలోకి పోయి ఆయుధాల్ని నేలమీదపెట్టి సాష్టాంగ నమస్కారం చేశాడు.

ఆయోగి అతన్ని దగ్గరకు పిలిచి వీపుమీద చెయ్యివేసి దీవిస్తూ - "వత్సా! నువ్వెవరి కొడుకువి? ఇక్కడి కెలావచ్చావు? జీవహింస మహాపాపం కదా. ఊరికే యీ రాక్షసులని ఎందుకు చంపుతున్నావు? శస్త్ర విద్యఫలం అమాయకులని హతమార్చడం కాదు కదా. నువ్వు వింటానంటే మంచి మాటలు ఉపదేశిస్తాను. హింసమానెయ్" అన్నాడు. ఆ మాట లతనికి అమృతంలా అనిపించాయి.

"మహాత్మా! నీ ఉపదేశంతో ఆయుధాలు వదిలేశాను. వీళ్ళు నన్ను బాధించడం వల్ల ఇలా చేయవలసి వచ్చింది. నేనిక్కడి కెలా వచ్చానో తెలియదు. నీ తండ్రిపేరు నాకు తెలియదు. నాకు తల్లి తండ్రులు నామకరణం చెయ్యలేదు. హరిదాసు అని పిలవ బడుతున్నాను. ఇది ఏదేశం? ఈ క్రూరుల మధ్య నువ్వెలా ఉంటున్నావు? వీరి పనులు 'విపరీతమైనవి. వీరిపైన నువ్వెలా దయచూపగలుగుతున్నావో! నువ్వు ఆపకపోతే నాలుగురోజుల్లో ఈ నగరాన్ని శూన్యం చేసే వాడినే. మీ వల్ల వీరికి అభయమిస్తున్నాను. దారుణ కృత్యాలు మానెయ్యమనండి. నేను మీ దగ్గరే నివసిస్తాను" అన్నా డతను వినయంగా.

ఆ యోగి హరిదాసుని మెచ్చుకుంటూ - "ఆవులను సాధువులను చేసినట్లే దేవుడు పులుల్ని క్రూరజంతువులుగా చేశాడు. అది భగవంతుని కార్యం. సహజగుణాలు మాన్పడం ఎవరితరం?" అంటూ హరిదాసుని శిష్యుడిగా చేసుకున్నాడు.

ఒకనాడు హరిదాసు లేనప్పుడు వజ్రకంఠుడు యోగి వద్దకు వచ్చి పాదాల మీదపడి – "మీ దయ వలన మేం ఇంతవరకూ సుఖంగా ఉన్నాం. ఇప్పుడు మా కొక ప్రాణ సంకటం వచ్చి పడింది. మీరు మమ్మల్ని రక్షిస్తామని అభయ మిచ్చేవరకూ మీ పాదాలను వదలను –" అని దీనంగా ప్రార్థించాడు. "అదేమిటో చెప్పు" అని యోగి అభయమిచ్చాక – వజ్రకంఠుడు, "స్వామీ! ఇప్పుడు నా బంధువులు శత్రువులతో పోరాడుతూ ఓడిపోతున్నారు. నా సహాయం కోరారు. శత్రువులు మహాబలవంతులు నేనిప్పుడు ఉపేక్షిస్తే శత్రువులు ఇక్కడికి వచ్చి నా రాజ్యం కూడా లాక్కుంటారు. మీ శిష్యుడైన హరిదాసుని పంపిస్తే వాడు వారి పీచం అణచగలడు. వాడు అసహాయశూరుడు. మీ మాట జవదాటడు" అన్నాడు.

"సరే. నేను చేయ గలిగినది చేస్తాను" అని అతన్ని పంపి – హరిదాసు తన దగ్గరకి రాగానే, " వత్సా! నువ్వు నాకొక ఉపకారం చెయ్యవలసి ఉంది. పరోపకారపారీణుడవని తలచి యీమాట చెప్పడానికి సాహసిస్తున్నాను. చెప్పేదా?" అన్నాడు. "స్వామీ! మిమ్మల్ని గురువుగా, తండ్రిగా భావించి మీ సేవ చేస్తున్నాను. మీరు నన్ను ఆజ్ఞాపించాలి కానీ ఇలా సందేహించడ మేమిటి? అగ్నిలోదూకేదా? సముద్రంలో మునిగేదా? మీరేం చెప్పినా చేయడానికి సదా సిద్ధమే." అన్నాడు హరిదాసు.

యోగి అతన్ని మెచ్చుకుని "నీకు యుద్ధమంటే పండగకదా. ఈ రాక్షసుల మిత్రులకు శత్రువుల వల్ల ఉపద్రవం వచ్చిందట. దానిని నివారించి వీరికి జయం కలిగించమనే నేను నీకు చెప్పదలుచుకున్నాను" అన్నాడు. "ఈ మాత్రానికేనా? వీరెవరూ నాకు సాయం అక్కర్లేదు. ఎవరిని జయించాలో చెప్పమనండి. ఇప్పుడే జయించి వస్తాను" అన్నాడు హరిదాసు.

యోగి వజ్రకంఠుడిని రప్పించి అతని చేతిని హరిదాసు చేతిలో ఉంచి – "ఇతన్ని నువ్వు మీతండ్రిగా భావించు. ఏం చెయ్యాలో ఇతను చెబుతాడు. ఇతనితో వెళ్ళి ధర్మవిజయం సాధించిరా." అని నియమించాడు.

వజ్రకంఠుడంటే ఇష్టంలేకపోయినా గురువాజ్ఞను మన్నిస్తూ హరిదాసు - "నీ శత్రువు లెక్కడున్నారు?" అనిఅడిగాడు.

"వీరోత్తమా! పాతాళంలో నా మిత్రులకీ, శత్రువులకీ పెద్దయుద్ధం జరుగబోతూంది. మేం మీ సహాయంతో మా మిత్రులకు విజయం కలిగిస్తాం" అన్నాడు వజ్రకంఠుడు. "పాతాళంలో మీ మిత్రు లెవరు? శత్రువు లెవరు? అని అడిగాడు హరిదాసు.

"కాకాదర చక్రవర్తులయిన తక్షక కర్కోటక కులస్థులగు ఉరగపతులు మాకు మిత్రులు ఆకులంలోని ఏలాపుత్రుడు - వాసుకి కులంవాడైన కౌరవ్యుడిపై కత్తికట్టి వారినగరం ముట్టడించడానికి ప్రయత్నిస్తున్నాడు. లంకాధిపతి అయిన విభీషణుడు వారికి బంధువు కనుక సాయానికి రాకమానడు. నీ సహాయం లేకపోతే మేం జయించలేం. మీరే సర్వ సేనాదిపతి అయి యుద్ధం నడిపించాలి" అంటూ వివరించాడు.

"కౌరవ్యుడికీ ఏలాపుత్రుడికీ విరోధం ఎందుకు కలిగింది?" అతని కంఠంలో విచారం తొంగిచూసింది. వజ్రకంఠుడు ఆ కథ చెప్పి ఇప్పుడు మనం పోయి మనవాళ్ళకి ఉత్సాహం కలిగించాలి" అన్నాడు. అది విని నిశ్చేష్టుడైన హరిదాసు అంతలోనే తేరుకుని - "పదండి - పదండి" అంటూ రాక్షస బలాలతో పాతాళానికి వచ్చాడు. ఆ వీరుడే మన వాళ్ళందరినీ పలాయనం చేయించాడు. ఆ యోగి చాలా మంచివాడు. మీరు వెళ్ళి అతన్ని ఆశ్రయిస్తే అతను హరిదాసుని యుద్ధ విముఖుడిని చేస్తాడు. అప్పుడు మనం శత్రువులని సులభంగా జయించవచ్చు.

అంతలో మరొక వేగులవాడు వచ్చి - "మహారాజా! మీ ఆనతిప్రకారం నేను గూఢాచారినై పాతాళలోకం అంతా తిరిగాను. జయసింహుడి గురించి ఆరా తీశాను. జయసింహుడిని వరించి తేజోవతి తన నవమానించిందనే కోపంతో పారిజాతుడు కొందరు రాక్షసుల సాయంతో - ఒకనాడు నిద్రపోతున్న జయసింహుణ్ని పట్టుకుని తాళ్ళతో కట్టివేసి ఒకపాడుపడిన నూతిలో పడవేసి చంపించాడని తెలిసింది. ఎంత ఘోరకృత్యం చేశాడో! అలాటి వాడిని సమూలంగా నాశనం చేసి తీరక తప్పదు" అని చెప్పి అవతలకి పోయాడు

# కాశీ మజిలీ కథలు

## 113. వ మజిలీ

### కలభాషిణి కథ

"ఆహా! నా పూర్వపుణ్యం! చంపక చామరికతో చెప్పిన మాటలు విని నేను కృతార్థుడి నయ్యాను. తేజోవతి నన్ను చూసి జయసింహుడని భ్రమపడింది. అంటే మామధ్య అన్ని పోలికలున్నాయి కాబోలు. అతను నా సోదరుడు కాడుకద? అంతభాగ్యం నాకు పడుతుందా? భగవంతుడు నన్ను ఈ లంకాపురానికి ఎందుకు తీసుకువచ్చాడో ఎవరికి తెలుసు? ఎలాగేనా నేను పాతాళలోకానికి వెళ్ళాలి. విభీషణుడు ఇవాళ రాత్రే దండయాత్ర వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. వాళ్ళతో వెళ్తాను. అంతవరకు ఎక్కడో ఉండడం దేనికి? చంపక అంతఃపురానికి పోయి వాళ్ళ మాటలు వింటూ అక్కడే ఉంటాను" అని నిశ్చయించుకుని వీరసింహుడు అంతఃపురానికి వెళ్ళాడు.

అప్పుడు అంతఃపురమంతా అల్లకల్లోలంగా ఉంది. "హా! జయసింహా! పురుషసింహా! నీకీ మృత్యువు ఎలా సంభవించింది? పారిజాతా! పాపాత్ముడా! వాడిని చంపించేస్తే నిన్ను వరిస్తాననుకున్నావా? నాకు వానితోడనేగతి అని నీకు తెలియదు. అమ్మా! ఇక ప్రాణాలతో పని లేదు. సఖీ! చంపకా! నా బతుకు నేటితో సరి" అంటూ తేజోవతి విలపిస్తూంది.

చంపక – "ఊరుకో. ఆ మాట నిజమో అబద్ధమో తేల్చుకోనక్కరలేదా? నిన్న మన అంతఃపురానికి వచ్చినవాడు జయసింహుడన్నావుకదా..." అంది.

"రూపం ఒకలాగే ఉంది కాని కంఠంలో బేదముంది అతను జయసింహుడు కాదు నాలుగునెలలనుండీ కనపడకపోతే ఎక్కడికో వెళ్ళాడనుకున్నాను ఆ పాపాత్ముడు వాడిని చంపినది నిజమే వాడే జీవించి ఉంటే శత్రువులని కోటదాపులకు రానిచ్చునా?" అని తేజోవతి బిగ్గరగా ఏడవసాగింది

పద్మావతి కన్నీరు పెట్టుకుంటూంది. తమరిక, రేవతి తేజోవతిని పట్టుకుని ఊరడిస్తున్నారు అంతలో లోపలినుంచి తల్లి వచ్చి – "హా. పుత్రా. విక్రమాదిత్యకుల రత్నాకరా. విజయభాస్కర పుత్రుడా! అస్తమించావా!" అంటూ గుండె బాదుకుని ఏడవసాగింది వీరసింహుడు – "అయ్యో! విధి తేజోవతి సంతోషానికి అంతరాయం కలిగించాదే! జయసింహుడి తల్లి దుఃఖం చాలా దయనీయంగా ఉంది. విక్రమాదిత్య కులం, విజయభాస్కరుడి సంతానం, అంటూ విచారిస్తూంది. నా అనుమానం తీరిపోయింది. ఈమె కలభాషిణే జయసింహుడు నా సహోదరుడే. దాని మరణవార్త నిన్నటి వేగుల వారు తెచ్చి ఉంటారు. అయ్యో! నన్ను విధి పైకెత్తినట్లే ఎత్తి కిందకి పడదోసింది నా సోదరుని చూసే బాగ్యం లేకపోయింది. ఇప్పుడు నేను నా తల్లిని ఏమని ఓదార్చేది? శత్రువులని జయించి విజయం పొందినా లాభమేమిటి?ఎవరానందిస్తారు? విధీ! నా సంతోషాన్ని ఇట్టే అంతరింపజేశావు కదా మా తల్లిని ఇంటికి తీసుకుపోవడమే మిగిలింది. ఈ రాక్షసస్త్రీల మధ్య ఊరికే శోకిస్తూంది' అనుకూంటూ, నిలవలేక, హారం దాచి ఆమె ముందుకు వెళ్ళాడు.

అతన్ని చూసి అందరూ తెల్లబోయారు ' జయసింహుడు... జయసింహుడు. ' అంటూ కొందరు కేకలు పెట్టారు. తేజోవతి – 'నిన్నటివాడే' అని ఊపేక్షించింది చంపక సఖులతో ఒక గదిలోకిపోయి కిటికీలోంచి చూడసాగింది. అక్కడ కలభాషిణి, పద్మావతి తప్ప ఎవరూ లేరు. కలభాషిణి అతన్ని చూసి అదిరిపడి "నాయినా! నువ్వేనా జయసింహుడివే? ఎలా వచ్చావు? నీ గురించి వచ్చిన వార్త అసత్యమా? తండ్రీ" – అంటూ అతన్ని కౌగలించుకుంది అప్పుడు – "తల్లీ! నేను

జయసింహుడిని కాను. వీరసింహుడిని. హేమప్రభ పుత్రుడిని. నిన్నూ మా తండ్రినీ రాక్షసుడు ఎత్తుకుపోయాడని తెలిసి దేశాలు తిరుగుతూ ఎలాగో ఈ లంకా పురానికి వచ్చాను. నా సోదరుడి మరణవార్త ఇప్పుడే విన్నాను. నిర్భాగ్యుణ్ని. వాడిని చూడలేకపోయాను. మా తండ్రి ఎక్కడున్నాడు?" అంటూ ఆమెను కౌగలించుకుని దుఃఖించాడు.

ఆ విషయం విని ఆమె అంత దుఃఖంలో కూడా ఆశ్చర్య పోయింది. "ఏమిటీ! నువ్వు హేమప్రభ కొడుకివా! మా కోసం ఇక్కడికి వచ్చావా! నిన్ను చూస్తూంటే ఎంతో ఆనందం కలుగుతూంది. మీ తండ్రి బతికే ఉన్నారు కాని ఎక్కడున్నారో తెలియదు. వత్సా! వీరసింహా! మాకోసం రాజ్యసుఖాలు వదిలి కష్టాలు పడుతూ దేశాటనం చేస్తున్నావా! సామాన్యుడు ఇక్కడికి రాలేడు. నీ శౌర్య ధైర్యాలు గొప్పవే. నీ సోదరుడు కూడా అలాటివాడే. మీరిద్దరికీ చాలా పోలికలు ఉన్నాయి." అంటూ తాను ఉజ్జయినీ పురం వదలిన నాటినుంచీ అంతవరకూ జరిగిన దంతా చెప్పింది. వేగులవాళ్ళు తెచ్చిన వార్త చెప్పి దుఃఖించింది. అప్పుడు వీరసింహుడు ఆమె కన్నీళ్ళు తుడుస్తూ → "అమ్మా! శోకించకు. నా సోదరుడు కూడా దైవ బలం కలవాడు. మరణం అకాలంలో జరగదని మా తండ్రిగారి నిశ్చయం. నూతిలో పడినా తప్పించుకోవచ్చు. అదీకాక వేగులవాళ్ళు తెచ్చే వార్తలన్నీ సత్యాలే అవవు. అమ్మా! మనకు పరమ ఉపకారి అయిన కౌరవ్యుడు శత్రువులకు చిక్కి ఆపదలో ఉన్నాడు కదా. నేనిప్పుడే పోయి అతని చెరవిడిపిస్తాను. ఏలాపుత్రుణ్ని పుత్రమిత్ర కళత్రాదులతో పరాభవిస్తానని నిన్న నీకోడలితో శపథం చేశాను. నా సోదరుడు ఎక్కడో చిక్కుపడకపోతే ఈ ఆపద వచ్చేదికాదు. విభీషణుడి బలాలతో పాతాళానికి వెళ్తాను. అనుమతించు. నా సోదరుడిని వెదికి తీసుకొస్తాను" అనేసరికి ఆమె నిట్టూర్చుతూ ఇలా అంది.

"వత్సా! నువ్వు యుద్ధానికి వెళ్ళొద్దు. మహావీరుడెవడో శత్రుపక్షంలో ఉన్నాడట. అతని నెవరూ గెలవలేరట. జయాపజయాలు దైవాధీనాలు. వంశాంకురమయిన నువ్వు ఇంటికి పోయి రాజ్యం ఏలుకో.

రాక్షసమాయలు మనుషులకి తెలియవు. విభీషణుడు కౌరవ్యుడిని వదిలిపెట్టడు. ఎలాగేనా అతనికి రాజ్యం యిప్పించక మానడు. మా గతి తరవాత చూడొచ్చు. నువ్వు కూడా చిక్కుపడడం దేనికి? జయసింహుడు బతికుంటే ఎప్పటికేనా ఇంటికి వస్తాం." అందామె దుఃఖిస్తూ. "తల్లీ! నువ్వు వీరమాతవయినా నా మీద కల వాత్సల్యంతో అలా అంటున్నావు. ఆ వీరుడేకాదు ఎదురొచ్చినా నేను గెలవగలను. నువ్వు సంశయించకుండా నన్ను దీవించి పంపు. మనకి శుభం జరిగే సూచనలు కనపడుతున్నాయి" అన్నా డతను. ఆమె ఆశీర్వదించి పంపింది.

వీరసింహుడు విభీషణుడి సేనలతో కలసి నడవసాగాడు. ఆ బలాలు దక్షిణంగా పోయి ఒక బిలంలో ప్రవేశించాయి. దానిలో కిందకి మెట్ల మీదుగా వెళ్ళగా ఆ బిలం ఒక రాయి కమ్మిలా అడ్డంగా వేయబడి ఉంది. రాక్షసులు పక్షుల్లా ఎగరగలరు కనుక ఆరాతి పలక మీంచి దుమికి పాతాళానికి పోతున్నారు. వీరసింహుడు చిట్టచివర ఉండడం వల్ల అందరూ దుమికాక అక్కడికి చేరాడు. అతని కారాతి మీంచి దూకడం వీలుపడడంలేదు. అంతలో ఎవరో వస్తున్నట్లనిపించి – "ఎవరు వారు?" అని కేకవేశాడు.

"నేను విరూపాక్షుడిని" అని జవాబు వచ్చింది. "ఇంతాలస్యం చేశావేం? నీకోసమే రాజుగారు నన్నిక్కడ నిలబెట్టారు" "అయ్యో! రాజుగారికే తెలిసి పోయిందా! ఏం చేస్తారో.." అని అతను భయపడు తూంటే – "ఏమీ చెయ్యరులే " అంటూ అతని మెడగట్టిగా పట్టుకుని వాడితో పాతాళలోకానికి ఉరికి రాక్షస బలాలను కలుసుకున్నాడు. విభీషణుడు బలిని దర్శించుకుందుకు పోయినట్లు ఎవరో చెప్పుకుంటూంటే విని తాను కూడా పోవాలని ఆప్రదేశమంతా తిరుగుతూంటే ఒకచోట – 'బలిభవనద్వారం' అని కనపడింది. అతను లోపలికి పోయాడు. అక్కడ ఎందరో వైష్ణవులు గుమ్మాన్ని కాపుకాస్తున్నారు. ఇతను తప్పించుకుపోవాలని ప్రయత్నించినా ఒక వైష్ణవు డతని చెయ్యి పట్టుకుని – "నువ్వెవడివి? ఇలా అదృశ్యంగా ఎందుకు పోతున్నావ్? అని అడిగాడు.

వీరసింహుడు భయపడుతూ "నేను విభీషణుడి పరిచారకుడిని. బలిచక్రవర్తిని చూడాలని పోతున్నాను" అని చెప్పాడు. ఆ వైష్ణవుడు నవ్వుతూ పోపొమ్మన్నాడు. ఒకటి..రెండు..అని అంకెలు వేయబడిన ద్వారాలు నాలుగుదాటి - వచ్చిన దారి, వెళ్ళవలసిన దారి తెలియక అత నాశ్చర్యపోయాడు. అది ఇంద్రలోకమా? వైకుంఠమా? అన్నట్లు ఎన్నో వింతలతో చిత్రంగా ఉంది. అతనక్కడే తిరుగుతూంటే విభీషణుడు బలిచక్రవర్తి దర్శనం చేసుకుని వొచ్చేస్తూంటే ఇక మరిలోపలికి పోక అతనితోపాటు సేనలున్న విడిదికి వచ్చేశాడు. మొదటిద్వారంలో మునపటి వైష్ణవులెవరూ మళ్ళీ కనిపించలేదు. బలిచక్రవర్తి ద్వారాన్ని మహావిష్ణువు కాచుతున్నాడని పురాణాలు చెబుతున్నాయి. నా చెయ్యి పట్టుకున్నది మహావిష్ణువే. లేకపోతే అదృశ్యుడినయిన నన్ను సామాన్యులు చూడగలరా? విష్ణువు దర్శనం ఇచ్చినా తెలుసుకోలేని మూఢుణ్ణయ్యాను. అయ్యో! ఎంత పాపాత్ముణ్ణి! - అని అతను విచారిస్తూంటే - ప్రయాణం సాగించమని ఆజ్ఞ వచ్చింది. దళాలతో కలసి అతను భోగవతీ నగర ప్రాంతంలోనికి వెళ్ళాడు.

అని చెప్పి కథ ఆపాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 114. వ మజిలీ

### భుజగాసురుల యుద్ధం

**లం**బకర్ణిక. దీర్ఘ జిహ్వికా! మన లంకకు రాజు వజ్రకంఠుడు ఔతాడట. ఈ రహస్యం విన్నావా?

*దీర్ఘజిహ్వీక*. ఎలా? విభీషణమహారాజు ఏమౌతాడు?

*లంబకర్ణిక* : వాని పని ఐందట. ఇప్పుడే నా కొడుకు దీర్ఘజంఘుడు పాతాళం నుంచి ఒక జాబు తీసుకుని వచ్చాడు. భోజనం చేశాక చంపక వద్దకు పోతాడు. విభీషణుడు ఆ యుద్ధంలో మూర్ఛపోయాడని జాబులో ఉంది. కాని అది చావే ఐవుంటుంది అంతఃపురకాంతలందరినీ పారిపోయి మానం కాపాడుకోమని రాశాడట.

*దీర్ఘజిహ్వీక* : మరి - చిన్న విభీషణుడు ఏమయ్యాడు? తక్కిన రాక్షసు లేమయ్యారు.

*లంబకర్ణిక* : ఆవివరా లేమీ లేవు. మహాబలశాలి అయిన పెద్ద విభీషణుడే చచ్చిపోయాక తక్కినవారి లెక్కేమిటి? మంచిపనే జరిగిందిలే.

*దీర్ఘజిహ్వీక*: ఔను. మన కడుపులు మాడ్చుతున్నందుకు మన ఉసురులు తగలక మానలౌయా? ఇక మనం నిరాటంకంగా మనుష్య మాంసం తినొచ్చు. మద్యం తాగొచ్చు. యధేచ్ఛగా తిరగొచ్చు. మద్యమాంసాలనే సరికే నా నాలుక నూరుగజాలు పెరిగింది. వజ్రకంఠా! రాక్షసజాతి అంతటకి ఉపకారం చేశావు కాదురా! (అంటూ గంతులు వెయ్యసాగింది)

*లంబకర్ణిక* : అయ్యో! కేకలు వెయ్యకు. ఎవరికీ చెప్పొద్దన్నాడు నా కొడుకు. రహస్యంగా ఉంచాలి. వాడికిది తెలిస్తే కోపిస్తాడు. ఆగలేక నేను నీకు చెప్పాను. నా కొడుకు లేచే వేళయింది. వస్తాను.

దీర్ఘజంఘుడు ఆ పత్రిక తీసుకుని అంతఃపురానికి అతివేగంగా వచ్చాడు. అప్పుడు చంపక - "దేవీ! నువ్వు అతనితో చాలాసేపు మాట్లాడావు. మేం చాటునుండి విన్నాం. కొన్ని మాటలు మాత్రం వినపడలేదు. అత నెవరు? ఇక్కడికి ఎలా వచ్చాడు? కులశీలాదులు రహస్యంగా ఉంచానని అతనికి చెప్పావు. ఇప్పుడు మాకు చెప్పక తప్పదు-" అని అంటే...కలభాషిణి - "ఇతను జయసింహుడు కాదు. వీరసింహుడు. విక్రమార్కుడి కీర్తి మీరు వినే వుంటారు. అతని మనవడు విజయభాస్కరుడికి ఇద్దరు భార్యలం. పెద్దది హేమప్రభ. ఆమె కొడుకు వీడు. మీకా వృత్తాంతం తెలిసే వుంటుంది. రెండవ భార్యని నేను. హేమప్రభది రాక్షస వంశమే ..." అంటూ ఆమె చరిత్ర చెప్పింది. అది విని చంపకకి చాలా సంతోషం కలిగింది. కాని అదంగా మనసులో దాచుకుని చామరికతో ఏదో చెప్పింది. అప్పుడు తేజోవతి వచ్చి "యుద్ధవార్త లేమైనా తెలిసాయా? చారు లెవరైనా వచ్చారా?" అని అడుగుతూండగా -

దీర్ఘజంఘుడు ముందరకు వచ్చి నమస్కరించి.. "నేను దేవర దాసుడిని, దీర్ఘ జంఘుడిని. పాతాళం నుంచి ఇప్పుడే వస్తున్నాను. ప్రహస్తపుత్రుడు మీకీ పత్రికనిమ్మని పంపాడు" ఉంటూ ఆ ఉత్తరాన్ని అందించాడు. చంపక దానిని పుచ్చుకుని ఇలా చదివింది.

"యుద్ధక్రమం దీర్ఘజంఘుడు వివరిస్తాడు. ప్రస్తుతం మనకి అపజయం కలిగింది. వజ్రకంతుడు పారిజాతుడి ప్రోత్సాహంతో లంకాపురికి వచ్చి తేజోవతిని చెరపట్టాలని ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది. అంతఃపురకాంత లందరూ తప్పించుకుని వెళ్ళిపోడానికి సిద్ధంగా ఉండాలి. మానుంచి రెండవవార్త వచ్చేవరకూ ఇల్లు కదలవద్దు

(ఇట్లు...పాదసేవకుడు మంత్రిపుత్రుడు.)

దానిని నమ్మడాని కిష్టపడక - "దీర్ఘజంఘా! మా తాత, తండ్రి, దగ్గరచుట్టాలూ ఉండగా మంత్రిపుత్రు డెందుకీ లేఖను పంపాడు? యుద్ధ విశేషాలేమిటో చెప్పు" అంది ఆత్రంగా. వాడు - "దేవీ! విభీషణ మహారాజు చతురంగ బలాలతోనూ పాతాళలోకానికి వెళ్ళి బలిని దర్శించి భోగవతీ

నగరప్రాంతంలో వ్యూహాలు పన్ని రణ భేరి మోగించారు శత్రువులు కూడా రణభేరి మోగించారు. రెండు సైన్యాలూ కలియబడ్డాయి మీతండ్రి సర్వసేనాధిపతిగా సేనలను నడుపుతూంటే విభీషణ మహారాజు గదను ధరించి స్వల్పకాలంలోనే శత్రువులని పరుగెత్తించాడు. మనబలాలు కౌరవ్యుడి కోటను ఆక్రమించుకోబోయే సమయంలో ఒక వీరపురుషుడు గుర్రంమీదవచ్చి ప్రచండంగా పోరుసలిపాడు. ఆ వీరుడి యుద్ధరీతి ఇలాటిదని చెప్పశక్యంకాదు. రాక్షసవీరులు ప్రయోగించిన శస్త్రాలూ, అస్త్రాలూ అతని నేమీ చెయ్యలేకపోయాయి. అతను ప్రహస్తుడిని ఇట్టే కూలగొట్టేశాడు. చిన్న విభీషణుడు ముష్టాముష్టి (పిడికిలి) యుద్ధం చేయగా రెండు గడియల వరకూ సమంగా పోరాడు. వజ్రకంఠరండు మొదలైన వారు సింహనాదం చేయగా ఆ సేనాధిపతి ప్రహస్తుణ్ని నేలకు పడదోశాడు. మనవడి పాటు చూసి విభీషణుడు గదతో అతని మీదకి పోగా వారిద్దరి మధ్యా భీముడు, దుర్యోధనుల మధ్యవంటి గదా యుద్ధం చాలా సేపే జరిగింది. అప్పుడా వీరుడు దారుణమైన గద దెబ్బతో మీ తాతగారిని మూర్ఛపోయేలా కొట్టాడు. అంతటితో ఆ వీరుడు యుద్ధ విముఖుడై అవతలకి పోడం వల్ల మన సేనలక్కడ నిలబడ్డాయి. లేకపోతే యీ పాటికి లంకాపురి వచ్చేసేవే మనరాజు మూర్ఛ నుండి కోలుకునేంతలో పారిజాతుడు, వజ్రకంఠుడు. మొదలైన వారి సాయంతో లంకాపురి వచ్చి తేజోవతి మొదలయిన నాగకాంతలను చెరపట్టడానికి ప్రయత్నిస్తున్నట్లు గూఢచారులవల్ల తెలుసుకుని ప్రహస్తుడి పుత్రుడు ఈ పత్రికనిచ్చి మీ వద్దకు నన్ను పంపాడు. ఇవే యుద్ధ విశేషాలు" అని అతను ముగించాడు.

చంపక శోకంతో పరితపిస్తూ తేజోవతికి చెప్పబోతూండగా – మరొక గూఢచారివచ్చి ఒక ఉత్తరాన్ని రాజపుత్రిక కందించాడు. ఆమె తడబడుతూ దానిని ఆత్రంగా చదివింది.

"దేవీ! మీరు అంతఃపురాలు విడచి పోనక్కర్లేదు. శత్రువుల ప్రతిభ చల్లారింది. మనకి విజయసూచనలు కనిపిస్తున్నాయి. ఆ విధం అంతా శార్దూలుడు మీకు చెబుతాడు".అని ఉందా ఉత్తరంలో. ఆ విషయాలకు చాలా ఆనందించి – "శార్దూలా! మనవాళ్ళు మూర్ఛనుంచి

లేచారా? శత్రువు లెందుకు పారిపోయారు? ఆ విధానం వివరించు" అని అడిగింది.

అందు కతను "అమ్మా! మనవాళ్ళింకా మూర్ఛనుంచి లేవలేదు. ఇది మనవారి ప్రజ్ఞకాదు. మనవ్యూహానికి ఆ వీరపురుషుడు ఎలా వచ్చాడో తెలియదు. మనవాళ్ళని పిరికితనం ఆవహిస్తూంటే అతను గుర్రంమీద వచ్చి శంఖంపూరించాడు. అది విని శత్రుసేనలు పులిగర్జన విన్న మేకల్లా చిందరవందర అయిపోయాయి. మన వీరుడు సేనలను ఉత్సాహపరచి రౌద్రావేశాలతో శత్రువులను కత్తులు దూసీ, శూలాలతో పొడిచీ, బాణాలు వేసీ అతి తొందరలోనే శత్రువులని కల్లోలపరిచాడు. అతని ముందు నిలచిన వాడే లేడు. యుద్ధభూమి కాళీఅయిపోయింది. శంఖం పూరిస్తూ మనవీరుడు వాళ్ళని తరుముతూ పోయాడు. అప్పుడు మన బలాలు చేసి సింహనాదాలు మిన్ను ముట్టాయి. అవతలి వీరుడు ఇంకా యుద్ధానికి రాలేదు. పడిపోయిన మన వీరులింకా లేవలేదు. ఇంతవరకూ చూసి వచ్చాను –" అన్నాడు.

చంపక సంతోషిస్తూ – 'చారులారా! మీరు వెళ్ళండి. మళ్ళీ వేగం వచ్చి యుద్ధవిశేషాలు చెప్పండి" అంది. అప్పుడు కలభాషిణి వేపు చూస్తూ – "దేవీ! నీ పుత్రుడు అధిక పరాక్రమశాలి అని తెలుస్తూంది. రాక్షస వీరులకి రక్షకుడై పోరుతున్నాడట. మనకి విజయంకలుగుతుంది" అంటూంటే తేజోవతి వచ్చి – "అక్కా! జయసింహుడి వార్త ఏమైనా తెలిసిందా? అతను బతికే ఉన్నాడేమో తెలుసుకున్నావా?" అని అడిగింది. "అయ్యో! ఈ విజయోత్సాహంలో ఆ మాట అడగడమే మరిచాను. రేపు మళ్ళీ దూతలు వస్తారు. అడుగుతాను" అంది చంపక.

యుద్ధ వార్తలగురించి మాట్లాడుకుంటూ వాళ్ళు ఆ రాత్రి గడిపారు. మర్నాడు శార్దూలుడు రాగానే అంతఃపురకాంత లందరూ అతని చుట్టూ మూగి – "మనవీరుడు గెలిచాడా? విభీషణుడు మొదలైన వీరులు మూర్ఛనుంచి తేరుకున్నారా?" అంటూ ప్రశ్నలు అడిగారు.

అప్పుడు శార్దూలుడు "దేవీ! మనకి విజయం కలిగింది. విభీషణుడు మొదలయిన వారందరూ లేచారు. కోటమనకు స్వాధీన మయింది. మీకీ విషయం చెప్పడం కోసమే వచ్చాను" అని క్లుప్తంగా చెప్పాడు. చంపక చాలా సంతోషించి వాడికి పారితోషికం ఇస్తూ - "కోట మనకి ఎలా వశమయింది? వీరసింహుడికీ, శత్రువీరుడికీ యుద్ధం ఎలా జరిగింది? ఆ వృత్తాంతం వివరంగా చెప్పు" అని అడిగింది.

"ఆ మహావీరుడి ప్రతాపం వర్ణించడం నాతరం కాదు. మనవీరుడు విజృంభించి శత్రుసేనలని చిందర వందర చేసేసరికి శత్రువీరుడు ఏదో విచారంలో ఉన్నాడట. మన వీరుడికి జడిసి యుద్ధవిముఖు డయ్యాడని కొందరు భావించారు. వజ్రకంరుడు విభీషణుడి విజయానికి విచారిస్తూ యుద్ధం చెయ్యమని అతన్ని ఎంతగానో బతిమాలుకున్నాడు. అయినా అతను వినిపించుకోలేదు.

వజ్రకంరుడు వెంటనే తలాతలానికి వెళ్ళి యోగి పాదాలమీద పడి - "మహాత్మా! మీ శిష్యుడివలన విభీషణుని అదరగొట్టి విజయం సాధించాం. కాని...అంతలోనే శత్రుసేననుంచి ఒక వీరుడు వచ్చి మా సేనలను చెల్లాచెదరుచేశాడు. వాడిని ఎదుర్కోమని హరిదాసుని ఎంత బతిమాలుకున్నా ఆయుధం పట్టలేదు. మీరువచ్చి హరిదాసుని యుద్ధంలోకి దించకపోతే మే మందరం మరణించ వలసిందే. అంతకంటె మాకు గతిలేదు. వేగంగా వచ్చి రక్షించండి" అని ప్రార్థించాడు.

యోగి అతనితో పాతాళానికి వచ్చి హరిదాసుని దీవించి - "శత్రువులు విజృంభిస్తుంటే నువ్వెందుకు ఉపేక్షిస్తున్నావు? అది శరణాగత రక్షణకు లోపం కాదా ?" అని అడిగాడు. అప్పుడు హరిదాసు అతనికి నమస్కరించి - "శత్రువులకు భయపడికాక మరొక కారణంవల్ల యుద్ధ విముఖుడి నయ్యాను. ఇప్పుడు చూడండి" అంటూ అప్పుడే గుర్రమెక్కి యుద్ధరంగానికి పోయాడు. రెండుపక్షాలకీ ఘోరమైన యుద్ధం జరిగింది. దానిలో మనవీరుడు అవతలి వీరుడితో తలపడి విచిత్రమైన యుద్ధం చేశాడు. మూడు రోజులపాటు ఏకరీతిగా పోరాడినా వాళ్ళలో ఎవరికీ

జయాపజయాలు కలగలేదు. అప్పుడు వారు తమ పెద్దలను స్మరించి ఒకరిపై ఒకరు ఆయుధాలు ప్రయోగించగా ఇద్దరూ మూర్ఛపోయారు. వారిని తమవారు నిరపాయకరమయిన స్థలానికి తరలించారు.

అప్పుడు మన మహారాజుగారు శంఖం పూరించి సేనలకు ఉత్సాహం కలగజేసి, అవలీలగా శత్రువులని పార దోలి కోటను కైవసం చేసుకున్నారు. మనవాళ్ళు అందులో ప్రవేశించారు. మీకు ఈ విజయం చెప్పి మిమ్మల నందరినీ అక్కడికి తీసుకురమ్మని నన్ను పంపారు" అంటూ వివరంగా చెప్పాడు.

చంపక హృదయం తల్లడిల్లుతూంటే – "శార్దూలా! మనవీరుడు మూర్ఛనుంచి లేస్తాడా? ఎక్కడ ఉంచారు? అయ్యో! పాపం అతను చేసిన ఉపకారాన్ని మనవాళ్ళు తలుచుకుంటున్నారా?" అంటూ పదే పదే అడిగింది. తేజోవతి – "జయసింహుడి వార్త ఏమైనా తెలిసిందా?" అని అడిగింది.

"అమ్మా! నేను వచ్చేసరికి ఆ వీరుడు మూర్ఛలేవలేదు. అతని ఉపకారం గురించి మనవాళ్ళు చాలా మెచ్చుకుంటున్నారు. బతుకుతాడనే ఆశతోనే తగిన ఉపచారాలు చేస్తున్నారు. జయసింహుడి విషయం నాకు తెలియదు. మీరు అక్కడికి వచ్చాక అన్నీ తెలుస్తాయి. రండి, రండి" అంటూ తొందరపెట్టి వారిని రథం ఎక్కించి పాతాళానికి తీసుకు పోయాడు.

అని చెప్పి మణిసిద్ధుడు వేళ మించుతూందని మిగిలిన కథను పై మజిలీలో చెబుతానన్నాడు.

# కాశీ మజిలీ కథలు

## 115. వ మజిలీ

### మహాయోగి కథ

"మహారాజా! మీ శాసనం ప్రకారం వజ్రదంష్ట్రుడు మొదలయిన రాక్షసవీరులని బంధించి లంకాపురంలోని చెరసాలకు పంపాను. ఏలాపుత్రుణ్ణి పుత్ర, మిత్ర, మంత్రి సమేతంగా ఇక్కడ బందీగృహంలో పెట్టించాను. రాక్షసులు పరాయి నాగకాంతల జోలికి పోకుండా కాపాడాను. తలాతలం కూడా మనవశం అయింది. కౌరవ్యుడికి పాతాళలోకరాజ్యం పట్టంకట్టవలసి ఉంది. మనకి మహోపకారం చేసిన వీరుడు ఇంకా మూర్ఛనుండి లేవలేదు. అతని కులశీల వివరాలు తెలియలేదు." అని ప్రహస్తుడు విభీషణుడికి నివేదించాడు. అప్పుడే ఒక గూడచారి వచ్చి నమస్కరించి దేవా. నేను సారణుడిని మీ ఆజ్ఞప్రకారం ఆ వీరయోగి చర్యలు తెలుసుకుని వచ్చాను. వినండి. ...

ఆ యోగి శత్రునగరం బయట ఉద్యానవనంలో నివసిస్తూ... హరిదాసు మూర్ఛకీ, వజ్రకంఠుడు మొదలయిన రాక్షసుల పరాభవానికీ చాలా చింతిస్తూ – శరణాగతులయిన నాగులు, రాక్షసులు చుట్టుముట్టగా హరిదాసు వద్దకు నిద్రపోతున్న సింహంలో ఉన్న అతన్ని చూసి పామరుడిలా దుఃఖిస్తూ – "అయ్యో! ఈ మహావీరుడెవరో ఎరుగను. తలాతలానికి వచ్చాకే పరిచయం అయ్యాడు. నాపై అకారణంగా అతనికి గురుభావం కలిగింది ఈ యుద్ధం అతనికి ఇష్టం లేకపోయినా నా మాట మన్నించి చేశాడు. ఇలాటి పరోపకార పారీణుడికి నా ఆయువు ఇచ్చేనా బతికించాలి. లేకపోతే హత్యాపాతకం నాకు చుట్టుకుంటుంది" అంటూ అతను ప్రతిజ్ఞ చేస్తున్నట్లే వీరుడు మూర్ఛనుంచి తేరుకోవా

లన్నాడు. అంతే ... ఆ వీరుడు నిద్రలోంచి మేలుకున్నట్లు లేచాడు. వెంటనే యోగికి నమస్కరించాడు.

అదివినగానే విభీషణుడి గుండెలు గుభేలుమన్నాయి. "అతని ముందర మనం నిలబడలేం. ఆ యోగి సత్తముడి తపోబలం వల్ల వానికి అలాటి జీవం కలిగింది. నిర్దయులకీ, దుర్మార్గులకీ ఉపకారం చేస్తున్నా డేమిటి? మనం పోయి అతన్నాశ్రయిద్దామా? మన వీరుడు లేచే ఉపాయం ఏదేనా ఉందా? ఇప్పుడు మనం ఏం చేయాలి?" అని అడిగాడు.

అందుకు ప్రహస్తుడు – "దేవా! వాడు అజేయుడు. వాడికి తగిన వాడు మనవీరుడే. యోగి వాడిని బతికించినట్లు దేవర వార వీడిని బతికించాలి. అయినా ... తరవాత వృత్తాంతం విని కర్తవ్యం ఆలోచిద్దాం" అన్నాడు. తరవాత ఏంజరిగిందో చెప్పమన్నట్లు సారణుడి వేపు చూశాడు.

"దేవా! మీ మాటల కడ్డు వాస్తే కోపిస్తారని ఆగిపోయాను. మనం తొందర పడవలసిన పనిఏమీలేదు" అని ఒక్కసారాగి ... "అలా లేచిన హరిదాసుని ఆయోగి కౌగలించుకుని – "కుమారా! మనప్రయత్నం వృధాఅయింది. మనని శరణుకోరినవారు శత్రువులకు చిక్కారు. నీతో పోరిన ఆ వీరు డెవరు?" అని అడిగాడు. హరిదాసు దీనంగా ఇలా అన్నాడు. "తండ్రీ! నేను మహాపాపాత్ముణ్ని. నాలాటి కృతఘ్నుడు ఎక్కడా ఉండడు. నా వృత్తాంతం ఎవరికీ చెప్పొద్దని మా తల్లి శాసించడం వల్ల మీకు చెప్పలేదు. ఇంక దాచిన ప్రయోజనం లేదు.

నేను విక్రమార్కుని మనవడైన విజయభాస్కరుడి కుమారుడిని. మా తల్లి పేరు కలభాషిణి. నేను గర్భంలో ఉండగా రాక్షసు డొకడు మా తల్లితండ్రులను ఎత్తుకుపోయాడు. ఏంచేశాడో తెలియదు. పుట్టిన నెలలోగానే ఎలాగో కౌరవ్యుడి ఇంటికి చేరాను. ఆ దంపతులు నన్ను పెంచి పెద్దచేశారు. తేజోవతి నన్ను వివాహం చేసుకుందుకు నిశ్చయించుకోడంవల్లనే ఈ తగవు వచ్చింది. పారిజాతుడి ప్రోత్సాహంతో నిద్రిస్తున్న నన్ను తలాతలంలో పడేశారు. అదంతా తెలిసినా మీకు మాట ఇవ్వడం వల్ల తప్పనిసరిగా యుద్ధం చేశాను. ప్రతి వీరుడు చదివిన

పద్యం వినగా అతను నాకు సోదరుడని తోచింది. సోదరవధ, మిత్రవధ నన్ను భాదింపకమానవు. విశ్వాస ఘాతకం అన్నింటికంటె పెద్దది. మహా పుణ్యాత్ముడైన విభీషణుడిని మూర్ఛిల్లజేసిన నాపాపానికి ఏదీ సరికాదు. మహాత్మా! నేను అన్నివిధాలా పతనమయ్యాను. బంధువులకూ, తేజోవతికీ వెలి అయ్యాను. ఆమె ముఖం ఎలా చూడగలను? ఇంక నాకు యుద్ధంతో పనిలేదు. మీపాదాల దగ్గర చనిపోతాను అనుమతించండి" అని వేడుకున్నాడు.

అంతవరకే చూసివచ్చాను. వాడు జయసింహుడే ఇక యుద్ధం చెయ్యడు. భయపడకండి –" అన్నాడు.

అదివిని విభీషణుడు – "ఆ! వాడు జయసింహుడా! ఎంత బలవంతుడు! ఎంత సత్యసంధుడు! ఇప్పటికి నా ప్రాణాలు కుదుట పడ్డాయి. ఎన్నో యుద్ధాలు చూశాను కాని వాడిలాటి వీరుణ్ని చూడలేదు. ఈ శుభవార్త అంతఃపురకాంతలకు చెప్పండి. మనమంతా పోయి ఆ యోగిని ప్రార్థిద్దాం. ఆయన మన వీరుడిని కూడా బతికించగలడు." అంటూ అందరినీ వెంటబెట్టుకుని ఆ ఉద్యానవనానికి వెళ్ళాడు.

అప్పటికి ఆ యోగి జయసింహుడితో ఏదో మాట్లాడుతున్నాడు. తన దర్శనం కోసం విభీషణుడు వచ్చాడని విని లేచి ఎదురువెళ్ళి నమస్కరించి స్తోత్రం చేశాడు. విభీషణుడు అతనికి నమస్కరించి. "మహాత్మా! నువ్వు అద్భుత ప్రతిభా సంపన్నుడివని నీ చరిత్రమే చెబుతూంది. నీ తపస్సు మహిమవల్లనే రాక్షసులకి విజయం కలిగింది. తపోధనుడివే! దుర్మార్గులకి ఎందుకు ఉపకారం చేశావు? నువ్వీ తలాతరానికి ఎలా వచ్చావు? నీ వృత్తాంతం వినాలని వేడుకగా ఉంది. అంతేకాక.. కౌరవ్యుడి చేత చంపబడిన మీ వీరుణ్ని బతికించినట్లే మా వీరుణ్ని బతికించవా? అంటూ వినయంగా ప్రార్థించాడు. అందుకు యోగి ఇలా చెప్పాడు. 'దానవేంద్రా! నా వృత్తాంతం ఇంతవరకూ రహస్యంగా దాచాను. కాని నీవంటి విష్ణుభక్తుడి ముందు అసత్యం ఆడకూడదు. నేను విజయ భాస్కరుడిని. విక్రమాదిత్యుని మనవడిని. ఒక రాక్షసుడు నా భార్యతో పాటు నన్నెత్తుకుని వచ్చి ఇక్కడ పెట్టాడు.

రాక్షసులు పెట్టే బాధలు సహిస్తూ కొన్నాళ్ళుండేసరికి - వారి బాధలు నన్నంటకపోడంతో వాళ్ళకి నా మీద భక్తి విశ్వాసాలు కలిగి గురువుగా తలచి పూజించ సాగారు. నేను తపస్సు చేసుకుంటున్నాను. ఒకనాడు ఈ కుమారుణ్ని బంధించి పారిజాతుడు తలాతలంలో పడవేయించాడట. రాక్షసులందరినీ చంపేస్తూంటే నా మాటవిని శాంతించి కొన్ని రోజులున్నాడు. వజ్రకంరుడి కపటం తెలియని నేను వీడిని యుద్ధానికి పొమ్మన్నాను. ఈ జయసింహుడు నా కొడుకు. కలభాషిణికి పుట్టినవాడు. మీ అనుగ్రహం వల్ల ఇలా కలుసుకున్నాం. కలభాషిణి మీ దగ్గర ఉందని విన్నాను. తనని పోషించిన వారినే పరాభవించాడని ఇతను ప్రాణత్యాగం చేసుకుంటానంటున్నాడు. ధర్మా ధర్మాల వివేచనకు మీ కంటె సమర్థులు మరెవరూ లేరు. వీడికి ప్రాయశ్చిత్తం తెలపండి."

విభీషణుడు ఆ మాటల కెంతో సంతోషించి - "ఇవాళ చాలా సుదినం. మహాపుణ్యపురుషులని చూశాను. మీ తాతగారి సాహసం వితరణ గురించి ఎన్నోసార్లు విన్నాను. జయసింహుడు సత్యసంధుడు. గురువుగారి మాటయందు గౌరవం ఉంచి తనకి ద్రోహులయిన వారి పక్షాన తన అప్తులతో పోరాడాడు. ఇలాటి సుజనుడు ఎక్కడుంటాడు? మీరూ అతనూ కౌరవ్యుడి మందిరానికి రండి" అని ప్రార్థించాడు.

జయసింహుడు సిగ్గుపడుతూ, తనని తాను ద్రోహిగా భావించుకుంటూ కౌరవ్యుడి ఇంటికి రావడాని కంగీకరింపలేదు. కాని విభీషణుడు తన వీరులందరినీ పంపి ఎలాగో రప్పించాడు.

విజయభాస్కరుడు వాని ఆకారవిశేషాలు చూసి - ఇతను హేమప్రభకొడుకా? - అని ఆలోచించసాగాడు. ఆకారాలను బట్టి వారిద్దరూ అన్నదమ్ములని చూసినవారు నిశ్చయించారు. జయసింహుడు సోదర భావంతో అతనిమీదపడి విలపించసాగాడు. అప్పుడు విభీషణుడు చెప్పగా విజయభాస్కరుడు కొడుకు శరీరాన్ని నిమురుతూ - తన వంశంలోని విక్రమార్కుడు విఖ్యాతుడైతే వీడు మూర్ఛవదలి లేవగలడు - అని పద్యం చదివాడు. దానితో వీరసింహుడు "మహావీరా! నిలబడు.."

అంటూ లేచాడు. జయసింహుడు అతన్ని కౌగలించుకుని – "అన్నా! నేను ఇక్కడే ఉన్నాను. నేను శత్రువుని కాను. మనం అన్నదమ్ములమని తెలియక పోరాడి మూర్ఛలో మునిగాం. నువ్వు చదివిన పద్యం ద్వారా నువ్వు నా సోదరుడి వని గ్రహించాను. నువ్వు హేమప్రభ కుమారుడివి అని భావిస్తున్నాం. ఇతనే మన తండ్రి విజయభాస్కరుడు. చూడు. నువ్విక్కడి కెలా వచ్చావు? నీ వృత్తాంతం చెప్పు" అన్నాడు.

వీరసింహుడు విభ్రాంతుడై – కొంతసేపటి వరకూ సంతోషం పట్టలేక – ఎలాగో తేరుకుని – తండ్రికి నమస్కరించి, కౌగలించుకుని – "విధి ఎంత విచిత్రమైనది? తేజోవతి వలన నీ వృత్తాంత మంతా విన్నాను. ఆమె నీకోసం పడిన దుఃఖానికి మేరలేదు. అలాటి వారి మీద కత్తికట్టాను! అది వీరధర్మం. పాపం, ఆ కౌరవ్యుడు కొన్నాళ్ళు శత్రువులకి లొంగి ఉన్నాడు. మన తండ్రి గారి శాంతమే ఇలాటి వింతలు కలగజేసింది. వారు తలుచుకుంటే తలాతలవాసులు విజృంబించగలరా! పైపెచ్చు వారికే ఉపకారం చేశారు. దుర్జనులకు ఉపకారం చేస్తే సజ్జనులకి పీడ కలుగుతుంది. తండ్రీ! దిక్కుమాలిన పాపులమధ్య ఒక్కడివీ ఎందుకిన్నాళ్ళు నివసించావు?" అంటూ తను పుట్టింది మొదలు అంతవరకూ జరిగిన కదంతా చెప్పాడు.

అది విని అందరూ ఆశ్చర్యపోయారు విజయభాస్కరుడు ఇద్దరు కొడుకులనీ దగ్గరకు తీసుకుని "వత్సలారా! అంతా దైవేచ్ఛ – కలభాషిణి బోధిస్తున్నా నేనప్పుడు ఆ రాక్షసుడి పీకనులిమి చంపలేదు. అందుకే ఇంత కద జరిగింది. మన పూర్వజన్మ పుణ్యంకొద్దీ విభీషణుని దర్శనం లభించింది." అంటూంటే – అప్పటికే అక్కడికి వచ్చి అతనిమాటలు వింటున్న కలభాషిణి తటాలున అతని ముందుకువచ్చి – "హా! ప్రాణేశ్వరా!" అంటూ అతని పాదాలమీద పడి దుఃఖించింది.

అత నామెని లేవనెత్తి – "విచారించకు. నీ వృత్తాంతం తెలుసుకున్నాను. దైవం ఇప్పటికి అనుకూలుడయ్యాడు. మానవదుర్లభమైన లంకాధిపతి దర్శనమయింది. పాతాళలోకం చూడగలిగాం" అంటూ ఆమెను ఊరడించాడు.

అప్పుడు విభీషణుడు – "మహారాజ పుత్రా! నేను రాక్షసులు నరులను బాధపెట్టకుండా చూడడానికి నియమించాను. వజ్రకంఠుని ప్రోత్సాహంతో సముద్ర మధ్యంలోని గృహంలో ఉన్న హేమప్రభని తీసుకు వెళ్ళడానికి రక్తాక్షుడు వెళ్ళి అక్కడామె లేకపోవడంతో నువ్వు తీసుకుపోయినట్లు తెలుసుకుని తనదూతలైన దీర్ఘదంతుడినీ, శూలనఖుడినీ – నిన్ను బంధించి తీసుకురమ్మని నీమీదకు పంపాడట. నీ ద్వార పాలకుడైన బేతాళుడు వారిద్దరూ కోటలో ప్రవేశిస్తూంటే పట్టుకుని దీర్ఘదంతుని దంతం పెరికి, శూలనఖుని చేతులు విరిచి, వారిని గిరగిరతిప్పి విసిరేశాడట. వాళ్ళ పరాభవం చూసి, బేతాళుడికి భయపడి, రక్తాక్షుడు బ్రాహ్మణవేషంతో – కోటలోకి రాకుండా నిన్ను మాయచేసి తీసుకు వెళ్ళాడు. ఆ కథ మొన్ననే నాకు మా దూతలు నివేదించారు.

హేమప్రభ రాక్షసవంశంలోనే పుట్టింది కనక మాకు బంధువు. హేమప్రభ పుత్రుడు మాకు సాయపడ్డాడు. నీ ఇద్దరు కొడుకులతోనూ వచ్చి మా లంకాపట్నం పాలించు. నేను పెద్ద వాడినైపోయాను. ఉన్నవారి పాలన సక్రమంగా లేకనే మీకీ బాధ కలిగింది" అంటూంటే –

కౌరవ్యుడు బంధువులతో వచ్చి విజయభాస్కరుడి పాదాలమీద పడ్డాడు. "ఆర్యా! నీభార్య, పుత్రుడు మా యింట నివసించి మమ్మల్ని కృతార్థులని చేశారు. తెలియక వారిని ఏమేనా న్యూనత పరిస్తే క్షమించగోరుతున్నాను. నువ్వయినా మన చుట్టరికం తెలియక ఏలాపుత్రుడికి సాయంచేశావు. నీకుమారుడికి తెలిసినా ధర్మం కోసం పోరాడాడు. మునుపు బభ్రువాహనుడు తండ్రితో పోరాడలేదా? అది వీరధర్మం. మీ పుత్రుడు సిగ్గుపడుతున్నట్లు తెలిసింది. కాని అతను చేసింది వానికీర్తికి మెరుగుపెడుతోంది. మా తేజోవతి వానిని వరించింది. కనక పాతాళలోక రాజ్యంతోపాటు మా పిల్లని కూడా పరిగ్రహించేందుకు నీ పుత్రుడు తగి ఉన్నాడు" అని కోరాడు.

అప్పుడు విజయబాస్కరుడు కౌరవ్యుడిని ఎంతగానో ప్రశంసిస్తూ – "తండ్రీ! నీ వల్లనే నా భార్యాపుత్రులు బతికారు. నీ ఉపకారం ఎప్పటికీ

మరవ దగినది కాదు. యావజ్జీవం నీకు కృతజ్ఞుడినై ఉంటాను. నీకు నేను చేసిన ఉపకారం మరచిపో" అని ప్రార్థించాడు.

కౌరవ్యుడు వారందర్నీ వాహనాలమీద తన రాజ్యానికి తీసుకు వెళ్ళాడు. పద్మావతి - వీరసింహ, జయసింహులని తీసుకు రమ్మని పరిచారకులను పంపింది. అంతఃపురానికి రావడానికి జయసింహుడు సిగ్గుపడుతూంటే - "అన్నా. సందేహిస్తావేమిటి? పోదాం రా, ఆమె నిన్ను పెంచింది కదా. తేజోవతి నీకు సహాధ్యాయిని పద పద" అంటూ తీసుకు వెళ్ళాడు.

అంతఃపురం వింతగా అలంకరించబడి ఉంది. నాగకాంతలు వారిని రత్నపీఠాలమీద కూర్చోబెట్టి మంగళహారతులిచ్చారు. అప్పుడు తేజోవతి పూలదండపట్టుకుని మెల్లగా నడచివచ్చి - "అమ్మా! ఇతనేనా మన జయసింహుడు? వీరి పరాక్రమమే కదా మనందరిని లంకాపురం తీసుకువెళ్ళింది? అందుకు వీరికి ఏదేనా కానుక ఇవ్వాలి కదా? ఇదుగో దీనితో పాటు నా హృదయాన్ని కూడా అర్పిస్తున్నాను" అంటూ పరిహాసం ఆడుతూ మెడలో దండవేసింది. అతను సిగ్గుపడుతూ - "ఔను నేను చేసింది తప్పే. మీ యింట్లో తిని మీకే అపకారం చేశాను. నా అపరాధం క్షమించు" అంటూ పద్మావతి పాదాలమీద పడి నమస్కరించాడు.

ఆమె అతన్ని పట్టుకుని - "బాబూ! తేజోవతి నిన్ను పరిహాసం ఆడింది. అందుకు జవాబు చెప్పాలికాని విచారిస్తావేం? నువ్వు చేసిన దానిని అందరూ మెచ్చుకుంటున్నారు. సంతోషంతోనే తేజోవతి అలా అంటూంది. నువ్వు కూడా ఈ దండ ఆమె మెడలో వెయ్యి" అంటూ పూలదండ అందించింది.

"తేజోవతీ! తప్పు చేశాను. ఇదే క్షమార్పణ" అంటూ అతనాదండని ఆమె మెడలో వేశాడు. అక్కడున్న నాగకాంతలందరు వారిమీద పూలవర్షం కురిపించారు.

అప్పుడు చామరికలేచి - "ఈ జయసింహుడు మనల్నీ భయపెట్టినా తేజోవతి హృదయం అర్పించింది. కాని అభయం ఇచ్చిన ఈ వీరసింహుడి నెలా పూజించాలో తెలియడం లేదు. తండ్రి, తాతలకు ఉపకారం చేసిన వీనిని అర్చించడానికి రాక్షసరాజు పుత్రిక అయిన చంపక ఆమోదిస్తూంది" అంటూ ఆమెను నియోగించింది.

చంపక లేచి పుష్పమాలతో వీరసింహుని దగ్గరకు పోయి - "అదృశ్యుడివై మా అంతఃపురానికి వచ్చి మా హృదయాన్ని హరించిన చోరుడివి. నిన్ను బంధించవలసిందే. కాని...మా పక్షం వహించి యుద్ధంచేసి మాకు విజయం కలగచేశావు కనక కానుకగా ఈ దండ వేస్తున్నాను. నా మనసు ఇదివరకే నీ అధీనమయింది" అంటూ అతని మెడలో దండవేసింది. అతను మరొక దండని ఆమెమెడలో వేశాడు. స్త్రీలు పూలు జల్లారు.

మర్నాడు విభీషణుడు ఏలాపుత్రుణ్ని అతని కొడుకుతో సహా రప్పించి - అతను చేసిన తప్పులన్నీ నిరూపించి, రాజ్యార్హుడు కాదంటూ...కొన్ని గ్రామాలు మాత్రం ఇచ్చి నాగరాజ్యాని కంతటికీ కౌరవ్యుడినే పట్టభద్రుడిని చేశాడు.

కౌరవ్యుడు లంకాధిపతి అనుమతి పొంది శుభముహూర్తంలో తేజోవతిని జయసింహుడికిచ్చి వివాహం చేశాడు. పదిరోజులపాటు పాతాళవిశేషాలు చూశాక విభీషణుడు వారందరినీ సగౌరవంగా లంకాపురికి తీసుకువెళ్ళి మహా వైభవంతో చంపకను వీరసింహుడి కిచ్చి వివాహంచేశాడు. కొన్ని రోజులు వారు ఆనందంగా గడిపారు.

చేపవలన తనకి లభించిన రత్నం పారిజాతుడిదని తెలుసుకుని వీరసింహుడు దానినతనిని తీసుకోమని ప్రార్థించాడు. కాని అతను అంగీకరించలేదు.

విజయభాస్కరుడికి తనదేశం వెళ్ళాలని ఉందని గ్రహించి విభీషణుడు విమాన శాలనుంచి ఒక విమానం తెప్పించి అమూల్యమైన మణులూ, రత్నాలూ ఎన్నో ఇచ్చి తేజోవతి, చంపకలకు అరణంగా

వెయ్యిమంది దాసీలనిచ్చి, అందరినీ విమానం ఎక్కించి, కుమారుడితో తానుకూడా అందులో ప్రవేశించి స్వల్పకాలంలో ఉజ్జయినీపురం చేర్చాడు.

విజయభాస్కరుడి వృత్తాంతం విన్న పౌరులు ఆశ్చర్యంతో వచ్చి మహారాజు కుటుంబాన్ని చూడసాగారు. వియోగచింతలో మునిగి ఉన్న హేమప్రభని కౌగలించుకుని బుజ్జగించి విజయభాస్కరుడు ఆమెకూ, తల్లికీ పరమానందం కలిగచేసాడు.

అలాగ విభీషణుడు వారిని వారిస్థానాలలో వుంచి జయసింహ వీరసింహాలని అప్పుడప్పుడు వారి భార్యలతో సహా తన పట్నానికి వస్తూ వుండమని, ఒక విమానం ఇచ్చి, కొడుకుతో తన రాజ్యం చేరుకున్నాడు.

"కొండమీంచి పడినా, సముద్రంలో మునిగినా అగ్నిలో దూకినా, భయంకర సర్పాలతో ఆడినా - సమయంరానిదే మరణం రాదు" అని అర్థం వచ్చే పద్యాన్ని దేశమంతా ప్రచారం చేస్తూ వారు తన వృత్తాంతం ప్రకటించి భూమిని విజయభాస్కరుడు చాలాకాలం పాలించాడు."

అని చెప్పి - మణిసిద్ధుడు, "వత్సా! విచిత్రంగా ఉండే విజయ భాస్కరుడి చరిత్రం చదివినా, విన్నా పవిత్రులై కోరుకున్నవి పొందగలరుసుమా?" అని ముగించాడు.

గోపాలు డాకథ తలుచుకుంటూ ఎంతో సంతోషంతో కావడి ఎత్తుకుని తరువాత మజిలీకి గురువుతో బయలుదేరాడు.

# కాశీ మజిలీ కథలు

## 116. వ మజిలీ

### గురుదత్తుడి కథ

**ఆ** మజిలీలో గోపకుమారుడు పట్టణవిశేషాలు చూడడానికి వెళ్ళాడు. ఒక దేవాలయం గోడమీద ఒక పద్యం రాయబడి ఉంది. మొదటిపాదాలు కొన్ని చెరపబడినా ఉన్నవాటినే రాసుకుని అతివేగంగా అయ్యగారి దగ్గరకి పరుగెత్తుకొచ్చి – "గురువుగారూ! ఈ పద్యం వినండి. దీనిలో ఏదో కథ ఉందనిపిస్తుంది. ఎవరినడిగినా చెప్పలేకపోయారు." అంటూ.....

భూపతి చంపితిన్ మగడు భూరి భుజంగము చేత చచ్చి నే
నాపద చెంది ఉదయార్కుని పట్టణమేగి వేశ్యనై
పాపము కట్టుకొంటినట పట్టి విటత్వము పూని రాగ సం
తాపము చెంది అగ్గి షడి దగ్ధముగాక ఇటు గొల్లభామనై
ఈ పని కొప్పుకొంటి నృపతీ వగపేటికి చల్ల చెందినన్.

(పూర్వం గొల్లభామ అనే తెలుగు సినిమాలో ఈ పద్యం వినపడుతుంది. ఆ సినిమాకథకి ఆధారం ఇదే)

మణిసిద్ధుడు మణిని పూజించి దాని ప్రభావం వలన ఆశ్చర్యకరమైన ఆ కథని చెప్పసాగాడు.

సముద్ర తీరంలో కుంభీనసం అనే నగరం ఉండేది. అక్కడ రత్నాకరుడు అనే వర్తకుడు ఓడలమీద ఇతర ద్వీపాలకి వెళ్ళి వ్యాపారం చేస్తూ ఎంతో డబ్బు సంపాదించి కోటీశ్వరుడయ్యాడు. కాని అతనికి సంతానం లేదు. ఆ లోటు మాత్రం అతని సంతోషాన్నంతటినీ మింగేసేది. అతని భార్య సులక్షణ తనకు సంతానం లేనందుకు ఎంతగానో విచారించేది.

ఒకనాడు భిక్షకు వచ్చిన బ్రాహ్మణుడిని చూసి ..భిక్షవేసి - "అయ్యా మీకు పిల్ల లెందరు?" అని అడిగింది.

అతను కన్నీరు కార్చుతూ - "అమ్మా! నాకు సంతతి లేదు. మేము ఏడుగురం అన్నదమ్ములం. వారిలో నేనొక్కడినే విద్యా విహీనుడిని. లేమికంటె బిడ్డలలేమి వల్లనే నాభార్య ఎక్కువ విచారిస్తుంది. అన్నం తినదు. నిద్రపోదు. ఎప్పుడూ కంటతడే. యాత్రలకు పోదాం అంటుంది. దరిద్రులం, యాత్రల కెలావెళ్ళగలం?" అన్నాడు.

'ధనవంతులకైనా, పేదవారికైనా పుత్రానందం సమానమే' అనుకుని - "అయ్యా! మీకు తీర్థయాత్రలకు కావలసిన ద్రవ్యం నేనిస్తాను. మీరు దేశాలు తిరిగి సంతానం పొందడానికి మంత్రతంత్రా లేవైనా సంపాదించుకురండి. భూమిమీద ఎలాటి మహానుభావులేనా ఉంటారు. మీరు తిరిగి వొచ్చేవరకూ మీ భార్యని నేను పోషిస్తాను. దైవకృపవల్ల మన అభీష్టం నెరవేరిందా, మిమ్మల్ని మీ అన్నల కన్నా ధనవంతుణ్ని చేస్తాను" అని అతన్ని చెప్పించి పంపించింది.

ఆ బ్రాహ్మణుడు శుభముహూర్తంలో ఇల్లు వదిలి కాశీ రామేశ్వరం మొదలైన యాత్రలన్నీ చేసి, మహానుభావులను దర్శించి కొన్నాళ్ళకు ఇంటికి వచ్చాడు. "అమ్మా! నీ ఉపదేశంతో భూమంతా తిరిగి బదరీవనంలో ఒక అవధూతని ఆశ్రయించి మూడు సిద్ధౌషధాలు సంపాదించుకు వచ్చాను. ఇవి చాలా రహస్యమని ఆయోగి చెప్పాడు" అంటూ ఆమెను ఆశీర్వదించి ఆ మందులిచ్చి - "సిద్ధుల ఉపదేశం ఊరికేపోదు" అన్నాడు.

వాటివల్ల ఆ వైశ్యాంగనా, బ్రాహ్మణస్త్రీ ఇద్దరూ గర్భం దాల్చి పుత్రులను కన్నారు. రత్నాకరుడు తన కొడుక్కి గురుదత్తుడని పేరు పెట్టగా

బ్రాహ్మణుని పుత్రుడికి గదాధరుడని పేరు పెట్టాడు. వర్తకుడు ఆ బ్రాహ్మణుణ్ని పురోహితుడిగా ఉంచుకుని ధనవంతుణ్ని చేశాడు. గదాధరుణ్ని తనకుమారుడితో సమంగా పెంచుతూ వయసురాగానే చదవవేశాడు. కుర్రవా ళ్ళిద్దరూ కొద్దికాలంలోనే ఎన్నో విద్యలు గ్రహించారు. "బ్రాహ్మణ చదువులతో మనకి పనేమిటి? వ్యాపార రహస్యాలు నేర్చుకో" అని తండ్రి ఎంత చెప్పినా వినకుండా పదహారేళ్ళు వచ్చేసరికి గురుదత్తుడు పండితుడని ప్రసిద్ధి చెందాడు. అతనికి పిల్లనిస్తామని నిత్యం ఎందరో ధనికులు ఇంటిచుట్టూ తిరగసాగారు. రత్నాకరుడు కొడుక్కి పెళ్ళిచేసే ఉద్దేశంతో ప్రసిద్ధి చెందిన వర్తకుల పుత్రికల చిత్రఫలకాలు తెప్పించి, గదాధరుణ్ణి రప్పించి – "నీ మిత్రుడికి నచ్చిన అమ్మాయిని ఎన్నుకోమను" అన్నాడు.

అతను వాటిని పట్టుకుని గురుదత్తుడి దగ్గరకు వెళ్ళి చూపించాడు. గురుదత్తుడు మిత్రుడితో కలసి వాటిని విమర్శించి ఒక్కటి కూడా చక్కనిది కాదని ఆక్షేపిస్తూ తనకి వివాహం అక్కర్లేదని తండ్రికి తెలియజేశాడు.

అది విని వర్తకుడు పరితపిస్తూ ఒకనాడు గదాధరుణ్ణి రప్పించి – "కుమారా! లక్షలకొద్దీ కట్నంతో తమపిల్లనిస్తామని ఎందరో కోటీశ్వరులు వస్తున్నారు. నీ మిత్రుడేమో ఒక్కకన్యనీ అంగీకరింపక పెళ్ళాడ నంటున్నా డేమిటి?" అని అడిగాడు.

అందు కతను – "నువ్వు ద్రవ్యలాభమే చూస్తున్నావు కాని కన్య లక్షణాలు పరీక్షించడం లేదు. ఆ కన్యల్లో ఒక్కరూ చక్కనివారు కాదు. అందుకే అతను అలా చెప్పాడు" అన్నాడు.

*రత్నాకరుడు* : సరే. అయితే ఆ లక్షణ లేమిటో నాకు తెలియవు. కాగితం మీద రాసియిమ్మను.

*గదాధరుడు* : మీ కుమారుడు పద్మినీ జాతి కన్యను కాని పెళ్ళాడ నంటున్నాడు. అలాటి దాని నిచ్చి పెళ్ళిచెయ్యి.

*రత్నాకరుడు* : పద్మినీ జాతా! ఆ మాట నేనెప్పుడూ వినలేదు. మా జాతికీ ఆ జాతికీ సంబంధాలూ ఉన్నాయో లేదో? మీ మాటనమ్మి చేస్తే కులంవాళ్ళు వెలివేస్తారు.

*గదాధరుడు* : పద్మినీ జాతి అంటే వేరే కులం కాదు. స్త్రీ జాతిలోనే అత్యుత్తమమైంది.

*రత్నాకరుడు* : నీ మిత్రుడి అభిలాష ఇదేకదా. ఎక్కువ కానుక లిచ్చేవారి పిల్లనే పద్మినీజాతి అనిపిద్దాం.

*గదాధరుడు* : ఇత్తడిని బంగారమంటే ఎవరేనా నమ్ముతారా? పద్మినీ జాతి లక్షణాలు చెబుతాను, విను.

శ్లో॥ వక్త్రం చన్ద్రవికాసి, పఙ్కజపరీహాస క్షమే లోచనే,
వర్ణః స్వర్ణమపాకరిష్ణు, రలినీజిష్ణుః కచానాం చయః,
వక్షోజా విభకుమ్భ విభ్రమహరౌ, గుర్వీ నితమ్బ స్థలీ,
వాచాం హారి చ మార్దవం, యువతిషు స్వాభావికం మణ్డనమ్.

శ్లో॥ వ్రజతి మృదు సలీలం రాజహంసేవ తన్వీ
త్రివళి లలిత మధ్యా హంసవాణీ సువేషా,
మృదుశుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీ స్యాత్.

అంటూ శ్లోకాలు చదివాడు

*రత్నాకరుడు* : నీ మిత్రుడి కెన్ని కోరికలున్నాయి! నీ సహవాసం వల్లే ఇదంతా అనుకుంటాను. సంసార పక్షంగా వుండి స్త్రీలకు అంద మేమిటి? పద్మినీ స్త్రీలు మా కులంలో లేరు. మీ కులంలో ఉంటే నువ్వు పెళ్ళాడు.

*గదాధరుడు* : నీ కొడుకు నాకంటే చాలా శాస్త్రాలు చదివాడు. వాడికి నా ఉపదేశం అక్కర్లేదు.

*రత్నాకరుడు* : మీతో మేం మాట్లాడలేం. కులవిద్య నేర్పించక శాస్త్రాలు చదివించడం నాదే తప్పు. పుస్తకాల్లో రాసినట్లు భార్యలు ప్రవర్తించాలని కొరుకుంటున్నారు! అది జరిగేదిపనికాదు. సరే. మీకు కావలసినంత డబ్బిస్తాను. పరివారాన్నిస్తాను. దేశాటనం చేసి మీ యిష్టంవచ్చిన పద్మినీ స్త్రీలను ఎంచుకుని పెళ్ళాడి ఇంటికి తిరిగిరండి.

వాళ్ళకా కోరిక అంతకు మునుపునుంచే ఉండడంతో రత్నాకరుడి మాటకు అంగీకరించి – ఒక శుభముహూర్తంలో దేశాటనం చేయడానికి బయలుదేరారు.

వాళ్ళు ప్రతిగ్రామానికీ వెళ్ళడం, భాగ్య వంతులయిన వర్తకుల ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ ఇంటవున్న కన్యలని పరీక్షిస్తూ అందంగా ఉన్నా తెలివితేటలు లేని వారిని తిరస్కరించడం - చేయసాగారు. నచ్చినకన్య ఒక్కరూ వారికి కనపడలేదు.

ఒకనాడు వాళ్ళు ఒక గ్రామంలోని సత్రంలో బసచేశారు. వివిధ ప్రదేశాల నుంచీ వచ్చి ఉన్న వర్తకులని పలకరించి వారి వివరాలడిగారు. వాళ్ళలో ఒకడు - "అయ్యా! మాది కుంభకోణం. మేం వర్తకులం. మా యజమాని చాలా భాగ్యవంతుడు. అతను తన కుమారుడికి పెళ్ళి చేద్దామని - దుర్గానగరంలో కుముదాంగుడి కూతురు పద్మిని అనబడే చిన్నది. సౌందర్యవతీ, చతురా అని లోకులవలన విని ఆమె నడగడానికి మమ్మల్ని పంపించాడు.

మేం వెళ్ళి ఆ వైశ్య శిఖామణికి మా సందేశం తెలియ జేశాం. అతను వరుని విద్య, రూపం, గుణం గురించి అడిగాడు. మేం - "అయ్యా! మా యజమానికి ఒక్కడే బిడ్డ అవడం వల్ల గారాబంగా పెంచి విద్యలు నేర్పించలేదు. రూపం విషయానికొస్తే పురుషుడికి రూపమెందుకు? వారి సిరిసంపదలు అన్నిటికీ చాలు. నీ పుత్రిక ఇంద్రభోగాలు అనుభవిస్తుంది" అన్నాం.

అతను నవ్వుతూ తన పుత్రికను పిలిచి చెప్పగా ఆమె పెదవి విరిచి మాటాడకుండా అవతలకి వెళ్ళిపోయింది. అప్పు డతను - "అయ్యా మాకు విద్యా రూప శీలాలు ప్రధానం. సంపదను అంతగా పట్టించుకోం. మాకున్నది ఇది ఒక్కతే. మా ధనమంతా ఏం చేసుకోవాలి? మా పద్మినికి తగిన పండితునితో వివాహం చేయకపోతే నిందపడి పోమా? మా పద్మిని అభిప్రాయం కూడా అదే." అన్నాడు. మేం మరోదారిలేక ఇంటి ధారి పట్టాం -" అన్నా డతను.

వారిమాటలువిని గదాధరుడు సంతోషిస్తూ - "అయ్యా మీ రామెను చూశారా? ఆమె సౌందర్యం ఎలా ఉంది?" అని అడిగాడు.

"ఆమె పదమూడేళ్ళ వయసులో ఉంది. ఆ అందం చూసి తీరవలసిందే తప్ప వర్ణించడం కవుల తరం కూడా కాదు. మేం వెళ్ళొస్తాం" అని వాళ్ళు మాటలు పట్టుకుని వెళ్ళిపోయారు.

గదాధరుడు గురుదత్తుడితో – "తమ్ముడా! పద్మినిని కాక ఇతరులను పెళ్ళాడనన్న నీ శపదం నెరవేరేటట్లే ఉంది. వీళ్ళ మాటలు మనకి శుభం పలుకుతున్నట్లే ఉన్నాయి. ఇంక ఆలస్యం ఎందుకు? వేగంగా ఆ నగరం పోదాం పద" అన్నాడు.

"ఆమె నన్ను మాత్రం వరిస్తుందా? అది మనకంటే ఎక్కువ చదివిందేమో? ఓడిపోతే పరాభవమే. కానియ్" అంటూ బయలుదేరాడు.

దుర్గానగరంలో పద్మినిని ఎరగని వారేలేరు ఎవరి నడిగినా –"బాప్‌రే! ఆ అమ్మాయా! వయసుకు మించిన తెలివితేటలు. చక్కని రూపం" అనేవారే. కుముదాంగదుడికి రాజుగారి కొలువులో కులపరిపాటిగా వచ్చే షరాబు (డబ్బు లెక్కపెట్టే) పని ఉంది.

వాళ్ళిద్దరూ అతని ఏడంస్తుల మేడ యింటికి పోయి వీధి అరుగు మీద కూర్చుని – "షరాబుగా రున్నారా?" అని అడిగారు లోపలి నుండి వచ్చిన దాసి – "మీరు లోపలికి దయచేసి చావడిలో కూర్చోండి. మీ దేవురు, ఏం పనిమీద వచ్చారు? అని అడిగింది.

గదాధరుడు తమ గురించి చెప్పి – మేం బాటసారులం. ఈ నగరంలో కుముదాంగదుని ప్రసిద్ధి విని కులపరిపాటిగా ఇతను చూడడానికి వచ్చాడు వేరే పనేమీలేదు" అన్నాడు.

ఆ మాటలను లోపలినుంచి విన్న పద్మిని మరోపరిచారిక చేత వాళ్ళు కాళ్ళు కడుక్కుందుకు బంగారు చెంబులతో నీళ్ళు పంపించింది. వాళ్ళు చావడిలోకి వచ్చి పీఠాలమీద కూర్చున్నారు. అక్కడ ఒక సుందరమైన చిత్రాన్ని చూసి వాళ్ళు మెచ్చుకోలుగా మాట్లాడుకున్నారు. చిత్రంలోని స్త్రీ పద్మినీ జాతి స్త్రీ అని గదాధరుడన్నాడు. తనజన్మ ధన్యమైందన్నాడు గురుదత్తుడు. "ఇంతదేశం తిరిగినా ప్రత్యక్షంగా పద్మినీజాతి యువతిని చూడలేకపోయాం. కనీసం చిత్రాన్నయినా చూడగలగడం అదృష్టమే" అని అతను అంటూంటే పరిచారిక పళ్ళు తెచ్చి వారిని తినమంది. వారు అడగ్గా ఆ చిత్ర ఫలకం అమ్మాయిగారిదనీ, పేరు పద్మిని అనీ చెప్పింది. గొప్ప గొప్ప పండితులు వచ్చి ఆమెముందు ఓడిపోయి వెళ్తారని చెప్పింది. లోపలినుంచి పద్మిని – "మూర్ఖురాలా! తెలిసీ తెలియని మాటలాడకు వారిముందు" అంటూ మందలించింది.

ఆమె కంఠధ్వని మనోహరత్వానికి వాళ్ళు ఆశ్చర్యపోయాయి. గదాధరుడు పొంగిపోతూ "పద్మినీ! ఇటురావమ్మా. నీ విద్యావిశేషాలు వినే నిన్ను చూడాలనివచ్చాం. నువ్వు పండితులతో సంభాషిస్తావని విన్నాం. ఒక్కసారి మా వీనులకు విందు చెయ్యి." అన్నాడు.

" సముద్రం అంతటినీ చేతిలో ఇముడ్చుకున్న అగస్త్యమహర్షి భార్యతో, సీతాదేవి తన భర్త సముద్రానికి సేతువు కట్టాడని ప్రగల్భాలు పలికితే ఎలా ఉంటుందో – మీ ముందు నేను విద్వాంసురాలినని చెప్పుకుంటే అలాగే ఉంటుంది. మీరు మహా విద్వాంసులు. దాసీదాని మాటలు పట్టించుకోకండి. పళ్ళు తినండి. మా తండ్రి వచ్చే వేళయింది. మాట్లాడుదురుగాని" అంది పద్మిని. ప్రసంగంలో ఆమె తెచ్చిన ఉపమానాన్ని గదాధరుడు ప్రశంసించాడు.

అంతలో ఆమెకు చదువు చెప్పిన పండితుడు రాగా – "అయ్యగారూ! అక్కడ కూర్చొండి. వారు పండితులు వారితో మాట్లాడండి" అంది.

చిత్రఫలకాన్ని చూస్తున్న వారిద్దరినీ చూసి – "అయ్యా! మీరెవరు? ఏం చదువుకున్నారు? పండితులు మీరేనా?" అని అడిగాడు. గదాధరుడు సంస్కృతభాషలో ఉపన్యసించి తనవిద్యాపాటవంతో అతన్ని ఆశ్చర్యపరిచాడు. ఆ ఉపన్యాసం విని తుదా మొదలూ కానలేక తెల్లబోతున్న ఆ గురువు పక్షం వహించి గురుదత్తుడు గదాధరుడి యుక్తులను కొన్నిటిని ఖండించాడు. ఆ ప్రసంగంలోని వారిపాండిత్య విశేషాలను లోపలినుంచి వింటున్న పద్మిని ఆశ్చర్యపోతూ..కిటికీలోంచి గురుదత్తుడిని తదేక దృష్టితో చూడసాగింది. గురువు వారి విద్యాపాటవానికి ఆశ్చర్యపడి – "మీ వయసు చిన్నది. కాని మీ పాండిత్యం గొప్పది. మీదేవూరు? ఇక్కడి కెందుకొచ్చారు? మీ వివరాలు చెప్పి నాకు ఆనందం కలగ జేయండి" అని కోరాడు.

గదాధరుడు తమకథ చెప్పి ..."మా గురుదత్తుడు మీ పద్మినితో ముచ్చటించాలని వచ్చాడు. ఆమెమీ శిష్యురాలే కదా. ఒకసారి రప్పించండి. ఇద్దరు పండితులూ ఒకసారి ముచ్చటిస్తారు" అన్నారు. ఆ మాటకు గురువు చాలా సంతోషించి – పద్మినిని పిలిచి – "నేటికి నువ్వు కోరిన పండితవరుడు లభించాడు. వచ్చి ముచ్చటించు." అన్నాడు.

ఆమె గుమ్మంవద్దకు వచ్చి – "గురువరా! వారు శ్లేషకవులు. వారితో మనం ముచ్చటించగలమా?" అంటూ సిగ్గుపడింది. "మీ తండ్రి వచ్చే వేళయింది. మీరు వచ్చిన పని అతనికి చెబితే తీర్చగలడు. చిన్నదానిని, నా కేం తెలుస్తుంది? అదీకాక..మీ సహాధ్యాయులు మావారు కదా. మా ఇంట్లో భోంచేస్తారు. మీరు మా గురువుగారింట్లో భోం చెయొచ్చు" అంది వినయంగా.

కొంతసేపటికి కుముదాంగదుడు దివాణంనుంచి వచ్చాడు. రత్నాకరుణ్ని తెలిసిన వాడవడం వల్ల గురుదత్తుణ్ని ఎంతో గౌరవించాడు. గదాధరుడు పద్మిని తమకు చేసిన మర్యాదలను ఎంలగానో పొగిడాడు. ఆ రాత్రి అతను భార్యతో రహస్యంగా – "పద్మినిని అతనికి వివాహం చేద్దామా? అమ్మాయి అభిప్రాయం ఏమిటో తెలుసుకో" అన్నాడు. ఆమె – "మీ యిష్టం" అంది. అంతలో భోజనాలు చేసి ఆచార్యుడు, గదాధరుడు తిరిగివచ్చారు. కుముదాంగదుడు చావడిలోకి వచ్చి చమత్కారంగా మాట్లాడుతూ గురువుతో తన అభిప్రాయం వెల్లడించాడు.

"గురుదత్తుడు భాగ్యంలో మేటి అని లోకం ఎరిగినదే. విద్యాశీలరూపాల వల్ల మా పద్మిని అతన్ని వరించింది. అందులో ఆశ్చర్యం లేదు. ఈ వైశ్యుడికి పద్మిని ఒక్కతే సంతానం దానిని వదలి మేముండలేం. గురుదత్తుడు పద్మినిని పెళ్ళాడి ఇక్కడే ఉండి ఈ భాగ్యం అనుభవించాలని కోరిక. ఇందుకు అంగీకరించండి శుభముహూర్తం నిశ్చయిద్దాం." అన్నాడు.

ఎలాగేనా పద్మినిని పొందాలని ఆరాటపడుతున్న గురుదత్తుడి అవస్థ గ్రహించి గదాధరుడు అందుకు అంగీకరించాడు. పద్మిని వచ్చి గురుదత్తుడి మెడలో పూలదండ వేసింది. కుముదాంగదుడు చాలా సంతోషిస్తూ గదాధరుణ్ని పొగుడుతూ శుభముహూర్తం పెట్టించి రత్నాకరుడికి తెలపకుండానే పద్మినిని గురుదత్తుడికిచ్చి వివాహం జరిపించాడు.

గురుదత్తుడు మాట యిచ్చిన ప్రకారం తన ఇంటికి పోక అక్కడే ఉండి పద్మినితో కలసి సుఖంగా కాలం గడపసాగాడు.

అని చెప్పి మణిసిద్ధుడు గోపాలుణ్ని పై మజిలీకి సిద్ధం చేశాడు.

# కాశీ మజిలీ కథలు

## 117. వ మజిలీ

### సురూపుడికథ

ప్రసిద్ధి చెందినపట్నాల్లో దుర్గానగరం ఒకటి. ఆ దేశానికి రాజధాని అదే. ఆ దేశాధిపతి సురూపుడు. పట్టభద్రుడైన కొద్ది కాలానికే రూప, యౌవన, విద్యా, రాజ్యమదం నాలుగూ కలసి తలకెక్కి సప్తవ్యసనాలలో మొదటి నాలుగూ అతనికి నిత్యకృత్యాలయ్యాయి. పండితులని మమన్నించడు. మంత్రులను నిరాకరిస్తాడు. విటులను గౌరవిస్తాడు. జూదరులను ఆదరిస్తాడు. తాగుబోతులను చేరదీస్తాడు. పరస్త్రీ సంగమంలో రావణుడినే మించిపోతాడు. అందమయిన ఆడది కంటపడితే కామించక మానడు.

అతనికి గోమిని అనే దాది, కరటు డనే పరిచారకుడు స్నేహితులై అతని పనులకి సహకరిస్తారు. ఒకనాడు ఉద్యాన వనంలోని క్రీడా సౌధంలో ఉండి వెన్నెల కన్నుల పండుగ చేస్తూండగా గోమినిని రప్పించాడు.

"గోమినీ! నువ్వు నిత్యమూ కొత్త కొత్త స్త్రీలను తీసుకు వస్తూ నాకు ఉత్సాహం కలుగజేస్తూంటావు. ఇవాళ పడుతున్నంత విరహబాధ ఎప్పుడూ పడలేదు. నా శరీరం ముట్టుకుని చూడు, ఎలా మండిపోతుందో. ఉపచర్య చేసి బతికించు" అంటూ నిట్టూర్చాడు.

ఆమె – "అయ్యో! దేవరకి ఇలాటి బాధపడవలసిన కర్మేమొచ్చింది? మీరు కోరాలేకాని ఏ స్త్రీ కాదంటుంది? ఎవరి కోసం మీరిలా విరహవేదన పడుతున్నారో వేగంగా చెప్పండి. ఆమెను మీ పాదాలదగ్గరకి తీసుకొస్తాను" అంది.

"గోమినీ! నా వలపు చిత్రమయింది. ఆమె ఎవరో ఏమిటో ఏమీ ఎరుగను. మొన్న విజయదశమినాడు రాత్రి పట్టపు ఏనుగు నెక్కి వేంకటేశ్వరుడి రథంతో ఊరేగుతున్నాను. ఒక మేడవద్ద నిలబడి ఉండగా ఆ యింటిలో నుండి ఒక యింతి వచ్చి స్వామికి నివాళి ఇచ్చింది. కర్పూరహారతి వెలుగులో ఆమె ముఖం ఎంత చక్కగా ఉందని! ఆమె కళ్ళు...శరీరం...సౌష్టవం, సౌందర్యం ... కదలికలు పరమాద్భుతం. అంత అందమైనస్త్రీ మనవూళ్ళో వుందని నువ్వు చెప్పావే కావు. నిత్యం పట్నం అంతా తిరిగి చక్కని వారిని వెదుకుతూ ఉంటానని చెప్పే నీకు ఆమె ఎందుకు కంటపడలేదు? ఆమెని చూసి మోహపరవశంలో అంబారి మీద పడిపోయాను. తరువాత ఏం జరిగిందో తెలియదు. ఇంటికి చేరాక మెలకువ వచ్చింది. అప్పటినుంచి ఆహారం రుచించదు, నిద్రపట్టదు.

నీకోసం ఎన్నోసార్లు కబురు పంపాను. ఏం చేస్తావో ఆలోచించు. ఇదే నా చింతకుకారణం" అన్నాడు సురూపుడు.

అందుకు – "దేవరవారి అభిలాష సమంజసం గానే ఉంది. కాని ఆమె ఉండే గృహమయినా గుర్తుచూశారా? ఆ వీధిలో నేనెరగనివారు ఎవరున్నారు? పేరు చెప్పండి, క్షణంలో దానిని మీ కౌగిట్లోకి తెస్తాను" అంది గోమిని.

"నాకేమీ తెలియదని చెప్పానుగా? వీధి తప్ప దిక్కుకూడా తెలియదు" అన్నాడతను నిట్టూర్చుతూ.

అప్పు డామె కొంచెంసేపు ఆలోచించి అతని చెవిలో ఏదో చెప్పింది. ఆ ఉపాయిని కతను సంతోషించి, అప్పటికప్పుడే ప్రధానమంత్రిని రప్పించి – "సచివోత్తమా! మొన్న మనం ఒక పొరపాటు చేశాం. విజయదశమినాడు హరిహరులిద్దరినీ ఊరేగించక హరికి మాత్రమే. ఉత్సవం చేశాం. అందుకు శంభుడు కోపించి నా కలలోకి వచ్చి – 'నన్ను అవమాన పరుస్తావా? అంటూ ఏమేమో అని మాయమై పోయాడు.

దేవతా ద్రోహం వల్ల ప్రమాదం రాకమానదు. అందుచేత రేపటి సోమవారం రాత్రి శంకరుడికి మునుపటికంటె ఘనంగా ఉత్సవం

జరిపించాలి. మొన్న ఏయే వీధులకు తిప్పారో ఆ వీధులకు తప్పకుండా పోవాలి. మేళతాళాలు ఎక్కువగా ఉండాలి. జాగ్రత్తసుమా." అని చెప్పాడు.

ఆ రోజురాత్రి రాజకుమారుడు చక్కగా అలంకరించుకుని ఏనుగునెక్కి గోమినిని తనపక్కన ఉంచుకుని ఊరేగసాగాడు. తన ఏనుగు కదిలేవరకూ అందరూ నిలబడి ఉండాలని నియమించాడు.

మేడలున్న చోట ఎక్కువసేపు ఆగుతూ...హారతులిచ్చే స్త్రీల ముఖాలు పట్టి పట్టి చూస్తూ మెల్లగా వెళ్తుంటే – చివరకి ఒక మేడలోంచి మెరుపుతీగ లాంటి స్త్రీ ఒకామె పట్టుబట్టలు ధరించి స్వామిని స్తుతిస్తూ ద్వారం వద్ద నిలబడింది. ఆమెను చూసి, రాజు – "అదిగో..ఆమె..." అంటూ తడబడుతూ గోమినికి చూబించాడు.

గోమిని ఏనుగును దిగివెళ్ళి ఆమె వివరాలు తెలుసుకువచ్చి – "దేవా! ఈ మేడ విత్తగణకుడు (షరాబు) కుముదాంగదుడిది. ఆమె అతని కూతురు పద్మిని. చాలా చక్కనిది. మీరు వరించదగినదే" అని చెప్పింది. ఆమె స్వామికి నివాళులిచ్చి స్తుతించి ప్రసాదం తీసుకుని వెంటనే ఇంట్లోకి వెళ్ళిపోయింది.

అప్పుడు రాజు కుముదాంగదుణ్ని రప్పించి, చాలా గౌరవించి " నీ మేడ చాలా చక్కగా ఉంది. ఎప్పుడూ చూబించావు కాదే" అన్నాడు. ఆ వైశ్యుడు – "ఇది మా పూర్వులు కట్టినది. లోపలికి రండి" అని రాజు నాహ్వానించాడు. "రేపు సాయంకాలం వస్తాను, జ్ఞాపకం, చెయ్యి." అని ఊరేగింపుతో మరి కొంతదూరం పోయి – నిద్రకు ఆగలేనంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

మర్నాడు కరటుణ్ని రప్పించి – "కామశాస్త్ర, వాత్సాయన కామసూత్రాలు గట్టిగా వచ్చిన నువ్వ పద్మినిని నాచెంత కెప్పుడు రప్పిస్తావ్? ఏ ఉపాయంతో రప్పిస్తావ్? విరహవేదనలో నిముషం ఒకయుగంలా ఉంది నాకు" అని చెప్పాడు.

అందుకు కరటుడు – "దేవా! దాని చరిత్ర నాకు ఇది వరకే తెలుసు. ఎన్నోసార్లు పండిత వేషంలో వాళ్ళింటికి వెళ్ళాను. ముఖమెత్తి

చూడదు. మహాభక్తురాలు. విద్యలలో సరస్వతి. ఆమెను రప్పించడం అసాధ్యం" అనేశాడు. రాజు గోమినిని రప్పించి - "స్త్రీని స్త్రీయే వొంచగలదు. పద్మినిని నా వశం చేస్తే నీకు లక్షరూపాయలు కానుకగా ఇస్తాను" అన్నాడు.

ఆ మాటకామె చాలా సంతోషించి - "దేవా! ఇది ఎంతపని? ఒర్పు వహించారో.. అరుంధతి నైనా తీసుకురాగలను. ఈమెఎంత? ఏదో నెపంతో మీరొకసారి ఆమె కంటపడి రండి. తరవాత ఆమె మిమ్మల్ని సేవించేలా నేను చేస్తాను" అంది. కరటుడు నవ్వుతూ - "కపటంతో నువ్వామెను ఇతనికి వశం చేయగలిగితే నేను శిఖ, యజ్ఞోపవీతాలూ తీసేసి సన్యాసినౌతాను ఇదే నాశపథం" అంటూ ఆమెదగ్గర మాయలు సాగవన్నాడు. గోమిని కూడా ఆమెను తీసుకువస్తానని శపథం చేసింది. ఇద్దరూ కలహించుకుంటూంటే రాజు గోమిని పక్షం వహించి కరటుణ్ని మందలించాడు.

అంతలో కుముదాంగదుడు తన ఆహ్వానాన్ని గుర్తు చేయడానికి రాగా గుఱ్ఱపుబండి తెప్పించి బయలుదేరాడు. అతిచక్కగా అలంకరించ బడిన ఆ మేడలో పద్మినిని ఎక్కడా గమనించలేక - "సెట్టీ! నీకు పిల్లలెందరు?" అని అడిగారు.

"దేవా! లేకలేక ఒక్కతే కూతురు కలిగింది. అల్లుడు మా ఇంట్లోనే ఉంటున్నాడు" అంటూ అల్లుణ్ని రప్పించి చూపించాడు.

"నీ అదృష్టం మంచిదే. మంచి అల్లుడే దొరికాడు" అన్నాడు రాజు గురుదత్తుణ్ని చూసి ఆశ్చర్యపడుతూ.

"దేవా! ఇతనికి చాలాసిరి ఉంది. విద్యల్లో విశేష ప్రతిభ కలవాడు" అని సెట్టి చెప్పగా - "మన ఆస్థానానికి రమ్మను. వేతనం ఏర్పరుస్తాను. పండిత గోష్టులు రాజుకి అవసరమేకదా" అన్నాడు రాజు. గురుదత్తుడు ఏదో పనికల్పించుకుని అవతలకి పోయాడు. ఎంతసేపున్నా పద్మిని కనపడకపోడంతో రాజు, గోమినితో కలసి ఇంటికి వెళ్ళిపోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 118. వ మజిలీ

### గోమిని కథ

"అమ్మా! మొన్న రాజుగారితో వచ్చిన గోమిని అనే ఆమె ద్వారం వద్ద వేచి ఉంది. మీతో మాట్లాడాలట. అయ్యగారు లోపలికి తీసుకుపొమ్మన్నారు. తీసుకురానా?" అని పరిచారిక అడిగింది. పద్మిని కొంచెం ఆలోచించి – "అయ్యగారు సెలవిచ్చారా? ఓహో! రాజుగారి చుట్టంకదా. సరే. తీసుకురా" అంది. గోమిని వచ్చి కూర్చుంటూనే పద్మిని రూప విద్యావిశేషాలను పొగిడి "ఈ పట్నం ఏలే మహారాజు భార్యకు నీ గుణాలలో వందోవంతు కూడా లేవు. రాజుగారేమో సుందరుడు, రసికుడు. ఆమె అతనికి ఏ మాత్రమూ తగదు. దైవం తగిన వారికి తగిన భార్య నివ్వడు. పాండిత్యం కల స్త్రీ లంటే రాజుకి చాలా సంతోషం. ఈ పూలూ, పళ్లూ, వస్త్రాలూ నీకు కానుకగా పంపాడు. మొన్న మీ యింటికి వచ్చింది మొదలు మీయందు అతనికి స్నేహభావం కలిగింది" అంటూ వాటిని ఆమెముందు పెట్టింది.

పద్మిని వాటిని చూడనయిని చూడక "గోమినీ! నీ దూతికా కృత్యములు నా దగ్గర చూపకు. నీ స్తోత్రాలకి నేను పొంగిపోను. ధర్మబుద్ధితో ప్రజలను బిడ్డలుగా చూస్తూ దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేయడం రాజధర్మంకాని రసికుడవడమూ, స్త్రీ విద్యాలాలసుడవడమూ రాజ్యతంత్రానికి అవసరం కావు. దుర్వ్యసనాలలో ఆసక్తి పడితే రాజుసిరి త్వరితంగా క్షీణించి పోతూంది. నాకు ఈ కానుకలు పంపడం అతనికి భావ్యం కాదు. నా చక్కదనాన్ని ప్రశంసించే అవసరం అతనికేమిటి? సంసారస్త్రీ చరిత్రతో అతనికేం పని? నాకీ కానుకలు వద్దు. తీసుకుపో. ఇలాటి మాటలు నావద్ద ఎప్పుడూ చెప్పకు" అని అవతలికి పోయింది.

గోమిని సిగ్గుపడి – ఏం చేయడానికీ తోచక ఆ వస్తువులక్కడే వదిలేసి రాజు దగ్గరకి పోయింది. అతనామెకు ఎదురొచ్చి – "ఏం జరిగింది? అనుకూలపడిందా?" అంటూ ఆత్రంగా అడిగాడు. ఆమె కొంచెం దిగులుపడుతూ తలదించుకుని –

"దేవా! అది సామాన్యురాలు కాదు. గంభీరురాలు. మనసులో కోరికున్నా బయట పడిందికాదు. మీ గుణాలు, రూపం, సరసత పొగిడాను. అన్నింటికీ వంకలే పెట్టింది. కానీండి." అంటూ నిట్టూర్చింది.

రాజు గుండె ఝల్లుమనగా – ఏమైందో వివరంగా చెప్పమన్నాడు. ఆమె జరిగినదంతా చెప్పింది. అతనది విని విచారిస్తూంటే – "తొందరపడకండి. ఆడదాని మనసు క్షణానికి ఒకలా ఉంటుంది. కార్యం సాధిస్తాను కదా" అని అతన్ని సముదాయంచింది.

ఎన్నోసార్లు గోమిని పద్మిని ఇంటికి వెళ్ళింది కాని పద్మిని దాని మాటలకు లోబడలేదు. చివరికది విసిగిపోయి, రాజు వద్దకు వచ్చి – "దేవా! నేను ఎందరినో చూశాను. కాని ఇలాటి గడసరిని ఎక్కడా చూడలేదు. మనం ఏమన్నా అది తప్పే అంటూ శ్లోకాలు చదువుతుంది. మనకే నీతులు చెబుతుంది దేవరప్రవర్తనే బాగులేదన్న దానితో ఇంకేం మాట్లాడగాను?" అంది.

ఆ మాటలకి రాజుకోపగించి "ఆ! మాకే తప్పులు పట్టిందా! దాన్ని వరించడం మా అనుగ్రహంగా భావించక గర్వంతో వెక్కిరిస్తూందా! సరే. స్త్రీలు సామంతో లొంగరు. లోకోపవాదానికి వెరచి ఇన్నాళ్ళు ఓర్చాను. చూసుకో ఇక. నా చివరిసందేశం తెలిపిరా" అంటూ తన సందేశాన్ని ఇలా చెప్పాడు. "మంచిగా మారాజుతో కూడితే సామ్రాజ్య సుఖం అనుభవించగలవు. లేకపోతే నిన్ను బలాత్కారంగా అయినా పరాభవించక మానడు. నీ భర్తనీ తల్లితండ్రులనీ చెరపట్టి సంపదంతా లాక్కుంటాడు. అప్పుడు నీకెవరు అడ్డుపడతారో చూస్తాం. అని నిర్భయంగా చెప్పిరా" అని దాన్ని పంపాడు. గోమిని నిర్భయంగా పద్మిని దగ్గరకు వెళ్ళి "నీతో ఒక రహస్యం చెప్పాలి" అంది. "నీ రహస్యాలు నా కక్కర్లేదు. నిన్ను మా యింటికి రావొద్దని చెప్పలేదా? మళ్ళీ ఎందుకొచ్చావ్?" అంది పద్మిని కోపంగా.

"తల్లీ! కోపగించకు ఇది నా కడపటి సందేశం. ఆ రాజపుత్రుడు నీమీద మోహంతో నిద్రాహారాలు మాని కృశించిపోతున్నాడు" అంటూ అతను చెప్పిన సందేశం వినిపించి - "నీవల్ల మీకులానికి అంతటికీ ముప్పురాగలదు" అని హెచ్చరికగా చెప్పింది. అది విని పద్మిని ఉలిక్కి పడింది. కొంచెం ఆలోచించి, చిరునవ్వు నవ్వుతూ - "ఇంతవరకూ రాజు హృదయాన్ని స్పష్టంగా చెప్పావు కావేం? నువ్వు సందిగ్ధంగా చెబుతూంటే నేను సరిగా చెప్పలేదు. రాజే కోరితే కాదనే వెర్రివాళ్ళుంటారా? ఇవాళ నువ్వు బయటపడ్డావు కనుక అంగీకరించాను. నేను మగనాలిని కదా! నువ్వు మాటి మాటికీ వొస్తూంటే అనుమాన పడుతున్నాడు. రాజుని కలుసుకోడం సామాన్యమా? మంచి ఉపాయం ఆలోచించాలి. నాలుగు రోజులు పోయాక రా. చెబుతాను" అంది.

గోమిని చాలా సంతోషించి ఆమె వీపుతట్టుతూ - "నువ్వు మంచి జాణవి. నీ మనసు తెలుసుకోలేకపోయాను. నువ్వు చెప్పిననాడే వస్తాను" అంటూ దీవించి వెళ్ళింది.

గురుదత్తుడు రాజు తన ఇంటికి రావడం, మాటి మాటికి దూతికను పంపడం మొదలైనవి చూసి ఆవేళ వాళ్ళ సంభాషణను రహస్యంగా విన్నాడు. కొంచెందూరం అవడం వల్ల - కొన్ని మాటలు మాత్రమే వినపడ్డాయి. వాటిని బట్టి అతను 'రాజు పద్మినిని చూసి మోహించి దూతికను పంపాడు. ఇది ఇలా చెప్పింది. ఇక దీన్ని పతివ్రత అని ఎలా నమ్మేది? పద్మినీ జాతి మహాపతివ్రత ఔతుందని కొక్కోకుడు చెప్పిన మాటలు నిజమనుకుని దీన్ని నమ్మి తల్లితండ్రులని కూడా చూడకుండా ఇక్కడే పడున్నాను. ఎంత మూర్ఖుణ్ని చదువుకున్న స్త్రీలకే శృంగార లీలల యందు అభిలాష ఎక్కువగా ఉంటుంది. ఈమె కథవింటే వూళ్ళో వారందరూ నవ్వుతారు. గదాధరుడేమో ఇంటికి పోయి రాలేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి? చెప్పకుండా పోవడమా? కానియ్ చూద్దాం. నాలుగు రోజులలో అది మళ్ళీ వొస్తుంది కదా? అప్పుడు వాళ్ళ మాటలని బట్టి చూద్దాం" అనుకున్నాడు.

గోమిని రాజువద్దకు పోయి ఆనందం పట్టలేక పోతూ - "దేవా! నీ అభీష్టం తీరింది. పద్మిని వశమయింది. కరటుడిని పందెంలో

గెలిచాను" అనే సరికి అతను వివరంగా చెప్పమని కోరాడు. ముందుగానే పారితోషికం ఇస్తున్నానంటూ కడియం తీసి ఇచ్చాడు. అప్పుడు గోమిని జరిగినదంతా చెప్పింది.

"గోమినీ! నేననుకోడం కాదు కానీ నా రూపం, నా రసికత, నా యౌవనం చూసిన ఏ రసిక యువతి విరహం చెందదు? సరే. ఎప్పుడు రమ్మంది?" అని అడిగాడు ఆత్రంగా. "నాలుగు రోజులు ఆగాలి" అందామె.

ఆ వేళ గోమిని పద్మిని ఇంటికి వెళ్ళిమాట్లాడి వచ్చి రాజుకి ఇలా చెప్పింది. "దేవా! ఎల్లుండి అమావాస్యనాడు రాత్రి పెరటి వేపున ఉన్న పశువుల శాలలోకి రమ్మంది. తలుపుతీసి ఉంచుతుందట. అక్కడ మంచం వేస్తుందట. ఒక్కరాత్రి గడిస్తే దివ్యసుఖం అనుభవించవచ్చునని చెప్పింది. దీపంలేని లోటు ముందు ముందు తీర్చగలనని చెప్పింది. చాలా ప్రీతిగా మాట్లాడింది."

ఒక్కరోజే కదా! ఎలాగో కష్టపడతాను. ఒక్కసారి కలిస్తే వెంటబడి వచ్చేటట్లు చెయ్యనా? నా చాతుర్యం చూస్తావు కదా" అని ఉగ్రూత లూగాడు.

పద్మిని గోమినితో మాట్లాడిన దంతా విన్న గురుదత్తుడు పద్మినిని నమ్మినందుకు పశ్చాత్తాపపడుతూ స్త్రీలలో పతివ్రతే ఉండదనుకుంటూ ఆమెను ప్రాణంలా చూసుకుంటున్నందుకు సిగ్గుపడుతూ ... ఆ అమావాస్య చర్య చూసి వారిద్దరినీ ఆ మంచంమీదే కడతేర్చి ఇంటికి పోదాం అని కత్తినూరసాగాడు.

అమావాస్యనాడు తెల్లవారింది మొదలు సురూపుడు గడియలు లెక్కపెట్టసాగాడు. పర్వదిన మయినా క్షురకర్మ చేయించి మీసాలు దిద్దించాడు. పన్నీటితో జలకా లాడాడు. ఎన్నెన్నో దుస్తులూ, నగలూ మార్చి మార్చి ధరించాడు. పొద్దుకుంకడమేమిటి, పోదాం పద" అన్నాడు గోమినితో.

ఆమె నవ్వుతూ – "దేవా! రాత్రి పన్నెండుగంటలు కొట్టినప్పుడే అక్కడుండాలి. ఈ లోపల ఆమె తలుపు తీయదు. వీధిలో నిలబడితే

చూసినవారు అనుమానిస్తారు. కొంచెం తాళండి" అంది. అతనెలాగో పదిగంటల వరకూ నిగ్రహించుకుని "ఇక నిలవలేను, పద" అంటూ గోమినిని తొందరపెట్టి - నల్లని బట్ట ముసుగు వేసుకుని గోమిని దారి చూపుతూంటే మెల్లగా నడుస్తూ కొంతసేపటికి కుముదాంగదుడి యింటి పెరటిగుమ్మం దగ్గరకి చేరిపోయాడు.

గోమిని ముందు వెళ్లి తలుపు ఓరగా వేసి ఉండడం చూసి సంతోషించి - రాజు చేయిపట్టుకుని లోపలికి తీసుకుపోయి చీకట్లో తడుముతూ రాజుని మంచం మీద కూర్చోబెట్టి - "నేను బయట ఉంటాను. ఆమె యిప్పుడే వస్తుంది" అని తలుపు చేరవేసి బయట కూర్చుంది.

కొంత సేపటికి గురుదత్తుడు వచ్చి తలుపు గొళ్ళెంవెయ్యక పోడం, మంచం వేయబడడం, దానిమీద ఎవరో పడుకుని ఉండడం చూసి పద్మిని నిశ్చయంగా దుష్కార్యానికి పాల్పడుతోందని నిశ్చయించుకుని నూరిన కత్తిని తనగదిలో మంచం పక్క పెట్టుకుని కపటనిద్ర నటించసాగాడు.

పద్మిని భర్త గుర్రువిని మెల్లగా లేచి ఒక కాగితం తీసుకుని దీపం వెలుగులో ఇలా రాయసాగింది.

"మహాజనులారా! ఈ రాజు పరస్త్రీలోలుడై మంచి చెడ్డలు విచారించక నన్నుచూసి మోహించి, నా తల్లితండ్రులనూ, బంధవులనూ నిర్బంధించి చెరసాలలో పెట్టించి నన్ను బలాత్కారంగా తీసుకుపోతానని దూతికద్వారా తెలియజేశాడు. అందుకు భయపడి, మరోదారిలేక అంగీకరించినట్లు నటిస్తూ, ఈ రాత్రి మా యింటికి రమ్మని సాంకేతికం ఏర్పరిచాను. ఇప్పుడే దుష్టుణ్ని చంపి నా పాతివ్రత్యం కాపాడుకున్నాను. ఇలాటి పాపాత్ముడు రాజుగా ఉండడంకంటె ప్రజలకు మరొక అపకారం లేదు. ఈ ద్రోహి మూలంగా - సత్యసంధుడు, తల్లితండ్రులనీ సిరిసంపదలనీ విడచినాతో ఉంటూ ప్రాణంకంటె నన్నే ఎక్కువగా చూసుకునే భర్తని విచారంలో ముంచి ప్రాణాలు వదులుతున్నాను. నేను చేస్తున్న ఈ పని నా భర్తకు కాని తల్లితండ్రులకి కాని తెలియదు. మీరు వారిని దండించవద్దు. జన్మజన్మాలకూ నాకు గురుదత్తుడే భర్త అవాలి.

ఓ మనోహరా! గురుదత్తా! నువ్వు నన్ను పరీక్షించి పెళ్ళి చేసుకున్నావు. నా కోసం నీ తల్లితండ్రులనీ, సిరిసంపదలనీ వదలి వచ్చావు. కాని నీతో సుఖపడే యోగం నాకు లేకపోయింది.

ఆ వేళ దేవతోత్సవాలలో నన్ను చూసింది మొదలు ఈ దుర్మార్గుడు పంపేవార్తలకు లెక్కలేదు. మీతో చెబితే ఏంటారో అని చెప్పలేదు. చివరకి ప్రాణసంకటం అయింది. మీరు నన్ను దుష్టురాలిగా తలపక పుణ్యలోకానికి పోయేటట్లు దీవించండి. మీకు ఇదే కడపటి నమస్కారం.

ఓ తల్లి తండ్రులారా! మిమ్మల్ని దుఃఖంలో ముంచి పోతున్నాను. నాకోసం విచారించక విరక్తితో పుణ్యకార్యాలు చెయ్యండి. మీకు ఇవే చివరినమస్కారాలు" అది రాసి ఆ చీటిని మడిచి అక్కడే ఉంచి మరొక గదిలోకి వెళ్ళిపోయింది. అదంతా క్రీగంట గమనిస్తున్న గురుదత్తుడు – రంకుమగని కేదో చీటీ రాసింది – ఏమిటో చూద్దాం అని దానిని తీసి మళ్ళీ మంచం మీద పడుకుని నిద్ర నటించసాగాడు.

అంతలో పద్మిని తన నగలన్నీ తీసేసి కత్తి పట్టుకుని భర్త మంచానికి మూడుసార్లు ప్రదక్షిణం చేసి కన్నీటితో పాదాలకు మొక్కి – తాను రాసిన చీటికోసం వెదికి వెదికి కనుక్కోలేక – మరోచీటీని రాయడానికి పక్కగదిలోకి వెళ్ళింది.

ఆ అవకాశం చూసి గురుదత్తుడు తాను సంగ్రహించిన చీటిని దీపం వెలుగులో చదివాడు. గుండెఝల్లుమంది. ఆమె మీదున్న కోపమంతా పోయి – హృదయం ద్రవించిపోగా – ఎంతో దుఃఖం వచ్చింది. అంతలో పరిస్థితి గుర్తుకొచ్చి ఆమె కోసం పక్కగదిలోచూడగా అక్కడ ఆమె కనిపించలేదు. అతను గబగబ మేడమెట్లు దిగి పశువుల శాలకి వెళ్ళాడు. ఆమె అక్కడ ఉండడం చూసి అతను ఎదురు చూడసాగాడు.

పద్మిని పాదధ్వని విని రాజు "సుందరీ! ఇటురా. నేనిక్కడ ఉన్నాను" అని మెల్లగా పిలిచాడు. ఆమె అతని దగ్గరకు పోయి ఎడమచేత్తో వాని తలను పట్టుకుని వంచి గురిచూసి కుడిచేతిలోని కత్తితో అతని

కంఠం మీద బలంగా ఒకవేటు వేసింది. "హా! చచ్చాను" అంటూ అరిచి ఆ పాపాత్ముడు నేలమీదపడి గిలగిలకొట్టుకుని ప్రాణాలు వదిలాడు.

ఆ ఆర్తనాదం విని గోమిని భయపడుతూ పెరటి తలుపు తోసుకుని లోపలకు వచ్చి - రాజు చచ్చి పడుండడం చూసి భయపడి, తనని కూడా చంపుతారన్న భయంతో వేగంగా ఇంటికి పారిపోయింది.

గురుదత్తుడు భార్య చేసిన సాహసం కళ్ళారా చూసి భయపడుతూ చటుక్కున వచ్చి ఆమెను పట్టుకుని కత్తిలాక్కుని "ప్రమాదం చేశావు" అని గద్గదస్వరంతో అన్నాడు.

భర్తని గుర్తుపట్టి ఆమె "అయ్యో! మీరిక్కడికి ఎలా వచ్చారు? నా ప్రయాత్నానికి ఆటంకం కలగజేశారే. వదలండి, వదలండి ఈ క్రూరుడిన్ని ముట్టుకున్నందుకు చచ్చిపోతాను" అంది.

అందుకు - "ప్రేయసీ! ఆత్మహత్య మహాపాపం కదా? ఇలాటి పనికి ఎందుకు పూనుకున్నావు. వీడెవడు? ఇక్కడి కెందుకు వచ్చాడు? వీడినెందుకు చంపావు?" అని అతను ఏమీ ఎరగనివాడిలాగే అడిగాడు. ఆమె అంతా చెప్పి తనని వదలమని బతిమాలింది.

అతను నవ్వుతూ. "లోకకంటకుడైన ఈ రాజుని చంపి ప్రజలకు ఉపకారమే చేశావు. ఇది పాపంకాదు. కీర్తికి కారణమే. ద్రౌపది సింహబలుడిని చంపించలేదా? పదపద - " అన్నాడు.

"నాథా! మన మితనిని చంపిన విషయం తెలియక మానదు. రాజభటులు మనల్ని వదులుతారా? నేను బలిఔతాను. మీరు సుఖంగా ఉండండి" "చాలుచాలు. నువ్వు లేనిదే సుఖముంటుందానాకు? భయపడకు. మరోదేశం పోదాం" అంటూ అత నామెకు ఎన్నో ఉపాయాలు చెప్పాడు. ఆమె అంగీకరించింది.

అప్పుడు ఇద్దరూసాయం పట్టి ఆ రాచపీనుగుని వీధిలో దూరంగా పారేశారు. తెల్లవారకుండానే, ఎవరికీ చెప్పకుండా దేశాంతరం పోయారు. కుముదాంగదుడు పెందరాళే లేచి వాడుకప్రకారం అల్లుడితో మాట్లాడదాని కతని గదికి వెళ్ళాడు. "గురుదత్తా! లే...పొద్దెక్కింది. రాజు నిన్ను కూడా ఆ స్థానానికి తీసుకు రమ్మన్నాడు. పోదాం." అంటూ

"పిలిచి పిలిచి - ఎంతకీ జవాబు రాకపోడంతో తలుపుతోసి లోపలికి పోయి అతను కనపడక, కూతురిగదిలోకి పోయాడు. ఆమె కూడా కనపడకపోడంతో - భార్యని పిలిచి, "మన వాళ్ళు మేడమీద లేరే! ఎక్కడికేనా వెళ్ళారా?" అని అడిగాడు.

ఆ యిల్లాలు - "అయ్యో! నాకేమీ తెలియదు. ఎక్కడికి పోతారు? అమ్మాయి ఇంకా లేవలేదేమిటా అనుకుంటున్నాను. చూడండి." అంది కంగారుగా. ఇద్దరూ మేడమీద వున్న గదులన్నీ వెదికినా వాళ్ళు ఎక్కడా కనపడలేదు. దుఃఖిస్తున్న భార్యకి ధైర్యం చెప్పి - "రాజసభకి పోయి రాజుకి చెప్పి సెలవు తీసుకుని వస్తాను. రాత్రి వాళ్ళు ఉన్నారుకదా. మనకి చెబితే ఒప్పుకోమని భార్యని తీసుకుని తన ఇంటికి వెళ్ళి పోయాడేమో? ఎద్దులూ, బండీ ఒకటైతే మనం ఏం చెయ్యగలం?" అంటూ రాజసభకి వెళ్ళిపోయాడు.

ఆ వేళ రాజు సభకి రాలేదు. అత్యవసర కార్యాలకోసం రాజుగారి ఆజ్ఞకోసం ఎదురు చూసి అంతఃపుర రక్షకులని రాజు గురించి అడగ్గా - "రాత్రి ఉద్యానవనంలో పడుకున్నారు. ఇంటికి రాలేదు" అని చెప్పారు వాళ్ళు. కొందరు మంత్రులు కేళీవనానికి వెళ్ళారు. అక్కడ రాజులేకపోడంతో కంగారు పడుతూ కరటుడి నడిగారు. "నాకే మీ తెలియదు గోమినిని నడగండి" అన్నా డతను. గోమిని, రాజు ఆ ఉద్యానవనంలో రాత్రి ఏకాంతంగాఉన్నట్లు తెలిసి గోమినిని రప్పించి అడిగారు "నాకేమీ తెలియదు" అనేసింది గోమిని.

అంతలో రాజభటులు హాహాకారాలు చేస్తూ వచ్చి - "సురూపుడిని ఎవరో కత్తితో నరికి పెంటకుండులో పారేశారు. పెంటఎత్తే వాళ్ళకి ఆ శవం కనిపించింది" పౌరులందరూ చూస్తున్నారు. కుముదాంగదుడి ఇంటిముందర కుండలో కనిపించింది ఆ శవం" అని చెప్పారు. మంత్రులందరూ అక్కడికి పోయి కంఠం నరకబడి ఉన్న ఆ రాచపీనుగుని చూచి విలపించారు. రాజు శరీరమంతా చక్కగా అలంకరించబడి ఉంది.

ఆ శవాన్ని పల్లకీ మీద ఎక్కించి నగరంలోకి తీసుకు వచ్చారు. రాజు భార్యలూ, బంధువులూ విలపించసాగారు. అతనెందుకు ఎలా

చనిపోయాడో ఎవరికీ తెలియదు. మంత్రులు గోమినిని నిర్బంధించి బెదిరించగా అప్పుడు అది యదార్థం చెప్పింది. అప్పుడు మంత్రులు రక్షక భటులతో వెళ్ళి కుముదాంగదుని యిల్లు ముట్టడించారు. పశువుల సాలలో రక్తం మరకలు కనిపించాయి. ఇల్లు వెదకగా పద్మిని రాసిన ఉత్తరం కనిపించింది.

రాజు చేసిన దుష్కార్యమే అతన్ని చంపిందని మనసులో భావించినా దండనీతిప్రకారం కుముదాంగదుణ్ని నిర్బంధించి – "మీ వాళ్ళు ఎక్కడికి పోయారో చూపించు" అని అడిగారు. అతను తనకి ఆ విషయం ఏమీ తెలియదనీ అది తెలుసుకుందుకే సెలవడగడానికి రాజసభకి వచ్చాననీ చెప్పి రుజువులు చూపించి చెరసాలలో పెట్టకుండా తనని కాపాడుకున్నాడు.

మంత్రులు సురూపుడికి అంత్యక్రియలు జరిపించి సామంతుడైన గజేంద్రవాహనుడు ఆజ్ఞానుసారం తామే రాజ్యభారం వహించి పాలిస్తూ – గురుదత్తుడినీ, పద్మినినీ కనపడగానే పట్టుకుని తీసుకు వచ్చేటట్లు దేశదేశాలకీ దూతలని పంపుతూ ఆ దేశపు రాజులకి వారు చేసిన ద్రోహం తెలిపారు. కుంభీనసపురానికి పోయిన రాజభటులు అక్కడున్న రాజు ఆజ్ఞతో రత్నాకరుడి ఇట్లు ముట్టడించి పరీక్షించారు కాని వాళ్ళిద్దరూ అక్కడా కనపడలేదు.

రత్నాకరుడు ఆ వార్తవిని పిడుగు పడ్డట్లు నిశ్చేష్టుడై కొంతసేపటికి తేరుకుని గదాధరుణ్ని రప్పించి యిలా అన్నాడు. "గదాధరా! నువ్వు మా వాడిని తీసుకుని వెళ్ళి అత్తారింటి దగ్గర వదిలివచ్చావు. వాడి భార్యని రాజువలచుటచే వాడిని చంపి వాళ్ళిద్దరూ ఎక్కడికో పారిపోయారు. వాళ్ళిద్దరినీ పట్టుకోవడానికి రాజభటులు దేశ దేశాలు తిరుగుతున్నారు. దొరికితే వాళ్ళని బతకనివ్వరు కదా – అని భయపడి బలాత్కారంగా చనిపోయారేమో తెలియదు. మీ శాస్త్రాల వల్ల ఒరిగిన ఫలం ఇది. పద్మినీ జాతి కన్యని పెళ్ళాడినందుకు యిలా అయింది. మళ్ళీ నా కొడుకు నాకంటపడలేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఈ ధనమంతా ఎవరివశం చెయ్యాలి? నీ సహవాసం వల్లనే వాడికి ఈ ముప్పువొచ్చింది" అంటూ నిష్ఠూర మాడుతూ దుఃఖించసాగాడు.

గదాధరుడు దుఃఖిస్తూ – "రత్నాకరా! నీ కోడలు ముల్లోకాలూ మెచ్చే పని చేసింది. అందుకు విచారించక్కరలేదు. వాళ్ళు కొన్నాళ్ళు ప్రచ్ఛన్నంగా తిరిగినా నలదమయంతుల్లా మళ్ళీ పూర్వ వైభవాలు అనుభవించక మానరు. ధర్మాత్ములకి ఆపదలంటవు.

నన్ను పెళ్ళి చేసుకుని వెంటనే వొచ్చెయ్య మన్నాడు నా మిత్రుడు. లేకపోతే తాను నిలవలేనన్నాడు. నేను వెంటనే అతన్ని చూడలేక పోయాను. శెట్టీ! నీ కోడలి గుణగణాలు, పాతివ్రత్యం పొగడడం ఆదిశేషుడి తరం కూడా కాదు. ఆ మహాపతివ్రతని చెరచదలచిన నీచుడు చావకుండా మిగులుతాడా? మీరు విచారించకండి. నేను దేశాలు తిరిగి వాళ్ళని వెదికి తీసుకు వస్తాను. కొంతకాలం గడిస్తే ఈ నేరం సమసిపోగలదు. వాళ్ళకేమీ భయంలేదు" అంటూ చెప్పి..మంచి ముహూర్తం చూసుకుని ఇల్లు వదిలి రామదుర్గ నగరం పోయాడు.

ఆ పురంలో పద్మినిని పొగడనివారూ లేరు, సురూపుణ్ని నిందించనివారూ లేరు. గదాధరుడు వేషం మార్చుకుని రాజభటులని తప్పించుకుటూ కుముదాంగదుడి ఇంటికి వెళ్ళాడు. వాళ్ళు అతన్ని పట్టుకుని విలపించారు. గదాధరుడు వాళ్ళిద్దరూ మసలిన గదులన్నీ పరీక్షిస్తూంటే ఒకచోట ఒక పుస్తకం కనిపించింది. దానిలో గురుదత్తుడు రాసిన ఈపద్యం చదివాడు.

క. **నలుఁడును రాముఁడు పాండవు**
**లిల విధి గతి వెతలఁ బడయరే! మనమును వా**
**రల కన్న ఘనులమే? యిది**
**దెలిసిన వగమాని ముక్తి తెర లెరుఁగ వొకో.**

'నలుడు, రాముడు, పాండవులకే విధి తప్పలేదు. మనం ఎంతటివారం? ఇది తెలుసుకుంటే విచారం ఉండదు.' అన్న భావం కలిగిన ఆ పద్యంగురించి గదాధరుడు తరచితరచి ఆలోచించగా ... మేం అడవిలో దాగుని ఉంటాం. మా తావు తెలుసుకుని నువ్వురా! అన్న అభిప్రాయం అతనికి స్ఫురించింది. కనుక అరణ్యాలే వెదకాలని నిశ్చయించుకుని – ఆ విషయం వైశ్యదంపతులకి చెప్పి ఉత్తరం వేపుకి సాగిపోయాడు గదాధరుడు" అంతవరకూ కథ చెప్పి ఆపి తరవాత మజిలీకి బయలుదేరాడు మణికంఠుడు శిష్యుడితోసహా.

# కాశీ మజిలీ కథలు

## 119. వ మజిలీ

### పద్మిని కథ

రామదుర్గానికి ఉత్తరంగా కొన్ని యోజనాల దూరంలో దుర్గమమయిన అరణ్యాల మధ్య కొన్ని కోయ పల్లెలు ఉన్నాయి. వాటి చుట్టూ పెద్ద పెద్ద పర్వతాలు పెట్టని గోడల్లా నిలుచున్నాయి. ఆ పల్లెలకి పదియోజనాలవరకూ మహారణ్యమే కాని గ్రామమేదీ లేదు. అక్కడున్న వారిని శబరులనీ, వనచరులనీ, బోయలనీ, కోయలనీ పిలిస్తూంటారు. వాళ్ళకి నాగరికత తెలియదుకానీ అడవి ఆకులతో చాపలు, బుట్టలు, తట్టలు మొదలైనవి అల్లే నేర్పుంది. తేనె, పునుగు, జివ్వాది, కస్తూరి మొదలయిన అడవివస్తువులనీ, తాము అల్లిన బుట్టలనీ గాడిదల మీద తీసుకు వెళ్ళి గ్రామాలలో అమ్ముకుని సొమ్ము చేసుకుంటూంటారు. కోయవాళ్ళకి తప్ప అక్కడ ఆ పల్లెలున్నాయనే ఎవరికీ తెలియదు.

మృగాల బాధని పట్టించుకోక, ముళ్ళని లెక్కచెయ్యకుండా, రాళ్ళనొప్పిని గమనించకుండా, రాజద్రోహభయంతో గురుదత్తుడూ, అతని భార్యా పగలూ రాత్రీ ఏకబిగిన ప్రయాణంచేసి మారువేషాలతో ఎలాగో ఆ కోయపల్లె చేరుకున్నారు. దారిలో పరిచయమయిన ఒక శబరుడినుంచి ఆ పల్లె వృత్తాంతం తెలుసుకుని అతని వెంట ఆ దంపతులు వెళ్ళగలిగారు.

నాలుగువేపులా కొండలు మధ్యనున్న భూమిలో మనోహర మయిన లతలు, వృక్షాలు, సమృద్ధిగా నీరు ఉద్యానవనంలాగే ఉందా ప్రాంతం. కొండలమీంచి పారేకాలువలకు అడ్డుకట్టి కోయలు పంటలు పండిస్తారు.

శబరుడి వెంట వెళ్ళిన యీ దంపతులు ఆ కొండపల్లెలోని వింతలు చూసి ఆశ్చర్యపోతూ అక్కడ ఉండడానికి నిశ్చయించుకున్నారు. ఆ కొండ వారి భాష వికృతంగా ఉండడం వల్ల తెలుసుకోడం అసాధ్యంగా ఉంది. తమని చూసి ఆశ్చర్య పడుతున్న ఆ కొండ వారితో మాటలు కలుపుకుని కొంత సామ్మిచ్చి ఒకపర్ణకుటీరం వేయించుకుని కాలక్షేపం చేయసాగాడు.

ఒకనాడు, పద్మిని గురుదత్తుడితో "మనోహరా! నా వల్లకదా మీ కీ కష్టాలు వచ్చాయి. అగర్భశ్రీమంతులై సమస్తవిద్యలూ చదివి, ఉత్తమ రూపం కలిగిన మీకు ఈ కొండలోయలోని కోయలతో గుడిసెలో కాపరం చేయవలసివచ్చింది. విధివిలాసం! ఆ పాపాత్ముణ్ణి చంపిన నేను కూడా చనిపోయి వుంటే - మీరు మరోకన్యని పెళ్ళాడి సుఖంగా ఉండేవారు నా మూలంగా మీరు తల్లితండ్రులకి దూరమయ్యారు. గొప్పవేడుకతో అత్తవారింటికి పోవాలన్న నా కోరిక తీరింది కాదు. ఆ నీచుడు సందేశం పంపినవెంటనే మీకు చెప్పి ఉశీనరపురానికి వెళ్ళిపోయి ఉంటే ఈ ఆపద వచ్చేదికాదు" అంటూ మగడితొడమీద తలపెట్టుకుని దుఃఖించింది.

అందు కతను - "నీతో ఇక్కడ ఉండడంవలన నాకేమీ కష్టం లేదు. ఈ అరణ్యమే ఉద్యానవనమయింది. కాని...నువ్వుమాత్రం గర్భభారంతో పనులు చేస్తూంటే చూడడానికి నాకు విచారంగా ఉంది. ఎందరెందరు ఎన్నివిధాల నిన్ను అరచేతిలో పెట్టుకుని కాపాడే వారో! ఏముచ్చటా లేకుండా కిరాతయువతులతో కలసి తిరుగుతున్న నిన్ను చూసి నా హృదయం పగిలిపోతూంది. కానియ్. కాలం ఒకేలా ఉండదు. కర్మసూత్రాన్ని ఎవరు మీరగలరు?" అంటూ ఆమెను ఓదార్చాడు.

వాళ్ళు ఒకరిగురించి ఒకరు విచారిస్తూ, ఒకరినొకరు ఓదార్చుకుంటూ, పూర్వచరిత్రలు చెప్పుకుంటూ, అక్కడున్న కోయబాలురికి చదువు చెబుతూ కాలం గడపసాగారు. పద్మినికి అల్లికపనిలో మంచి నేర్పరితనం ఉండడంతో ఆ కిరాతులల్లే చాపలూ, బుట్టలూ చూసి అంతకంటె చిత్ర విచిత్రంగా తాను బట్టలు అల్లసాగింది. మగడికి కూడా ఆపని నేర్పింది. జంతువుల వెంట్రుకలు, అడవి ఆకులతో అద్భుతమయిన

తివాసీలు, చాపలు మొదలయిన గృహోపకరణాలు చేసి వాటిమీద ధరలు వేసి కోయలకిచ్చి గ్రామాలలో అమ్మించేవారు. ఆ వింత వస్తువులను పౌరులు వేగంగా కొనేవారు. అలాగ ఆ పల్లెలోని వాళ్ళు ధనం సంపాదించేవారు గురుదత్త పద్మినులు వారినుంచి పరిచర్యలు తప్ప మరే ప్రతిఫలం కోరేవారు కారు. అక్కడున్న కోయవాళ్ళందరూ ఆ దంపతులని గురువులుగా, దైవంగా భావించేవారు. ఆ వనవాసం ఆ దంపతులకి వినోదం లాగే ఉంది. పద్మినికి నెలలు నిండుతూంటే భిల్ల స్త్రీలు ఆమెకి ఉపచారాలు చేయసాగారు. గురుదత్తుడు ఆమెని ప్రాణంలాగే చూసుకునేవాడు. ఒకనాడు విచిత్రమైన తివాసి అల్లడానికి మృదువయిన పిట్టరెక్కలు కావలసి కోయవారిని తీసుకుని బయలుదేరబోతూంటే, "వద్దు మనం క్షత్రియులం కాము. వేట మనకి తగదు. ఆకులతో పూర్తిచేద్దాం. నోరులేని పిట్టలను కొట్టకండి –" అని పద్మిని వారించింది. అయినా వినకుండా అతను అరణ్యమంతా తిరిగి తిరిగి అలసిపోయి ఒక చెట్టు కిందకూర్చుని తనతో వచ్చిన వారిని పిట్టల రెక్కలకోసం నాలుగు మూలలకీ పంపాడు.

విధి ఎన్ని ఆటలయినా ఆడగలదు కదా! ఆ చెట్టుమీంచి ఒక పాము నేలపైకి ఉరికి అతన్ని కరిచి జరజరా పాకిపోయింది మరునిముషంలో అతను ఆ విషప్రభావానికి స్పృహతప్పి పడిపోయాడు. అతనికి దగ్గరలో ఉన్నకోయలు అది చూసి హడలిపోతూంటే ఒకడు మందు చెక్కకోసం పరుగెత్తాడు. ఒకడు ఇంటిదగ్గరున్న పద్మిని తివాసి నేస్తుండగా – "తల్లీ! మా అయ్యగారిని పాము కరిచింది. నేలనపడిపోయారు" అని కబురు చెప్పాడు.

"అయ్యో! ఎక్కడ? దైవమా! ఇంకా మమ్మల్ని పీడించక వదలవా?" అంటూ అరచి మూర్ఛపోయింది. అంతలోనే తెలివి తెచ్చుకుని – "బతికించే మందులున్నాయా? ఆయన ఎంతదూరంలో ఉన్నారు? మాట్లాడుతున్నారా? నా మాట ఏమైనా చెప్పారా? నీవెంట వస్తాను. నన్నక్కడికి తీసుకుపోవా ." అంటూ పిచ్చి దానిలా మాట్లాడ సాగింది.

"తల్లీ! వారికేమీ భయంలేదు. మా కొండలలో పాము విషం విరిచే చెక్కలు చాలా ఉన్నాయి. ఆ చెక్క గంధంరాస్తే బతికేస్తాడు. ఏడవకు – రా, పోదాం" అంటూ ఆ భిల్లుడు ఆమెని గురుదత్తుడి వద్దకు తీసుకుపోసాగాడు.

ఒకచోట చిన్న మెట్ట ఎక్కుతూంటే ఆమెకు ప్రసవవేదన మొదలయింది నేలమీద చతికిలపడిపోయింది. అక్కడే ఆమెకు ఒక మగశిశువు పుట్టాడు. కాని అది ఆమెకు తెలియదు. కొంచెం సేపట్లో ఆ కిరాతుడు కొందరు ఆడవాళ్ళని వెంట బెట్టుకుని అక్కడికి వచ్చాడు. వాళ్ళకి శిశువు కనపడలేదు. ఆ స్త్రీలు పద్మినికి ఉపచారాలు చేసి ఎత్తుకుని పల్లెకు తీసుకుపోయి కుటీరంలో పడుకోపెట్టారు.

చాలా సేపటికి ఆమెకు తెలివొచ్చింది. "హా! ప్రాణనాథా!" అంటూ ఏడవసాగింది. కిరాతస్త్రీలు ఆమెను ఊరడించి – "తల్లీ! నువ్వు కన్నపుత్రు డేమయ్యాడు? మాకు కనపడలేదే" అని అడిగారు. అందుకు పద్మిని – "అయ్యో! నాకేమీ తెలియదే. ఆ ఆశకూడా భగ్నం అయిందా? కాలహిమ. పోన్లేండి. నా భర్త జీవించి ఉన్నాడా?" అని అడిగింది.

"అమ్మా! అక్కడివాళ్ళింకా రాలేదు. నీకోసం మేము అడవికి వచ్చాం. అక్కడి వాళ్ళు యింకారాలేదు. మేము వచ్చేటప్పటికి నువ్వు వివశవై పడున్నావు" అంటూ ఆ వృత్తాంతం అంతా చెప్పారు.

పద్మిని చాలాభయపడుతూ తానుకన్న శిశువుని ఏమృగమో ఎత్తుకుపోయి ఉంటుందని నిశ్చయించుకుని ఆ విచారాన్ని మనసులోకి రానివ్వక భర్త క్షేమ వార్తకోసం ఎదురు చూడసాగింది.

అంతలో పిట్లల వేటకు వెళ్ళిన వాళ్ళు వచ్చి దీనవదనాలతో – "అమ్మా! నీ భర్తను పాము కరవడంతో నలుగురమూ నాలుగువేపులా పోయాం. మందులు తీసుకుని వచ్చేసరికి అతనక్కడలేదు. అడవి ఏనుగు పాదాల గుర్తులు కనిపించాయి. స్పృహలో లేని అతన్ని ఆ ఏనుగు తీసుకుపోయింది. మేమేమీ చెయ్యలేక పోయాం" అంటూ దుఃఖించారు.

ఆ మాటలు వినేసరికి ఆమెకు మతిపోయింది. పిచ్చి మాటలాడుతూ వింతగా చూసింది.

"అమ్మా! నీ మగని కేమీ భయం లేదు. ఏనుగెక్కి వస్తాడు. నీ వొళ్ళు పచ్చిది. దుఃఖిస్తే చెడిపోతుంది" అని వాళ్ళు బతిమాలసాగారు. వారి మాటలు వినిపించనట్లే ఆమె ఏవేవో జవాబులు చెప్పింది. వాళ్ళు అభిమానంతో ఆమెకు పరిచర్యలు చేసినా క్రమంగా ఆమె వెర్రి ఎక్కువైందేకాని తగ్గలేదు. పూర్వంలా పనులు చెయ్యదు. మాటలాడదు. ఎవరేనా పిలిచిపెడితే తింటుంది. లేకపోతే ఉపవాసమే. గురుదత్తుడి జాడే తెలియక అతను చచ్చిపోయాడనుకుని ఆమెను పట్టించుకోడం మానేశారు. పద్మిని తనను పట్టించుకునే వారు లేకపోడంతో ఒకనాడు అరణ్యమార్గాన పడి నడవసాగింది. పులులకు భయపడదు. ఎండనీ, వాననీ, చీకటినీ లెక్కచెయ్యదు. మరీ ఆకలేస్తే ఆకులో అలమలో తిని ఆకలి చల్లార్చుకుంటుంది. తెలివి కలగినప్పుడు – 'మనోహరా! గురుదత్తా!' అని అరుస్తుంది. అలా నడచి నడచి ఒక పట్నం చేరుకుంది. అప్పటికి కొంచెం పొద్దెక్కుతూంది. ఆమె పిచ్చిదానిలా వీధిలో నడచిపోతూంది.

ఆ వీధిలో రత్నాంగి అనే వేశ్య తన ఇంటిముందు నిలబడి నీళ్ళు తెచ్చే పనిమనిషి కోసం ఎదురుచూస్తూంది. అది ఎంతకీ రావడం లేదు. పద్మిని ఆ వీధిలోనే అటూ యిటూ తిరుగుతూండడం చూసింది. చిక్కిపోయి దుమ్ముకొట్టుకుని ఉన్న ఆమె సౌందర్యానికి గ్రహణం పట్టి ఉంది. కాని – రత్నాంగి ఆమె సౌందర్యాన్ని గుర్తించి దగ్గరకు వెళ్ళి – ఆమె వివరాలడిగి – "తప్పుగా భావించక ఈ కడవతో నీళ్ళు తెచ్చి పెడతావా? అదుగో అదే చెరువు. మేం స్వయంగా తెచ్చుకుంటే కులంలో వెలివేస్తారు" అని బతిమాలుకుంది.

సహజంగా పరోపకారబుద్ధి కల పద్మిని కడవతో నీళ్ళు తెచ్చి ఎక్కడ పోయాలని అడిగింది. స్నానం చేసి ఆమె తెచ్చిన నీళ్ళను ఇంటిలోని పాత్రలనిండా పట్టడమే కాకుండా, తాను స్నానం చేసి, మొక్కలకి కూడా పోసింది. అన్నినీళ్ళూ కిమ్మనకుండా తెచ్చిన ఆమెను రత్నాంగి వెర్రిదానిలా భావించి – "అమ్మీ! నీకు కూడు గుడ్డ ఇస్తాను. మా యింట్లో ఇంకే పనీ చెయ్యక్కర్లేదు. రోజూ పదిబిందెలు నీళ్ళు పోస్తూంటావా?" అని అడిగింది. అలాగే అన్నట్లు పద్మిని తల ఊపింది.

పనిమనిషికోసం ఇబ్బంది పడుతున్న రత్నాంగి చాలా సంతోషించి ఆమెకు కట్టుకోవడానికి మంచి బట్టలిచ్చి భోజనం పెట్టి పోషించసాగింది. పూర్వస్మృతిలేక పిచ్చిదానిలాగే తయారయినా పద్మిని ఆమె మెచ్చుకునేటట్లు పనులు చేస్తూ కొంతకాలం దానింట్లో ఉంది. అప్పుడప్పుడు తెలివొచ్చి తనవృత్తాంతం గుర్తు తెచ్చుకుని చచ్చిపోవా లనుకునేది. కాని అంతలోనే ఆ మాట మరచిపోయి యధా ప్రకారం పనులు చేసేది. పాండవులనే బానిసలను చెయ్యగలిగిన విధికి పద్మినిని ఒక వారాంగనకు పని మనిషిగా చేయడం ఆశ్చర్యమా!

మ. ఎట నెవ్వానికి నెన్నిరేల్ సుఖముగానీ దుఃఖమున్ గాని లి
స్ఫుట పూర్వా చరితాత్మ కర్మవశతన్ భోక్తవ్యమై యుండునో
ఘటనా చాతురిఁ ద్రాళ్ళఁగట్టుచు బలాత్కారంబుగా వాని న
చ్చోటికిం దోడ్కొని వచ్చి దాని గుడిపించున్ దైవ మన్నాళ్ళొగిన్.

అని చెప్పి మణిసిద్ధుడు – "గోపా! తరవాత మిగిలిన కథ చెబుతాను. ప్రయాణానికి సిద్ధం అవు." అన్నాడు. ఇద్దరూ బయలు దేరారు.

# కాశీ మజిలీ కథలు

## 120. వ మజిలీ

### .మృగదత్తుడి కథ

"గురుదత్తుడూ, పద్మినీ నివసించిన కోయపల్లెకి నాలుగు కోసుల దూరంలో మరోకొండపల్లె ఉంది. అక్కడ కోయలు, చెంచులు, బోయలు మొదలైన అడవి జాతివాళ్ళు నివసిస్తున్నారు. వాళ్ళు కూడా చాపలు, బుట్టలు, తట్టలు మొదలైనవి అమ్మి సొమ్ము చేసుకునే వారే.

పద్మిని అల్లిన వస్తువుల వలన కోయపల్లె లోని వాళ్ళందరికీ చాలా డబ్బు వొచ్చిందని తెలుసుకున్న ఆ పల్లె పెద్దలు – "అయ్యో! కోయపల్లె వాళ్ళు వింతచాపలు, బుట్టలు అల్లుతున్నారు. మనకి ఆపని తెలిసింది కాదు. మనం ఏడాదీ అమ్మితే వొచ్చేవి వారికి ఒక్క తివాసి మీదే వస్తూంది. వాళ్ళు ఆ పని ఎక్కడ నేర్చుకున్నారో తెలుసుకోవాలి. మనం కూడా ఆపని నేర్చుకోవాలి." అనుకుంటూంటే వాళ్ళలోని పదమూడేళ్ళ కుర్రాడు ముందుకొచ్చి – "నాకు వాటిని చూబించండి. అచ్చం అలాగే నేను అల్లుతాను" అన్నాడు.

ఆ మాటలు విని కొందరు గిరిజనులు అప్పుడే ఆ పల్లెకి పోయి తమచుట్టాలదగ్గరున్న వింత వస్తువులు తెచ్చి వాడికి చూబించారు. వాడిపేరు చిరతపులి. చాలా చురుకయినవాడు. అందరూ వాడిని పులి పులి అంటారు. వాడు ఆ వస్తువులను విప్పి – మళ్ళీ అల్లి వాటిలోని మర్మాలని గ్రహించి ఆ ఆకులు తెప్పించి తాను కూడా అల్లడం మొదలు పెట్టాడు. ఒకనాడు అల్లినట్లు మరోనాడు అల్లడు. అంతకంటే నేర్పరితనంగా అల్లుతాడు. ఏడాది తిరిగేసరి కతను ఆ పనిలో ఆశ్చర్యకరమయిన నిపుణత సాధించాడు. గురుదత్తుడు, పద్మిని

అల్లినవాటికంటె పులి అల్లినవి చాలా గొప్పగా కనిపించేవి. పిట్టల ఈకలు, వింతమేకబొచ్చు మొదలయిన వాటితో తివాసీలను అల్లి వాటికి చాలా వెలవొస్తుందని తండ్రి నడిగి కోయపిల్లల సాయంతో గాడిదలమీదవేసి చిరతపులి ఒకనాడు ఉదయార్కుడు అనే రాజు పరిపాలించే నగరానికి వెళ్ళాడు. ఆ వస్తువుల్ని గ్రామంలోని సంతకు తీసుకు పోయాడు. వాటిని అమ్మాక ఒక వింత తివాసి మాత్రం మిగిలింది. ప్రజల ఆత్రం చూసి పదిరెట్ల ధరచెప్పగా ఎవరూ కొనలేకపోయారు. ఆ రత్నకంబళం గురించి పరిచారికల ద్వారా విన్న రత్నాంగి అనేవేశ్య అతనిని తీసుకురమ్మని, తాను చక్కగా అలంకరించుకుని వీధి అరుగుమీద నిలబడింది. అంతలో ఆ పరిచారిక బోయ బాలుణ్ని తీసుకుని వచ్చింది.

రత్నాంగి వాడి అందం కన్నార్పకుండా చూసి ఆశ్చర్య పోయింది. ఆటవికవేషంలో ఉన్నా వీడిసౌందర్యం అద్భుతం. వీడికి వలపులవ ు విసిరి టక్కరితనంతో ఏమీయ్యికుండానే యీ తివాసీ కాజెయ్యాలి అనుకుంది మనసులోపల.

వాడిని తన మేడమీదకి తీసుకుపోయి అక్కడ ఉన్న వింతలన్నీ చూపించింది. వాడి బుగ్గలమీద వేళ్లు విరిచి – "గట్టివాడివే!" అని నవ్వుతూ కంబళిని పరిచి చూపించమంది. వాడు దాని విలాసాలకు లొంగిపోతూ, ముసి ముసి నవ్వులు నవ్వుతూ కంబళిని పరిచి చూబించాడు. దాని అందానికీ, పనితనానికీ మురిసిపోతూ – "సొగసుకాడా! దీన్ని ఎవరు అల్లారు? దీనివెల ఎంత?" అని అడిగింది.

"నేనే అల్లాను. ఎవడో అల్లింది నేనెందుకు తెస్తాను? దీనివెల నూరు మాడలు" అన్నాడు వాడు "బాలుడా! మేం ఎవరిమో తెలుసా? వెలయాళ్ళం. మేము ఇతరులకు వెల ఇవ్వం."

"మరేమిటిస్తారు?" "ఏంకావలసినా ఇస్తాం. నీకేం కావాలో అదే తీసుకో" అని కవ్విస్తూ నవ్విందామె

"నువ్వేకావాలి నాకు."

"అందుకు నేను సిద్ధమే. ఈ కంబళిని ఇక్కడే ఉంచి రాత్రికి రా" అంటూ చెయ్యిపట్టుకుని మృదువుగా నొక్కింది. వాడి వొళ్ళు ఝల్లుమంది. యౌవన ఆరంభంలో ఉన్నవాడికి మదనవికారం కలిగింది. "రాత్రికి వొస్తాను. ఇది నీకు ఊరికే యిస్తున్నాను తీసుకో. అమ్మకానికి మరొకటి అల్లుతాను" అని బసకి వెళ్ళి పోయాడు.

తోటివాళ్ళు - "తివాసీ అమ్మావా?" అని అడిగితే వాడు నవ్వుతూ - "వింతలు చూశాను. రేపు చెబుతాను. రాత్రి మళ్ళీ అక్కడికి పోవాలి. మనకొండలకంటె ఎత్తయిన మిద్దెలు చూశాను. ఎన్నో బొమ్మలు పక్క పక్కన వేలాడ గట్టారు. వాటి అందం చూసి తీరవలసిందే. బోగంది మంచి కులాసా చేసింది" అంటూ గొప్పగా చెబుతూ రాత్రి కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూడసాగాడు.

సూర్యాస్తమయం అయింది. పువ్వులూ, ఆకులూ అదీ తెప్పించాలనుకుంటూంటే రత్నాంగికి తలనొప్పీ, చలీజ్వరం వచ్చాయి. భోజనం కూడా చేయలేక పోయింది - 'అయ్యో! కిరాతపుత్రుణ్ని రమ్మన్నాను. నాడు వచ్చే వేళయింది. శరీరం అస్వస్థతగా ఉంది. మాట్లాడడానికే నాకు ఓపికలేదు. ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తూంటే తనింట్లో ఉన్న వెర్రిది గుర్తొచ్చింది. ఆమెను పిలిచి -

"ఎంతో వింతగా ఉన్న ఈ తివాసీ చూశావా? ఇది ఎంతో విలువ కలది. మన చావడికే కొత్త అందం తెచ్చింది. ఒక బాలవిటుడు దీన్ని కానుకగా తెచ్చాడు. వాణ్ని ఈ రాత్రికి రమ్మన్నాడు. ఇంతలో నాకు ఉష్ణం వచ్చింది. ఆ బాధకి తాళలేకపోతున్నాను. నువ్వొక ఉపకారం చెయ్యాలి.

వాడు కుర్రాడు. మీసకట్టయినా సరిగా రాలేదు. మాటలతో అయినా సంతోష పెట్టొచ్చు. ఈ రాత్రి వాడిని పడకకు రమ్మన్నాను. రెండుగడియలు ఎలాగో వాడితో ముచ్చట్లాడి సాగనంపేయ్. నువ్వు మాత్రం ఆడదానివి కావా? ఈ పాటి ఉపకారం చెయ్యి. మంచి వస్తువు దక్కుతుంది" అని బతిమాలింది.

ఆ తివాసి చూడడంతోటే పద్మినికి పూర్వస్మృతి కలిగింది. 'ఓహో! ఇది నా భర్త అల్లి ఉండాలి. మాకు తప్ప మరెవరికీ ఈ పనిరాదు. ఇది తెచ్చిన పిల్లవాడెవరో చూసి వాడి ద్వారా నా భర్త వివరాలు తెలుసుకుంటాను – ఈ వేశ్య యింట్లో ఉంటే దుష్కార్యాలకి ప్రోత్సహించక మానదు. ఇక్కడ ఉండడం నాదే తప్పు. అనుకుంటూ ఏమీమాట్లాడక ఆ కంబళినే చూస్తూ ఉండి పోయింది.

ఆమె మెత్తబడిందని గ్రహించి, రత్నాంగి – "ఇటురా! ఆ పెట్టెలో నగలున్నాయి. పెట్టుకో. మంచి చీర కట్టుకుని అలంకరించుకో. చమత్కారంగా మాట్లాడు. నీని వలపు చూబించు వాడికి వేడుక కలిగించు" అంటూ వేశ్యాధర్మాలు బోధించింది.

పద్మిని అవేవీ వినకుండా తన సహజవేషంతోనే మేడమీద గదిలోకి పోయింది. రత్నాంగి తనబాధలో అదిగమనించలేదు. చెంచుబాలుడు తలరుమాలు చుట్టి, పంచెకట్టి, పిట్టరెక్కల కుచ్చుటోపీ పెట్టి, వెండి మొలతాడు బిగించి వయ్యారంగా నడుస్తూ వచ్చాడు. ద్వారం దగ్గరున్న దాసి వాడిని మేడమీదకు తీసుకుపోయింది. వాడు ఆ గది నాలుగు మూలలూ చూసి పద్మినివంక తలూపి ... ఒక పీరంమీద కూర్చున్నాడు.

అతని ఆకారం ... ముఖంలో గురుదత్తుడి పోలికలు చూసి ఒళ్ళు ఝల్లుమని పాలుచేపుకి రాగా "బాలుడా! నీకులమేది? నీ తల్లితండ్రులెవరు? కాపరం ఎక్కడ? ఇక్కడి కెప్పుడొచ్చావ్?" అంది.

**చిరతపులి** : నువ్వెవరివి? సాయంకాలంనాతో మాట్లాడిన భోగందానివి కావా?

**పద్మిని** : అది వొస్తుందిలే. నే నడిగిన ప్రశ్నలకి జవాబు చెప్పు.

**చిరతపులి** : మేం చెంచువాళ్ళం. కోయపల్లె మా కాపరం. నాకు తల్లిలేదు. నా తండ్రి చెంచు. చాపలమ్మాలని మొన్న ఈ వూరు వచ్చాం. నా పేరు చిరతపులి. పులి అని కూడా పిలుస్తారు.

**పద్మిని** : ఓహో! ఈ తివాసి ఎవరు అల్లారు?

చిరతపులి : నేనే అల్లాను.

పద్మిని : చక్కగా అల్లావు. నీకీపని ఎవరునేర్పారు?

చిరతపులి : ఎవరూ నేర్పలేదు. నాబుద్ధి బలంతోనే స్వయంగా నేర్చుకున్నాను.

పద్మిని : కోయపల్లె అంటే – ఆ కొండల మధ్యన ఉంటే కొండపల్లికి ఎంతదూరంలో ఉంది?

చిరతపులి : నాలుగు క్రోసుల దూరంలో ఉంటుంది. దానిని నువ్వెలా ఎరుగుదువు?

పద్మిని : ఒకప్పుడు అక్కడికి వచ్చాంలే – నీకీ చిరతపులి పేరు ఎలా వొచ్చింది?

చిరతపులి : అది రహస్యం. మా తండ్రి ఎవరికీ చెప్పవొద్దన్నాడు.

పద్మిని : మీ వూళ్లో అయితే చెప్పకూడదు. ఇక్కడ చెప్పినా దోషమేమీ ఉండదు.

చిరతపులి : ఐతే చెబుతాను విను. ఒకనాడు మా తండ్రి చెంచుడు లోయలో తిరుగుతూంటే నన్నొక చిరతపులి నోట కరుచుకుని – నేనేడుస్తూంటే – పరుగెత్తుకుంటూ ఎక్కడికో పోతూందట. మా తండ్రి ఆ పులిని చూసి జడవకుండా బాణంవేసి దాన్ని చంపి నన్ను మెల్లగా దానినోటిలోంచి తీసి తన పల్లెకు తీసుకుపోయి పెంచుకున్నాడట. ఒకసారినాకీ కథ చెప్పి ఎవరికీ చెప్పొద్దన్నాడు. చిరతపులి నోటినుంచి కాపాడబడ్డాను కదా. అందుకని నాకు చిరతపులి అని పేరు పెట్టాడు.

పద్మిని అంతా విని 'హా' పరమేశ్వరా!' అంటూ గొల్లున ఏడవసాగింది.

చిరతపులి : ఏమమ్మా.. నా మాటలు విని అలా ఏడుస్తావేం? నీ కంత కష్టంగా ఉందా?

పద్మిని : నిన్ను చూస్తే దుఃఖమొస్తూంది నాయనా. విధి ఇలా రాసి పెట్టాడా! అయ్యో ...

చిరుతపులి : తల్లీ! నన్ను చూస్తే నీకు దుఃఖం ఎందుకు రావాలి? విధి

ఏం రాశాడో చెప్పు. నేను ముచ్చటపడి ఇక్కడికి వొస్తే దుఃఖం చూపుతావేమిటీ?

పద్మిని : పుత్రా! మరేమీకాదు. నువ్వు చిన్నవాడివి. నీతి నియమాలు నేర్చుకోవలసిన వాడివి. ఈ వయసులోనే నువ్విలాటి చెడ్డపనికి పూనుకొన్నావని దుఃఖం వొచ్చింది. అంతే.

*చిరతపులి* : (ఆశ్చర్యపడుతూ) ఇది దుష్టకార్యమా! భోగంవాళ్ళతో కలిస్తే తప్పులేదని మా పల్లెలో వాళ్ళు చెబుతారే! వీళ్ళకి ఆటపాటలు బాగా వస్తాయట. తప్పు చెయ్యడం నా కిష్టంలేదు. కాని - ఎందుకు తప్పో...ఎలా తప్పో చెప్పు.

అప్పుడు పద్మిని ఒక పద్యం

**కం. జారభట చోర చేలుక**
**చార నట ప్రభృతి నీచ జన నిష్ఠీవా**
**ధర శరావము వార**
**స్త్రీ రమ్యాధరము సంస్మరింతురె కులజుల్.**

చదివి -

"వేశ్యంటే మన్మథాగ్ని. గణికాసంగమం దూష్యం. ఆయుక్షీణం. రోగకారకం. ధనహానికరం." అంటూ జారత్వం వలన సంక్రమించే నష్టాలను అతని మనసుకి హత్తుకునేలా అతి చక్కగా, ప్రతిభావంతంగా చెప్పింది.

వాటిని వినీ వినగానే ఆ బాలుడు ఆమె పాదాలమీద పడి - "తల్లీ! నువ్వు నాకు ఎంతో మంచి మాటలు చెప్పావు. నాకు నీ నీతులు ఎంతో ఆనందం కలగజేశాయి. ఇది మొదలు ఇలాటి పనులు ఎప్పుడూ చెయ్యను. నువ్వెంతో పండితురాలిలా ఉన్నావు. ఈ బోగంది నీకేమవుతుంది? ఇక్కడ ఉండికూడా ఇలాగ చక్కనినీతులు ఎలా చెప్పావు? నీ వృత్తాంత మేమిటి?" అని అడిగాడు.

అందు కామె - "పుత్రా! నాకీ బోగంది చుట్టమేమీ కాదు. నేనొక పాపాత్మురాలిని. నా వృత్తాంతంతో నీకేంపని? నేను నీకొక

రహస్యం ఉపదేశిస్తాను. ఎవరికీ తెలియనివ్వకు" అని ఒక్కసారాగి – నువ్వు ఉత్తమ కులంలో పుట్టిన వాడివి. నీ మాటల వల్లనే కిరాతకులకు పుట్టలేదని తెలిసింది కదా. నిన్ను కన్నతల్లి ఏమైందో తెలియదు. నిన్ను చూస్తే జాలేస్తూంది. నీకొక ఉత్తరం రాసిస్తాను. అది ఎవరికీ చూబించకు.

తూర్పు దేశంలో ఉన్న రామదుర్గం అనే నగరానికి పోయి అక్కడ కుముదాంగదుడనే వైశ్యుని ఇంటికి వెళ్ళు. వానికే యీ ఉత్తరం ఇవ్వు. అతను లేకపోతే అతని భార్యకివ్వు. ఇతరులకి చూబిస్తే ప్రమాదం సుమీ. నీ పుణ్యం కొద్దీ వాళ్ళు జీవించి ఉంటే నిన్ను కన్న కొడుకులా చూసుకుని పోషించి వారి సంపద అంతా నీకే ఇస్తారు. నువ్వు సుఖపడగలవు" అంది.

అతను చాలా సంతోషించి – "అమ్మా! మా తల్లిని నేనెరుగను కదా. నువ్వే నాకు తల్లివి. నేను గొప్పవంశంలో పుట్టానన్నావే నన్నెలా ఎరుగుదువు?" అని అడిగాడు.

"ఆ మాటలేవీ అడగకు. నిన్ను చూస్తే నాకు అలా తోచింది. నేను చెప్పినట్లు వింటే నువ్వు భాగ్యవంతుడివి కాగలవు" అందామె.

"అమ్మా! ఊరికే సిరిసంపదలు వొస్తా నంటూంటే వొద్దనేవా డుంటాడా? ఈ రహస్యం ఎవరికీ చెప్పను. నువ్వు ఉత్తరం రాసివ్వు" అన్నా డతను.

ఆమె వెంటనే – "ఓ పుణ్యాత్ములారా! ఈ ఉత్తరం తెచ్చిన పిల్లవాడు మీ మనవడు. వీడిపేరు మృగదత్తుడు. వీడిని కాపాడి కులవృద్ధి చేసుకోండి. మీ కూతురూ అల్లుడూ చనిపోయారు. వాళ్ళకోసం విచారించి ప్రయోజనం లేదు. వీడికి విద్యాబుద్ధులు నేర్పించి వృద్ధిలోకి తీసుకురండి." అని ఉత్తరం రాసిచ్చి వాని తలని ముద్దాడుతూ –

"తండ్రీ! పొరపాటునయినా వెలయాలి ఇంటికి పోకు. పరులకు హింస కలిగించకు ఈ ఉత్తరం ఇతరులకు చూపకు" అంటూ పదే పదే చెప్పి – తెల్లవారకముందే అవతలకి పంపించేసింది.

పొద్దుట రత్నాంగి పద్మినిని మెచ్చుకుంటూ – "జాణవే! ఏమైనా సొమ్ములాగావా?" అని అడిగింది. పద్మిని మాట్లాడకుండా

ఆమెముందునుంచి అవతలికి తొలగి పోయి – 'ఛీ' పాము కరచి మగడు చనిపోయినప్పుడే నేనూ చావక ఇన్నాళ్ళెందుకు బతికాను. వేశ్యని కూడా పిలిపించుకున్నాను. కీడులో కొంత మేలు. కొడుకుని చూశాను. ఐహిక భ్రమవదిలింది. అయ్యో! కొన్నాళ్ళు ఉండమనకుండా పంపేశానే! ఎందుకులే. నా అవస్థకి వాడు బాధపడతాడు. నన్ను వేశ్య అనుకుంటాడు. మంచి పనే చేశాను. ఇంక నేను చావక చేయవలసిందేముంది? అడవికి పోయి ఎలాగో చస్తాను." అనుకుని ఎవరికీ చెప్పకుండా అప్పటికప్పుడే ఇల్లు వదిలి అడవిదారిని పడి నడిచి పోసాగింది.

ముళ్ళకంపలు, రాళ్ళు – రప్పలు, తుప్పలు వీటినీ లెక్క చెయ్యకుండా అడవిలో పోతూంటే – ఒకచోట దావాగ్ని మండుతూ కనిపించింది. ఆమె దానిలో దూకబోయేసరికి కుండలతో నీళ్ళు వొంపుతున్నట్లు వర్షం కురిసి ఆ అగ్ని కాస్తా చల్లారిపోయింది. పద్మినికి కొంచెమయినా వేడి తగిలింది కాదు. ఆమె నాలుగుమూలలా చూసి – 'అయ్యో! నన్ను దైవం చంపడం లేదు. ఇంకా ఎన్ని కష్టాలు పెడతాడో. అనుకుంటూ పోయి పోయి ఒక గొల్లపల్లె చేరింది. అప్పు డామెకు మళ్ళీ బుద్ధి స్వస్థత తప్పిపోయింది. అక్కడ ఒక గొల్లవారి ఇంట్లోవాడు చెప్పిన పనులన్నీ చేస్తూ కాలం గడపసాగింది.

అంతవరకూ చెప్పి ఆగాడు మణిసిద్ధుడు. ప్రయాణానికి వేళయిందని శిష్యుణ్ని హెచ్చరించాడు. గోపాలుడు కావడిని భుజాని కెత్తుకున్నాడు. ఇద్దరూ నడచి నడచి మరుసటి మజిలీ చేరారు.

# కాశీ మజిలీ కథలు

## 121. వ మజిలీ

### ఉదయార్కుడి కథ

"ఆహా! ఆమె ఎవరోకాని చాలామంచిది. నేనీ బోగందాని ఇంటికి రావడం తప్పనుకోలేదు. మోసపోయాను. ఎంతో విలువైన తివాసీని వొదులుకున్నాను. అయినా మంచి మాటలు వినగలిగాను. అదీమంచిదే. నేను ఉత్తమ కులంలో పుట్టానట! ఈ ఉత్తరంవల్ల కొంతలాభం కలుగుతుంది. అయ్యో! నాకు చదువు రాకపోదంవల్ల దీనిలో ఏం రాశారో తెలియదు. పరులకు చూబించ వొద్దంది. సరే ముందు చదువు నేర్చుకుని, ఈ ఉత్తరం చదువుకున్న తరవాతే రామదుర్గనగరం వెళ్తాను. ఇక కోయల సహవాసం విడిచిపెడతాను' అని నిశ్చయించుకుని కనుచీకటి ఉండగానే ఊరిబయట ఉన్న గుడిసెల వద్దకు పోయాడు మృగదత్తుడు.

అక్కడున్న కోయలు – "చిరతపులీ! రాత్రి ఎక్కడికి పోయావు? నీ కోసం పురమంతా వెదికాము. ఆతివాసీని అమ్మేవా? మన తివాసీలు రాజుగారు చూసి మెచ్చుకుని పెద్ద తివాసీ తామే కొంటామని, నిన్ను తీసుకు రమ్మన్నారట. రాజభటులు వొచ్చిపోతున్నారు. నీ అదృష్టంమంచిది" అన్నారు. అందుకతను – "నన్ను పులి అని పిలవకండి. నా పేరు మృగదత్తుడు పెద్ద తివాసీ అమ్మేశాను. రాత్రి ఎక్కడికో పోయాను –" అంటూాండగానే రాజభటులు కొందరు వచ్చారు.

"తివాసీలు అమ్మిన పిల్లవాడు ఇతనే" అని కోయలు చెప్పేసరికి వాళ్ళు – "నీకోసం రాత్రినుంచి తిరుగుతున్నాం. ఎక్కడికి పోయావు? పెద్ద తివాసీ ఉందా, అమ్మేశావా? పదపద. రాజుగారు నిన్ను తీసుకురమ్మన్నారు" అంటూ అతన్ని కొలువుకి తీసుకు పోయారు.

ఇంద్రనీలంలా మెరుస్తున్న దేహఛాయ, ఆకర్ణాంత విశాల నేత్రాలు, పొడవైన చేతులు కల మృగదత్తుణ్ణి చూసి రాజు – 'వీడు కోయవాడా! ఎంత విచిత్రం!' అనుకుంటూ పరికించి చూశాడు.

రాజు : ఓరీ! నీ పేరేమి?

మృగదత్తుడు : మృగదత్తు డంటారు స్వామీ.

రాజు : వింత తీవాసీలు అల్లింది నువ్వేనా?

మృగదత్తుడు : నేనే స్వామీ.

రాజు : ఈ పని నువ్వెక్కడ నేర్చుకున్నావు?

మృగదత్తుడు : నాకెవరూ నేర్పలేదు స్వామీ. నా బుద్ధి బలంతో ఊహించి అల్లాను.

రాజు : నువ్వు చదువుకున్నావా?

మృగదత్తుడు : లేదు స్వామీ లేదు.

రాజు : ఎందుకని చదువుకోలేదు?

మృగదత్తుడు : చెప్పేవారు లేక స్వామీ.

రాజు : నువ్వు తరచు ఎక్కడ నివసిస్తావు.

మృగదత్తుడు : కొండల మధ్య స్వామీ.

రాజు : నీతల్లి తండ్రు లిక్కడికి వచ్చారా?

మృగదత్తుడు : లేదు స్వామి.

రాజు : నిన్న అద్భుత మయిన తివాసీ తెచ్చావట ఏం చేశావు?

మృగదత్తుడు : రత్నాంగి అనే బోగంది తీసుకుంది స్వామి.

రాజు : ఎంత వెల ఇచ్చింది?

మృగదత్తుడు : ఏమీ ఇవ్వలేదు. ఊరికే తీసుకుంది స్వామీ.

రాజు . ఎందుకని?

మృగదత్తుడు : (సిగ్గుపడుతూ) ఏమో తెలియదు స్వామి.

రాజు : తెలిసింది. విటుడివై వెళ్ళావు కాబోలు. నిజం చెప్పు.

తప్పుంటే దాన్ని దండిస్తాను. అప్పుడే అక్కడికి రత్నాంగి వచ్చి రాజుకి నమస్కరించి ఫిర్యాదు ఒకటి అందించింది. "మహారాజా! నిన్నరాత్రి చిరతపులి అనే కోయవాడు మా యింటికి విటుడిగా వచ్చి తాను అల్లిన తివాసీ నొకదానిని ఇచ్చి నా కూతుర్ని భోగినిగా కోరి రాత్రి మా యింట పడుకుని, తెల్లవారకముందే – సకలలంకారాలతోనూ దాన్ని తీసుకు పోయాడు. ఎక్కడ దాచాడో తెలియదు. దేవరవారు నన్ను కటాక్షించి వాడిని దండించి నా పుత్రికని ఇప్పించమని ప్రార్ధిస్తున్నాను" అని ఉంది దానిలో. అది చదివి – "చిరతపులి నీకూతుర్ని ఎత్తుకు పోతే మే మేం చేస్తాం? తినేసి ఉంటుంది –" అని పరిహాసమాడి – "మృగదత్తా! ఇలాగ తివాసీలల్లే వాళ్ళు మీలో చాలా మంది ఉన్నారా?" అని అడిగాడు. అందుకు వాడు – "నాకు తప్ప మరొకరికి ఈ విద్య తెలియదు స్వామీ" అన్నాడు.

"మహాప్రభూ! వీడే రాత్రి మా యింటికి వొచ్చి నా కూతుర్ని ఎత్తుకుపోయినవాడు" అంది రత్నాంగి.

రాజు : "వీడి పేరు చిరుతపులా? మృగదత్తుడా?"

రత్నాంగి : చిరుతపులి అని నాతో చెప్పాడు రాజా.

రాజు : మృగదత్తా! నీకు రెండు పేర్లున్నాయా?

మృగదత్తుడు : నా మొదటి పేరు చిరుతపులే. తరవాత మృగదత్తుడని చెప్పుకుంటున్నాను. ఒక కారణంగా.

రాజు : నువ్వు ఈ రత్నాంగి మాటలు విన్నావు కదా? దాని కూతురు నెందుకు ఎత్తుకెళ్ళావు? నిజం చెప్పు.

మృగదత్తుడు : రామరామ! నేనేమీ ఎరుగను. అది బొంకుతూంది.

రాజు : అడవివాళ్ళు అసత్యం ఆడరు. నువ్వే బొంకుతున్నావు. రత్నాంగీ! వీడి తివాసీని అన్యాయంగా తీసుకున్నావట. తీసుకురా. లేకపోతే నిన్ను శిక్షిస్తాను.

రత్నాంగి : ఓరీ! నిన్న సాయంకాలం....

మృగదత్తుడు : ఆగు. నేను కోయవాడినికాను. ఉత్తమ కులస్తుడిని. ఓరి అనకు.

రత్నాంగి : తివాసీ తీసుకుని మాయింటికి వచ్చావా?

మృగదత్తుడు : వచ్చాను.

రత్నాంగి : నీ పేరు చిరుతపులి అని చెప్పావా?

మృగదత్తుడు : చెప్పాను. అప్పటికి నా పేరు అదే.

రత్నాంగి : రాత్రి మాయింటికి పడకకు వస్తానని చెప్పేవా?

మృగదత్తుడు : నేను చెప్పలేదు. నువ్వే రాత్రికి రమ్మన్నావు.

రత్నాంగి : ఎలా ఐతే ఏం. రాత్రి మా యింటికి వచ్చావా, లేదా?

మృగదత్తుడు : వచ్చాను.

రత్నాంగి : నా కూతుర్ని నీ దగ్గరకు పంపానా, లేదా?

మృగదత్తుడు : కూతురో ఎవరో తెలియదు. ఒకతె నా గదిలోకి వచ్చి కూర్చుంది.

రత్నాంగి : అది నీ ఇష్టం చొప్పున మెలిగిందా?

మృగదత్తుడు : లేదు.

రాజు : మరేం చేసింది?

మృగదత్తుడు : దేవా! వినండి ఆమె ఉత్తమ ఇల్లాలు (అంటూ ఉత్తరం గురించి తప్ప జరిగినదంతా చెప్పాడు)

రాజు : రత్నాంగీ! ఆమె నీకూతురేనా? నిజం చెప్పు.

రత్నాంగి : కడుపున పుట్టింది కాదు. పెంచుకున్నాను.

రాజు : ఎన్ని సంవత్సరాల వయసులో? దాని తల్లితండ్రు లెవరు?

రత్నాంగి : ఏడెనిమిదేళ్ళవుతూంది. దాని తల్లితండ్రులు ఎవరో నాకు తెలియదు. వీధిన పడిపోతూంటే పిలిచి అన్నవస్త్రాలిస్తూ పోషిస్తున్నాను. అది వట్టి వెర్రిది. చెప్పిన పని మాత్రం చేస్తుంది.

రాజు : ఇంతకు మునుపు లంజరికానికి పంపావా?

రత్నాంగి : లేదు ఆ అవసరం రాలేదు. నిన్న నా ఒంట్లో స్వస్థత లేక దానిని పంపవలసి వచ్చింది.

రాజు : నగలు అలంకరించే పంపావా?

రత్నాంగి : పదివేల విలువ చేసే నగలతో అలంకరించాను.

మృగదత్తుడు : లేదు స్వామీ. ఒక్క నగయినాలేదు. మాసిన గుడ్డ కట్టుకుని మూలకూర్చుంది. వెర్రిది కాదు. ఎలాటి పురాణాలు చెప్పింది! పద్యాలు చదివింది!

రాజు : రత్నాంగీ! వీడిమాట అబద్ధమా?ఆమె సింగారించుకోగా నువ్వు చూశావా! గుర్తుచేసుకుని చెప్పు.

రత్నాంగి : జ్వరంగా ఉండడం వల్ల నేను చూడలేదు. అలంకరించుకుని వెళ్ళమనిమాత్రం చెప్పాను.

రాజు : మరి – నీ పిర్యాదులో పదివేల విలువగల నగలతో తీసుకు పోయాడని వ్రాయించావే? చూడకుండా ఎలా రాయించావు?

రత్నాంగి : నగలు ధరించే ఉంటుందని అలా వ్రాశాను.

రాజు : నీ మాటలలో పరస్పర విరుద్ధాలు చాలా ఉన్నాయి. నువ్వు చెప్పేదంతా అసత్యం ఉత్తమ ఇల్లాలిని చెడ్డపనికి నియోగించావు. చెయ్యని అపరాధాన్ని ఫిర్యాదు చేశావు. ఈ రెండు తప్పులకీ నువ్వు శిక్షించదగిన దానిని. వెయ్యి నిష్కాములు ఇచ్చుకొనేటట్లు నీకు శిక్షవిధించాం. అది చెల్లింపకపోతే రెండేళ్ళు కారాగారవాసం అనుభవించాలి. వీడి తివాసి వీడి కిచ్చెయ్యి.

అని రత్నాంగికి శిక్షవిధించాడు. రాజభటులు దాన్ని గెంటుకుంటూ వెళ్ళి శిక్షాధనం, తివాసీ తీసుకు వచ్చి రాజుకు ఇచ్చారు.

'రాజు పక్షపాతం చూపి నాకు శిక్షవిధించాడు. తివాసీ తీసుకుందుకు ఇంత పన్నాగం పన్నాడు. సర్లే. పై అధికారులు లేరా? భూమంతటనీ ఇత నొక్కడే పాలిస్తున్నాడా? పైవాళ్ళ దగ్గకిపోయి న్యాయం పొందుతాను – అనుకుంటూ ఉదయార్కుడిపై అధికారం కల గజేంద్రవాహనుడనే రాజువద్దకు వెళ్ళింది. ఆమె తన జరిగిన అన్యాయాన్ని తెలియజేయగా, గజేంద్రవాహనుడు విచారణకు తన సామంతుడైన సుమేధుని వద్దకు పంపాడు.

అంతవరకూ చెప్పి, కథ ఆపి ప్రయాణానికి బయలు దేరమన్నాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 122 వ. మజిలీ

### సుమేధుని కథ

గజేంద్రవాహనుడు సామంత చక్రవర్తి. అతని అధికారం కింద ఏభయ్యారుగురు సామంతరాజు లున్నారు. వారు చేసే న్యాయా న్యాయాలను విచారించే అధికారం అతనికి ఉంది. అతను – చాలా బుద్ధిశాలి అయిన సుమేధుడనే సామంతరాజుని నేరవిచారణకు నియమించాడు. సుమేధుడికి నూరుగ్రామాలు ఇవ్వడం వలన అతన్ని కూడా రాజు అనే అంటారు. ధర్మాత్ముడైన సుమేధుడు చేసిన తీర్పులని తదుపరి విమర్శించకుండానే గజేంద్రవాహనుడు స్థిరపరుస్తూ ఉంటాడు.

రత్నాంగి తన అభియోగం సుమేధుడి వద్దకు పంపబడిందని తెలుసుకుని అతని పట్నమైన విద్యానగరానికి వెళ్ళింది. ఆమె యౌవన మధ్యంలో ఉన్నా అలంకారాలవల్ల చిన్నదానిలా కనపడుతూ ఉంటుంది. ఆటపాటలలో నైపుణ్యం లేకపోయినా విటులనుంచి విత్తం సంగ్రహించడంలో మంచి నేర్పరి. విటులను రంజింపజేసే వగలు, టక్కులు దానికి బాగా తెలుసు. విద్యానగరంలో పుష్పవేణి అనే వారకాంత ఇంట్లో ఆమె బస చేసింది. దానికి తన వృత్తాంతం చెప్పుకుని కన్నీరు కార్చుతూ –"ఉదయార్కుడు తివాసీకోసం నాకు అన్యాయంగా శిక్షవిధించాడు. ఈ మచ్చ మాపుకోకపోతే నేను ఆ వూళ్ళో కాపరం చెయ్యలేను ఈ సుమేధుడు ఎలాటి వాడో తెలియదు. నీకు అతను తెలుసా? అతనికి ఎన్నేళ్ళు? భార్యాపుత్రులు ఉన్నారా? రసికుడేనా?" అంటూ అడిగింది.

అందుకు పుష్పవేణి – "సుమేధుడు ధర్మ స్వరూపు డంటారు. విహారం చేస్తూంటే చూశాను. చాలా చక్కనివాడు. పరస్త్రీలను కన్నెత్తి

చూడడు. న్యాయం చెప్పడంలో అతని బుద్ధి బృహస్పతిని మించిందంటారు. అతనికి అన్ని దర్మసూక్ష్మాలూ తెలుసునట. అందుచేత న్యాయమే చేస్తాడు. నువ్వు విచారించి నక్కరలేదు" అంది. "ఎల్లుండి నా నేరం పరీక్షిస్తారట. సాక్షులతో రమ్మన్నారు. పరిచారిక ఒకతె సాక్షిగా ఉంటుంది. రెండవ సాక్షిగా నువ్వొచ్చి నాగౌరవం గురించీ, నీతి గురించీ చెప్పాలి" అని రత్నాంగి బతిమాలింది. ఆమె సరే అంది.

నిరూపణ దినంనాడు రత్నాంగి ఇద్దరు సాక్షులతోనూ రాజసభకి పోయింది. సుమేధుడు ఆమెను చూసి – "రత్నాంగివి నువ్వేనా? ఉదయార్కుడు నీ మీద రెండు నేరాలు మోపి నీకు శిక్ష విధించాడు. ఆ అపరాధాలు చెయ్యలేదని ఎలా ఖండించి చెబుతావు?" అని అడిగాడు.

అందు కామె ఇలా అంది. "దేవా! నేను వారకాంతను. వారు ఒకప్పుడు వర్తమానం పంపగా నేను వారివద్దకు వెళ్ళలేక పోయాను. నా మీద వారికి ఆ కోపం మనసులో ఉంది. మీరెరుగని ధర్మమేముంది. నేను కొన్న తివాసీని వారు ఊరికే తీసుకున్నారు. వస్తులోభంతో నామీద నేరం నిరూపించి శిక్షించారు. నేను నా కులవృత్తి ప్రకారమే చేశాను. అది తప్పంటే మేం ఏం చెయ్యగలం?" అంటూ ఏడిచింది. రాజు ఆమెను "అడిగిన మాటకే జవాబు చెప్పు. ఇతర ప్రసంగాలు చెయ్యకూడదు. నీ కులవృత్తిని అతనేమీ అనలేదు. కాని యోగ్యమయిన శీలంకల ఒక స్త్రీని వ్యభిచారినికి నియమించావే. అది ఒక తప్పు. గుణ సంపన్నుడైన కోయబాలుడిమీద – నీ కూతురిని తీసుకు పోయాడని నేరం మోపడం రెండోతప్పు. ఈ రెండు తప్పులకే నిన్ను ఉదయార్కుడు శిక్షించాడు. ఇందుకు నువ్వేం చెబుతావో చెప్పుకో." "దేవా! భోగంవాళ్ళు ఇతర జాతుల బాలికలను తెచ్చుకుని పెంచడం ఆచారమే. నేనూ అలాగే ఆమెని పెంచాను. దానికి ఆ కుర్రాడు తివాసీని సుకంగా ఇచ్చి ఇల్లు దాటించేశాడు. నేను నిజమైన అపరాధమే వాడిపై మోపాను. తివాసిని తీసుకుందుకే నా కా శిక్ష విధించారు తండ్రీ!" అని రత్నాంగి మొరపెట్టుకుంది.

సుమేధుడు న్యాయవాదులతో చర్చించి – "తివాసీతో కూడా ఆ పిల్లవాణ్ని పంపమని రాశాం కదా? పంపించారా?" అని కింద ఉద్యోగి నడిగాడు.

"పిల్లవాడు రాలేదు. తివాసీని పంపారు. వాడు ఆ తివాసిని అమ్మి ఆ రోజే కొండలలోకి పోవడం వల్ల పిలిపించడానికి ఆలస్యం ఔతూందనీ, కొంచెం వ్యవధిస్తే పంపగలమనీ రాశారు."

సుమేధుడు తివాసీని తెప్పించమనగా పరిచారకుడు తెచ్చి దానిని పరిచాడు ఆ అల్లిక, రంగుల మేళవింపు, ఆ చక్కదనం, మెరుగూచూసి ఎంతో ఆశ్చర్యపోతూ, బాగా పరీక్షగా చూసి చూసి – కళ్ళు మూసుకుని కొంతసేపు దీర్ఘంగా ఆలోచించాడు.

అప్పుడు రత్నాంగి మొహంచూస్తూ "మృగదత్తుడు ఈ రత్నాసనాన్ని తనే అల్లానని నీతో చెప్పాడా? ఈ పని అతని కెవరు నేర్పారో అడిగావా?" అన్నాడు.

ఆమె సమాధానంగా – "దేవా. అది వాడు అల్లినమాట వాస్తవం. పని ఎలా నేర్చుకున్నాడో నాతో చెప్పలేదు. ఉదయార్కుడితో చెప్పాడేమో నాకు తెలియదు" అంది. అప్పుడతను ఆ ఫిర్యాదుకి సంబంధించిన పత్రాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించాడు. కోయపల్లెలో ... ఆ అల్లికని బుద్ధిబలంతో నేర్చుకున్నట్లు వాటినుంచి తెలిసింది. "మృగదత్తుడిని సాధ్యమైనంత త్వరగా ఇక్కడికి పంపవలసింది. వానినుంచి కొన్ని సంగతులు తెలుసుకోవలసి ఉంది" అని వ్రాయించి సుమేధుడు గజేంద్రవాహనుడి రాజు ముద్రికలు వేయించిన పత్రాన్ని ఉదయార్కుడి దగ్గరకు పంపాడు.

"మరి కొన్ని దినాలు గడువిచ్చాం. మృగదత్తుడి సాక్ష్యం అవసరమైంది వాడిని రప్పించడానికి ఉత్తరం పంపాం. అప్పటికి నువ్వురా" అని రాజు అప్పటికి రత్నాంగిని పంపించేసి మృగదత్తుడి రాకకోసం ఎదురు చూడసాగాడు. ఉదయార్కుడు గజేంద్రవాహనుడి శాసనపత్రిక చదువుకుని తొందర పడుతూ – మృగదత్తుడు కనపడగానే పట్టుకుతీసుకు రమ్మని చాలామంది దూతలని గిరిజనపల్లెకు పంపాడు

# కాశీ మజిలీ కథలు

## 123. వ మజిలీ

### గదాధరుడి కథ

ఉ. విద్య నిగూఢగుప్త మగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశ బంధుఁడున్
విద్య విశిష్ట దైవతము విద్యకు సాటి ధనంబు లే దిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగని వాఁడు మర్త్యుఁడే.

"ఆహా! విద్య ఎంత గొప్పది! చదువుకోలేక ఎంత మూర్ఖుడి నయ్యాను. ఆ ఇల్లాలు చెప్పకపోతే ఏమీ తెలిసేది కాదు కదా! ఇప్పుడు – చదువుకోడంవల్ల ఎన్ని గ్రంధాలు చూడడానికి వీలవుతూంది. నాలుగు మాసాల్లోనే చదవడం రాయడం పట్టుపడింది. ఆమె చీటిలో రాసిన విషయాలు అర్ధమయ్యాయి. 'నా తల్లి తండ్రులు చనిపోయారట. అక్కడ ఉన్నవారు నా తల్లికి తల్లితండ్రులట! ఆమెకి నా వృత్తాంతం ఎలా తెలిసిందో! ఆమె ఎక్కడికి పోయిందో తెలియదు. ఇక నేను రామదుర్గం పోవడం మంచిది. బంధువులని కలుసుకుంటాను. కాని..అయ్యో! నన్ను కోయవాడని నిరసించి నిందిస్తారేమో వేషం మారుస్తాను' అని భావించి మంచి వేషం ధరించి ఒకమార్గం ద్వారా నడవసాగాడు మృగదత్తుడు.

దీర్ఘంగా ఆలోచిస్తూ నడవడంవలన అతన్ని రాళ్ళూ, ముళ్ళూ అట్టే బాధించలేదు. పోగా పోగా మధ్యాహ్నానికి ఒకగ్రామం చేరుకున్నాడు. భోజన సదుపాయం కోసం వెదుకుతూ ఒక సత్రం గురించి విని అక్కడికి పోయాడు. అక్కడ నాలుగు వర్ణాల వారికీ అన్నం పెడతారు. భోజనం చేసి కూర్చున్నాక ఒక బ్రాహ్మణుడు వచ్చి అతన్ని – "ఏ వూరు వెళ్తున్నావునాయినా ?" అని అడిగాడు.

మృగదత్తుడు : రామదుర్గ నగరం పోతున్నాను.

బ్రాహ్మణుడు : అక్కడ ఎవరింటికి వెళ్తావు?

మృగదత్తుడు : కుముదాంగదుని ఇంటికి.

బ్రాహ్మణుడు : అతను నీకు చుట్టమా?

మృగదత్తుడు : ఔను. చుట్టమే.

బ్రాహ్మణుడు : అతను నీకు ఏమౌతాడు?

మృగదత్తుడు : మా తల్లి గారికి తండ్రి కాబట్టి మాతామహుడు.

బ్రాహ్మణుడు : (ఆశ్చర్యంతో) అయితే మీ తల్లి పేరేమిటి?

మృగదత్తుడు : అదీ తెలియదు.

బ్రాహ్మణుడు : మీ తండ్రి గారి పేరు?

మృగదత్తుడు : అదీ తెలియదు.

బ్రాహ్మణుడు : వాళ్ళు ఎక్కడున్నారు?

మృగదత్తుడు : తెలియదు. చనిపోయారని ఒకస్త్రీ చెప్పింది.

బ్రాహ్మణుడు : (దుఃఖంతో) వారికి నువ్వు ఎక్కడ పుట్టావు?

మృగదత్తుడు : నాకేమీ తెలియదు. పోన్లెండి. నా వృత్తాంతంతో మీకేం పని? ఇంతకీ మీరెవరు?

బ్రాహ్మణుడు : నేను మీ తండ్రికి మిత్రుణ్ణి. మీ తల్లితండ్రుల కోసమే వెదుకుతూ దేశాటనం చేస్తున్నాను.

మృగదత్తుడు : మీపేరు?

బ్రాహ్మణుడు : గదాధరుడంటారు.

మృగదత్తుడు : వాళ్ళెక్కడికి పోయారు.

బ్రాహ్మణుడు : చెప్పకూడదు. మెల్లిగా మాట్లాడు. మహాపతివ్రత అయిన మీ తల్లిని రాజు కామించడంతో అతనిని చంపి వాళ్ళిద్దరూ అడవులలోకి పారి పోయారని విన్నాను. వాళ్ళకోసం వెదుకుతున్నాను. బాబూ! వాళ్ళు చనిపోయారని నీకెవరు చెప్పారు? (అంటూ కన్నీరు పెట్టుకున్నాడు.)

మృగదత్తుడు : వేశ్య ఇంటిలో ఉన్న ఒక పరిచారిక. ( అంటూ ఆ కథంతా చెప్పి... అతనిమీద నమ్మకం కలగడంతో ఆమె రాసిచ్చిన ఉత్తరాన్ని చూబించాడు.)

గదాధరుడు ఆ ఉత్తరాన్ని చదివి – ఆమెచేతి రాతను గుర్తుపట్టి – 'అయ్యో! ఈ ఉత్తరం రాసింది పద్మినే. భర్తతో వియోగం సంభవించి ఉంటుంది. విరక్తితో రాసిందనుకుంటాను. అక్కడికిపోయి చూద్దామా?' అనుకుని – "బాలుడా! ఆమె ఇప్పుడు ఎక్కడుంది?" అని అడిగాడు.

"ఎక్కడికో పోయింది. అక్కడలేదు" అన్నాడు మృగదత్తుడు. అతను రహస్యంగా గదాధరుడినుంచి తన తల్లితండ్రుల వృత్తాంతం పూర్తిగా తెలుసుకుని ఎంతో విచారిస్తూ – "దుర్గానగరం పోవడానికి సాయంగా రండి" అని గదాధరుణ్ని కోరాడు.

అందుకు గదాధరుడు "అక్కడి అధికారుల శాసనం చాలా కఠినంగా ఉంది. మీ వాళ్ళ ఇంటిచుట్టూ కాపలా పెట్టి ఉంచారు. కొత్తవాళ్ళు వొస్తే పరీక్షిస్తూ ఉంటారు. వాళ్ళ నెక్కడికీ పోనివ్వరు. నీ వృత్తాంతం తెలిసిందో నిన్ను పట్టుకుంటారేమో? మీ తాతగారి ఊరు వెళ్దామన్నా వాళ్ళని అలాగే నిర్బంధిస్తున్నారు. అందుచేత రహస్యంగా పోయి చూడాలి" అని గదాధరుడు చెప్పాడు.

మృగదత్తుడు ఆ మాటలకి ఆశ్చర్యపోతూ, "మనమేమి అపరాధం చేశామని? నిరపరాధుల్ని కూడా రాజభటులు పట్టుకుంటారా? రాజు చేసిన అక్రమాన్ని ఖండించక మావాళ్ళని నేరస్తులుగా ఎంచడం తప్పుకాదా? ఎలాగేనా సరే దుర్గానగరం వెళ్ళక తప్పదు. ఈ ఉత్తరం చూబించక తప్పదు." అన్నాడు.

వాళ్ళు అలా మాట్లాడుకుంటూంటే రహస్యంగా అనుసరిస్తున్న ఒకపురుషుడు వాళ్ళమాటలు విని వారివెంట నీడలా తిరగసాగాడు.

వాళ్ళు రహస్యంగా దుర్గానగరం పోయారు. ఎలాగో కావలి వారికన్నుగప్పి తప్పించుకుని ఇద్దరూ కుముదాంగదుడి ఇంట్లోకి దూరారు. గదాధరుణ్ని గుర్తుపట్టి కుముదాంగదుడు నమస్కరిస్తూ – "బ్రాహ్మణోత్తమా!

మా వాళ్ళ జాడ ఏమైనా తెలిసిందా? అయ్యో! మేమిక్కడ బందీల్లా ఉన్నాం. ఈ బాలు డెవరు? ఉశీనర నగరానికి ఏ వార్తలూ తెలియవు కదా" అని దుఃఖించాడు.

"శెట్టీ! విధి మనమీద పగపట్టి అలా చేస్తున్నాడు. కీడులో కొంత మేలు అంటే ఇదే! ఈబాలుడు పద్మిని కొడుకు. పేరు మృగదత్తుడు. దైవికంగా వీడు నా కంట పడ్డాడు. పద్మిని వీడిని కనడమే తప్ప ముద్దుముచ్చట్లు చూసి ఎరగదు. వారు చనిపోయారని వదంతి వ్యాపించింది. కాని అది అసత్యం. దేశాలు పట్టి తిరుగుతున్నారు. రాజభటుల భయంతో బయటపడడం లేదు." అంటూ తనకు తెలిసిన సమాచారం అంతా గురుదత్తుడు చెప్పాడు. శెట్టి చాలా ఆశ్చర్య పోయాడు. అతను ఆ విశేషం భార్యకు చెప్పి – ఆ బాలుణ్ని కౌగలించుకుని ఆనంద బాష్పాలతో వాడి శిరస్సు తడిపాడు. అతని భార్య కూడా కూతురి పోలికలు బాలుడిలో చూసి – గతం తలుచుకుని ఎంతో దుఃఖించింది.

అప్పుడు మృగదత్తుడు తన కధంతా చెప్పి – రత్నాంగి ఇంట్లో ఆమె తనకిచ్చిన ఉత్తరం చూబించాడు.

అది చదివి 'అయ్యో! నాయనా! ఆమేనీతల్లి. వేశ్య ఇంట్లో ఎందుకుంది? ఏమంది? చెప్పు చెప్పు" అని మరీ మరీ అడిగేసరికి – ఆ కధంతా మళ్ళీ మొదటినుంచీ చెప్పాడు. అలాఎన్ని సార్లు చెప్పించు కున్నారో వాళ్ళు.

వాళ్ళు అలా మాట్లాడుకుంటూంటే – "రాజభటులు కొందరు లోపలికి వచ్చి – "ఈ కొత్తవాళ్ళెవరు? గురుదత్తుడిచే పంపబడ్డారేమో అని అనుమానంగా ఉంది. నిజం చెప్పండి" అని గద్దిస్తూ అడిగేసరికి,

కుముదాంగదుడు భయపడుతూ – "వారెవరో నాకు తెలియదు" అన్నాడు. భటులు వారిని పట్టుకుని రాజసభకు తీసుకు పోయారు. రాజప్రతినిధి వారిని విడివిడిగా – "మీరెవరు? వీరింటికి ఎందుకు వొచ్చారు?" అని అడిగితే ఇద్దరూ చెరో విధంగానూ చెప్పారు.

అంతకు ముందునుంచే కుముదాంగదుడి మేడలో అతనికి తెలియకుండా ధ్వనిగ్రాహిణి అనే యంత్రాన్ని ఒక దానిని అమర్చి ఉంచారు. ప్రతినిది ఆ యంత్రాన్ని తెప్పించి పరీక్షించారు. మృగదత్తుడు చెప్పిన మాటలలోనూ, గదాదరుడు ఆడిన మాటలలోనూ చాలాభాగం ఆ యంత్రం ఆకర్షించింది. మరోవైపుకు తిరిగి చెప్పినవి అది గ్రహించలేదు. సంభాషణలు అన్నీ ఆకర్షించబడితే వారు నిరపరాధులని తేలేది. కాని ,వారికి ప్రతికూలమయిన మాటలే దానిచేత ఆకర్షింపబడ్డాయి.

మృగదత్తుడు గురుదత్తుడి కొడుకైనట్లూ, గదాధరుడు మిత్రుడైనట్లు, అతను అడవులలో నివసిస్తూ వీరినిక్కడికి పంపుతున్నట్లూ తెలుసుకుని రాజప్రతినిధి వారిని అపరాధులుగా భావించి, చెరసాలలో పెట్టించాడు.

సామంత్ర చక్రవర్తి అయిన గజేంద్రవాహుడి కొత్త శాసనం ప్రకారం వారికి స్థిరమయిన దండన విధించడానికి తనకు అధికారం లేకపోడంతో ముగ్గురినీ రక్షకభటులతో గజేంద్రవాహుడివద్దకు పంపాడు.

మృగదత్తుడు, గదాధరుడు, కుముదాంగదులని పదిమంది రక్షకభటులు చుట్టూ ఉండి గజేంద్రవాహుడి దగ్గరరకు తీసుకుపోయేందుకు నడుస్తూంటే – తోవమధ్యలో రాజభటులని, ఉద్దేశించి గదాధరు డిలా అన్నాడు "కింకరులారా! లోకంలో ధర్మాధర్మాలూ, న్యాయాన్యాయాలూ, మంచిచెడ్డలూ, పాపపుణ్యాలూ అంటారు కాని వాటన్నిటి భావమూ ఒక్కటే. ఒక్కొక్కప్పుడు న్యాయమే అన్యాయంగా పరిగణించబడుతుంది. దానిని పూర్వజన్మకర్మ అని పెద్దలు అంటారు

పూర్వం మాండవ్యుడనే మహర్షి నిరపరాధే అయినా దొంగలా కొరత వేయబడ్డాడు. ఈ కథ భారతంలో ఉంది దుర్మరణం చెందిన మీ రాజుగారి కృత్యాలు ఎలాంటివో మీకు తెలియనివి కావు. పద్మిని చేసిన పని సమంజసమే అని మనం అనుకోక మానం. ప్రజలు – చాటున, మంచిని మంచిగానూ, చెడ్డను చెడ్డగానూ చెప్పుకోక మానరు.

అది ఎలాటిదైనా అపరాధాన్ని విమర్శించడం రాజప్రతినిధి విధి. కాని – ఏమీ ఎరగని మమ్మల్ని ఇలా బాధించడం కేవలం అక్రమం. అధర్మం.

ఇతను గురుదత్తుడి కొడుకని ఊహించాం. ఆ దంపతులు ఎక్కడున్నారో మీకు తెలియదు. వీడికి ముందే తెలియదు. గుర్తులని బట్టి సంబంధం కలుపుకున్నాం. ఇది మా పూర్వకర్మ. సజ్జనులు అందరిలోనూ ఉంటారు. కోటీశ్వరుడికి మనవడై కూడా ఇతనిలా కష్టాలు పడుతున్నాడు. వీని సిరికి మీ రాజు రాజ్యమంతా కూడా సాటిరాదు. విధి..”

ఆ మాటలకు వాళ్ళలో జాలి కలిగింది.

వారిలో ఒకడు – “బ్రాహ్మణుడా! మేమేం చెయ్యగలం?”

*గదాధరుడు* : మీరు చేయగలిగిన పని మహారాజే చెయ్యలేదు.

*మరొకడు* : విడిచి పెట్టమంటావా ఏం? అలా అయితే మా తలలు తెగిపోతాయి.

*గదాధరుడు* : అలా అనడానికి నేనంత మూర్ఖుడినా? మీ బాధ్యతలు నాకు తెలియని కావు.

*మరొకడు* : మాకు బాధ కలగని పద్ధతి అయితే మీకు ఏదేనా ఉపకారం చేస్తాం.

*గదాధరుడు* : వినండి. ఉశీనరపురంలో వీడి తాత రత్నాకరుడు ఉన్నాడు. అతను కోటీశ్వరుడు అతనికి వీడిని చూబించి తీసుకుపొండి. అతను మీకు మంచి పారితోషికం ఇస్తాడు. ఇదే నా కోరిక. ధనానికి వశంకానివారెవరుంటారు? దేముడికే ధనమంటే వేడుక. ధనం తాలూకు శక్తి అంతటిది

ఆ మాటలకు వాళ్ళ మనసు మెత్తబడింది. వారిని మార్గం మళ్ళించారు. గదాధరుడితో మంచి మాటలు చెబుతూ గౌరవించసాగారు. కొన్నాళ్ళకు ఉశీనరపురం చేరుకున్నారు. సంకెళ్ళు తీసి దాచి రత్నాకరుడి ఇంటికి రహస్యంగా తీసుకుపోయారు.

రత్నాకరుడు గదాధరుణ్ని చూసి ఆరాటపడుతూ – "మావారి జాడేమైనా తెలిసిందా?" అని అడిగాడు.

గదాధరుడు – "విను, ఇతను మీ మనవడు. అడవిలో పుట్టాడు. తల్లితండ్రుల నెరగడు. దైవికంగా దారిలో తారసిల్లాడు. దుర్గానగరానికి పోయాం. విధి వశాన పట్టుబడ్డాం. పెద్దశిక్షకు తీసుకుపోబడుతున్నాం" అంటూ ఆ కథంతా చెప్పాడు.

రత్నాకరుడు మనవణ్ని కౌగలించుకుని దుఃఖించ సాగాడు. రాజభటులు – "అయ్యా! చూశారు కదా. ఇక పోవాలి లేవండి లేవండి" అని తొందర పెట్టారు.

గదాధరుడు రత్నాకరుడితో ఏకాంతంగా మాట్లాడి తరవాత వారితో – "భటులారా! మీ వేతనాలు చాలా తక్కువ. బాధ్యతలూ అధికారాలూ చాలా పెద్దవి. దండనవిధి అంతా మీ చేతిలోనే ఉంది. ఈ ధనం తీసుకుని మీరు మాకొక ఉపకారం చేయవలసి ఉంది" అంటూ ఏభైవేల దీనారాలను వారిముందు రాశిగా పోయించాడు. కళ్ళు మిరుమిట్లు కొల్పుతున్న ఆ బంగారపు రాశిని చూసి విభ్రాంతితో వాళ్ళు కొంత సేపు ఏమీ మాట్లాడలేకపోయారు. "ముందు వీటిని మీరు మూటకట్టండి. తరవాత మీరేం చేయాలో చెబుతాను" అన్నాడు గదాధరుడు. వాళ్ళు గద్గదికకంఠంతో – "స్వామీ! మీ అనుగ్రహానికి చాలా సంతోషిస్తున్నాం" మీరేం చెప్పినా చేస్తాంకాని మా శిరస్సులు నిలిచేటట్లు మాత్రం చూడండి" అన్నారు.

అందుకు గదాధరుడు "మీకేం భయం లేదు. అపాయం లేని ఉపాయం చెబుతాను. వినండి. మా ముగ్గురికి ఇక్కడ వదిలెయ్యండి. మాకు బదులు మనుషులు ముగ్గురిని అప్పగిస్తాం. వాళ్ళు మా పేర్లే చెబుతారు. అందువల్ల మీకేమీ ప్రమాదం రాదు. అక్కడివాళ్ళు మమ్మల్ని చూడలేదు కదా? పత్రికలలో పేర్లే రాయబడి ఉన్నాయి. వాటిని చదువుకుని వారికే శిక్షవిధిస్తారు. వాళ్ళకి తగిన ఉపాధులు మేం ఏర్పాటు చేస్తాం" అన్నాడు.

వాళ్ళు ఆలోచించుకుని తమకి భయంలేదని నిశ్చయించుకుని అందుకు అంగీకరించారు. రక్షకభటులవెంట మరో ముగ్గురిని పంపారు.

రత్నాకరుడు వారిని తన ఇంట్లో ఉండమని బలవంతం పెట్టినా గదాధరుడు అంగీకరింపలేదు. మేము ఇక్కడుంటే గుట్టు బయట పడక మానదు - దానివల్ల ప్రమాదం ముంచుకు వస్తుంది. కొన్నాళ్ళు రహస్యంగా ఉండి' మళ్ళీ వస్తాం" అని అతనికి నచ్చచెప్పి ఇల్లు వదలి ఉత్తరంగా వెళ్ళిపోయారు.

అప్పుడు మృగదత్తుడు - 'అయ్యా! మీరు మన గమ్యస్థానం గురించి చింతించనక్కర్లేదు. నేనుపుట్టిన కోయపల్లె చాలా రహస్యమైనదని మీరు వినే వుంటారు. మనం అక్కడికి పోదాం. మనలని వారు ఎరగరు. కొన్నాళ్ళుండి వద్దాం. జన్మభూమి చూడాలని నాకూ వేడుకగా ఉంది" అంటూ ఆ అరణ్యానికి ప్రయాణం చేయించాడు.

ఎన్నోకష్టాలుపడి ఎలాగైతే ఏం అక్కడికి చేరారు. కొందరు మృగదత్తుణ్ని గుర్తు పట్టలేకపోయారు. గుర్తు పట్టినవారు "చిరుతపులి" అంటూ కేకలు వేశారు. అతని తండ్రి - "ఏమిరా! పెద్దవాడివై ఇంటికిరాక దేశాలపాలై తిరుగుతున్నావా? వీడెవడు? చాపలమ్మిన సొమ్ము ఏంచేశావ్?" అని అడిగాడు. అతని పామరత్వానికి జాలిపడి - "నాయనా! కారణం ఉండబట్టే తిరిగాను. మిమ్మల్నెప్పటికీ మరచిపోను" అంటూ కొంతసొమ్ము వాడికిచ్చి మాటలతో కూడా సంతోషపరిచాడు.

ఆ సొమ్ము పుచ్చుకుని వాడు "బాబూ! నీకోసం ఈ మధ్య ఎవరెవరోవచ్చి వెదికారు. ఎక్కడికో పోయావంటే ఇల్లు కూడా వెదికారు. కారణమేమిటి?" అని అడిగాడు. అతను తనకి తెలియదనేశాడు. గదాధరుడు ఆ మాటలు విని ఏదో అనుమానిస్తూ - "అలా వెదకడానికి వచ్చి ఎన్నాళ్ళయింది?" అని అడిగి కారణం తెలియక ఆలోచించసాగాడు.

చిరతపులి వచ్చాడని ప్రచారం కావడంతో చాపలల్లడం నేర్పమని ఎందరో రాసాగారు.

ఒకనా డొక కోయవాడు నలుగురు రాజకింకరులని వెంట బెట్టుకుని అక్కడికి వచ్చి – "వీడే చిరుతపులి అనబడే మృగదత్తుడు" అని చూబించి వాళ్ళ కప్పగించాడు.

ఆ రాజభటులు వాడిని చూసి – "ఔరా! నీ కోసం ఎన్ని దేశాలు తిరిగాం! ఎన్ని కష్టాలు పడ్డాం. అడవుల్లో దాక్కుంటే వదిలేస్తాం అనుకున్నావా?" అంటూ వాడిని బంధించారు. మృగదత్తుడు తెల్లబోయి చూస్తూంటే – గదాధరుడు –"ఇది ఎవరి ఆజ్ఞ? వీడేం నేరం చేశాడు?" అని అడిగాడు.

వాళ్ళు – "అదేమీ మాకు తెలియదు. గజేంద్రవాహుడి ఆజ్ఞమేరకు వాడిని పట్టుకున్నాం. వీడికోసం మేమేకాక ఎందరో రాజభటులు తిరుగుతున్నారు" అని చెప్పారు. గదాధరుడికి ఏం కారణమో తోచక – ఏదయినా సరే అనుకుని, "మేం కూడా వస్తాం పద –" అని వారి వెంట నడవసాగాడు. కొన్ని రోజులకి వాళ్ళని ఉదయార్కుడి పట్నం చేర్చి రాజుముందు నిలబెట్టారు.

ఉదయార్కుడు వాళ్ళనిచూసి, "ఏమిరా? నీ మూలంగా మాకు పైవారి వల్ల చాలా అవమానాలు కలుగుతున్నాయి. నిన్ను పంపమని మా చక్రవర్తి ఇప్పటికి ఇరవైసార్లు ఆజ్ఞా పత్రికలు పంపాడు. నీ జాడ మాకు తెలియదు. రత్నాంగి పైవారిని పట్టుకుని తన అపరాధం మాపుకోదలుచుకుంది. నువ్వు పోయి గట్టిగా వాదించుకుని గెలుచుకురా. పో. నీవెంట రాజభటులు వస్తారు. భయపడకు" అన్నాడు.

మృగదత్తుడు ఆ మాటలకు సంతోషించి, గదాధరుడితో – "నువ్వు బుద్ధి మంతుడవు. ఎలా చెప్పాలో ఆలోచించు" అన్నాడు.

గదాధరుడు మళ్ళీ ఆ కథంతా విని ఆలోచించసాగాడు. రాజభటులు విచారణ దినానికి వారిని విద్యానగరానికి తీసుకుపోయారు.

అని చెప్పి మణిసిద్ధుడు కథను అక్కడ నిలిపాడు.

# కాశీ మజిలీ కథలు

## 124. వ మజిలీ

### అపరాధవిచారణ కథ

"అయ్యో! మృగదత్తా! మనరహస్యం బయట పడిపోయే-టట్లుంది. విధి విపరీతం కదా. రామదుర్గం నుంచి రాజప్రతినిధి పంపిన అభియోగం ఇవాళే విచారిస్తారట. అదుగో. అప్పుడే మృగదత్తా అనీ, కుముదాంగా అనీ, గదాధరా అనీ మూడేసి మార్లు పిలిచేశారు. ఇప్పుడు మనమేం చెయ్యాలి."

కన్నంలో దొంగల్లా దొరికిపోయాం. రాజభటులు మనని పారిపో నివ్వరు. నిన్ను వదిలి మేం పోలేము" అంటూ భయంగా అతననేసరికి - గదాధరుడు "మనరోజులు అంత చెడ్డగా ఉన్నాయి. మనకంటే ముందుగా శని వొస్తుంది. సరే ఏం చేస్తాం? చంపితే చంపనీ" అన్నాడు. సభలో ఒక మూల కూర్చుని అంతా చూడసాగాడు.

సుమేధుడు పీఠం అలంకరించాడు. అతనికి రెండు పక్కలా న్యాయవాదులు ఆసనాల మీద కూర్చున్నారు. సభాభవనం కిక్కిరిసి ఉంది. మొట్టమొదటే సుమేధుడు రామదుర్గం నుండి పంపబడిన నేరారోపణను విచారించసాగాడు.

"దేవా! కొన్నేళ్ళకిందట రామదుర్గనగరపు సామంతరాజు సురూపుడిని కుముదాంగదుడనే వైశ్యుని కూతురు, అల్లుడు బలవంతంగా చంపి కుండులో పారేశారు. వారి జాడ ఏమీ తెలియలేదు ఆ రహస్యం తెలుసుకుందుకు ముకుదాంగదుడి ఇంట్లో ధ్వనిగ్రాహిణి అనే యంత్రం అమర్చబడింది. ఈ మధ్య గురుదత్తుడి కొడుకు మృగదత్తుడు, స్నేహితుడు, గదాధరుడు కుముదాంగదుడి ఇంటికి వచ్చి మాట్లాడు కున్నారు. యంత్రం

వల్ల వాళ్ళ మాటలు తెలిశాయి. గురుదత్తుడు, భార్య ఎక్కడో అడవులలో నివసిస్తూ రహస్యంగా వీరిని తమవారిదగ్గరకు పంపుతున్నారు. కనుక వీరు ముగ్గురూ శిక్షాపాత్రులే. వీరిని శిక్షించే అధికారం మునుపు ఆ సామంత రాజుకే ఉండేదికాని దానిని దేవర వారే తగ్గించేశారు. అందుచేత మీరు వీరిని శిక్షించాలి" అన్నాడు న్యాయవాది.

రాజు : సురూపుడిని వీళ్ళు బలవంతంగా ఎందుకు చంపారు?

న్యాయవాది : నలుగురూ నాలుగువిధాల చెబుతున్నారు. కచ్చితమైన కారణం తెలియరాలేదు.

రాజు : ఒకటిరెండు విధాలు వివరించి చెప్పండి.

న్యాయవాది : గురుదత్తుడి భార్య చూడచక్కనిదట. సురూపుడూ చాలా చక్కనివాడే అవడంవల్ల ఆమె అతన్ని మోహించి సాంకేతికం ఏర్పరచి ఇంటికి రమ్మన్నదట. ఆ గుట్టు గురుదత్తుడు గ్రహించడంతో సురూపుడు తనని బలవంతం చేస్తున్నాడని మగడితో చెప్పి చంపించిందంటారు.

రాజు : మరో విధం ఏమిటి?

న్యాయవాది : రాజే దానిని బలవంతం చేశా డంటారు. నిజం దేవుడికే తెలియాలి. ఎలాగైనా వారు రాజుని చంపిన మాట వాస్తవం. రాజద్రోహం వారి నెత్తిమీద ఉంది.

రాజు : సురూపుడికి సంతతి లేదా?

న్యాయవాది : లేదు లేదు. చక్రవర్తే ప్రతినిధిని ఏర్పరిచారు. మీ అధికారంలోనే జరుగుతుందని విన్నాం.

రాజు : వీరిలో మృగదత్తు డెవరు?

మృగదత్తుడు : నేను స్వామీ.

రాజు : నీ తండ్రి పేరేమిటి?

మృగదత్తుడు : గురుదత్తుడు స్వామీ.

రాజు : గదాధరుడు ఎవరు?

గదాధరుడు : (ముందుకు వచ్చి) నేనే ప్రభూ

రాజు : మీ కులం ఏమిటి?

గదాధరుడు : బ్రాహ్మణులం ప్రభూ.

రాజు : నువ్వేం చదువుకున్నావు?

గదాధరుడు : మా తండ్రి బిచ్చం ఎత్తుకోడంతో నాకు చదువు అబ్బలేదు.

రాజు : కుముదాంగదుడివి నీవేనా?

కుముదాంగదుడు : (ముందుకొచ్చి) నేనే దేవా!

రాజు : నీ అల్లుడూ, కూతురూ సురూపుని చంపారట. నిజమేనా?

కుముదాంగదుడు : సురూపు డెవరు బాబూ?

రాజు : మీ దేశపు రాజు.

కుముదాంగదుడు : అదా! నాకు తెలియదు తండ్రీ.

రాజు : సరే మీరు పొండి. రేపు విమర్శిస్తాం అప్పటికి రండి.

అని రాజు వాళ్ళని పొమ్మన్నాడు. రత్నాంగి అభియోగంలో వాది ప్రతివాదులను పిలవమన్నాడు. రాజభటులు మృగదత్తుణ్ణి ప్రవేశపెట్టారు. వాడిని చూసి ఆశ్చర్యపోయి - కొంచెం ఆలోచించాడు.

రాజు : మృగదత్తుడివి నువ్వేనా?

మృగదత్తుడు : నేనే సామీ

రాజు : నీ తండ్రి పేరు?

మృగదత్తుడు : గురుదత్తుడు.

రాజు : మీ కులం?

మృగదత్తుడు : వైశ్యులం.

రాజు : మునుపు చెంచులమని చెప్పావే?

మృగదత్తుడు : అని తెలియక చెప్పనమాట సామీ.

రత్నాంగి : వీడు గడియ కొకపేరు చెబుతాడు. దేవరవారు అదిగమనించాలి.

రాజు : ఆగు. నువ్వు మాట్లాడకు. నీ న్యాయవాదే అంతా చెబుతాడు.

న్యాయవాది : దేవా! ఇది చాలా విపరీతంగా ఉంది. ఇందాకా వచ్చినవాడు తనపేరు మృగదత్తుడే అనీ, తండ్రి గురుదత్తుడే అనీ చెప్పాడు. ఇద్దరిలోనూ నిజమైన మృగదత్తుడు ఎవరు?

రాజు : మృగదత్తా! ఈతివాసీని ఎవరు అల్లారు?

మృగదత్తుడు : నేనే సామిా.

రాజు : ఈ పని ఎక్కడ నేర్చుకున్నావు?

మృగదత్తుడు : కొండపల్లిలో అల్లి ఉన్న దానిని విప్పి చూసి నేర్చుకున్నాను. నాకెవరూ చెప్పలేదు స్వామీ.

రాజు : కొండపల్లిలో ఎందుకున్నావు?

మృగదత్తుడు : నాకది జన్మభూమి.

రాజు : నీ తల్లిపేరు?

మృగదత్తుడు : తెలియదు. తలోమాట చెప్పారు.

రాజు : తండ్రి గురుదత్తుడని చెప్పావు కదా? తల్లి పేరు ఎందుకు తెలియదు?

మృగదత్తుడు : పద్మిని అని కొందరు చెప్పారు.

రాజు : (కొంచెం ఆలోచనలో పడి) ఈ రత్నాంగిని నువ్వు ఎరుగుదువా?

మృగదత్తుడు : ఎరుగుదును.

రాజు : దాని ఇంటిలోని పరిచారికను నీవెంట తీసుకు పోయావట. నిజమేనా?

మృగదత్తుడు : లేదు. అది అబద్ధం చెబుతూంది.

రాజు : దానింటికి వెళ్ళావా?

మృగదత్తుడు : వెళ్ళాను. అక్కడ ఉన్న ఆమె ఉత్తమ ఇల్లాలు స్వామీ.

రాజు : ఎలా తెలుసు నీకు?

మృగదత్తుడు : భోగం వాళ్ళు చాలా చెడ్డవాళ్ళనీ, వాళ్ళింటికి రావడం తప్పనీ నాకామె బోధించింది. ఇంకా ఎన్నో నీతులు చెప్పింది. నా వృత్తాంతం విని పేరు మార్చుకోమంది. ఏదో ఉత్తరం రాసిచ్చింది.

రాజు : ఎవరికి ఉత్తరం రాసిచ్చింది?

మృగదత్తుడు : రామదుర్గ నగరంలో ఉన్న కుముదాంగదుడికి. అది చూపించడం వల్లే నాకు ఇన్ని కష్టాలు వచ్చాయి.

రాజు : గదాధరుణ్ని ఎరుగుదువా?

మృగదత్తుడు : ఎరుగుదును. అహ..ఎరగను.

రాజు : అటుచూస్తున్నావ్. అక్కడెవరున్నారు?

మృగదత్తుడు : మావాళ్ళు.

రాజు : వాళ్ళని ఇలా ఎదురుగా రమ్మను.

గదాధరుడు : (వచ్చి) దేవా! నేను ఇతని తండ్రికి మిత్రుణ్ని. నాపేరు గదాధరుడు.

రాజు : వీనితో నీకెక్కడ పరిచయమైంది?

గదాధరుడు : దారిలో.

రాజు : (రత్నాంగి వేపు చూస్తూ) వీళ్ళ మాటలు విన్నావా?

రత్నాంగి : (న్యాయవాది మొహం చూస్తూ) విన్నాను దేవా! అన్నీ అబద్ధాలే.

న్యాయవాది : దేవా! ఇదొక చిత్రమైన నాటకంలా ఉంది. మొదటి అభియోగంలో – మృగదత్తుడు, గదాధరుడు, కుముదాంగదుడు అని ముగ్గురు ప్రతివాదులు వచ్చారు. రెండవ మృగదత్తుడు మా అభియోగంలో సాక్షి. చూడబోతే అతనూ, ఇతనూ ఒక్కడే అనిపిస్తోంది. దేవరవారు

అది అనుమానించి కూడా ఊరుకున్నారు. ఆ అపరాధులను మళ్ళీ పిలిపించండి. ఎదటపెట్టి విమర్శించవచ్చు.

రాజు : అదంతా రేపు చూద్దాం. కాలాతీతమయింది. అని పీఠం నుంచి లేచి వెళ్ళిపోయాడు.

"ఇవాళ్టికి తప్పింది కదా. రేపు మరో ఉపాయం దొరక్క పోతుందా?" అని సంతోషిస్తూ గదాధరుడూ, మృగదత్తుడూ తమ బసకి వెళ్ళిపోయారు. సుమేధుడు పక్షపాతంగా వ్యవహరిస్తున్నాడని తన న్యాయవాది చెప్పడంతో రత్నాంగి విచారంగా తన బసకి పోయింది..

సుమేధుడికి ఆ నేరం విచారించడంతో ఆ రాత్రి ఎందుకో నిద్రపట్టింది కాదు. ఆలోచిస్తూండగానే తెల్లవారిపోయింది. అలవాటు ప్రకారం గుర్రమెక్కి ఉత్తరంగా ఉన్న ఒక రాజమార్గం వెంట పోసాగాడు.

పట్నంచివర వున్న పల్లెలలోని వాళ్ళు పాలు, పెరుగు, నెయ్యి, కూరగాయలు, పుల్లలు మొదలైనవి అమ్మడానికి ఆవైపునుండే వొస్తూంటారు. ఎంతో బరువును నెత్తిమీద ఎత్తుకుని, చాలా శ్రమపడుతూ వొచ్చే ఆ జానపదులని జాలిగా చూస్తూ...పలకరిస్తూ, గుర్రాన్ని మెల్లగా నడిపంచసాగాడు సుమేధుడు.

"ప్రభువుల వారు...ప్రభువులవారు." అంటూ రాజు గుర్రం ముందునడిచేవాడు అరుస్తూ జనులని బెదిరిస్తూంటే వాళ్ళు తడబడిపోతూ గంపలు జార్చేసుకుంటున్నారు. రాజు అది చూసి – "మాట్లాడకు వెనకరా" అంటూ వారికి ఇబ్బంది కలగకుండా గుర్రాన్ని నడిపంచసాగాడు. కడుపాకలి తీర్చుకుందుకు వాళ్ళు పడుతున్నయాతనని చూసి అతని హృదయం కరిగిపోయింది. అప్పుడే ...

ఒక గొల్లభామ పట్నానికి వొస్తూంది. మాసిపోయినచీర, విడిపోతున్న కొప్పు. అలవాటు లేకేమో నెత్తిమీద తడబడుతున్న గంప. బరువు భరించలేక పోయిందేమో చుట్టుకుదురుతో సహా చల్లకుండలున్న గంపని ఒక తూము మీద ఉంచి..నిట్టూర్చి చెమట తుడుచుకుంది పొద్దెక్కిపోతోందని మళ్ళీ గంప ఎత్తుకుందుకు చేయూత ఇచ్చే బాటసారుల కోసం ఎదురు చూడసాగింది.

సుమేధుడు గుర్రాన్ని నిలబెట్టి అలంకారాలు లేకపోయినా అంత అందంగా ఉన్న ఆమెని నీచకులంలో పుట్టించినందుకు విచారిస్తూ... మోయలేని బరువు మోస్తున్నందుకు జాలిపడి దీని మగడెంత కఠినాత్ముడో...అనుకుంటూ గోపికలా కనిపిస్తున్న ఆమెకు కడవెత్తమని తన గుర్రపు వాడికి చెప్పాడు

"అమ్మా! రాజుగారి సెలవయింది. కుండని నెత్తిమీదకు ఎత్తుతాను –" అని అతనామెకి దగ్గరగా వెళ్ళాడు. ఆమె కొంచెం జంకుతూ రాజాని ఓరకంట చూసింది. ఆచూపులనిబట్టి ఆమె ఉత్తమకులంలో పుట్టిందని రాజుగ్రహించాడు

ఆమె పరిచితులుకాని మగవారిని చూసి బెదురుతూ, మరో మార్గంలేక, కట్టుచీర సవరించుకుని, వాడుసాయం చేస్తూంటే ఆ కుండని రెండు చేతులతోనూ ఎత్తుకోబోయింది అలా ఎత్తుకోబోతూంటే కుండ కొంచెం వొరిగి ధానిలోని చల్ల కొంత నేలపాలయింది. అది చూసి సుమేధుడు విచారిస్తూ గుర్రపువాడిని తిట్టి, "అయ్యో! వీడు తిన్నగా ఎత్తకపోడంతో నీవు తెచ్చే చల్ల కొంత నేలపాలయింది. దీనిని ఎంతో దూరంనుంచి తెస్తున్నావు విచారించకు. నా వల్ల ఇది నేలపాలయిందని కనుక దీని వెల నేనిస్తాను ఎంతో చెప్పు" అన్నాడు

అప్పుడామె -

ఉ॥ శ్రీపతి కప్పులెట్టు సిరిచేఁ దూగెదు శెట్టిపట్టినై
రూపునఁ బేరు పొంది యనురూపవమోగుణరూపశీల వి
ద్యాపరి పూర్ణుఁ రాత్మహితుఁ డైన మనోహరు చెట్టఁబట్టి ఘో
రాపయసంబుజెందుచుఁ బరాంగనలం జెరపట్టుచున్న మా
భూపతి జంపితి న్మగఁడు భూరిభుజంగముచేతఁ జచ్చెఁ బై
నాపదఁ జెంది చెంది యుదయార్కుని పట్టణమేఁగి వేశ్యనై
పాపముఁ గట్టికొంటి నటఁ బట్టి లిటత్వముఁ బూని రాగ సం
తాపముఁ జెంది యగ్గిఁ బడి దగ్ధముఁ గాకిటు గొల్లభామనై
యీ పని కొప్పుకొంటి నృపతీ వగపేటికి? చల్ల చిందినన్.

"విష్ణువుకే అప్పివ్వగలిగినంత ఐశ్వర్యం కల శెట్టి పుత్రికని, రూపంలోనూ, విద్యలోనూ, ప్రకాశిస్తూ పండితుడంతటి వాడిని వివాహం చేసుకున్నదాన్ని. పరస్త్రీలను చెరపట్టే మారాజుని చంపాను. మగడు పాముచేత చంపబడ్డాడు. నేను ఆపదలోపడి ఉదయార్కుడి పట్నం చేరాను. వేశ్యనై పాపం మూటకట్టుకున్నాను. వైరాగ్యంతో అగ్నిలో పడినా దగ్ధం కాక ఇలా గొల్లభామనై ఈ పనికి ఒప్పుకున్నాను. చల్లచిందితే విచారించడందేనికి? అనే అర్థం వొచ్చే పద్యం చదివింది.

ఆ పద్యం వినడంతోటే సుమేధుడు – "హా! పరమేశ్వరా!" అంటూ మూర్ఛపోయాడు. గుర్రంవాడు అదిచూసి – "అయ్యో! గొల్లభామా! నువ్వెవరివి? ఏదో చదివి మారాజుని మూర్ఛ పోగొట్టావు. ఉపకారం చేసిన వాడికే ఇలా అపకారం తలపెడతావా!" అంటూవాడు రాజుకి ఉపచారాలు చేశాడు.

గొల్లభామ – "బాబూ! నాకేమీ తెలియదు. నాకు మంత్రాలూ తంత్రాలూ రావు. పాపాత్మురాలినవడం వల్ల నాకు ఉపకారం చేయబోయి మీ రాజు నేలపడి పోయాడు" అంటూ దుఃఖిస్తూ కుండలోని చల్లని అతని ముఖంమీద చిలకరించింది.

కొంతసేపటికి రాజు తేరుకుని..గుర్రపువాడిని నీళ్ళు తెమ్మని పంపి – "హా! ప్రేయసీ! ఎన్నాళ్ళకు కనిపించావు! ఎలాటి కష్టాలు పడుతున్నావు! నువ్వేమిటి, ఈ చల్లకుండేమిటి? విధీ!" అంటూ కౌగలించుకోబోయాడు.

ఆమె భయపడుతూ – "మహారాజా! నా పతి పరలోక గతుడయ్యాడు. నేను పరపురుషుణ్ని ముట్టను. నన్ను అంటుకోకు. నా బతుకింతే" అంది.

అతను – "గర్భవతివై ఉన్న నిన్ను అడవిలో వదలిపోయిన దయావిహీనుడు గురుదత్తుడిని నేనే" అన్నా డతను పశ్చాత్తాపంతో. ఆమెకొంచెం ఆలోచించి – "నువ్వు గురుదత్తుడివా! ఎలా బతికొచ్చావు?

ఇది నిజమే అవ్వాలని దేముణ్ణి ప్రార్థిస్తున్నాను. నా సందేహం తీర్చు" అంది. అప్పుడతను కొన్ని రహస్యాలు చెప్పి "దైవం ఇప్పటికి మనకి అనుకూలించినట్లుంది. నీ కుమారుడు, నీ తండ్రి ఇక్కడకే వచ్చి ఉన్నారు. నిన్ననే వాళ్ళని చూశాను. నేనని వాళ్ళకి తెలియదు. నేర విచారణలో ఉన్నారు" అని క్లుప్తంగా చెప్పాడు.

ఆమె అతని పాదాలమీద పడి – "ప్రాణేశ్వరా! నిన్ను గుర్తుపట్టక ప్రశ్నించినందుకు మన్నించు. మనం విడిపోయి పద్దెనిమిది సంవత్సరాలయింది. ఆహా! దైవమహిమ నాకు మతిపోయింది. ఇప్పుడు అంతా స్ఫురిస్తూంది." అంటూ కన్నీరు కారుస్తూ అతన్ని కౌగలించుకుంది.

"రోజూ ఇటే వస్తున్నా ఎవరినీ పరీక్షగా చూడలేదు. ఇవాళ నాకు అలా బుద్ధి పుట్టడం విశేషమే. దేముడే మనల్ని కలిపాడు. పరిచారకుడు వస్తున్నాడు. ఊరుకో" అన్నాడు రాజు. గుర్రపు వాడు అంతలో నీరు తెచ్చాడు "నువ్వు గుర్రాన్ని తీసుకుపో. నేను వెనక వస్తాను" అని వాడిని పంపివేసి, తరవాత ఆమెతో రహస్యంగా తన నివాసానికి చేరుకున్నాడు.

అంతటితో అక్కడి కాకథ ఆపి – ప్రయాణానికి బయలుదేరాడు మణిసిద్ధుడు గోపాలుడితో సహా

# కాశీ మజిలీ కథలు

## 125. వ మజిలీ

### పద్మినీ గురుదత్తుల కలయిక

**పుష్పవేణి** : రత్నాంగీ! నీ అభియోగం ఇవాళ విచారిస్తారా? పాపం, ఎన్నో రోజుల నుంచి దివాణం చుట్టూ తిరుగుతున్నావు.

రత్నాంగి : ఎరక్కపోయి దీనిలో దిగాను. ఛీ! సొమ్ముపోతే పోయిందని ఊరుకోవలసింది. ఒక్కరికీ జాలిలేదు. న్యాయవాది వచ్చినప్పుడల్లా డబ్బు తెమ్మంటూనే ఉంటాడు. బంట్రోతుల కివ్వలేక చేతులు కాయలుకాశాయి. తిప్పి తిప్పి చంపుతున్నారు. నా లంజరికపు సొమ్మంతా వీళ్ళ లంచాలకే నరిపోతోంది. నువేంధుడు జితేంద్రియుడన్నావు. కాని అతను స్త్రీలోలుడని తెలిపోయింది కదా.

పుష్పవేణి : ఆ మాట నేను ఒప్పుకోను. అతను పరస్త్రీని కన్నెత్తి చూడడని శపథం చేసి చెప్పగలను.

రత్నాంగి : చాల్లే! నీమాట నమ్మే ఆ ప్రయత్నం చెయ్యలేదు నేను. లేకపోతే ఈపాటి కతను నా కౌగిట్లో కరుగుతూ ఉండేవాడు. దాంతో నాపక్షాన తీర్పు చెప్పించుకునే దాన్ని.

పుష్పవేణి : రాజు స్త్రీలోలుడని నీ కెలా తెలిసింది?

రత్నాంగి : అతను రోజు గుర్రమెక్కి ఎటో పోతాడని తెలిసి గుర్రం వాడికి లంచమిచ్చాను. వాడే నాకు కొన్ని సంగతులు చెప్పాడు.

పుష్పవేణి : ఏమని చెప్పాడు ఆ లంచగొండి?

రత్నాంగి : మొన్న పొద్దున్న ఒకచక్కని గొల్లది చల్లకుండ నెత్తిమీద పెట్టుకువొస్తూంటే దానిని చూసి మోహించి ఇంటికి తీసుకు పోయాడట. విచారణలో పక్షపాతం చూపుతున్నాడని న్యాయవాది చెబుతున్నాడు. అదిగో

దూతిక వస్తూంది. విచారణ ఎప్పుడో తెల్పుకు రమ్మని న్యాయవాది వద్దకు దానిని పంపాడు.

దూతిక : అభియోగం తేవడం కంటె పాపం మరొకటుండదు. తిరగలేక చస్తున్నాను. అమ్మా! మనవ్యవహారం చక్రవర్తిగారు స్వయంగా విచారిస్తారట. ఉదయార్కుడిని కూడా రమ్మన్నాడట. ఎల్లుండి విచారణలు. పెందలకడనే రమ్మన్నారు వారికివ్వవలసిన సొమ్ము కూడా వెంట తెమ్మన్నారు.

రత్నాంగి : చక్రవర్తే స్వయంగా విచారిస్తారు కనుక ఈ సారి న్యాయం చెయ్యవచ్చు

పుష్పవేణి . మృగదత్తుడు సాక్ష్యం ఇచ్చాడు కదా? ఎలావుంది?

రత్నాంగి : వాడు గడియకొక పేరు చెబుతున్నాడు రామదుర్గ నగరం నుంచి వచ్చిన బంట్రోతులు ఏడుస్తూ ఏదో బతిమాలు కుంటున్నారు, వివరాలు తెలియవు.

దూతిక : నాకు తెలుసు. ఈ మృగదత్తుడు మరేదోనేరం చేసి తనపేరుతో మరొకడిని అప్పగించాడట. ఈ సమయానికే ఆ అభియోగం విచారణకి వచ్చింది. ఒకేపేరు కలవారు రెండు విధాలుగా రావడంతో అందరూ వింతగా చెప్పుకుంటున్నారు. న్యాయవాది ఇంట్లో కూడా ఇదే విషయం చర్చించుకుంటున్నారు

దుర్గానగరంనుంచి వచ్చిన రాజభటులు దైవికంగా తారసిల్లిన గదాధర బృందాన్ని చూసి, "బాబూ! మా బతుక్కి హాని తెచ్చి పెట్టారు. మీరూ ఇవాళే వచ్చారు. ఈ అభియోగం ఉందని మాకు చెప్పారు కారు. మీ కోసం వెదుకుతున్నాం. చక్రవర్తి స్వయంగా విచారిస్తారట. సుమేధుడు తరచి అడిగితే మొన్ననే తెలిసిపోయేది ఆయన ఎందుకో ఊరుకున్నాడు మా విషయం ఏం చేస్తారు?" అని దుఃఖిస్తూ అడిగారు.

"మాకు ఈ విషయం తెలియదు రత్నాంగి తెచ్చిన అభియోగంలో మృగదత్తుని సాక్ష్యమని తెలియదు. మేము అడవిలో దాక్కుందామనిపోతే అక్కడ ఇతన్ని పట్టుకున్నారు. ఇది మాకూ ప్రమాదమే

నిజం తెలిస్తే అందరం కారాగారంలో ఉంటాం. దేముడు ఏం తలుచుకున్నాడో తెలియదు. రేపు నేను సుమేధుణ్ని కలసి ఆశీర్వదించి ఆశ్రయిస్తాను. అతను దయామయుడని తెలుస్తోంది. నిజం చెప్పి తప్పుమన్నించమని ప్రార్ధిస్తాను. అతనికి ఏమాత్రం పాండిత్యం ఉన్నా రంజింపజేస్తాను" అని గదాదరుడు వాళ్ళని ఊరడించాడు.

తమని తప్పించమని వాళ్ళతని పాదాలమీద పడి పలు విధాల ప్రార్ధించారు.

మర్నాడు గదాధరుడు స్నానంచేసి...వొళ్ళంతా విభూది రాసుకుని బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ పండ్లు తీసుకుని సుమేధుడి ఇంటికి వెళ్ళాడు. దేవర దర్శనార్థం వచ్చి ఉన్నాడని పద్యాలతో అర్జీరాసి పంపాడు.

వాటిని చదివి పరమానంద భరితుడై – ఎదురు పోయి స్వాగతం పలికి. "నన్ను మీరు పరమమిత్రుడిగా భావించండి." అంటూ ఏకాంత ప్రదేశానికి తీసుకు వెళ్ళాడు. కొంతసేపటి వరకూ ఇద్దరూ ఆలోచనల్లో మౌనంగా ఉండిపోయాక – "పండితోత్తమా! మీ రాకకు కారణం చెప్పండి." అన్నాడు మనసులో అతను గదాధరుడుడని అనుకూంటూనే.

అందు కతను – "మిమ్మల్ని చూసేసరికి నాకు మనమిద్దరం ఒకటే అనిపిస్తూంది" అన్నాడు భావగర్భితంగా.

"మీ మాట నిజమే గదాధరత్వం మరొకరిలో ఆరోపించినా – మీ అపరాధం లేదని చెప్పడానికే కాదా వచ్చారు? నిజం చెప్పండి" అన్నాడు సుమేధుడు

"సుమేధ శబ్దం కూడా మీ విశేషణమే అని గురుదత్తవరంతో తెలుసుకున్నాను" అని గదాధరుడు అనేసరికి – రాజు "హా! గదాధరా! ఇంతకాలానికి కలుసుకున్నామా!" అంటూ అతన్ని కౌగలించుకుని కన్నీరు కార్చాడు. గదాధరుడు – "దైవఘటనలు ఎంత చిత్రమైనవి! ఇంతకాలం మమ్మల్ని చూకుండా ఎందుకున్నావు? నీ భార్య పద్మిని దేశాలు పట్టి తిరుగుతూంటే నేను నీ కొడుకుని కలుసుకుని తిరుగుతున్నాను" అంటూ ఆ వృత్తాంతమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

సుమేధుడు – "నేను మొన్ననే మిమ్మల్ని గుర్తు పట్టాను. దైవోపహతులం కావడం వల్ల ఇలా వియోగం చెందాం. పద్మినిని మొన్ననే కలుసుకున్నాను. లోపల ఉంది" అంటూ ఆమెను పిలిచాడు. పద్మిని వచ్చి గదాధరుడికి నమస్కరించి, కన్నీరు కారుస్తూ తను పడిన కష్టాలన్నీ చెప్పింది. ఆమె నోదార్చుతూ – "నీ కుమారుడికి నువ్వు రాసిచ్చిన ఉత్తరం చూసి నువ్వే అని గ్రహించాను. మీ కోసమే తిరుగుతున్నాను" అంటూ తాను పడిన కష్టాలన్నీ చెప్పాడు గదాధరుడు.

అప్పుడు సుమేధుడు తన వృత్తాంతం చెప్పసాగాడు. "గర్భవతి అయిన ప్రియురాలిని వదిలి కోయలతో విచిత్రమైన పత్రాలకోసం అడవికి పోయాను. అక్కడ పాము కరచి స్పృహ తప్పిపడి ఉండగా మందుకోసం కోయలు నాలుగు మూలలకీ వెళ్ళారు. ఒంటరిగా వివశునై పడున్న నన్ను ఒక అడవి ఏనుగు తొండంతో వాసనచూస్తూ..ఆపాదమస్తకం తడిడింది. అప్పుడు నాశరీరంలోని విషం తగ్గి నాకు కొంచెం తెలివి వచ్చింది. అది నన్ను తొండంతో చుట్ట చుట్టి వీపుమీదకి విసరింది. దానివీపుమీద పడిన నేను మెల్లగా కుంభస్థలం చేరుకున్నాను. నేను దానిమీద ఉన్న విషయం తెలియదు కాబోలు అది వేగంగా అటూ యిటూ తిరుగుతూ చెట్లనీ పొదలనీ విరిచేస్తూ ఆ అడవిలో భయంకరంగా విహరించసాగింది. నేను దాని కంఠం వదలకుండా గట్టిగా పట్టుకుని ఉన్నాను.

గజేంద్రవాహనుడు అనే చక్రవర్తికి ఏనుల వేటలో మంచి నైపుణ్యం ఉంది. అతను వేటకి వచ్చి బోనులు ఏర్పరచి ఉన్నాడు. అతన్ని చూసి ఏనుగు వేగంగా ఆ చెట్టు వేపు పరుగెత్తి దాని కొమ్మలన్నిటినీ తొండంతో విరిచెయ్య సాగింది. గజేంద్రవాహనుడున్న కొమ్మని విరవబోతూంటే తనదగ్గరున్న కఠారిని తొండం మీదకి విసిరాడు. ఆ వేటు తప్పి గండస్థలం మీద గుచ్చుకుంది. నేనాకత్తిని తీసుకుని దగ్గర ఉంచుకున్నాను. ఆఏనుగు కొమ్మమీదున్న గజేంద్రవాహనుణ్ని పడదోయడానికి ప్రయత్నిస్తూ ఆ కొమ్మ విరిచి. అతనినిన తొండంతో పట్టుకుని పెత్తబోతూంటే చేతిలో ఉన్న కత్తితో తొండం నరికేశాను.

లేకపోతే ఆ రాజు రక్తం ముద్దే అయి చనిపోయేవాడు. తొండంతో పాటుగా నేలబడి మూర్ఛపోయాడు. అంతలో రాజభటులు వచ్చి ఆ ఏనుగుని ఈటెలతో పొడిచి చంపి రాజుని సేదతీర్చారు.

రాజు లేచి - నన్ను చూసి - "నా ప్రాణాలు కాపాడిన భగవంతుడా! నువ్వెవరివి? నీ వృత్తాంతం చెప్పు" అని ప్రార్థించాడు. నేను నిజం చెప్పకుండా మరొకవిధంగా చెప్పాను. అతను నన్ను తన రథం ఎక్కించుకుని రాజధానికి తీసుకువచ్చి ప్రాణమిత్రుడిగా చూసుకోసాగాడు. అదేమిటో కాని పూర్వస్మృతి అంతా నశించింది. కలలా మిగిలిపోయింది. కొన్ని అభియోగాలలో సందిగ్ధంగా ఉన్న విషయాల నిజం గ్రహించి నేను తీర్పు రాశాను. అది మెచ్చుకుని అతను నాకు అధికారం యివ్వడంతోపాటు, ప్రాణదాతను కనుక నూరుగ్రామాలకు రాజుని చేశాడు.

రత్నాంగి అనే భోగం దాని అభియోగంలో మృగదత్తుడు అల్లిన తివాసి చూడగానే వెనకటి స్మృతి అంతా జ్ఞాపకం వచ్చింది. అప్పుడే పద్మిని జాడ కూడా తెలిసింది. మృగదత్తుణ్ని రప్పించాలనే, సాక్ష్యంనెపంతో అనేక ఉత్తరువులు పంపాను. ఇదే నా వృత్తాంతం. దైవానుకూలం వల్ల అందరం కలుసుకున్నాం. పద్మిని పడరాని పాట్లు పడింది. గొల్లవానికి సేవకురాలై పెరుగు, పాలు అమ్మి మధ్యాహ్నానికి ఇంటికి పోవడం, సాయంత్రం వరకూ ఇంటిపనులు చేయడమూనట! భోగందానింట్లో నీళ్ళు మోసిందట. అయ్యో, ఎలాటి కష్టాలు పడింది!" అంటూ విలపించాడు.

పద్మిని తనపైటతో అతని కన్నీరు తుడుస్తూ - "అది కాలమహిమ తప్ప మరొకటి. కాదు. సీత, చంద్రమతి మొదలయిన వారికంటే నేనెక్కువ దానినా ఏం? చివరకయినా మేలు చేసిన భగవంతుడికి కృతజ్ఞులమై ఉండాలి. నాకుమారుణ్ని చూడాలని ఉంది. వేగం రప్పించండి" అంది.

గదాధరుడు వెళ్ళి వాళ్ళిద్దరినీ తీసుకువచ్చాడు. అప్పటి వారి ఆనందం మాటలతో చెప్పలేనిది. ఆ రాత్రి వాళ్ళు నిద్రపోకుండా తమ కథలను ఒకరికొకరు చెప్పుకుంటూ గడిపారు.

తెల్లవారకుండానే సుమేధుడు చక్రవర్తి వద్దకు వెళ్ళి తన వృత్తాంతం చెప్పి అతన్ని ఆశ్చర్యంలో ముంచాడు. అతను కోరిన ప్రకారం విద్యానగరంలో సభచేసి సామంతులందరినీ రప్పించి నిండు కొలువులో గురుదత్తుడి చరిత్రంతా చెప్పి వారి నాశ్చర్య పరిచాడు. అదంతా వింటూ రత్నాంగి తెల్లబోయిచూడసాగింది. ఉదయార్కుడి ముఖం వికసించింది. సామంతరాజులు పద్మినిపాతివ్రత్యం పొగడుతూ సురూపుడిని నిందించ సాగింది

అప్పుడు చక్రవర్తి సభ్యులని వారించి, దుర్గానగరానికి ప్రతినిధిని తగ్గించి మృగదత్తుడిని రాజుగా చేశామనీ, సుమేదుడికి మరి నూరుగ్రామాలకు అధికారం ఇచ్చామనీ, పద్మిని చరిత్రను గ్రందాలుగా వ్రాయించి దేశంలో వ్యాప్తి చెయ్యమని ఆజ్ఞ ఇచ్చామనీ, రత్నాంగి తప్పు మన్నించి దానికయన ఖర్చులన్నీ ఇప్పించామనీ అందరికీ వినిపించేలా గట్టిగా చెప్పడంతో సభ్యులు ఆనందించి జయజయ ధ్వానాలతో కరతాళధ్వనులు చేశారు అంతటితో ఆ సభ ముగిసింది.

శుభముహూర్తంలో మృగదత్తుడిని సామంత రాజులతో సహా రామదుర్గా నగరానికి అధిపతిని చేశాడు. గురుదత్తుడు తల్లిదండ్రులని తనవద్దకు రప్పించుకుని విద్యానగరంలో నివసిస్తూ రాజ్యపాలన చేయసాగాడు.

అనిచెప్పి - గోపా పద్యమంతా మళ్ళీ గుర్తు చేసుకోగలవా? ఈ పద్యంలో ఎంతమంచి కథ ఉందో చూశావా?" అని మణిసిద్ధుడు అడిగాడు.

అందుకు గోపాలుడు - "స్వామీ! మీ దయ వల్ల నాకు గ్రహణశక్తి, బాగా పెరుగుతూంది. ఈ కథ నా మనసుకి ఎంతో వింతగా తోస్తూంది. పద్మిని ఎంత పతివ్రతో. ధర్మాన్ని విడువని వారు మొదట ఎన్ని కష్టాలు పడినా చివరకు సుఖించక మానరు నేను ఈ కదనుంచి ఈ నీతిని గ్రహించాను" అన్నాడు వినయంగా

"సరే మన ప్రయాణానికి వేళయింది. బయలు దేరదాం" అన్నాడు మణిసిద్ధుడు. గోపాలుడు గురువుని అనుసరించాడు

# కాశీ మజిలీ కథలు

## 126. వ మజిలీ

### కుశలవుల కథ

"స్వామీ! ఈ నగరం కూడలిలో ఒక శిలా విగ్రహం ఉంది. దాని నుదుట వికటదంతుడు అని రాయబడి ఉంది. పళ్ళు ఎత్తు పల్లాలుగా ఉండడం వలన అలా రాసి ఉంటారు. అదేమీ వింత కాదు. ఆ వీధంట వొచ్చి పోయేవాళ్ళందరూ ఆ విగ్రహం మీద ఉమ్మేస్తున్నారు. అందుకు కారణం తెలియలేదు. తమరే చెప్పాలి" అన్నాడు గోపాలుడు అయ్యవారికి చేతులు జోడించి. మణిసిద్ధుడు మణి ప్రభావంతో ఆ వృత్తాంతం చెప్ప సాగాడు.

"పూర్వం ఈ పురానికి కాంచీపురం అనే పేరుండేది. దానిని చంద్రగుప్తుడు పాలించేవాడు. అతని భార్య పేరు ధర్మపత్ని ఆమె అత్యంత సుగుణవతీ, సౌందర్యవతీను. నిరంతరం వేదాంత గోష్ఠి చేయడం ఆమెకు ఎంతో ఇష్టం.

ఒక వసంతకాలంలో భార్యతో కలసి ఉద్యానవనంలో విహరిస్తూ అక్కడి విశేషాలు వివరిస్తూ "ఈ వసంత కాలపు వెన్నెల రాత్రులందు మలయ మారుతాలు శరీరానికి హాయి కొల్పుతూంటే లతా మంటపాలలో విహరించే పురుషులకి ఇంకేం భోగాలు కావాలి? దేవీ" అన్నాడు.

అందు కామె – "ఇవన్నీ శృంగార చేష్టల కథలు కాని అనిత్యత తెలిసిన మనసుకి ఇవేవీ రుచించవు." అంది. ముసలి మాటలాడతావేం? వికసించిన ఈ పువ్వు ఎలా వుందో చెప్పు". "పరిమళంలేని ఈ పువ్వు

విద్యలేని సౌందర్యంలా చూడదగినదే తప్ప పొగడదగినది కాదు." "కాదు కాదు. ఈ మోదుగ పూలు ప్రియుడు ప్రియురాలికి చేసిన నక్షత్రాల్లా ఉన్నాయి " అన్నాడు. తన భార్య విరక్తి తెలుసుకుని ఆమె బుద్ధి మార్చడానికి శృంగార ప్రబంధాలు తెప్పించి చదవమనేవాడు. భర్త మనసుమారదని ఆమె అతనికి అనుగుణంగా మాట్లాడేది.

కొన్నాళ్ళకు ఆమెకి ఇద్దరు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు కవలలుగా జన్మించారు. మగపిల్లలకి కుశలవులనీ, ఆడపిల్లలకు రతి విరతి అనీ పేర్లు పెట్టారు. లవుడికీ, విరతికీ తల్లి పోలికలు వస్తే కుశుడికీ రతికీ తండ్రి తత్వం అనువంశికంగా వచ్చాయి.

పిల్లలను చూసి రాజు ఆనందిస్తూ తగిన ఈడు రాగానే వాళ్ళని చదవ వేశాడు. సూక్ష్మజ్ఞానం కల ఆ పిల్లలు గంటకొక గురువు నేర్పుతూంటే - కావ్యాలు, నాటకాలు, శాస్త్రాలు, సంగీతం, దండనీతి, వ్యాయామం, ధనుర్విద్య మొదలయినవన్నీ ఆలవోకగా నేర్చుకోసాగారు. రాజపత్ని భర్తకి తెలియకుండా వారికి వేదాంత విద్య చెప్పడానికి వేరే ఒక గురువుని నియోగించింది. నలుగురూ అతని వద్ద తత్వశాస్త్రం చదివినా లవుడికీ, విరతికీ మాత్రం అది బాగా పట్టుబడింది. మిగిలిన ఇద్దరూ ఆ శాస్త్రాన్ని పరిహసించేవారు.

ఒకనాడు గురువు ప్రబోధచంద్రోదయం అనే నాటకం వారికి పాఠంగా చెప్పి - "కామక్రోధాదులు మానవులకు పరమశత్రువులు వాటిని శమదమాది గుణాలతో అణగ దొక్కి వివేకంతో ప్రవర్తిస్తే ఆత్మప్రబోధం వల్ల మనుషులు ముక్తులౌతారు" అన్నారు.

అప్పుడు కుశుడు వంకరగా నవ్వుతూ - "ఆచార్యా! మీరు చెప్పిన విషయాలు చెప్పడానికీ, వినడానికి బాగుంటాయి కాని ఆచరించే వారెవరూ ఉండరు. శరీరం కల మనుషులకి కామక్రోధాలు తప్పక ఉండవలసిందే. సృష్టికర్త నిరుపయోగాలయిన వాటిని సృష్టించడు కదా! పరిచారకులు లేకపోతే రాజుకి పనులెలా జరగవో కామక్రోధాదులు లేకపోతే మనిషికి జీవయాత్ర కూడా అలాగే సాగదు. కోపాన్ని అవసరానికి కూడా వాడకపోతే అసమర్థత ఔతుంది కామం లేకపోతే మానవజన్మ

నిరర్ధకం. కామక్రోధాదులను విడచిన వారు ఇంతకు పూర్వం కాని ఇప్పుడు కాని ఒక్కరున్నారేమో నిరూపించండి" అంటూ సుదీర్ఘంగా ఉపన్యసించాడు.

అది విని గురువు తెల్లబోతూ లవుడి వంక వింతగా చూశాడు. అతను – "తమ్ముడా! చార్వాక మతం అనుసరిస్తున్నావా! అది అవివేకం సుమా!" అంటూ అద్వైతతత్వం గురించి ఎన్నో శ్లోకాలు చదివి వేదాంతాన్ని బలపరిచాడు. కాని కుశుడు దానిని అంగీకరించక ఛాందసం వదలి సుఖపడమంటూ తనవాదాన్ని సాగించాడు. ఇద్దరి మధ్యా పెద్దవాదం జరిగింది. విరతి లవుడిపక్షమూ, రతి కుశుడిపక్షమూ అయ్యారు.

ఈ వాదం గురించి తండ్రికి తెలిసింది. కొడుకులిద్దరినీ పిలిపించి వారివాదనలు విని పండితులని రప్పించి సభచేయించాడు. ఎవరి వాదం సరయినదో చెప్పమని కోరాడు. ధనలోభం కల పండితులు కుశుడి బోధవలన అతని వాదమే సత్యమైనదని నిర్ధారించారు.

దానితో కోపం వచ్చిన లవుడు దుర్జనులతో నిండిన దేశంలో ఉండకూడదని భావించి ఎవరికీ చెప్పకుండా ఒకనాడు దేశాంతరవాసం వెళ్ళిపోయాడు.

రాజు భార్యతో ఆ విషయం అంతా చెప్పి – "నువ్వు పిల్లల్ని సన్యాసులని చేశావు. లవుడు విరక్తితో తమ్ముడితో వెఱ్ఱివాదన చేసి ఎక్కడికో పోయాడు. వాడికోసం వెదికిస్తున్నాను. వాడి ఆచూకీ నీకేమైనా తెలుసా?" అని అడిగాడు. రాజపత్ని ఒక నిట్టూర్పు వదలడం తప్ప ఏమీ మాట్లాడలేదు.

కాని, విరతి – "బాబా! చిన్నన్నా, అక్కా నాస్తిక వాదం చేశారు. నువ్వూ వాళ్ళతో కలిసి పండితులచేత అదే సరయినదని చెప్పించావు. ఆ కోపంతో ఇక్కడ ఉండడం ఇష్టంలేక లవుడు వెళ్ళిపోయాడు." అంది. "ఓహో! నువ్వూ వేదాంతివే కాబోలు! మీ అమ్మ శిక్షణ మహా చక్కగా వుంది" అన్నాడతను ఆక్షేపణగా.

"దేహం క్షణభంగురం. కామక్రోధాలను అణచుకుని జ్ఞానం కలిగి ఉండాలి" అంటూ ఆమె సుదీర్ఘంగా ఉపన్యసించేసరికి రాజు కోపంగా వెళ్ళిపోయాడు.

తరవాత కొన్నాళ్ళకి రాజు పుత్రికలకి వివాహ ప్రయత్నాలు చేస్తూంటే పరిచారికలు దానిగురించి మాట్లాడకోసాగారు.

వకుళ : ముకుళా! నీసఖురాలు విరతిని వీర్యవంతుని కుమారుడు వత్సుడి కివ్వాలని నిశ్చయించారటగా? విరతి అంగీకరించిందా? ఆమెకి తగిన మగడే దొరికాడులే.

ముకుళ : వకుళా! ఏమిటి నీ పరిహాసం? అప్పుడే పెళ్ళిపోయినట్లే వెక్కిరిస్తున్నావే! మావిరతి అతన్నంగీకరించదు రతిని కేయూర దత్తుడి కొడుకు సుకుమారుడి కిస్తారట కదా?

వకుళ : ఔను అతని సౌందర్యం ..పరాక్రమం. .చాలా గొప్పవి. ఇదిగో . చిత్ర పటం చూడు. అన్ని విధాలా రతికి తగిన వాడు. అతనికిచ్చి సహాయంగా ఇక్కడే ఉంచుకుంటారట. పాపం, విరతికే.. ..

ముకుళ : పోనీలే. మీ రతి పతితో సుఖిస్తే చాలులే. మా విరతి అవధూతగా ఉండి అద్వైతానందం పొందుతుంది.

వకుళ : మీ విరతి జోగురాలు కనకనే మంచి సంబందాలు రావడం లేదు రసికుడైన రాజకుమారుడు విరాగిని ఎలావరిస్తారు? వత్సుడు గుణహీనుడు కనుక అంగీకరించాడు.

ముకుళ : శృంగారం బుద్బుదం వంటిది. వైరాగ్యమే శాశ్వతం. తినడానికి కూడులేనట్లు అత్తారింట ఇల్లరికం ఉండడానికి సిద్ధ పడుతున్న సుకుమారుణ్ని పొగుడుతున్నావా. విరతిని ఆక్షేపిస్తున్నావా! చాల్చాల్లే.

వకుళ : ఏమిటీ! సుకుమారుడు అన్నంలేనివాడా! ఈ మాట జ్ఞాపకం ఉంచుకో. పెళ్ళయ్యాక అతనిచేత నీ ముక్కూ చెవులూ కోయించకపోతే నాపేరు వకుళ కాదు.

ముకుళ : అప్పుడు చూద్దాంలే. విరతిని జోగురాలని ఆక్షేపించావు కదా. ఆమాట జ్ఞాపకం ఉంచుకో ఆమె మగని చేతనే నిన్ను కురూపిని చేయిస్తాను.

వకుళ : ఏడిశావులే నోటికెలా వస్తే అలా పేలకు.

ముకుళ : చాల్లే అధిక ప్రసంగం మాని నోరు మూసుకో.

అలా వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుని చివరకి వకుళ రతి దగ్గరికీ, ముకుళ విరతి దగ్గరకీ పోయి కన్నీరు కార్చసాగారు. విరతి ఆమె దుఃఖానికి కారాణం అడిగితే – "అమ్మా. కుశుడు తండ్రిని వశపరచుకుని విద్యారూప సంపన్నుడైన సుకుమారుడనే రాజపుత్రుడికి రతినిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు. వీర్యవంతుడనే వాడి కుమారుడు వత్సుడు వట్టి శుంఠ. కోపిష్టి. వ్యసనపరుడు. రూపహీనుడు. అలాటివాడికి మిమ్మల్నిస్తారట. రతి సఖురాలు ఆక్షేపించింది అందుకే మేమిద్దరం జగడం ఆడుకున్నాం వత్సుడిని మీరు అంగీకరించకండి" అంది. విరతి నవ్వుతూ – "ముకుళా. నీకు నా మీద ఎంత అభిమానమే. కాని..మనం ఎలాటి కర్మబీజం నాటుతామో అలాటి పలమే అనుభవిస్తాం. అంతేకాని మన మంచిచెడ్డలకి ఇతరులు హేతువు కారు ఎవరిగర్వం వారినే చెడుపుతుంది ఊరుకో." అంటూ ఓదార్చుతూంటే తల్లి అక్కడికి వచ్చి, విని "ఛీ! వత్సుడు వొట్టి నిర్భాగ్యుడు. వాడికి నిన్ను ఇవ్వడానికి నేను అంగీకరించను" అంది.

అప్పుడే చంద్రగుప్తుడు అంతఃపురానికి వచ్చి కూర్చుని భార్యని చూసి – "మన పిల్లలిద్దరికీ పెళ్ళిళ్ళు నిశ్చయించాను. కేయూరదత్తుడి నాలుగవ కుమారుడు సుకుమారుడనే వాడు విద్య, బల రూప, శీలాలలో గొప్పవాడు అతనికి రతినివ్వాలని నిశ్చయించాం. అతనూ అంగీకరించాడు వీర్యవంతుడు బలశాలీ, ధనికుడూ, పలుకుబడి కలవాడూ. అతని ఒకే ఒక్క కొడుకు వత్సుడు. గారాబంగా పెరగడంతో చదువట్టే అబ్బలేదు. రూపం ఒక మాదిరిగా ఉంటుంది. సర్వగుణాలూ సువర్ణాన్ని ఆశ్రయించి ఉంటాయి. దానికి వత్సుడివద్ద కాబట్టి ఏకొదవాలేదు. సుముహూర్తం ఎల్లుండే నిశ్చయించాం. ఇది చెప్పడానికే వచ్చాను" అన్నాడు.

రాజపత్నికి ఆశ్చర్యం, విచారం, కోపం వచ్చాయి. కొంచెం సేపు ఊరుకుని "వత్సుడి గురించి తెలిస్తే మీరీ సంబంధం అంగీకరించరు. సప్తవ్యసనాలూ ఉన్నాయట వాడికి రత్నంలాటి పిల్లని చూస్తూ చూస్తూ వాడికి ఎలా యిస్తాం? దుష్టుడ్ని పెళ్ళాడి కష్టాలు పడడంకంటె నా బిడ్డ యోగినిగానే ఉండిపోతుంది. దానికి పెళ్ళిఅక్కర్లేదు" అంది.

"వానికి విద్యలేని లోపం ఒక్కటే తప్ప మిగిలినవి అసత్యాలే. విరతి వేదాంతి కదా? ఎలా ఉన్నా సర్దుకో గలదు. మరో సంబంధం ఏదీలేదు. తరలిరమ్మని శుభలేఖ పంపాం. ఇప్పుడు వొద్దంటే వీర్యవంతుడు కోపగించడా? ఎలాగేనా నువ్వు అంగీకరించాలి" అని బతిమాలాడు రాజు. కాని ఆమె వినలేదు. "బిచ్చగాడి కిచ్చినా సంతోషిస్తాను కాని వత్సుడి కివ్వడాని కంగీకరించను" అని కచ్చితంగా తెగేసి చెప్పేసింది.

అప్పుడు రాజు – "సరే. నువ్వన్న మాటమీద ఉండు. ఇక సంబంధాలకోసం దేశాలు తిరగలేం. ఎల్లుండి ఉదయం ఉత్తరగోపురం దగ్గరికి ఊళ్ళోకి వచ్చే మొదటి వాడు ఎవడు కనపడతాడో వాడికి విరతి నిస్తాను. అంగీకారమేనా?" అని అడిగాడు.

"అలాగే చెయ్యండి. దేముడే తగిన వరుణ్ని తీసుకొస్తాడు" అందామె. ఆమాట వాళ్ళిద్దరికీ తప్ప మరెవరికీ తెలియదు.

రాజు అంతఃపురంనుంచి ఇవతలకి వచ్చేసరికి కుశుడు కలుసుకుని – "వీర్యవంతుడు రేపు రాత్రికే వస్తాడట. విడిది ఎక్కడ ఇద్దాం?" అని అడిగాడు.

రాజుకోపంగా – "చాల్లే. గొప్పనిర్వాకం చేశావు. వత్సుడు వొట్టి నిర్భాగ్యుడట. మీ అమ్మ విరతిని వాడి కివ్వడానికి అంగీకరిచలేదు. వాళ్ళని రావొద్దని రాసెయ్యి" అన్నాడు.

"అలా చేస్తే వాళ్ళకి కోపం రాదూ? వాళ్ళకి కోపం వస్తే మనం నిలబడగలమా? వత్సుడు నిర్భాగ్యుడని చెప్పిన వారు శత్రువులు" అని అతను ఏదో చెప్పబోతూంటే చంద్రగుప్తుడు – "పోపో. నీ కపటం అంతా తెలిసింది. పెద్దవాణ్ని దేశాలపాలు చేశావు. విరతికి నీచుణ్ని తెచ్చావు. తెలియక నీమాయలకు చిక్కాను" అంటూ అతని మాటలు వినిపించుకోకుండా విచారంగా నివాసానికి పోయాడు.

అని చెప్పి – సమయం దాటిపోతూండడంతో ప్రయాణానికి బయలుదేరాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 127. వ మజిలీ

### జంగందేవర కథ

తెల్లారి ఎనిమిది గడియలకి ముహూర్తం. వీర్యవంతునికి రావొద్దని ఉత్తరాలు పంపడంవల్ల వాళ్ళు రాలేదు. రతిని గ్రహించడానికి సుకుమారుడు మహావైభవంగా ఊరేగసాగాడు. మంగళవాద్యాలతో ఊరంతా మార్మోగి పోతూంది.

పురోహితులు వివాహ వేదిక మీద రెండు పెళ్ళిపీటలు వేసి మంగళ సంస్కారాలు చేస్తున్నారు. విరతికి వరుడెవరో తెలియదు. విడిది కూడా లేదు. దీని గురించి ఆప్తులు గుసగుస లాడుతున్నారు. పెళ్ళివేళ చూస్తాం కదా అని సరిపెట్టుకుంటున్నారు.

అరుణోదయమై - చీకట్లు తొలగిపోతున్నాయి. పక్షులు కూస్తున్నాయి. కాలాన్ని సూచించే భేరీ ధ్వనులు మోగుతున్నాయి.

అప్పుడు చంద్రగుప్తుడు స్నానంచేసి తయారై గుర్రమెక్కి రత్నాల పల్లకీని వెంట రమ్మని ఉత్తర గోపురం దిశగా వెళ్ళసాగాడు. తమని పిలవలేదేమా అనుకుంటూనే కొందరు బంధువులు పల్లకీవెనక వెళ్ళసాగారు. ఉత్తరగోపురం దగ్గర ఆగి రాజు అటూ యిటూ చూస్తూంటే - కంచుగంట, శంఖం పట్టుకుని నెమలి ఈకలతో అలంకరించుకుని, వొంటినిండా విబూది పులుముకుని, గంధం బొట్టు పెట్టుకుని వయసెంతో కనిపించని - పట్నంలో ముష్టెత్తు కుందుకు ఒక జంగందేవర వస్తూ కనిపించాడు.

అతన్ని చూడగానే రాజు గుండె ఝల్లుమంది. 'హా! విరతీ! నీ కెలాటి గతి పట్టింది! మహారాజు కడుపున పుట్టినా ఈ బిచ్చగాణ్ని

పెళ్ళాడవలసి వస్తూందా! ఇదంతా నీ తల్లి వల్లనే జరిగింది. విధి ఇలా ఉంది కాబోలు, నేనేం చెయ్యగలను?' అనుకుంటూ విచారం తోనే – "ఆ జంగందేవరను గౌరవంగా పల్లకీ ఎక్కించి ఊరేగిస్తూ పెళ్ళి పందిరికి తీసుకురండి" అని చెప్పి భార్యవద్దకు పోయి జరిగింది చెప్పి – "ఇప్పుడు ఏం చెయ్యమంటావు?" అని అడిగాడు.

ఆమె కన్నీరు కార్చుతూ – "విరతి విరాగిణి. దానికి ఎలాటి మగడయితే ఏం? వత్సుడి కంటె ఎవడేనా నయమే పోన్లెండి మీసంకల్పం నెరవేరింది. మంచివాడిని తీసుకురావాలని ఉంటే అలాటి ప్రతిజ్ఞ ఎందుకు చేస్తారు? పొద్దుటే ఊళ్ళోకి వొచ్చేవాడు చక్రవర్తి ఔతాడా? జంగమదేవర మంచివాడే ఏమో. పరమేశ్వరుడే ఆ వేషంలో వచ్చాడేమో. ఎవరి పుణ్యం ఎవరికి తెలుస్తుంది? అతనికే ఇచ్చి పెళ్ళి చెయ్యండి" అంది విరక్తిగా.

రతీసుకుమారుల వివాహం వైభవంగా జరిగింది. విరతికి సుగతుడనే ఆ జంగంతో రహస్యంగా పెళ్ళి జరిగింది. బంధువు లెవరికీ అందుకు కారణం తెలియదు. "నీ మగడు జంగం నీ మగడు జంగం" అంటూ రతీ, కుశుడూ పిల్లలచేత వాళ్ళని వెక్కిరింపులు చేశారు. జోగుర లు, జంగమూ భిక్ష మొత్తుకుంటూ దేశాటనం చెయ్యొచ్చని పరిహసించేవారు. ఆ మాటలకి విరతి ఏ జావాబూ చెప్పేది కాదు.

ఒకనాడు రతి గుర్రపుబండి మీద వచ్చి – "పూలతోటకి వెళ్దాం వస్తావా? నీ మొగుడు గ్రామాలకు వెళ్ళాడా? నువ్వు గంట వాయించగలవా? శంఖం ఊదగలవా? వేదాంతివి కదా. నీకు సరిపడ్డవాడే దొరికాడులే. వేదాంతానికి ఫలం ఇదే" అని వెక్కిరించింది. విరతి – "మగడితో నువ్వు సుఖించు. అదే నాకు సంతోషం. వేదాంతం నీకు హాస్యాస్పదం అయిందా!" అంది వాళ్ళిద్దరూ వాదించు కుంటూంటే రాజపత్ని రతిని మందలిస్తూ – "నవ్విన ఊళ్ళే పట్నా లౌతాయి. ఎవరినొసట ఏమి రాయబడిందో!" అంది.

మరొకనాడు కుశుడు సుకుమారుడిని ఏకాంతంగా పిలిచి – "బావా! ఈ జంగం దేవర మూలంగా మనకి అపకీర్తి వొస్తూంది.

ప్రతిసభకీ వచ్చి మనతో సమానంగా కూర్చుంటాడు. మా తండ్రికి వాడిమీద ప్రేమ అవడంవల్ల ఏమనడానికీ వీలుండడంలేదు. ఈ అవమానం వొదిలే ఉపాయం ఆలోచించు" అన్నాడు. "రాబోయే అనర్థం నీకు తెలియనట్లుంది. విను. నీ తండ్రి విరతికీ, ఆమె మగనికీ అర్ధరాజ్యం రాసిఇవ్వాలని నిశ్చయించుకున్నాడు. మొన్న పండితులనీ, ధర్మశాస్త్రాలనీ తెప్పించి ఆ విషయం పరిశీలించాడు. కూతురికి ఎంతయినా ఇవ్వొచ్చు – అన్నారట. లవుడి భాగం జంగందేవరకీ ఇస్తారట" అన్నాడు సుకుమారుడు.

ఆ మాటలు విని కుశుడు విభ్రాంతుడయ్యాడు. "రాజ్యం అవిభాజ్యం కదా? ధర్మశాస్త్రా లొప్పుకున్నాయా?" అని అడిగాడు. "అంతా చట్టాలు చూసే నిశ్చయించారు" అన్నాడు సుకుమారుడు. అప్పుడు కుశుడు ఆలోచించి – "బావా! నువ్వు సహాయం చెయ్యాలి. ఈ పని జరగకుండా వేరే ఏదైనా ఉపాయం చెప్పాలి. మా అన్నని సాగనంపి నట్లే వాళ్ళిద్దరినీ కూడా దేశాల పాలు చెయ్యాలి. విరక్తుడయిన రాజు ఏం చెయ్యగలడు?" అన్నాడు.

"అప్పుడు రాజ్యమంతా నీకే దక్కుతుంది" అంటూ సుకుమారుడు అతని చెవిలో ఏదో చెప్పాడు. కుశుడు ముఖం వికసించింది.

మరికొన్ని రోజులు గడిచాక.... ఒకనాటి ఉదయం విరతి కళ్ళు తెరిచేసరికి మహారణ్యంలో ఒక చెట్టుకింద ఉంది. ఆమె ఆశ్చర్యపోయి "ఇదేం మాయ? అంతఃపురం ఏమైంది? అడవిలో ఉన్నానేమిటి? ఇది కలకాదు కద?" అనుకుంటూ నాలుగువేపులా చూసింది. ఆకాశంలో సూర్యుడు కనిపించాడు. ఇంకా అరుణ కాంతే ఉంది. దానితో – 'ఇది స్వప్నం కాదు. పరమేశ్వరుడి ఇంద్రజాలం. ఇదే మహామాయ. ఏమైతే నాకేం? వినోదం చూస్తాను' అని లేచి నాలుగడుగులు వేసేసరికి సుగతుడు తనకి ఎదురుగా వొస్తూ కనిపించాడు. అత నామెకి మంగళ సూత్రం కట్టడమే తప్ప అంతవరకూ ఆమెతో ఒక్క మాటైనా మాట్లాడలేదు. కనక కొంచెం జంకుతూ –" రాజపుత్రీ!

మన మిక్కడికి ఎలా వొచ్చాం?" అని అడిగాడు. ఆమెనోరు విప్పకుండానే తనకేమీ తెలియదనీ భగవంతుడి విలాసమనీ సైగలతో చెప్పింది. అతను మౌనంగా ఆమెతో నడవసాగాడు.

పోయిన కొద్దీ అరణ్యం దట్టమవడమే తప్ప తెరిపి ఏమీకనపడలేదు. ఇద్దరూ మూగవాళ్ళలా ముందుకు పోసాగారు. ఎండవేడి భరించలేక నీడ పట్టున నిలుచుందా మనుకుంటూంటే ఒకచోట దిగుడు బావి కనిపించింది దానిలోకి తొంగి చూశారు నీళ్ళు చాలా లోతులో ఉన్నాయి. ఏంచేయాలో తోచక తడబడుతున్న సుగతుడి దైన్యం చూసి ఆమె ఒక తాటాకును చీల్చి తాడులా కట్టి అతని చేతిలోని గంటని తిప్పి కట్టి నీరు తోడి అతనికి పోసింది అతను పది గంటల నీరు తాగాడు. ఆమె కూడా నీరు తాగాక ఆ నూతిచుట్టూ తిరుగుతూ చూస్తూంటే పైశాచక భాషలో ఒక శిలా శాసనం కనిపించింది. ఆ భాష తెలిసిన విరతి దానిని చదివింది.

"ఈ ప్రాంతంలోని కీలక పర్వతం మీద ఛండవేగుడు అనే భూతరాజు భార్యతో కాపరం చేస్తున్నాడు. అతను అర్ధరాత్రి ఈ రాతి బండమీద కూర్చుని మాంసాహారం భుజించి నూతిలోని నీళ్ళన్నీ తాగేస్తాడు. అప్పుడు నూతిలో మెట్లు కనపడతాయి. వాటిని దిగుతూపోతే పాతాళలోకానికి చేరతారు అప్పుడప్పుడు భూతదంపతులు అలా పాతాళానికి వెళ్తారు. తెల్లవారే సరికి నూతిలోకి నీళ్ళు వొస్తాయి. ఈ ప్రాంతంలో రాత్రులందు మనుషులుంటే భూతరాజుకి ఆహారం అయిపోతారు."

ఆమె చెట్టు కింద పడుకుని సమయంకోసం చూడసాగింది. శిలాశాసనం విషయం తెలియని సుగతుడు ఆమెకు పళ్ళు తెచ్చి ఇచ్చి తను కూడా వాటితో ఆకలి తీర్చుకున్నాడు. క్రూరమృగాలు వొస్తే గంటవాయించి శంఖం ఊదితే అవి పారిపోయేవి.

తొందరగానే అతనికి నిద్రవచ్చేసింది కొంతసేపటికి భూతాలకంపు కొట్టింది. 'అయ్యో! ఈ సుగతుడు నా వల్ల కొంచెమయినా సుఖపడకపోయినా కూడా విశ్వాసంగా నా వెంట తిరుగుతున్నాడు. నన్నే

మీ బలాత్కరించదు. నా చావు గురించి విచారం లేదు. ఆ భూతం నన్ను చంపి వీనిని వదిలేస్తే బాగుండును. నేను శిలాశాసనం గురించి చెప్పానయినా కాదు. పాపం, గుర్రుపెట్టి నిద్ర పోతున్నాడు. భూతం వొచ్చి చంపుతుంది. కాబోలు ఎంత పాపాత్మురాలిని!" అనుకుని అంతలోనే – 'నా వెర్రి కాని విధి తలుచుకున్న దానికి నా బాధ్యత ఏమిటి? ఈ కల్పన అంతా చేసినవాడూ, ఈ అరణ్యమధ్యానికి తెచ్చినవాడూ ఎవడు? జరిగేది చూడడమేనాపని' అని కొమ్మల సందులోంచి వాడిరాకను గమనించసాగింది.

అంతలో గండశిలవంటి తల, గుహలాంటి నోరు, రక్తం ప్రవహిస్తున్నట్లున్న నాలుక, వాడి అయిన కోరలు, పొట్టిచేతులతో వస్తున్న భూతరాజు వికృతరూపానికి ఆమె కళ్ళు మూసుకుంది. నల్లని ఆ భూతం దగ్గరకి వస్తున్న కొద్దీ చిన్నదౌతూ చివరకి ఒక సామాన్య మానవుడిలా కనపడింది. ఆ భూతరాజు రాతిమీద కూర్చుని "ప్రేయసీ! ఎక్కడ? ఇంకా రావేం?" అని పిలవగా – నూతిలోంచి మెట్లెక్కి ఆమె వచ్చి – "నాథా! ఈ రోజు ఇంత ఆలస్యం చేశారేం? ఊరికే ఉండడం ఎందుకని జలజంతువుల కోసం నూతిలోకి వెళ్ళాను. ఏమీ దొరకలేదు. మీరేం తెచ్చారు? నరమాంసం తెచ్చారా?" అని ఆశగా అడిగింది. అతను ఫక్కున నవ్వుతూ..." ఇవాళ ఒట్టు పెట్టినట్లు ఏమి దొరకలేదు నరమాంసం అటుంచు, కుక్కమాంసం కూడా దొరకలేదు నువ్వేమన్నా సంగ్రహించిందుంటే తీసుకురా" అన్నాడు.

"నాకు ఏమీ దొరకలేదు. నూతి నీళ్ళతో కడుపునింపుకుందాం. నాకూ ఆకలి మండిపోతూంది." "పరగడుపున నీళ్ళు నోటికి పోవుకదా. ఏదేనా మాంసం వెదికి తీసుకురా. నీకు పుణ్యముంటుంది–" "మన భయంతో ఇక్కడ జీవులు నివసింపవు కదా. అంతగా ఆకలేస్తే నన్ను తినెయ్యండి."

"ప్రేయసీ! అలాటి మాటలు ఎప్పుడూ అనకు. నువ్వు లేకపోయి నప్పుడు నేనుండి ఏం చెయ్యాలి? ఒకరాత్రి ఏదోలా తాళలేమా?" అన్నాడు భూతం.

"పోనీ..ఫలాలేవైనా తెచ్చేదా?" "వొద్దు. వమనం (వాంతి) ఔతుంది. అవితింటే నీ ఆకలి సంగతేమిటి? అదీ నా విచారం. రెండు రోజులు ఆగామో, కొండలంత నరమాంసం, ఏరంత రక్తం, కుండలతో రక్తంతాగొచ్చు."

"అదెలా? భూమిమీద జననష్టం కలిగించే ఉపద్రవమే దయినా జరుగుతుందా?"

"ఒక స్త్రీ మూలంగా ఇద్దరు మహారాజులు యుద్ధం చేయబోతున్నారు. సైన్యాలు మోహరించి ఉన్నాయి. వేలకొద్దీ సైనికులు చస్తారు దాంతో మనకి కావలసినంత రక్తం మాంసం దొరకుతాయి. "అంటూ ఆనందంతో గంతులు వేయసాగాడు. అతని భార్యకూడా అతనికి తోడై నాట్యం చేసింది. తరవాత ఇద్దరూ విశ్రాంతిగా కూర్చున్నారు. అప్పు డామె – "ఆహారం లేకపోడంతో మనకి పనీలేదు. ఇంతకీ ఆ స్త్రీ ఎవరు? ఆమెకోసం పోట్లాడబోతున్న రాజు లెవరు? ఎందుకు యుద్ధం చేస్తారు?ఆ కథేదో చెప్పవచ్చుకదా! కొంత కాలక్షేపం ఔతుంది. కథలో పడితే ఆకలిని మరచిపోతాం" అంది భూతం భార్య.

"అవును నిజమే! అది చాలా చిత్రమయిన కధ. విని తీరవలసిందే" అంటూ అతను ఆకలి బాధను మర్చిపోయేలా ఆ కదను ఇలా చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 128. వ మజిలీ

### సురస కథ

దేవయజనం అనే అగ్రహారంలో అగ్నివర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనెన్నో వేదవేదాంగాలు చదివీ, యాగాలు చేసీ, శ్రోత్రియులలో ఉత్తముడని పేరు పొందాడు. అతని ఏకైక పుత్రిక సురస. ఆమె అతిచక్కనిది కావడం వల్ల తగిన వరుడి కోసం ఎంతో ప్రయత్నం చేసి విద్య, రూప, యౌవన, ఐశ్వర్యాల్లో సంపన్నుడయిన ప్రవరుడు అనే విప్రకుమారుడి కిచ్చి పెళ్ళిచేసి తనవద్దనే ఇల్లరికం ఉంచుకున్నాడు.

సురసకి ప్రాప్తకాలంలో యౌవనం వచ్చింది. సరసుడైన ప్రవరుడు సురసతో సరసాలకు తొందరపడుతున్నాడని గ్రహించిన అగ్నివర్మ శుభముహూర్తంలో వారిద్దరికీ శోభనం ఏర్పాటు చేశాడు చెలికత్తెలు వారిని కూర్చోబెట్టి గంధంపూయించడం, పన్నీరు జల్లించడం, దండలు వేయించడం మొదలైనవి చేసి – అవతలికి తొలగిపోయి గదితలుపులు బిగించారు. వెంటనే ఆమె కూడా మంచం దిగిపోయి తులపుమూలకి పోయింది. ప్రవరు డామెను ప్రేమతో కౌగలించుకోబోగా ఏడుస్తూ విరసత్వం చూపింది. అంతలో తూర్పు తెల్లవారింది. చెలికత్తెలామె చుట్టూ మూగి – “నీ అల్లరి తెలిసింది. మీ తల్లికి చెబుతాం సుమా!” అంటూ ఆమె రాత్రి ప్రదర్శించిన ప్రవర్తనను తగదని మందలించారు. ఎన్నో పురాణాలు చదివిన ఆమెకు పతిపట్ల ఇటువంటి విరసత్వం తగదన్నారు.

మరుసటి రాత్రి కూడా ఆమె మళ్ళీ అలాగే ప్రవర్తించేసరికి ప్రవరుడు కోపగించి ఆమెను పలకరించడం మానేశాడు. చెలులు ఆ సంగతంతా ఆమె తల్లికి చెప్పారు. ఆమె సురసని బుజ్జగించీ, లాలించీ ఎన్నోవిధాల నచ్చచెప్పింది. మూడోరాత్రి ప్రవరుడు తన శృంగార

విద్యాపాటవమంతా చూపినా సురస సరసానికి అంగీకరించలేదు. పతికేమాత్రం అనుకూలవతి కాలేదు. తల్లి తన కూతురి స్తబ్దతను భర్తకి తెలిపింది. అతను అల్లుడికి ఒక సందేశం రాసిపంపగా ప్రవరుడు జవాబుగా ప్రతి సందేశం రాసి పంపాడు. అది చదివి అగ్నివర్మ – "ప్రవరుడికి అన్నీ తెలుసు. సురసలో కామ ప్రవృత్తి లేదు. కొన్నాళ్ళు దానికి భర్త సంపర్కం మానిపించాలి." అని భార్యకి చెప్పాడు. కొన్నాళ్ళపాటు ఆమె కూతురికి దాంపత్య విషయాలు బోధించినా సరయిన సమాధానం పొందక – "మనోహరా! మన సురసకు పద్దెనిమిదేళ్లు నిండుతున్నాయి. అవయవాలు పూర్తిగా వికసించాయి. ఐనా పురుషాపేక్ష కొంచెమైనా కలిగినట్లు లేదు. అల్లుడు మంచివాడు కనుక ఇన్నాళ్ళు ఆగాడు. అతను మరొకరిని పెళ్లాడతానని చెప్పినా సురసలో భర్తపట్ల అనురక్తి కలగలేదు. ముందుకూడా కలుగుతుందని తోచటంలేదు. కూతురి నెలా మందలించు కుంటారో మీరే చూసుకొండి" అంది.

అది విని ఆ బ్రాహ్మణుడు ఆలోచించి – "ఇక మనం ఎన్ని చెప్పినా దానికి కామగుణం కలగదు. రూపం చక్కనిదీ, వయస్సు యౌవనం, విద్య సాటిలేనిదే, బుద్ధి చురుకయిందీ అయినా భర్తంటే భయపడే దానిని ఏమనుకోవాలి? అది బ్రహ్మచారిణిలా ఉంటుంది. ఎరగక పెళ్ళిచేశాం. మరికొన్నాళ్ళు చూడమని ప్రవరుణ్ని బతిమాలతాను. అతను మనమాట వింటాడు సురస నేమీ అనకు–" అన్నాడు.

"విరక్తురాలంటే నేనంగీకరించను. మగడు తప్ప అన్నింటిలోనూ దానికి ఆసక్తే. దానికి తెలియని పనిలేదు. పురాణాలు బోధిస్తుంది. పతివ్రతా ధర్మాలు చెబుతుంది. ఈ పురుషద్వేషం మన ప్రారబ్ధం" అందామె విచారంగా.

"పోనీలే. అది నా ఆరోప్రాణం. దాన్ని ఏమీఅనకు –" అన్నాడు అగ్నివర్మ.

సురసకి పురుషవాంఛ లేదని గ్రామమంతా వ్యాపించింది. ప్రవరుడు అత్తమామల ఆదరాన్ని, సురస సౌందర్యాన్నీ దృష్టిలో ఉంచుకుని ఎప్పటికేనా దానిబుద్ధి మారుతుందేమో అని ఆశగా ఎదురు చూడసాగాడు

# కాశీ మజిలీ కథలు

## 129. వ మజిలీ

### అల్పుడి కథ

ఒకనాడు అగ్నివర్మ వీధిచావడిలో కూర్చుని శ్రోతలకు మహాభారతంలోని శాంతిపర్వం పురాణం చెబుతున్నాడు. అప్పుడు చాలా అందమైన, పదహారేళ్ళ వాడొకడు వచ్చి అక్కడ కూర్చుని శ్రద్ధగా వినసాగాడు. అతని బట్టలు మాసినా తేజస్సు తగ్గకుండానే ఉంది.

"గృహస్థధర్మము, యోగ ధర్మమూ కూడా మోక్షానికి ముఖ్య మార్గాలే. రెండూ కష్టపడి ఆదరించవలసినవే" అంటూ వాటిగురించి వివరణలు చెప్పాడు అగ్నివర్మ. ఆ చిన్నవాడు లేచి అతనికి నమస్కరించి – "మహానుభావా! ఇవాళ నా మనసులో సందేహాన్ని తీర్చారు. అమృతం లాటి పురాణవాక్యం చెప్పారు" అన్నాడు. అగ్నివర్మ అతని వివరాలు అడగగా అతను తన వృత్తాంతం చెప్పసాగాడు.

"నా పేరు అల్పుడు. తల్లితండ్రు లెవరో ఎరగను. కులగోత్రాలు అసలే తెలియవు. ఏకాకినై తీర్థయాత్రలు చేస్తున్నాను. ఇవాళ మీరు చాలా మంచి మాటలు చెప్పారు" అంటూ అతనిని స్తుతించాడు.

అగ్నివర్మ ఆనందించి – "నాయనా! నీ మాటలు వింటూంటే విరక్తుడలా అనిపిస్తున్నావు. నీకు ఆ అభిలాష ఉంటే కొన్నాళ్ళు ఇక్కడ ఉండి పురాణం విను. నీ సందేహాలన్నీ తీరిపోతాయి. మా యింట్లో భోజనం చెయ్యి." అన్నాడు. అల్పుడు వాళ్ళింట్లో ఉంటూ రోజు పురాణం వినసాగాడు.

ఒకనాడు సురస ఎండలో కొంచెం దూరంగా ఉన్న నూతికి నీళ్ళు తేవడానికి వెళ్ళి, కొంతసేపట్లో చిరిగిన వస్త్రాలలో చెదరిన తలతో

ఏడుస్తూ వచ్చి తండ్రిపాదాల మీద పడి – "తండ్రీ! నువ్వు పండితుడివే కాని లోకజ్ఞానం కాస్సైనా లేనివాడివి. అల్లుడి కులశీలాలు తెలుసుకోకుండా ఇంట్లో పెట్టుకుంటావా? వాడు వట్టి టక్కరి. ఆ నీచుడు నన్ను కామించి తిరుగుతున్నాడని నాకు తెలియలేదు. నేను బిందె తీసుకుని మంచినీటికి పోతే – 'నువ్వు సుకుమారివి. 'నేను చేదుతానులే' అంటే, 'తమ్ముడా! నాకు శ్రమలేదు. ఎండలో ఎందుకొచ్చావు? ఇంటికి పో" అన్నాను.

వాడుకదలక, అటూ యిటూ చూసి అక్కడ ఎవరూలేకపోవడం గమనిచింది – "నీ మగడు ఇక్కడే ఉన్నాడు. అతనిమీద నీకు ఇష్టంలేదని విన్నాను. నిన్నుచూస్తే జాలేస్తూంది. ఎందుకు యౌవన్నాన్ని వ్యర్థం చేసుకుంటావు? గతించిన యౌవనం తిరిగిరాదు." అంటూ ఏమిటేమిటో మాట్లాడి చివరకు తనని కూడమంటూ నన్ను కౌగలించుకున్నాడు.

తరవాత జరిగింది నీ కేమని చెప్పుకుంటాను? కొప్పు పట్టుకుని, చేతులు లాగుతూ ఎన్నో చిక్కులు పెట్టాడు. కేకలు వేసినా దగ్గరలో ఎవరూ లేరు. ఎలాగో తప్పించుకుని పారిపోయివచ్చాను. నా ఒళ్ళంతా ఎలా చీరేశాడో చూడు. నా ప్రారబ్ధం. పరపురుషుడి చేతిలో ఇలా జరిగింది. ఇక ఈ దేహం కాల్చనా?" అంది దీనంగా.

అగ్నివర్మ అల్లుడిని కృతఘ్నుడంటూ తిడుతూ – "ఈ ఎండలో మీ అమ్మకి కూడా తెలియకుండా నీటి కెందుకు పోయావు? సరే. అల్లుడు ఎక్కడున్నాడో చెప్పు. అధికారికి అప్పగిస్తాను" అన్నాడు.

"నేను తిరస్కరించడంతో వాడు ఊరిచివర తోటవేపు పారిపోయాడు. అక్కడే ఉండి ఉంటాడు" అంది సురస. అతను శిష్యులని వెంటబెట్టుకుని ఆ తోటకు వెళ్ళి నాలుగు వేపులా చూడగా – ఒక చెట్టుకింద కూర్చుని ఏదో ధ్యానించుకుంటున్న అల్లుడు కనిపించాడు. అతనిని పరిపరివిధాలుగా నిందించి. అప్పటికీ కోపం తీరక దుడ్డుకర్రతో వాడి నెత్తిమీద కొట్టాడు. అల్లుడి తలకు గాయమై రక్తం కారుతూంటే శిష్యులు కట్టుకట్టి ఏమీ సమాధానం చెప్పక మౌనంగా ఉన్న అతణ్ణి రెక్క పట్టుకుని గ్రామాధికారి వద్దకు తీసుకుపోయి అతను చేసిననేరం చెప్పి తగిన శిక్షవిధించమని కోరారు.

ఆ అధికారి తన బుద్ధిబలమంతా ఉపయోగించి ఆ ఫిర్యాదును విచారించి ఏంచేయడానికి తోచక ఏదో తీర్పురాసి పైఅధికారి అయిన మండలాధిపతికి పంపించాడు. అతనికీ ఏం చెయ్యాలో తోచక రాజుగారయిన దేవవర్మకి పంపేశాడు.

దేవవర్మ ఒక సామంతరాజు. మణిచక్రం అనే నగరానికి అధిపతి. ప్రజలని న్యాయంగా పాలించేవాడు. దేశం చిన్నదయినా, అతను సామంత రాజయినా, అతనికీర్తి రాజ్యపాలన వల్ల నాలుగుమూలలా వ్యాపించింది. అతను అపరాధాలని చక్కగా విచారించి నిజం తెలుసుకుని నేరస్తులని తగిన విధంగా శిక్షించేవాడు.

అగ్నివర్మ తెచ్చిన ఫిర్యాదును మంత్రి రాజు చేతి కందిస్తూ – "ఇదో వింత తగవు. గ్రామాధికారి; మండలాధిపతి నిజం తెలుసుకోలేక మనవద్దకు పంపారు" అన్నాడు. అతను ఆ అభియోగానికి సంబంధించిన వివరాలను చెప్పమన్నాడు. మంత్రివాటిని చూపాడు. "......నర మృగ పశు పక్షి క్రిమికీటకాదు లన్నిటికంటే అల్లుడినని తలచి నాకు నేనే ఆ పేరు పెట్టుకున్నాను. ఆ బ్రాహ్మణుని తండ్రీ అని పిలుస్తున్నాను. తరవాత విషయం నేను చెప్పలేను. యౌవనం ఎన్ని వికారాలయినా కలిగిస్తుంది దైవం ఎలాటి బుద్ధయినా పుట్టిస్తుంది. నన్ను తప్పకుండా శిక్షించవలసిందే. సురసలో ఏదోషమూలేదు" అని అల్లుడిగురించి చదవగా – "మరి వాళ్ళకి సందేహం ఎందుకు కలిగింది? స్త్రీలకంటే మగవాళ్లే చంచలురు. కాని ... సురసదీ, అల్లుడిదీ ఒక మాటగా ఉంది. అందుచేత దానిలో ఏదో రహస్యం ఉండక మానదు. అందరినీ రప్పించు. విచారిద్దాం" అని రాజు అంతఃపురానికి పోయాడు.

మూడోనాటికి వాళ్ళందరినీ న్యాయస్థానానికి రప్పించారు. విచిత్రమైన అభియోగం కనక ప్రజలు కూడా అధికసంఖ్యలో తరలి వచ్చారు.

రాజు మొదట అల్లుడిని పిలిపించాడు. అతని సౌందర్యాని కాశ్చర్యపోయాడు.

రాజు : నీవెవరివి?

అల్లుడు : శ్లో॥ నా హం దేహో నేంద్రియాణ్యంతరంగః
నాహంకార ప్రాణవర్గో న బుద్ధిః
దారా పుత్ర క్షేత్ర విత్తాది దూరః
సాక్షి నిత్యః ప్రత్యగాత్మా శివోహం.

రాజు : (తనలో) వీడెంత చక్కగా ఉన్నాడు. మాటలు ప్రగల్భంగా ఉన్నాయి. వీడిని చూస్తూంటే నాకుకూడా మనసు మారిపోతూంది. (పైకి) మా ఎదుట వేదాంతం కాదు, యదార్థం చెప్పాలి.

అల్లుడు : నేను చెప్పిందే యదార్థం.

రాజు : (సరసను చూసి ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపోయి - ఒకరి కొకరు తగినవారే అనుకున్నారు). ఈమె తండ్రి ఎవరు?

అగ్నివర్మ : మహాప్రభూ! నేనే. అగ్నిహోత్రుడంటారు నన్ను. సత్కాలక్షేపం చేస్తూంటాను. ఎన్నడూ రచ్చకెక్కి ఎరగను. లేకలేక ఈ బిడ్డ పుట్టింది. పురుషులంటే విముఖత. మా గ్రామాధికారి నాయందు విరోధం వల్ల ఆ తుచ్ఛుడు మంచివాడనీ, నాబిడ్డ చెడ్డదనీ రాసి పంపాడట.

రాజు : భూసురోత్తమా! సాక్షి అంటే ఏమిటి?

అగ్నివర్మ : కళ్ళారా చూసిన వాడని.

రాజు : ఔను మరి మీ కూతుర్ని అల్లుడు కోరుతుండగా చూసిన వారెవరు?

అగ్నివర్మ : అది అబద్ధం ఆడదు. దానిమాట శిలాశాసనమే. నేను కూడా అబద్ధం చెప్పనివాడిని.

రాజు : ఇప్పుడు వీడిని ఏం చెయ్యమంటారు?

అగ్నివర్మ : శిక్షాస్మృతిలో చెప్పినట్లు చేతులు తరగాలి. వీడు మహాపాపాత్ముడు. మా యింట్లో తిని, పురాణం విని, గురుపుత్రికనే పరాభవించినవాడు. శిక్షాస్మృతి ప్రకారం శిక్షించండి.

రాజు : అల్లుడా! నువ్వేమంటావు?

అల్లుడు : న్యాయశాస్త్ర ప్రకారం అపరాధిని శిక్షించండి.

రాజు : నువ్వు తప్పు చేశావా?

అల్లుడు : సందేహం ఎందుకు?

రాజు : నిన్ను దండించవలసిందేనా?

అల్లుడు : సందేహం ఎందుకు?

రాజు : ఎందుకు ఆ తప్పు చేశావు?

అల్లుడు : ప్రారబ్ధం కొద్దీ.

రాజు : దేవీ! ఇతను నిన్ను కామించిన మాట వాస్తవమేనా?

సురస : వాస్తవమే (తలవంచు కుంటుంది)

రాజు : ఎలా కామించాడో చెప్పు.

అగ్నివర్మ : మీరలా అడిగితే ఆడవాళ్ళు సభలో సిగ్గువిడచి ఏం చెబుతారు? నాకే వొణుకు వొస్తూంది.

రాజు : జరిగింది చెప్పకతప్పదు.

అగ్నివర్మ : (కూతురితో) భయపడకుండా నిజం చెప్పు.

సురస : (తలవంచుకుని) నేను నూతికి పోతూంటే వెనుక ఈల విన్పించింది. చూడగా – ఇతను.

రాజు : తరవాత?

సురస : మళ్ళీ నేను పోతూంటే నిలబడమని పిలిచాడు. నేను భయపడి నూతికిపోయి నీరు తోడుతూంటే ముద్దివ్వవా అని అడిగాడు. అర్థంకాక ముద్ద అంటే ఏమిటని అడిగాను.

రాజు : అంతకుముందు పురాణం వింటూండగా ఇతన్ని చూశావా?

సురస : జ్ఞాపకం లేదు.

రాజు : ఇతను నిన్నెరుగునా? అగ్నివర్మ కూతురివని తెలుసునా?

సురస : నాకు తెలియదు. ఎరగబట్టే వెంట వచ్చాడు.

రాజు : నీ మాట విని వీడు ఏం చేశాడు?

సురస : 'ముద్ద కాదు..ముద్దు. అది ఇమ్మని అడిగాను. ఇస్తావా?' అన్నాడు.

రాజు : నువ్వేమన్నావు?

సురస : నీచా! నా శీలం తెలుసుకోక ఇలా అంటావా? నిన్నేం చేయిస్తానో చూడు – అని వచ్చి మా తండ్రికి చెప్పాను.

అగ్నివర్మ : కౌగిలి మాట కూడా చెప్పు.

రాజు : మీరేమీ మాట్లాడకూడదు.

అగ్నివర్మ : నాతో చెప్పింది. అందుకని జ్ఞాపకం చేస్తున్నానంతే. గ్రామాధికారి దగ్గరకూడా చెప్పింది రాశాడు.

రాజు : మీరు ఛాందసులు. ఏ మాట అనాలో తెలియదు. ఊరుకోండి. పుత్రీ! తరవాత ఏం చేశావు?

సురస : జ్ఞాపకం వచ్చింది. నేను ఇంటికి పోతూండగా అడ్డంవొచ్చి కౌగలించుకోబోయాడు. తప్పించుకోయాను.

రాజు : అప్పుడక్కడ ఎవరేనా ఉన్నారా?

సురస : లేరు. ఒంటరిగా చూసే వాడు వచ్చాడు.

రాజు : నీ భర్తకి నీమీద ఇష్టమేనా?

సురస : ఇష్టమే.

రాజు : నీకతనిమీదో?

అగ్నివర్మ : రాజా! మీరు గ్రామాధికారి రాసిందే నమ్ముతున్నట్లున్నారు తప్ప మా మాటని కొంచెమయినా గౌరవించడం లేదు. బాల్య చాపల్యం వల్ల మగడంటే బెదురుతూంది కాని ఇష్టం లేకేం?

రాజు : పండితులని గౌరవిస్తూంటే అడ్డంగా మాట్లాడుతున్నారు. సహించను సుమా! ఆమే మా ప్రశ్నలకు జవాబులు చెప్పాలి.

అగ్నివర్మ : నాకు తెలియదు. క్షమించండి.

తనకి భర్తమీద ఇష్టముందో లేదో సురస చెప్పలేదు. రాజు - 'ఈ చిన్నది చక్కనిది. అతను మోహించవచ్చు. వీడు చక్కనివాడు. ఆమె ఇతన్ని మోహించవచ్చు. సురసమాటల్లో వ్యత్యాసాలున్నాయి. అల్లుడు అన్నిటికీ ఔననే అంటున్నాడు. వాడికి భయంలేనట్లుంది. చాలా విద్వాంసుడిలా, విరక్తుడిలా కనిపిస్తున్నాడు. ఏది నిశ్చయించడానికీ పాలుపోకుండా ఉంది. వాళ్ళిద్దరిలో ఎవరు అపరాధో కచ్చితంగా తెలుసుకుని కాని శిక్షించకూడదు' అంటూ చాలాసేపు ఆలోచించి - "మళ్ళీ రేపు విచారిస్తాం. అప్పటికి వారందరినీ రప్పించండి" అని మంత్రికి చెప్పి రాజు అంతఃపురానికి పోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 130. వ మజిలీ

### యమున కథ

*యమున* : ఏమిటీ సఖీ! నవ్వుతున్నావు? వింత లేమైనా చూశావా? వినతా! చెప్పవే. ఆపత్రి కేమిటి?

*వినత* : ఇది మీ తండ్రిగారు ప్రకటించినది. ఒక వింత అయిన నేరంలోని నిజం తెలుసుకోలేక దానిలోని నిజం ప్రత్యక్షంగా చూసి చెప్పినవారికి వెయ్యి దీనారాలు కానుకగా ఇస్తామని ప్రకటించారు.

*యమున* : అంత తెలియని అభియోగం ఎక్కడి నుంచి వొచ్చింది? ఆ విషయం నాకు చెప్పావా?

*వినత* : నేను చెప్పక్కర్లేదు. అంతా క్లుప్తంగా దీనిలోనే రాయబడి ఉంది. చూసుకో.

*యమున* : (చదివి) దీనిలోని నిజం నేను చెప్పగలను సుమా వినతా.

*వినత* : ఐతే ఆ పారితోషికం నీదే.

*యమున* : అల్లుడెంత అందగాడో, సురస ఎంతటి సౌందర్యవతో చూసివచ్చి నాకు చెప్పు.

*వినత* : ఇది వరకే చూశాను. అల్లుడు మన్మదుడే. చక్రవర్తి బిడ్డలా ఉంటాడు. సురసకూడా చాలా చక్కనిదే కాని అతనికి సాటిరాదు.

*యమున* : ఐతే సురసే మోసకత్తెలా తోస్తూంది. చెప్పి పారితోషికం అందుకోనా!

*వినత* : ఈ పాటి ఎవరేనా చెప్పగలరు రాజుగారికి ప్రత్యక్షంగా చూపాలట.

*యమున* : చూబిస్తాను.

వినత : ఐతే వెళ్ళి అయ్యగారికి చెప్పి తీసుకురానా?

యమున : పోయిరా.

అది వేగంగా వెళ్ళి రాజుకి చెప్పగా అతను అపరిమిత ఆనందంతో కుమార్తె వద్దకు వచ్చాడు. "నువ్వేమిటో చెప్పావట. నిజమేనా? అందులో ఎవరిది సత్యమో, ఎవరిది అసత్యమో యధార్థంగా చూపగలవా?" అని అడిగాడు.

యమున నవ్వుతూ – "వాంగ్మూలాలన్నీ చదివాను. ఆడదానిదే తప్పు. మగవాడిలో దోషంలేదు" అంది.

అందుకు రాజు – "అలా అనడానికి అవకాశం లేదు. పత్రికలని బట్టి దోషం ఆరోపించకూడదు. అదీకాక అల్లుడు కులశీలాదులూ, తల్లితండ్రుల వివరాలు చెప్పడు. తప్పు ఒప్పుకుంటున్నాడు. అతనే అపరాధి అని ఎందుకు ధ్రువ పరచకూడదు?" అని అడిగాడు.

"అంతరకూ సురస నియమవంతురాలే. అతన్ని చూశాక మనసుమారి ఉంటుంది. కావాలంటే నీకు ప్రత్యక్షంగా చూబిస్తాను. నేను చెప్పినట్లు చెయ్యి" అని ఏం చెయ్యాలో చెప్పిందామె.

రాజు సభకువెళ్ళి వాది ప్రతివాదులను రప్పించి అందరూ వింటూాంటగా తన మాటలను ప్రధానమంత్రిచేత చెప్పించాడు.

"విప్రోత్తమా! మీరు తెచ్చినతగవులో సత్యం నిరూపించడానికి ఆలోచించవలసి ఉంది. కనుక పదిరోజులు మీరు ఇక్కడే ఉండాలి. సురస, అల్లుడు ఈ పదిరోజులూ ఇతరులతో మాట్లాడకూడదు. పగలంతా వారిని చెరొక గదిలోనూ ఉంచి ఎవరితోనూ మాట్లాడకుండా చేస్తాం. రాత్రులు వాళ్ళిష్టం వచ్చినట్లు పోవచ్చు. అది బందీ, గృహం కాదు. దివ్యభవనం ఆ ప్రాంతంలో ఇతరులు ఎవరూ ఉండరు. పదిరోజులు అయ్యాక తీర్పు చెప్పబడుతుంది."

ఆ మాటలకు అగ్నివర్మకి కోపం వచ్చింది. "దేవా! అపరాధులని శిక్షించడం న్యాయంకాని, నిరపరాధులని నిర్బంధించడం న్యాయవిరుద్ధం కాదా? అల్లుణ్ని నిర్బంధంలో ఉంచండి. సురసను

ఉంచకూడదు - అని అంటూంటే రాజభటు లతన్ని గెంటుకుంటూ పోయారు ఏం చేయడానికీ వీలులేక అతను శాసనానికంగీకరించి అప్పటికి సురసను ఇంటికి తీసుకు పోయాడు

మర్నాడు రాజ పురుషులు సురసను సగౌరవంగా బండి ఎక్కించి ఒక భవనానికి తీసుకుపోయి దానిలో ప్రవేశపెట్టి తలుపులు వేసి పోయారు ఆ ఇల్లు చక్కగా అలంకరించబడి చదువుకుందుకు పుస్తకాలు తినడానికి ఆహారపదార్థాలు రత్నపీఠాలు ఉయ్యాల పూలు సంగీత పరికరాలు కలిగి ఉంది ఆమె అక్కడి వింతలు చూస్తూ పుస్తకాలు చదువుతూ వినోదంగా కాలక్షేపం చేయసాగింది సాయంత్రం అగ్నివర్మ రాజభటులతో బండిమీదవచ్చి ఆమెను తీసుకుపోయాడు సురస అక్కడి విశేషాలు అతనికి చెప్పింది అలా రెండు మూడు రోజులు గడిచాయి

ఆమె ఆ గదిగోడలని పరీక్షిస్తూ ఒకవేపు కిటికీ ఉండడంతో దానితాళ౦ పట్టిలాగింది అది ఊడి వచ్చింది అవతల మరోగది ఉంది అది అచ్చంగా తన గదిలాగే ఉంది తనగదిలో లాగే అక్కడా వస్తువులు ఉన్నాయి దానిలోకి చూసేసరికి అక్కడ అల్పుడు ఒక పీఠంమీద కూర్చుని కళ్ళుమ ుకుని ధ్యానిస్తూ కనిపించాడు

అతన్ని చూసేసరికి ఆమెకు వొళ్ళు ఝల్లుమంది రోమాలు నిక్క బొడిచాయి శరీరం చెమటలు కమ్మింది ఆమె మెల్లగా అతనికి వినిపించేలా - ఓ సుందరుడా ఆ వేళ నా మాట వినకపోడం వల్ల కదా నీకీ అవస్థ వచ్చింది? నువ్వు అంగీకరించి ఉంటే నా ప్రాణాలిచ్చి అయినా నిన్ను కాపాడకపోయే దాన్నా? పదివేల దీనారాలు వెలకలిగిన నా నగలు నీకు దక్కేవి ఎవరిమీదకీ పోని నామనసు ఎందుకనో నీతో వ్యభిచరించింది అందుకే - నిన్ను శిక్షించవచ్చునా? అని రాజు అడిగితే శిక్షించమనడానికి నోరురాక మీ చిత్తం అన్నాను నిన్ను వరించి కౌగలించుకుంటే తోసివేశావు పురాణం వింటున్న నిన్ను చూసి విరహం చెందాను నువ్వు నిజం చెప్పకుండా నేరం ఒప్పుకోవడం నామీద మక్కువ చేతనే అని భావిస్తున్నాను దాంతో నా కోపమంతా పోయింది నీ మనసు మారి ఉంటుంది నిప్పు అంటించాక ఆర్పడం కష్టంకదా ఇప్పుడేనా

నువ్వు అంగీకరిస్తే నీ నేరం తప్పిస్తాను దూరంగా పోయి సుఖపడదాం ఈ కిటికీ దగ్గరకి వచ్చి ఒక ముద్దుపెట్టు అంది అతను వినిపించుకోలేదు కాని పదే పదే పిలుస్తూంటే విసిగి - తల్లీ నువ్వు బ్రాహ్మణివి గురుపుత్రికవి శీలం ఎందుకు పాడు చేసుకుంటావు? ఈ శరీరం తుచ్ఛమయింది విద్వాంసుడు రూపవంతుడు కులీనుడు యువకుడు అయిన నీ భర్తయందు ప్రేమచూపక నా ముందు ఈ శృంగార లీలలు చూపుతావేం? మరణమయినా అంగీకరిస్తాను కాని దుష్కార్యం మాత్రం చెయ్యను - అన్నాడు అల్పుడు ఆమె పళ్ళు పటపటకొరికి - అల్పుడా నీకు తగిన పేరే పెట్టుకున్నావు చదువేతప్ప అనుభవంలేదు విను అంటూ శృంగార ప్రబోధకాలైన వాత్స్యాయన మహర్షి రచించిన శ్లోకాలు చదివింది అతను వాటి నన్నిటినీ ఖండించి - తల్లీ నీకు పదివేల నమస్కారాలు నన్నిక పలకరించకు రాజుగారు ఎ శిక్షవిధించినా అనుభవిస్తాను అని అక్కడి నుంచి దూరంగా తొలగి పోయాడు

అతనికి ఎలాగేనా కఠినశిక్ష విధింపజెయ్యాలని ఉపాయం ఆలోచించింది సాయంత్రం తండ్రి వొచ్చే సరికి వెక్కి వెక్కి ఎడుస్తూ కూర్చుంది

ఒంటరిగా ఉన్నందుకు భయపడ్డావా? ఊరుకో ఈ రాజు మనమీద కత్తికట్టినట్లున్నాడు లేకపోతే నిరపరాధివయిన నీకీ నిర్బంధ మేమిటి? ఇతను చేసిన అన్యాయాన్ని సామంత చక్రవర్తి అయిన సూర్యవర్మతో చెప్పమని కొంద రంటున్నారు ఆలోచిద్దాం

తండ్రీ ఈ రాజు చేసిన గృహ నిర్బంధం వల్ల నాకు మరోముప్పు వొచ్చింది అల్పుడిని అవతల గదిలో ఉంచింది తెలియక ఆ కిటికీ తలుపు ఎమిటో అని తెరచి చూశాను అక్కడే వున్న అల్పుడు నన్ను చూసి పొద్దుటనుంచీ విరహంతో బాధపడుతున్నాను- అంటూ బతిమాలాడు నేను అంగీకరించకపోడంతో దుర్భాషలాడుతూ రాళ్ళు రువ్వబోతే తలుపు వేసుకున్నాను గడియ పడకపోడంతో తోసితోసి రట్టుచేశాడు వాడికి తగిన శిక్ష పడేవరకూ నేను అన్నం ముట్టను- అని ఎడ్చిందామె

అతను అల్పుణ్ణి తిట్టి రాజుపురుషులకు చెప్పి సాక్ష్యంగా ఉండమని - సురసని ఇంటికి తీసుకు పోయాడు

# కాశీ మజిలీ కథలు

## 131 వ మజిలీ

### దేవవర్మ కథ

అమ్మా నీ బుద్ధిబలం చాలా ప్రశంసించతగింది యదార్థాన్ని చూపి సందేహం పోగొట్టావు నాపేరు నిలిపావు సురస కుటిలతా అల్పుడి సౌజన్యం చాటునుండి కళ్ళారా చూశాను చెవులారా విన్నాను సురసకి ఎం శిక్ష విధించాలో అల్పుడిని ఎలా గౌరవించాలో నువ్వే చెప్పు అక్షరాలా అలాగే చేస్తాను అంతేకాదు నీ మనసుకి ఇష్టమైనది చెప్పు అవీ చేస్తాను అని యమునని మెచ్చుకున్నాడు ఆమె తండ్రి దేవవర్మ

తండ్రీ సురస ఇంతవరకూ పరిశుద్ధురాలే అది నిజం రూపంవల్ల మదనుడిచే మోసగించబడి అకార్యానికి పూనుకుంది ప్రత్యక్ష సాక్ష్యం లేకపోడం ఆమె స్త్రీకావడం దృష్ట్యా ఆమెను శిక్షించడానికి వీలులేదు ఆమెని మన్నించి వదిలెయ్యి ఇదే నాకు ఇష్టం అల్పుడు ఎందుకో ఆ పేరు పెట్టుకున్నాడు కాని అతడు సామాన్యుడు కాడు అలాటి సుగుణవంతుణ్ణి మీరు గౌరవించదలచుకుంటే అతన్ని మీ రాజ్యానికి అధిపతిని చేయడం కంటె అతనికి వేరు గౌరవం ఉండదు ఇవికాక నాకింకే కోరికలు లేవు అంది యమున పుత్రీ నీ కోరికలు చాలా సమంజసంగా ఉన్నాయి నా మనస్సులోనూ ఇదే ఉంది అంటూ రాజు మెచ్చుకుని అప్పుడే కొలువుకి పోయి అందరినీ పిలిపించాడు

అగ్నివర్మ రాజుకి ఎదురుగా వచ్చి - మహారాజా నువ్వు పక్షపాతం చేస్తున్నావు అల్పుడు తప్పులమీద తప్పులు చేస్తున్నాడు బందీగృహంలో ఒంటరిగా ఉండడం గమనించి కిటికీ తలుపు తెరిచి

సురసని వాడు ఎలాటిమాటలు అన్నాడో రాజపురుషులనే అడగండి వేరే సాక్ష్యం అక్కరలేదు అనే సరికి రాజు వాళ్ళని సభకు రప్పించాడు

వాళ్ళు - దేవా మేమేమీ చూడలేదు తలుపు తెరిచేసరికి ఆమె వెక్కివెక్కి ఎడుస్తూంది ఎందుకని అడిగితే అల్పుడు తనని నిర్బంధించాడని చెప్పింది అన్నారు విన్నారుకదా అతని దౌర్జన్యం అని అగ్నివర్మ అనగా రాజు ఫక్కుననవ్వి - విప్రోత్తమా అల్పు డామెను నిర్బంధించడం చూసినవారు లేరు ఆమె చెప్పిన మాట నమ్మాలనా మీ అభిప్రాయం? అని అడిగాడు

'సందేహం ఎందుకు? నా పుత్రిక అనసూయే అబద్ధాలాడదు అదికూడా అల్పుడినే అడిగి చూడండి అన్నాడు అగ్నివర్మ

అయ్యో మొన్న బందీగృహంలో ఉండగా మీరు సురసను నిర్బంధించారట నిజమేనా? అని రాజు అల్పుడి నడిగాడు అంతా సత్యమే అన్నా డతను

ఇప్పుడేనా నమ్ముతారా? అన్నాడు అగ్నివర్మ రాజు మనసులో యమున మాటలు తలుచుకుని - భూసురోత్తమా స్త్రీల మనసుమీకు తెలియదు ఈ ఫిర్యాదులో సురసే అపరాధి అసత్యారోపణకు ఆమె శిక్షించదగినదే కాని ప్రత్యక్షసాక్ష్యం లేక ఆమెను విడిచిపెడుతున్నాం అల్పుడు నిరపరాధి గౌరవనీయుడు అని వాళ్ళందరినీ పొమ్మని అల్పుడికి నమస్కరించి రాజగృహానికి సగౌరవంగా తీసుకువెళ్ళి కూర్చోబెట్టి యిలా అన్నాడు

మహాత్మా మీ మనోనైర్మల్యం తెలిసింది మీకులం పరమోత్తమం కాకమానదు మీరు ఎదో కారణంతో ఈ మారువేషంలో దేశాలు తిరుగుతున్నట్లుంది ఎది ఎలాగున్నా సౌందర్యవతీ గుణవతీ మేధావీ అయిన నాకూతురు యమున మిమ్మల్ని వరించింది నా రాజ్యంతో కూడా ఆమెను స్వీకరించు మేము వినవచ్చునంటే మీ కులశీలాదులు చెప్పండి లేకపోయినా ఫరవాలేదు

దేవా అన్నిటా అల్పుడినని తెలిసికూడా మీరు ఇలా అనడం చిత్రంగా ఉంది యమున నన్ను వరించడం మరింత ఆశ్చర్యం నాలో

ఎ సుగుణం లేదు నాకు మీ రాజ్యం వొద్దు యమునా వొద్దు నా దారిన నన్ను పోనివ్వండి అన్నా డతను

అయినా రాజు అతన్ని మరీమరీ బతిమాలి యమున నిచ్చి మహావైభవంగా పెళ్ళి చేశాడు

కొన్నాళ్ళు గడిచాక దేవవర్మ సభలో ఉండగా సూర్యవర్మ దగ్గరనుంచి ఒక దూత వచ్చి ఒక ఆజ్ఞాపత్రికని ఇచ్చాడు నరమృగ పశుపక్షులలో మనుషులూ వారిలో బ్రాహ్మణులూ ఉత్తములు విద్వాంసులైన విప్రులు పూజ్యులు అటువంటి అగ్నివర్మ కూతురు సురస పరిశుద్ధురాలు అలాటి సాధ్విని మోహించిన నీచుడయిన అల్లుడిని శిక్షించడం మాని అల్లుడిగా చేసుకున్నావు సురసను నిర్బంధించి చిక్కులు పెట్టావు నీ కూతురు అతడిని వరించడం వల్లనే నీ కలాటి బుద్ధి పుట్టింది నీ కీర్తికి కళంకం తెచ్చుకున్నావు నువ్వు అన్నీ తప్పులే చేశావు మా వద్దకు వచ్చి అగ్నివర్మ ఈ అభియోగాన్ని మళ్ళీ విచారించమని వేడుకున్నాడు కనుక మీ అల్లుణ్ణి వెంటనే పంపు తిరిగి మేం విచారిస్తాం ఇది నా ఆజ్ఞా పత్రిక

అది చదివిన దేవవర్మకి కోపం వచ్చింది తాను చక్రవర్తి అయినంత మాత్రాన నిజం తెలుసుకోకుండా అన్యాయం చేశానని రాయడం న్యాయమా? అల్లుడి గురించి ఎం తెలుసునని ఇలా రాశాడు? అనుకుంటూ ఇలా జవాబు రాశాడు

మహారాజా మీ ఆజ్ఞాపత్రిక చదువు కున్నాను ఆ అభియోగాన్ని నేను పూర్తిగా విమర్శించాను అల్లుడు చాలా ఉత్తముడు సురస మదనపీడిత? తన తప్పంతా అతని మీద మోపింది కళ్ళారా కని చెవులారా వినే నేను న్యాయం చేశాను అల్లుడి గుణసంపత్తి వల్లనే నేనతన్ని అల్లుణ్ణి చేసుకున్నాను నా రాజ్యాని కతనే అధిపతి అతను మీకు గౌరవనీయుడు అపరాధిలా రావలసిన వాడుకాదు తప్పులు మన్నించండి

అది అందుకున్నాక మళ్ళీ సూర్యవర్మ నుంచి మరొక ఉత్తరం వచ్చింది అపరాధి ఐనప్పుడు నీ అల్లుడైతే ఎమిటి? నువ్వయితే ఎమిటి?

రాజభటులచేత బంధించబడి రావలసిందే అపరాధి అయితే శిక్షిస్తాం లేకపోతే గౌరవిస్తాం నువ్వు రాజ్యం ఇచ్చినంతమాత్రాన నీ అల్లుడైనంత మాత్రాన అతడు పూజ్యుడు కాబోడు మా ఆజ్ఞను తిరస్కరించినట్లు భావించినా మొదట తప్పుగా మన్నించాం తక్షణం నీ అల్లుడిని పంపు అతన్ని పంపకుండా ఎదేదో రాసి పంపావో నీపై దండెత్తి నీ రాజ్యం మా అధీనం చేసుకుని నీ పీచం అడుస్తాం

అది పట్టుకుని కూతురి వద్దకు వెళ్ళి కర్తవ్య మేమిటని దిగులు మొహంతో అడిగాడు

ఆమె కొంచెం ఆలోచించి - తండ్రీ మనం విప్రుల కేమీ అన్యాయం చేయలేదు చాటున ఉండి సురస అల్పుడితో పలికిన మాటలు విన్నాం అతని జవాబులూ విన్నాం కళ్ళారా ఇదంతా చూసి సురస మహాపతివ్రత అనీ అల్పుడు శిక్షార్హుడనీ ఎలా అంటాం? ఆ రాచపినుగ కేం తెలుసు? అతని వద్దకు అపరాధిలా పంపడం అవమానం క్షత్రియులకి యుద్ధంలో మరణం పరమధర్మం జయించామా పేరు వాస్తుంది అంది

తల్లీ సూర్మవర్మ చేతికింద నలభైమంది సామంతరాజులు ఉన్నారు అతను కోరితే వాళ్ళందరూ చతురంగ బలంతో సాయం వస్తారు మనకి వజ్రదత్తుడు తప్ప వచ్చేమిత్రుడు మరెవరూ లేరు కనక మనం గెలవడం ఎలా? అన్నాడు దేవవర్మ

ధర్మబుద్ధి కలవాడికి దైవమేవచ్చి సాయం చేస్తాడు చింతింపక యుద్ధప్రయత్నం చెయ్యి అందామె అంతలో అల్పుడు వచ్చాడు ఆ వృత్తాంతం అంతావిని - ఏమీ సూర్యవర్మకి ఇంత కావరమా నా పరాక్రమం అతనికి తెలియదు దేవవర్మ అసహాయుడని అలా రాశాడు యుద్ధరంగంలో పశ్చాత్తాపపడతాడు యుద్ధానికి సన్నద్ధులమని జవాబు రాయండి అన్నాడు

దేవవర్మ - మాలో ఎ తప్పూలేదు అయినాయుద్ధం ప్రకటించావు సన్నద్ధులమై ఉన్నాం అని జవాబు పంపించాడు అది చూసి సూర్యవర్మ మంత్రులతో ఆలోచించి - ప్రతి సామంతరాజునీ

ఇద్దరు మహావీరులనీ లక్షసైన్యాన్నీ పంపించమని ఆజ్ఞాపత్రికలు పంపాడు దాని ప్రకారం వాళ్ళు పంపారు

దేవవర్మ తమ మిత్రులు కొందరిని తోడు రమ్మని రాయగా యిద్దరు ముగ్గురు మాత్రం రహస్యంగా తమ సైన్యాన్ని కొంతమందిని పంపారు

రెండు పక్షాలవారూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు రెండు మూడు రోజులలో మహాయుద్ధం జరుగుతుంది మనకి తృప్తిగా ఆహారం దొరుకుతుంది అని ఆ వృత్తాంతం ముగించాడు భూతరాజు అది విని భూతపత్ని - పాపం దేవవర్మ బలహీనుడు శత్రువుకి లొంగిపోతాడుకదా న్యాయం ఇతనిదే అయ్యో సూర్యవర్మకి ఈయుద్ధం ధర్మవిరుద్ధమని ఎవరూ చెప్పలేదా? అంది జాలిగా

అదంతా మనకెందుకు? మనకి పుష్కలంగా ఆహారం దొరుకుతుంది అబ్బా. ఈ కడుపుమంట భరించలేకపోతున్నాను ఎప్పుడు తెల్లవారుతుందో

అయ్యో నీ బాధ నేను చూడలేక పోతున్నాను ఆహారం ఎదీ దొరకదు ఎం చేసేది? అని దు ఖించసాగింది

అదంతా వింటున్న విరతి - పాపం ఈ భూతదంపతులు ఆహారం లేక ఆకలికి అలమటిస్తున్నారు నేను వీరికి ఆహారం అయితే నా జన్మ సఫలం ఔతుంది బతికి ఎం చెయ్యాలి? అనుకుంటూ వారి ఎదుటకు వచ్చి నమస్కరించి పిశాచ భాషలో - ఓ భూతదంపతులారా మీరు ఆకలితో బాధపడుతున్నారు నన్ను భక్షించి మీ ఆకలిని తీర్చుకోండి భూతతృప్తి చెయ్యడం కంటె వేరే పుణ్యంలేదు అంది వాళ్ళు ఆమెవేపు ఆశ్చర్యంగా చూసి నువ్వుఎవరివి? ఇక్కడి కెలా వచ్చావు చావుకి సమ్మతించే వాళ్ళుంటారా? ఎందుకింత సాహసం చేస్తున్నావు? అని అడిగారు

నా చరిత్ర వింటే మీకు విచారం కలుగుతుంది నేనెవరినైతే ఎం నా చరిత్ర ఎదైతే ఎం? మనుష్య కాంతని వేగంగా భక్షించి నా దు ఖం పోగొట్టండి అంది విరతి అందుకువాళ్ళు - అమ్మా

నువ్వు మా ఇంటి అతిధి వయ్యావు ఎంత ఆకలిగా ఉన్నా అతిధిని భక్షించే పాపాత్ములుండరు అతిధులు ఎల్లవేళలా పూజార్హులు నీ కంఠస్వర మాధుర్యం బట్టి ఉత్తమ జాతి యువతిగా అనిపిస్తున్నావు నీ కథ నీకొచ్చిన ఆపద చెబితే కాని మాకు శాంతి ఉండదు - అన్నారు భూతదంపతులు విరతి తనకథంతా చెప్పి - ఆ చెట్టుకింద గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు నా భర్త అంది

ఆమె కథ విని నీలాటి ఇల్లాలిని చంపి తినమంటున్నావా నీ అక్కా, అన్నా నిన్ను ఆక్షేపించి అడవిలో పడేశారా నీ తండ్రి ఎంత కఠినాత్ముడయ్యాడూ కానియ్ నవ్విన ఊళ్లే నగరా లౌతాయి నీ పాద ధూళి సోకితే మేం పవిత్రులం ఔతాం దీని మగడికి మంచి ఐశ్వర్యం కలగ జెయ్యాలి ఉపాయం ఆలోచించండి అంది భూతపత్ని అతను సరే అని ఆలోచించసాగాడు

అప్పుడు భూతపత్ని - తల్లీ నీ భర్తని చూడాలి అతని వృత్తాంతం తెలియదన్నావు కదా ఇది చాలా ఆశ్చర్యమే అత[illegible]లువు అంది 'నేనతనిని ఇంతవరకూ పలకరించి ఎరుగను నన్ను అతనూ పలకరించలేదు అంది విరతి పదపద సిగ్గెందుకు? నేనూ వస్తాలే అంటూ ఆమెను అతని వద్దకు తీసుకెవెళ్ళింది అప్పటికే లేచి ఉన్న అతను వీళ్ళిద్దరూ రావడం చూసి భయపడుతూ వాళ్ళని వింతగా చూడసాగాడు నువ్వెవరివి? నీ వృత్తాంత మేమిటి? నీది ఎ కులం? నిజం చెప్పక పోతే నిన్ను దండిస్తాను చెబితే గౌరవిస్తాను నేను భూతపత్నిని అతను భూతరాజు మేమిద్దరం ఈ పర్వతం మీద నివసిస్తాం నీ భార్యకారణంగా నీతో యిలా మృదువుగా మాట్లాడు తున్నాను లేకపోతే నా భర్త నిన్ను ఈ పాటికే చీల్చితినేసి ఉండేవాడు నిజం చెప్పు అని అడిగింది భూతపత్ని

అతను ఆశ్చర్యంతోనూ చికాకుతోనూ వాళ్ళవంకకు చూసి నిజం చెప్పక తప్పదని భావించి ఇలా చెప్పసాగాడు

# కాశీ మజిలీ కథలు

## 132 వ మజిలీ

### సుగతుడి కథ

అమ్మా నువ్వు అడిగేసరికి నా వృత్తాంత మంతా జ్ఞాపకం వస్తూంది విను

శ్రీకంఠ నగరంలో వజ్రదత్తుడు అనే రాజు ఉన్నాడు అతనికి సంతానం కలగక చాలా కాలంగా విచారిస్తూంటే - ఒకనాడు ఆవూరికి అపర శివుడిలాటి జంగం దేవర వచ్చి శివాలయంలో బస చేశాడు అతని వేషం చూసిన వారికి అతను మహానుభావుడని తోచక మానదు ప్రజలు అతనిని త్రికాలవేది అనీ రసమూలికా సిద్ధుడని చెప్పుకోసాగాడు

అది విని వజ్రదత్తు డొకనాడు ఆయోగి వద్దకి పోయి స్తుతించి తన కోరికని తెలిపాడు అతను రాజుని దయగా చూస్తూ - జయ శంకర మృత్యుంజయ అంటూ పలుకుతూ రక్షరేకుతో పాటూ మంత్రభస్మ మిచ్చి - మహారాజా నువ్వు ఈ భస్మం పూసుకో నీ భార్యకు ఈ రక్షరేకు కట్టు నీకు తప్పకుండా కొడుకు పుడతాడు వాడికి జంగమదాసు అని పేరు పెట్టి పదహారవ ఎట జంగంవేషం వేయించి శ్రీశైలానికి తీసుకుపోయి మల్లికార్జునస్వామికి అప్పగించాలి లేకపోతే ముప్పు కలుగుతుంది అన్నాడు

రాజు ఆనందంతో - మీరు ఇంతవరం ఇచ్చాక అలా చేయడం ఆశ్చర్యమా? తప్పకుండా అలాగే చేస్తాను అని కానుకలు ఇవ్వబోగా ఆ యోగి వాటిని తిరస్కరించాడు వజ్రదత్తుడతనికి నమస్కరించి ఇంటికెళ్ళి భార్యకి రక్షరేకు కట్టుకోమని ఇచ్చాడు ఆ యోగి

చెప్పినట్లే వాళ్ళకి కొడుకుపుట్టాడు చాలా అందమైన ఆ బాలుడికి జంగమదాసని పేరు పెట్టారు వాడు దిన దినం వృద్ధి చెందుతూ చదువుకునే వయసుకి రాగా తండ్రి ఎందరో గురువులని నియమించాడు వాడి గ్రహణశక్తి మెచ్చుకోదగిందే కాని ప్రతివాళ్ళనీ ఎదిరించి తిరస్కరిస్తాడు పురాణాలు చదువుతూ పూర్వులనీ విద్య నేర్చుకుంటూ గురువులనీ ఆక్షేపిస్తాడు శివకేశవుల ఆలయానికి పోతూ శిలలు అనే విగ్రహానీ తిరస్కరిస్తాడు పెద్దలని అవమానిస్తాడు ఆ విధంగా సర్వజనకంటకుడు కాసాగాడు రాజకుమారుడు కనుక వాడి నెవరూ ఏమీ అనలేకపోయేవారు కొడుకు దుడుకుతనం తెలుస్తున్నా లేకలేక కలిగిన వాడవడం వల్ల మందలించలేక వాడు కోరినట్లు చేసేవాడు రాజు వాడికి పదహారేళ్ళు వచ్చాయి అప్పుడు రాజు కొడుకుతో ఇలా అన్నాడు

రాజు వత్సా నువ్వు ఒక యోగి వరం వలన పుట్టావు ఈ వయసులో నీకు జంగంవేషం వేయించి శ్రీశైలం తీసుకు పొమ్మని అతను చెప్పాడు బంగారుగంట శంఖం జోలి ధరించాలి

కొడుకు నువ్వు ఎవరి వరం వల్ల పుట్టావో చెప్పు?

రాజు పరిహాసం ఆడకు నేను ఎవరివరం వలన పుడితే ఎం? నా జీవితం అయిపోయింది కదా

కొడుకు నాకూ కొంత గడిచింది ఇలాటి వెర్రిమాటలు నాకు చెప్పకు ఆ యోగి ఎవరివరం వల్ల పుట్టాడు? జన్మకి తల్లితండ్రులే తప్ప వేరెవరూ కారకులు కారు

రాజు అలా చెయ్యకపోతే ముప్పు కలుగుతుందని చెప్పాడు ఆ యోగి ద్రవ్యం మీద ఆశకలవాడు కాదు నా మాట విను పెద్దలను ఆక్షేపించకు నువ్వు జంగం వేషం వెయ్యాలి

కొడుకు చాలు చాలు ఇప్పుడు జంగం వేషం వెయ్యమంటారు రేపు మాదిగ వేషం వెయ్యమంటారు నే నే వేషమూ వెయ్యను ఎం ముప్పు వస్తుందో చూస్తాను

చేయగలిగింది లేక రాజు విచారించసాగాడు కొన్నాళ్ళు గడిచాయి మునుపటి జంగం దేవర ఆ వూరు వచ్చి దేవాలయంలో ఉన్నాడు రాజు భక్తి పూర్వకంగా అతని వద్దకు వెళ్ళి పాదాలమీదపడి -

మహాత్మా నన్ను కృతఘ్నుడిగా తలపకండి అంటూ కొడుకు గురించి అంతా చెప్పి అలాటి దుందుడుకు కొడుకుని దయచేశావేం? వాడు నేను చెప్పినట్లు వినడు మీ వద్దకు ఆ వికట వాదిని తెస్తాను మీరే మందలించండి అని వేడుకున్నాడు ఆ జంగం దేవర ఎలాగో ఒప్పుకున్నాడు రాజు తనపుత్రుణ్ణి అతికష్టంమీద ఆయోగి దగ్గరకు తీసుకువెళ్ళాడు అతను యోగికి నమస్కరించక తృణీకార భావంతో కూర్చున్నాడు

*జంగమదేవర* నీ పేరేమిటి?

**రాజపుత్రుడు** గడ్డంపెంచేసరికి గర్వం బలిసి అందరినీ నువ్వు అంటారు కదా

**రాజు** బాబూ నువ్వు వీరి వరం వల్లనే పుట్టావు వారు నిన్ను మీరు అనకూడదు

**రాజపుత్రుడు** పేరా జంగమవాసి

**రాజు** జంగమదాసురా

**రాజపుత్రుడు** మీరుపెట్టిన పేరది నేను పెట్టుకున్నది ఇది

**రాజు** వారికి నమస్కరించు

**రాజపుత్రుడు** మీరు నమస్కరించారు చాలు దానివలన వచ్చే లాభం మీరే అనుభవించండి నాకు అక్కర్లేదు

*జంగమదేవర* నీకు తగిన ఫలం ఇస్తాను కావాలా?

**రాజపుత్రుడు** పరిహాసంగా ఎదో కొంచెం దయచేయించండి

*జంగమదేవర* చంకలోజోలి ఒక చేతిలోగంట ఒక చేతిలో శంఖంతో జంగంవేషం వేయించి నీ చేత భిక్షం ఎత్తిస్తాను చూడు

*రాజపుత్రుడు* నిజంగా అలా చెయ్యగలిగితే నువ్వు జంగందేవరవే

*జంగందేవర* సరే ఇంటికి వెళ్ళు

*రాజు* మహాత్మా వీడి మాటలు పట్టించుకోకండి వీడు మీ పుత్రుడు భ్రష్టుణ్ని చేయకండి చిన్న శిక్షమాత్రమే విధించండి

అని బతిమాలుకున్నాడు అప్పటికే రాజకుమారుడు ఇంటికిపోయాడు ఇంటికి చేరాడో లేదో దుర్భరమైన శూలనొప్పి వచ్చి గిలగిలకొట్టుకో సాగాడు వైద్యులు చేసిన చికిత్సవల్ల ఏమీప్రయోజనం లేకపోయింది జంగందేవర మహిమవల్లనే తనకు ఆ బాధ కలిగిందని పశ్చాత్తాపపడి రాజకుమారుడు తండ్రిని వేడుకున్నాడు ఎ గర్వమైనా ఎంతటిదైనా బతకమేమో అన్నంత ఆపద కలిగితే పోతుంది కదా రాజు వాడిని వెంటనే యోగి వద్దకు తీసుకుపోయాడు

జంగం వేషం వేయించి కాని నా వద్దకు తీసుకురావద్దు అన్నాడతను ముందుగానే తయారుచేయించిన బంగారు గంట మొదలయిన వాటితో వేషం వేయించి తీసుకువచ్చారు ఈ రాజవేషంతో కాదు భిక్షం ఎత్తే జంగం వేషం ధరించాలి అన్నాడు యోగి

రాజు కొడుకుని కంచుగంట శంఖం మామూలు గుడ్డతో కుట్టిన బొంతలతో జంగం వేషం వేయించి కొడుకుని యోగివద్దకు తీసుకెళ్ళాడు

*యోగి* నీవెవడివిరా?

*రాజపుత్రుడు* స్వామీ నేను జంగందాసుని

*యోగి* ఈ జంగమదేవర జంగమదేవరయేనా?

స్వామీ బుద్ధొచ్చింది అపరాధిని క్షమించు ఐశ్వర్య మదంతో చెడ్డగా ప్రవర్తించాను మీరు నా బుద్ధిని చక్కజేశారు ఇక చక్కగా ప్రవర్తిస్తాను మీ దాసుడిని కనికరించమని మీకు మొక్కుకుంటున్నాను

*యోగి* ఇప్పుడు నీకు శూలనొప్పి ఉందా?

రాజపుత్రుడు లేదు మహానుభావా మీ పాదరేణువుసోకడం తోటే మాయం అయింది

యోగి నువ్వు ఈ వేషంతో కొంతకాలం బిచ్చం ఎత్తుతూ దేశాటనం చెయ్యి నిష్కృతి కలుగుతుంది సాధువులా ప్రవర్తించు తరవాత సౌఖ్యాలు పొందుతావు అంతవరకూ నీ మతి వివశువై ఉంటుంది రాజు ఎదో ప్రార్థించబోయాడు కాని యోగి వినిపించు కోలేదు ఆ రాత్రే అతను ఊరువదలి బిచ్చం ఎత్తుతూ దేశాటనం చేయసాగాడు

అని చెప్పి - ఆ జంగమదాసే ఈ వ్యక్తి మీరు అడగడం వల్ల ఆ వృత్తాంతమంతా మెదడులో స్ఫురించింది అప్పటి నుంచి ఇప్పటి వరకూ మతిస్థిమితం లేకపోడంతో వెర్రివాడిలా ఉండిపోయాను ఒకనాడు పట్నానికి పోతూంటే నన్ను పల్లకీ ఎక్కించుకుని ఒక రాజు నాకు ఈమె నిచ్చి పెళ్ళి చేశాడు ఇదంతా నాకు కలలాగే ఉంది అన్నాడు

ఆ కథవిని రాకుమార్తె విరతి కూడా భూతపత్నితోపాటు ఆశ్చర్యపోయింది భూతపత్ని- సాధ్వీ. విరతీ నువ్వు గాజు అనుకున్నది రత్నమయింది విచారించకు భవిష్యత్తులో చాలా సుఖపడతావు అని భర్త వద్దకు తీసుకుపోయి ఆ వృత్తాంతం అంతా చెప్పింది

అంతవరకూ చెప్పి మణిసిద్ధుడు గోపాలుడితో కలసి ప్రయాణానికి బయలుదేరాడు

# కాశీ మజిలీ కథలు

## 133 వ మజిలీ

### యుద్ధం కథ

చక్రవర్తి అయిన సూర్యవర్మ దేవవర్మ మీద యుద్ధం ప్రకటించి తన అల్లుడైన సురూపుడినీ కుమారుడు కుశునీ కొంతసైన్యంతో తోడు పంపమని చంద్రగుప్తుడికి ఆజ్ఞాపత్రిక పంపడంతో చంద్రగుప్తుడు విధిలేక వాళ్ళని పంపి యుద్ధవార్తలు తెలపడానికి చాలామంది వేగులవాళ్ళని నియమించాడు

రెండవరోజున కొందరు వేగులు – 'దేవవర్మ బలం అక్షోహిణి అయినా లేదు సూర్యవర్మ – ఇప్పుడేనా నీ అల్లుణ్ణి అపరాధిగా పంపిస్తే యుద్ధం ఆపుచేయిస్తాను అని రాయబారం పంపాడు కాని దేవవర్మ తిరస్కరించి రాయబారిని అవమానించి పంపాడు దానితో చక్రవర్తి కోపించి యుద్ధానికి ఆజ్ఞ ఇచ్చాడు ఉభయులకీ పెద్దయుద్ధం జరిగింది మనసేనలు సముద్రంలా విజృంభించి శత్రుసేనలను క్రమంగా వెనక్కి నెట్టసాగాయి

అప్పుడు – దేవవర్మ అల్లుడట గుర్రంమీద కత్తి పట్టుకుని వొచ్చి విచిత్రంగా కలయ తిరుగుతూ తమ బలాలను ఆపి శత్రుబలాలను ముందుకి రాకుండా నిరోధించాడు మన యువరాజుగారు వారిని ఎదుర్కున్నారు ఇద్దరు తీవ్రమైన యుద్ధం చేశారు జయాపజయాలు తేలకుండానే సాయంకాలం అయింది రెండు పక్షాలవారూ యుద్ధం నిలిపారు ఇంతవరకూ చూసి వచ్చాం అని వార్తాహరులు తెలియజేశారు తరవాత ఏం జరిగిందో అని చంద్రగుప్తుడు తహతహ లాడాడు

మర్నాడు యధా సమయానికి మళ్ళీ వార్తాహరులు వచ్చారు

మన పక్షం గెలిచిందా? అని ఆత్రంగా అడిగాడు చంద్రగుప్తుడు

వాళ్ళు దీనంగా - మహారాజా అంతా వ్యర్ధమయింది భూమి మీద ఇలాటి విపరీతం ఎప్పుడూ చూడలేదు వినండి పగలంతా యుద్ధంచేసి అక్కడితో ఆగక రాత్రి మళ్ళీయుద్ధం ప్రారంభించారు మనకి చాలా సేనలున్నాయనే గర్వమే ఇంత ముప్పు తెచ్చింది

రాత్రి యుద్ధం ప్రారంభించిన రెండు గడియలకి ఒక మహాభూతం శత్రుసేనలో చేరి సింహనాదం చేసింది మన బలాలన్నీ మూర్చపోయాయి తేరుకునేసరికి ఆ భూతం కొండగుహలాంటి నోరు తెరచుకుని అగ్నిజ్వాల వంటి నాలుక వేలాడేసుకుంటూ మన బలాలని పాదాలతో తొక్కేస్తూ దోమలనిలా చేతులతో కొడుతూ నోట్లో వేసుకోసాగింది కుంభకర్ణుణ్ని చూసిన వానరాల్లా మనవాళ్ళంతా కిరీటాలు వదిలి వాహనాలు ఉరికి ఒకరికొకరు చెప్పక కాలికొద్దీ పరుగుతీశారు శత్రుసేనమాత్రం చెక్కుచెదరలేదు అర్ధరాత్రయ్యేటప్పటికి రణరంగం శూన్యం అయిపోయింది కొందరు వాడినోటికి కబళాలు అయ్యారు చక్రవర్తిని భూతం కాలికింద వేసి నలిపేసి చంపేసిందని వార్త వ్యాపించింది

ఎవరు చచ్చిపోయారో ఎవరు పారిపోయారో లెక్కతెలియదు వాడు బ్రహ్మరాక్షసుడో భూతమో తెలియదు ఆ రణరంగం మహాప్రళయమే అయ్యింది రుద్రుడో కాలభైరవుడో అలా చేశాడనుకుంటున్నారు అర్ధరాత్రి వరకూ అలా సంహారం చేసి ఆ భూతం ఎక్కడికోపోయింది అన్నారు వార్తాహరులు

అది విని రాజు - కుశుడేమయ్యాడు? సుకుమారుడు క్షేమమేనా? అని ఆదుర్దాగా అడిగాడు

- మాకెవరూ కనపడలేదు ఎవరిని అడగగలం? ఒకవైపు వాడొచ్చి మా మీదపడతాడేమో అని భయం అదృష్టం కొద్దీ మేం శత్రుసేన

వేపుండి చూడడం వల్లబతికాం కాని లేకపోతే మేమూ చచ్చిపోయే ఉండేవాళ్ళం అన్నారు

పొండి మనవాళ్ళ క్షేమం తెలుసుకోకుండా ఎందు కొచ్చారు? తెలుసుకుని వేగంగా రండి అని వారిని పంపించి రాజు ఆ విషయం భార్యకీ రతికీ చెప్పి విచారించసాగాడు

మర్నాడు రెండు గడియలు పొద్దెక్కేటప్పటికి వార్తా హరులు వచ్చి పురంలో ప్రవేశించడం చూసి పౌరులు హాహాకారాలు చేశారు వాళ్ళు రాజుగారిని చూసి ఏమీ చెప్పలేక గొల్లున ఎడవసాగారు రాజు భయపడుతూ ఎమైందని అడిగాడు

దేవా మానోటితో దుర్వార్త చెప్పవలసి వస్తోంది ఆ పాడు భూతం కిరీటాలు ధరించిన యోధులందరినీ ఎరి కొట్టి ఇద్దరిద్దరిని లంకె వేసి తీసుకుపోయిందట మనవాళ్ళిద్దరినీ చంపి లంకెవేసి మెడమీద వేసి తీసుకు పోయినట్లు చెప్పారు అన్నారు రాజు అది విని నేలమీదపడి వొళ్ళెరక్కుండా కొట్టుకోసాగాడు మంత్రు లతన్ని సేదతీర్చి అంత పురానికి పంపారు

అతని దు ఖం చూసి - భార్య ప్రాణనాధా ఎందుకు విచారిస్తావు? సంసారం బూటకమనీ నాటకమనీ మొదటే చెప్పలేదా? రతి కుశుడు సుకుమారుడు కపటంచేసి లవుడినీ విరతినీ ఊరినుంచి తరిమెయ్యలేదా? అప్పుడు మీకెందుకు విచారం కలగలేదు ఇప్పుడు మీకు ప్రపంచం అసహ్యంగా కనిపించడం లేదా? ఇప్పటికేనా వేదాంతం అర్ధంచేసుకుని వనవాసం పోదాం రండి రాజ్యభోగం వదలండి ఇదీ మనకి దేవుడు చేసిన ఉపకారమే అని ఉపదేశించింది

రాజు ఆ మాటల్ని పట్టించుకోక - దు ఖిస్తున్న కూతురితో పుత్రీ నీ భర్త సుకుమారుడు పరాక్రమశాలి అనీ విజయంతోనే వస్తాడనీ కుమారుడిని కూడా జతచేసి పంపాను ఇలాటి అవస్థ పడుతుందను కోలేదు ఇప్పుడు ఎం చెయ్యాలి? ఎవరిని చూసుకు బతకాలి? నిన్నెలా

భరించేది? మీ అమ్మ వట్టి వెర్రిది మాట్లాడితే అంతా మిధ్య అడవికి పోదాం - అంటుంది అయ్యో పరమేశ్వరా అని నిట్టూర్చాడు

రతి - భర్త గురించీ సోదరుడి గురించీ పరితపిస్తూ - చెల్లెల్నీ భర్తనీ నిష్కారణంగా అడవులపాలు చేసినందుకే తనకు ఇలాటి కష్టం కలిగిందని నిశ్చయించుకుని పశ్చాత్తాపం చెందుతూ తల్లికి నమస్కరించి తనకి వేదాంతం ఉపదేశించమంది

వాళ్ళు అలా దు ఖంలో ఉండగా మరో రెండు రోజులకి మరికొందరు వేగులు వచ్చి - మహారాజా ఆ భూతం అంతటితో వదలక ఒక యౌవనపురుషుణ్ని తీసుకుని వచ్చి చక్రవర్తి సింహాసనం మీద కూర్చో బెట్టింది కొత్త చక్రవర్తి చాలా తేజశ్శాలి చావగా మిగిలిన సామంతరాజులూ మంత్రులు అతన్ని ఆజ్ఞల్ని శిరసావహిస్తున్నారు అతని ఆజ్ఞానుసారంగా - యుద్ధంలో చనిపోయిన రాజకుమారుల పేర్లు రాయబడిన పత్రిక ఒకటి కోటగోడకి అంటించబడింది ఆయా సామంతరాజులకి తెలియపర్చమని చక్రవర్తి ఒక అజ్ఞ ఇచ్చాడట ఆ పత్రికలో మనవారి పేర్లు రెండూ రాయబడి ఉన్నాయి మేం అనాధలమైపోయాం అంటూ దు ఖించారు ఆ వృత్తాంతం విని రాజు వారి మరణానికి విచారిస్తూ మరణించిన వాళ్ళకు అపరసంస్కారాలు చేయించాడు

# కాశీ మజిలీ కథలు

## 134 వ మజిలీ

### కుశ సుకుమారుల కథ

అయ్యో కాలమా నాకెంత చెడ్డచేశావు భార్యాపుత్రికలతో నన్నిలా వనవాసం పాలుచేస్తావా కుశుడినీ సుకుమారుడినీ బ్రహ్మరాక్షసుడు చంపబట్టికదా నన్ను ఇలా రాజ్యభ్రష్టుణ్ని చేసి పురంనుంచి వెళ్ళగొట్టావు నాలాటి అభాగ్యుడు ఎక్కడా ఉండడు కొడుకులు ఇద్దరూ గతించి పోయారు అల్లుళ్ల గతీ అంతే అయింది రాజ్యం శత్రువుల పాలయింది సుఖాలు ఆవిరైపోయాయి పరిజనులూ ఆశ్రితులూ ఉన్నపళంగా వదిలేశారు అయినా నేను ఎ సుఖం అనుభవించడానికి పోతున్నానో తెలియదు ఇంకనాకు మరణంకంటె శరణం లేదు భార్య చెప్పిన హితవాక్యాలు ఆనాడు తలకెక్కలేదు ఇప్పుడు ఒక్కొక్కటే జ్ఞాపకం వస్తున్నాయి ప్రేయసీ నాకిప్పుడు మంచి మాటలు చెప్పి మనసుని నిలబెట్టు అమ్మాయి రతీ నీ అవస్థ చూస్తూ కూడా ప్రాణాలతో ఉన్న నాకంటె కరినుడు ఎక్కడేనా ఉంటాడా? అని దు ఖిస్తూ చంద్రగుప్తుడు ఒకచెట్టుకింద కూలబడిపోయాడు

అప్పుడు అతనిభార్య ధర్మరతి – ప్రాణేశ్వరా కొడుకులు కోడళ్ళు కూతుళ్లూ మీరు పుట్టినప్పటి నుంచీ ఉన్నారా? మధ్యలో వచ్చారు మధ్యలోనే పోయారు వాళ్ళకోసం విచారం ఎందుకు? ఒకరికొకరితో సంబంధంలేదు ఈ సంబంధాలన్నీ అస్థిరాలే ఆ వియోగం దు ఖానికి కారణం కాబోదు మనం తపోవనానికి పోతున్నాం విచారించకండి మనపుణ్యం మంచిదైతే ఇందులోనూ మేలే జరగవచ్చు అంది

తల్లిపలుకులకి రతికి మతి పోయింది తల్లిపిచ్చిదని ఆమె అభిప్రాయం వాళ్ళు ముగ్గురూ అరణ్య మార్గంలో పోతూంటే ఒకచోట సుకుమారుడూ కుశుడూ ఎదురు పడ్డారు

వాళ్ళని దూరంనుంచే గుర్తు పట్టి అమ్మా రతీ అడుగో నీ మొగుడు వాడే నీ సోదరుడు మృతి చెంది పిశాచాలై అడవుల్లో తిరుగుతున్నారు కాబోలు ఇప్పుడేం చెయ్యాలి? ఎం కావాలంటే అది పెడదాం కాని వాళ్ళు మనమీద పడి చంపరుకదా? అన్నాడు చంద్రగుప్తుడు భయపడుతూ

తండ్రీ వెనకటి ప్రేమంతా మరచిపోతారా? మనం వచ్చామనే వాళ్ళు చూడ్డానికి వచ్చి ఉంటారు నేను వెళ్ళి మాట్లాడతాను ఉండండి అని వెళ్ళబోయింది రతి చంద్రగుప్తుడు ఆమెని వద్దని వారించాడు అంతలో వాళ్ళిద్దరూ ఆ చెట్టు కిందకి వొచ్చి చంద్రగుప్తుణ్ణి - మీది ఎవూరు? అని అడిగారు అయ్యో మీకు ఇలాటి అవస్థ పట్టిందా ప్రేతలు అయిపోయారా? మీకేం కావాలో చెప్పండి అన్నాడు హా ప్రాణనాథా మీరు పిశాచరూపం దరించారా మీ పాదాలు ఇలా ముందుకు ఉన్నాయేమిటీ? అంది రతి

మీరెవరో చెభితే అప్పుడు మా వృత్తాంతం చెబుతాం అన్నారు వాళ్ళు చంద్రగుప్తుడు తనకొడుకూ అల్లుడూ యుద్ధంలో బ్రహ్మరాక్షసుడి చేత చ పబడడం వరకూ చెప్పి - వాళ్ళు చనిపోయారని - మాకు అజన శత్రువయిన విశోకుడనే రాజు మామీద దండెత్తి రాజ్యం ఆక్రమించుకున్నాడు మేం రహస్యంగా అడవులలోకి పోతున్నాం అంటూ తమని పేర్లతో సహా పరిచయం చేసుకున్నాడు మీ రూపాలు చూస్తూంటే మావాళ్ళలా ఉన్నారు అన్నాడు

ఆ మాటలకి వాళ్ళు మూర్ఛపోయి - హా మీకు ఎంత కష్టం వచ్చింది మేం మీ వాళ్ళమే దైవికంగా బతికాం ఇంటికి వొస్తూంటే దారిలో మీరు కనిపించారు అన్నారు చంద్రగుప్తుడు సందేహం వెలిబుచ్చగా - వాళ్ళు ఇలా చెప్పారు మమ్మల్ని మెడమీద వేసి తీసుకుపోయిన భూతం మమ్మల్ని ఒకచెట్టు కొమ్మకి తగిలించి ఇతర శవాలరక్త మాంసాలను భార్యతో కూడి ఆరగిస్తూ నాట్యం చేయసాగింది మాకింకా కొన ప్రాణం ఉండబట్టి గిలగిలకొట్టుకుంటూ వేలాడుతున్నాం అప్పుడు ఒకపుణ్యాత్మురాలయిన చిన్నది మెల్లగా వచ్చి మా కాళ్ళకట్లు విప్పి అవతలకి పొమ్మని సంజ్ఞచేసింది ఆమె ఉపకారానికి కృతజ్ఞతగా

మేమొక ఉంగరం ఇచ్చి - మేం ఒక దేశానికి అధిపతులం నువ్వెవరివో మాకు తెలియదు ఇప్పుడు దేనికీ సమయం లేదు నువ్వెప్పుడేనా వీలయితే మా దేశానికి రా ఈ ఉంగరం ఆనవాలు చూబిస్తే తగిన మేలు చేస్తాం

అని ఎలాగో నడిచి నడిచి ఒక దేశంలోని పల్లెకు చేరాం ఆ రాక్షసుడి దెబ్బకి యమలోకం చూసి వచ్చాం రక్తమాంసాలు క్షీణించి నడవడానికి శక్తి లేకపోయినా భూత భయంతో ఎలాగో అడవిదాటి అక్కడా అక్కడా ఆగుతూ చివరకి మన దేశానికి దారి తెలుసుకుని నడుస్తూ వస్తున్నాం అంతలో మీరు కనిపించారు నిజానికి మమ్మల్ని ప్రేతలుగా తలచవలసిందే కాని ఆ చిన్నది దేవుడిలా రక్షించింది అప్పుడు ధర్మరతి - మీ పూర్వ జన్మపుణ్యమే మిమ్మల్ని రక్షించింది అంతా మన ప్రతిభే అని అనేవారు - ఇప్పుడు ఆమాట లేమయ్యాయి? అంది ఆమెను వెర్రిదానిగా తలచి ఎవరూ జవాబు చెప్పలేదు

సుకుమారుడు - మహారాజా విశోకుడు మిమ్మల్ని నగరం నుంచి వెళ్ళగొట్టాడా ఆ వృత్తాంతం అంతా వివరించండి అన్నాడు 'సైన్యాన్ని చక్రవర్తికి సాయానికి పంపాను అది తెలిసి విశోకుడు అగ్నిలా విజృంభించి పట్నాన్ని చుట్టు ముట్టాడు పలాయనమే రక్ష అన్నారు మంత్రులు దుర్మార్గుడైన విశోకుడు స్త్రీలను చెరపడతాడని భయపడి కట్టుగుడ్డలతో వొచ్చేశాం నాకోడలు పుట్టింట్లో ఉంది కనుక దానికి ఆపద తప్పింది మేం అడవులలో తిరుగుతున్నాం రాజ్యంపోతే పోయింది మీరు కనపడ్డారు అంతేచాలు ఇక్కడే ఆశ్రమం కట్టుకుని తపస్సు చేసుకుంటే మేలు ఇంటికి పోవద్దు అని భర్త అనడంతో ధర్మరతి సంతోషంగా అదే కర్తవ్యం అంది కాని సుకుమారుడు రోషంగా - మీసం దువ్వుతూ - శత్రువులకి ఓడి అరణ్యాలలో నివసించడమా ఎంతమాట ఏదో ఉపాయంతో మళ్ళీ రాజ్యం సంపాదిద్దాం రహస్యంగా నగరంలోకి వెళ్ళి సమయం రాగానే శత్రువుని పరాభవిద్దాం అన్నాడు కుశుడు రతి అతని మాటనే బలపరిచారు రాజు - మనకి బలాలు లేవు దనంలేదు మనలని గుర్తు పడితే విశోకుడు చంపించక మానడు అదంతా ఎందుకు? ఇక్కడే సుఖంగా ఉంటే సరి అనే సరికి కుశుడు అతన్ని ఆక్షేపిస్తూ - మా తల్లి వేదాంతం మీకూ వచ్చింది కాబోలు

మాకు బలం లేకుంటే బంధువులనీ మిత్రులనీ ఆశ్రయించి సేనలు కూర్చుకుందాం అని నచ్చచెప్పి తండ్రిని ఒప్పించి మారువేషాలతో తమ రాజధానికి పోయి వికటదంతుడనే పురోహితుడికి తమ పరిస్థితి గురించి చెప్పి - కొన్నాళ్ళు మీ ఇంట్లో ఉంటాం అవకాశం ఇవ్వు అని కోరారు

## వికటదంతుడి కథ

వికటదంతు డనే బ్రాహ్మణుడు స్వభావత కదు దుర్మార్గుడు ఆపైన కృతఘ్నుడు పాతరాజు నుండి అనేక దానాలు గ్రహించి ఐశ్వర్యం అనుభవిస్తున్నా కొత్తరాజుని ఆశ్రయించి ఉండడం వల్ల - మిమ్మల్ని నా ఇంట్లో పెట్టుకుంటే విశోకుడికి తెలియకా మానదు నన్ను సకుటుంబంగా నాశనం చేయకా మానడు మరోచోటుకి పొండి అనేశాడు కుశు డతన్ని ఎంత కోరినా అంగీకరించలేదు మరోచోటుకి పొమ్మన్నాడు వాళ్ళు మరోమిత్రుడి ఇంటికి పోయి ఆశ్రమం అడిగారు ఆ వైశ్యుడు వారిపట్ల కృతజ్ఞత చూపుతూ వారి పరిస్థితికి చాలా విచారిస్తూ తన యింట్లో పెట్టుకుని వారి ఉనికిని కాపాడసాగాడు

చంద్రగుప్తుడు తనకి అప్తమిత్రుడైన వజ్రదత్తుడికి ఒకజాబు రాసి ఆ వైశ్యుడిద్వారా పంపాడు దానిలో తమ పరిస్థితిని వివరించి - కొన్ని సాధనాలూ సేనలూ పంపమని రాశాడు

ఈ లోపల వికటదంతుడు విశోకుడి వద్దకుపోయి - చంద్రగుప్తుడు భార్యాపుత్రులతో రహస్యంగా వచ్చి యీ వూరిలోనే ఉన్నాడు నన్ను తావివవ్వమంటే నేను ఇవ్వలేదు సమయం కోసం చూస్తూ ఉంటాడు మీకు హితుడిని కనుక చెప్పాను అన్నాడు

అది విని విశోకుడు వారి జాడ తెలుసుకుందుకు రాజపురుషలనీ గూఢచారులనీ నియమించాడు ఒకగూఢచారి వారిజాడ తెలుసుకుని - వైశ్యగృహంలో ఉన్నట్లు రాజుకి తెలియపరచగా విశోకుడు వారందరినీ పట్టించి సంకెళ్ళు వేసి కారాగారంలో పడవేయించాడు

# కాశీ మజిలీ కథలు

## 135 వ మజిలీ

### సూర్యవర్మ కథ

దైవం ధర్మంలోనే ఉంటాడు దైవమే వచ్చి మనకి శత్రువయిన సూర్యవర్మని కడతేర్చాడు అంటూ దేవవర్మ అల్లుడితోనూ కూతురితోనూ ముచ్చటిస్తూంటే యమున– చక్రవర్తి స్థానంలో మరెవరినో ఉంచారట తెలుసా? అని అడిగింది అంతలోనే ఒకదూత పత్రిక తెచ్చాడు దానిలో యుద్ధంలో సూర్యవర్మ చనిపోయాడు వారి స్థానంలో నేను రాజుగారి పీఠం ఎక్కాను ఇప్పుడు అగ్నివర్మ ఆ అభియోగాన్ని నన్ను విచారించ మంటున్నాడు దీని గురించి యదార్థం మీకు తెలుసని పత్రికలో ఉంది ఇప్పుడు మరొక సభ చేస్తున్నాను దానిలో రాజులమధ్య కలిగిన తగవులను విమర్శించి సామంత రాజు లందరి అభిప్రాయం తీసుకుని న్యాయం నిరూపించ బడుతుంది దీనిలో మనకి విరోధం అవసరం లేదు కనుక ఆ సభకు మీరు మీ అల్లుడు స్త్రీలతో సహా మీ బిరుదులతో వాహనాలతో రావచ్చును అందరికీ బసలు ఏర్పాటయ్యాయి అని ఉంది

కొత్త చక్రవర్తి ఎంతమంచివాడు ఎంత న్యాయవేత్త ఎంత వినయశీలి అని పొగడుతూ దేవవర్మ తన వారితో కలసి సభకి వెళ్ళాడు విశోకుడి చేత చంద్రగుప్తుడు మొదలయినవారు చెరసాలలో పెట్టబడ్డారని వైశ్యుడి ద్వారా విన్న వజ్రదత్తుడు న్యాయం నిర్ణయించాలంటూ కోరగా వారందరూ కూడా సభకి వచ్చారు అలాగే తమమధ్య తగవులు కల రాజులు కూడా వచ్చారు

సభలో చక్రవర్తి పీఠానికి ఎదురుగా రెండు వరసలుగా వేయబడిన పీఠాల్లో సామంతరాజులు తమతమస్థాయిని బట్టి కూర్చున్నారు పండితులు హితులు పురోహితులు రాజుల బంధువులతో సభ పూర్తిగా నిండిపోయింది చక్రవర్తి వచ్చి స్వస్థానం అలంకరించగానే అందరూ జయజయధ్వానాలు చేశారు ప్రధాని వరసగా పేర్లు పిలుస్తూంటే వారు చేతులెత్తుతున్నారు చంద్రగుప్తుడు సభకి రాలేదేం? అని రాజు అడిగేసరికి విశోకుడు వొణికి పోయాడు వజ్రదత్తుడు లేచి జరిగింది చెప్పాడు అంతేకాక అతను బంధితుడై ఇక్కడికి తీసుకురాబడ్డాడని కూడా చెప్పాడు రాజు ఆ తగువే ముందు నిర్ణయిస్తానని విశోకుడి గురించి అడిగాడు అతను లేచి రాజుధర్మంతో అతన్ని ఓడించి రాజ్యం తీసుకున్నాను అన్నాడు

ఇప్పుడు నేను నీకంటె అధికుణ్ని నిన్ను చెరసాలలో పెట్టించి నీ రాజ్యం లాక్కుంటే ఈ రాజులంతా సమ్మతిస్తారేమో అది రాజధర్మమే ఎమో అడుగు అన్నాడు చక్రవర్తి అది విని - వాళ్ళంతా - అన్యాయం అని అరిచారు విశోకుడు - తప్పుచేశాను రక్షించండి అన్నాడు చంద్రగుప్తుణ్ని సపరివారంగా విముక్తి చేసి తీసుకురా అని అజ్ఞాపించాడు చంద్రగుప్తుడు తన వృత్తాంతం విశోకుడు తనకి చేసిన అన్యాయం చెప్పాడు చక్రవర్తి అతన్ని ప్రశ్నమీద ప్రశ్నవేయగా చంద్రగుప్తుడు తన అల్లు డొకడు జంగందేవర అని చెప్పక తప్పిందికాదు చక్రవర్తి రెట్టించగా ఆ వృత్తాంతం చెప్పాడు అప్పుడు వారందరినీ పీఠాలమీద కూర్చోమన్నాడు అగ్నివర్మను సురసను దేవవర్మని అతని అల్లుణ్నీ పలిపించి వారి సాక్ష్యాలూ అవీ పరిశీలించి - సామంతులారా గ్రామాధికారి మండలాధిపతి దేవవర్మ అల్లుడిని నిరపరాధిగాపెంచారు సురసదే తప్పన్నారు కాని దానికి సాక్ష్యం ఏమీ కనపడదు దేవవర్మ కూతురు యమున సురస రహస్యంగా అల్లుణ్ణి ప్రార్థించిన విషయం చూబించిందని చెబుతున్నాడు అగ్నివర్మ అది కల్పన అంటున్నాడు కాబట్టి నిజానిజాలు మీరే తేల్చండి రేపు చెప్పండి అని సభ చాలించాడు

వాళ్ళందరూ ఆ విషయం గురించి ఆలోచిస్తూ - దేవవర్మని అడుగుతూ ఎలాగో ఆ రాత్రి గడిపారు మర్నాడు సభలో -

మహారాజా దేవవర్మ అబద్ధం ఆడేవాడు కాదు అతని మాట
నమ్మకూడదు? అని అడిగాడు అలాగే వజ్రదత్తుడు కూడా అన్నా
అందుకు చక్రవర్తి - బాగానే చెప్పావు కాని నీకు సంతానం ఉందా
అని అడిగాడు అతను దీనంగా తనకొడుకు జంగం దేవర వృత్తాంతం
వివరించాడు అప్పుడు చక్రవర్తి - ఇంతవరకూ మీ వృత్తాంతాలు
చెప్పారు ఇక నా వృత్తాంతం వినండి భగవంతుడి లీలలు చాలా చిత్రాలు
పూర్వపుణ్యం మంచిదైతే అడవిలో ఉన్నా అదృష్టం వరిస్తుంది నేను
వజ్రదత్తుడి కొడుకుని జంగం దేవర వరం వల్ల జన్మించాను అంటూ
తాను విరతి కిచ్చి పెళ్ళి చేయబడడం కుశుడు సుకుమారుడూ తమని
అడవిలో వదలడం భూతరాజు భార్య తమని ఆదరించడం యుద్ధంలో
సూర్యవర్మని భూతరాజు చంపడం కుశుడినీ సుకుమారుడినీ విరతి
కాపాడడం వాళ్ళు వెళ్తూ ఉంగరం ఇవ్వడం తరవాత భూతరాజు తనని
ఈసింహాసనం మీద కూర్చోబెట్టి చక్రవర్తిని చేయడం అంతా చెప్పి -
చంద్రగుప్తుడు తన మామగారంటూ ఆ కుటుంబంలోని వారితో తన
సంబంధాలు వివరించాడు అల్పుడు - లవుడే అతను చాలా
మంచివాడు అంతర్ముఖుడు యమున స్త్రీ కనుక సురసగుట్టు
గ్రహించగలిగింది వాళ్ళవల్లే ఈ ఘోరసంగ్రామం జరిగింది విశోకుడు
అన్యాయ మార్గంలో పోయాడు రాజ్యార్హుడు కాడు వికటదంతుడు
కృతఘ్నుడు వానిని ఈ లోకంలో ఉంచకూడదు మీరంతా ధర్మానికి
కట్టుబడి రాజ్యపాలన చేయండి అని పీఠం దిగి తండ్రి అయిన
వజ్రదత్తుడికీ మామగారు చంద్రగుప్తుడికీ నమస్కరించాడు కుశుడు
సుకుమారుడు సిగ్గుతో తలవంచుకున్నారు లవుడు తండ్రికి నమస్కరిస్తూ
- మా తమ్ముడు నాస్తికుడు ఇప్పటికేనా బుద్ధొచ్చిందేమో అడగండి
ఆవేళ నాతో వక్రంగా వాదించాడు అన్నాడు చంద్రగుప్తుడు లవుణ్ని
కౌగలించుకుని బాబూ మేముందరం అజ్ఞానులం నువ్వూ, విరతీ
మీ అమ్మా జ్ఞానవైభవం పొందారు కుశుడు మిమ్మల్ని అడవిలో వదలడమే
మీకు ఉపకారం అయింది పరమేశ్వరుడి లీలలు ఎవరికి తెలుస్తాయి?
నీ మాటలలో ఇప్పటికి నమ్మకం కలిగింది ఇంటికి వచ్చి రాజ్యంచేసుకో
అన్నాడు

తండ్రీ కుశుడు రాజ్యలోభంతో నన్ను నగరం నుంచి వెళ్ళగొట్టాడు అందుకు నాకేమీ కోపం లేదు నాకు మామగారి రాజ్యం ఉంది అంచేత కుశుడికి పట్టాభిషేకం చెయ్యి అన్నాడు

రాజులందరూ సుగతుడిని స్తుతిస్తూ అతని అనుమతితో తమ స్థలాలకి వెళ్ళిపోయారు సుగతుడు విరతితో కలసి చక్రవర్తిగా ప్రజలని చక్కగా పాలించాడు

చంద్రగుప్తుడు అనుమతితో కుశుడు ఇంటికిపోగానే పురోహితుడైన వికటదంతుడిని నడివీధిలో నిలబెట్టి వచ్చే పొయే వారిచేత వానిమీద ఉమ్మేటట్లు నియమించాడు ఆ పురోహితుడు చచ్చిపోయాక అతనిశిలావిగ్రహాన్ని అక్కడ ఉంచి అలా ఉమ్మివేయిస్తున్నాడు

గోపాలా నువ్వు చూసింది వికటదంతుడి రూపమే కృతఘ్నుడు కావడం వల్ల అలాటి అవమానం పొందుతున్నాడు తెలిసింది కదా? అన్నాడు మణిసిద్ధుడు

తెలిసింది స్వామీ ఈకథలో అతిచక్కని అంతరార్థం ఉంది కుశుడు రతికలసి లవుడినీ విరతినీ ఆక్షేపించడం వల్ల ఎంతో అవమానం పొంది వారి చేతనే కాపాడబడ్డారు కుశుడు కపటంతో సుగతుడితో విరతిని అడవిపాలు చేసినా అదేవారికి ఉపకారమై రాజ్యవైభవం లభింపజేసింది దేవవర్మ ధర్మాన్ని నమ్మి పాలించడం వల్ల ప్రబల శత్రువులు కూడా మిడతల్లా మాడిపోయారు కృతఘ్నుత అనే దోషం వికట దంతుణ్ని చిరకాలం బాధిస్తూంది అన్నాడు గోపాలుడు సంతృప్తిగా

శ్లో॥ మిత్ర ద్రోహీ కృతఘ్నశ్చ నృశంసశ్చ నరాధమ
క్రన్యాదై క్రిమిభిశ్చానై ర్న భుంజ్యంతే హోతాదృశా

7వ భాగం సమాప్తం

(ఎనిమిదవ భాగము)

# విషయ సూచిక

## 136 వ మజిలీ నుండి - 165 వ మజిలీ వరకు

# కాశీ మజిలీ కథలు

## 8. వ భాగం

## 136 వ మజిలీ

### సప్తమిత్ర చరిత్ర

'అల్లుడే కోడలయ్యేను - అని చదువుతూ వచ్చాడు గోపాలుడు సంస్కృతంలోని శ్లోకపాదం మళ్ళీ చదివి - గురువుగారూ వింతలు చూడడానికి ఊళ్ళోకి పోయిన నేను - ఒక రచ్చబండమీద కూర్చుని ఈ శ్లోకపాదం చదివి దానిలోని భావం గ్రహించలేక తర్కిస్తున్న విద్వాంసులని చూశాను అల్లుడు కోడలవడం చిత్రమే కదా దాని భావం మీరు నాకు వివరిస్తే నేనా పండితులకి చెప్పి గ్రామంలోని వింతలు చూసి వొస్తాను అన్నాడు

మణిసిద్ధుడు రత్నప్రభావంతో ఆ వృత్తాంతం గ్రహించి - "ఈ శ్లోక పాదం ద్వారా అద్భుత కథ అయిన సప్తమిత్రచరిత్ర స్ఫురిస్తోంది అది నువ్వింతకు మునుపు విన్న కథలకంటే చాలా చమత్కారంగా ఉంటుంది అంటూ చెప్పసాగాడు

❦

### దత్తుడి కథ

యౌవనంలో బ్రహ్మచారిగా వింత తేజస్సుతో వెలిగి పోతున్న ఒక బ్రాహ్మణ కుమారుడు అడవి మధ్యలో ఉండి - ఆహా నేను కాశీపురం నుంచి బయలుదేరి ఇరవై రోజులయింది మొదట

నాలుగయిదు పల్లెలు కనిపించాయి తప్ప తరవాత అంతా అడివే ఎన్నాళ్ళు నడిచినా మొదలూ తుదీ కనపడడంలేదు తెచ్చుకున్న ఆహార పదార్ధాలు అయిపోయాయి పళ్ళు తింటూ చెట్ల కొమ్మల మీద పడుకుంటూ ఎన్నాళ్ళు గడపాలి? ఎదేనా గ్రామం ఉంటుందనే ఆశతో పొద్దుపోయే వరకూ నడిచాను కాని ఎదీ కనిపించింది కాదు మనుషులు నడిచేతోవ కాదిది తెలియక ఈ తోవలో వచ్చాను ఎమౌతుందో - అని విచారిస్తూ నాలుగుమూలలా పరికించి చూశాడు

కొంచెం దూరంలో ఒకదీపం కనిపించింది అతని ఆనందానికి అవధులు లేకపోయాయి అది ఒకసారి తళుక్కుమని మెరుస్తూ మరోసారి మిణుకుమిణుకు మంటూ ఒక్కొక్కసారి అదృశ్యమై పోతూంది జన సంచారంలేని ఈ అడవి మధ్య ఈ దీపం ఎందుకుందో? అది ఉన్నచోటు పర్వతమో భవనమో? అక్కడ ఎవరేనా క్రీడాసౌధం కట్టించుకుని నివసిస్తున్నారేమో? జనం లేనిదే దీపంఉండదు కదా చూద్దాం అనుకుని అటువేపు నడవసాగాడు భూమిని బట్టి అది ఒక కొండ అనిపించింది మెల్లగా చేతులతో ఎగబాకుతూ ముళ్ళనీ రాళ్ళనీ తప్పించుకుంటూ అతను వెళ్ళసాగాడు ఎంతసేపు నడిచినా అది అలాగే దూరంగానే కనపడుతూంది ఆ చీకటిలో ధైర్యమే తోడుగా - కొండ ఎగపాకి ఆ ప్రదేశాన్ని ఎలాగైతేనేం చేరుకున్నాడు అక్కడ నేల చదునుగా ఉంది ఒక భవనంలోని కిటికీలోంచి ఆ విద్యుద్దీపం కనపడుతూంది ఎవరో రాజు ఆ క్రీడా భవనం కట్టించుకుని ఉంటాడు లేదా దేవతలు నివసిస్తూ ఉండాలి తలుపులు తెరిచే ఉన్నాయి లోపలికి పోయి చూస్తాను అనుకుంటూ ఆ గుహలోకి పదడుగులు వెళ్ళాడు పక్కగా ఉన్న గదిలో మణిదీపాలు వెలుగుతున్నాయి అతను తలుపులు తోయకుండా లోపలికి తొంగి చూశాడు

ఆ గది ఎంతగానో అలంకరించబడి ఉంది రత్నాలతో అలంకరించబడిన మంచంమీద ఒక యక్షుడు యక్షిణిని ముద్దాడుతున్నాడు

యక్షిణి మనోహరా మన వియోగకాలం సంవత్సరమే అయినా యుగాలలా ఉంది కుబేరుడికి ఎం అపరాధం చేశామని అలాటి శాపం ఇచ్చాడు? తలుచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తూంది కదా

**యక్షుడు** కుబేరుడు ఒకనాడు దేవతవనొ దానిని వరించి దానిని తీసుకు రమ్మని నాకు నిమమించాడు నేను ఇంటి కొచ్చి నీ ప్రణయంలో ఆ మాట మరచిపోయాను అందుకు - కోపగించిన కుబేరుడు - చిత్రకూట పర్వతంలో నేను పన్నెండు మాసాలు నివసించాలనీ అలకాపురి రాకూడదనీ శిక్షవిధించాడు

**యక్షిణి** అదా కారణం సరే మనం ఇల్లూ వాకిలీ వొదిలి ఎంతకాలం ఇక్కడుండవలసి ఉంటుందీ?

**యక్షుడు** ధూర్తుడైన కుబేరుడి సేవచేయడం నాకిష్టంలేదు ఎవేవో పనులు చెప్పి తప్పులెన్నుతూంటాడు ఈ గుహ చాలా చక్కగా ఉంది మనింట్లోని వస్తువులన్నీ ఇక్కడికి తెచ్చాం కదా ఈ ఎకాంత ప్రదేశంలోనే ఉందాం మన క్రీడలకిది అనువుగా ఉంది

**యక్షిణి** ఈ అరణ్యంలో నివసించడం ఎందుకూ? మరోదేవతా నగరానికి పోయి సుఖంగా ఉండొచ్చు కదా?

**యక్షుడు** కుబేరుడి శాపం వల్ల దేవలోక నివాసాని కర్హత పోయింది నేను పగలంతా భూలోక సంచారం చేసి వచ్చి రాత్రులు నీకు విశేషాలు చెబుతూ ఉంటాను ఇదే సుఖంగా ఉండడానికి మంచి ప్రదేశం

**యక్షిణి** విశేషా లంటే జ్ఞాపకం వచ్చింది ఇవాళ సాయంకాలం ఎదోమూట భద్రంగా తెచ్చారు అదేమిటీ?

**యక్షుడు** చెప్పడం మరచిపోయాను అది మన చరిత్ర మేఘసందేశ మనే గ్రంధం ఒకగ్రామంలో విద్యార్ధులు వల్లిస్తూ ఉంటే దగ్గరగా పోయి భూర్జపత్రాలమీద ఆ గ్రంధమంతా రాసుకు వచ్చాను అంటూ మొదటి శ్లోకంచదివాడు దానిలో శాపవిధానమంతా ఉంది అది చదివాక - 'నేను ఆ పర్వతం మీరు శాపగ్రస్తుడినై ఉండగా మేఘం వచ్చింది ఆ మేఘం ద్వారా నీకు సందేశం పంపాను అందుకే దానికి మేఘ సందేశం అనే పేరు వచ్చింది మన ఇంటి గుర్తులు నేను మేఘుడికి చెప్పాను అంటూ మేఘసందేశం నుంచి ఆ శ్లోకం చదివాడు

**యక్షిణి** మన ఇల్లు కుబేరుడి ఇంటికి ఉత్తరంగా ఉన్నట్లూ మన

పెరటిలో మందార వృక్షం పూలగుత్తులతో వొంగి ఉంటుందనీ కవి కెలాతెలుసు? అతను విన్నాడా? చూశాడా? మీరు మేఘుడితో చెబుతూంటే విన్నాడా?

**యక్షుడు** ఆ మహారణ్యంలోకి మానవమాత్రులు రాలేరు ఆ కవి దైవశక్తి కలవాడట నీవు ఒక రాత్రి నిద్రలో లేచి వెక్కి వెక్కి ఎడుస్తూంటే నేను కారణమడిగాను అప్పుడు నువ్వు - వంచకుడా మరో కాంతతో నువ్వు రమిస్తున్నట్లు కలలో కనిపించావు అందుకు ఎడుస్తున్నాను అన్నావు ఈ రహస్యం మనిద్దరికే తప్ప మరెవరికీ తెలియదు నేనది ఆనవాలుగా నీకు చెప్పమన్నాను నేను మేఘుడితో చెప్పింది ఈ కవి వర్ణించిన ఈ శ్లోకం విను అంటూ ఆ శ్లోకం చదివాడు

**యక్షిణి** మహానుభావుడైన ఈ కవి పేరేమిటో? అతని వివరాలేమిటో?

**యక్షుడు** మేఘసందేశం కవిపేరు మహాకవి కాళిదాసు అతను భోజుడు ఆస్థాన కవిట భోజుడు ధారానగరానికి రాజు గొప్పదాత ఎప్పుడేనా వెళ్ళి చూసిరావాలి

**యక్షిణి** ఆ గ్రంధం చదివి వినిపించరా?

**యక్షుడు** ఇప్పుడు చాలావేళయింది రేపు వినిపిస్తాను

అని ఆమెతో శృంగార లీలలు జరిపి ఆమెతోపాటు ఇవతలకి వస్తూ ద్వారం దగ్గరున్న విప్రకుమారుణ్ని చూసి - యక్షిణి సిగ్గుపడుతూ లోపలికి పోగా అతను వాని చెయ్యి పట్టుకుని గద్దిస్తూ ఎవరునువ్వు? ఇక్కడి కెందుకు వచ్చావు? నిజం చెప్పు అని అడిగాడు

ఆ బ్రాహ్మణుడు భయపడుతూ నాపేరు దత్తుడు మాధురుని కొడుకుని మాది పాటలీపుత్రం అక్కడే కొంతచదువుకుని మిగిలిన విద్య నభ్యసించడానికి కాశీనగరం వెళ్ళాను క్షేమేంద్రుడనే ఉపాధ్యాయుడివద్దకు వెళ్ళి నమస్కరించి నాగురించి చెప్పుకుని ప్రార్థించగా ఆయన నన్ను పరీక్షించి సంతోషించి నన్ను తన విద్యార్థులలో చేర్చుకున్నాడు నాతో సహాధ్యాయుడిగా ఉండడానికి ఎవరు సమర్థులో అని ప్రసంగింపచేయగా

ఆరుగురు మాత్రమే తేలారు మేం ఎడుగురం ఒకే ప్రాణంలా మెలుగుతూ విద్యలు పూర్తిచేసి దేశపర్యటనం చేయాలని తలోదారినా పోయి విశేషాలు చూసి ఎడాదికి ధారా నగరంలో కలుసుకోవాలని నిర్ణయించుకున్నాం నేను దారితప్పి యీ మహారణ్యంలో పడి ఈ రాత్రి దీపకాంతి చూసి ఇక్కడికి వచ్చాను మీ మాటల వల్ల మీరు యక్షదంపతులని గ్రహించాను నన్ను అనుగ్రహించి నాకు దారి చూపండి అని ప్రార్థించాడు

అప్పుడు యక్షుడు ఎంతో చదువుకున్నావు అయినా - ఆలుమగలు క్రీడిస్తూంటే చూశావు కనక నువ్వు ఆడదానివై తిరుగు - నువ్వు విద్వాంసుడివనీ బ్రాహ్మణుడివనీ ఇంతటితో వదిలిపెట్టాను అన్నాడు

దత్తుడు చాలా పరితపిస్తూ - కష్టంలో నీ ఇంటికి వచ్చాను రక్షించాలి కాని శిక్షించడం తగునా? నేను చదివిన విద్యంతా వృధాఔతుంది ఆడదాన్నై స్వేచ్ఛగా తిరగలేను యక్షులు దయాదాక్షిణ్యాలు కలవారంటారు దయచేసి నీ శాపాన్ని వెనక్కి తీసుకో అని పరిపరివిధాల ప్రార్థించాడు

యక్షుడి హృదయం కొంచెం మెత్తబడింది నా శాపానికి తిరుగుండదు నువ్వొక సంవత్సరం ఆడదానిగా ఉంటావు తరవాత మళ్లీ పూర్వంలా మగవాడివౌగతావు నీ విద్యలూ కళలూ నీకు వొచ్చేస్తాయి ఇంతకంటె నేనేమీ చెయ్యలేను ఇక్కడ నుంచిపో అన్నాడు

ధారానగరం చేరేదాకా అయినా ఆడతనం రాకుండా కరుణించండి అని ప్రార్థించాడు దత్తుడు సరే అలాగే కాని మేముంటున్న చోటు గురించి ఎవరికేనా చెప్పావో శాపవిముక్తి అయినా మళ్ళీ ఆడదానివై పూర్వస్మృతిలేక తిరుగుతావు సుమీ అని హెచ్చరించి యక్షు డతనికి దారి చూబించాడు

దత్తుడు బయలుదేరాడు అప్పటికి తెల్లవారుతుంది అతను జరిగినదానికి ఎంతో విచారించసాగాడు ధారానగరానికి పోయి కాళిదాసు మొదలయిన పండితులతో ప్రసంగించి ఖ్యాతి సంపాదించు

కోవాలనుకున్నాను ఆడదానినై ఎం చేయగలను? వయసుకాండ్రు వెంటపడి ఎం మోసాలు చేస్తారో? అనుకుని అంతలోనే ఎదో స్ఫురించగా - విచారం దేనికి? ధారానగరం చేరినప్పుడు కదా నేను ఆడదాన్నవడం అక్కడికి వెళ్ళక పోతే శాపాని కవకాశమే లేదు మరోదేశం పోతాను మిత్రులు నాకోసం ఎదురు చూస్తుంటారా వేరే విధంగా వర్తమానం తెలియజేస్తాను అనుకుంటూ నడవసాగాడు

కొన్నాళ్ళపాటు నడిచాక అలసట వొచ్చి ఒక చెట్టు నీడలో నిలబడి విశ్రాంతి తీసుకుంటూ - బయలుదేరినవేళ మంచిది కాదు తప్పుదారిలో పడ్డాను అంతా అరణ్యమేతప్ప గ్రామమే కనపడదు ఇది ఎదేశమో ఈ దారి ఎక్కడకి పోతుందో చెప్పేవారు కనపడరు యక్షుడు తన శాపం అమోఘం అన్నాడు ఆ వూరికిపోక తప్పదేమో కానీ జరిగేది జరక్క మానదు అనుకుంటూ దారివేపు చూశాడు ఎదో మృగం పరుగెత్తుకొంటూ వొస్తున్నట్లు కనిపించింది అతను చెట్టెక్కి కొమ్మలమధ్య దాగున్నాడు అంతలో జీను కట్టిన గుర్రమొకటి వచ్చి ఆ చెట్టు కిందే నిలబడింది దానిని చూసి - ఇది అడవిమృగం కాదు ఈ ప్రాంతంలో ఎదో నగరం ఉండి ఉంటుంది దాని రాజుదైన ఈ గుర్రం యిలా పారిపోయి వచ్చి ఉంటుంది అనుకుంటూ చెట్టుదిగి దాని జూలు దువ్వుతూ మచ్చిక చేసుకుని ముఖంమీద వేలాడుతున్న బిళ్ళని చూడగా రుక్మిణి అని ఉంది అతను ఆశ్చర్యపోయాడు నడవలేక అలసిపోయిన నాకీ గుర్రాన్ని దేముడే పంపాడు దీని నెక్కి పోతాను ఎదో ఒకటవుతుంది అని నిశ్చయించుకుని కళ్ళెం పట్టుకుని దానిమీద కెగిరి కూర్చున్నాడు అతను దానిని కొంచెం అదిలించడంతోనే అది అతివేగంగా పరుగెత్తి రెండు గడియలలో భోజరాజు రాజధాని అయిన ధారానగరానికి దగ్గరగా కల ఒక ఉద్యానవనం చేరింది

అని మణిసిద్ధుడు అప్పటికి ఆ కధను ఆపాడు

# కాశీ మజిలీ కథలు

## 137 వ మజిలీ

### భోజుడి కథ

భోజరాజుకి నలుగురు భార్యలు అతనికి నలుగురిమీదా సమాన ప్రేమే అయినా లీలావతి అంటే కాస్తమక్కువ ఎక్కువ ఆమె అతన్ని ఎంతో భక్తిగా ఆరాధించేది అతను తరచుగా ఆమె అంత పురంలోనే ఉండేవాడు అతనికి అందరికంటే అప్పుడు కాళిదాసు అతను గడియసేపు కనిపించకపోయినా భోజుడు ఉండలేకపోయేవాడు లీలావతి అంత పురానికి కూడా అతన్ని కూడా తీసుకుపోయేవాడు లీలావతి కాళిదాసుకి ఎదుటపడి మాట్లాడకపోయినా పరోక్షంగా అతనికి ఉపచారాలు చేసేది రాజే ఆమెకు ఆ పనులు చేయమని చెబుతూ ఉండేవాడు తనకి చేసిన ఉపచారాలకంటె కాళిదాసుకి చేసే ఉపచారాలే భోజుడికి ఎక్కువ సంతోషం కలిగించేవి

ఒకసారి భోజుడికి శరీరంలో కొంచెం అస్వస్థత కలిగింది కాళిదాసు కూడా అతనితో లీలావతి ఇంట్లోనే ఉండిపోయాడు దానితో ఇతర కవులకీ లీలావతి సవతులకీ అసూయ కలిగింది కాళిదాసుకి లభించే గౌరవం చూసి ఓర్వలేకపోయిన పండితులు - రాజుఎంత అవివేకి అయ్యాడు జారశిఖామణై ఎప్పుడూ భోగం వాళ్ళతో కాలం గడిపే కాళిదాసుని లీలావతి అంత పురంలో ఉంచి ఆమెచేత ఉపచారాలు చేయిస్తున్నాడట ఎ క్షత్రియుడైనా ఇలా చేస్తాడా? ఎంత ప్రీతి ఉన్నా అతన్ని స్త్రీలు వుండే అంత పురంలో పెట్టుకుంటాడా? అంటూ ఆక్షేపించసాగారు

రాజుగారి భార్యలు కూడా తమ పరిచారికలచేత కూడా యిలాగే పలికించసాగారు

**ఒకరు** లీలావతి చర్యలన్నీ రాజరత్నం నాకు చెప్పింది కాళిదాసు కామె విసురుతుందట పన్నీరు జల్లుతుందట భోగందానిలాగే సేవలు చేస్తుందట చెప్పేదేముంది? రాజు వట్టి వెర్రివాడైపోయాడు

**రెండవది** ఆకుచుట్టలు చేతికి కాక నోటికే అందిస్తుందట ఆ కవికి గంధం పూస్తూండగా కళ్ళారాచూసినట్లు నాకు చకోరాక్షి చెప్పింది అంత యిష్టముంటే పరిచారికలచేత చేయించవచ్చుకదా? ఎరాజు భార్యయినా ఇలాటి పనులకి ఒప్పుకుంటుందా?

**మూడవది** నీకు అసలు సంగతి తెలియలేదు అంటూ చెవిలో ఎదో చెప్పి గజయాన చెప్పింది

**నాలుగవది** ఆ నమ్మలేకపోతున్నాను అబద్ధమయి ఉంటుంది

**మూడవది** అబద్ధం కాదు రహస్య మేమీలేదు అంతా బాహాటమే అక్కడి పరిచారిక లందరికీ తెలుసు

**ఇంకొకతె** రాజుగారి కిష్టమేనా? సహిస్తున్నారా?

**మరొకతె** ఆమె ఆయన కేదో మందు వేసింది రాజు మందమతి అయి వాళ్ళ శృంగారచేష్టలకి ఆనందిస్తాడు

**రాజుగారి భార్యలు** నవ్వుతూనే ఛీ రండలారా పేలకండి మా ఎదుట మా అక్కని ఆక్షేపించారంటే ఊరుకోం మా అక్క చాలా తెలివి కలది అందుకే మగని వశపరచుకో గలిగింది అంతే తప్ప మరేంకాదు

**పరిచారికలు** అమ్మా మా నోరు మూయ గలరు కాని లోకం నోరు మూయగలరా? దేశమంతా ఇదేమాట

**భార్యలు** ఐతే ఆ మాట రాజుగారికి తెలిసేటట్లు చెయ్యండి అంతేకాని మా ఎదుట అలాటి మాటలాడకండి

వారి ఉపదేశంతో పరిచారికలు క్రమంగా లీలావతి పరిచారికల దగ్గరా అంత పురాలలోనూ ఆ మాటలను వ్యాపింప చేశారు అవి మెల్లగా రాజుగారి చెవిన కూడా పడ్డాయి అతను మొదటి ఆ మాటల్ని లెక్కచెయ్యలేదు కాని ఒకనా దతని శయ్యమీద ఉంచబడిన పత్రికను చదవగా ఇలా ఉంది

'రాజా నువ్వు తెలివయిన వాడివే అయినా స్నేహప్రలోభంలో పడి స్త్రీనెలా కాపాడుకోవాలో తెలుసుకోలేక పోతున్నావు కాళిదాసకవి ఎలాటి జారుడో నీకు తెలియదా? అతను అంత పుర ద్రోహం చేస్తున్నాడని లోకమంతా చెప్పుకుంటూంది నీ కతని మీద అంతయిష్టమైతే భూములో గ్రామాలో ద్రవ్యమో యివ్వు అంతేకాని అంత పురంలో పెట్టుకుని పరిచర్యలు చేయిస్తూ అవమానం తెచ్చుకుంటావా? కర్ర ఎంత గట్టిదయినా నిప్పు తగిలితే మెత్తబడకుండానో కాలకుండానో ఉంటుందా? కర్తవ్యం ఆలోచించుకో

ఆ పత్రికలోని విషయం అతని నిర్మలమైన మనస్సుని కలవరపరచింది మహానుభావుడైన కాళిదాసు మిత్రద్రోహం చేస్తాడా? పోనీ మగవాడు చంచల మనస్కుడు అనుకున్నా మహాసాధ్వి లీలావతికి నామీద ఎంతో అనురాగం ఆమె ఇటువంటి తుచ్ఛపు పనికి దిగజారుతుందా? ఉహు ఎవరో కిట్టనివారు కల్పన చేశారంతే అందుకే పత్రిక దిగువన సంతకం కూడాలేదు అనుకుని మామూలుగానే ప్రవర్తించసాగాడు

ఒకనాడు లీలావతి భర్తకు భోజనం వడ్డించగా కాళిదాసు అతనికి దగ్గరలో పీటమీద కూర్చుని మాట్లాడుతున్నాడు రోగాలని పోగొట్టే ఈ పెసరపప్పుకి పొట్టెందుకు తీయాలి కవీంద్రా? అని అడిగాడు భోజుడు అన్నం అనే భర్తలో కలవడానికి అది కవచం తీసుకుంది అని శ్లేషగా జవాబు చెప్పాడు కాళిదాసు ఆ చమత్కారానికి లీలావతికి నవ్వువొచ్చింది ఆ నవ్వే భోజరాజుమనసులో అనుమానాగ్నిని

రగిలించింది అతను మొహం ముడుచుకున్నాడు స్త్రీ సమక్షంలో ఇలాటి ఉత్ప్రేక్ష ప్రయోగిస్తాడా లీలావతి సిగ్గు విడచి నవ్వుతుందా ఇది ఎంత అనుచితం చూడబోతే లోకాపవాదం నిజంలాగే ఉంది స్త్రీల చిత్తం ఇలా ఉంటుంది కాబోలు - అనుకుని అప్పటి నుంచి కాళిదాసుతో మాట్లాడ్డం మానేశాడు లీలావతిని కూడా కోపంగా చూడసాగాడు తానూ కాళిదాసూ కూర్చుని ఉండగా ఆమె వొస్తే అవతలికి పొమ్మనేవాడు ఒకనాడు – లీలావతి దాసిని పిలిచి – ఆ గదిలో ఎవరున్నారో చూసిరా రాజుగారు ఒక్కరే ఉంటే వేగంగా వొచ్చి చెప్పు అని పంపింది కొన్ని రహస్యాలు మాట్లాడాలి వెంటనే తిరిగొచ్చి చెప్పు అంది

ఆ గదిలో – మంచం మీద అవతలివేపు ముఖం పెట్టుకుని కాళిదాసు పడుకున్నాడు భోజుడు పీఠంమీద కూర్చుని – పరిచారిక తొంగిచూసి వెళ్ళడం గమనించాడు తాను చాటుకి వెళ్ళాడు అయ్యగా రొక్కరే ఆ గదిలో పడుకుని ఉన్నారు అని పరిచారిక చెప్పగా లీలావతి అలంకరించుకుని ఫలహారం పట్టుకుని ఆ గదిలో మంచం మీద పడుకున్నది తన భర్తే అనుకుని మంచంమీద కూర్చుని – మనోహరా లెండి ఈ ఫలహారం స్వీకరించండి నాతో మాట్లాడ్డం మానేశారే? కోపం వచ్చిందా? కవిరాజు రాగలడు వేగం లెండి మీతో మాట్లాడాలి అని ముసుగులాగింది ఆ ముసుగులో పడుకున్నది కాళిదాసని గ్రహించి సిగ్గుపడుతూ చివాలున లేచిపోయింది కిటికీలోంచి చూస్తున్న రాజుకి 'రాజు రాగలడు అని వినిపించి తననిచూసి ఆమె వెళ్ళి పోయిందని ఆమె గది వద్దకు పోయి ఏమనుకుంటూందో అని కనిపెట్టివినసాగాడు

లీలావతి – తిన్నగా చూడకుండా అబద్ధం చెబుతావా? ఎంత ప్రమాదం నీ అశ్రద్ధకు నిన్ను కఠినంగా శిక్షించాలి అని దాసిని గద్దించడం విని – ఓహో ఇప్పుడు తెలిసింది నన్ను చూడక అత నొక్కడే ఉన్నాడని చెప్పినందుకు దానిని మందలిస్తూంది వేశ్యాలంపటుడైన ఆ కవిని అంత పురానికి తీసుకొచ్చి చనువివ్వడం నాదే తప్పు స్త్రీ లత

దగ్గరున్న వాటిపై పాకుతాయని శాస్త్రాలు చెప్పనే చెప్పాయి నా బుద్ధి గడ్డితింది ఈ అపకీర్తి లోకమంతా వ్యాపించింది కాబోలు అనుకుంటూ కోపం పట్టలేక తక్షణమే కాళిదాసు వద్దకు వెళ్ళి అతని మొహం చూడకుండా - నువ్వు ఇప్పుడే నా దేశంనుంచి ఫో అని వచ్చేశాడు 'నేనేం తప్పు చేశాను? నన్నెందుకు పొమ్మంటున్నావు? అని అడగనైనా అడగకుండా - మహాప్రసాదం అంటూ కాళిదాసు కట్టుగుడ్డలతో ఎక్కడికో వెళ్ళిపోయాడు

రాజు అంతటితో ఆగక అంతరంగికులయిన పరిచారకుల్ని పిలిచి - లీలావతిని ఎవరికీ తెలియకుండా అర్ధరాత్రి తీసుకుపోయి మహారణ్యంలో వదలిరండి అని నియమించాడు

అని చెప్పి ప్రయాణానికి సిద్ధమయ్యాడు మణిసిద్ధుడు గురువుని అనుసరించాడు గోపాలుడు

# కాశీ మజిలీ కథలు

## 138 వ మజిలీ

హితుడైనకవి మిత్రుడినీ అనురాగవతియైన భార్యనీ వెళ్ళగొట్టింది మొదలు రాజుకి మతిస్థిమితం పోయింది సభకి వెళ్ళడు ఎవరితోనూ మనసువిప్పి మాట్లాడడు ఎదో ఆలోచిస్తూ ఒక్కడూ కూర్చుంటాడు వాళ్ళ విషయం పరిజనులు ఎమనుకుంటున్నారో అని చాటునుంచి వాళ్ళ మాటలు వింటూంటాడు ఒకచోట ఇద్దరు పరిచారికలు మాట్లాడుకుంటూంటే భోజుడు వారి మాటలను రహస్యంగా వినసాగాడు

బాపియా  కనికీ ఆగు ఎక్కడికి పోతున్నావ్? చేసిన పని సాగింది కదా  కానుకలు అందాయా?

కనికి  బాపియా నేను తొందరగా పోవాలి కానుకలా వెటకారంగా ఒళ్ళంతా బంగారమైపోయింది?

బాపియ  అలా అంటున్నా వేమిటి? వాళ్ళు కానుక లివ్వలేదా? మీ అమ్మ ఈ ఎటితో అప్పులు తీరిపోతాయంది?

కనికి  చేతిలో వేయించుకుని కాని ఎపనీ చెయ్యకూడదు పండితులిచ్చిన పత్రిక రాజుగారి మంచం మీద పడవేశాను అది చదువుకునే కదా మనరాజుగారు కాళిదాసుమీద అనుమానం కలిగి మాట్లాడడం మానేశారు కాని తరవాత ఆయన వాళ్ళని వెళ్ళగొట్టడం నేను చేసిన పని వల్ల కాదట

బాపియ  మరి ఎవరు చేసిన పని వల్లనో?

కనికి  లీలావతి పనికత్తె చేసిన పనివల్ల నట ఇంతకీ అది చేసేం దేమీ లేదు అన్నీ అమిర్చాక అది వచ్చి వేలు పెట్టింది లీలావతి దానిని ఆ గదిలో ఎవరున్నారో చూసిరమ్మంటే కాళిదాసు పడుకుని ఉంటే

రాజుగారని చెప్పింది అంచేత ఆమె అతని ముసుగులాగింది రాజుగారది చూసి - ఒక్కసారాగి చుట్టూ చూసి బ్రహ్మరహస్యం సుమీ ఎవరికీ చెప్పకేం రాజుగారు వాళ్ళని వెళ్ళగొట్టారు చివరి పని చేసిన బుచ్చివెంకికి మాటదక్కింది కానుకలూ దానికే దక్కాయి

బాపియూ రాజుగారికి నిజం చెబుతానని బెదిరించలేక పోయావా?

కనిక దానంతట అదే నిజం బయట పడుతుంది మహాపతి వ్రతల నడివిక పంపితే ఆ పాపం ఊరికేపోతుందా?

బాపియూ నవ్వుతూ) అంత తెలిసిన దానివి మొదట ఎందుకలాటి పనికి పూనుకున్నావూ?

కనికి గొప్పవారికి నీతి ఉండాలి కాని మనకేమిటి? నేను కాకపోతే మరొకతె చేస్తుంది

బాపియ అదీ నిజమే పదపద ఎవరో యిటువస్తున్నారు

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు దైవికంగా ఆ మాటలు చెవిన పడిన రాజు వాళ్ళిద్దరూ నిరపరాధులని హృదయ పూర్వకంగా నమ్మి పశ్చాత్తాప పడసాగాడు ఏం చేయడానికీ తోచక గదిలో మంచంమీద పడుకుని వాళ్ళని తలుచుకుంటూ దు ఖించసాగాడు కొంతసేపయ్యాక లేచి లీలావతిని అడవికి తీసుకుపోయి విడచిన వారిని రప్పించి నా ప్రియురాలిని ఏం చేశారు? ఎక్కడ వదిలారు? తిరిగొచ్చాక నా వివరాలేవీ ఎందుకు చెప్పలేదు? అని అడిగాడు

అందుకు వారు - 'దేవా అనాడే మీ దర్శనం కోసం వచ్చాం కాని కావలివాళ్ళు మమ్మల్ని లోపలికి రానివ్వలేదు మీ ఆజ్ఞానుసారమే ఆమెకు మత్తుమందు వాసన చూబించి ఆమె మైమరచి ఉండగా పల్లకి ఎక్కించి నగరానికి ఉత్తరంగా ఉన్న మహారణ్యంలో తెల్లవారే వరకూ చాలాదూరం నడిచి పోయాం సూర్యోదయానికి మెలకువ వచ్చిన ఆమె మమ్మల్ని దొంగలనుకుని దీనంగా ప్రార్థించింది తన భర్త వద్దకు చేర్చమని వేడుకుంది అప్పుడు మేం ఆమెకు మీ ఆజ్ఞాపత్రికను చూబించాం అది చదువుకుని - అమె హా ప్రాణేశ్వరా అంటూ మూర్ఛపోయింది

మేం ఉపచారాలు చేయగాఎలాగో తెలివితెచ్చుకుని - లేచి నాలుగు వేపులా చూసి నాకిలాటి పాడు కల వచ్చిందేమిటి? నేను ఈ అడవి కెలావచ్చాను? నా జీవితేశ్వరుడు నన్నీ అడవిలో వదిలి రమ్మన్నాడా ఎంతమాట అన్నారు ఆ దయాశాలి నిరపరాధి నయిన నన్ను ఎందుకు విడచి పెడతాడు? అది అంతా అబద్ధం ఇదంతా కలే అని ఆమె అనగా మేం మళ్ళీ మీ శాసనం చదివి వినిపించాం

అప్పు డామె పడిన దు ఖం మేం వరించి చెప్పలేం పెద్ద గొంతుకతో అడవి ప్రతిధ్వనించేలా ఆమె ఎడుస్తూంటే మాకూ ఎడుపు వచ్చింది తనని చంపి పొమ్మంది మేం ఎమని ఊరడించగలం? ఆమెను వదలలేక వదలలేక వచ్చేస్తూంటే తమకిమ్మని యీ పత్రికలో ఎదో రాసి ఇచ్చింది చూసుకోండి అంటూ ఆ పత్రిక నందించారు నేను చావడానికి విచారించడం లేదు జీవితం ఎలాగూ ఆశాశ్వతమే కాని దుష్టురాలి ననిపించుకున్నందుకే దు ఖిస్తున్నాను మీ పాదాలే నమ్మి బతుకుతున్న దానిని పంచభూతాల సాక్షిగా నేను ఎ పాపం ఎరగను జన్మజన్మలకే మీరే నా భర్త కావాలని మిమ్మల్నీ పరమేశ్వరుణ్నీ ప్రార్థిస్తున్నాను అని ఉంది ఆ పత్రికలో

అది చదివి రాజు మూర్ఛపోయాడు కొంచెంసేపటికి తెలివొచ్చి పిచ్చివాడిలా - మీ రామెను తీసుకుపోయి ఎన్నాళ్ళయింది? అని అడిగాడు పదిహేను దినాలయింది స్వామీ అన్నారు వారు

నాకు యుగా లయినట్లుంది నేను ఆ అడవికి వొస్తాను నా ప్రియురాలి నెక్కడ వదిలారో చూబించండి అంటూ ఎవరికీ చెప్పకుండా అశ్వశాలకి వెళ్ళి ఒక గుర్రానికి జీను కట్టించి ఎక్కి రాజు వాళ్ళతోపాటు`మహారణ్యానికి వెళ్ళాడు ఆ దూతలు తాము రాణిని ఎక్కడ పత్రిక దింపిందీ ఎక్కడ శాసనం తెలియజేసిందీ ఆమె ఎక్కడ దు ఖించిందీ ఎక్కడ పత్రిక రాసిచ్చిందీ చూబించారు అడవంతా వెతికారు ఆమె జాడ కనిపించలేదు రాజు చాలా విచారిస్తూ తాను వచ్చేవరకూ రాచకార్యాలన్నీ మంత్రుల్ని చక్కబెట్టమని శాసనం రాసి ఇచ్చి వాళ్ళని యింటికి పంపివేసి తానుమాత్రం అరణ్యమంతా తిరుగుతూ

లీలావతిని వెదకసాగాడు ఆమె ఎంతకీ కనిపించకపోతే బలవన్మరణం చెంది ఉంటుందని భావిస్తూ ఒక చెట్టుకింద అలసటతో చతికిల పడ్డాడు

అయ్యో పరమపతివ్రతా శిరోమణి అయిన ఇల్లాలిని అనుమానించి చంపించాను మహానుభావుడైన కాళిదాసుని అవమానించాను వారిద్దరూ నిర్దోషులని ఇప్పుడు నా హృదయమే చెబుతూంది నాకీ పాపం ఎలా పోతుంది? ఉపవాసాలతో ప్రాణాలు వదులుతాను అని నిశ్చయించుకుని నలుమూలలూ చూస్తూంటే ఉత్తరం వేపునుంచి ఒక బ్రాహ్మణుడు ఆ చెట్టుకిందకే ఎండబాధతీర్చుకుందుకు వొచ్చి కూర్చుని - రాజుని చూసి ఆశ్చర్యపోతూ పలకరించడానికి కొంచెం భయపడి ఊరికే అతని వంక చూడసాగాడు

అప్పుడు భోజుడు అతన్ని చూసి దీనస్వరంతో - అయ్యా మీరేవూరు? ఎక్కడికి పోతున్నారు? అని అడిగాడు

అతను - అయ్యా నేనొక బ్రాహ్మణుడిని నాపేరు ఘోటముఖు డంటారు భోజమహారాజుగారిని చూడడానికి ధారా నగరానికి వెళ్తున్నాను కాశీలో చదువుకున్నాను అంటూ తన వృత్తాంతం అంతా చెప్పాడు

ఆ మాటలు విని రాజు అతనికి నమస్కరించి - ఆర్యా భోజుడితో మీకేం పని? అని మెల్లగా అడిగాడు అయ్యా అతను గొప్పపండితుడే కాక పండితులపాలిట కల్పవృక్షమని కాశీలో విన్నాం మేము ఎడుగురం సహాధ్యాయులం వారిని దర్శించుకోవాలని వేరు వేరు మార్గాలలో బయలుదేరాం నా మిత్రులు ఈ పాటికి అక్కడికి చేరుకునే ఉంటారు దారిలో ఆటంకాలు కలగడంవల్ల నాకు కోంత ఆలస్యమయింది అన్నా డతను ఆర్యా ఈ అడవిలో ఎక్కడేనా ఒక సుందరి మీకు కనిపించిందా? అని రాజు అడగగానే అతను - ఆమె వల్లనే నాకు ఆలస్యమయింది అన్నాడు ఎక్కడ కనపడిందో చెప్పండి నన్ను అక్కడికి తీసుకెళ్ళండి అని బతిమాలాడు భోజరాజు

'నేనొక దారిన వస్తూంటే - ఒకచోట చెట్టు కొమ్మకి పైట చెంగు తగిలించి మెడకి ఉరిపోసుకుని చావడానికి ప్రయత్నిస్తున్న ఒక అంతపుర స్త్రీ కనిపించింది కళ్ళు మూసుకుని దేవుణ్ని ధ్యానిస్తూంది

నేను తటాలున ఉరిబిగవకుండా పట్టుకుని - సాధ్వీ నువ్వువరివి? బలవంతంగా చనిపోతున్నా వెందుకు? అని అడిగాను ఇది పాపం కాదా? నీకేం ఆపద వచ్చింది? చూడబోతే నువ్వు గొప్పఇంటి దానిలా ఉన్నావు నీ వృత్తాంత మేమిటి? అని నేను రెట్టించగా -

ఆమె కళ్ళు తెరచిచూసి ఆర్యా నీకు నమస్కారం నన్ను వదులు నా వృత్తాంతం అడగకు నన్ను చనిపోనీ - అని ఎంతగానో బతిమాలింది తల్లీ నన్ను పుత్రుడిగా భావించి నీ వృత్తాంతం చెప్పు బలవన్మరణం పొందకూడదు అంటూ ఆ మాట వదలక పోడంతో ఆమె ఆత్మహత్యా ప్రయత్నం అయితే విరమించింది కాని తన వృత్తాంతం మాత్రం చెప్పలేదు అప్పుడు నేనామెను - మీ ఊరికి పోదాం అంటూ లాలించి ఒకదారిలో నడిపించసాగాను మేమిద్దరం కొంతదూరం వెళ్ళాక ఆ దారిలో ఒక మాంత్రికుడు - ఎలుగుబంట్లనీ కోతులనీ కుక్కలనీ మెడలకు తాళ్ళు తగిలించి ఆ తాళ్ళను తనచేతిలో ఉంచుకుని వస్తూ మాకు ఎదురు పడ్డాడు వాడిచేతిలోని దుష్టజంతువులకు జడిసి నేను ఆ ఇల్లాలిని దగ్గరగా రమ్మని దారికి పక్కగా నిలబెట్టాను వాడు వెళ్ళిపోతాడని ఎదురు చూస్తున్నాం

కాని ఆ దుర్మార్గుడు ఆమె ముఖం ఎగాదిగా చూసి తన దగ్గరకి రమ్మని వేలితో సంజ్ఞ చేశాడు ఆమె వాడి ముఖమే చూడలేదు అతను ఆమె దగ్గరగా వచ్చి - నువ్వెవరివి? ఎక్కడికి పోతున్నావ్? అని అడిగాడు ఆమె భయపడి నా చాటుకి వచ్చింది

నేను అడ్డంగా నిలబడి - అయ్యా మా జోక్యం మీకెందుకు మీదారిన మీరు పొండి ఈమె నాకు సహోదరి మేం బ్రాహ్మణులం నేనుండగా దానిని పలకరిస్తావేం? అన్నాను ఆ మాటలకు అతను

తలూపుతూ - బాపురే బాపనయ్యా అంటూ ఒక కుక్క తాడు విప్పి నామీదకి ఉసికొల్పాడు అది మొగుతూ వొచ్చి నామీద పడేసరికి నేను ధైర్యం చాలక పారిపోయాను ఆ కుక్క నన్ను తరిమితరిమి కాలు కరవగా నేను పడిపోయి మూర్ఛచెందాను తెలివొచ్చాక ఎంత వెదికినా ఎవరూ కనపడలేదు తిరిగితిరిగి విసుగెత్తి మళ్ళీ పాతతోవ పట్టాను ఎంత పాపాత్ముణ్ణి అంటూ దు ఖించి - మాంత్రికుడు అడవిలో తిరుగుతూ సాధువులని హిసిస్తున్నాడంటే ఆ పాపం రాజుదే నా కంట పడాలే కాని ఆ మాంత్రికుణ్ని చంపెయ్యనా? ఓ బ్రాహ్మణుడా నిన్ను కుక్కచేత కరిపించాడా వాడు ఏదీ గాయం? అయ్యో కోరలు లోతుగా దిగాయి గాయం ఇంకా పచ్చిగానే ఉంది వాడెటు వెళ్ళాడో చెప్పు సంహరిస్తాను అన్నాడు రాజు

ఆ మాటకు అత నెవరో గొప్పవాడని ఊహించి ఆ చిన్నదాన్ని ఇతను అనుమానించి అడవులకు పంపి ఆపైన పశ్చాత్తాప పడుతున్నాడనీ ఆమె ఇతని భార్య అయివుంటుందనీ అనుకున్నాడు ఆ మాంత్రికు డామెను చెరపట్టకమానడు ఆమె చనిపోక మానదు ఈ దంపతుల కలయిక ఇక కలే - అనుకుంటూ అతనితో - "అయ్యా నేను వాళ్ళకోసం వెదికాను కాని వాళ్ళు కనిపించలేదు ఆ క్రూరుడి నొసట పెద్ద కుంకుమ బొట్టుంది గెడ్డం పెంచాడు జడలు ముడివేశాడు వా డీ పాటికి జనపదాలకు పోయుంటాడు నేను వాడిని గుర్తు పట్టగలను మనం ఈ అడవి వదిలి గ్రామాల మీదుగా పోయివెదుకుదాం అన్నాడు రాజు ఆ మాటలకి సంతోషించి ఘోటక ముఖుడితో కలసి దేశసంచారానికి బయలుదేరాడు

# కాశీ మజిలీ కథలు

## 139 వ మజిలీ

### రుక్మిణి కథ

భోజరాజుకి గంధర్వపుత్రిక అయిన కమల అనే భార్యయందు కలిగిన వారే చిత్రసేనుడనే కొడుకూ రుక్మిణి అనే కుమార్తె రాజపుత్రిక రుక్మిణి గంధర్వ అంశతో జన్మించిన అసామాన్యమయిన సౌందర్యవతి ఆమె విహరించడానికి పట్నానికి అనుకొని గొప్ప ఉద్యానవనం నిర్మించబడింది ఆ తోటలో ఉన్నపుష్పజాతులు మరెక్కడా లేవు ఆ ఉద్యానవనం చుట్టూ ప్రహరీ కట్టబడి ఉంది రుక్మిణి ఎప్పుడూ ఆ తోటలేనే విహరిస్తూ ఉంటుంది దానిలోకి పురుషులకి ప్రవేశం నిషిద్ధం రుక్మిణికి అత్యంత సన్నిహితరాలయిన సఖి రేవతి

ఒకనాడు రుక్మిణి ఉద్యానవనంలో ఆడి ఆడి సాయంకాలం స్వారి చేయాలని వేడుక పడి – 'సఖీ పరిచారిక గుర్రాన్ని తీసుకురాలేదేం? వాహ్యాళి లేదనుకుందా? అని రేవతిని అడిగింది

పరిచారిక వేళకే గుర్రాన్ని సిద్ధంచేసి తీసుకువచ్చిందట కాని అది అకారణంగా బెదిరి ఎంతగా కళ్ళెంపట్టుకు లాగినా నిలబడక కళ్ళెం తెంచుకుని ఎక్కడికో పారిపోయిందట దానికోసం చాలామంది రాజభటులు పరుగెత్తారు దానిజాడ తెలియలేదట అది చెబుదామనే వచ్చాను నువ్వు ఎదో పుస్తకం చదువుకుంటూ నావేపు చూశావు కాదు ఇంక షికారుకి వేళలేదు రేపు వెళ్దాంలే ఆ పుస్తకం ఎమిటి? అంది రేవతి

దీనిలో చాలా చమత్కారం అయిన విషయాలున్నాయి ఇది రహస్య గ్రథం పేరు చెప్పకూడదు స్పష్టంగా అర్థమవడంలేదు చూడు

అంటూ రేవతికి ఇచ్చింది రేవతి దానిని చూసింది గురుముఖంగా చదువు కోమన్నావు కాని దీనిని పురుషుల ముందు చదవకూడదు శాస్త్ర పాండిత్యంకల స్త్రీలు మనకి దొరకరు అందుచేత అర్ధమైనంత వరకే చదువుకోవాలి రేవతీ నీకంటె నాకు ఎక్కువ పాండిత్యం ఉందా? తిన్నగా చూస్తే నీకే అర్ధమౌతుంది లేకపోతే పండితులను అడిగి తెలుసుకు వస్తాను అంది సిగ్గుసిగ్గు ఈ మాట ఎవరికేనా చెప్పావు సుమా ఇంటికి పోదాం బండికట్టించు అంటూ పుస్తకం తీసుకుంది రుక్మిణి అంతలో అశ్వరక్షకురాలు వొచ్చి బండి సిద్ధంగా వుంది అంది వినయంగా నీవల్ల షికారు చెడిపోయింది గుర్రం ఎందుకు బెదిరింది? సరిగామచ్చిక చెయ్యడం లేదా? అని అడిగింది అందుకామె - అది ఎప్పుడూ యిలాటి ఆగడం చెయ్యలేదు ఊరికే బెదిరి ఎవరో లాక్కుపోయినట్లు పారిపోయింది ఆపడం నాతరం కాదు అంటూండగానే అదుగో రాకుమార్తె గుర్రం వస్తూందని వనపాలికలు కేకలు పెట్టారు

అందరూ అటు చూశారు ఒక చక్కని యువతి జీనుమీద కూర్చుని కళ్ళెం లాగుతూంటే ఆ గుర్రం వేగంగా వచ్చి రుక్మిణి బండి పక్క నిలుచుంది ఆమెని చూసి ఆశ్చర్యపోతూ - నీ వెవరివి గుర్రం నీకెక్కడ కనపడింది? దీనిని తెచ్చి ఇచ్చావు కనుక నువ్వు మాకు నెచ్చెలివే అయ్యావు రా నీ వృత్తాంతం చెప్పు అంది రుక్మిణి ఆమె నేర్పుగా గుర్రం దిగింది రాకుమార్తె ఆమెను వేదిక మీద కూర్చుండ బెట్టింది అప్పుడామె -

రమణీ నాపేరు చారుమతి అంటారు నేనొక వేశ్యాపుత్రికని కన్నవారు చిన్ననాడే గతించారు బంధువులు పోషించగా విద్యాభ్యాసం మీద కోరికతో కాశీపురం వెళ్ళి చాలా విద్యలు నేర్చుకున్నాను విశేషాలు చూడాలని దేశం తిరుగుతున్నాను నేనీవూరు వొస్తూంటే ఈ గుర్రం పరుగెత్తివొస్తూంది మృగం అనుకుని చెట్టెక్కాను ఇది ఆ చెట్టు కిందకే వచ్చి నిలబడింది ఉత్తమాశ్వమని గ్రహించి దీనిపైకి ఎక్కాను ఒక్కపరుగున ఇక్కడికి తీసుకొచ్చింది ఆ వేగానికి నేను వివశువు

నైపోయాను ఇదే నా వృత్తాంతం నిన్ను చూస్తే రాజపుత్రికలా కనిపిస్తున్నావు నీపేరేమిటి? ఏ మహారాజుగారి పుత్రికవి? ఈనగరం ఏది? చెప్పి నాకు ఆనందం కలిగించు అందామె

అప్పుడు రేవతి - ఈమె భోజుని కుమార్తె పేరు రుక్మిణి ఇది ధారానగరం ఇది ఈమె విహరించే ఉద్యానవనం అంది

చారుమతి ఆశ్చర్యపోతూ - ఓహో నేడు ఎంతసుదినం నేను ఎంతధన్యురాలిని నాకోరిక తీర్చడానికి సర్వేశ్వరుడి అనుమతితోనే ఈ గుర్రం నన్నిక్కడికి తీసుకొచ్చింది భోజమహారాజు కీర్తి కాశీదేశమంతా వ్యాపించింది అలాటి రాజుగారి కుమార్తెతో మైత్రి కలిగిన నాలాటి ధన్యురాలు మరెవరూ ఉండరు అని పొగుడుతున్న ఆమెను వారించి - చారుమతీ నీ మాటలవల్లనే నువ్వు అఖండ పండితురాలివని తెలుస్తోంది నీలాటిది దొరకడం నా అదృష్టం నువ్వు నా దగ్గర కొంతకాలం ఉండి నన్ను శిష్యురాలిగా స్వీకరించి నీకు వచ్చిన విద్యఅంతా నాకు నేర్పాలి నువ్వు నా అంత పురంలో వుండు నీ భాగ్యమే నా భాగ్యము నీ సౌఖ్యమే నా సౌఖ్యం అంది రుక్మిణి 'రాజపుత్రీ నీ యిష్టప్రకారమే చేస్తాను ఒక విషయం విను నేను గణిక నయినా వేశ్యావృత్తిని విడచివేశాను మీవాళ్ళెవరేనా నన్ను వేశ్యగా భావిస్తారేమో అందుకంగీకరించే దాన్ని కానుసుమా రుక్మిణి నవ్వుతూ - నా అంత పురానికి పురుషులు రారు నీకు సంశయ మక్కరలేదు అని ఆమె చేతిలో చెయ్యి వేసి బండి ఎక్కించుకుని తన పక్కన కూర్చోబెట్టుకుంది

అప్పుడు కొందరు పరిచారికలు వచ్చి - దేవీ నీ గుర్రమెక్కి ఎవడో పురుషుడు వచ్చాడనీ వాడిని ఇవతలకు పంపమనీ తాము అతనిని దండిస్తామనీ రాజభటులు ద్వారం దగ్గర గోలచేస్తున్నారు అన్నారు చాలుచాలు గుర్రమెక్కి వచ్చినది ఆడోమగో తెలియకుండా ఉన్నారు పొమ్మను అని ఆమె కసిరింది ఆ రాత్రి రుక్మిణి చారుమతితో ఇష్టాగోష్ఠి సలిపింది

మరునాడు చిత్రసేనుడు అనువాడు వచ్చి - సోదరీ నిన్న సాయంత్రం నీ గుర్రం పారిపోయిందనీ దానినెక్కి క్రొత్తవాడు

ఉద్యానవనానికి వచ్చాడనీ వానిని బండిలో ఎక్కించుకుని రాజభటుల్ని గద్దించి అంత పురానికి తీసుకువచ్చావనీ కావలివాళ్ళు చెప్పగా ఆ విషయం తెలుసుకురమ్మని మంత్రులు నన్ను నియమించారు అన్నాడు

రుక్మిణి భయం నటిస్తూ - అన్నా కాశీపుర నివాసిని చారుమతి అనే వేశ్యారత్నం మన వూరికి వస్తూ దారిలో ఎదురుపడిన నా గుర్రమెక్కగా అది ఆమెను నా ఉద్యానవనానికి తీసుకు వచ్చింది ఆమె చాలా విద్యావంతురాలు ఆమెనుంచి కొన్ని విద్యా సంప్రదాయాలు తెలుసుకుందామని నా అంత పురానికి తీసుకు వచ్చాను కావలివాళ్ళు మగవాడని బొంకుతున్నారు - అంటూ చారుమతిని పిలిచి- ఈమే నిన్న నా గుర్రమెక్కి వచ్చిన యువతి అని చూబించింది

ఆమె రాజకుమారుడికి నమస్కరించి అతనడిగిన వివరాలు చెప్పింది అప్పుడతను - కులవృత్తిని ఎవగించుకున్న నువ్వు పెళ్ళి చేసుకుంటావా? అని అడిగాడు

విధినిర్ణయానికి తలవొంచాలి కదా" అందామె రాజకుమారుడి కామెమీద మోహం కలిగింది వచ్చిన పని మరచి ఎవేవో మాట్లాడుతున్న అతన్ని - అన్నా ఇక నువ్విక్కడ ఉండకూడదు వేగంగా వెళ్ళు చారుమతీ లోపలికి పోదాం పద అని ఆమెను తీసుకుని రుక్మిణి లోపలికి వెళ్ళిపోయింది

చిత్రసేనుడికి ఎం చేయడానకీ తోచక అన్యమనస్కంగా ఇంటికి వెళ్ళిపోయాడు

లోపలికి వెళ్ళాక - చారుమతి రుక్మిణితో - మీ అన్న ఎలాటి ప్రశ్నలు వేశాడో ఎన్నివికారాలు ప్రదర్శించాడో చూశావుగా? అంది వాటిని లెక్కలోకి తీసుకోకు నీ వ్రతం అతనికి తెలియదు పైగా నీ రూపం అలాటిది - అంది రుక్మిణి

ఇవాళే మంచిది నావల్ల నువ్వు తెలుసుకోవలసిన విద్యలేమిటో చెప్పు ప్రారంభిద్దాం రుక్మిణి ఆలచనలో పడగా - రేవతి

ఉద్యానవనంలో చూస్తున్న పుస్తకంలోనివి చెప్పించుకో అని జ్ఞాపకం చేసింది ఆమె ఆ పుస్తకం తెప్పించి చారుమతికి చూపించింది చారుమతి దాని సారాంశం చెప్పసాగింది

పూర్వకాలంలో పరస్త్రీగమనం నిషేధంకాదు బ్రాహ్మణులు మద్యమాంసాలు తీసుకునేవారు గురుపుత్రికని పెళ్ళాడేవారు ఉద్దాలక మహర్షి కొడుకు శ్వేతకేతుడనే పండితుడు ఆ దురాచారాలన్నీ ఖండించి ఒక శాస్త్రాన్ని రచించాడు అప్పటినుంచీ ఆ దురాచారాలు నశించాయి ఆ గ్రంథంలోని విషయాలనే క్లుప్తం చేసి పాంచాలుడనే పండితుడు ఒక గ్రంథం రచించాడు దానిలో - పురుషుడు తన ఆయువుని బాల్యం యౌవనం కౌమారం వృద్ధాప్యం అనే నాలుగు భాగాలుగా చేసుకోవాలి పదహారేళ్ళవరకూ బాలుడు విద్యనభ్యసించాలి తరువాత యౌవనంలో కామమనుభవించాలి ముసలితనంలో ధర్మం అనుభవించాలి అని చెబుతూంటే రుక్మిణి అడ్డుపడి - యౌవ్వనంలో కామమేకాని ధర్మార్థాలను ఆర్జించకూడదా? అని అడిగింది చారుమతి నువ్వుతూ - జీవితం అస్థిరం అవడం వల్ల ధర్మార్థాలను ఎప్పుడేనా సంపాదించాలని గ్రంథకర్తే చెప్పాడు అంది

చారుమతీ ధర్మార్థాలకు శాస్త్రం అవసరం కాని కామానికి శాస్త్రమెందుకు? పశుపక్ష్యాదులకు కామం ఎవరు ఉపదేశిస్తున్నారు?

వాటికి రుతుకాలం లోనే సంయోగ వాంఛ కలుగుతుంది మనుషులకి అలాటి నియమం లేని స్వేచ్ఛ కనుక శాస్త్రం అవసరమైంది అని సమాధానం చెప్పి - 'రావణుడు మొదలైనవారు అధర్మ కామం వల్లనే చెడిపోయారు అంతేకాదు శరీరస్థితికి రోగాలలాగే కామం హేతువే అంది రుక్మిణి ప్రశ్నలకు సమాధానం చెబుతూ - చతుష్షష్టి 64 కళలగురించీ ద్యూతాశ్రయాలు 20 గురించీ 16 శయనోప చారికాలు 4 ఉత్తరకళలగురించీ 64 విద్యలగురించీ వివరించింది ఆమె చెప్పిన విషయాలకు చారుమతి ఎంతో సంతసించింది

# కాశీ మజిలీ కథలు

## 140 వ మజిలీ

### గోణికాపుత్రుడి కథ

దత్తకుడు మొదలయిన మిత్రులలో ఒకడయిన గోణికా పుత్రుడు నియమించుకున్న ప్రకారం కాశీనగరం నుంచి శుభముహూర్తంలో బయలుదేరి దక్షిణదిశగా వెళ్తూ తోవలో అనేక జనపదాలలోని విశేషాలను చూసుకుని పోతూ ఒకనాడు ఒక చెట్టుకింద నీడలో కూర్చుని అలసట తీర్చుకుంటూంటే -

ఆ దారిన పోతున్న ఒక బ్రహ్మచారి అతనికి నమస్కరించాడు గోణికాపుత్రుడు - నువ్వెవరివి? నీ వూరేది? ఎక్కడికి పోతున్నావ్? అని అడిగాడు

అందుకతను - అయ్యో నాదొక పల్లెటూరు నాపేరు గోమరు డంటారు బ్రాహ్మణుణ్ని దరిద్రుణ్ని ముష్టెత్తుకుందుకు ఈ ప్రాంతంలోని గ్రామాలకు పోతున్నాను అన్నాడు అతను నవ్వుతూ - విద్యాభ్యాసం ఏమైనా చేశావా? పెళ్ళయిందా? అని ప్రశ్నించాడు చిన్నతనంలోనే తల్లితండ్రులు గతించారు సంసారభారం మీద పడింది చదువుకుందుకు అవకాశం కలగలేదు ముష్టెత్తుకు బతుకుతున్న ఈ విద్యా శూన్యుడికి పిల్ల నెవరిస్తారు? శుద్ధ బ్రహ్మచారిని బాబూ అన్నా డతను అతిదీనంగా

అయ్యో విద్య నభ్యసించ వలసిన మంచికాలంలో నువ్వు బిచ్చమెత్తుకుని వృధా చేశావా ఒక పొట్టకోసం ఈ ముష్టి దేనికి ఇప్పటికేనా మించిపోయింది లేదు భిక్షం ఎత్తడంమాని చదువుకో అన్నా డతను

అందుకు గోమరుడు అయ్యా నావంటి వాళ్ళు కూడా చదువుకోడం మొదలుపెడితే ప్రపంచం నిలబడుతుందా? ఇప్పుడు నాకేం

చదువొస్తుంది? పెళ్ళికోసమే నాలుగు డబ్బులు పోగుచేశాను అందుకే ప్రయత్నం చేస్తున్నాను బాబూ మీ వేపు ఎవరేనా పెళ్ళికి పిల్లలున్నారా? అని ఆశగా అడిగాడు

పిల్లల కేం లోటు? కాని పెళ్లితో నీ కష్టాలు తీరిపోతాయా? అని అడిగాడు గోణికాపుత్రుడు సందేహం లేకుండా భార్యుంటే అడివయినా పట్నమే అమె లేకుంటే పట్నమయినా అడివే ఆలులేనివాడు అధముడు ఒళ్ళు పట్టాలన్నా కాళ్ళు పిసకాలన్నా వేణ్ణీళ్ళు పెట్టాలన్నా కంచం పెట్టాలన్నా మంచం వెయ్యాలన్నా భార్యఉంటేనే కద? మహాత్మా చక్కని భర్యతో కాపరం చెయ్యాలని నాకు చాలా ముచ్చటగా ఉంది నువ్వు మహావిద్వాంసుడిలా ఉన్నావు నీకు సేవచేస్తూ నీ వెంట వస్తాను నాకు పెళ్ళిచేస్తావా? అని ప్రాధేయపడ్డాడు గోమరుడు

అంతేకదా? నీకు మంచి కన్యకతో వివాహం చేయిస్తాను అన్నాడతను ఇక గోమరుడు ఇంటికిపోక అతనితోనే పోసాగాడు ఇద్దరూ కలసి ఒకనాడు విపుల అనే అగ్రహారం చేరారు

## జారకథ

అక్కడ సోమవర్మ అనే పండితుడున్నాడు అతనికి మడిమాన్యాలు చాలా ఉన్నాయి జ్యోతిషంలో అంతటి పండితుడు మరొకడు లేడని పేరు పొందాడు చిరకాలానికి అతని కొక ఆడపిల్ల పుట్టింది అమ్మాయి పుట్టిన వేళను బట్టి లగ్నంక ట్టి ఎమీ మాట్లాడకుండా ముఖం చిన్నబుచ్చుకున్నాడు నాథా మనమ్మాయి పుట్టిన వేళ మంచిదేనా? ఆయుర్భాగ్యా లెలా ఉన్నాయి? పంచాంగం చూసి వెలవెల బోతున్నారేం? అని అడిగింది భార్య

అప్పుడతను – నీ కూతురికి ఆయువు భాగ్యం బాగానే ఉంది కాని స్త్రీలకుండ కూడని దోషముంది అందువలన బంధువులలో తలవంపు లౌతుంది జారత్వంవల్ల ఆదేకాక కులం కూడా కళంకిత మౌతుంది అన్నాడు

ఆమె ఫకాలున నవ్వి - గొప్ప జ్యోతిషమే ఆ మాటకొస్తే - వీలు కుదరకకాని స్త్రీలలో జారిణి కానిదెవరు? మీరు శాస్త్రం చదువుకున్నారే కాని లోకజ్ఞానం బొత్తిగా లేనివారు ఇంకా ఏదో అనుకున్నాను బతికి బట్టకట్టాక చూసుకో వచ్చులెండి మీరు విచారించకండి - అని తనతల్లితండ్రులతో పరిహాసంగా చెప్పింది వాళ్ళు నవ్వుతూ ఆ పిల్లని జార జారని ముద్దుగా పిలవసాగారు దాంతో ఆ పిల్లకు ఆపేరే రూఢి అయిపోయింది పదేళ్ళప్రాయం వచ్చేసరికి ఆ పిల్ల ముగ్ధమనోహరంగా తయారైంది తల్లితండ్రులు ఆమెకు వివాహం చేయాలను కున్నారు

ఆమె కుల రూప విద్యా విశేషాల బట్టి ఎవరేనా అడగవచ్చి జార అని పేరు పెట్టడానికి కారణం ఏమిటని అడిగితే సోమవర్మ యదార్థం చెప్పేవాడు దానితో - వాళ్ళు కోడలు వ్యభిచరిస్తే కులం చెడిపోతుంది అని వెనక్కి వెళ్ళి పోయేవారు ఒక్కరూ ఆమెని కోడలుగా అంగీకరించలేదు అలా రెండేళ్ళు గడిచిపోయాయి ఆ కన్యగురించి దేశమంతా తెలిసిపోయింది ఎవ్వరూ ఆమెను వివాహం చేసుకోలేదు ఒకనాడు సోమశర్మ భార్య - 'వైదికోత్తమా మనకి భోగభాగ్యాలు చాలా ఉన్నాయి ఒక్కతే కూతురు అది విద్యారూపాలు కలిగింది అయినా దాని కింతవరకూ వివాహం చేయలేక పోయామంటే మనదే తప్పు దానిని జార అని చెప్పకపోతే యీ ముప్పు వొచ్చేదికాదు లోకంలో కన్యలందరూ పతివ్రత లేనా? ఓ తండ్రి అయినా కూతురి గురించి ఇలా చెప్పుకుంటాడా? మీరు అమాయకులై పోయారు పిల్లకి యౌవనం వస్తోంది కాని వరుడు దొరకలేదు రజస్వల అయితే కొంప నట్టేట కట్టుకున్నట్లే ఇకనయినా మీరు ఆగుట్టు చెప్పనని ఒట్టుపెట్టుకోండి మా వాళ్ళందరూ మిమ్మల్ని నిందిస్తున్నారు అంది

దోషం తెలుసుకుని చేసుకుంటే తరవాత దానిని నిందించరు కదా అని చెబుతున్నాను సరే బ్రహ్మసూత్రాలు తోడుగా ఇక ఎవ్వరికీ చెప్పను అని అతను శపథం చేశాడు కాని గ్రామస్తులు పైవా రెవరేనా వాళ్ళింటికి వెళ్ళక మునుపే ఆ వృత్తాంతం చెప్పేవారు

గోణికాపుత్రుడు గోమరుడు అగ్రహారం రావడంతోనే జార నడగడానికి వచ్చారని నిశ్చయించి - మీరు సోమవర్మ కూతురి నడగడానికి వచ్చారు కాబోలు ఆ పిల్ల మంచిది కాదు సుమండీ అంటూ గ్రామస్థులు ఆ వృత్తాంతమంతా చెప్పగా గోణికాపుత్రుడు నవ్వుతూ గోమరుడి వేపు చూశాడు.

విద్యా ధనం గొప్పతనం ఏమీలేని నాకు పిల్లని ఎవరిస్తారు? సోమవర్మ కూతురు జార అయినా విద్యా వైభవాలు కలది స్త్రీ సంపర్కంకోసం పరితపిస్తున్న నాకు ఆమె నిప్పించండి పెళ్ళాడతాను అన్నాడతను

పెళ్ళాడు సంతోషమే కాని రాబోయే అనర్థాలు తెలుసుకో భార్య జారిణి అయితే బంధువులు ఊరివాళ్ళు నవ్వుతారు అన్నదమ్ములతో సహా అందరూ చేతకాని వాడంటారు ఎరిగినవారు ఎత్తి పొడుస్తారు అలా పెళ్ళాడి బాధలు పడడం కంటె బ్రహ్మచారిగా ఉండిపోడమే ఉత్తమం ఇవన్నీ సహించి కాపరం చేసినా జారిణి అయిన భార్య మగడితో మనసిచ్చి మట్లాడదు చెప్పిన పని చెయ్యదు మృదువుగా మాట్లాడదు భర్త ఎడ్డెం అంటే తాను తెడ్డెం అంటుంది అలాటికాపరం చెయ్యడం కంటె ఏటిలోపడి చావడం మేలనిపిస్తుంది? అని హెచ్చరించగా గోమరడు - మహాత్మా మగవాడు సమర్థుడై వ్యవహరిస్తూంటే ఆడది ఎలా వ్యభిచరించగలదు? నేనామెను వెయ్యి కళ్ళతో కనిపెట్టుకుని ఉంటాను అన్నారు

సరే ఇప్పు డెందుకు ముందు ఆలోచించుకోవచ్చు అంటూ సోమవర్మ గారింటికి వెళ్ళారు ఆ యిల్లాలు వాళ్ళని చూసి బ్రహ్మచారులనీ పిల్లనడగడానికి వచ్చారనీ తెలుసుకుని జార నలంకరించమని పరిచారకులను నియోగించి వారిద్దరికీ కాళ్ళు కడుక్కుందుకు తానే స్వయంగా నీళ్ళందించింది వాళ్ళచేత వేడినీటిస్నానం చేయించింది అంతలో సోమశర్మఇంటికి వచ్చాడు ఆమె అతనికి వారి వారి గురించి అతనికి చెప్పింది

సోమవర్మ వారిని స్తుతించి తృప్తిగా భోజనం పెట్టాడు అప్పుడు గోణికాపుత్రుడు – "ఆర్యా మీకు పిల్లలెందరు? అని అడిగాడు సోమవర్మ

తనకుమార్తెను పిలవగా చక్కగా అలంకరించుకున్న జార వారివద్దకు వచ్చింది ఆమెను చూసి గోమరుడు మోహావేశం చెంది - ఎంత సౌందర్యవతి ఇది జారిణి అయితే అగుగాక ఒక్కరాత్రి దీనితో సుఖిస్తే చాలదా నాకంత యోగం పడుతుందా? అనుకున్నాడు

సోమవర్మ కూతురిని వొడిలో కూర్చోబెట్టుకుని - అయ్యా ఇది ఒక్కతే నాకు తూతురు లేక లేక కలిగింది అన్నాడు

బాలా నీపేరేమిటి? చదువుకున్నావా? అని గోణికా పుత్రుడు అడిగినా సిగ్గుతో ఆమె జవాబు చెప్పలేదు అప్పు డతను - జాతకం ఉందా? అని అడిగాడు భార్య వద్దువద్దని సైగ చేస్తున్నా వినిపించుకోకుండా ఉంది అంటూ సోమవర్మ లోపలికి వెళ్ళి తీస్తూంటే - ఆమె అతన్ని నిందించి - మీ మూలంగా నా బిడ్డకి పెళ్ళవదు జాతకం లేదని చెప్పరాదా? అప్పుడే యీవూళ్ళో ఎవరో వాళ్ళకి జారవిషయం చెప్పేసి ఉంటారు లేకపోతే ముందే ఎందుకు జాతకం అడుగుతారు? ఈ సంబంధం దాటిపోతే ఇక పెళ్ళికాదు జాతకంలేదని చెప్పండి పొండి అని కసిరింది

సోమవర్మ వారితో - జాతకం ఇప్పుడు కనిపించడం లేదు తరవాత ఆ విషయాలు విన్నవిస్తాను మీరు ఉత్తమ కులజులని మీ రూపు రేఖలే చెబుతున్నాయి మీతో సంబంధం చెయ్యాలని ఉంది మీ అభిప్రాయం ఎమిటి? అన్నాడు అంతలో సోమవర్మ భార్య చాటుగా నిలబడి -

అయ్యా ఈ వూరి వారు మాకు విరోధులు వారి మాటలు నమ్మకండి మా పిల్ల చాలా గుణవంతురాలు రూపం చూడనే చూశారు పదివేల విలువ కల నగలున్నాయి కొన్ని ఇబ్బందులవల్ల పెళ్ళి ఆలస్యమైంది మొన్ననే పదేళ్ళు వెళ్ళాయి ఎపుగా ఎదగడం వల్ల అలా కనపడుతూంది మీకు దీనినివ్వాలనుంది పెళ్ళిచేసుకుని సుఖపడండి అంది

గోణికాపుత్రుడు నవ్వుతూ - అమ్మా నేనిప్పుడు వివాహం ఆడను ఇతను నా శిష్యుడు వీనికోసమే మీ పిల్లనడగడానికి వచ్చాను

ఈ వూరివారు మాకేవో చెప్పారు కాని మేమవి పరిగణించం. ఇతనికి మీ పిల్లనివ్వండి. ఇతను అంగీకరిస్తున్నాడు. మీ ఇంట ఇల్లరికం ఉండగలడు" అన్నాడు. "బాబూ! ఎవరేనా మంచిదే. మా యింట ఉండమనే మేమూ కోరేది. మా కోరిక తీర్చారు. లగ్నానికి వ్యవధిలేదు. రేపే మంచి ముహూర్తం. బంధువు లందరూ తరవాత వొస్తారు. రేపేపెళ్ళి చెయ్యాడానికి మీరంగీకరించాలి. రెండువేపులా మీరేపెద్దలు" అంది. అతను సంతోషంగా ఒప్పుకున్నాడు.

సోమవర్మ ఊరిలో వారిని కాని, బంధువులని కాని ఎవరినీ పిలవకుండా మర్నాడే గుడిలో జారను గోమతుడికిచ్చి వివాహం జరిపించేశాడు. అప్పటికి వారి ప్రాణాలు కుదుటపడ్డాయి. గోమతుడు కూడా చాలా ఆనందిచాడు. పెళ్ళయిన నాలుగురోజులకి సోమశర్మ గోణికాపుత్రుడితో కూతురి వృత్తాంతం చెప్పగా అతను నవ్వుతూ – "అయ్యా! మీరు వైదికోత్తములు. లోకవ్యవహారాలు అంతగా తెలియనివారు. మీ రహస్యాలన్నీ వినే మేము చేసుకున్నాం. పోన్లెండి. మీ అల్లుడు గట్టివాడు. భార్యని కాపాడుకోగలవాడు." అన్నాడు.

సోమవర్మ తన భయం, విచారం ఆ మాటలతో పోగా అతనిని గట్టిగా కౌగలించుకుని స్తోత్రం చేశాడు.

గోణికాపుత్రుడు కొన్నిరోజులు అక్కడుండి గోమతుడికి భార్యని కాపాడుకునే విధానం బోధించి ధారానగరంవేపు వెళ్ళిపోయాడు.

తనభార్య – వీధిని పోయేవాళ్ళ వేపుచూడడం, వాళ్ళ పాటలు ఆలకించడం, అందంగా ఉండే పొరుగింటి మగాణ్ని తొంగిచూడడం, ఆయవారం బ్రాహ్మలని ఊరివిశేషా లడగడం, తండ్రితో మాట్లాడడానికి వొచ్చే యువకులముందు వయ్యారాలు పోవడం మొదలయిన చేష్టలు గమనించి, మమగారికి చెప్పి ఒక మహారణ్యమధ్యంలో గొప్ప మేడ కట్టించి, దాని చుట్టూ ఎత్తయిన ప్రాకారం నిర్మించి దానిలో భార్యనుంచాడు. పంజరంలో చిలకలా ఆమెని కదలనివ్వక ఆమెకు తానే విద్యాబుద్ధులు నేర్పుతూంటే – ఆమెకి యౌవనం పొడచూపింది. అప్పుడు కేళీ మందిరంలో ఆమె ఎలా ప్రవర్తించాలో – "ముఖానికి మసిపూసుకుని...

చింపరిగుడ్డ మొలకి చుట్టకుని తలవిరగబోసుకుని మండుతున్న నిప్పుల కుంపటిని నెత్తిమీద పెట్టుకుని, ఒక చేతితో బెత్తం మరో చేత్తో వేపకొమ్మా పట్టుకుని వికటాట్టహాసం చేస్తూ..'కరుస్తాను, మింగుతాను, ఆగు, కదలకు..' అంటూ అరుస్తూ శయ్యదగ్గరకి పోయి 'మూఢా! ఇక్కడ పడుకుని ఉండు. మళ్ళీ వొచ్చి నీ పని పడతాను' అని పెరట్లోకి పోయి ఆ వేషమంతా తీసేసి స్నానంచేసి కొత్తబట్టలూ, అలంకారాలూ ధరించి నన్ను కలుసుకోవాలి" అని చెప్పాడు. అలాగే చేయిస్తూ ఆమెతో క్రీడించ సాగాడు. లోకజ్ఞానం లేనిదవడంవల్ల ఆమె అదే ఆచారం అనుకుని ఆవిధానాన్ని అక్షరాలా పాటించసాగింది. అలా కొన్నాళ్ళు గడిచాయి.

# రత్నవర్తకుల కథ

ఒకనాడు గోమరుడు ఇంటికి అవసరమైన సామానులు తేవడం కోసం దగ్గరలోని గ్రామానికి వెళ్తూ భార్యతో – "నేను ఊరినుంచి రాత్రికి వస్తాను. తప్పితే రేపు పొద్దుట వస్తాను. తలుపు వేసుకుని భద్రంగా ఉండు" అని చెప్పి వెళ్ళాడు. అతను వెళ్ళడం తోటే జన్మలగ్న ప్రభావం వల్ల ఆమెలో పురుషసంగమం పట్ల అభిలాష కలిగింది. ఆమె అలంకరించు కుని.."ఈ రాత్రి లోపల ఎవడేనా పురుషుడు ఇక్కడికి రాకూడదా? నాకీ నిర్బంధ మేమిటి? మావూళ్ళో ఉంటే చక్కగా, స్వేచ్ఛగా ఉండేదాన్ని కదా. మేడెక్కి చూస్తూంటాను. సాయంకాలం లోపల ఎవరేనా ఈ దారిని పోకపోతారా?" అనుకుని మేడమీదకు వెళ్ళింది. కొంతసేపటికి ఆ దారిన ధనవంతులయిన నలుగురు రత్నవర్తకులు కనిపించారు. వాళ్ళు అవతలి ఊరి సంతకు వెళ్తూ దారితప్పినవారు. ఆ యిల్లు చూసి ఆశ్చర్యపడుతూ ఆగిపోయారు.

వారినిచూసి ఆమె – 'ఆహా' ఇవాళ నా అదృష్టం ఫలించింది. వీరు నలుగురితోనూ నేటిరాత్రి నాలుగు జాములు క్రీడించి నా మదన తాపం తీర్చుకుంటాను. ఇక నాపతి రాత్రి కెలాగూ రాడు! అనుకుని "ఓ బాటసారులారా! చీకటి పడుతూంది. దగ్గరలో గ్రామం లేదు. రాత్రి ఇక్కడుండి రేపు పొద్దున్నే పోదురుగాని, రండి" అని తియ్యని కంఠంతో

పిలిచింది. వారు ఆమే మాటలు విని - " ఎవరో ఇల్లాలు మనల్ని రమ్మంటూంది. భోజనం సదుపాయం కలుగజెయ్యక మానదు. ఈ రాత్రి ఇక్కడ పడుకుని పొద్దున్నే పోదాం" అనుకున్నారు. కాని వారిలో ఒకడు - "అడవిలో ఒంటరిగా ఉన్న యీ యింటికీ, ఆ యింటి వద్దకీ బాగా ఆలోచించకుండా పోకూడదు. అది భూతమో, దెయ్యామో, బ్రహ్మారాక్షసో" అన్నాడు.

మరొకడు వెంటనే - "ఆ చిన్నదాని మొహం చూశావా? భూతాలూ బ్రహ్మారాక్షసులూ అంత అందంగా ఉంటాయా? గొప్పవాళ్ళు జన సంపర్కం సహింపక ఏకాంత స్థలాల్లో ఇళ్ళు కట్టుకుని నివసిస్తూ ఉంటారు. ఉపకారానికి పిలుస్తూంటే ఊరికే శంకించడం దేనికి? పదండి, పోదాం" అన్నాడు.

ఒకడు- "సుందరీ! మేం వస్తున్నాం. తలుపులు తీయించు." అని కేకవేశాడు. ఆమె వేగంగా వచ్చి తలుపులు తెరిచింది. నలుగురు పడుచువాళ్ళనీ చూసి సంతోషంగా తలపంకించి వాళ్ళని ఒక గదిలో ఉంచింది. భోజనం తయారు చేసి పెట్టింది. వాళ్ళు భోంచేశాక - "మీ రెవరు? ఎక్కడికి పోతున్నారు? ఈపడుచు వయసులో భార్యని వదలి పెట్టి తిరగడం ధర్మమా? మీ విరహానికి వాళ్ళెంత బాధపడు తున్నారో! నా భర్త రేపు పొద్దుటకి కానిరాడు. ఒంటరిపడక నాకు అలవాటు లేదు. ఒక్కనాటికే నాకెంత బాధగా ఉందో! మీలో ఒక ధైర్యశాలి నా పడకటింట్లో సాయంగా పడుకోగలడా?" అని అడిగింది.

ఆ వర్తకులలో మన్మథభావాలు కలగసాగాయి. "ఓ యువతీ! నువ్వెవరివి? నీభర్త ఎక్కడికిపోయాడు? నువ్విక్కడ ఒంటరిగా ఎందుకున్నావు? నీ వృత్తాంతం చెబితే ఒక్కడు కాదు. నలుగురం నీ పక్కన పడుకుంటాం" అన్నారు వాళ్ళు. "ఇది నా పూర్వపుణ్యం. నలుగురిని చూసే భాగ్యం నాకులేదు. ఇక్కడికొచ్చాక పరపురుషుల ముఖమే కనపడలేదు. నా పుణ్యం వల్ల ఈ రోజు మీరు తటస్థ పడ్డారు. నా వృత్తాంతం చాలా ఉంది. తరవాత చెబుతాను. మీరు నిద్రమానుకుని నలుగురూ ఒక్కసారి రావద్దు. జాము కొకరు రండి. అలా అయితే ఎవరికీ కష్టం ఉండదు. అందరికీ సుఖంగా ఉంటుంది" అంది జార.

వాళ్ళలో యువకుడు తటాలున లేచి – "నేను ముందువొస్తాను. పడక గది చూబించు" అన్నాడు చొరవగా. ఆమె అతన్ని తీసుకుపోయి మంచంమీద కూర్చోబెట్టి – "ఇప్పుడేవొస్తా" నని అవతలికి వెళ్ళింది. అతను అలాటి సుందరిపొత్తు లభిస్తున్నందుకు తెగ సంతోషపడి పోతున్నాడు. సాహసించి వచ్చినందుకు తొలికలయిక లభిస్తోంది – అనుకుంటూ ఆమెకోసం వళ్ళంతా కళ్ళుచేసుకుని ఎదురు చూడసాగాడు.

అవతలిగదిలో ఉన్న ముగ్గురూ – "అయ్యో! వాడికున్న సాహసం మనకి లేకపోయింది. నలుగురిలోనూ ఎవరో ఒకరిని రమ్మంది కాని పేరుపెట్టి "పిలవలేదుకదా. మనకి బుద్ధీ, చొరవా రెండూ లేక పోయాయి. ఆమె జాము కొకరు అంది కాని వాడంతటితో వదలడు. మనపని వొట్టిదే. వాడెప్పుడు వొస్తాడో?" అంటూ నిద్రపోకుండా గడియలు లెక్కపెడుతూ అతని కోసం ఎదురు చూస్తుకూర్చున్నారు.

జార పెరట్లోకి పోయి వాడుక ప్రకారం మసిపూసుకుంది. చింపిరి గుడ్డలు కట్టుకుని నెత్తిమీద నిప్పుల కుంపటి పెట్టుకుని బెత్తం, వేపరెమ్మా పట్టుకుని – "కరుస్తాను. మింగుతాను. పొడుస్తాను," అంటూ అతనున్న గదిలోకి వచ్చే సరికి –

అమ్మో! ఇది బ్రహ్మరాక్షసి. ఎరక్క మోసపోయాను. లేకపోతే ఒంటరిగా ఈ అడవిలో ఇంత చక్కంది నివసిస్తోందా? వాడు వొద్దని చెబుతూనే ఉన్నా విన్నాను కాదు. వాళ్ళు ఈ పాటికి దీనిసంగతి చూసి పారిపోయేవుంటారు. నేనే దొరికిపోయాను. నాకే చావుమూడింది. విధీ! ఈ బ్రహ్మరాక్షసి నామీద పడి చంపుతుంది కాబోలు. చొరవ ఎప్పుడూ కూడదు. మూటలో లక్ష వెలగల రత్నాలున్నాయి. అవన్నీవాళ్ళు తీసుకుపోతారు కాబోలు. నాభార్య కిస్తారో, ఇవ్వరో? అది వద్దంటున్నా ప్రయాణం పెట్టుకున్నది చావడానికే కాబోలు. ఈ రాక్షసి వాళ్ళని కూడా చంపక వదులుతుందా! ఏమో ముందు నేను చిక్కాను' అనుకుంటూ భయంతో సగంచచ్చి – దానివేపు చూడకుండా కూర్చున్నాడు. జార మూడుసార్లు మంచం చుట్టూ తిరిగి – "నీపని పడతానుండు." అంటూ పెరట్లోకి పోయింది. అదే అదనని ఆ వర్తకుడు మంచందిగి –

మిగిలిన వారున్న గదిలోకి పారిపోయాడు. అతని కోసమే ఎదురు చూసున్న వాళ్ళు - "నేను ముందుపోతాను" అంటూ లేచారు. అతను వారిని వారిస్తూ - "అది ఆడది కాదు బ్రహ్మరాక్షసి. ఇక్కడుంటే మనందర్నీ చంపేస్తుంది" అని అనేసరికి ఎవరికి వారే తమతమమూటలు పట్టుకుని తలుపులు తెరచి పారిపోసాగారు.

ఆ సందడివిన్న జార ఆ వేషంలోనే వారి వెంటపడి - "పారిపోతారేం? రండి రండి మీమీద ఎంతో ఆశపెట్టుకున్నాను. నా కోరిక తీర్చకుండా పోవొచ్చునా? అసలేమయింది? అంటూకేకలు పెట్టింది. వాళ్ళు వెనక్కి చూసి, దానివేషం భయంకరంగా ఉండడంతో - ఆ రాక్షసి తమను వెంట తరుముతున్నది చంపడానికే అని శక్తికొద్దీ వేగంగా పారిపోసాగారు. జార నిరాశచెంది వెనక్కిపోయి దుఃఖిస్తూ మంచంమీద పడుకుంది. వర్తకులు తెల్లవారే వరకూ పరుగెత్తి సూర్యోదయాని కొక పల్లె చేరి - బతికామనుకుంటూ ... అంతలో మూటలు జ్ఞాపకం వొచ్చి - 'దరిద్రుల మయ్యాం. ఇళ్ళకి పోయి ఏం చేస్తాం? భార్యాపుత్రుల నెలా పోషించుకుంటాం?' అని చెరువు గట్టున కూర్చుని దుఃఖించసాగారు. అప్పటికి సూర్యోదయం ఔతుంది.

గోమఠుడు గృహసామగ్రితో ఇంటికి పోతూ...కట్టుగుడ్డలతో కూర్చుని విచారిస్తున్న వర్తకులని చూసి అనుమానించి వారికి దగ్గరగా పోయి - "మీరెవరు? ఎందుకు చింతిస్తున్నారు?" అంటూ అడిగాడు.

వాళ్ళలో ఒకడు జరిగిన కథంతా చెప్పి - "రత్నాలపేటికలు పోయాయి. అంటూ ఏడవసాగాడు. అప్పుడు గోమఠుడు గోణికాపుత్రుడు చెప్పిన ఉపాయం సఫలమయిందని సంతోషిస్తూ - "వర్తకులారా! మీ ప్రాణాలు దక్కాయని సంతోషించక మూటలు పోయాయని విచారిస్తారేం? మీ భార్యల మెడతాళ్ళు గట్టివి. అందుచేతనే బతికి బయట పడ్డారు. అది బ్రహ్మరాక్షసి. పగలు అందంగా కనపడుతూ శృంగారచేష్టలతో లోపలికి పిలిచి రాత్రి కాగానే వారిని చంపేస్తూ ఉంటుంది. దాని బారినుంచి మీరు ఎలా తప్పించుకొచ్చారో ఆశ్చర్యమే. రత్నాలకు ఆశపడి అటువెళ్ళారు సుమా. అది అక్కడే ఉండి మీమీద పడి చంపుతుంది" అన్నాడు వారిని మరింత భయపెడుతూ.

అది విని వారు - "బాబూ మీ పుణ్యమా అని మంచి మాట విన్నాం. మావాడొకడు సొమ్ముకి ఆశపడి అక్కడికి పదిమందిని వెంట బెట్టుకుని పోదాం అంటున్నాడు. బతికుంటే సొమ్ము ఎలాగేనా సంపాదించుకోవచ్చు" అని అతనికి నమస్కరించి మరోతోవన వాళ్ళ దేశంపోయారు.

గోమరుడు వేగంగా ఇంటికి పోయి భార్యని పిలిచాడు. ఆమె తలుపు తీసింది. అతనామె మొహం చూసి - "కళ్ళెర్రగా ఉన్నాయేం? రాత్రి నిద్రపట్టలేదా?" అని అడిగాడు.

"మనోహరా! మీ వియోగం వల్ల నేను రాత్రి పడిన పాట్లు ఏమని చెప్పమంటారు? భయమో, విరహతాపమోకాని కళ్ళు మూతలు పడ్డాయికాదు" అంటూ ఏవేవో మాయమాటలు చెప్పసాగింది.

"ఔను. నేనూ అదే అనుకుంటున్నాను. ఇంకెప్పుడూ నిన్ను వదిలిపోను. వెళ్ళినా రాత్రికి వొచ్చేస్తాను" అన్నాడతను. ఆమె వంట చేస్తుంటే ఇల్లంతా వెదికి వర్తకులు మూటలు దాచిని చోటు తెలుసుకున్నాడు. రాత్రి - భోజనం తరవాత మామూలు కార్యక్రమాలన్నీ అయి ఆమె చక్కగా తయారయి వచ్చాక అతను ఆమె గుండెలమీద తలపెట్టి - "ఊ...తరవాత? వర్తకులు నలుగురా? సాయంకాలం ఈ దారిన పోతున్నారా? మేడగోడ ఎక్కి వారిని రమ్మని పిలిచిందా? వాళ్ళు వచ్చి ...చావడిగదిలో కూర్చున్నారా! తృప్తిగా భోజనం పెట్టిందా... తరవాత? ఒకడిని ముందుగా పడకగదిలోకి తీసుకుపోయి మంచం మీద కూర్చోబెట్టిందా..మొదట వికార వేషం వేసుకొచ్చి. ... స్నానం చేయదానికి పెరట్లోకి పోయిందా. ఆమె వొచ్చేసరికి వాళ్ళు మూటలు వదలి పారిపోతున్నారా! ఆమె వారి వెనక కొంతదూరం పోయి రమ్మని పిలిచినా రాలేదా. పాపం - తరవాత వాళ్ళకోసం విచారిస్తూ రాత్రంతా నిద్రపోలేదా. మరి, వాళ్ళ మూటలు ఏమి చేసింది? చిన్నగది అటకమీద దాచిందా. సరే." అంటూ ఆమె హృదయం తనకి అంతా చెప్తుంటే విన్నట్లు నటించాడు. ఆ జార అదిచూస్తూ వెలవెల బోయింది. "రండా!

నేను లేనప్పుడు నువ్వుచేసిన వెధవ పనులన్నీ నీ హృదయం నాకు చెప్పింది. విన్నావు కదా! నిజం చెప్పు అని గోమరుడు గద్దించేసరికి - ఆమె. "రామరామ! నేనేమీ ఎరగను-" అని బొంకింది.

అప్పు డతను - "నిజం చెబుతావా, లేదా?" అని పలుపుతో ఆమె వీపుమీద బాదేసరికి - "రక్షించండి, రక్షించండి" అంటూ ఏడ్చి యదార్థం చెప్పేసింది. ఇంకెప్పుడూ చేయనంటూ పాదాలమీద పడింది. అది మొదలు తప్పుగా మన్నించి అతనామెతో మునపటిలాగే క్రీడించ సాగాడు.

నాలుగు రోజులు పోయాక అతను ఊరు వెళ్తున్నాని ఆమె చెప్పి - ఇంట్లోనే దాక్కున్నాడు.

అమె పెందరాళే భోజనం చేసి - పడకగదిలో మంచంమీద కూర్చుని రవిక విప్పి గుండెలమీద గుద్దుకుంటూ - 'పాడు హృదయమా! నా రహస్యాలన్నీ చెప్పేస్తావా! నీకు నాకంటె ఆయనే దగ్గర చుట్టమా? ఇంకోసారి చెప్పావంటే నిన్ను చీల్చేస్తాను. నా సంగతి తెలియదు నీకు" - అంటూ పదిగుద్దులు గుద్దింది. అవి తనకే నొప్పెట్టింది. ఇక హృదయానికి బుద్ధొస్తుందని రవిక తొడుక్కుని ఇంటిపనులలో చొరబడింది. గోమరుడు ఊరినుండి వచ్చినట్లు సాయంకాలం యింటికి వచ్చాడు. భార్య పెందరాళే వంటచేసి పెట్టింది. ఆ సమయం చూసుకుని - అతనామె గుండలమీద తలపెట్టి - "ఏడుస్తావేం? ఊరుకో, ఏమిటీ? నిన్ను గట్టిగా గుద్దిందా? తన రహస్యం నాతో చెప్పినందుకా? ఏమందీ? నాకంటే నీకు ఆయన దగ్గర చుట్టమా? అందా. చీల్చి పారేస్తానందా! నేను మందలిస్తాలే. ఊరుకో. ఇంక నీకు భయంలేదు" అంటూంటే -

'ఇక దీని ముందర నా రహస్యాలు నిలవవు. నేను ఏంచేసినా ఇది చెప్పడం మానదు' అని నిశ్చయించుకుని తనని దండించ బోతున్న భర్తపాదాల మీద పడి "ఇంకెప్పుడూ చెయ్యను - చేస్తే నా హృదయమే చెప్పేస్తుంది కదా. ఈసారి పరీక్షించి చూడండి. మీరేంశిక్ష విధించినా భరిస్తాను" అంటూ ప్రమాణం చేసింది.

అతను తలపంకిస్తూ "నీ బొంకులు నా దగ్గర పనికిరావు. ఇకపై ఏపాటి తప్పుచేశావని నీ హృదయం చెప్పినా గట్టిగా శిక్షిస్తాను" అని మందలించాడు గోమరుడు.

అది మొదలు జార తనహృదయానికి జడిసి అణకువగా మసలసాగింది. భార్యకు బుద్ధి కుదిరిందని నమ్మకం కలిగిన కొన్నాళ్ళకు అతనామెను పుట్టింటికి తీసుకు వెళ్ళాడు.

సోమవర్మ, భార్య వారిని చాలా ఆదరించారు. తల్లి, స్నేహితులు ఆమెను – "నీ భర్త నిన్ను ఇష్టంగా చూసుకుంటున్నాడా? కాపరం అనుకూలంగా ఉందా? విశేషాలేమిటి?" అని అడగ్గా – "ఇది ఉంది. మాటాడకండి. వారితో చెప్పగలదు" అని గుండెని చూబిస్తూ సంజ్ఞ చేసింది. వాళ్ళకేమీ అర్థం కాలేదు. తల్లి ఒంటరిగా తర్కించి తర్కించి అడగడంతో – "నేనేం చేసినా నా హృదయం ఆయనకి చెప్పేస్తుంది. నన్నేమీ అడక్కండి. నాకాపరం బాగా ఉంది" అని చెప్పింది జార.

ఆవిడ ఆ మాటలు భర్తకు చెప్పగా – అల్లుడు చేసిన నియమంతో కూతురు బుద్ధిగా ప్రవర్తిస్తూందని గ్రహించి అతన్ని మెచ్చుకుని వాళ్ళని తమయింట్లో ఉంచుకుని కాపాడసాగాడు.

జార – భర్తబోధించిన ప్రకారం కులటలతో, యోగినులతో, భిక్షుకులతో, నటులతో, విటులతో, మూలికాయోధులతో మాట్లాడేదికాదు. కొన్నాళ్ళక్కడ ఉన్నాక భార్య గుణం పూర్తిగా చక్కబడిందని నిశ్చయించి – తనకి ఉపకారం చేసిన గోణికాపుత్రుణ్ణి చూడడానికని ధారానగరానికి ప్రయాణ మయ్యాడు.

# కాశీ మజిలీ కథలు

## 141 వ. మజిలీ

### రతినూపుర కథ

మగధదేశానికి రాజధాని అయిన పాటలీపుత్ర నగరం ప్రపంచమంతా ఖ్యాతి చెందింది. దత్తుడి కది జన్మభూమి. ఆ పట్నంలో రతినూపుర అనేవేశ్య కాపురముండేది. విద్యలలోనూ, రూపంలోనూ, వైభవంలోనూ ఆవేశ్య కొన్నాళ్ళు ఒకరితో ... మరికొన్నాళ్ళు అనేకమందితో ... కొన్నాళ్ళు ఒంటరిగా ఉంటూ చాలాధనం ఆర్జించింది. ఆమె వద్దకు వస్తే కుబేరుడిలాటి విటుడయినా సరే జోగి అవవలసిందే! భూములు, మేడలు చాలా సంపాదించినా ఆమెకు సంతానం కలగలేదు. అందుచేత సంతానాభిలాషతో వ్రతాలు, దానాలు, ధర్మాలు చేస్తూవుండేది.

ఆమె నడివయసులో ఏ విప్రుడి ప్రభావం వల్లనో ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. వేశ్యకి ఆడపిల్లలు పుట్టడం అంటే అత్యంత అదృష్టమే మరిం వాళ్ళకి చిత్రసేన, రతిమంజరి అనే పేర్లు పెట్టింది. వయసురాగానే వాళ్ళకి సంగీత సాహిత్యాలు నేర్పించింది. వీణాగానంలో వాళ్ళని మించిన వారు లేరని వాడుక వచ్చింది. బంగారానికి పరిమళం అబ్బినట్లు వారికి చక్కదనం కూడా తోడయింది.

వారి సౌందర్యాన్ని చూడాలనీ, సంగీతాన్ని వినాలనీ, విద్యలను తెలుసుకోవాలనీ ఎందరో విటశిఖామణులు ప్రయత్నిస్తున్నా ఎవరికీ అవకాశమివ్వక అంతఃపురస్త్రీలలాగే మెలగసాగారు.

వారినిద్దరినీ వేశ్యావృత్తిలో ప్రవేశపెట్టదలచి రతినూపుర ఒకనాడు వారికి వేశ్యాధర్మాలు బోధించింది. "బిడ్డలారా! మీరు మనోహర రూపంతోనూ విద్యలతోనూ అసామాన్యంగా ఉన్నారు. మీ నిమిత్తం

ఎందరో ధనవంతులు మన ఇంటిచుట్టూ తిరుగుతున్నారు. మీరేమో వేశ్యల నాక్షేపిస్తూ విటుల మొహం చూడక కులస్త్రీలవలె ఒదిగిపోయి ఉంటున్నారు. మన నిమిత్తం విద్వాంసులచేత రాయబడిన వైశిక ప్రకరణం ఒకటి మీకు వినిపిస్తాను. కాములకు శరీరమిచ్చి డబ్బు సంపాదించడం వేశ్యల కులధర్మం. కులస్త్రీలు రాగాసక్తులు కాగా వేశ్యలు ధనాసక్తలు. గణిక, రూపాజీవ, కుంభదాసి అని వేశ్యలు మూడు రకాలు. పుణ్యకార్యాలు చేస్తూ ఒకరినే పతిగా గ్రహించి ధనం సంపాదించేది గణిక. సౌందర్యం సామాన్యమైనా వస్తుప్రగల్భం కలది రూపజీవ. రాచస్త్రీల వద్ద సంచరించే దాదులు కుంభదాసీలు. నట, శిల్పకారుల భార్యలు భర్తమరణానంతరం వేశ్యావృత్తి, వహిస్తారు. వారిని శిల్పికారక లంటారు. వీరందరిలోనూ గుణికయే ఉత్తమురాలు.

ఆత్మస్తుతి చేసుకునేవాడిని, త్యాగశీలుణ్ని, స్వతంత్రుడిని, ధనికుడిని పతిగా పరిగ్రహించాలి. కామపరులయిన పురుషులు వేశ్యలకపటాలను నమ్ముతారు. నాయకుణ్ని తొందరపడి అంగీకరించ కూడదు. అతని గుణాలు పరిశీలించాలి. అతనిని రంజింజెయ్యడానికి అనేక ఉపాయాలున్నాయి." అంటూ అవన్నీ చెప్పిన తల్లిని చూసి – వాళ్ళిద్దరూ "అమ్మా! నీ ఉపన్యాసం ఇక నిలుపు. వేశ్యావృత్తి ఎంత నీచమయింది! ఎంత నిందించ దగింది! నువ్వీ ధనమంతా అలాగే సంపాదించావు కాబోలు. అయ్యో! మేం ఇలాటి కులంలో పుట్టామేమి? దుర్మార్గుడు కురూపి జాతిశూన్యుడు. క్షయరోగి గుడ్డివాడు ఎవడేనా సరే విత్తమిస్తేచాలు, అతనికి దేహం అర్పించాలా! ఇంతకంటె నీచమింకేమైనా ఉందా? అమ్మా! మేడలు, ధనం ఎంత సంపాదించినా, కోటికి పడగెత్తినా వేశ్య బతుకు అసహ్యమే. కాపరాలు కూల్చి, అబద్ధాలాడి, ధర్మాలు వదలి, కపటంతో విటులను జోగులని చేసే గణికలు యమభటులకంటె భయంకరులు. దేహం అశాశ్వతం. ఇహపరాలు ఆలోచించి చూస్తే స్త్రీకి భర్త అవసరం. ఒకమంచి వాడిని వివాహం చేసుకుని హాయిగా ఉంటాం" అన్నారు వారు.

రతినూపుర తనకోపాన్ని దాచుకుని చిరునవ్వు నవ్వుతూ – "బిడ్డలారా! పెళ్ళాడే తలంపు మీకెందుకు కలిగింది? ఇది ఎవరి ఉపదేశం? అత్తమామలకు జబాబు చెబితే తప్పు, చెప్పకపోతే తప్పు. వీధిలో నిలుచుంటే తప్పు. ఏం చేసినాతప్పే. ఇవన్నీ ఎలాగో భరించినా భర్త కోపదారి అయితే ఆమె పడేపాట్లు దేముడికే తెలియాలి. మగనాలి తనం శత్రువులకేనా వొద్దు" అంది. కాని వారు తమమాటని వదలలేదు. అప్పుడు రతినూపుర – " మొగుడు చిరకాలం జీవించి ఉంటాడనిలేదు. కర్మకాలి విధవయితే – నేలమీద పడుకోవాలి. భోగాలన్నీ వదిలెయ్యాలి. విరాగిలా బతకాలి. స్త్రీలు కామాన్ని జయించగలరా? నామాట వినండి. పెళ్ళిమాట వదిలెయ్యండి. కులవృత్తి స్వీకరించండి" అని బతిమాలింది. వారందుకెంత మాత్రం అంగీకరించక ఆమెను శాస్త్రజ్ఞానం లేనిదన్నారు. చిత్రసేన – "నేను చిన్నప్పుడు దత్తకుడనే వానితో కలసి చదువుకున్నాను. అతని అందంచూసి అప్పుడే అతన్ని పెళ్ళాడాలనుకున్నాను. బడిలోనే మేము ఒకరినొకరం వరించాం. అతను కాశీపురంలో చదువుతున్నాడని విన్నాను. నేనక్కడికి పోయి బాల్యస్నేహం చెప్పి అతన్ని బతిమాలి వివాహం చేసుకుంటాను. నీ ఐశ్వర్యంనాకు వద్దు" అంది.

రతిమంజరి, చిత్రసేన చెవిలో ఏదో చెప్పి – "అలాటి వాడే నాభర్త. ఇది గురువుగారి ఉపదేశం" అంది

రతినూపుర – "చిన్నవాళ్ళు. మీకేమీ తెలియదు పొండి" అని వారిని మందలించి తానుఅవతలకి పోయింది.

అంతవరకూ చెప్పి మణిసిద్ధుడు కద ఆపాడు. "గోపా! మనం బయలుదేరవలసినవేళ ఔతూంది లే. మజిలీ చేరాక తరవాత కథ తీరిగ్గా చెప్పుకుందాం" అన్నాడు.

# కాశీ మజిలీ కథలు

## 142 వ. మజిలీ

### చిత్రసేన, రతిమంజరుల కథ

గురువు చెప్పిన శుభదినాన రతిమంజరి తెల్లవారు ఝామునే లేచి స్నానం చేసి చక్కగా అలంకరించుకుని – "అక్కా! నా భాగ్యం ఎలా ఉందో? భర్తను వరించే సమయం సమీపించింది. ఇప్పుడే పోయి, వీధి తలుపు తీసేసరికి మన అరుగుమీద మొదట ఎవడు కనపడతాడో అతనినే ప్రాణేశ్వరుడిగా భావించి ఈ పూలదండ అతనిమెడలో వేస్తాను. గురువు అలాగే ఉపదేశించాడు. కాని ... అక్కడ ఎవరూ లేకపోతేనో?" అంది.

అందుకు చిత్రసేన – "చెల్లీ! మహాత్ముల మాటలు తప్పవు. వారు చెప్పినట్లు చేస్తే మంగళమే ఔతుంది. ముహూర్తం సమీపించింది. పద" అంది. అప్పటికి చీకట్లు విడుతున్నాయి. వెలుగు రేక వొస్తూంది.

రతిమంజరి చేతిలో పూలదండతో, భగవంతుణ్ణి ధ్యానిస్తూ తటాలున ద్వారం తెరిచింది.

జలతారు రత్నశాలువా కప్పుకుని తేజశ్శాలి అయిన ఒక విప్రకుమారుడిని చూసింది. ఆమె సంతోషానికి అవధులు లేవు. అతనూ ఆమె సౌందర్యానికి చాలా ఆశ్చర్యపోయాడు. "తరుణీ! ఈ ఇంటివారు ఎవరు? వారి ఔదార్యానికి నేను కృతజ్ఞతలు తెలుపుకోవాలి అన్నాడు.

"వారు మీకేం ఉపకాం చేశారని పొగుడుతున్నారు? పురుషోత్తమా! మీరెవరు? ఇక్కడి కెప్పుడు వచ్చారు? మీ వివరాలు చెప్పండి. తరవాత ఈ యింటివారి సంగతి చెబుతాను" అంది రతిమంజరి. " మాకాపరం కాశీపురం. దత్తకుడు మొదలయిన ఆరుగురు పండితులు నా సహాధ్యాయులు. నేను భోజుడి రాజధానికి పోతున్నాను.

నాపేరు గోణికాపుత్రుడంటారు. ఇది మా దత్తకుడి జన్మభూమి. అందుకు చూడడానికి వచ్చాను. నేనిక్కడ రాత్రి సుఖంగా నిద్రపోయాను. అందుకని ఇంటివారికి కృతజ్ఞత తెలుపుకోవాలి. చెబితే, వారినీ నిన్నూ దీవించి వెళ్ళిపోతాను" అన్నాడు.

ఆమె చిత్రసేన వద్దకువెళ్ళి – "అతనిపేరు గోణికాపుత్రుడట. గురుకృపవల్ల అనుకూలుడే ఎదురయ్యాడు. నువ్వుమాట్లాడు" అంది. అప్పటికే అతనినోట దత్తకుడనే పేరు వినడం వల్ల మరింత ఉత్సాహంతో – "ఈమె నాసోదరి. వరుణ్ణి కోరుకుని వచ్చింది. ఈ ఉదయం మీముఖమే చూసింది. దానికోరిక తప్పక తీరుతుంది. దీనిని పరిగ్రహించండి" అని – చెల్లెలికి కనుసైగ చేసింది. రతిమంజరి పూలదండను – "ఇది నా హృదయమే" అంటూ అతని మెడలో వేసింది. "మీరేనాభర్త." అంది, తలవంచుకుని. అతను విభ్రాంతుడయ్యాడు. "ఇది నిజమా, కలా? నా మొహమే తెలియని ఈమె ఇలా ఎందుకు చేసింది. నన్ను మరెవరో అనుకోలేదు కద? స్త్రీవ్యామోహం ఎంత చిత్రమయింది!......ఆ...ఇది వేశ్యాగృహమనే సూచన ఆమె మాటలలో ధ్వనించింది. వీరిద్దరూ వేశాపుత్రికలు. నా పటాటోపం చూసి కపట ఉపచారాలు చేస్తున్నారు. వీళ్ళు చదువుకున్నవారిలా ఉన్నారు. చూద్దాం! అని మనసులో అనుకున్నాడు. "విదుషీమణీ! కామి, సుఖార్థుడు, అజ్ఞాని, స్వతంత్రుడు, అభిమాని, నపుంసకుడు...ధనవంతులయివుంటే వారిద్రవ్యమంతా లాగివేసి తల్లిచేత వెళ్ళగొట్టించడం మీ కులధర్మం. కాని..నేను వారిలో ఏవొక్కడినీ కాను. మీ కపట కృత్యాలు నాదగ్గ రెందుకు? మరెవరిమీదయినా ప్రయోగించండి మీ సత్కారానికి ఆనందం. దీవించి పోతాను" అన్నా డతను.

"ఆర్యా! మేము వేశ్యాపుత్రికలం అవడం నిజమే. కులవృత్తి విసర్జించి కులస్త్రీ కావాలనుకుంటున్నాం. ఇది నాచెల్లి రతిమంజరి. ఒకదేశికుడు నేటి ఉదయం ఈ వేదిక మీద ఉన్నవాడిని పతిగా చేసుకొమ్మని దీనిని ఆదేశించాడు. పూర్వపుణ్యం వల్ల మీరు కనిపించారు. మాకు మొదటనుంచీ పండితులను పతిగా పొందాలని కోరిక. మీరు

చెప్పిన మీ మిత్రుడు దత్తకుడు, నేను ఒకబడిలో చదువుకున్నాం. అతన్ని తండ్రి మాధురుడు అతనిని పెంచలేక, తల్లిలేని అతనిని ఎవరికో పెంపకాని కిచ్చేశాడని నేను విన్నాను. ఆవిడ అతని చదువు పట్ల చాలా శ్రద్ధ వహించింది.

నా కంటె రెండేళ్ళు పెద్దఅయిన అతన్ని బావ అనిపిలిచేదాన్ని. అతను నన్ను పెళ్ళామని హాస్యాలాడేవాడు. అతను పండితుల వద్ద శాస్త్రాలు అభ్యసించడం మొదలుపెట్టాక మా స్నేహానికి అంతరాయం కలిగింది. అంతవరకూ వేమిద్దరం ఒకరిని విడచి ఒకరు ఉండలేకపోయేవాళ్ళం. ఆయన కాశీకి పోయినప్పుడు నేను ఊళ్ళోలేను. తరవాత వచ్చాను. చాలా విచారించాను. స్నేహానికి దూరంలేదు కదా. నామనసు వారి మీదే ఉంది. వారినే పెళ్ళాడతాను. మీరు దీన్ని పరిగ్రహించి, మమ్మల్ని వెంట బెట్టుకుపొండి. నేను మీ యిద్దరికీ సేవలు చేస్తాను.

మా తల్లి మమ్మల్ని వృత్తిలోకి దింపాలనుకుంటూంది. కాని మాకు కులవృత్తి ఇష్టంలేదు. కవీంద్రులకి మహారాజులు కూడా సాటిరారు. మా ప్రార్థన ఆలకించండి.

అతను నవ్వుతూ – 'నువ్వు మా దత్తుడికి మిత్రురాలివవడం వల్ల నాకూ స్నేహభావం ఏర్పడింది. భాగ్యాలు వదులుకుని,నన్నెందుకు పరిగ్రహిస్తున్నారు? ఈ ఆలోచన మానుకుని చక్కని గుణవంతుడిని వరించండి. సుఖపడండి. మా వెంట వస్తే అన్నీకష్టాలే" అన్నాడు.

రతిమంజిరి అతని పాదాలమీద పడింది – "మమ్మల్ని కపటులనీ, దుష్టులనీ భావించకండి. మిమ్మల్ని భర్తగా వరించాను. మీకు అన్ని సేవలూ చేస్తాను" అంటూ తల్లికీ తమకీ జరిగిన సంభాషణ అంతా చెప్పింది. అతనామె మాటలు నమ్మి అంగీకరించాడు ఆమె అతని నర్చించి మేడమీదకి తీసుకు వెళ్ళింది.

ఆ విషయం పరిచారికల ద్వారా తెలుసుకున్న తల్లి కోపంతో వాళ్ళిద్దరినీ రప్పించి – "మిమ్మల్ని చక్రవర్తులకు ప్రియురాళ్ళని చేసి

ఇంద్రభోగాలనుభవింప జెయ్యాలనుకున్నాను. కాని మీనుదుట బాపనదాసరుదుల పెళ్ళిచేసుకొని, ముష్టెత్తుకు బతకాలని విధిరాసిపెడితే నేనేం చెయ్యగలను? కులస్త్రీలు మనల్ని చూసి ముచ్చట పడుతూంటే మీరేమో పెళ్ళి పెళ్ళి అని పలవరిస్తారేం? ఆ గోచీపాత రాయుడి నెవరినో మేడ ఎక్కించారు. వాడితో కులుకుదామని కాబోలు. వాడినిపుడే గెంటిస్తాను. ఇదంతా నా స్వార్జితం. మీ నగలన్నీ ఇక్కడ పెట్టి పొండి" అంది.

"తల్లీ! నువ్వెందరి ఇళ్ళో కూల్చి సంపాదించిన యీ ద్రవ్యం అనుభవిస్తే మహాపాపం వొస్తుంది మాకొద్దు" అంటూ అన్నీ వొలిచిపెట్టి మామూలు బట్టలు ధరించి ఆ విషయమంతా గోణికాపుత్రుడికి చెప్పారు.

అతను వారి సాహసానికి మెచ్చుకుని ఆశ్చర్యపోతూ అంగడికి వెళ్ళి వారికవసరమయినవి కొని తెచ్చాడు. ఆ రాత్రే వారు ముగ్గురూ ఎవరికీ తెలియకుండా ధారానగరం వేపు బయలుదేరారు.

# కాశీ మజిలీ కథలు

## 143 వ మజిలీ

### మతంగ యోగిని కద

ఒంటినిండా విభూది పూసుకుని రుద్రాక్షమాలలు ధరించి కాషాయవస్త్రాలు కట్టుకున్న ఆ యోగిని పాటలీపుత్ర నగర రాజమార్గం మీద పోతుంటే ఆమెకు నమస్కరించనివారు లేరు ఆమె వేషం చూసి తపస్సిద్ధురాలిగా భావించసాగారు ఆమె వారి నమస్కారాలందుకుంటూ ఏమీ మాట్లాడకుండా తిన్నగా రతినూపుర ఇంటికి వెళ్ళింది ఎప్పుడూ సందడిగా ఉండే ఆ యిల్లు నిశ్శబ్దంగా ఉన్నందుకు ఆశ్చర్యపోతూ ఆమె డాకినీ నామస్మరణ చేస్తూ లోపలికి వెళ్ళింది

మంచంమీద పడుకున్న రతినూపుర ఆమెను చూడగానే దిగ్గున మంచందిగి ఆమె పాదాలకు నమస్కరిస్తూ - తల్లీ నాకూతుళ్ళు నన్ను వదిలి పోయారు అంటూ ఎడిచి ఆకథంతా చపుకుంది అదివిన్న యోగిని ముఖం చిన్నబోగా - వాళ్ళు ఎటువేపు పోయారో చెప్పగలవా? అని అడిగింది ఆమె తెలియదండి

యోగిని - 'నేనిప్పుడు నీకూతుళ్ళని చక్రవర్తికి భార్యలని చేసే ఉద్దేశంతో వచ్చాను కాని నారాక నిష్ఫలమయింది మహాపుర నగరాధీశ్వరుడు విపులు డనేరాజు నవరసరసికుడు రూపంలో మన్మధుడే నేనా నగరానికి వెళ్ళి అతనిదర్శనం చేయగా అతను నన్ను భక్తి పూర్వకంగా అర్చించి నా అభీష్టం అడిగాడు

దేశపర్యటనమే మా కృత్యం నీ సద్గుణాలు విని నిన్ను చూడవచ్చాను నాకే కోరికాలేదు సజ్జనులే నాకు మిత్రులు అన్నాను

అందుకతడు – "నీవు కొన్నాళ్ళిక్కడుండి సద్గోష్ఠి చెయ్యి" అని కోరాడు. నేనంగీకరించి ఆరుమాసాలు అక్కడ ఉన్నాను. ఒకనాడు స్త్రీ ప్రశంస వచ్చి, అతను – "దేవీ! నువ్వు అన్ని దేశాలూ తిరుగుతూంటావు. కవులు వర్ణించిన స్త్రీలు ఎక్కడేనా ఉన్నారా?" అని అడిగాడు.

నేను కొంచెం సేపు ఆలోచించి, చిరునవ్వుతో.. "నిజానికి నాకు ఈ ప్రసంగంతో సంబంధంలేదు కాని. మీరడిగారు కనక చెబుతున్నాను ...పాటలీపుత్రనగరంలో రతి నూపుర అనే వేశ్య ఉంది. దాని కిద్దరు కూతుళ్ళు. వాళ్ళ అవయవాలన్నీ పోతపోసినట్లుంటాయి. చక్కదనం మాత్రమేకాదు. సంగీతంలో సరస్వతి అంతటివారు. వాళ్ళ సుగుణాలు ఎన్నో! ఇప్పుడు వారు యౌవనంలోకి వొచ్చి సానపట్టిన వజ్రాల్లా మెరుస్తూంటారు.

రాజా! నేను అవధూతనయినా సరే, చెప్పవలసిన మాట చెప్పక మానను. నీకు వారూ, వారికినువ్వు ఎంతయినా తగుదురు" అన్నాను.

నా మాటలు విని రాజు – "అంత చక్కనివారా వారు? వారింకా ఎవరి స్వాధీనం కాలేదు కద?" అన్నాడు. "లేదు. తమకి సరిపడిన వారు దొరికే వరకూ వారు వరింపరు" అన్నాను నేను.

రాజు తటాలున నా పాదాలమీద పడి – "దేవీ! నువ్వు యోగిని వయినా భోగిని తత్వం తెలిసినదానివి. వైరాగ్యంలోనే కాక శృంగారం లోనూ నువ్వు పండితురాలివే. నువ్వు లోకోపకారం కోసం పాటుపడేదానవు. నన్ను నీ శిష్యునిగా చేసుకుని ఆ కన్యలను నాకిచ్చి పెళ్ళి చేయించు. నీ ఉపకారం ఎన్నటికీ మరవను" అని ప్రార్థించాడు.

నేను నీకూతుళ్ళ మీద అభిమానం కొద్దీ యిక్కడికి ఎంతో ఉత్సాహంతో వచ్చాను. కాని ఏంలాభం? నాప్రయాస అంతా వ్యర్థమై పోయింది" అంది. "దేవీ! వాళ్ళ నొసట అలారాసి పెట్టి ఉంటే నేనేం చెయ్యగలను? కోరికోరి విభూతిరాయలను కోరుకున్నారు. నీకు శక్తిఉంటే వాళ్ళని పట్టుకుని తీసుకెళ్ళి ఆ రాజుకి కట్టబెట్టు. నువ్వు నిజంగా తలచుకుంటే అసాధ్యమా?" అంది రతినూపుర.

ఆ మాటలు విని ఆ అవధూత తలపంకించి వారి ఆనవాళ్ళు తీసుకుని బయలుదేరి వారి జాడలు కనుక్కుంటూ కొన్నాళ్ళు దేశం తిరిగింది.

కాంతాకనకాలు ఒంటరిగా లభిస్తే ఎలాటి వాడికేనా ఆశపుడుతుందని గోణికాపుత్రుడు చిత్రసేనకీ, రతిమంజరికీ పురుష వేషాలు వేయించి ధారానగరం తీసుకెళ్ళ సాగాడు. మహాపురంలో ఒక సత్రంలో వారు బసచేసి ఉండగా మతంగ యోగిని అక్కడికొచ్చి నాలుగు మూలలా వెదకసాగింది.

చిత్రసేన ఆమెను గుర్తుపట్టి గోణికాపుత్రుడితో – "ఈయోగిని అప్పుడప్పుడు మాయింటికి వొచ్చేది. మాల్లికి దీనియందు భయభక్తులు ఎక్కువ. అది పంపగా ఇదివొచ్చిందేమో." అంది.

అప్పుడతను ఆమె వద్దకు పోయి – "నీవెవరివి? ఎందుకు వెదుకుతున్నావు? ఏంపని?" అని అడిగాడు.

"బాబూ! మొన్న రాజసభలో సంగీతం పాడిన గాయకులు ఇక్కడున్నారని విన్నాను. వాళ్ళని చూడాలని వచ్చాను. వారెక్కడున్నారో చెప్పగలరా?" అని అడిగింది. "నీవు సంగవర్జితురాలివి. శృంగారరస దీపకమయిన సంగీతంతో నీకేంపని?"

"సంగీతం వింటూంటే నామనస్సు పరబ్రహ్మంలో లీనమౌతుంది. నేనెందరో గాయనీగాయకుల సంగీతం విన్నాను. అందుకే దేశాటనం చేస్తాను. ఈ దేశాధిపతి విపులుడు. నా పట్ల గురుభక్తి కలవాడు. మొన్న వారివద్ద ఏవోపాడరట. ఆగానా న్నతను చాలా మెచ్చుకుంటున్నాడు. నేను అప్పుడు ఊళ్ళోలేను. వాళ్ళు ఈ సత్రంలో ఉన్నారంటే చూద్దామని వచ్చాను. వారు మీరే అయితే నేను ధన్యురాలినే. కొంచెం పాడి నాకు ఆనందం కలిగిస్తారా? మిమ్మల్ని దీవించిపోతాను" అంది. అతను చిత్రసేనను కొంచెంసేపు పాడమని కోరాడు.

పురుషవేషంలో ఉన్న చిత్రసేన వీణతో గొంతు కలిపి పాడగా ఆ యోగిని – "ఓహోహో! ఎంతకాలానికి ఇలాటిసంగీతం విన్నాను! నా

చెవుల తుప్పు వొదిలింది. ఇలాటి సంగీతం పాటలీపుత్రనగరంలో రతినూపుర పుత్రికలు పాడుతుండగా విన్నాను. ఇంతమనోహరంగా వారు తప్ప మరెవరూ పాడలేరు" అని పొగిడి." మరొక గీతం. మరొకటి.." అంటూ పాడించుకుంటూ తల ఊపింది. "అవధూతా! నీ చిత్తం పరబ్రహ్మాయత్తం అయిందా? ఆనందం అనుభవించావా? ఇక చాలునా?" అని అడిగాడు గోణికాపుత్రుడు

"బాబూ! ఎన్నాళ్ళయినా వినగలను, పాడాలేకాని." "నువ్వు వినగలవు కాని పాడేవాళ్ళకి ఒపిక ఉండొద్దూ? వేదాంతివి కదా అని పాడాడు కాని విత్తం చూపనిదే వీణతియ్యడు. ఇకవెళ్ళు.అన్నాడతను నవ్వుతు "బాబూ! ఇతరులని నేనెప్పుడూ కష్టపెట్టను. మీరు నానిమిత్తం పాడక్కరలేదు. మీరు పాడినప్పుడే వింటాను. మీతో రావడానికి అంగీకరిస్తారా?అందామే.

అందుకతను - "నువ్వు మాతో రావద్దు. నువ్వు యోగినివి, మేము భోగులం" అని చెప్పేశాడు కచ్చితంగా.

అప్పుడా యోగిని విపులుడి దగ్గరకు పోయి - "మహారాజా! వాళ్ళు రతినూపుర పుత్రికలే. గడుసువాడైన ఆ బ్రాహ్మణుడు వారికి పురుషవేషాలు వేసి తీసుకుపోతున్నాడు. నన్ను వారితో రావద్దన్నాడు. పాపం, రతినూపుర ఇద్దరినీ మీకివ్వడానికి సిద్ధంగా ఉంది. ఇప్పుడు మనమేం చెయ్యాలో ఆలోచించండి" అంది.

"నువ్వువాళ్ళని కలుసుకుని నాగురించి వివరించి నా అభిలాష తెలియజెయ్యి. వాళ్ళు వస్తారు. రాకపోతే అప్పుడు ఆలోచిద్దాం. నీకు చెప్పవలసిన పనిలేదు. ప్రౌఢురాలివి" అంటూ దారిఖర్చుకి కొన్ని దీనారాలిచ్చి, చేయవలసింది చెప్పి రాజు ఆమెను పంపాడు.

గోణికాపుత్రుడు వారితోకలసి దేశవిదేశాలు చూస్తూ మెల్లగా వెళ్తూండడం వల్ల పదిరోజులకే యోగిని వారిని కలుసుకోగలిగింది. అతనామెను పలకరించలేదు అయినా ఆమె - "నేనేంచేశానని నామీదకోపగిస్తున్నావు? ఒక్కపాట పాడించవా?" అంటూ ప్రాధేయ పడింది. అతను వొద్దన్నా వారితోపాటే తిరగసాగింది.

ఒకనాడు అతనులేని సమయంచూసి – "బిడ్డలారా! మిమ్మల్ని నేను గుర్తుపట్టాను. మీరు రతినూపురపుత్రికలు. మీరు కన్నుకప్పివచ్చేశారు. మీకోసం మీతల్లి మంచం పట్టింది. అది అలా ఉంచండి. మీకొక శుభవార్త. విపులుడనే మహారాజు వద్ద మిమ్మల్ని చాలాపొగిడాను. అతను మిమ్మల్ని చేపడతానంటున్నాడు. అతని ఐశ్వర్యమంతా మీదే. నాతోరండి. మిమ్మల్నతనికి కలుపుతాను. ఈ ముష్టి బ్రాహ్మణుడి వెంటవెళ్ళి ఏంపొముకుంటారు" అంది అనునయిస్తూ.

ఆ మాటలు విని చిత్రసేన చురచురచూస్తూ –" ఓసిదుష్ట యోగినీ! ఇదా నీవేదాంతం? రాజుదగ్గర తార్పుడు కత్తెవన్నమాట. చాలు. నువ్వు మాతో మాట్లాడదగిన దానివికావు. పోపో. రతినూపుర ఎవరు? విపులు డెవరు? మేం నువ్వు అనుకున్నవాళ్ళంకాం. భ్రమపడ్డావు. మాకవీంద్రునికి కోపం ఎక్కువ. ఈ మాటలు వింటే శిక్షిస్తాడు" అంది. "మీ సుఖంకోరి ఇలా అన్నాను. మీకు ఇష్టంలేకపోతే నాకేం? కాని – మీరు చేస్తున్నది చాలా తప్పు. తల్లికి తెలియకుండా దాని ఆస్తంతా దొంగిలించి మారు వేషాలు వేసుకుని ఈ బాపనయ్యని తగులుకుని పోతున్నారు. మీరు దండనకు అర్హులు. మీ తల్లి రాజుదగ్గర మీ మీద ఫిర్యాదు చేసింది. మిమ్మల్ని బలవంతంగా తీసుకు పోతాను చూడండి" అని బెదిరించి ఆ యోగిని వెళ్ళింది.

గోణికాపుత్రుడు రాగానే చిత్రసేన అంతా చెప్పింది. అతను – మనమిక ఈదేశం వదలిపోవాలి. విపులుడు మిమ్మల్ని వలచాడు. కామాంధులకు యుక్తాయుక్తాలు తెలియవు" అంటూ హుటా హుటి ప్రయాణం సాగించాడు.

ఒకనాడు – "వేశ్యకులంలో సద్గుణాలకి పేరుపొందిన వారెవరేనా జన్మించారా?" అని చిత్రసేన అడగ్గా.. "మీరు పుట్టలేదా?" అని నవ్వాడతను. "పరిహాసం ఆడక నిజం చెప్పండి" అని ఆమె ప్రార్థించగా గోణికాపుత్రుడు – "చింతామణి అనే వేశ్య లీలాశుకుడనే బ్రహ్మణుని భర్తగా వరించి ముక్తినిపొందిన కథ జగద్విఖ్యాతమే. మీరు వినలేదా!" అన్నాడు. వారు ఆ కథను చెప్పమని కోరగా అతను చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 144 వ. మజిలీ

### చింతామణి కథ

రూప, యౌవన, శీల, విద్యలలో చింతామణి అనే వేశ్య చాలా ప్రసిద్ధి చెందింది. ఎన్నో శృంగారశతకాలను చదివి, కామతంత్రాలు తెలుసుకుని, కామకళా రహస్యాల నర్థం చేసుకుని యౌవనం వచ్చేసరికే శృంగార కళలో పండితురాలయింది. పూర్వజన్మ వాసనను బట్టి దుష్టవిటులను ఆదరించినా యౌవనం ఉదయించే సరికి ఏకచారిణీవ్రత అనుసరించాలని తగిన ప్రియుడికోసం ఎదురు చూడసాగింది.

ప్రయాగలో – మునుపు కృష్ణమిత్రుడనే సోమయాజి కాపురం చేసేవాడు. అతనికి నడివయసులో మన్మధుడిలాంటి కొడుకు పుట్టాడు. శ్రీశుకుడే మళ్ళీ పుట్టాడనే భావం స్ఫురించేలా ఆ బాలుడికి లీలాశుకుడని పేరు పెట్టాడు. కొడుకుని ఎంతో ప్రేమగా పెంచుతూ ... మహావిద్వాంసుణ్ని చెయ్యాలనే తలపుతో గురువులనింటికే రప్పించేడు. ఆ బాలుడికి ఆటలలో ఉన్న ఆసక్తి చదువులో ఉండేదికాదు. ఎలాగేనా వాడికి విద్యాగంధం అంటించాలని, వాడు ఆడుకుంటూంటే పుస్తకాలు పట్టుకుని వెంటతిరుగుతూ గురువులచే విద్యచెప్పించేవాడు. లీలాశుకుడికి పన్నెండేళ్ళు వొచ్చేసరికి తండ్రి మరణించాడు.

దానితో అతనినదిలించే వారులేక చదువంతటితో ఆగిపోయింది. శృంగారలీలలను తెలుసుకుందుకు కావ్య, నాటక, అలంకార గ్రంథాలను విమర్శిస్తూంటారు. చదరంగం, కోడిపందాలు, జూదం, ఆటలలో గడుపుతూ కులాచారం మట్టుపెట్టి దురాచాలకు లోనయ్యాడు. విటులు, నటులు, గాయకులూ అతని మిత్రులు. ఊళ్ళో అంత ఆకతాయి లేదని పేరు పొందాడు. మరో రెండేళ్ళలో అతని తల్లికూడా మరణించింది. ఇల్లుచేరలేదని మందలించేవాళ్ళు కూడా లేకపోయారు.

లీలాశుకుడిలో యౌవనం పూర్తిగా ఆవరించింది. అద్దంలో ముఖం చూసుకుని మీసాలు దువ్వుకుంటూ, మన్మథుడు కూడా తనకి సరిరాడనుకునేవాడు. ఎవరేనా పిల్లనిస్తామని వొస్తే విరక్తుడిలా - "సంసారమనేది కూపం. ఒకసా రందులో పడితే మరి బయటకురాలేం" అంటూ వారిని పంపేసేవాడు. ఊరిలోకల వేశ్యల గుణగణాలు, తారతమ్యాలు చర్చించేవాడు. చింతామణి అనే వేశ్య అన్నివిధాలా గొప్పదని...దానిని భార్యగా స్వీకరించాలని ఆలోచించి ఒకనాడు మిత్రులతో దాని ఇంటికి వెళ్ళాడు. మిత్రులు అతని కులశీలాలు ఆమెకు తెలిపారు.

అతని గురించి అంతకుమునుపే విన్న ఆ చిన్నది అతని అందం చూసి మనసులో మెచ్చుకుని సగౌరవంగా ఎదురేగి అతన్ని ఆసనంపై కూర్చోబెట్టి ఉపచారాలు చేసింది. అతను ఆనందిస్తూ తాను తెచ్చిన నగలూ అవీ ఇచ్చి తనకోరిక తెలిపాడు. ఆమె కొన్ని షరతులు విధించగా అతను అంగీకరించి ఒకశుభముహూర్తంలో కన్నెరికం చేశాడు.

ఇది పగలు ... ఇది రాత్రి అని తెలియకుండా లీలాశుకుడు చింతామణితో మన్మథ క్రీడలలో మునిగితేలుతూ స్నాన, సంధ్య మొదలయిన కర్మలను వదలి...అప్పటికీ తనివి తీరక చింతామణినే మనసులో ప్రతిష్ఠించుకుని ధ్యానం చేయసాగాడు.

చింతామణి వేశ్య అయినా జ్ఞాని అవడంవల్ల అతను తనపట్ల చూపుతున్న మోహానికి ఆశ్చర్యపోతూ అతనికి తగినట్లుగా ప్రవర్తిస్తూ అతనినే ప్రధానపురుషుడిగా ఎంచుకుని అతని ఆస్తంతా తనవశం చేసుకున్నా బ్రాహ్మణద్రవ్యమని, తాను అనుభవింపక దాచి ... అతనికి సంతోషం కలిగించేది.

ఒక ఏకాదశినాడు దగ్గరలో కల విష్ణువు ఆలయంలో పురాణం చెబుతూంటే ఆమెవెళ్ళి భక్తి శ్రద్ధలతోవింది. "మాతా పితరులని పూజించాలి. వారు చనిపోయాక పిండోదకాలు ఇవ్వాలి. పితృసేవకంటె గొప్పది మరేమీలేదు. తల్లితండ్రులకి ఆబ్దికాలు పెట్టి బ్రాహ్మణు లనర్చించని వాడు. జీవచ్ఛవమే." అని పౌరాణికుడు చెప్పగా ఇంటికి వచ్చాక - "లీలాశుకా! నువ్వుతల్లితండ్రులకి ఆబ్దీకాలు పెడుతున్నావా?

అని అడిగింది."నాలుగైదు సంవత్సరాలనుంచి పెట్టడంలేదు" అన్నాడతను. ఎందుచేత అని ఆమె అడగ్గా "భోజనసమయం తప్ప తక్కిన సమయమంతా నీతోనే ఉంటున్నాను కదా అందుచేత కుదరటంలేదు." "హరిహరీ! ఎంత పాపాత్మురాలినయ్యాను! నువ్వునేనూ కూడా రౌరవనరకంలో పడవలసిందే." "పురాణంలో విన్నావా? చాలుచాలు. ఇవి బ్రాహ్మణులు డబ్బు లాక్కుందుకు రాసేరాతట. ఆరిన దీపానికి చమురు పోస్తే ఎంత లాభమో, మృతులకు తద్దినాలు పెట్టడం అంత ప్రయోజనకరమే." "నీలాటి మహానుభావులు పుట్టడం వల్ల కులగౌరవం చెడిపోతుంది. నాకు నాస్తిక వాదం ఇష్టముండదు. నీకు ఆ తిధులు జ్ఞాపకం ఉన్నాయా?" అని అడిగింది చింతామణి నిట్టూర్పు వదులుతూ.

"మా పురోహితుడికి జ్ఞాపకం ఉండొచ్చు" అన్నాడతను. "రేపు అతన్ని తీసుకొచ్చేవరకూ మీతో మాట్లాడను –" అని ఆమె పెడమొహం పెట్టుకుని తన గదిలోకి పోయింది.

'దీనిని గుడికి పోనివ్వడం నాతప్పయింది. తద్దినం పెట్టేవరకూ నన్నువేపుకు తింటూంది కాబోలు. శృంగారానికి విఘ్నం వచ్చిందే' అని విసుక్కుంటూ అతను మర్నాడు పురోహితుణ్ని తీసుకు వచ్చాడు.

చింతామణి అతనికి నమస్కరించి కూరోబెట్టింది. "అయ్యా! మీలో తద్దినం పెట్టనివాడికేమి శిక్షవిధిస్తారు?" "కులంలోంచి వెలివేస్తారు. అతని పంక్తిని ఎవరూ భోజనం చెయ్యరు" అని చెప్పాడు పురోహితుడు.

"మీ శిష్యుడు అలాటి తప్పు చేస్తుంటే మీరెందుకు మందలించ లేదు? శిష్యుడి పాపం గురువుదేకదా." "అతను నాకు కనపడి మూడేళ్ళయింది. వాడు నీ అధీనంలో ఉన్నాడు కనక ఆ పాపం నీకే అంటుతుంది." అని నవ్వాడు. చింతామణి చాలా పశ్చాత్తాపపడి లీలాశుకుని తల్లితండ్రుల తిధులగురించి అడగగా – "పదిరోజులలో తండ్రితిథీ, మూడుమాసాలలో తల్లితిథి వొస్తాయి" అని చెప్పాడు.

"అయ్యా! అయిపోయినదానికి నేనేమీ చెయ్యలేను. అతనిచేత తప్పకుండా తద్దినాలు పెట్టించండి. లోపమేమీ రానివ్వకండి" అంటూ ఆమె అతనికి సరిపడిన ద్రవ్యం అందించింది. అతనామెను దీవించి వెళ్ళాడు. అప్పుడు చింతామణి లీలాశుకుడితో – "విన్నారు కదా

పురోహితుడి మాటలు? ఆబ్దికానికి ముందురోజు, ఆనాడు, మరునాడు – మూడు రోజులు మీరు మా యింటికి రాకూడదు!" అంది హెచ్చరిస్తున్నట్లు. "అమ్మో! మూడురోజులు నిన్ను చూడకుండా నే నుండగలనా? నా తండ్రి తద్దినం నేను పెడతానోలేదో కాని, నువ్వు వెంటనే నా తద్దినం పెట్టిస్తావు. ఆబ్దికం మానిన దోషం నాదయితే బ్రహ్మహత్యాపాతకం నీదౌతుంది" అన్నాడతను. వాళ్లిద్దరిమధ్యా వాదన జరిగింది. చివర కతను తిథినాడు రాకుండా ఒప్పించింది.

కోడికూసింది మొదలు చింతామణి లీలాశుకుణ్ని లేపడం మొదలుపెడితే సూరోదయమైన గడియకి ఎలాగోలేచాడు. "తండ్రి కడుపున చెడబుట్టావు" అంటూ అతణ్ని మందలించి – "ఇవాళ ఈయింటికి రాకూడదు సుమా!" అనిమళ్ళీ హెచ్చరించి పంపింది. అతను బలవంతంగా ఆ పురోహితుడి వెంట వెళ్ళాడు. అప్పటికే ఆలస్యమయిందని కోపగిస్తున్న పురోహితుడితో – "మంత్రంలో ఏమీలేదు. తంత్రం.ఆచార్యులు కల్పించింది. బ్రాహ్మణులు భోజనం చేస్తే చాలులే" అన్నాడు లీలాశుకుడు. అన్ని తతంగాలూ పురోహితుడే జరిపాడు.

సాయంకాలం అయ్యేసరికి లీలాశుకుడి పరితాపం ఎక్కువ యింది. రాత్రి పదిగడియలవరకూ అంగళ్ళు తిరుగుతూ ఎలాగో గడిపాడు. చింతామణి ముఖం చూడకుండా ఉండలేననుకుంటూ దానియింటికి దూరంగా నిలుచుని అటువేపు చూడసాగాడు. అప్పుడు ఏదో ఆలోచనవచ్చి పురోహితుడి ఇంటికి పోయి కొన్ని వంటకాలు మూటకట్టుకుని తిన్నగా చింతామణి ఇంటికి పోయాడు.

ఆ యింటి తలుపులు మూసి ఉన్నాయి. ఎవరిని పిలిచినా పలకలేదు. అతనా యింటిచుట్టూ ముమ్మారు తిరిగాడు. అప్పుడొక తెల్లతాచుపాము పశువులసాలలోని ఎలకలని తిండానికి గోడెక్కుతూంటే అది అతని కంటికి జనపనారతాడులా కనిపించింది. మనస్సంతా చింతామణే నిండిన అతను దానిని పట్టుకుని గోడ ఎక్కి లోపలికి దుమికాడు. ఆ పాము సగం తెగి అతని చేతిలోకి వచ్చింది. అతనేమీ చూడకుండా దీనిని అక్కడ పారేసి చింతామణి గదిలోకి వెళ్ళాడు. దానిమంచం దగ్గర నిలబడ్డాడు.

ఆమె దిగ్గున లేచి – "ఛీ! నీచా! నీ చెడుబుద్ధి వదిలావు కావు. నీకు తలుపులెవరు తీశారు? ఒక్కరాత్రికే తాళలేవా? రేపుఎక్కడికి పోతుంది? ఈ తుచ్ఛశరీరం కోసం ఇంత కాంక్షా! నీవల్ల నేను కూడా పాపం సంపాదించుకుంటాను" అని కసిరింది. అతనామె పాదాలమీద శిరసానించి – "చింతామణీ! నువ్వు చెప్పిన మాటలన్నీ జ్ఞాపకం ఉన్నాయి. కాని ఎంత ప్రయత్నించినా మనసు మరలలేదు. ఏం చేసేది? నిన్ను చూడకుండా నిముషం ఉండలేను. నన్ను చంపేస్తే చంపెయ్" అన్నాడు దీనంగా.

"వెర్రివాడా! నీకింత మోహం ఏమిటి? వస్తుతత్వం తెలుసుకోలేక పోతున్నావు. అవతల గదిలో పడుకో" అందామె. "చింతామణీ! నీకోసం పిండివంటలు తెచ్చాను. నానోటి కేదీ రుచించలేదు. నువ్వుతింటే నామనసు చల్లబడుతుంది" అంటూ ఆ మూట ఆమె ముందు పెట్టి దీపం తెచ్చాడు. ఆ వెలుగులో ఆమె ఆ మూటకీ, అతని బట్టలకీ అంటిన రక్తం చూసి – "అయ్యో! ఈ రక్త మేమిటి? పాముపొర ముక్కలు న్నాయేమిటి?" అంది భయంగా.

అప్పు డతను ఆలోచించి – "గోడమీద వేలాడుతున్నది తాడు అనుకున్నాను. పాముకాబోలు" అన్నాడు. ఎక్కడుందో చూపమంటూ ఆమె దీపం పట్టుకుని బయలుదేరింది. 'కామాంధులికి ఏమీ కనపడదు. ఇతనికి ఈ జన్మలో వివేకం కలగదు. వీని మూలాన నేను కూడా చెడిపోతున్నాను' అనుకుందామె. "పాము చస్తే విచారిస్తావేం? లోపలికి పద. మన్మథానందం పొందుదాం. కోపగించకు. ఈ రాత్రి నా శరీరం నిలవదు" అన్నా డతను.

"మంచంమీద కూర్చో స్నానం చేసివస్తాను" అని ఆమె అవతలికి పోయింది. అతను నిముషమొకయుగంగా ఎదురు చూడసాగాడు. అప్పుడు – శరీరం నిండా బూడిద పూసుకుని జుత్తు చెరుపుకుని..అలంకారాలు కాని వస్త్రాలు కాని లేకుండా...దిగంబరంగా... వికృతంగా చింతామణి వొచ్చి అతని ముందు నిలుచుంది.

"లీలాశుకా! ఇటుచూడు నవరంధ్రాలు కల తోలుబొమ్మ లాటి దేహంకోసం నీకంత తహతహ ఎందుకు? వస్తుతత్వం తెలిసిన వారికి

మోహం కలగదు. మలమూత్రాలతో ఉండే శరీరం మీద మోహమెందుకు? ఇది వొట్టి తోలుబొమ్మ. దేముడు దయతో చర్మం కప్పాడు కాని లేకుంటే నెత్తురు మాంసం ... వాటిమీద ముసిరే ఈగలు, క్రిములు..అంతేగా? అంటూ వైరాగ్యం ఉపదేశించేసరికి లీలాశుకుడు మంచం మీంచి ఊరికి ఆమె పాదాల మీదపడి "తల్లీ! నమస్కారం. నీ ప్రవచనాలవల్ల నా మొహం మాయమైంది. బుద్ధి వికసిస్తూంది. ఈ తుచ్ఛభోగాలు వొద్దు ... నాకునువ్వు సరయిన దృష్టిని కలిగించినందుకు చాలా కృతజ్ఞుడిని. జ్ఞానవంతురాలివయిన నువ్వు నాకు గురువుని చూబించు" అన్నాడు. అతనికి విరక్తి కలిగిందనీ, ఉపదేశానికి ఇదే సమయమనీ భావించి ఆమె - "గంగాతీరంలో నా గురువు ఉన్నాడు. ఎప్పుడూ జపం చేసుకుంటూ ఉంటాడు. అతని నామధేయం సోమగిరి, అతని పాదాలు పట్టుకుని వేడుకుంటే తప్పకుండా దయదలచి ముక్తిమార్గం బోధిస్తాడు. ఇప్పుడే బయలుదేరు" అంది.

ఆమె చెప్పిన గుర్తులద్వారా లీలాశుకుడు ఆయోగి వద్దకుపోయి తనవృత్తాంతమంతా చెప్పుకోగా ... అందుకు కారణం పూర్వజన్మ కృతమేఅని తలచి సోమగిరి అతనికి ఒక మంత్రం ఉపదేశించి దానిని శ్రద్ధగా జపించమన్నాడు. లీలాశుకుడు ఆ మత్రానికి చింతామణి అనిపేరుపెట్టి గంగాతీరంలో కూర్చుని, నిద్రాహారాలు మాని తదేక దీక్షతో జపించసాగాడు. 'పదిరోజుల లోగా పరమాత్మ ప్రత్యక్షమవకపోతే ప్రాణత్యాగం చేస్తాను' అని ప్రతిజ్ఞపూనాడు.

పదవరోజు చివర్న శిరంమీద నెమలిఫింఛం, చిన్నబొజ్జ, పసిడి గజ్జెల మొలతాడుతో, మురళి వాయిస్తూ నల్లటి బాలుడొకడు అతని వద్దకు వచ్చాడు. వాడు గజ్జెలు ఘల్లుమనేలా నాట్యంచేస్తూ, లీలాశుకుడి చెవిలో మురళీనాదం వినిపించేసరికి అతను అదిరిపడి కళ్ళు తెరిచి ఎవరూ కనపడక కళ్ళుమూసుకుంటే కృష్ణుడు అతనికి ఎన్నో లీలలు చూబించాడు.

ఆ ముద్దుకృష్ణుణ్ని అతను కనపడిన విధాలనీ వర్ణిస్తూ లీలాశుకుడు నాలుగువందల శ్లోకాలు రచించి స్తుతించాడు. వాటికే శ్రీకృష్ణకర్ణామృతాలనిపేరు.

అని అడిగింది."నాలుగైదు సంవత్సరాలనుంచి పెట్టడంలేదు" అన్నాడతను. ఎందుచేత అని ఆమె అడగ్గా "భోజనసమయం తప్ప తక్కిన సమయమంతా నీతోనే ఉంటున్నాను కదా అందుచేత కుదరటంలేదు." "హరిహరీ! ఎంత పాపాత్మురాలినయ్యాను! నువ్వునేనూ కూడా రౌరవనరకంలో పడవలసిందే." "పురాణంలో విన్నావా? చాలుచాలు. ఇవి బ్రాహ్మణులు డబ్బు లాక్కుందుకు రాసేరాతట. ఆరిన దీపానికి చమురు పోస్తే ఎంత లాభమో, మృతులకు తద్దినాలు పెట్టడం అంత ప్రయోజనకరమే." "నీలాటి మహానుభావులు పుట్టడం వల్ల కులగౌరవం చెడిపోతుంది. నాకు నాస్తిక వాదం ఇష్టముండదు. నీకు ఆ తిధులు జ్ఞాపకం ఉన్నాయా?" అని అడిగింది చింతామణి నిట్టూర్పు వదులుతూ.

"మా పురోహితుడికి జ్ఞాపకం ఉండొచ్చు" అన్నాడతను. "రేపు అతన్ని తీసుకొచ్చేవరకూ మీతో మాట్లాడను –" అని ఆమె పెడమొహం పెట్టుకుని తన గదిలోకి పోయింది.

'దీనిని గుడికి పోనివ్వడం నాతప్పయింది. తద్దినం పెట్టేవరకూ నన్నువేపుకు తింటూంది కాబోలు. శృంగారానికి విఘ్నం వచ్చిందే' అని విసుక్కుంటూ అతను మర్నాడు పురోహితుణ్ని తీసుకు వచ్చాడు.

చింతామణి అతనికి నమస్కరించి కూరోబెట్టింది. "అయ్యా! మీలో తద్దినం పెట్టనివాడికేమి శిక్షవిధిస్తారు?" "కులంలోంచి వెలివేస్తారు. అతని పంక్తిని ఎవరూ భోజనం చెయ్యరు" అని చెప్పాడు పురోహితుడు.

"మీ శిష్యుడు అలాటి తప్పు చేస్తుంటే మీరెందుకు మందలించ లేదు? శిష్యుడి పాపం గురువుదేకదా." "అతను నాకు కనపడి మూడేళ్ళయింది. వాడు నీ అధీనంలో ఉన్నాడు కనక ఆ పాపం నీకే అంటుతుంది." అని నవ్వాడు. చింతామణి చాలా పశ్చాత్తాపపడి లీలాశుకుని తల్లితండ్రుల తిధులగురించి అడగగా – "పదిరోజులలో తండ్రితిథీ, మూడుమాసాలలో తల్లితిథి వొస్తాయి" అని చెప్పాడు.

"అయ్యా! అయిపోయినదానికి నేనేమీ చెయ్యలేను. అతనిచేత తప్పకుండా తద్దినాలు పెట్టించండి. లోపమేమీ రానివ్వకండి" అంటూ ఆమె అతనికి సరిపడిన ద్రవ్యం అందించింది. అతనామెను దీవించి వెళ్ళాడు. అప్పుడు చింతామణి లీలాశుకుడితో – "విన్నారు కదా

పురోహితుడి మాటలు? ఆబ్దికానికి ముందురోజు, ఆనాడు, మరునాడు – మూడు రోజులు మీరు మా యింటికి రాకూడదు!" అంది హెచ్చరిస్తున్నట్లు. "అమ్మో! మూడురోజులు నిన్ను చూడకుండా నే నుండగలనా? నా తండ్రి తద్దినం నేను పెడతానోలేదో కాని, నువ్వు వెంటనే నా తద్దినం పెట్టిస్తావు. అబ్దికం మానిన దోషం నాదయితే బ్రహ్మహత్యాపాతకం నీదౌతుంది" అన్నాడతను. వారిద్దరిమధ్యా వాదన జరిగింది. చివర కతను తిథినాడు రాకుండా ఒప్పించింది. ఆ వేళ కోడికూసింది మొదలు చింతామణి లీలాశుకుణ్ని లేపడం మొదలుపెడితే సూర్యోదయమైన గడియకి ఎలాగోలేచాడు. "తండ్రి కడుపున చెడబుట్టావు" అంటూ అతణ్ని మందలించి – "ఇవాళ ఈయింటికి రాకూడదు సుమా!" అనిమళ్ళీ హెచ్చరించి పంపింది. అతను బలవంతంగా ఆ పురోహితుడి వెంట వెళ్ళాడు. అప్పటికే ఆలస్యమయిందని కోపగిస్తున్న పురోహితుడితో – "మంత్రంలో ఏమీలేదు. తంత్రం ఆచార్యులు కల్పించింది. బ్రాహ్మణులు భోజనం చేస్తే చాలులే" అన్నాడు లీలాశుకుడు. అన్ని తతంగాలూ పురోహితుడే జరిపాడు.

సాయంకాలం అయ్యేసరికి లీలాశుకుడి పరితాపం ఎక్కువ యింది. రాత్రి పదిగడియలవరకూ అంగళ్ళు తిరుగుతూ ఎలాగో గడిపాడు. చింతామణి ముఖం చూడకుండా ఉండలేననుకుంటూ దానియింటికి దూరంగా నిలుచుని అటువేపు చూడసాగాడు. అప్పుడు ఏదో ఆలోచనవచ్చి పురోహితుడి ఇంటికి పోయి కొన్ని వంటకాలు మూటకట్టుకుని తిన్నగా చింతామణి ఇంటికి పోయాడు.

ఆ యింటి తలుపులు మూసి ఉన్నాయి. ఎవరిని పిలిచినా పలకలేదు. అతనా యింటిచుట్టూ ముమ్మారు తిరిగాడు. అప్పుడొక తెల్లతాచుపాము పశువులసాలలోని ఎలకలని తిండానికి గోడెక్కుతూంటే అది అతని కంటికి జనపనారతాడులా కనిపించింది. మనస్సంతా చింతామణే నిండిన అతను దానిని పట్టుకుని గోడ ఎక్కి లోపలికి దుమికాడు. ఆ పాము సగం తెగి అతని చేతిలోకి వచ్చింది. అతనేమీ చూడకుండా దీనిని అక్కడ పారేసి చింతామణి గదిలోకి వెళ్ళాడు. దానిమంచం దగ్గర నిలబడ్డాడు.

ఆమె దిగ్గున లేచి – "ఛీ! నీచా! నీ చెడుబుద్ధి వదిలావు కావు. నీకు తలుపులెవరు తీశారు? ఒక్కరాత్రికే తాళలేవా? రేపుఎక్కడికి పోతుంది? ఈ తుచ్ఛశరీరం కోసం ఇంత కాంక్షా! నీవల్ల నేను కూడా పాపం సంపాదించుకుంటాను" అని కసిరింది. అతనామె పాదాలమీద శిరసానించి – "చింతామణీ! నువ్వు చెప్పిన మాటలన్నీ జ్ఞాపకం ఉన్నాయి. కాని ఎంత ప్రయత్నించినా మనసు మరలలేదు. ఏం చేసేది? నిన్ను చూడకుండా నిముషం ఉండలేను. నన్ను చంపేస్తే చంపెయ్" అన్నాడు దీనంగా.

"వెర్రివాడా! నీకింత మోహం ఏమిటి? వస్తుతత్వం తెలుసుకోలేక పోతున్నావు. అవతల గదిలో పడుకో" అందామె. "చింతామణీ! నీకోసం పిండివంటలు తెచ్చాను. నానోటి కేదీ రుచించలేదు. నువ్వుతింటే నామనసు చల్లబడుతుంది" అంటూ ఆ మూట ఆమె ముందు పెట్టి దీపం తెచ్చాడు. ఆ వెలుగులో ఆమె ఆ మూటకీ, అతని బట్టలకీ అంటిన రక్తం చూసి – "అయ్యా! ఈ రక్త మేమిటి? పాముపొర ముక్కలు న్నాయేమిటి?" అంది భయంగా.

అప్పు డతను ఆలోచించి – "గోడమీద వేలాడుతున్నది తాడు అనుకున్నాను. పాముకాబోలు" అన్నాడు. ఎక్కడుందో చూపమంటూ ఆమె దీపం పట్టుకుని బయలుదేరింది. 'కామాంధులికి ఏమీ కనపడదు. ఇతనికి ఈ జన్మలో వివేకం కలగదు. వీని మూలాన నేను కూడా చెడిపోతున్నాను' అనుకుందామె. "పాము చస్తే విచారిస్తావేం? లోపలికి పద. మన్మథానందం పొందుదాం. కోపగించకు. ఈ రాత్రి నా శరీరం నిలవదు" అన్నా డతను.

"మంచంమీద కూర్చో స్నానం చేసివస్తాను" అని ఆమె అవతలికి పోయింది. అతను నిముషమొకయుగంగా ఎదురు చూడసాగాడు. అప్పుడు – శరీరం నిండా బూడిద పూసుకుని జుత్తు చెరుపుకుని..అలంకారాలు కాని వస్త్రాలు కాని లేకుండా...దిగంబరంగా... వికృతంగా చింతామణి వొచ్చి అతని ముందు నిలుచుంది.

"లీలాశుకా! ఇటుచూడు నవరంధ్రాలు కల తోలుబొమ్మ లాటి దేహంకోసం నీకంత తహతహ ఎందుకు? వస్తుతత్వం తెలిసిన వారికి

మోహం కలగదు. మలమూత్రాలతో ఉండే శరీరం మీద మోహమెందుకు? ఇది వొట్టి తోలుబొమ్మ. దేముడు దయతో చర్మం కప్పాడు కాని లేకుంటే నెత్తురు మాంసం ... వాటిమీద ముసిరే ఈగలు, క్రిములు..అంతేగా? అంటూ వైరాగ్యం ఉపదేశించేసరికి లీలాశుకుడు మంచం మీంచి ఉరికి అమె పాదాల మీదపడి "తల్లీ! నమస్కారం. నీ ప్రవచనాలవల్ల నా మొహం మాయమైంది. బుద్ధి వికసిస్తూంది. ఈ తుచ్ఛభోగాలు వొద్దు ... నాకునువ్వు సరయిన దృష్టిని కలిగించినందుకు చాలా కృతజ్ఞుడిని. జ్ఞానవంతురాలివయిన నువ్వు నాకు గురువుని చూబించు" అన్నాడు. అతనికి విరక్తి కలిగిందనీ, ఉపదేశానికి ఇదే సమయమనీ భావించి ఆమె – "గంగాతీరంలో నా గురువు ఉన్నాడు. ఎప్పుడూ జపం చేసుకుంటూ ఉంటాడు. అతని నామధేయం సోమగిరి, అతని పాదాలు పట్టుకుని వేడుకుంటే తప్పకుండా దయదలచి ముక్తిమార్గం బోధిస్తాడు. ఇప్పుడే బయలుదేరు" అంది.

ఆమె చెప్పిన గుర్తులద్వారా లీలాశుకుడు ఆయోగి వద్దకుపోయి తనవృత్తాంతమంతా చెప్పుకోగా ... అందుకు కారణం పూర్వజన్మ కృతమేఅని తలచి సోమగిరి అతనికి ఒక మంత్రం ఉపదేశించి దానిని శ్రద్ధగా జపించమన్నాడు. లీలాశుకుడు ఆ మంత్రానికి చింతామణి అనిపేరుపెట్టి గంగాతీరంలో కూర్చుని, నిద్రాహారాలు మాని తదేక దీక్షతో జపించసాగాడు. 'పదిరోజుల లోగా పరమాత్మ ప్రత్యక్షమవకపోతే ప్రాణత్యాగం చేస్తాను' అని ప్రతిజ్ఞపూనాడు.

పదవరోజు చివర్న శిరంమీద నెమలిఫింఛం, చిన్నబొజ్జ, పసిడి గజ్జెల మొలతాడుతో, మురళి వాయిస్తూ నల్లటి బాలుడొకడు అతని వద్దకు వచ్చాడు. వాడు గజ్జెలు ఘల్లుమనేలా నాట్యంచేస్తూ, లీలాశుకుడి చెవిలో మురళీనాదం వినిపించేసరికి అతను అదిరిపడి కళ్ళు తెరిచి ఎవరూ కనపడక కళ్ళుమూసుకుంటే కృష్ణుడు అతనికి ఎన్నో లీలలు చూబించాడు.

ఆ ముద్దుకృష్ణుణ్ని అతను కనపడిన విధాలనీ వర్ణిస్తూ లీలాశుకుడు నాలుగువందల శ్లోకాలు రచించి స్తుతించాడు. వాటికే శ్రీకృష్ణకర్ణామృతాలనిపేరు.

# కాశీ మజిలీ కథలు

## 145 వ. మజిలీ

### అగ్నిశిఖుడి కథ

చిత్రసేనా! చింతామణి ఉపదేశం వల్లనేకదా లీలాశుకుడు పరమభక్తాగ్రే సరుడయ్యాడు? ఆమె తనకులంలో చాలాపేరుపొందింది." అన్నాడు గోణికాపుత్రడు.

చిత్రసేన పరమానందభరితురాలై– "మహాత్మా! చింతామణి ఉదంతం చాలా సంతోషం కలిగించింది. మరి – లీలాశుకుడు విరక్తుడయ్యాక చింతామణి ఏం చేసింది? వాళ్ళిద్దరూ మళ్ళీ ఎప్పుడేనా కలుసుకున్నారా! అది వినాలని ఉంది. వివరిస్తారా?" అని కోరింది.

"శ్రీకృష్ణుడి దయకుపాత్రుడైన లీలాశుకుడు మళ్ళీ చింతామణి ఇంటికి రాలేదు. చింతామణి కూడా అతను ఉత్తముడై భగవంతుణ్ని ఆరాధిస్తున్నాడని విని సంతోషించి, తననిచూస్తే మళ్ళీ అతని మనసు చంచలమౌతుందేమో అని ఎన్నడూ అతని దరిదాపులకి పోలేదు. ఆవేళ రాత్రి అతనికి విరక్తి కలిగించడానికి అలాటి వికృతవేషం వేశాక మరెప్పుడూ ఆమె అలంకారాలు ధరింపలేదు. ఆవేళరాసిన బూడిదనే స్థిరపరచి కాషాయబట్టలు కట్టుకుని తన ఆస్తి అంతటినీ సత్కార్యాలకు ఇచ్చేసి విరక్తితో తిరగసాగింది.

అగ్నిశిఖుడనే యతీశ్వరుడు ప్రయాగలో వ్యాసమఠంలో నివసిస్తూ గంగాస్నానాలు చేస్తూ తపస్సు చేసుకుంటూ మఠానికి వచ్చి కందమూలాలు తిని కాలక్షేపం చేస్తున్నాడు. ఆత్మావలోకనంలో కాలం గడుపుతున్న ఆయోగి వద్దకు వచ్చి చింతామణి అతని పాదాల మీద పడింది. "మహాత్మా! నాకు విజ్ఞాన ప్రవృతిఎరింగింపుడు." అని వేడుకుంది. అతనికి బాహ్యదృష్టి లేకపోడంతో తనధ్యానాని కనుగుణమైన

- "దేహంయొక్క అంతమందు మనస్సు ఎలాటి గతిననుసరిస్తుందో అలాటి గతివస్తుంది." అన్నవాక్యం పలికారు. చింతామణికి ఆ సమాధానం సరిపడలేదు. ఆమె అలాఅనగా "విధించబడిన కర్మఫలం అనుభవం వల్లకాని నశింపదు-" అని పలికాడు. అప్పుడు - "మీమాటలు ఒకదానికొకటి సందర్భంగా లేవు." అంది. అతను తనధ్యానంలోనే - "బుద్ధిః కర్మానుసారిణీ." అన్నారు. అది చాలా సామాన్యమైన మాటగా అనిపించిం దామెకి." సరిగా చెప్పండి." అని ఆమె ప్రార్థించింది. అతనామె మాటల కందని స్థితిలోనే -" యోగినాం భోగినామపి. (యోగులు భోగులుకూడా) అన్నారు. దానితో అతను తనని అవమానించాడని ఆగ్రహించింది చింతామణి. నిర్మలమైన ఆమె మనస్సు కలుషితమయింది. ఎలాగేనా అతన్ని వంచించాలని సంకల్పించుకుని అతనితో మరి మాట్లాడక ఇంటికి పోయింది. మనిషి-దానాలూ, ధర్మాలూ, జపాలు ఏవయినా చెయ్యొచ్చుకాని మనసుకంటి ఉన్న అభిమానం వొదలలేరు కదా.

# మాతంగుడి కథ

ప్రయాగకు ఉత్తరంగా క్రోసుదూరంలో ఒక మాలపల్లె ఉంది. అక్కడ మాతంగుడనే మాలవాడు భార్యతో కాపరం చేసేవాడు. వాడు నిత్యమూ సూర్యోదయం వేళ గంగలో మునిగి సూర్యుడికి మొక్కి ఇంటికి వొచ్చి నామాలు పెట్టుకుని గుడిసెలో ఒకమూల వేదికమీద దేవతగా నిలిపిన మట్టి విగ్రహాన్ని పూజించి తరువాత కులవృత్తి చేసుకునేవాడు. వాని భార్యకూడా నిత్యమూ శుచిగా ఉంటూ - భర్త గంగకి వెళ్ళి వొచ్చేసరికి గుడిసె చుట్టూనూ, వేదికా అలికి ముగ్గులు పెడుతూంటుంది. పంది, కోడి, కుక్క లాటి నీచ జంతువులు రాకుండా చూస్తుంది.

ఒకనాడు మాలిని భర్తతో - "మనకులం వాళ్ళందరికీ సంతతి ఉంది. మనం మాత్రమే లేనివారం. నువ్వుకుల విరుద్ధంగా స్నానాలూ

జపాలు అవీ చేయడం వల్లనే సంతానం కలగడం లేదంటున్నారు. తండ్రితాతలకి లేని నియమాలు మనకెందుకు? మానెయ్యకూడదా?" అంది.

అతను నవ్వుతూ – "వెర్రిదానా! మనం పెట్టి పుట్టలేదంతే. స్నానాలూ పూజలూ బిడ్డల కడ్డుపడతాయా? కులంవారు తెలియక అనే మాటలని పట్టించుకోకు." అన్నాడు.

మరొక రోజు ఆమె భర్తతో – "మొన్న ఒక నూని గుడ్డలవాడు తంబుర మీటుతూ బిచ్చానికి రాగా తోటికోడలు నిర్బంధించడంతో మనకి పిల్లలు కలుగుతారా? అని శకునం అడిగాను. వాడు మంత్రాలు చదువుతూ నాచెయ్యిచూసి "నీకు గాలి సోకి పిల్లలు కలగకుండా అడ్డుపెడుతూంది. రక్షరేకు కట్టుకుంటే పుడతారు. కుంచెడు ధాన్యమిస్తే తాయొత్తు ఇస్తాను." అన్నాడు.

"రేపురా. అని పంపేశాను. మీరేంటారు?" అంది.

"బిచ్చగాళ్ళ మాటలు నమ్మకూడదు. నీకు కావాలంటే ఊళ్లోకి పోయి గొప్పవాళ్ళ నడిగి మంచి రక్షరేకులు తెచ్చిస్తాను. తొందరపడకు." అన్నాడు మాతంగుడు.

ఒకనాడు గంగాస్నానం చేసి, నామాలు దిద్ది, పూజలు చేసుకుని రక్ష రేకుకోసం త్రివేణికి పోతూంటే ఒక మాలదాసరి ఎదురుపడి – "ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు. మాతంగుడు – "నా భార్యకి గాలి సోకిందట. రక్షరేకు కోసం వెళ్తున్నాను. దాసరీ! నువ్వు అనేక దేశాలు తిరుగుతూ ఉంటావు. ఎందరినో ఎరిగి ఉంటావు. అలాటి వాళ్ళెక్క డున్నారు?" అని అడిగాడు. "ఎవరో ఎందుకు? నేనే కట్టగలను." అన్నాడు దాసరి.

"నీమాట సరే. త్రివేణిలో జపం చేసుకునే బైరాగుల నడిగితే ఇవ్వరా?" అన్నాడు మాతంగుడు.

'కాదు కాదు. నేనొకటి చెబుతాను విను. ఈ ప్రయాగలోనే పల్లవువీధిలో చింతామణి అనే భోగమావిడ ఒకామె కలదు. ఆమె విరక్తి

చెంది తన ధనమంతా దానాలు చేసి కాషాయ గుడ్డలు కట్టుకుని విరక్తితో తిరుగుతూంది. ఆమె చాలా జ్ఞాని అట. అక్కడికిపో. నీకు రక్షరేకు ఇస్తుంది." అని చెప్పాడు.

మాతంగుడు ఆమె యింటి ముందుకి వెళ్ళి కేక వేయగా చింతామణి వాకిట్లోకి వచ్చి - "నువ్వెవరివి? ఎందుకొచ్చావు?" అని అడిగింది. అతనామెకు నమస్కారాలు పెట్టి తన సమస్య గురించి చెప్పుకుని - "తల్లీ! నాకీ ఉపకారం చెయ్యి. పుట్టినబిడ్డకి నీ పేరు పెడతాను. నీకు దాసుడినై ఉంటాను." అని వినయంగా ప్రార్థించాడు.

ఆమె అతన్ని పరీశీలనగా చూసి - "మాతంగా! నీకు సంతానం కావాలా? ఐతే రక్షరేకుతో పనిలేదు. అమూల గంగలో జపం చేసుకుంటూ ఒక రుషి మిట్టమధ్యాహ్నం ఎండలో మఠానికి పోతూంటాడు. రేపు వొచ్చే వేసవిలో ఆయన మఠానికి వెళ్ళే తోవలో అక్కడక్కడ పాదరక్షలు ఉంచు. నీ పుణ్యవశాన అతను ఆ చెప్పులలో కాలు పెట్టాడో నీకు తప్పకుండా సంతతి కలుగుతుంది. రక్షరేకుతో పనిలేదు." అంది.

అతను ఇంటికిపోయి భార్యకి ఆమాట చెప్పి మూడు జతల పాదరక్షలు తయారుచేసి గ్రీష్మకాలంలో యోగి గంగనుంచి మఠానికి వెళ్ళే దారిలో అక్కడక్కడ ఉంచాడు. ఆ ఎండాకాలంలో వేడి గాడ్పులు వీస్తూంటే. నిప్పులు కురుస్తున్నట్లు ఎండ కాస్తూంటే ... నేల కాలిపోతూంటే - యోగి మఠానికి పోతూ కాళ్ళు కాలి పొక్కులెక్కుతూంటే చురుకుగా నడవలేక..ఒకచోట మాతంగుడు ఉంచిన పాదరక్షలను చూసి విధివశాన వాటిలో పాదాలు పెట్టి రెండు నిముషాలు నిలబడ్డాడు. పాదాలు చల్లబడ్డాయి. దానితో చెప్పులు వదలి మఠానికి పోయాడు. కాని అతనికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఆ పాద రక్షలగురించి ఆలోచిస్తూ - 'నేనొక తాపసినే. కొంచెం ఓర్చుకోలేక ఎవరో ఉంచిన పాదరక్షలను వాడుకుని రుణగ్రస్తుడి నయ్యానే. ఛీ! శీతోష్ణసహనంలేని నా తపస్సెందుకు?" అని విచారించాడు. మరణం వరకూ అతన్ని ఆశంక వదలలేదు. చనిపోతున్నప్పుడు కూడా అతనికి ఆ పాదరక్షలే మనసులో మెదిలాయి.

ఆ యతి మరణించిన కొన్నాళ్ళకి మాతంగుడు చింతామణి వద్దకు వచ్చి – "తల్లీ నీ దయవలన నాకులం వర్ధిల్లుతుంది. నాభార్య గర్భం దాల్చింది." అంటూ నమస్కరించాడు.

ఆమె కొంచెం ఆలోచించి – "చాలాసంతోషం నీకు మంచి కొడుకు పుడతాడు. నీభార్య నొప్పులు పడుతూంటే నాతో చెప్పు. వొచ్చి చూస్తాను." అని వ్యాసమఠానికి వెళ్ళి విచారించగా అగ్నిశిఖుడు మరణించినట్లు తెలిసింది. అప్పుడు ఆమె చాలా పశ్చాత్తాపపడుతూ 'నేను మహాపాపాత్మురాలిని. మహానుభావుడైన యతిని పంచముడి ఇంట్లో పుట్టిస్తున్నాను. నాజ్ఞానం కాల్చనా? నేను మనిషినేనా? అతను అవమానించాడని కోపగించాను. కోపమంటే పాపమే.' అని...ఇంటికి పోయి అతని జననానికి నెలలు లెక్కపెట్టసాగింది.

ఒకనాడు మాతంగుడు వచ్చి తన భార్య ప్రసవవేదన పడుతోందని చెప్పగా ఆమె వారింటికి వెళ్ళింది. అప్పటికే గడియకిందట మగశిశువు జన్మించాడు. పాలుతాగడం లేదని తల్లి దుఃఖిస్తూంది. చింతామణి ఆ బాలుణ్ని ఎత్తుకుని ముద్దాడి ఆకార లక్షణాలను పరీక్షించి యతే ఇలాపుట్టాడని నిశ్చయించి – "బాలుడా! నువ్వెవరివి?' అని అడిగింది.

"బాలికా! నేను యతిని."

"నువ్వు ఇక్క డెందుకు జన్మించావు?" ఆ బాలుడు ఆ వృత్తాంతం చెప్పి – "ప్రాణంపోయేక్షణాలలో బుద్ధి ఎలా ఉంటుందో అలాటి జన్మమే సంప్రాప్తిస్తుందని శాస్త్రాలు చెప్పాయి కదా?" అని కేరుమని ఏడవసాగాడు. ఆమె కన్నీరు కార్చుతూ – "తండ్రీ! వీళ్ళు అపవిత్రులని పాలు తాగడం లేదా! నిన్నిక్కడ పుట్టించి ఎంతపాపం చేశాను." అంది మెల్లగా.

మాతంగుడు – "అమ్మా! వీడు బతుకుతాడా? నువ్వు కూడా ఏడుస్తున్నా వేమిటి? నిజం చెప్పు. దేవతలకి మొక్కు. వీడి భారమూ బతుకూ నీవే." అని ఆమె పాదాలమీద పడ్డాడు.

"వీడి కేమీ భయంలేదు. మీ శిశువుకి తల్లి పాలు పడవు. ఆవుపాలు కావాలి. నేను వెళ్ళి తీసుకువస్తాను." అని ఆమె వెళ్ళ బోతుంటే

– "ఆవుపాలు మాయింట్లోనే ఉన్నాయి." అని అతను తెచ్చాడు. బాలుడు అవితాగలేదు. దానితో ఆ దంపతులు గొల్లున ఏడవసాగారు. చింతామణి ఆలోచించి, ఒక బ్రాహ్మణుని ఇంటికివెళ్ళి ఆవుపాలు తెచ్చిపొయ్యగా బాలుడు అవితాగి నవ్వాడు. మర్నాడు అక్కడినుంచే తెచ్చినా తాగక పోడంతో చింతామణి బాలుడి ఉద్దేశం అర్థంచేసుకుని రోజుకొక ఇంటినుంచి తానే తెచ్చి పోసేది. మాతంగుడు చింతామణి తనమీద దయతో బాలుడికి సేవలు చేస్తూందని ఆమెను గుర్విణిగానూ, దైవంగానూ భావించి స్తుతించేవాడు.

బాలుడు మెల్లగా పెరిగి పెద్దవుతూ బాలక్రీడలు చూపుతూంటే ఆ దంపతులు బ్రహ్మానంద పడిపోయేవారు. బాలుడికి అన్నప్రాశన చేయాలని చింతామణి ఒక విప్రుడి ఇంటినుంచి పాయసం తెచ్చి పెట్టబోయింది. ఆమె వాడి ఉద్దేశం గ్రహించి, "పాలూ, ఫలాలూ కాక వీడు మరేమీ తినడు. అవే పెట్టండి." అని అవే యివ్వసాగింది. వాడికి చింతామణి అని పేరు పెట్టారు. వాడిని బయటకు రానివ్వకుండా ఎప్పుడూ ఇంట్లోనే ఉంచి బంగారు మూటలా జాగ్రత్తగా చూసుకునే వారు. చింతామణి వచ్చి చూసిపోతూండేది. మాతంగుడు ప్రయాగలో నెలకొక రాత్రి గస్తీ తిరగ వలసిఉంది. అలా తిరక్కపోతే అతనికి రాసిచ్చిన మాన్యం లాక్కుంటారు. కనుక అత నెక్కడికి వెళ్ళినా ఆ రోజుమాత్రం ఊరిలో ఉండి తీరాలి. ఒకనాడు అతను తప్పనిసరి పనిమీద ఊరికి వెళ్ళి రాత్రికి ఇంటికి రావాలని బయలుదేరాడు. కాని, గంగానది పొంగి వాడి ప్రయాణానికి ఆటంకం కలిగించింది. నావ దొరకలేదు. మాన్యం పోతుందని వాడు చాలా విచారిస్తూ ఒడ్డున పడుకున్నాడు.

ఇంటిదగ్గర మాలిని దీపాలు పెట్టినా మగడు రాకపోడంతో మాన్యం పోతుందన్న విచారంతో అవతలికీ, ఇంట్లోకీ తిరగసాగింది. పొరుగింటి కెళ్ళి చూస్తూ కేకవేస్తూ..ఆరాటపడిపోతున్న తల్లిని చూసి – "అమ్మా! ఇవాళ నువ్వు బాబాకోసం పరితపిస్తున్నావేం? ఇవాళకాకపోతే రేపు రాడా?" అని అడిగాడు.

"మూడు తరాలనుంచీ గస్తీ మాన్యం మనకి జరుగుతూంది. ఇవాళ ఆపని చేయకపోతే మాన్యం పోతుంది." "గస్తీ అంటే ఏమిటమ్మా?"

"ప్రజలు నిద్రపోతూంటే రాత్రినాలుగు జాములూ నాలుగు వీధులకు, డప్పు వాయిస్తూ పోయి ఇంట్లో దొంగలు దూరి వస్తువులు దొంగిలిస్తారు, జాగ్రత్తగా ఉండండో - అని కేకలు పెట్టిలి. ఇదే గస్తీ అంటే." అని చెప్పిందామె.

"ఈ పాటి పని నేను చెయ్యలేనా? నన్ను పంపించు. విచారిస్తావేం?"

"అయ్యో! తండ్రీ! నువ్వు ఇల్లు కదిలి ఎరగవు. చీకటిలో కొత్త వీధులకు పోయి ప్రజల నెలా మేల్కొలుపుతావు? జడుసుకున్నావంటే భూతాలు సోకుతాయి. మాన్యం పోతేపోనీ కాని నీకా పనివొద్దు." "నాకేమీ భయంలేదు. డప్పువాయించగలను. ఏవీధులకు వెళ్ళాలో గుర్తులు చెప్పు." "నీకు అలాటి ఉద్దేశం ఉంటే డప్పు పట్టుకుని నీతో వొచ్చి వీధులు చూపుతాను.కేకవెయ్యగలవా? "అది చాలు - నువ్వునాతో ఉండి వీధులు చూబించు. నేను డప్పుకొట్టి గట్టిగా కేక వేస్తాను." అంతే చాలనుకుని మాలిని ఆ రాత్రి కోటలో పదిగంటలు కొట్టడంతో పిల్లవాణ్ని ఒక చంకలో ఎత్తుకుని మరోచేత్తో డప్పు పట్టుకుని బయలుదేరింది. తాను నడవగలనన్నా పిల్లవాణ్ణి ఆమె నడవనిచ్చింది కాదు. చామె మొదట తూరుపు వీధికి వెళ్ళి తానే డప్పు వాయించి అతన్ని కేకవెయ్యమంది. ఆ బాలుడు -

"జనులారా! కామక్రోధ లోభమోహం మొదలైన ఆరుగురు దొంగలు మానవ శరీరమనే ఇంట్లో తిరుగుతున్నారు. వాళ్ళు జ్ఞాన రత్నాన్ని హరిస్తారు. కనక జాగ్రత్తగా ఉండండహో!" అనికేకవేశాడు. అది విని ఆమె - "బాబూ! నేను చెప్పినట్లు కాక మరేదో చదివావేం? ఈ చదువు నీకెక్కడి నుంచి వచ్చింది? కొత్తమాటలు చెప్పకూడదు. 'దొంగలు పడతారు, మేలుకొని ఉండండి.' అనే చెప్పాలి. అంది. అదే చెప్పాను అన్నాడు బాలుడు.

రెండవ జాములో ఆమె అతన్ని దక్షిణపు వీధికి తీసుకుపోయి ఒకచోట నిలబడి దప్పుకొట్టింది. అక్కడ చింతామణి – "తల్లితండ్రులు, అన్నదమ్ములు, భార్యాపుత్రులు, ధనం, గృహం, పశువులు మొదలైనవన్నీ అశాశ్వతాలు. వాటిని నమ్ముకోక శాశ్వతమైన వస్తువులను తెలుసు కుందుకు మేలుకుని ఉండండి" – అని అర్థంవొచ్చే సంస్కృతశ్లోకం చదివి అర్థం చెప్పాడు. "పుత్రా! కొత్త మాటలాడుతున్నావు. రాజుగారి వల్లమాట వొస్తుంది సుమా!" అని తల్లి మందలించినా మూడవ జాములో పడమటి వీధిలో దప్పు కొట్టాక – "జనన మరణ దుఃఖాలు ... భార్యాపుత్రులుతో కూడిన సంసారసాగరం దుఃఖప్రదమయింది. (జన్మదుః ఖం, జరాదుఃఖం, సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత)" అనే అర్థం వొచ్చే శ్లోకం చదివాడు.

నాలుగోజామున ఉత్తరపు వీధిలో – "లోకంలో తనకి దినదినమూ ఆయువు క్షీణిస్తూందని తెలుసుకోలేక ఆశచేత కట్టబడి గొప్పగొప్ప పనులు చేయడానికి మనిషి ప్రయత్నిస్తాడు. మృత్యుదేవత ఎప్పుడో హటాత్తుగా వచ్చి గుటుక్కున మింగేస్తుంది. కనక ఆ విషయంలో జాగ్రత్తగా మేలుకుని ఉండండి. (ఆశయా బధ్యతే లోకో కర్మణా బహుచింతయా ఆయుక్షీణం నజానేతి తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త)" అని చదివాడు. అలా చెప్పినందుకు ఏంమూడుతుందో అని భయపడుతూనే తల్లి అతన్ని ఇంటికి తీసుకుపోయింది.

ఆ పట్నపు రాజు మొదటి జాములో చల్లగాలిసేవిద్దామని మేడపైకి వచ్చాడు గస్తీ తిరుగుతున్నవాడు చదివిన –

"కామఃక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః.

జ్ఞానరత్నాపహారేణ తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త." అనే శ్లోకం వినపడింది. అతను ఆశ్చర్యపోయి మేలుకుని ఉండి రెండవ జాములో చదివిన – "మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరః అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత." అన్న శ్లోకమూ విన్నాడు. మూడునాలుగు జాములలో చదివినవి కూడా విన్నాడు.

'గస్తీ తిరిగేవాడికి వైరాగ్య శ్లోకాలు ఎలా వొచ్చాయి?' అని సంతోషిస్తూ మర్నాడు ఉదయం – "రాత్రి గస్తుతిరిగిన మాలవాడిని తీసుకురా." అని భటుడిని పంపాడు.

రాజభటుడు మాలపల్లెకు పోయి – "రాత్రి గస్తుతిరిగిన వాడెవడు?" అని వాకబు చేస్తూ మాతంగుడి ఇంటికి పోయాడు. అతను అప్పుడే ఊరినుంచి వచ్చాడు. రాత్రి జరిగినది భార్య చెబుతూంటే విన్నాడు. అంతలో భటుడి కేక వినపడింది.

"రాత్రి గస్తుతిరిగినవా డెవడు? ఇటురా."

"నేనే బాబూ!" అంటూ మాతంగుడు అతనిముందుకు వెళ్ళాడు.

"నీకోసం మాలపల్లి అంతాతిరిగాను. పద. రాజుగారు పిలుస్తున్నారు."

"ఎందుకో తెలుసా బాబూ?"

"అదేమీ నాకు తెలియదు. నడువు." అంటూ భటుడు అతనిని రాజుముందు ప్రవేశపెట్టాడు. రాజు అతన్ని పరిశీలనగా చూశాడు. "రాత్రిగస్తు తిరిగినవాడివినువ్వేనా?"

**మాతంగుడు** : నేనే ప్రభూ.

**రాజు** : ఎంతకాలం నుంచి గస్తు తిరుగుతున్నావు?

**మాతంగుడు** : నలభయ్యేళ్ళనుంచి ప్రభూ.

**రాజు** : నిజం చెప్పు. రాత్రి నువ్వే తిరిగావా? (గద్దించాడు)

**మాతంగుడు** : (వణుకుతూ) తప్పు చేశాను స్వామీ! మన్నించండి. నది ఆటంకం వల్ల నేను రాత్రి ఇంటికి రాలేకపోయాను. మాన్యం పోతుందని మా ఆడది బిడ్డ నెత్తుకుని గస్తు తిరిగిందట. వాడు ఏం తప్పుచేశాడో తెలియదు. లేకలేక కలిగిన బిడ్డ ఆ శిక్షనాకు వేసి వాడిని కాపాడండి. (అంటూ ఏడుస్తూ రాజుకి మోకరిల్లాడు)

**రాజు** : (నవ్వుతూ) రాత్రి గస్తు తిరిగిన వాడు నీకొడుకా! వాడి కెన్నేళ్ళున్నాయి?

మాతంగుడు : ఎనిమిదోయేడు ఇంకా వెళ్ళలేదు ప్రభూ.

రాజు : నువ్వు పోయి వాడిని తీసుకురా. వెళ్ళు.

మాతంగుడు : (ప్రాధేయపడుతూ) తండ్రీ! ఆ శిక్షనాకు విధించండి. కుర్రాడు తెలియక తప్పుచేశాడు.

రాజు : వాడు మా శిక్షలు పడేవాడు కాదు. వాడే మమ్మల్ని శిక్షిస్తాడు. తీసుకురా.

మాతంగుడిని మరేమీ మాట్లాడనివ్వక రాజభటులు అవతలికి గెంటుకు పోయారు. అతను ఇంటికి వెళ్ళి – "నీమూలానే ఇంత ముప్పొంచ్చింది. మాన్యం పోతే పోతుంది కాని ముక్కు పచ్చలారని పిల్లాణ్ని తీసుకుని అర్ధరాత్రి ఊరంతా తిప్పుతావా? వీడిమాటలకి రాజుగారికి చాలాకోపం వచ్చినట్లుంది. వాడే మమ్మల్ని శిక్షిస్తాడని వెటకారమాడేరు." అని చిరాకు పడ్డాడు.

మాలిని చింతామణిని పట్టుకుని గొల్లున ఏడిచింది. "బాబూ! నేను చెప్పినట్లు కేకవేయక నువ్వు ఏదో చదివావు. రాజుగారికి కోపం వచ్చి నీకు శిరచ్ఛేదం విధిస్తారట విన్నావా?" అంది.

అతను నవ్వుతూ – నేనేం తప్పు చేశానని రాజు శిక్షిస్తాడు? నేనన్న మాటలు నువ్వే విన్నావు కదా. భయపడకండి." అన్నాడు ధైర్యంగా, రాజకింకరుడు తొందరచేయగా కుమారుణ్ని తీసుకుని వాళ్ళు రాజువద్దకు వెళ్ళారు. వెండిమురుగులు గజ్జెల మొలతాడు, గోచి ...ముఖంమీద చుక్క ...ముద్దుగా ఉన్న ఆ బాలుణ్ని చూసి – ఇంత చక్కనివాడు, లోకాల నేలగలిగినవాడు ఛండాలకులంలో ఎందుకుపుట్టాడా – అని ఆశ్చర్య పోయాడు రాజు. గతజన్మలో ఎవరో యతియై వుంటాడను కున్నాడు.

అతను ఆబాలుడి దగ్గరకు వెళ్ళి – "రాత్రి గస్తుతిరిగినది నువ్వేనా?" అని అడిగాడు. చింతామణి ఔనన్నట్లు తలూపాడు. "నువ్వేం చదువుకున్నావు? నీ ఉపాధ్యాయుడు ఎవరు?" అని రాజడిగితే ఏమీ జవాబు చెప్పలేదు. ఏమీ చదువుకోలేదని మాతంగుడు చెప్పాడు.

రాజు : మాతంగా! నీకు పిల్లలెందరు?

మాతంగుడు : వీడొక్కడే. చింతామణి కృపవల్ల కలిగాడు.

రాజు : చింతామణి ఎవరు?

మాతంగుడు : భోగం ఆవిడ మాకు తెలిసినది.

రాజు : ఏం చెప్పిందావిడ?

మాతంగుడు : (ఆ వృత్తాంతం చెప్పాడు)

రాజు : వీడు మాంసం తింటాడా?

మాతంగుడు : చింతామణిగారు తెచ్చే పాలు, పళ్ళు తప్ప మరేమీతినడు.

రాజు ఆ మాటలకి చాలా విచారించి పళ్ళెంలో వెయ్యి దీనారాలుంచి "నీకు..రాత్రి గస్తు తిరిగినందుకు పారితోషికంగా ఇస్తున్నాను. తీసుకో." అంటూ అందించాడు. ఆ బాలుడు తీసుకుని "అమ్మా! నేను మొయ్యలేకపోతున్నాను. తీసుకో." అని తల్లికి అందించాడు. వాళ్ళు ఆనందంగా ఇంటికి వెళ్ళారు. బిడ్డకి దృష్టి తీసిపడుకోబెట్టే సరికి చింతామణి వచ్చి, జరిగిందివిని, "మాతంగుడా! ఎంతపని చేశావురా!" అంది. వాళ్ళు – "ఇదంతా నీ అనుగ్రహమే" అని ఆమెను పొగిడారు. మాతంగదంపతుల పుత్ర ప్రేమను తలుచుకుని చింతిస్తూ, యతి సత్తముడు బంధవిముక్తు డౌతాడని సంతోషించి – "బాలు డెక్కడ?" అని అడిగింది. అతన్ని పడుకోబెట్టిన గుడిసె చూబించారు.

చింతామణి వేగంగా వెళ్ళి ..."బాబూ! నిద్రపోతున్నావా? మాట్లాడవేం? యోగనిద్రా?" అంటూ ఎంత పిలిచి పలకరించినా వాడు పలకలేదు.

అప్పుడామె – "మహాత్మా! స్వస్వరూపం ధరించావా! అయ్యో! నీ వల్ల మంచిమాటలు ఎన్నో వినాలనుకున్నాను. ఎంతో ఆశపడ్డాను. ఈ దుర్మార్గురాలితో ఇక మాట్లాడవా?" అని దుఃఖిస్తూంటే మాతంగ దంపతులు – "అలా దుఃఖిస్తున్నా వేమిటి? నాయన లేవ......లేదా?" అన్నారు.

ఆమె – “ఇంకెక్కడి నాయన? మీ ముద్దుల నాయన పరమ పదించాడు. వాడినుంచి ఏదీ తీసుకోవద్దని చెప్పలేదా? రాజు వాడికిచ్చిన కానుకలు ఎందుకు తీసుకున్నారు? మీరుణం తీరిపోయింది. వాడి దారిన వాడు పోయాడు.” అంది. ఆఛండాల దంపతులు గుండెలు బాదుకుంటూ.. వాడు చనిపోయాడని బిగ్గరగా ఏడవసాగారు. చింతామణి వారితో కొంతసేపు విలపించి. వాళ్ళ నూరడించి – “అతను మహర్షి పాదరక్షలమూలంగా మీ యింట్లో పుట్టాడు. మీరుణం తీర్చుకుని ముక్తుదయ్యాడు.” అంటూ ఆ వృత్తాంతం చెప్పింది. వాళ్ళు విరక్తి చెంది తీర్థయాత్రలకి పోయి ముక్తి చెందారు.

చింతామణి ఆ బాలుడు చెప్పిన నాలుగు శ్లోకాలలోనూ ప్రస్థానత్రయంలోని తాత్పర్యం ఉండడం వల్ల వాటినే స్మరించుకుంటూ మహాయోగిని ఐ దేశపర్యటనం చేస్తూ ముక్తురాలయింది.

చిత్రసేనా! వేశ్య అయినా చింతామణి వైరాగ్య బుద్ధితో ఎలా ప్రవర్తించిందో చూశావా? ఎంత జ్ఞానవంతురాలయిందో తెలుసు కున్నావా?” అన్నాడు గోణికాపుత్రుడు.

ఆ వృత్తాంతంవిని చిత్రసేన, రతిమంజరి పరమానంద భరితులయ్యారు.

మణిసిద్ధుడు శిష్యుడితో తరవాత మజిలీలో ఇలా చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 146 వ. మజిలీ

### ఢాకినీదేవత కథ

ఒకనాడు మతంగయోగిని ఇద్దరు రాజభటులతో వెళ్తూ - "దూతలారా. మన మహారాజుగారి దేశపు హద్దు సమీపిస్తూంది. వాళ్ళు ఈ పాటికి దేశందాటిపోతారేమో. పరదేశంలో మనం వాళ్ళని పట్టుకోవచ్చునా?" అని అడిగింది.

అందుకు రాజభటులు - "దేవీ! మనం ఇతర దేశంలో వాళ్లని పట్టుకోకూడదు. అక్కడి అధికారులకి మనరాజశాసనం చూబించి వారినుంచి మరో శాసనం తీసుకుంటే అప్పుడు మనం వారిని పట్టుకోవచ్చు వెనకటి గ్రామస్తులు చెప్పిన దానిని బట్టి వాళ్ళు ఇంకా మనదేశం దాటిపోరు. నువ్వు వేగంగా నడవలేకపోతూండడం వల్ల ఆలస్యమౌతూంది. మేమే ఐతే ఈపాటికే వాళ్ళని పట్టుకునే వాళ్ళం." అన్నారు. ఆమెను వేగం నడవమని జాము పొద్దువేళకి ఒక పల్లెచేరారు. అక్కడివారిని "పురుషవేషాలు ధరించిన ఇద్దరు చక్కని స్త్రీలతో పోతున్న బ్రాహ్మణుడు కనిపించాడా?" అని అడిగారు.

"వారు స్త్రీలా! పురుషులు అనకున్నాం. ఇంతకు ముందే ఈ వూరు దాటిపోయారు. బండిమీద పోతున్నారు." అన్నారు వారు. రాజభటులు ఆ గ్రామాధికారికి, రాజశాసనం చూబించి కొందరిని సాయంగా తీసుకుని వేగంగా పోయి క్రోసుదూరంలో వాళ్ళని కలుసుకుని బండికిఅడ్డంగా నిలబడి "ఆగండి." అని నిరోధించారు.

గోణికాపుత్రుడు బండిదిగి - ముందరికి వచ్చి - "మీరెవరు? మమ్మల్నెందు కాపారు? అని అడిగాడు. "పాటలీపుత్ర వాస్తవ్యురాలయిన

రతినూపుర అనే వేశ్య తన పుత్రికలను విలువగల వస్తువులతో తనకి తెలియకుండా నువ్వు తీసుకుపోతున్నావని నీమీద నీదేశప్రభువైన విపులుడికి ఫిర్యాదు చేసింది. నీ నేరాన్ని విచారించడానికి మిమ్మల్ని పట్టుకుని తెమ్మని మారాజు ఆజ్ఞాపత్రిక ఇచ్చాడు. ఇదిగో. చదువుకో." అని ఇచ్చారు.

అతను అది చదివి నవ్వుతూ – "మీరాజు న్యాయవిధానం గొప్పది. ఇదంతా మతంగయోగిని కల్పితం. రాజశాసనానికి బద్ధులం కావలసిందే. అలాగే వొస్తాం, పదండి." అని బండిని వెనక్కి తిప్పమన్నాడు.

అంతలో మతంగయోగిని అక్కడికి వచ్చి – "దొంగలు దొరికారా? సరే. వీళ్ళు వేషాలు మార్చి తిరుగుతున్నారు. జాగ్రత్తగా తీసుకెళ్ళాలి." అంది గంభీరంగా.

గణికాపుత్రికలు ఆమెని చూసి "మాయవివై, కపట యోగినివై తిరుగుతున్న నువ్వు మోసకత్తెవి కాని మేము కాదు. మేము ఎవరిసొమ్ము తీసుకురాలేదు. రాజు మమ్మల్ని అన్యాయంగా శిక్షించాలనుకుంటే పైన దైవం లేదా? ఇదంతా నీ కల్పనే." అన్నారు.

మతంగయోగిని పురికొలపగా రాజభటులు కోపంగా – "చాలు చాలు. మాట్లాడకండి. ఇంటిదగ్గర సుఖంగా ఉండలేక, తల్లిమాట వినక బోడిబాపనుణ్ని తగులుకుని పోతూ ఏమో అరుస్తారేం? పదండి. మీపాట్లు ముందున్నాయి. ఇప్పటికేనా ఇతన్ని వదిలి మీ తల్లి చెప్పినట్లు వింటే బతికి పోతారు." అంటూ విచ్చుకత్తులు తీసి బెదిరించారు.

గోణికాపుత్రుడు వాళ్ళమాటల కడ్డమొచ్చి – "మీకేమీ చెప్పక్కర్లేదు. రాజు వద్ద వారు చెప్పుకుంటారు. అన్యాయముంటే శిక్షిస్తాడు. మీకా గొడవెందుకు? పదండి." అన్నాడు.

ఆ మాటలకు కోపగించిన రాజభటులు అతనికి సంకెళ్ళు వేయబోగా గ్రామాధికారులు వచ్చి అతను మహాపండితుడని, తమది బాధ్యత అనీ వారించారు. వారి వీణలు మొదలయినవి పల్లెలో వుంచి స్త్రీల నిద్దరినీ బండిలో ఎక్కించి గోణికాపుత్రుడిని వెనకనడిపిస్తూ విచ్చుకత్తులకాపలాలో నడవసాగారు.

ఒకనాడు అరణ్య మార్గంలో పోతుండగా మతంగయోగిని – "భటులారా! రాజు మీతో నేను చెప్పినట్లు చెయ్యమన్నాడు కదా? ఈ ప్రాంతంలో ఢాకినీదేవి ఆలయం ఉంది. ఆ మహాదేవిని దర్శించి పోదాం. కార్యం సఫలమౌతుంది." అని వారిని ఆదారిన మళ్ళించి ... ఆలయానికి కొంచెం దూరంలో బండి ఆపించి ... రాజభటులతో ఏకాంతంలో "నేను మహారాజు కోసం వీళ్ళలో ఒకరిని కూర్చడానికి ఇంత ప్రయత్నం చేశాను. రాజు పెద్దదానిని తాను తాసుకుని చిన్నదానిని నాకు వదలడానికి అంగీకరించాడు. నేను చిరకాలం నుంచీ ఢాకినీ దేవతను ఆరాధిస్తున్నాను. చక్కని వేశ్యాపుత్రికను బలియిస్తే నాకాదేవత వరాలిస్తుంది. అందుకే విశ్వప్రయత్నం చేశాను. మీ దయవల్ల నాకోరిక తీరుతుంది. రాజు మీకంటె ఎక్కువచుట్టం కాదు. ఈ బ్రాహ్మణుడు చాలా గట్టివాడు. రాజు వద్దకు తీసుకుపోతే తన పాండిత్యంతో అతని మనసు మార్చెయ్యగలడు. కాబట్టి ఇప్పుడే మనం మన అభీష్టం నెరవేర్చుకుందాం.

మీరిద్దరూ రంభలాటి పెద్దదాన్ని తీసుకుపోయి దానిని పొంది ఆనందించండి. చిన్నదాన్ని నాకివ్వండి." అని బోధించింది. వాళ్ళు చిత్రసేన సోయగం తలచుకుని – ఆనందంగా అంగీకరించారు.

"ఈ ఆడవాళ్ళు ముగ్గురూ దగ్గరున్న అమ్మవారి గుడికి వెళ్ళి వస్తారు. నువ్వు ఇక్కడ ఉండు." అని రాజభటులు అనేసరికి – "ఢాకినీ దేవిని మేము మాత్రం అర్చించకూడదా? మేము రాకూడదా?" అని అతను ఎదురు ప్రశ్నించాడు.

"మగవాళ్ళు అక్కడికి పోకూడదు–"

"మీరు మగవాళ్ళు కారా?"

"మాకు చెప్పడానికి నువ్వెవరివి? సంకెళ్ళు తీసేసరికి నీకు పొగరెక్కింది. మేము కావలి వాళ్ళం. ఎక్కడికేనా పోవచ్చు." అంటూ అతన్ని ఒక చెట్టకి కట్టేసి – "పారిపోకుండా చూడు." అని బండి వాడికి చెప్పి, రాజభటులు ముగ్గురు స్త్రీలనీ వెంటబెట్టుకుని గుడివేపు పోయారు.

అప్పు డతను బండివాడితో "ఈ రాజభటులు చాలా దుర్మార్గులు. ఆ సుందరులను మానభంగం చెయ్యాలని మనను ఇక్కడ

ఆపి వాళ్ళని తీసుకుపోయారు. మన ఎదుట అక్రమం జరుగుతూంటే ఊరుకోడం ధర్మంకాదు. నీకు మాత్రం ధర్మ విచక్షణ లేదా? రాజభటులూ యోగినీ గుసగుసలాడడం నువ్వు చూశావు కదా? నువ్వు ఇప్పుడు ఒక ఉపకారం చెయ్యి. నాకట్లు విప్పు. ఇద్దరం పోయి వాళ్ళని అదిలిద్దాం. గుక్కెడు ప్రాణం ఎప్పుడయినా పోయేదే. అబలలకి అన్యాయం జరుగుతూంటే చూస్తూ ఊరుకోడం నీతికాదు." అని జాలి కలిగించేలా మాట్లాడాడు.

బండివాడి మనసు కరిగి అతని కట్లు విప్పాడు. ఇద్దరూ గుడివేపు పరుగెత్తారు. గోణికాపుత్రుడు వీరావేశంతో నారసింహ మంత్రం జపించసాగాడు.

విశాలమయిన మర్రి చెట్టుకింద రాతితో కట్టబడిన ఆలయంలో ఉంది ధాకినీదేవి. అగ్నిశిఖలా వేలాడుతున్న నాలుక, మెడలో కపాలమాల ... భయంకరరూపంతో సింహాసనం మీద కూర్చుని ఉంది. నేలంతా బలియివ్వబడిన జంతువుల రక్తంతో అట్టలు కట్టిఉంది.

గోణికాపుత్రుడు అక్కడికి చేరేసరికి - రతిమంజరి కాళ్ళూ చేతులూ కట్టబడి మెత్తని వేపరొట్టమీద పడుకోబెట్టబడి ఉంది. యోగిని కత్తిఎత్తి ఉంది. అదీ చూసిన గోణికాపుత్రుడు రౌద్రంతో నారసింహం జపిస్తూ ఒక్క అడుగులోపోయి ... యోగిని కత్తిని గాలిలోనే పట్టుకుని లాగి - "ద్రోహులారా! ఎంతపని చేస్తున్నావు! నీలాటి పాపాత్మురాలు ఎక్కడా ఉండదు. నువ్వెత్తిన కత్తితోనే నిన్ను - నువ్వు ఆరాధించిన దుర్గకే బలిస్తున్నాను. ఇష్టదేవతను స్మరించుకో." అని ఎడంచేత్తో దాని జుత్తు పట్టుకుని లాగేసరికి అది - "చచ్చాను చచ్చాను. రండో." అంటూ రాజకింకరులకోసం అరిచింది. ఆ కేకలు విని - చిత్రసేనను బలాత్కారం చేయబోతున్న రాజభటులు క్షణంలో అక్కడికి పరుగెత్తుకొచ్చారు. వాళ్ళని చూసి అతను యోగినిని వదలి వాళ్ళలో ఒకడిమీద పడ్డాడు. బండివాడు రెండోవాడిమీద కలియబడ్డాడు. ఆయుధాలు లేని భటులు పారిపోబోవగా కొన్ని అడుగులలోనే వారిని కలుసుకుని వాళ్ళతలలు నరికేశారు. అప్పుడు గోణికాపుత్రుడు ఆ ప్రదేశంలో వెదుకగా ఒకచోట వొళ్ళెరక్కుండా పడున్న

చిత్రసేన కనిపించింది. "లే,లే. దేముడు నీ ఆపద గట్టెక్కించాడు. శత్రువులు నాశనమయ్యారు.

నేను నీ మిత్రుణ్ని, గోణికాపుత్రుడిని." అంటూ పిలిచేసరికి అమృతంవర్షించినట్లే ఆమె లేచి అతన్ని కౌగలించుకుని – "మహాత్మా! ఎలా వచ్చారు? శత్రువులు ఎలా చచ్చారు? మనకు ఎలాటి చిక్కులు వచ్చాయి! మమ్మల్ని కట్టినప్పుడే నాకు తెలివితప్పింది. రతిమంజిరిని శక్తికి బలిస్తామనే మాటలు లీలగా వినిపించాయి. ఇప్పుడు మీ మాట వినపడేసరికి తెలివొచ్చింది." అంది. "రతిమంజరికి పెద్ద గండం దాటింది." అంటూ జరిగింది అతను చెప్పాడు.

"అయ్యో! నా చెల్లెలిని అలా వదలివచ్చారా? ఆ దుష్టురాలు దానిని మళ్ళీ ఏం చేస్తుందో? పదండి." అనేసరికి అతనామెను గుడికి తీసుకు వెళ్ళాడు.

రతిమంజరి అలాగే పడుకుని ఈశ్వరుణ్ణి మనసులో ధ్యానించుకుంటూంది. చిత్రసేన చేతితో ఆమెను పట్టుకుని "తల్లీ! చెల్లీ! లే. నువ్వు మళ్ళీ పుట్టావు. ఎంత ఆపద దాటిందో!" అంటూ ఏడిచింది. రతిమంజరి కళ్ళుతెరిచి – "అక్కా! మీరిక్కడికి ఎప్పుడు వచ్చారు? నా కాళ్ళు చేతులు కట్టి మెడకి వేపరొట్ట చుట్టి నన్ను పడుకోబెట్టడంవరకే నాకు తెలుసు." అంది, కన్నీరు కార్చుతూ. అప్పుడత నామెను ఓదారుస్తూ – "మనం విధికి బద్ధులం. సంసార నాటకానికి అతనే సూత్రధారుడు. ఇప్పుడు మన అపదలన్నీ మబ్బు విడిచినట్లు విడిపొయాయి. కపట యోగినిని ముక్కు, చెవులూ కొసి కురూపిని చేశాం. అది ఎక్కడికో పారిపోయింది. రాజభటులను మేము చంపేశాం. ఈ బండివాడు నాకు చాలా సాయం చేశాడు. కత్తి తిప్పడంలో ఇతను నకులు దంత నిపుణుడు. ఎప్పుడు నేర్చాడో అంత విద్య." అన్నాడు.

బండివాడు – "మహాత్మా! నేనేమీ ఎరగను. బండి తోలడంతప్ప ఏమీ చేతకాదు. రాజభటులని చూస్తేనే వొణిపోయే పిరికివాడిని. అదేం మహిమో తెలియదు. మీకట్లు విప్పుతూంటే ఏదో ఆవేశం వచ్చింది.

ం ఆ యోగిని మీదకి ఉరికేటప్పుడు నా శరీరం పొంగింది. ‌టుల నెలా చంపానో నాకే తెలియదు. అంతా ఆశ్చర్యంగా ఉంది. ్డు నేను మునపటి వాడినయ్యాను." అన్నాడు వినయంగా.

చిత్రసేన – మీరు మాత్రం కత్తి సాధన చేశారా? భటులని ‌ చంపారు? వింతగా ఉందే!" అంది. ఆందు కతను – "నా ష్టదేవత నారసింహప్రభావం తప్ప మరేమీకాదు. నన్ను వాళ్ళు నప్పుడే ఆ మంత్రం జపించాను. ఆ మహాత్ముడే ఇలా చేయించాడు" టూ అమ్మ వారి ఎదురుగా నిలబడి..ఢాకినీదేవతని అనేక విధాలుగా ‌స్తూంటే –

"విద్వాంసుడా! తొందరలోనే నీ మిత్రులతో కలసి చాలా తోషం పొందుతావు." అని వినిపించింది. ఆ మాటలు దేవే పలికిందని ంసుకుని – వారికి ఆ విధం చెప్పాడు.

అప్పుడు చిత్రసేన – "ఆర్యా! ఇక్కడి శిలాశాసనం చదివి శాను. మనోహర రూప యౌవనములు కల వేశ్యా పుత్రికను బలియిస్తే దేవి కోరిన వరాలిస్తుందట. అందుకే కాబోలు ఆ యోగిని పలుమార్లు ‌ వద్దకు వస్తు ఢాకినీ దేవి దగ్గరకి తీసుకుపోతాను – అనేది. దైవమే ంకి ప్రతికూలుడయ్యాడు. దానిని చంపకుండా విరూపిని చేసి ంలేశారు. అది రాజు వద్దకు వెళ్ళి మళ్ళీ ఏవో బోధించి చిక్కులు ్టి పెడుతుందేమో. మనం వేగంగా ఈదేశం వదలి పోవాలి." అంది.

అతను అందు కంగీకరించి బండివాడికి చెప్పాడు. వాళ్ళు ంటాహుటి ప్రయాణంచేసి, ఆ దేశం దాటి, ఒకనాటి రాత్రి ధారా ‌రం చేరుకున్నారు." అని అక్కడికి కథ ఆపాడు మణిసిద్ధుడు.

గోపాలుడు ప్రయాణానికి వేళయిందని గ్రహించి తగిన న్నహాలు చేశాడు. ఇద్దరూ పైమజిలీకి నడవసాగారు.

# కాశీ మజిలీ కథలు

## 147 వ. మజిలీ

### దత్తక శాపవిముక్తి కథ

**చా**రుమతి, రుక్మిణి - ఎప్పుడూ ఒకేమంచం మీద పడుకుంటారు. ఒకనాటి రాత్రి పండువెన్నెలలో పూలపాన్పుమీద పడుకుని ఉండగా - రుక్మిణి - "చారుమతీ! ఆ పుస్తకం మొదట చూసినప్పుడు ఏమీ అర్థం లేదు. నీ బోధవల్ల ఇప్పుడు అంతా కరతలామలక మయింది. ఇందుకు తగిన పారితోషికం ఇద్దామంటే నా దగ్గర ఈ కౌగిలితప్ప ఏమీలేదు -" అంటూ ఆమెని ప్రీతిగా కౌగలించుకుని - "ఈ కౌగిలే మనప్రేమానుబంధాన్ని ధృడపరచాలి." అంటూ చెక్కిళ్ళుముద్దిడింది.

చారుమతి కూడాఆమెను కౌగలించుకుని - "నీ సౌందర్య విలాసాలకు తగిన భర్త లభించి అతనితో మదన క్రీడలు సలుపుతున్నప్పుడు నన్ను స్మరించు. అప్పుడే నా ఉపదేశ ఫలం -" అంది. వాళ్ళు అలా చాలాసేపు మాట్లాడుకుని ఒకరి కౌగిలిలో ఒకరు నిద్రపోయారు.

అర్ధరాత్రి రుక్మిణికి మెలకువ వొచ్చింది. చారుమతి చేతులూ పాదాలు బరువుగా తోచడంతో మెల్లగా లేచి చూడగా - అక్కడొక చక్కని పురుషుడు కనిపించాడు. ఆమె ఆశ్చర్యపోయి - "ఆహా! ఈ సుందరుడెవరు? చారుమతి ఏమైంది? ఇతనిని నాపక్కన పడుకోబెట్టి ఆమె ఏమైందో? ఇతన్ని అంతఃపురాని కెలా తీసుకువొచ్చిందో? సరే. ఎలా ఐతే ఏం? ఇతని శరీర సంపర్కం జరిగింది కనుక ఇతనే నాభర్త. ఎంత అందంగా ఉన్నాడు! చారుమతి నాకు మంచి ఉపకారమే చేసింది. ఇప్పుడితనిని లేపి వివరాలడిగి నిద్రాభంగం కలిగించడం ఎందుకు?

తెల్లవారాక అడగొచ్చు." అనుకుంటూ ఆమె మరోమంచం మీద పడుకునేసరికి నిద్రపట్టేసింది.

ఆ పురుషుడికి మెలకువ వచ్చింది. "సంవత్సరమైంది కాబోలు. నేటితో నాశాపం తీరింది. జరిగినదంతా కలలా ఉంది. ఇప్పుడు రాజపుత్రికని లేపి నావృత్తాంతం చెబితే కోపగిస్తుందేమో చెప్పకపోడమే మంచిది. చీకటి విడకుండా ఇక్కడ నుంచి దాటిపోడం మంచిది.' అని అతను వెళ్ళిపోతూంటే అంతఃపుర కావలిభటుడు అతనిని పట్టుకుని - "నువ్వెవరివి?" అని అడిగాడు. అతను సమాధానం చెప్పడానికి తడబడడంతో అపరాధిగా భావించి బంధించాడు.

భోజుడు కాళిదాసుని తీసుకురాడానికి దేశాంతరం వెళ్ళడం వల్ల చిత్రసేనుడనే రాజకుమారుడి దగ్గరకు తీసుకుపోయి ఆ అపరాధాన్ని పత్రికాముఖంగా తెలియజేశారు. అతను - "నాకు ఓపికలేదు." అంటూ బ్రాహ్మణపుత్రుణ్ని నియోగించి విమర్శించి రమ్మన్నాడు.

ఆ బ్రాహ్మణపుత్రుడు వాకిట్లోకి వచ్చి దత్తకుణ్ని చూసి ఆశ్చర్యపోతూ.."ప్రాణమిత్రమా! శుద్ధాంతానికి ఎందుకువెళ్ళావు?" అని అడిగాడు.

దత్తకు డతన్ని కౌగలించుకుని - "ఎంతచిత్రం! మిత్రమా! నేనేమీ అపరాధం చెయ్యలేదు. వీళ్ళుఊరికే బంధించారు. దారితెలియక లోపలికి కొంచెం దూరం వెళ్ళి తిరిగి వచ్చాను." అన్నాడు.

అప్పుడు గోణికాపుత్రుడు - "ఇతను రాజపుత్రుని మిత్రుడు. మీరు పొండి." అని భటులని పంపివేశాడు. దత్తకుడు గోణికాపుత్రుడి చేయి అందుకుని - "మిత్రమా! నువ్వెప్పుడు వచ్చావు? రాజసాన్నిధ్యం ఎలా కలిగింది? మనమిత్రులలో ఎవరేనా ఇక్కడ చేరారా?" అని అడిగాడు.

"దత్తకా! నేను కాశీనగరం నుంచి బయలుదేరిపోతూ ఒక అగ్రహారంలో గోమతుడనే బ్రహ్మచారికి వివాహంచేయించి అక్కడినుంచి

అనేక జనపదాలు చూస్తూ పాటలీపుత్రం చేరాను. రతినూపుర అనే వేశ్య యింటికి అతిదిగా పోగా దానిపెద్దకూతురు చిత్రసేన చిన్నప్పుడు నీతో చదువుకుందట. నిన్నే తప్ప పెళ్ళి చేసుకోనని నియమం పట్టింది. రెండవది నన్ను వరించింది. వారిద్దరూ అన్నీత్యజించి నాతో వస్తూంటే మతంగ యోగిని అనే కపట మాయావి పన్నిన కపటంవల్ల ప్రాణసంకటమైన కష్టాలు పడ్డాం. అవి దాటి ఇక్కడికి చేరుకున్నాం. ఒక సత్రంలో పడుకోగా తెల్లవారే సరికి వాళ్ళిద్దరూ బండివాడూ లేరు. పరితపిస్తూ నగరం అంతా తిరిగాను. ఎక్కడా కనిపించలేదు. నేను మళ్ళీ ఇక్కడికి వచ్చి దేవాలయం గోడలు పరీక్షించాను మనమిత్రులు వచ్చిన జాడలు తెలియలేదు."

ఊరికే ఉండడం ఎందుకని పండిత వేషంలో రాజదర్శనం కోసం వచ్చాను. భోజరాజు దేశాంతరం వెళ్ళాడని విని అతని కుమారుడు చిత్రసేనుణ్ని కొన్నిశ్లోకాలతో స్తుతించాను. రాజపుత్రుడు మంచంమీద పడుకుని తనకు స్వస్థత ... లేదని కవితా చమత్కృతి కది సమయం కాదంటూనే కొన్ని దీనారాలు కానుకగా ఇప్పించాడు.

"రాజపుత్రా! నేను విత్తం కోసం రాలేదు. ఈ ఆస్థానంలో విద్వాంసు లున్నారని విని వారితో వాదించాలని వచ్చాను మీ అస్వస్థత శరీరానికి సంబంధించింది కాదు. దానికి మందు నాకు తెలుసు." అన్నాను, అతనిచ్చిన కానుకలు తీసుకోకుండా అతను అందర్నీ పంపివేసి నన్ను తనపక్కన కూర్చోబెట్టుకుని – "నువ్వు నా వ్యాధి గ్రహించావు కదా. దీనికి ప్రతీకారం ఏమిటి?" అని అడిగాడు.

"నీవు ఎవరికోసం విరహవేదన అనుభవిస్తున్నావు? ఆమె నీకెందుకు లభ్యంకాలేదు?" అని నేనడగగా.. "చారుమతి అనేవేశ్య నా హృదయం తీసుకుంది. ఆమెది జనాతీత సౌందర్యం. అందరానిదై నా సహోదరి అంతఃపురంలో ఉంటూంది." అంటూ ఆ వృత్తాంతం చెప్పాడు.

"దానిని ఒకసారి చూపగలరా?" అని నేనడిగాను.

"అలాగే. తగిన ఉపాయం ఆలోచించండి." అన్నాడతను.

కాశీనుండి ఒక పండితుడు వచ్చాడనీ, సంస్థానకవులతో వాదనకు మధ్యవర్తిలేదనీ, చారుమతి మహా విద్వాంసురాలు కనుక ఆమెను పంపమనీ చిత్రసేనుడు కోరగా రాజపుత్రికతో వచ్చి ఆమె తెరవెనుక కూర్చుంది. రెండు గడియలేనా ప్రసంగం జరగకుండానే, మధ్యవర్తిని చెప్పకుండానే వారు తమఓటమిని అంగీకరించారు.

అప్పుడా యువతే రోషంగా నాతో వాదానికి పూనుకుంది. అందుకు రాజపుత్రిక ప్రోత్సహించింది. మా యిద్దరికీ చాలాసేపు ప్రసంగం జరిగింది. ఏం చెప్పమంటావు? మనం ఎన్ని చదివామో ఆమెకూడా అన్నీ చదివింది. మన ఉపాధ్యాయులే ఆమె ఉపాధ్యాయులనుకుంటాను. జయాపజయాలు ఎవరూ నిర్ణయించలేకపోయారు. ఆమె నన్నూ, నేనామెనూ స్తుతించడంతో సభ ముగిసింది. ఆమె ముఖం చూస్తే నీ ముఖం చూసినట్లే ఉంది. మిత్రమా! ప్రసంగంకూడా నీలాగే చేసింది.

ఆమె విద్యా ప్రాభవం చూశాక రాజపుత్రుడి విరహం మరింత ఎక్కువయింది. మర్నాడు అతను – "ఆర్యా! నా పని నేను చేశాను. ఇక మీరు మీపని చెయ్యాలి. ఏం ఆలోచించారు?" అని అడిగాడు.

నేను నిట్టూర్పువదులుతూ – "రాజపుత్రా! ఆమె నా తంత్రాలకి లోబడేదిగా తోచదు. ప్రతితంత్రమూ దానికి తెలుసు. నా మిత్రుడు దత్తుడు నేడోరేపో వస్తాడు. అతను దానిని మార్చగలడు – అన్నాను. అతను నీరాక కోసం ఎదురు చూస్తున్నాడు. దైవికంగా నువ్వు వచ్చావు. ఆ కారణంగానే రాజపుత్రుడితో నాకుమైత్రి కలిగింది. గడియ కనపడకపోతే ఉండలేడు." అంటూ అతన్ని లోపలికి తీసుకుపోయి గోణికాపుత్రుడు రాజకుమారుడికి పరిచయం చేశాడు.

రాజపుత్రుడు దత్తుని రాకకి ఎంతో సంతోషించి, నమస్కరించి స్తుతించి – తనను కాపాడమని కోరి మంచంమీద పడుకున్నాడు. అప్పుడు గోణికాపుత్రుడు దత్తుడికి చారుమతి విషయం చెప్పాడు. అతనది విని – "ఆ వేశ్య అంత గొప్పదా? ఎంత చోద్యం! వేశ్యలకు వ్రతమా!...

రాజపుత్రా! నీవిక విచారించకు. రేపురాత్రి ఆమె నీ శయ్య చేరేటట్లు చేస్తాను." అన్నాడు. రాజపుత్రుడు లేచి అతన్ని కౌగలించుకుని – "ఇతను నీ మిత్రుడవడం వల్ల కనికరించడానికి పాత్రుడు. సిగ్గు వదలి చెబుతున్నాను. నీ అప్పుణ్ని బతికించుకో." అని ప్రార్థించాడు.

దత్తుడతని మంచంమీద కూర్చుని – "ఒక్కసా రామెను నాకు చూబించు. నీ కోరిక తీర్చగలను." అన్నాడు. రాజపుత్రుడు ఒకచీటి వ్రాసి చెల్లిలి అంతఃపురానికి పంపాడు.

అందుకు సమాధానంగా "సహోదరా! కొత్తపండితుడితో ప్రసంగించడానికి చారుమతిని పంపమని రాశావు. కాని ఆమె మొన్నటి నుంచి కనపడడంలేదు. ఎక్కడికి పోయిందో తెలియదు. రాగానే పంపుతాను." అని రాసి పంపింది రుక్మిణి. అది చదివి రాజపుత్రుడు చిన్నపోగా – "రాజనందనా! అది ఎక్కడికి పోగలదు? నేడు కాకపోతే రేపయినా రాదా? మేమిక్కడే ఉంటాము కదా." అని ఊరడించాడు. గోణికాపుత్రుడు దత్తుడిని తనబసకి తీసుకుపోయి చారుమతి గురించి ఘనంగా పొగిడాడు. "చూస్తే కాని న్మమను." అని నవ్వా డతను.

మర్నాడు దత్తుడు రాజపుత్రునివద్దకి వెళ్ళక ఊరు చూస్తానంటూ – రుక్మిణీ విరహంతో వీధులవెంట తిరుగుతూ ఒక దేవాలయం ద్వారంలో వింతను చూడసాగాడు. అప్పుడొక పరిచారిక అతనిని ఎగాదిగాచూసి, తన చేతిలోని చిత్ర ఫలకంతో అతని ముఖం పోల్చి చూసి – "స్వామీ! తమది ఏవూరు?" అని అడిగింది. అతనామెను చూసి –" నువ్వుచిత్రసేనవా ఏమిటి, అలా చూస్తున్నావు? నాతో నీకేంపని" అన్నాడు. ఆమె నవ్వుతూ – "మీరు అనిరుద్ధులయితే నేను చిత్రలేఖనే. పనుండే పలకరించాను. ఈ చిత్రం మీ ప్రతిబింబంలా లేదా?" అంది.

"ఔను. ఇది నా అకారమే. దీనిని రాసిన దెవ్వరు?"

"పోనీ, మీరెప్పుడేనా భోజరాజు అంతఃపురానికి వొచ్చారా?

"అంతఃపురానికి నే నెలా రాగలను? చారుమతి నెరుగుదురా?"

ఎరుగుదును. ఆమే నేనగా నేనే ఆమెగా కొన్నాళ్ళు మెలిగాం."

"మళ్ళీ ఒకసారి ఆమెను చూపమని.."

అది ఎలా సాధ్యం?.

ఉపాయం చెప్పిందామె. అతని అంగీకారంతో అంతఃపురానికి వెళ్ళి ఆ విషయం రుక్మిణికి చెప్పింది. ఆమె పరమానందంతో ఆ సాయంత్రం గుర్రపు బండిమీద రేవతితో కలసి కేళీవనానికి వెళ్ళింది. కేళీసౌధంలో రేవతి తప్ప మరెవరూ ఉండకుండా పనులమీద పంపి – "అతనితో ఏం చెప్పావు? అతను ఏమన్నాడు? మరోసారి చెప్పు." అని రేవతిని అడిగింది.

"దేవీ! అతను వేధించి వేధించి కాని నిజం చెప్పలేదు. చివరకి స్త్రీ వేషంలో ఇక్కడికి రావడానికి అంగీకరించాడు. నన్ను ఈ ద్వారం దగ్గర ఎదురు చూడమన్నాడు. ఈ చిత్రఫలకం అతనిదే. సందేహం లేదు." అందామె.

అంతలో ఒక సుందరి గుమ్మందగ్గర ఎదురయింది. ఆమెను చూసిన రేవతి ఆశ్చర్యంతో – "ఓహో! కొత్తదానిలా జంకుతున్నావేమిటి? ఎక్కడికి పోయావు? రాజపుత్రిక నీకోసం చాలా విచారిస్తూంది." అంటూ ఆమెని లోపలికి తీసుకు పోయి రుక్మిణి వద్ద చేర్చింది. రుక్మిణి ఆమెను చూసి "ఓహో! మా పుణ్యం. నన్నెంత మోసం చేసి పోయావు! నాలుగు రోజులయింది." అంటూ మంచం మీద కూర్చొబెట్టుకుని కౌగలించుకుని – "ఎక్కడికి పోయావో చెప్పు." అని అడిగింది.

"నేనింక ఇక్కడ ఉండలేను. నన్ను చూసింది మొదలు మీ అన్న మదనతాపంతో నాకు అనేక వార్తలు పంపుతున్నాడు. నీకు చెప్పినా పట్టించుకోలేదు. ఐనా స్నేహబంధం కొద్దీ – కాశీపోయేముందు నిన్నొకసారి చూసి వెళ్దామని వచ్చాను. కళ్ళు చల్లబడ్డాయి"

"సఖీ! నన్ను వియోగ సాగరంలో ముంచేసి వెళ్ళావు. అది అలా ఉంచు. నా పక్కన ఎవరినో పడుకోబెట్టి పోయావే...అతనెవరు?" అని అడిగి – "రేవతీ! నువ్వు ద్వారం వద్ద ఎదురుచూడు –" అని ఆమెను పంపివేసి – మళ్ళీ చారుమతితో–"నేను అది కల అనుకుంటూ

రాజపుత్రా! నీవిక విచారించకు. రేపురాత్రి ఆమె నీ శయ్య చేరేటట్లు చేస్తాను." అన్నాడు. రాజపుత్రుడు లేచి అతన్ని కౌగలించుకుని – " ఇతను నీ మిత్రుడవడం వల్ల కనికరించడానికి పాత్రుడు. సిగ్గు వదలి చెబుతున్నాను. నీ అప్పుణ్ని బతికించుకో." అని ప్రార్థించాడు.

దత్తుడతని మంచంమీద కూర్చుని – "ఒక్కసా రామెను నాకు చూబించు. నీ కోరిక తీర్చగలను." అన్నాడు. రాజపుత్రుడు ఒకచీటి వ్రాసి చెల్లెలి అంతఃపురానికి పంపాడు.

అందుకు సమాధానంగా "సహోదరా! కొత్తపండితుడితో ప్రసంగించడానికి చారుమతిని పంపమని రాశావు. కాని ఆమె మొన్నటి నుంచి కనపడడంలేదు. ఎక్కడికి పోయిందో తెలియదు. రాగానే పంపుతాను." అని రాసి పంపింది రుక్మిణి. అది చదివి రాజపుత్రుడు చిన్నపోగా – "రాజనందనా! అది ఎక్కడికి పోగలదు? నేడు కాకపోతే రేపయినా రాదా? మేమిక్కడే ఉంటాము కదా." అని ఊరడించాడు. గోణికాపుత్రుడు దత్తుడిని తనబసకి తీసుకుపోయి చారుమతి గురించి ఘనంగా పొగిడాడు. "చూస్తే కాని న్మమను." అని నవ్వా దతను.

మర్నాడు దత్తుడు రాజపుత్రునివద్దకి వెళ్ళక ఊరు చూస్తానంటూ – రుక్మిణీ విరహంతో వీధులవెంట తిరుగుతూ ఒక దేవాలయం ద్వారంలో వింతను చూడసాగాడు. అప్పుడొక పరిచారిక అతనిని ఎగాదిగాచూసి, తన చేతిలోని చిత్ర ఫలకంతో అతని ముఖం పోల్చి చూసి – "స్వామీ! తమది ఏవూరు?" అని అడిగింది. అతనామెను చూసి –" నువ్వుచిత్రసేనవా ఏమిటి, అలా చూస్తున్నావు? నాతో నీకేంపని" అన్నాడు. ఆమె నవ్వుతూ – "మీరు అనిరుద్ధులయితే నేను చిత్రలేఖనే. పనుండే పలకరించాను. ఈ చిత్రం మీ ప్రతిబింబంలా లేదా?" అంది.

"ఔను. ఇది నా ఆకారమే. దీనిని రాసిన దెవ్వరు?"

"పోనీ, మీరెప్పుడేనా భోజరాజు అంతఃపురానికి వొచ్చారా?

"అంతఃపురానికి నే నెలా రాగలను? చారుమతి నెరుగుదురా?"

ఎరుగుదును. ఆమే నేనగా నేనే ఆమెగా కొన్నాళ్ళు మెలిగాం."

"మళ్ళీ ఒకసారి ఆమెను చూపమని.."

అది ఎలా సాధ్యం?.

ఉపాయం చెప్పిందామె. అతని అంగీకారంతో అంతఃపురానికి వెళ్ళి ఆ విషయం రుక్మిణికి చెప్పింది. ఆమె పరమానందంతో ఆ సాయంత్రం గుర్రపు బండిమీద రేవతితో కలసి కేళీవనానికి వెళ్ళింది. కేళీసౌధంలో రేవతి తప్ప మరెవరూ ఉండకుండా పనులమీద పంపి – "అతనితో ఏం చెప్పావు? అతను ఏమన్నాడు? మరోసారి చెప్పు." అని రేవతిని అడిగింది.

"దేవీ! అతను వేధించి వేధించి కాని నిజం చెప్పలేదు. చివరకి స్త్రీ వేషంలో ఇక్కడికి రావడానికి అంగీకరించాడు. నన్ను ఈ ద్వారం దగ్గర ఎదురు చూడమన్నాడు. ఈ చిత్రఫలకం అతనిదే. సందేహం లేదు." అందామె.

అంతలో ఒక సుందరి గుమ్మందగ్గర ఎదురయింది. ఆమెను చూసిన రేవతి ఆశ్చర్యంతో – "ఓహో! కొత్తదానిలా జంకుతున్నావేమిటి? ఎక్కడికి పోయావు? రాజపుత్రిక నీకోసం చాలా విచారిస్తూంది." అంటూ ఆమెని లోపలికి తీసుకు పోయి రుక్మిణి వద్ద చేర్చింది. రుక్మిణి ఆమెను చూసి "ఓహో! మా పుణ్యం. నన్నెంత మోసం చేసి పోయావు! నాలుగు రోజులయింది." అంటూ మంచం మీద కూర్చొబెట్టుకుని కౌగలించుకుని – "ఎక్కడికి పోయావో చెప్పు." అని అడిగింది.

"నేనింక ఇక్కడ ఉండలేను. నన్ను చూసింది మొదలు మీ అన్న మదనతాపంతో నాకు అనేక వార్తలు పంపుతున్నాడు. నీకు చెప్పినా పట్టించుకోలేదు. ఐనా స్నేహబంధం కొద్దీ – కాశీపోయేముందు నిన్నొకసారి చూసి వెళ్దామని వచ్చాను. కళ్ళు చల్లబడ్డాయి"

"సఖీ! నన్ను వియోగ సాగరంలో ముంచేసి వెళ్ళావు. అది అలా ఉంచు. నా పక్కన ఎవరినో పడుకోబెట్టి పోయావే...అతనెవరు?" అని అడిగి – "రేవతీ! నువ్వు ద్వారం వద్ద ఎదురుచూడు –" అని ఆమెను పంపివేసి – మళ్ళీ చారుమతితో–"నేను అది కల అనుకుంటూ

కొంతసేపు తడబడ్డాను. అతనిరూపుని చిత్రఫలకం రాశాను. నీలాగే అతనూ తెల్లవారకముందే ఎక్కడికోపోయాడు. ఇది కలో నిజమో తేల్చుకోలేక అతనిని వెదకమని చిత్రఫలమిచ్చి రేవతిని పంపాను. అతను కనపడి ఆడవేషంలో ఇప్పుడిక్కడికి వొస్తానన్నాడు. రేవతి అతనికి స్వాగతం పలకడానికే వెళ్ళింది. నువ్వు వచ్చావు. ఇక బాధలేదు. అతని వృత్తాంతం చెప్పు." అంది బతిమాలుతూ. "అలాటి దివ్యపురుషుడు నీకు భర్తగా ఉంటే బాగుంటుందని పరీక్షకి నీ పక్కన పడుకోబెట్టాను. నీకతను అన్నివిధాలా నచ్చాడు కదా! అతని సౌందర్యం నచ్చిందా?" అంటూ నవ్వింది. "అతనెక్కడికి పోయాడోచెప్పు." "ఏమో అంత తొందర పడతావేం? ఈ రాత్రి వస్తానన్నాడుగా? రాకపోతే చూద్దాం. అతనొస్తే ఏం చేస్తావు? నిజం చెప్పు. ఇక నాతో మాట్లాడవేమో."

"నేనేమీ మాట్లాడను అంతా నీదేభారం." అంతలో చీకటి పడింది. రేవతి ద్వారం వద్దనుంచి తిరిగివచ్చి - "దేవీ! అతను చెప్పిన సమయం దాటిపోయింది. ఇకరాడు. అతను అబద్ధమాడాడు కాబోలు." అంది.

"అంతా ఈమెలో ఉంది. ఈమె చెప్పకుండా అతను మనవద్దకు రాడు. అంచేత ఈమెనే పట్టుకుని ప్రార్థించాలి." అంటూ ఆమెను బండి ఎక్కించుకుని అంతఃపురానికి తీసుకుపోయింది. వెళ్ళింది మొదలు "ఆ పురుషుడెవరు? ఎక్కడి నుంచి తీసుకొచ్చావు? ఎక్కడికి పంపించావు? అతను వస్తానని రాలేదేం? మొదట- కావలివారిని తప్పించి ఎలా తీసుకొచ్చావు? ఎప్పుడూ నా దగ్గరే ఉండే నువ్వు ఎప్పుడు అవతలకి పోయావు? నా ఊహకేమీ అందడం లేదు. నన్ను కనికరించి నిజం చెప్పు. అతన్ని చూసింది మొదలు నా మనసు మనసులో లేదు." అని బలవంత పెట్టింది.

చారుమతి నవ్వుతూ లేచి ఆమెను కౌగలించుకుని చెక్కిళ్ళు రాస్తూ.."అతన్ని చూసి ఏం చేస్తావు? ఇప్పుడే తీసుకొస్తాను, ఏం పారితోషికం ఇస్తావు? అతను దివ్యుడని చెప్పనుగా. అతని రాకకి ఏవీ ఆటంకాలు కాబోవు. యోగశక్తి." అంది.

"నువ్విప్పుడు తీసుకొస్తే నిత్యమూ నీపాదసేవ చేసుకుంటాను. నా శరీరం నీకర్పించి సేవకురాలినై ఉంటాను." అంది రుక్మిణి ప్రాధేయపడుతూ.

"సరే కళ్ళు మూసుకో. తెరిస్తే ప్రమాదం సుమీ." అని ఆమె కనులు మూయించి – "దివ్యపురుషా! రా." అంటూ పద్యం చదువుతూ తనస్త్రీ వేషం తీసేసి పురుషవేషం పొంది – రుక్మిణి పక్క కూర్చుంది.. "అబ్బా! ఈ చారుమతి మాటిమాటికీ రమ్మని తినేస్తూంది కదా. కాదనడానికి మనసొప్పడం లేదు. చారుమతీ! నువ్వువెళ్తున్నావా? నన్నేం చెయ్యమంటావు? సరే" అంటూంటే రుక్మిణి నిగ్రహించుకోలేక కళ్ళు తెరిచింది. చారుమతి లేదు. ఆ రాత్రి తనపక్కన పడుకున్న పురుషుడే ఉన్నాడు.

ఆమెకు మదన వికారాలు పుట్టాయి. సిగ్గుతో మాట్లాడలేక ... బెదరుచూపులు చూడసాగింది. "బెరుతావేం? నన్ను రప్పించమని చారుమతిని ఎంతో ప్రార్థించావట కదా? సన్నిహితుడినయిన నాతో మాట్లాడవేం? నీకోరిక ఏమిటో చెప్పు. నేనిక్కడ ఎక్కువసేపు ఉండకూడదు. వేగంగా పోవాలి." అని అతననేసరికి రుక్మిణి ఎలాగో కంఠం పెగుల్చుకుంది. "మనోహరా! మీరు, చారుమతీ ఇంద్రజాలం తెలిసిన ప్రౌఢలు. మీరాకపోకలు గ్రహించడం అసాధ్యంగా ఉంది. ఇంతలోనే చారుమతి ఎక్కడికి పోయిందో! మీరెక్కడినుంచి వచ్చారో, ఆమెమిమ్మల్ని నాపక్కన ఎందుకు పడుకోబెట్టిందో, ఆమె అభిప్రాయ మేమిటో, చెభితే నా అభీష్టం చెబ్తుతాను." అంది. "బాగుంది. ఆమె ఉద్దేశం ఏమిటో నాకెలా తెలుస్తుంది?" అని అతననేసరికి. ఆమె – "ఐతే ఆమెనిప్పుడే రప్పించండి, అడుగుతాను. లేకపోతే మిమ్మల్ని అంతఃపుర అపరాధానికి బందీని చేయిస్తాను." అంది.

అతను నవ్వుతూ – "నేనిప్పటికే నీప్రేమలో బందీని అయ్యాను. మళ్ళీబద్ధుణ్ని చేసి ఏం లాభం?" అన్నాడు. వాళ్ళిద్దరూ అలా కొంతసేపు పరిహాసాలు ఆడుకున్నారు. ఆ సమయంలో అతని ఆకారవిశేషాలు,

స్వరమాధురీ, కళ్ళు...ఆనాడు ద్వారపాలకులమాటలు..అన్న అంతః పురానికి వచ్చి అడగడం.. అన్నీ జ్ఞాపకం తెచ్చుకుని – చారుమతి వేషంతో ఈ పురుషుడే తనని మోసం చేశాడని గ్రహించి, రుక్మిణి తటాలున అతని చెయ్యి పట్టుకుని "అమ్మదొంగా! చారుమతీ! ఎంతమోసంచేశావు! నీగుట్టు తెలిసిపోయిందిలే. నేనే చెబుతాను.

ఆనాడు మీరు గుర్రంమీద ఆడవేషం వేసుకుని ఉద్యాన వనానికి వచ్చారు. అప్పటి నుంచీ అలాగే మెలిగారు. రేవతితో చెప్పినట్లుగానే మీరు స్త్రీవేషంలో తోటకు వచ్చారు. చారుమతి అని భ్రమపడ్డాను. ఇక్కడ మీకపటం నటించారు. అంతేనా? ఇక నాకు భయం లేదు. మీద్గర చనువుంది కదా. నా ఇష్టం వచ్చినట్లు మాట్లాడొచ్చు." అంది.

అతను చాలా సంతోషించి మునుపు తాను తెలిపిన శృంగార విశేషాలను ఆమెమీద ప్రయోగిస్తూ రుక్మిణిని ఎంతగానో సంతోష పెట్టాడు.

# కాశీ మజిలీ కథలు

## 148 వ. మజిలీ

### యక్షిణీ గానం కథ

రుక్మిణి అంతఃపురానికి చారుమతి వచ్చిందన్న వార్త తెల్లవారక మునుపే రాజ పుత్రుడికి తెలిసింది. అతను అంతఃపురానికి కొత్త కావలి వాళ్ళని నియమించి సెలవు లేనిదే ఎవ్వరినీ, అవతలకి పోనివ్వద్దని వారిని నియమించి.. దత్తకుడిని తీసుకురమ్మని పరిచారకుణ్ని పంపాడు.

ఆ దూతతో గోణిపుత్రుడు రాజపుత్రుడి వద్దకు వెళ్ళాడు.

"చారుమతి రుక్మిణి అంతఃపురానికి మళ్ళీ వచ్చిందట. మన మిత్రుడు దత్తుడు ఏడీ? అతని ప్రతిజ్ఞ చూబించవలసిన సమయం వచ్చింది." అన్నాడు రాజపుత్రుడు.

గోణికాపుత్రుడు విచారంగా–"దేవా! అతను నిన్న ఒక పనిమీద ఊరికి పోయాడు. రెండు మూడు రోజులలో రాగలడు. ఆమె వొస్తుందని తెలిస్తే ఇతను వెళ్ళేవాడే కాడు." అన్నాడు.

అందుకు రాజపుత్రుడు – "సరిసరి. ఏదో ఒక అంతరాయం వొస్తూనే ఉంది. మీరతను ఉన్న చోటుకే పోయి వేగంగా తీసుకురావాలి. ఆలస్యం చెయ్యకండి. కనపడలేదంటే ఒప్పుకోను. ఈ ఉపకారం నాకు చేసిపెట్టండి." అన్నాడు,

అతనుఇంటికిపోతూ – చారుమతి ధీర. ఉపనిషత్ క్రియలకు వశపడదు. దత్తుని మాటలకు ఆశపడి ఇతను ఉర్రూత లూగుతున్నాడు. అతను మాత్రం ఏం చేయగలడు. అతనే వారస్త్రీ లంపటుడు. ఎక్కడికి

పోయాడో? ఎలాగేనా వాడిని వెదికి పట్టుకోవాలి! అని నిశ్చయించుకుని పట్నం అంతా వెదికాడు. కాని ఎక్కడా కనపడలేదు.

కొన్నాళ్ళయ్యాక దత్తుడు ఇంటికి వచ్చాడు. "మిత్రమా! మాకు చెప్పకుండా ఎక్కడికి పోయావు? రుక్మిణి అంతఃపురానికి చారుమతి మళ్ళీ వచ్చిందట. రాజపుత్రుడు నీకోసం కబురు మీద కబురు పంపుతున్నాడు. నువ్వు లేకుండా వెళ్తే నామీద మండిపడుతున్నాడు. పద." అంటూ గోణికాపుత్రు డతన్ని వెంటబెట్టుకుని పోయాడు.

రాజపుత్రుడు దత్తుణ్ణి దూరం నుంచి చూసే పొంగిపోయి – ఎదురు వెళ్ళి కౌగలించుకున్నాడు "మిత్రమా! దయతప్పిందా? ఇన్నాళ్ళూ ఎక్కడికి పోయావు? నీకోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురు చూస్తున్నాను. చారుమతి అంతఃపురానికి వచ్చింది. నీమాట చెల్లించుకోవలసిన సమయం వచ్చింది. ఇక వర్తమానాలతో పనిలేదు. మనమిప్పుడే అక్కడి పోదాం. ఏదో మిషతో ఆమె నీకంట పడేలా చేస్తాను. చాలా? అన్నాడు.

"అది చాలు. ఆమెను నీవశం చేస్తాను. అంటూ దత్తుడు మళ్ళీ ప్రతిజ్ఞ చేశాడు.

అప్పుడు చిత్రసేనుడు శారికని పిలిచి "ఒకపండితుడిని వెంటబెట్టుకుని రుక్మిణి అంతఃపురానికి వస్తున్నాననీ, చారుమతిని చావడిలో కూర్చోమనీ చెప్పు." అని పంపి, తాను దత్తుడిని మాత్రం వెంటబెట్టుకుని అక్కడికి వెళ్ళాడు.

ఆ వార్త విని కూడా రుక్మిణి అన్నను ముందరి చావడిలోనే కలుసుకుని నమస్కరించింది. "కాశీనుంచి ఒక పండితుడు వచ్చాడు. చారుమతి అతనితో కొంచెం ప్రసంగించవలసి ఉంది. ఆమెఏదీ?" అడిగాడతను.

అమె ముఖం చిన్నబుచ్చుకుని – "అన్నా! నువ్వు పలుమార్లు అమెగురించి తర్కిస్తున్నావని తెలిసి ఆమె ఇక్కడ ఉండడానికి సంకోచించి నిన్న ఉద్యాన వనంనుంచే నాకు చెప్పకుండా ఎక్కడికో పోయింది. నాలుగురోజుల్లో వొస్తుంది. రాగానే చెబుతాను." అంది.

రాజకుమారుడు వెలవెలపోతున్న ముఖంతో – "చాలుచాలు నీ మూలానే దానికి ఈ టక్కులు వచ్చాయి. వెలయాలికి అంతఃపురం ఏమిటి? నీముఖం చూసి కాని, దానిని బలవంతంగా ఐనా తీసుకురానా? విద్వాంసురాలని వేడుకపడి పలుమార్లు ఆమె ప్రసక్తితెచ్చాను. లేకపోతే దానిగొడవ నాకెందుకు? ఈ సారి అదిరాగానే నాకు చెప్పాలి. తప్పావో, ఒట్టే." అని, ఆమెచేత ఔననిపించుకుని, దత్తుడితో ఆవిషయం చెప్పి ఇంటికిపోయాడు.

దత్తుడు – "రాజపుత్రా! ఆమె రాగానే నేను వస్తను." అన్నాడు, అనుజ్ఞకోరుతూ.

"నిన్ను పోనివ్వను. అదెప్పుడు వస్తుందో తెలియదు. అంత వరకు నువ్వు ఎప్పుడూ నాతో ఉండవలసిందే." అని నిర్బంధించాడు చిత్రసేనుడు. దత్తుడి కేమనాలో తెలియక...అతని దగ్గరే ఉంటూ కాలక్షేపం చెయ్యసాగాడు.

ఒకనాడు రాజపుత్రుడు ఇద్దరిమిత్రులతోనూ మాట్లాడుతూంటే మంత్రి వచ్చాడు. అతను వినయంగా 'రాజకుమారా! మీ తండ్రిగారు కాళిదాసును తీసుకురాడానికి దేశాంతరం వెళ్ళినప్పటినుంచీ మీరు అస్వస్థులయ్యే ఉన్నారు. మీ అస్వస్థత రోజురోజుకీ పెరుగుతూందేకాని తగ్గడం లేదు. ఇది మీకు మీ తండ్రిగారిపై కల బెంగ వలన కావచ్చు. వారు కొద్దిరోజులలో రాగలరని వార్త అందింది. కనుక మీరు విచారింపనక్కర్లేదు. వినోదాలు చూస్తూంటే బాగుంటుంది. ఉత్తరదేశం నుంచి వచ్చిన ఒకామె మనవూరి నాటక శాలలో మొన్న సంగీతం పాడింది. దానిది దేవతల గానమని జనులు స్తుతించారు. ఆమె ఇవాళ మళ్ళీ పాడుతుందట. మీరు ఆప్తులతో కలసి వొచ్చి అనందించాలని కొరుతున్నాను." అన్నాడు.

చిత్రసేనుడు మిత్రులతో కలసి నాటకశాలకి వెళ్ళాడు. ఆ గాయని అత్యద్భుతమయిన గానం చేసింది. అది ముగిశాక ఇంటికి వచ్చి నిద్రపోకుండా ఆ సంగీతం గురించి పొగిడి, దత్తుడితో – "మిత్రమా!

ఆది చారుమతి అనే ఆశతో పోయాను. సువర్ణనాభుని భార్య అట. చారుమతి కూడా ఇలాగే పాడుతుంది సుమీ!" అన్నాడు.

దత్తుడు నవ్వుతూ – "అది చారుమతి కాదని అప్పుడే నిశ్చయింపకు. వేశ్యకి విటుడు ప్రాణనాథుడు సువర్ణనాభుడు అలాటివాడేమో, రేపువారి వృత్తాంతం తెలుసుకు వస్తాను. అనుమతించు." అన్నాడు. "నువ్వు వెళితే మళ్ళీరావు. అంచేత నిన్ను వదలను. అది చారుమతి కాదు," అన్నాడు చిత్రసేనుడు. "నీముందు శపథం చేశాక రాకుండా ఉంటానా? తెలియక ఊరికి పోయాను. రేపు వాళ్ళ విషయం తెలుసుకుని వెంటనే వస్తాను." అని నచ్చజెప్పి ఇంటికి పోయాడు దత్తుడు.

సువర్ణనాభుడి పేరు విన్నది మొదలు అతను తమ మిత్రుడేమో అని ఆ స్నేహితులకి ఆశకలిగింది. గోణికాపుత్రుడిని రాజకుమారుడి వద్దకు పంపి తాను దేవాలయానివీ, సత్రానివీ గోడలన్నీ చూశాడు. తాను రాసిన రాతకిందనే సువర్ణనాభుడు తాను ఆ నగరానికి వచ్చినట్లు రాసి ఆనాడే. ఆ సమయమందే వచ్చి చూస్తానని రాశాడు. దత్తుడు అక్కడ ఉండగానే సువర్ణనాభుడు వచ్చినా అతన్ని గుర్తుపట్టలేకపోయాడు. దివ్యభూషణాలలో విలాసపురుషుడి వేషంలో ఉన్నాడు. దత్తుడు ఎప్పుడూ విలాసపురుషుడే. సువర్ణనాభుడు – "మిత్రమా! వచ్చావా!" ఆ గాయనీ రత్నం నీభార్య ఎలా అయింది? కాశీపురం వదిలాక ఏం చేశావు? ఆ ఉదంతం అంతా చెప్పు." అని కోరాడు. అప్పుడు అతను చెప్పసాగాడు.

## సువర్ణనాభుడి కథ

ఆవేళ మిమ్మల్నందరినీ వదిలి, ఉత్తర భూములు చూడాలనే కోరికతో కష్టాలు సహిస్తూ నేనూ, కుచుమారుడూ కొన్నాళ్ళు ప్రయాణం చేశాం కుచుమారుడు సుకుమారుడవడం వల్ల కష్టాలకు ఓర్వలేక వెనక్కి వెళ్ళిపోయాడు. నేను ఉత్తరంగా పోయిపోయి మహారణ్యాలు, దుర్గమ పర్వతాల మధ్యతిరుతుతూండగా తీసుకెళ్ళిన ఆహారపదార్థాలు

ఐపోయాయి. పళ్ళతో కొన్నాళ్ళు, ఆకులతో కొన్నాళ్ళు ఆకలి తీర్చుకో సాగాను. ఆ ఆకులు తిన్నాక అమృతం తాగినట్లే అయి భోజనం చేసిన తృప్తీ, బలమూ కలిగేయి. రోగ వికారాలు లేక శరీరానికి కాంతి వచ్చింది. నేను తిన్నది ఓషధి కాబోలు అనుకున్నాను. ధైర్యంగా నదులు దాటి పర్వతాలెక్కి చాలాదూరం వెళ్ళాను.

జనసంచారం లేని ఆ ప్రదేశాలలో నాకొక సిద్ధుడు కాని యతి కాని, తపస్వి కాని కనపడలేదు. చెట్లు, లతలు, కొండలు తప్ప దేవతా మహాత్యమేమీ కనిపించలేదు. అంతా మంచు. మిట్టమధ్యాహ్నమే సూర్యుడు కనపడడం గగనం. ఒకనాడు ఒక కొండశిఖరంమీద నిలబడి, దారికోసం నాలుగువేపులా చూస్తూంటే ఎవరో సంగీతం పాడుతున్నట్లు మనోహరనాదం వినిపించింది. నేనటు చెవి పెట్టి వినగా గాంధర్వగాన మనిపించి అక్కడికిపోదామని ఎంతవెదికినా తోవ కనపడలేదు. అక్కడక్కడ చిన్నతుప్పలు మాత్రం ఉన్నాయి ఆ కొండ ఎక్కడానికి పది రోజులు ఆలోచించాను. ఉపాయం తట్టలేదు. కాని ఆ సంగీతం మాత్రం వినిపిస్తూనే ఉంది. దేవుణ్ని ధ్యానించగా ఒక ఉపాయం తట్టింది.

చెట్లనుంచి నారతీసి తాడుగా పేని దానిని మొక్కల మొదళ్ళకు విసురుతూ ఆ తాడుపట్టుకుని పైకెక్కుతూ మూడు రోజులకి ఆ కొండ మీదకి వెళ్ళగలిగాను. ఆ మూడురోజులూ నేను పడిన శ్రమ అంతా యింతా కాదు. చీకటి పడేసరికి కదలకుండా నిలబడి జాగారం చేశాను. తాడు వదిలానో కిందపడతాను. ఒకసారి ఉచ్చుముడి వూడి నేను పడవలసిందే. కాని దైవ వశాన ఒక తుప్పదొరికి నిలబడగలిగాను. కిందపడితే తలపగిలి వెయ్యి ముక్కలయిందే.

ఆకొండశిఖరం మీద సమతలమయిన ప్రదేశంలో ఒక అతిచక్కని సరస్సుంది. దానికి రాతితో కట్టబడిన మెట్లున్నాయి. పళ్ళమొక్కలూ, పూలతీగెలూ చెప్పనక్కర్లేదు. తుమ్మెదలు ఝూంకారం చేస్తున్నాయి. నేను ఆ తటాకం చుట్టూ ప్రదక్షిణం చేశాను. ఆ చెరువుకి ఒకవేపు – కొంచెం దూరంలో ఒక కోవెల మంటపంలో ఒక చిన్నది వీణపాడుకుంటూంది. నేను ఆశ్చర్యంతో దగ్గరకు పోయి నిలబడ్డాను.

సంగీతం ధ్యాసలో ఆమె నన్ను కొంతసేపటి వరకూ చూడలేదు. చూశాక దిగ్గున లేచి

చిన్నది : నువ్వెవరివి?

నేను : బ్రాహ్మణ పుత్రుణ్ని సువర్ణనాభుడని నాపేరు.

చిన్నది : ఇక్కడికెందు కొచ్చావు?

నేను : నీవంటి విద్వాంసులని చూడాలనిదేశాలు తిరుగుతున్నాను.

చిన్నది : ఇక్కడ నీకు ఏముంది?

నేను : త్రిలోకాలలోనూ దుర్లభమైన దర్శనం.

చిన్నది : ఏకాంతంలో ఉన్న స్త్రీలవద్దకు రావొచ్చునా?

నేను : విధి ప్రేరణం.

అలా మేము సంస్కృతంలో కొంతసేపు సంవాదం గావించాం. అప్పుడు ఆమె నాకు అతిథిపూజ చేసి తినడానికి పళ్ళు తెచ్చి ఇచ్చింది. తిని తృప్తిపడి, నేను వినయంగా – "దేవీ! ఇది మానవ సంచారం లేని భూమి కావడం వల్ల నువ్వు దేవకన్యవని తెలుస్తూంది. నీ కులమేమిటి? పేరేమిటి? ఇక్కడ ఒక్కర్తెవే ఎందుకున్నావు? నీవృత్తాంతం చెప్పి నన్ను కనికరించు. పదినెలలనుంచీ యీ అడవులలో తిరుగుతున్న నాకు నేటికి కృతార్థత కలిగింది. నువ్వు నాతో సంభాషించావు కనుక నేను మనుషులలో అధికుడినని గర్వం కలిగింది." అన్నాను. ఆమె చిరునవ్వుతో తన కదను చెప్పింది.

# సువర్ణ పదిక కథ

" నా కాపరం అలకాపురం. యక్షకన్యని. నాపేరు సువర్ణపదిక. మా అక్కపేరు రత్నపదిక. ఆమె భర్తతో కాపురం చేస్తూ నన్ను పెంచింది. మేమిద్దరమూ ఒకే ముని వలన పుట్టామట. మాతల్లి నా చిన్నతనంలోనే మరణించింది. మా అక్క బావ నన్ను గారాబంగా పెంచుతూండేవారు. కుబేరుడు ఏదోనెపంతో సంవత్సరం పాటు భార్యతో వియోగం చెందమని మాబావని శపించాడు. ఆశాపాన్ని అతికష్టంమీద భరించి తరవాత ఇంటికి వచ్చి ఆ వూరిలో ఉండడం ఇష్టంలేక అక్కడ కాపరం ఎత్తేసి భూలోకంలో ఒక పర్వతపు గుహలో నివసించారు. నన్ను కూడా తమతో వచ్చెయ్యమన్నా నాకు ఇష్టపడక అక్కడే ఉండి సంగీతం నేర్చుకోసాగాను.

నా అసహాయతను గమనించి కుబేరుడి వంటవాడు తనని పెళ్ళాడమని నన్ను బలవంత పెట్టసాగాడు. నేను కొంచెం చదువుకున్న దాన్ని కావడం వల్ల ఆ మూర్ఖుణ్ణి పెళ్ళాడనని చెప్పాను. వాడు నన్ను అంతటితో వదలక పదేపదే వేధించసాగాడు. నేను కుబేరుడికి ఫిర్యాదు చేశాను. కాని..మా కుటుంబం మీదకల కోపం కొద్దీ అతను నా మొర అలకించలేదు.

ఆ బానిస వొత్తిడి తట్టుకోలేక అక్కడినుంచి పోడానికి నిశ్చయించుకున్నాను. మా అక్క ఎక్కడుందో తెలియదు. ఒక వృద్ధ యక్షుడి సలహాపై ఈ శిఖరానికి వచ్చి ఇక్కడున్న చంద్రశేఖరలింగాన్ని ఆరాధిస్తున్నాను. అప్పటినుంచీ ఇప్పటి వరకూ – ఏపురుషుడూ ఇక్కడికి రాలేదు. చంద్రశేఖరుడు కలలో కనపడి – "నీకు పండితుడైన బ్రాహ్మణుడు భర్త ఔతాడు." అని చెప్పాడు. నువ్వు బ్రాహ్మణుడివని చెప్పావు పండితుడివి కూడా ఐతే నిన్ను పెళ్ళాడతాను." అంటూ కొన్ని విద్యలలో పరీక్ష చేసింది.

నేను అన్నిటికి సమాధానం చెప్పాను. ఆమె మెచ్చుకుని నామెడలో పూలమాల వేసింది. నా ఆనందం అంతా యింతాకాదు.

అహోరాత్రాలూ మేము మన్మధ క్రీడలలో తేలి ఆడాం. ఆమె నుంచి మరికొన్ని సంప్రదాయాలు తెలుసుకుని సాంప్రయోగిక ప్రకరణం రాశాను.

అలా నాలుగు నెలలు గడిచాయి. నా దివ్యస్త్రీ భోగమూ, భాగ్యమూ చూసి ఆనందించే మిత్రులు దూరంగా ఉన్నారని ఆమెను నా భూలోక సంచారానికి అనుజ్ఞ ఇమ్మని ప్రార్థించాను తన అక్కకూడా అక్కడుందని ఆమె నాతో దేశసంచారానికి అంగీకరించింది. ఆమె యక్షకాంత అయినా కుబేరుడి శాపం వలన దేవతాశక్తులు లేకపోయాయి. అతికష్టంమీద ఆ కొండదిగి ఆరుమాసాలకు జనపదాలు చేరుకున్నాం.

మధ్యమధ్య సభలు చేస్తూ ద్రవ్యం సంపాదించాం. మనం అనుకున్న కాలం దాటింది, మీరు ఉంటారో లేదో అని సంశయిస్తూనే వచ్చి, పండిత వేషం వదిలి సంగీతంతో డబ్బు సంపాదిస్తున్నాం. ఇదే మా వృత్తాంతం. నిన్న ఈ సత్రం గోడమీద మీరాత చూశాను. ఇప్పుడు నిన్ను చూసి ధన్యుడి నయ్యాను. నిన్న పాడింది సువర్ణపదిక.

తక్కిన మన మిత్రులు కనపడ్డారా? విశేషాలేమిటి? అని అడిగేసరికి దత్తుడు – 'ఏమి అదృష్టం!" అని అతనిని పొగిడి తన వృత్తాంతం కొంతకొంత చెప్పి అతనికి సంతోషం కలగజేశాడు.

"నాటక శాలకి పోదాం రా. సువర్ణపదికని చూద్దువుగాని. నేనుంటే కాని ఇతరులతో మాట్లాడదు. దేవభాష తప్పమరే భాషారాదు." అంటూ సువర్ణనాభుడు దత్తుని చెయ్యి పట్టుకుని తీసుకు వెళ్ళాడు. అప్పటి కామె పార్వతీపూజ చేస్తూంది. ఆమె కతనిని పరిచయం చేశాడు – "దత్తకుడు ... నామిత్రుడు, పండితుడు."

అతను ఆమెని దీవిస్తూ ప్రస్తావనలో – "మీ అక్క, బావలు ఉన్నచోటు నాకు తెలుసు." అన్నాడు. అదివిని ఆమె చాలా ఆత్రత పడుతూ – "మహాత్మా! వారెక్కడున్నారో వేగంగా చెప్పండి. మీకు చాలా పుణ్యముంటుంది." అని కోరగా అతను ఆ కొండగుహ గుర్తులు చెప్పసాగాడు అలా చెబుతూంటేనే అతనికి చిత్తచాంచల్యం కలిగింది. "ఉండండి. ఇప్పుడే వొస్తాను." అని ఎక్కడికో పోసాగాడు. కొంతసేపటికి

స్త్రీ ఐపోయాడు. వెనకటి స్మృతి పోయింది. ఎక్కడికి పోవాలో తెలియక పూర్వపు అలవాటు కొద్దీ రుక్మిణి ఉద్యానవనం వేపు పోసాగింది

తోటమాలులు "చారుమతి." అంటూ కేకలు వేస్తూ... ఆమెకోసం చూస్తున్నారని తెలిసి ఉండి..రాజకుమారుడికి ఆ వార్త చెప్పారు రాజకుమారుడు వెంటనే వచ్చి ఉద్యాన వనంలో పూలు కోస్తున్న చారుమతిని చూసి మోహం ఆపుకోలేక చెయ్యి పట్టుకున్నాడు. ఆమెను అనేక విధాలుగా బతిమాలుకుంటూంటే - ఆమె - "నువ్వెవరివైతే నాకేం? ఏ స్త్రీ కయినా భర్త ఉండాలి. రాజే లభిస్తుంటే వొద్దనే వెర్రిదాన్నా నేను?" అంటూ అంగీకారం తెల్పింది. రాజకుమారుడు ఎంతో ఆనందిస్తూ, ఆమె చెక్కిళ్ళు ముద్దుపెట్టుకుని బండెక్కించి అంతఃపురానికి తీసుకుపోయాడు."

అని తరువాత మజిలీలో మళ్ళీ చెప్పసాగాడు మణిసిద్ధుడు

# కాశీ మజిలీ కథలు

## 149 వ. మజిలీ

### కుచుమారుని కథ

కుచుమారుడు దత్తక మిత్రబృందం ఏడుగురిలోనూ ఒకడు. దత్తునికంటె రెండేళ్ళు చిన్నవాడు. చాలా చక్కనివాడు. ఓషధుల సేకరణలో చాలా అభిలాష. సువర్ణనాభుడికీ అలాటి అభిలాష ఉంది. వాళ్ళిద్దరూ కలిసే కాశీనుంచి బయలుదేరినా కొన్నాళ్ళు ప్రయాణించాక సుకుమారుడైన కుచుమారుడు - "బలవంతంగా ఇంతదూరం వచ్చాం. మంచుతప్ప మరేమీ కనపడడంలేదు. ఇక మనం మళ్ళీ పోయి పురవిశేషాలు చూస్తూ నియమిత కాలానికి ధారానగరం చేరుకుందాం." అన్నాడు. "ఇంక ఒక అడుగుకూడా నేను నడవలేను. అన్నీ కొండలే. పోలేం." అని కూడా అన్నాడు.

సువర్ణనాభుడు నవ్వుతూ "మిత్రమా! నిన్ను రావొద్దని ముందే చెప్పాను. నేను ఈ అరణ్యం అంతుచూడకుండా వదలను. అది నా అంతు చూస్తే చూడనీ ధారానగరం చేరడానికి ఇంకా చాలాకాలం ఉంది నువ్వు ఇక్కడినుంచి ఉళ్ళమీదుగా పో. నేను ముందుకి సాగిపోతాను." అన్నాడు.

కుచుమారు డతన్ని ఎంత బతిమాలినా వినకపోడంతో అతన్ని వదలలేక వదలలేక వదిలి దక్షిణం వేపు వెళ్ళాడు. ఒక కోయపల్లెను చేరి అక్కడి పెద్దవాడిని - "ఇక్కడికి కాశీపురం ఏదిక్కున ఉంది? ధారానగరానికి దారితెలుసా? పాటలీపుత్రం పేరు విన్నావా?" అని అడిగాడు.

అతను - "అవేవీ నే నెరగను. మా పెద్దలు కాశీ అనేవారు. పుణ్యం చేసి చస్తే అక్కడికి పోతారట." అన్నాడు.

"మీ అడవిలో ఆశ్చర్యకరమయిన విశేషాలేమయినా ఉన్నాయా? మహర్షులు యోగులు..సిద్ధులు ...తపస్సు చేసుకునే వారెవరినేనా చూశావా?"

"ఓ! ఇక్కడికి పది దినముల ప్రయాణంలో పడమరగా ఒకరుషి ఉన్నాడు. ఆయన కెన్నేళ్లో ఎవరికీ తెలియదు. పులులూ, సింహాలూ కూడా ఆయన చెప్పినట్లు చేస్తాయి. అక్కడ అవేవీ మనుషుల జోలికి రావు. అత నెప్పుడూ ముక్కు మూసుకుని జపం చేసుకుంటూ ఉంటాడు. పేరు మాకు తెలియదు. అలాటి గొప్పవాళ్ళు మాలాటి వాళ్ళతో మాట్లాడతారా? మాకు ఏదేనా ఆపదొస్తే ఆయనని తలుచుకుని మీదు (ముడుపు)లు కడతాం. మాకోరికలు తీరతాయి. అక్కడికి పోయి మొక్కు చెల్లించుకుంటాం. మేము ఏంతీసుకెళ్ళినా గుడి బయట ఉంచడమే. అతను దానిని కన్నెత్తి కూడా చూడడు. నిరుడే మావాళ్ళు కొందరు మొక్కులు తీసుకు వెళ్ళారు."

ఆ మాటలతో కుచుమారుడికి అతన్ని చూడాలనే ఉత్సాహం పెరిగింది. ఆ సిద్ధుడు మహానుభావుడని భావించి మరునాడు ఉదయం మార్గం అడిగి తెలుసుకుంటూ వెళ్ళి పదిహేను రోజులకి ఆ సిద్ధుడి అశ్రమం చేరాడు. అక్కడ మొక్కలూ లతలూ వాడిపోయి ఉన్నాయి. పూర్వం అక్కడ శోభాయమానంగా ఉండేదనిపిస్తుంది.

కోయవాడు చెప్పిన వనం అదే అని ధ్రువపరచుకుని ఆనవాళ్ళని చూసుకుంటూ వెళ్ళగా ఒక తటాకం కనిపించింది. దానికి మెట్లున్నాయి. నీరు నాచెక్కింది. జలకుసుమాలేమీ లేవు. అంతా వెలవెల బోతూంది. తూర్పున కనపడుతున్న మర్రిచెట్టును సిద్ధుడి ఉనికిగా గుర్తించి కుచుమారుడు అక్కడికి వెళ్ళాడు.

ఆ చెట్టుకింద పర్ణశాల పాడుపడి ఉంది. కృష్ణాజనం, కమండలం ముక్కలయి ఉన్నాయి. సిద్ధుడు పరమపదించాడని గ్రహించి అతను ఆ ప్రాంతమంతా తిరిగి ఏ విశేషాలు కనపడక కొంతసేపు ఆ చెట్టుకింద ధ్యానిస్తూ తలెత్తి ఆ చెట్టుపైకి చూడబోయాడు. దాని శిఖరం కనిపించలేదు. అప్పుడు చెట్టెక్కి ఒక కొమ్మమీద నిలబడి చూడగా అడవి

అంతాకనపడింది. ఆ చెట్టు కొమ్మకి బిరడా బిగించినట్లుంటే అతను అది పట్టుకుని లాగాడు. అది ఇట్లే ఊడివచ్చింది. లోపల పెటెలా ఉంటే తడిమి చూడగా ఒక తాటి ఆకుల పుస్తకం తగిలింది.

ఆశ్చర్య ఆనందాలతో అతను అది తెరచి దేవనాగర లిపిలో ఉన్న ఆరాత చక్కగా కనపడడానికి ఆకుపసరు పూశాడు. ముందుగా – 'సిద్ధుని స్వీయ చరిత్ర' అనే శీర్షిక ఉంది. అతను చదవసాగాడు.

## సిద్ధుడి స్వీయచరిత్ర

గోదావరి తీరంలో పర్ణశాల అనే అగ్రహారం ఉంది. దానిలో శ్రీధరభట్టు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి వయసు మీరాక మహీధర భట్లు అనే కొడుకు పుట్టాడు. వాడికి ఏడేళ్ళ వయసు వచ్చాక ఉపాధ్యాయుల వద్ద విద్యనేరుస్తూ – అష్టసిద్ధుల గురించి శ్లోకం చూసి దాని అర్థం ఏమిటని గురువుని అడిగాడు.

గురువు – "అణిమ, మహిమ, గరిమ, మొదలయిన ఎనిమిదీ అష్టసిద్ధులు మహాయోగులకి తప్ప అవి అసాధ్యాలు. అంతకుమించి నువ్విప్పుడు తెలుసుకో అక్కర్లేదు." అన్నాడు.

కాని అతనికి అష్టసిద్ధులపట్ల అభిలాష పెరిగి...పదే పదే అదేశ్లోకం చూసేవాడు. కొన్నాళ్ళకి అతని తల్లితండ్రులు గతించారు. అతను ఆ గ్రామం వదలి దేశాలు తిరుగుతూ ఒక పండితుణ్ని ఆశ్రయించి ఆ శ్లోకానికి అర్థం చెప్పమన్నాడు – వినయంగా ప్రార్థిస్తూ.

అతను నవ్వుతూ – "నీకు ఈ సిద్ధులని సంపాదించాలని ఉందా? ఐతే విను.

**అణిమ** : పరమాణువు ప్రమాణం పొంది నివసించడం.

**మహిమ** : బ్రహ్మ విష్ణువులకంటే పెద్దవాడై కనపడడం.

**గరిమ** : బ్రహ్మాండం అంత భారంగా ఉండడం

లఘిమ : మేరు పర్వతం అంత ఉన్నా దూదిలా తేలికగా ఉండడం.

ప్రాప్తి : తలచుకునేసరికి కావలసిన పదార్థాలు తనవద్దకు వచ్చేటట్లు చేయడం.

ప్రాకామ్యం : కావలసిన చోటుకి పో గలగడం.

ఈశత్వం : దేవతలకి సైతం అధిపతిగా ఉండడం.

వశిత్వం : దేవతలు, మనుషులేకాక పశు, పక్షి, మృగములు సైతం సేవకులలా సేవలు చేయడం, అష్టసిద్ధులంటే ఇవి."

"ఇవి ఎలా సాధ్యమౌతాయి స్వామీ?"

"తపస్సు వలన అసాధ్యమనేది ఉండదు. తపస్సు చేసి వీటిని సంపాదించు." అన్నాడతను పరిహాసంగా. ఇక మహీధర భట్టు ఉత్తరదేశంలోని అరణ్యాలు, కొండలు, గుహలు తిరుగుతూ కనిపించిన బైరాగినల్లా అడగసాగాడు. "నువ్వు తపస్సు చేస్తావా!" అని వాళ్ళు నవ్వేసి పోయేవారు. చివరకి ఒక కొండ గుహలో తపస్సు చేసుకుంటున్న అవధూతని చూసి ఆయనకు ఏమీ చెప్పకుండా సేవచేయసాగాడు.

కొన్నాళ్ళయ్యాక అతనికి భట్టు మీద దయ కలిగింది. ఒక మంత్రం ఉపదేశించి జపించమంటూ ఆవిధానం అంతా చెప్పాడు. అతను ఆ కొండ గుహలోనే మరోచోట నివసించి - నిద్రాహారాలు మాని తదేకంగా జపం చేస్తూంటే పదేళ్ళు గడిచిపోయాయి. అప్పుడొక దేవత ప్రత్యక్షమై "ఏం కావాలని అడిగితే - "ఎనిమిదవ సిద్ధి అయిన వశిత్వం అనుగ్రహించు." అని కోరా డతను. "అందుకు ఈ జపం చాలదు." అని మాయమై పోయింది.

మరో ఐదేళ్ళు తీవ్ర తపం తరవాత ప్రత్యక్షమై వెనకటిలాగే ఆ జపం చాలాదంది. చివరకు నలభయేళ్ళ జపం తరవాత దేవతకు మహీధరభట్టుకి ఆవరం యివ్వక తప్పలేదు.

వశిత్వసిద్ధి లభించాక మహీధరభట్టుకి తుచ్ఛభోగాలమీద అభిలాష పోయి, భక్తి జ్ఞాన వైరాగ్యాలతో ఆత్మవేత్త అయి కొండమీద ఈ

చిన్న వనం సృష్టించుకుని మృగాలు సేవ చేస్తూంటే ఈ మర్రి చెట్టుకింద పర్ణశాలలో తపస్సు చేసుకునేవాడు. అతనే నేను.

ఆ చరిత్ర చదివిన కుచుమారుడికి కళ్ళవెంట ఆనంద బాష్పాలు కురిశాయి. ఆ మహానుభవుణ్ని చూడడానికి నోచుకోలేదు. ఈ మధ్యనే పరమపదించినట్లున్నాడు. ఎంతవారికేనా మరణం తప్పదు కదా – అనుకుంటూ ఆ పుస్తకంలోని విశేషాలు కొన్నిటిని చదవసాగాడు.

ఓషధీవిశేషాలు మూలికాప్రయోగంతో మనుషులని మృగాలు గానూ పక్షులుగాను మార్చడం, కవిత్వప్రశంస మొదలైనవి రాసి – అవితపస్సు వల్లే సాధ్యాలయినా తన అస్తిమాలను ధరించినవారికి ప్రసన్నాలవుతాయని రాశారు. మాంసమూ, రక్తమూలేని ఎముకల పోగుకనిపించింది. అత నానందంగా దానిదగ్గరికి పోయి, కపాలం పగిలిఉండడం చూసి యోగమార్గంలో శరీరం వదిలి ఉంటాడనుకుని వెండికడ్డీల్లా మెరుస్తున్న ఆ ఎముకలని నీటిలో కడిగి ఎన్నాళ్ళో తపస్సు చేస్తే కాని లభించని వశిత్వ విద్య కుచుమారుడికి నిముషంలో లభించింది.

పశు, పక్షి, మృగాలలో దేనిని పిలిచినా అది వొచ్చి సేవలు చేస్తుంది. ఏ ఓషధిని పేరుపెట్టి పిలిస్తే అది తనను చూపుకుంటుంది. ఆ పరీక్షలన్నీ చేసి చూసి అతను దక్షిణంగా వెళ్ళసాగాడు.

"గోపా! ప్రయాణానికి సిద్ధం చెయ్యి. వేళౌతుంది." అన్నాడు మణిసిద్ధుడు లేస్తూ.

# కాశీ మజిలీ కథలు

## 150 వ. మజిలీ

### సరస్వతి కథ

కుచుమారు డొకసారి ఒక అగ్రహారంలో బ్రాహ్మణుని ఇంటికి అతిథిగా వెళ్ళాడు. అతను భోజనం చేస్తూంటే ఆ బ్రాహ్మణుడు – "అయ్యా! మీరూపం అతిచక్కన. మీ తేజం విద్యాధిక్యతను సూచిస్తూంది. మీరు ఎక్కడికి వెళ్తున్నారు? మీ జన్మ భూమి ఏది?" అని అడిగాడు.

అతను తన వృత్తాంతం చెప్పి – "ధారానగరానికి వెళ్తున్నాను." అన్నాడు.

"అయ్యా! మీరు అంతటివారైతే శ్రమపడి ధారానగరం వెళ్ళడం ఎందుకూ? ఆ రాజు వేలో, లక్షలో ఇవొవ్వచ్చుకాని రాజ్యం ఇవ్వడు కదా? విద్యలలో మీకంత గట్టితనమే ఉంటే సులభంగా రాజ్యలక్ష్మిని చేపట్టే మార్గం చెబుతాను. నాకు ఏం పారితోషికం ఇస్తారు?"

"ఆర్యా! మీవల్ల రాజ్యమే వొస్తే ఫలం మీకూ కొంత ఉంటుంది." "ఇతే వినండి. హిరణ్య గర్భుడనే రాజు పురందర పురాన్ని రాజధానిగా చేసుకుని ఈ దేశం పాలిస్తున్నాడు. అది ఇక్కడికి ఇరవై ఆమడలదూరం. వదాన్యుడైన ఆరాజు భోజరాజులాగే కవీంద్రులని ఆదరిస్తాడు. అతనికి సరస్వతి అనే కుతురొక్కతే సంతానం. ఆమె చరిత్ర విని తీరవలసింది. ఆమెకు అణుశాసాల వరకూ అన్ని విద్యలూ, అరువది నాలుగు కళలూ కరతలామలకాలే. ఆమె అత్యంత సుందరి. ఆమె తన పరీక్షకు నిలచిన వానిని కాని వివాహమాడనని శపథం చేసింది. ఎవరికీ కనపడదు. ఇప్పటికి ఎందరో వచ్చి ఓడిపోయారు. మీకు సమర్థత

ఉందనుకుంటే ఆమెతో వాదించి గెలిచి ఆమెనీ రాజ్యాన్నీచేపట్టిండి. కావాలంటే నా కొడుకు శంబరుడిని మీకు తోడుగా పంపుతాను."

"మహాత్మా! బ్రాహ్మణుని ఆశీర్వాదం అమోఘమయింది. ఆ ఐశ్వర్యం నాకు లభించేటట్లు ఆశీర్వదించండి. ప్రయత్నిస్తాను. సరస్వతి నయినా గెలవగలనని నాకు నమ్మకముంది." అన్నాడతను చిరునవ్వుతో. "కుచుమారా! నీ అకార తేజో విలాసాలు చూస్తూంటే నీలో ప్రభుత్వ చిహ్నాలు కనపడుతున్నాయి. నువ్వు రాజపుత్రిక ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలవు. రాచపుత్రికను చేపట్టగలవు. రాజ్యాధిపత్యం వహించగలవు–" అని ఆశీర్వదిస్తున్నట్లు పలికి, అతని వలన తనకి కూడా లాభం కలుగుతుందన్న ఆనందంలో – "మార్గాయాసం తీరేదాకా నాలుగు రోజులు మాయింట ఉండు." అని ప్రార్థించి తన కొడుకు శంబరుడిని అతనికి ఉపచారాలు చేసేందుకు శిష్యుడిగా నియమించాడు.

నాలుగు రోజులు తరువాత శుభముహూర్తంలో శిష్యుడు తోడురాగా కుచుమారుడు పురందపురం ప్రవేశించాడు. ఎక్కడ చూసినా సరస్వతి వార్తలే. అతను ఆ పట్నం వీధులు తిరిగి తిన్నగా ప్రధాన పురుషుల దగ్గరకి వెళ్ళి – "నేను సరస్వతి ప్రశ్నలకు సమాధానాలు చెబుతాను." అన్నాడు. వాళ్ళు నవ్వి ఆమెముందు ఎంతంత వాళ్ళు ఓడిపోయారో చెప్పి – "వైదికుడా! రాజ్యకాంక్షతో ఆశపడి వచ్చావు కాని ఇది గేలపు సిరికాదు, గంప సిరి. మరోచోట నీపాండిత్య ప్రకర్ష చూపించు." అన్నారు.

అప్పుడతను – "అయ్యా! నేను మీ రాజపుత్రిక చరిత్ర వినే వచ్చాను. తాడి తన్నువాడి తలతన్నేవాడు మరొకడు ఉంటాడని తెలుసుకోండి. ఎన్నో సంవత్సరాలు గురుకులవాసం చేసి విద్యాభ్యాసం గావించి, మహాపండితులమని దిగ్విజయం చేస్తున్న మావంటివారు అంతః పురంలో ఎవరిదగ్గరో నాలుగు మాటలు నేర్చుకున్న స్త్రీలతో ప్రసంగించలేకపోతే ఇక మా విద్యాపరిశ్రమకు ఫలమేమిటి? మీ మాటలకు నేను జడిసిపోను. నేనామె ప్రశ్నలకు జవాబులు చెప్పలేక పోతే ఏశిక్షకేనా సిద్ధమే." అని శపథం చేశాడు.

వారు అతని విద్యావిశేషాలు అవీ రాసి సరస్వతికి పంపారు. ఆమె ఆ పత్రిక చదివి – నవ్వుకుంటూ – "ఇతనెవరో చాలా ప్రగల్భాలు పలికాడు. చెప్పినంత చేయగలిగేవారుండరు. ఇతను ఏదో కొంచెం చదివి ఉంటాడు. బ్రాహ్మణులు గౌరవించదగినవారు. వెయ్యినూట పదహార్లిచ్చి పంపండి." అని తిరిగి రాసి పంపించింది.

అతను – " నన్ను వాదనలో ఓడిస్తేనే తప్ప మీకానుకలకు వశం కాను –" అంటూ ఆ కానుకలను తిప్పి పంపేశాడు. అది సరస్వతి అవమానంగా భావించి – ఎత్తి పొడవాలని ఆలోచించి కొన్ని పువ్వులు, పంపింది. మాల్యగ్రధన వికల్ప అనే 14 వ విద్యలో ప్రశ్న ఆమె అడిగిందని గ్రహించి ఆ పూలను తనపేరు స్పష్టంగా కనపడేటట్లు దండలుగా ... బంతులుగా కట్టి ప్రధానిద్వారా ఆమెకు పంపాడు. అది చూసి ఆమె ఆశ్చర్యపోయి – అతను తన అభిప్రాయం గ్రహించాడని, ఈసారి కొన్ని జాతి రత్నాలనీ కృత్రిమ రత్నాలనీ కలిపి వెలకట్టమని పంపించింది.

కుచుమారుడు మణులకి వెల తెలియజేస్తూ, కృత్రిమమయిన వాటిని పగలగొట్టి ఆ ముక్కలని కూడా పంపుతూ రత్న పరీక్ష అనే విద్యలో తన పాండిత్యం తెలియజేశాడు.

అది చూసి ఆమె – 'ఈ విప్రుడు అపారమైన కళా ప్రావీణ్యం కలవాడనిపిస్తూంది. భగవంతుడు నాకు రాజుని కాక బ్రాహ్మణుని భర్తగా చేయదలుచుకున్నాడా? అనుకుని తన వద్దనున్న మొద్దు చిలకను ఒక దానిని పంపి దానికి విద్యలు నేర్పమంది.

అతను దానిని పలకరించి – "ఏదీ? మీ రాజపుత్రిక సందేశం వినిపించు." అన్నాడు. కాని అది మాట్లాడలేదు. అప్పుడు దానిని తెచ్చిన దాది – "అయ్యా! దీనిని మా రాజపుత్రిక విదేశాలనుంచి తెప్పించింది. ఎంత ప్రయత్నించినా దీనికి ఒక మాట అయినా రాలేదు. మంచి మాటలు నేర్పమని మారాజపుత్రిక మిమ్మల్ని కోరింది." అంది.

"నువ్వు ఇంటికి పో. మాటలు నేర్పి ఈ చిలకను రేపు మీ రాజపుత్రికకి పంపుతాను." అని ఆ పరిచారికను పంపేసి – కుచుమారుడు

*ఎందుకు? పెళ్ళికి పెత్తనం అంతానీదే కదా? నీ తల్లితండ్రులు, బంధువులే* పెళ్ళివారు. నా మిత్రులు దూరంలో ఉన్నారు. ముఖ్యుడివి నువ్వే." *అన్నాడు.*

'అబ్బో! అప్పుడే రాజ్యమూ సరస్వతీ తనకి దక్కినట్లే ఉబ్బిపోతున్నాడు. మిత్రులకు రాజ్యమట. మాకు పెళ్ళి పెత్తనమట. వీడిని ఏం చేసినా తప్పులేదు.' అని మనసులో అనుకుని – "ఆర్యా! ఇవాళ నాకు శరీరంలో స్వస్థతగా లేదు. అందుకే ఇలా ఉన్నాను." అన్నాడు. "అలాఅయితే పెందరాళే పడుకో." అంటూ అతను గాఢంగా నిద్రపోయాడు. అతని గుర్రు వినిపించడం తోటే శంబరుడు సిద్ధం చేసుకున్న రాతిని మెల్లగా ఎత్తి అతని నెత్తిమీద పడేసి శవాన్ని ఎత్తుకునిపోయి కందకంలో పారేసి తానే కుచుమారుడని ప్రకటించుకోసాగాడు.

దుర్జనుల సంసర్గం ఎప్పటికేనా ముప్పే అని శాస్త్రాలు చెబుతున్నాయి కదా?

అప్పటికి ప్రయాణానికి వేళయిపోయిందని మణిసిద్ధుడు – "వొచ్చే మజిలీలో చెప్పుకుందాం." అని లేచాడు గోపాలుడు అతన్ని అనుసరించాడు.

# కాశీ మజిలీ కథలు

## 151 వ. మజిలీ

### శంబరుడి కథ

**దూ**త - ప్రాణమేనా వదులుతాడు కాని యజమాని రహస్యాన్ని ఎవరికీ చెప్పడు.

రాజపుత్రిక కుచుమారుడు చిలకచేత పంపిన సందేశం విని సంతోషించి దానిని ఆదరించి, మరికొన్ని మాటలు చెప్పి మరునాడు ఉదయం అతని దగ్గరకు పంపింది. ఆ చిలుక అతని బసకు వెళ్ళి - శంబరుడిని చూసి - "అయ్యా! మా గురువులు కుచుమారులు ఎక్కడున్నారు? చెప్పండి." అని స్పష్టంగా అడిగింది. "నేను కుచుమారుణ్ని. మరిచి పోయావా? నీకోసం నేరేడు పళ్ళు తెచ్చి ఉండాను. తిను." అన్నాడతను. "అయ్యా! మీ దయవల్ల పండ్లకు లోటు లేదు. పరిహాసం విడచి వారెక్కడున్నారో చెప్పండి. మిమ్మల్ని ఎరగని దానిని కాను. మీరు ఆయన మిత్రులు. మొదటి నుంచీ మిమ్మల్ని ఇక్కడ చూస్తూనే ఉన్నాను. రాజపుత్రిక సందేశం అందించాలి. ఆయన ఎక్కడున్నారో వేగం చెప్పండి." అంది చిలుక.

"రాజపుత్రిక సందేశాన్ని నాకు చెప్పు. మంచి పళ్ళు పెడతాను." ఆశ చూపా డతను.

"మీకు తెలియని ధర్మాలుండవు. భార్యాభర్తల మధ్యమాటలు పైవాళ్ళకి చెప్పడం తప్పు కాదా?" అంటున్న చిలకని చటుక్కున పట్టుకుని - "రాజపుత్రిక మాటలు ఏమిటో చెప్పు.' లేకపోతే నీగొంతు పిసికి

చంపుతాను." అంటూ దానికాళ్ళొక చేత్తోనూ కంఠం మరో చేత్తోనూ పట్టుకుని – "చెబుతావా, చంపేసేదా?" అంటూ ఎన్నోసార్లు గద్దించాడు. కాని అదిచెప్పలేదు.

ఆ చిలక ఉంటే తనగుట్టు రట్టవుతుందని ఆ దుష్టుడు దానిని పీకనులిమి చంపిపారేశాడు.

రామచిలుక తిరిగి రాకపోడంతో సరస్వతి పరితపిస్తూ సారసిక అనే సఖురాలిని పిలిచి – "ఆ చిలుక సందేశం పట్టుకుని రాలేదు. అతను దానిని తనవద్దనే ఉంచుకున్నాడా? ఏదేమయినా నువ్వొక్కసారి ఆ పండితుడి వద్దకు పోయి, చిలక గురించి తెలుసుకుని, వారి ఆకారం చిత్రఫలకం రాసుకునిరా." అంది. అది అతని నివాసానికి వెళ్ళి – "కుచుమారులు ఉండేది ఇక్కడేనా?" అని ఎవరినో అడుగుతూంటే, శంబరుడు తలుపుతీసుకునివచ్చి, "నేనే కుచమారుణ్ణి నువ్వెవరివి?" అని ప్రశ్నించాడు. ఆమె నమస్కరించింది. అతనామెను లోపలికి తీసుకుపోయి కూర్చోబెట్టి గౌరవించి – "నువ్వు వచ్చినపనేమిటి?" అని అడిగాడు. "అయ్యా! నేను సరస్వతి సఖురాలిని. సారసిక అంటారు. ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నది మీరేనా? వారు లోపలున్నారా?" అంది.

అందు కతను నవ్వుతూ – "నీతో పరిహాసం ఆడతానా! మీ రాజ పుత్రికను విద్యలలో జయించి, వివాహం చేసుకోబోతున్నది నేనే." అని మళ్ళీ చెప్పాడు. "మా రాజపుత్రిక మీ వద్దకు నిన్న పంపిన రామచిలుక తిరిగిరాలేదేం? మీ దగ్గరే ఉంచుకున్నారా?" "నిన్న అదినాతో ముచ్చటిస్తూంది. నేను పనిమీద అవతలికి పోయి వచ్చేంతలో ఒక పిల్లి తటాలున దాని గొంతు పట్టుకుని ఈడ్చుకుపోయి చంపేసింది. అందుకే విచారిస్తున్నాను. దానికి విద్యలన్నీ ఉపదేశించాను. మాకు దూతిక అయి వార్తలు తెలుపుతూంది. దానికి ఆయువు చెల్లితే మనమేం చెయ్యగలం?"

"అమ్మో! ఎంతమాట విన్నాను! విద్యలన్నీ వచ్చేసరికి ఆ చిలకమీద మా రాకుమార్తెకి ఎంతో ప్రేమ కుదిరింది. పెళ్ళివేళ కూడా యీ విచారం ఆమెను బాధింపక వదలదు." అని ఆమె అంటూంటే,

శంబరుడు ప్రసంగం మార్చుతూ – "సారసికా! ఇదిగో మీ రాజపుత్రిక పంపిన ముత్యాలహారం చూశావా? నేను కుచుమారుణ్ని కాకపోతే ఈ హారం నాదగ్గర ఎందుకుంటుంది?" అన్నాడు.

ఆ మాటలతోనూ వైఖరితోనూ ఆమె అతను కుచుమారుడు కాదని నిశ్చయించుకుని సరస్వతి వద్దకు వచ్చింది. ఆమె ఎంతో ఆరాటపడుతూ ఎన్నో ప్రశ్నలు వేసింది. సారసిక గుడ్ల నీళ్ళతో మొదట చిలక గురించి చెప్పింది. తరవాత – "సఖీ! నువ్వు అతను గొప్ప విద్వాంసుడని మురిసిపోతున్నావు కాని నాకు అతనేమీ నచ్చలేదు. అతని రూపం ఫలకం మీద రాయబుద్ధి కాలేదు." అంది.

"అతను అసహ్యంగా ఉన్నాడా?" అడిగింది సరస్వతి. "అతని మొహంలో నాకు తేజం ఏమీ కనిపించలేదు. దరిద్ర దేవత నాట్యమాడుతున్నట్లే ఉంది". అప్పుడు సరస్వతి విద్వత్తు ఉన్నచోట దరిద్రం ఉంటుంది. రూపహీనులకి విద్యేరూపం. సారసికా! నువ్వు ఈ చిలకని తీసుకుపోయి దానికిలాగే దీనికీ ఉపదేశం చెయ్యమను." అంటూ పత్రిక రాసి చిలకనిచ్చి పంపింది.

సారసిక అతని వద్దకు వెళ్ళి నమస్కరించి ..ముసిముసినవ్వులు నవ్వుతూంటే, అతను. "విశేషాలేమిటి? ఈ చిలక ఎక్కడిది?" అని అడిగాడు.

ఆమె పత్రికను అందించి – "ఆర్యా! వెనకటి చిలక మరణించినందుకు ఆమె చాలావిచారించింది. దీనికి విద్యలు నేర్పితే ఆమె విచారం పోతుంది. అంతా పత్రికలో ఉంది. చదువుకొండి." అంది. అది విదేశీ లిపిలో ఉండడంతో అతను దానిని చదవలేక పోయాడు. చదివినట్లు నటిస్తూ చివరి వరకూ చూశాడు.

"చాలుచాలు. ఇదా రసికత? అస్తమానూ మాకు ఇదేపనా? మా విద్యలను వృధాగా వినియోగించడం నాకు ఇష్టంలేదు. ఒకమాటు పరీక్షించింది. జావాబు చెప్పాను. పలుసార్లు అడగడానికి ఆమెకు తీరికుందేమో కాని మాకులేదు. ఈ చిలకకి విద్యలు ఇవ్వనని చెప్పు. ఈ ముత్యాల హారం తీసుకుపో. విద్యా విషయంలో ప్రసంగించి గెలిచాను,

అదే చాలు నన్ను పెళ్ళాడ్డానికి ఇష్టంలేకపోతే మానెయ్యమను. జయించబడిందని పత్రికరాసి ఇమ్మను. పో." అంటూ హారం దాని ముందర పారేశాడు.

"రసికాగ్రేసరా! కోపగిస్తారేం? పత్రికలో చిత్రమయిన విషయాలు వ్రాసింది కదా. చిలకని విద్యలు నేర్పకపోతే పోయారు, ఆమెకి సమాధానం ఎందు కివ్వరు? అది మిమ్మల్ని పరీక్షించడానికి కాదు. తనమనసు తెలపడానికి నాకు ఆ లిపి తెలియదు ఏం రాసిందో చెప్పండి." అంది సారసిక.

"నే నామాత్రం తెలియని వాడని కాను. నాకు దేవభాషా లిపి తెలుసో లేదో అని విదేశ లిపిలో రాసింది. ఇంతకంటే పరీక్ష ఏముంది? అన్నాడతను కోపంగా.

"పోన్లెండి మీకు అరవైనాలుగు విద్యలూ వచ్చుకదా? మీరు మరో లిపిలో సమాధానం రాసి ఆమెను పరీక్షించండి. అదీకాక.. మీ రహస్యాలు ఇతరులకి తెలియకుండా ఈ లిపిలో రాసిందేమో?" అందామె. "సారసికా! ఆ మాట లేవీ నాదగ్గర చెప్పకు పరీక్షించడానికే అడిగింది. అందుకే నాకు కోపం వచ్చింది. వెయ్యి సార్లు చెప్పినా నేను జవాబివ్వను. హారం తీసుకుపో." అని మొండివాదం చేయసాగాడు. ఆ లిపి అతనికి తెలియలేదనీ, అతని మాటలు అసందర్భంగా ఉండడమూ గ్రహించి అతను కుచుమారుడు ఔనోకాదో అని సారసిక మనసులో సందేహం బలపడింది. ఇప్పుడే వస్తానని ఆమె సరస్వతి వద్దకు వచ్చింది. "సఖీ! అతనికి నువ్వు రాసిన లిపి తెలిసినట్లు లేదు. పైపెచ్చు కోపం చెందాడు. అతను ఒట్టి మూర్ఖుడిలా కనపడుతున్నాడు. శాస్త్ర పరిశ్రమ మాట అటుంచి మాట్లాడడమే తెలియదు." అంటూ అక్కడ జరిగిన సందవాదమంతా ఆమెకు చెప్పింది.

అందుకు సరస్వతి – "అసహ్యపు మాటలు ఆడకు. ముఖంలో కళలేదనీ, మాట్లాడడమే రాదనీ, మూర్ఖుడనీ అనడం నీ జ్ఞానలోపమే. సర్వభాషల లిపులూ తెలిసిన అతనికి నా లిపి తెలియదనడం సమంజసం కాదు. పలుమార్లు అడిగానని కోపం వచ్చి ఉంటుంది. పోనీలే. ఇంకే మీ అడగొద్దు. ఈ శ్లోకం చూసి ప్రత్యుత్తరం రాసి ఇమ్మను. స్వదేశీలిపిలోనే

రాస్తున్నాను." అంటూ ఒక శ్లోకం రాసిచ్చి ఆమెను పంపింది. ఆమె దానిని తీసుకుపోయి అతని కిచ్చింది ఆ శ్లోకం చదివినా అర్థం చేసుకోలేక తలపంకిస్తూ - జవాబిమ్మని కోరుతున్న సారసికతో - "నేను దీనికి ఇప్పుడు ప్రత్యుత్తర మివ్వను తరవాత పంపిస్తాను. నువ్వుపో." అన్నాడు.

ఆమె చిన్నబుచ్చుకున్న మొహంతో సరస్వతి వద్దకు వెళ్ళి - "సఖీ! నువ్వు నన్ను తిడితే తిట్టు కాని .. వాడిని భర్తగా కోరడం అవివేకం. వాడు వొట్టి బుద్ధిహీనుడు బాగా ఆలోచించుకో." అని హెచ్చరించింది. అదే బుద్ధి లేనిదని సరస్వతి భావించింది.

సారసిక వెళ్ళాక శంబరుడు - 'అయ్యో! నేను తెలివి తక్కువ పనిచేశాను. మళ్ళీ పరీక్షించరనీ, సరస్వతినీ, రాజ్యన్నీ పొందవచ్చుననీ అనుకున్నాను. నా ఆశా, ప్రయత్నమూ అన్నీ వ్యర్థమయ్యాయి. ఇక్కడ ఉంటే నాగుట్టు బయలుపడక మానదు. ఎవరికీ తెలియకుండా పారిపోడమే మంచిది.' అనుకుంటూంటే - మంగళవాద్యాలు వినిపించాయి. అదివిని వాకిట్లోకి వచ్చాడు.

మంత్రులూ, సామంతులూ, పురోహితులూ ముందు నడుస్తూంటే చక్కగా అలంకరించబడిన భద్రగజం వొస్తూంది. అది ఎవరికోసమో అని శంబరుడు అనుకుంటూంటే - 'కుచుమారుడు ఇక్కడే ఉన్నాడు. వారి బస ఇదే.' అన్నా రెవరో.

ఎవరో అడగగా అతను - "కుచుమారుడిని నేనే." అన్నాడు. అప్పుడు వారు అతన్ని చక్కగా అలంకరించి ఏనుగుమీద ఎక్కించి ఊరేగిస్తూ తీసుకుపోయి ఒక చక్కని భవనంలో ప్రవేశపెట్టారు. ఆ ఆనందంలో అతను పారిపోడం మాట మరచిపోయాడు పరిజనులతనికి రాజోపచారాలు చేస్తున్నా అతనికి సంతోషం లేదు. ఎవరేమన్నా బెదిరిపోతూ మాట్లాడుతున్నాడు.

అంతవరకూ చెప్పి మణిసిద్ధుడు కథని ఆపాడు. గురుశిష్యులు ప్రయాణానికి బయలుదేరారు.

# కాశీ మజిలీ కథలు

## 152 వ. మజిలీ

### పల్లెవాళ్ళ కథ

పురందర పురానికి క్రోసు దూరంలో ఒకపల్లె ఉంది. దానిలో వారందరూ చేపలు పట్టీ, ఓడలు తోసీ జీవితం గడిపేవారే. వాళ్ళందరికీ ఒక పురోహితుడు ఉన్నాడు. అతని నడగకుండా కొత్త వలవెయ్యడం కాని, కొత్త పడవని నీటిలోకి తోయడంకాని, ఓడలబాగు మొదలు పెట్టడం కాని ఏమీ చెయ్యరు

ఒకనాడు నలుగురు బెస్తలు పురోహితుడి వద్దకుపోయి నమస్కరించి – "స్వామీ! మేము పెద్దవలని అల్లుకున్నాం దానిని నీళ్ళలో వెయ్యడానికి మంచి ముహూర్తం చెప్పండి." అన్నారు. ఆ రాత్రే అనుకూలంగా ఉందని అతను చెప్పాడు.

"స్వామీ! పురందరపురం కోట అగడ్త (కందకం) లోకి కొత్త నీరు వొచ్చింది. అది చాలా లోతు. గొప్ప గొప్ప చేపలున్నాయంటున్నారు. పగలు దానిలో వలవెయ్యనివ్వరు. ఈ రాత్రి మేము పోయి మీరు చెప్పిన వేళకి వలవిసురుతాం. ముందుగా అందులో పడిన వస్తువు లేదా దానిని అమ్మగా వొచ్చిన సొమ్మో, మీదే." అన్నారు. ఆ రాత్రి – నూరుగజాల తాడు మునిగిన గంగలో పాటపాడుతూ వలవేశారు. కొంచెం సేపట్లోనే వల బరువుగా తోచడంతో గంతులు వేస్తూ తాడు లాగడం ప్రారంభించారు. వలన లాగి ఒడ్డున దులిపేసరికి – "శవంరోయ్.." అంటూ వలని వదిలేసి భయంతో దూరంగా పరుగెత్తారు. అల్లరి చేస్తే రాజభటులు పట్టుకుంటారని ఆలోచించి..గడ్డివెంటి వెలిగించి మెల్లగా దగ్గరకుపోయి శవాన్ని పరీక్షించి చూశారు దాని మెడకి రాయి కట్టబడి

ఉంది. వాళ్ళలో ఒకడు – "వీడినెవరో తలమీద కొట్టి, చచ్చాడనుకుని మెడకిరాయి కట్టి ఇప్పుడే కందకంలో పారేసుంటారు. వీడి ఆయువు గట్టిది. ఇంకా ఊపిరి ఆడుతూంది. బ్రాహ్మడు కాబోలు మెడలో జంజా లున్నాయి. వీడిని బతికిస్తే మనకి పున్నెంవొత్తుంది." అన్నాడు.

మరొకడు– "మనకి ఇక్కడ మొదట దొరకిన వస్తువుని మన బ్రేమ్మడి కిస్తామన్నాం కదా. ఈ బ్రేమ్మణ్ణి ఆ బ్రామ్మడి కిచ్చేద్దాం." అన్నాడు. "ఎలాగేనా బ్రామ్మణ్ణి రక్షిస్తే పుణ్యమే. మనం యితన్ని మన బ్రామ్మడికప్పగించి సేవలు చేయిద్దాం. అందుకయ్యే కర్చుముందు మనమిచ్చు కుందాం. తరవాత ఇతని దగ్గర తీసుకుందాం." అంటూ వాళ్ళు వలనే ఉయ్యాలలా మడత పెట్టి దానిలో అతన్ని వేసి పురోహితుడి దగ్గరకు మోసుకుపోయి – అతనికి జరిగినదంతా చెప్పారు.

"వీడు బతుకుతాడో, లేదో? నా కెందుకు అనవసరపు గొడవ?" అన్నా డతను. "మీకింత దయలేదేం? మీ కులం వాడికి మేము కూడు పెడితే ఒప్పుకుంటారా? సొమ్ము మేమిచ్చుకుంటాం లెండి." అని అతన్ని ఒప్పించి, లోపలికి తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టి సెగతో వొళ్ళు ఆర్చి, గాయాలకి చేపపొట్టుతో లేపాకునూరి పట్టువేశారు.

ఆపదలు కలిగించడమూ, వాటిని తొలగించడమూ కూడా విధి పనే. ఆ రోగి వాళ్ళ ఉపచారాల వల్ల మర్నాడు ఉదయానికి బాగా ఊపిరి తీసుకోసాగాడు. బెస్తలు అతని మంచం వదలక జాగ్రత్తగా ఉపచారాలు చేశారు. నాలుగోనాటికి అతను కళ్ళు తెరచి దాహం ఇమ్మని సూచించాడు. పాలు ఇవ్వగా తాగాడు. పలకలేదు. మరో నాలుగు రోజులకి ఆవుపాలు ఆహారంగా వెళ్ళడంతో అతనికి స్మృతి వచ్చింది.

"అయ్యా! మీది ఏదేశం? కందకంలో పడున్నారేం? మిమ్మల్ని ఎవరు ఇలా చేశారు? మీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగారు. అందు కతను – "నాకేమీ జ్ఞాపకం లేదు. మీరు నన్ను బతికించారు. నేను మీకు దాసుడినై ఉంటాను." అన్నాడు నీరసస్వరంలో.

పల్లెవాళ్ళు సొమ్ము ఇస్తున్నారు కనుక పురోహితుడు అతనికి చక్కగా ఉపచారాలు చేయించసాగాడు. క్రమంగా మెదడు కూడుకుని

అతనికి పూర్వపుజ్ఞానం రాసాగాంది. శంబరుడు చేసినది తెలుసుకున్నాడు పల్లెవాళ్ళని ఎంతగానో స్తుతించాడు.

రోగినిమిత్తం అయినఖర్చు నలుగురూ సమానంగా పంచుకోడంలో తగవువచ్చి వాళ్ళు పురోహితుడి ఇంటికి వొచ్చి ఆయనతో చెప్పుకున్నారు. అది ఆరోగి విని వారినందరినీ పిలిచి – "బాబులారా! మీరందరూ నాకోసం శ్రమపడడమేకాక సొమ్ముకూడా ఖర్చుపెట్టారు. అందుకు కృతజ్ఞుడినే కాక మీ రుణానికి ఇంతకంత ఇవ్వగలను. ఇప్పుడు అంతకంటె ఎక్కువ చెప్పలేను. నేను బతికుంటే మిమ్మల్ని సమానులలో అత్యధికులని చేస్తానని చెబితే ముఖప్రీతి ఔతుంది. నాకు కొంచెం ఒపిక వస్తోంది. కొద్దిరోజులలోనే మీ రుణం తీరుస్తాను. మీరు నాగురించి తగువులు పడకండి." అని వారిని బతిమాలుకున్నాడు. వాళ్ళు అంగీకరించి వెనకటిలాగే కలసి మెలసి ఉండసాగారు

ఒకనాడు కొందరు వర్తకులు ఆ పల్లెకు వచ్చి – "మాకు చదువుకున్న పల్లెవాడు కావాలి. అతనికి తగిన జీతం ఇస్తాం. మేము ఒకసంవత్సరంపాటు రేవుని గుత్తుకు కొన్నాం. దాటే మార్గస్థుల దగ్గర పుచ్చుకున్న సొమ్ము నమ్మకంగా పద్దురాసి మాకు అప్పగించాలి. అదికారం అంతా అతని కిచ్చేస్తాం. అతను నది వొద్దునే కాపరం ఉండాలి." అన్నారు.

అలాటి పనికి తగినవాడు అక్కడెవరూ లేరు. పురోహితుడి ఇంట్లో ఉన్న బ్రాహ్మడది విని – "నేను ఈ పనులన్నీ నమ్మకంగా చేస్తాను. నాకు మొత్తంగా ముందుగా కొంత సొమ్మిచ్చి నెలనెలా వేతనంలో కొంత కొంత తీసుకొండి." అని అతను తన సామర్థ్యమంతా తెలిసేలా వారికి చక్కగా చెప్పాడు.

ఆ వర్తకులు అతను కోరిన సొమ్ము ఇవ్వడానికి ఒప్పుకున్నారు. అతను పల్లెవాళ్ళని పిలిచి తన నిమిత్తం వాళ్ళు ఖర్చుచేసిన సొమ్ము వివరాల పట్టికను తెప్పించి అంతకంటే చాలా అధికంగా వర్తకులచేత వారికి ఇప్పించాడు. వాళ్ళు చాలా సంతోషిస్తుంటే – 'మీరు నాకు ప్రాణదానం చేశారు. నేనేమిచ్చినా మీ ఉపకారానికి సరిపోదు. నేనొకప్పుడు ఈ దేశానికి రాజు కావొచ్చు. అప్పుడు ఏమేనా చేయగలనేమో.. అని పురోహితుణ్ని కూడా పొగిడి వర్తకుల వెంట ఏటి వొద్దుకి పోయాడు.

అది గొప్పరేవు. వేలకొద్దీ బాటసారులు నిత్యమూ ఆ రేవుదాటుతూ ఉంటారు. బాటసారుల నుంచి సొమ్ము వసూలు, పద్దులు రాయడం, ఓడ వారిని తగిన పనులకు నియోగించడం మొదలయిన వాటికి అతన్ని సర్వాధికారిని చేసి అక్కడ కాపరం పెట్టించారు. అతను సరిగా వసూళ్ళు చేస్తూ కచ్చితంగా లెక్కలు రాస్తూ...ఆ నెలలోనే తనయజమానికి ఎక్కువ లాభం చూబించాడు. అతని సత్యప్రవర్తన తెలుసుకుని గుత్తదారుడు అతని మీదే అన్నిపనులూ అధికారాలూ వదిలి వేతనం పెంచాడు.

మరికొన్ని దినాలు గడిచాక కొందరు విద్వాంసులు ఆరేవు దాటడానికి వచ్చి సొమ్ము పుచ్చుకుంటున్న విప్రుడిని చూసి – "అయ్యా! మేము పండితులము. పురందరపురానికి వెళ్తున్నాం. ఆ రాజుకూతురు సరస్వతి కుచుమారుడనే విప్రోత్తముణ్ని వివాహం ఆడుతోంది. ఆ మహోత్సవానికి పండితులందరినీ రమ్మని శుభలేఖలు రాశారు. మేము దూరం నుంచి వస్తున్నాం. మమ్మల్ని ఉచితంగా రేవు దాటించాలి." అని కొరుతూ ఆశీర్వచన శ్రుతి చదివారు. అతను నవ్వుతూ దానిలోని స్వరభేదమూ, అర్థసాలిత్యమూ వారికి తెలియజేసి గంభీరమైన ఉపన్యాసంలో సరయిన రూపం తెలియజేసి వారందరినీ ఆశ్చర్యంలో ముంచాడు.

వారు – 'నీ ఉపన్యాసం వింటే నాలుగుశాస్త్రాలలోనూ పాండిత్యం కలవానికిగా కనిపిస్తున్నావు. ఇలాటి పని చేస్తున్నావేం? మాతో పురందరపురానికి రా. అక్కడ ఎన్నో విద్వత్సభలు జరుగుతాయి. గెలిచినవారికి గొప్పకాను కలిస్తారు. గోనర్దీయుడనే విద్వత్ప్రభువు కూడా వొస్తున్నాడట. ఎన్నోవిశేషాలు జరుగుతాయి. ఈ హీనజీవితం ఎందుకు?" అన్నారు.

"కుచుమారుడు బ్రాహ్మణుడు కదా ... రాజపుత్రిక నెలా వివాహం ఆడుతున్నాడు? వానికి కూడా రాజ్యం ఉందా?"

"అదో పెద్ద కథ..." అంటూ సరస్వతి శపథం గురించి వారు చెబుతూంటే – గుత్తదారుడు ఒక చీటీ పంపాడు. "జయపురం రాజయిన

గోనర్దీయుడు మనరేవుదాటి పురందర పురానికి వెళ్తాడట. పెద్దసిబ్బందితో వొస్తాడు. కనుక తగినన్ని నావలను నియమించి మర్యాదగా వారిని దాటించి మాటదక్కిస్తారని నమ్ముతున్నాను. రేపు సూర్యోదయసమయానికే వారు వస్తారు కనుక సర్వమూ సిద్ధం చేయించాలి." అని ఉందా పత్రికలో.

"గోనర్దీయుడు క్షత్రియుడా!" అడిగాడతను. వాళ్ళునవ్వుతూ "కాదు బ్రాహ్మణుడే. మహావిద్వాసుడు. మంత్ర శాస్త్రంలో ఆయనకు సరి మరి ఎవరూ లేరు. జయపురం రాజు కూతురుని పట్టిన భూతాన్ని వదిల్చి ఆమెను పెళ్ళాడి ఆ దేశానికి రాజయ్యాడు." అని క్లుప్తంగా అతని గురించి చెప్పారు. అంతకంటే తెలుసుకుందుకు అతనికి అవకాశం చిక్కింది కాదు. వారిని ఊరికే రేవుదాటించి, ఏనుగులు, గుర్రాలు మొదలైనవి దాటడానికి అనేక ఓడలను నియమించి, నావికులను సిద్ధంగా ఉండమని – రాజు రాక కోసం ఎదురు చూడసాగాడు. మన్నాడు గోనర్దీయుడు సపరివారంగా వచ్చాడు. రాజభటులు అడగగా ఆ బ్రాహ్మణుడు "అన్నీ సిద్ధంగా ఉన్నాయి. ఇవి ఏనుగులకి అవి గుర్రాలకి...అవి మనుషులకి..అది రాజుగారికి అంటూ వేరువేరు పడవలని చూపాడు. భటులు సంతోషించి – "మీరొకసారి మా రాజుగారి దగ్గరకి రండి. కర్తవ్యం చెబుతారు." అని అతన్ని తీసుకువెళ్తూంటే అప్పుడే ఏనుగుదిగి గోనర్దీయుడు నదీతీరానికి విహారం కోసం వచ్చాడు. ఇద్దరూ ఎదురయ్యారు.

రాజభటులు వొంగి నమస్కరిస్తూ – "మహారాజా! ఇతడే నావికాధిపతి. దేవరదర్శనంకోసం తీసుకువచ్చాం మంచి నావలను ఎన్నిటినో సిద్ధం చేసి ఉంచాడు." అన్నారు. రాజు అతన్ని పరిశీలనగా చూసి ఆశ్చర్యపోతూ " మీ పేరేమిటి? నీ కాపరం ఎక్కడ? జన్మభూమి ఏది?" అని అడిగాడు.

విప్రుడు నవ్వుతూ – "నాపేరు కుచుమారుడు". అంటూండగానే రాజు – ఓహో! మిత్రుడా! నన్ను గుర్తు పట్టలేకపోయావా? గోనర్దీయుడిని." అంటూ గట్టిగా కౌగలించుకుని ఆనంద బాష్పాలతో అతన్ని తడుపుతూ – "నువ్వు ఇంత చిక్కిపోయావేం? రూపం చాలా

మారిపోయింది. ఈ నావికాధిపత్యం ఎక్కడ సంపాదించావు? నువ్వు పురందరపురాధిపతి కూతురు సరస్వతిని విద్యలలో ఓడించి పెళ్ళాడు తున్నావని పత్రికలలో చూసి అక్కడికే పోతున్నాను. మరి ఈ కుచుమారు డెవరు? ఇది వింతగా ఉందే! నీ వృత్తాంతం చెప్పు." అన్నాడు. తమ రాజుగారు అతనితో చనువుగా మాట్లాడడం చూసి అక్కడి వారు ఆశ్చర్యపోసాగారు.

కుచుమారుడు గోనర్దీయుడి చేయిపట్టుకుని ఒక ఏ కాంత స్థలానికి తీసుకువెళ్ళి తనకథ చెప్పాడు."భగవత్సంకల్పం బహువిచిత్ర మైంది. సువర్ణనాభుడు వెనక్కి వెళ్ళిపోయాక సిద్ధాశ్రమ విశేషాలు తెలుసుకుని కొత్త విద్య సంపాదించి సరస్వతిని ఓడించి వరించబడ్డాను. శంబరుడు దుష్టుడని ఎరగక గుట్టు చెప్పాను. వాడు నన్ను తల బద్దలుకొట్టి కందకంలో పడెయ్యగా పల్లెవాళ్ళు నన్ను రక్షించారు. ఆ రుణం కొంత తీర్చి ఈ ఉద్యోగంలో చేరాను."

గోనర్దీయుడు వెక్కి వెక్కి ఏడుస్తూ – "ఎంత ఆపద దాటింది! పల్లెవాళ్ళు మహానుభావులే. వారిని రప్పించు. వాళ్ళంతా బంగారం చేస్తాను. నిన్ను రక్షించిన తలని కులదేవతలా పూజిస్తాను. నిన్ను చంపడానికి ప్రయత్నించిన ఆ దుష్టుడింకా ఇక్కడే ఉన్నాడా? వాడి శిరస్సు నరికేస్తాను." అన్నాడు. ఆవేశపడుతున్న అతన్ని స్వాంతన పరచి – "నేను బతికాను కదా. విచారం దేనికి? శంబరుడిని కాలమే శిక్షించగలదు. వాని తండ్రి చేసిన సహాయం వల్ల విశ్వాసం నన్ను బాధిస్తూంది. అందుకే వాడిని ఏమీ చేయలేక పోతున్నాను. అది సరే. నువ్వు ఈ రాజ్యం ఎలా సంపాదించావు? నీవృత్తాంతం ఏమిటి?" అని అడిగాడు కుచుమారుడు.

"మిత్రమా! దుర్జనులని చేరనిస్తే విపత్తులు తప్పవు. అయ్యో! వాడు తానే కుచుమారుడని ప్రకటించుకున్నాడు కాబోలు. సరస్వతి తొందర పడివాడిని పెళ్ళాడదు కదా? ఆమె అసామాన్య ప్రజ్ఞ కలదిగా నీ మాటలనుంచి తోస్తూంది. మళ్ళీ పరీక్షించకుండా అంగీకరిస్తుందా? కానియ్ ... దైవసంకల్పం మార్చడం మన తరం కాదు. ఇక నా వృత్తాంతం చెబుతాను. విను." అంటూ చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 153 వ మజిలీ

## గోనర్దీయుడి కథ

మిత్రమా! మన మందరమూ ఒకసారి కాశీపురం వదిలాం. నేను పడమటి దిక్కుగా పోయాను. అనేక పురాలూ నదులూ అరణ్యాలూ దాటుతూ అక్కడివిశేషాలూ వింతలూ చూస్తూండగా రెండు నెలలు గడిచాయి. ఆ లోగా చెప్పుకోదగిన విశేషమేదీ కనిపించలేదు.

ఇంక ధారానగరం పోదామని ఒక వూరిలో ఆ మార్గం అడిగి తెలుసుకుని – దక్షిణం వేపు వెళ్ళసాగాను. అటువేపు నేలకంటె అడవిప్రాంతమే ఎక్కువ ఉన్నట్లుంది. నేను వెళ్ళిన దారి – మనుషులు, పక్షులు, జంతువులూ లేని ఒక మహారణ్యంలో వదిలింది. ఎన్నాళ్ళు నడచినా దాని అంతు కనిపించలేదు. ఎన్నాళ్ళు నడిచానో, ఏ దిక్కుకి పోతున్నానో తెలియకుండా దిగ్భ్రమలో తిరిగిన చోటే మళ్ళీ తిరిగసాగాను.

కందమూలఫలాలతో ఆకలిని అణచుకుంటున్నాను. కాని క్రమంగా వొంట్లో బలం తగ్గుతూంది. ఆ అరణ్యం నుంచి బయట పడగలననే ఆశ తగ్గిపోతూ అధైర్యం మొదలయింది. మిత్రులని చూడలేనే అని విచారించసాగాను. మొదటినుంచీ అడవులంటే భయమయిన నేను ఆ అడవిలోనే అంతమై పోతాననుకున్నాను.

ఒకనాడు చీకటిపడేవేళకి ఒకరావిచెట్టుకింద చేరాను. దానిమొదలున చుట్టూ శుభ్రంచేసి ఆ చెట్టుకి నమస్కరించి – వృక్షాలలో రావిచెట్టు అయ్యానని భగవద్గీతలో కృష్ణుడు చెప్పినవాక్యం తలుచుకుంటూ ఆ వృక్షాన్నే దేముడిగా తలుచుకుంటూ కొమ్మలని చూస్తూ ధ్యానించ సాగాను.

ఆవేళ అమావాస్య. కొంచెం మబ్బు కూడ పట్టి - కళ్ళు తెరచినా మూసుకున్నా చీకటిగానే ఉంది. పడుకున్నా నన్ను మాటే కాని నిద్రపట్టడంలేదు. అర్ధరాత్రయినట్లుంది. ఒక భయంకరమైన భూతం బొబ్బ పెట్టుకుంటూ పిడుగులా ఆ కొమ్మలమీదకు ఉరికింది. నావొళ్ళు ఝుల్లుమంది.

రావిచెట్టు మీద బ్రహ్మరాక్షసులు ఉంటారంటారు. ఆ ధ్వనిలోంచి వేదఘోష వినపడుతూంది. ఇది తప్పకుండా బ్రహ్మరాక్షసే. నా ఆయుర్దాయం ఇక గడియలలోఉంది - అనుకున్నాను. అంత్యకాలంలో వేదం చదవడం ముక్తిప్రదం అని ధైర్యం తెచ్చుకుని - ఉత్సాహంగా లేచి కూర్చుని నడుము కట్టుకుని పదాలూ, స్వరాలూ తప్పకుండా సమంగా స్వస్తి చెప్పసాగాను.

నా కంఠధ్వని విని భూతం కిందకి ఉరికి - "ఎవడవురా? భయం లేకుండా నాతో సమానంగా వేదం పలుకుతున్నావ్?" అంటూ పెద్దకేకపెట్టి అడిగాడు. నేను భయం వదిలి "అయ్యా! నా వృత్తాంతం వినండి. నేను గొనర్దీయుడనే బ్రాహ్మణుణ్ని. కాశీలో సమస్తవిద్యలూ చదివాను. అక్కడ నాకు కొత్తవిద్యలు నేర్పే గురువు దొరక్క ఆపట్నం వదిలి ఎన్నో దేశాలు తిరిగాను. కొత్త విద్యలు నేర్పగలిగే వారు ఎక్కడా కనపడలేదు.

ఇక్కడికి ఉత్తరంగా పదియోజనాలలో ఒక అగ్రహారం ఉంది. నేనక్కడికి పోయి నాకు వచ్చిన విద్యలు చెప్పి, కొత్త విద్య నేర్పేవారెవరయినా ఇక్కడ ఉన్నారా?" అని అడిగాను. అప్పుడొక బ్రాహ్మణుడు - "నువ్వు చిన్నవాడివయినా చాలా విద్యలలో పాండిత్యం సంపాదించావు. నీకంటె చదివినవారు ఈ అగ్రహారంలో లేరు. కాని ఇక్కడికి దక్షిణంగా పది యోజనాల దూరంలో ఒక మహారణ్యం ఉంది. అక్కడ ఒక రావిచెట్టుని ఆశ్రయించి ఒక బ్రహ్మరాక్షసుడు ఉన్నాడు. అతనికి రాని విద్యలు లేవు. నువ్వు అక్కడికి పో కొత్త విద్య ఉపదేశిస్తాడు." అన్నాడు. నేను మార్గం అడిగాను.

అప్పుడు మరొక బ్రాహ్మడు నా ప్రశ్న విని – "వెర్రివాడా! అక్కడికి పోయావు సుమీ! ఇతను పరిహాసానికి అన్నాడు. మనుషులని గారి ముక్కల్లా విరచి తినే బ్రహ్మరాక్షసుడు నీకు విద్యోపదేశం చేస్తాడా? వొద్దు. మరోదేశానికి వెళ్ళు." అని చెప్పాడు.

"సర్వవిద్యలూ తెలిసిన ఆయన నన్ను ఎందుకు చంపుతాడు? శిష్యరికం చేస్తానంటే విద్య ఎందుకు నేర్పడు? చస్తే చచ్చాను కాని అక్కడికి పోకమానను" అని నిశ్చయించుకుని గుర్తులు చూసుకుంటూ వెదకుతూ, వెదుకుతూ అతికష్టంమీద ఇవాళ సాయంత్రానికి మీ యింటికి అతిథినై వచ్చాను. నా పూర్వపుణ్యం కొద్దీ మిమ్మల్ని చూశాను. కొత్త విద్యలు నేర్పితే సంతోషమే. లేదా నన్ను భక్షించి ఆకలి తీర్చుకో. ఎలా అయినా చరితార్థుడినే." అన్నాను, నామీద అతనికి జాలికలిగేలా.

"ఎంతమాట అన్నావు! విద్యాభ్యాసానికి ఆశ్రయించిన నిన్ను చంపుతానా? ఎంత బ్రహ్మరాక్షసుడినయినా పాపపుణ్య విచక్షణ లేదా? నీ చిన్నదేహంతో నా ఆకలేం తీరేను? అదీకాక ఇంటికి ఎవరు అతిధిగా వచ్చినా పూజించాలి. అతిథి సర్వదేవమయుడు. నీ అభీష్టం తీర్చకపోతే నాపాపం ఎలా పోతుంది? నన్ను తరింప జెయ్యడానికే నువ్వు ఇక్కడికి వచ్చావు. నీతో మాట్లాడుతూంటే నా పూర్వచరిత్ర స్ఫురణకి వస్తూంది. నీకు నేను చేయగలిగిన ఉపకారం చేసి ఈ జన్మనుంచి విముక్తి చెందుతాను." అన్నాడతను.

నేను పునర్జన్మ ఎత్తినట్లే భావించి – "మహాత్మా! నీ పూర్వ జన్మవృత్తాంతం ఏమిటి? ఎందువల్ల ఇలాటి రూపం వహించావు? నాకు అర్హత ఉంటే – చెప్పి చరితార్థుడిని చెయ్యి." అని వినయంగా ప్రార్థించాను.

అతను చెట్టుమీద కూర్చునే చెప్పసాగాడు.

# దేవభూతి కథ

**కు**మారనగరంలో విష్ణుభూతి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను వేద వేదాంగా. లెరిగిన శ్రోత్రియుడు. అన్నదాత. ఆ పుణ్యాత్ముడికి నేను పుట్టాను. నాకు దేవభూతి అని పేరు పెట్టారు. నేను చాలా చక్కని వాడినని చెప్పుకుందుకు సిగ్గేస్తూంది. నాకు ఐదేళ్ళు వచ్చినప్పటి నుంచీ విద్య నేర్పించడానికి మాతండ్రి పెద్ద ప్రయత్నం చేశాడు. పదిమంది గురువులను పెట్టి అన్నివిద్యలూ నేర్పించసాగాడు నా సూక్ష్మ బుద్ధికీ, గ్రహణ, ధారణ శక్తికీ గురువులే ఆశ్చర్యపోయేవారు. నాలుగువేదాలు, ఆరు శాస్త్రాలూ నేర్చుకుని కొద్దికాలంలోనే తండ్రికంటె గొప్పపండితుడినని వాడుక పొందాను. మా తండ్రి కొద్ది కాలంలోనే స్వర్గస్తుడయ్యాడు. ఇకచెప్పేదేముంది? యౌవనం, ధనం, అధికారం, వివేక శూన్యత నాలుగూ ఉన్న నేను నా అంతటివాడు భూమిమీద లేడని గర్వపడేవాడిని. వచ్చిన పండుతులని సత్కరింపక అవమానించి పంపేవాడిని. అభ్యాగతులు విద్యలేనివారని పరిహసించి పూజించేవాడిని కాను. మా తండ్రిగారు నెలకొల్పిన వాడుక క్రమంగా అంతరించి పోసాగింది. దుర్వ్యసనాలపాలై విద్యార్థులకు నేర్పక ఎప్పుడూ క్రీడలలో ములిగేవాడిని.

మా తండ్రి ఉన్నప్పుడే ఒకశ్రోత్రియుడి పుత్రికని నాకు కట్టబెట్టారు. అది కాపరానికి వచ్చింది కాని దానికి శృంగారంలో ప్రవేశమే లేదు. ఎంతసేపూ మడి, పెద్ద కొప్పు, పూర్వాచారాలతో ఉండేది. నాకు దానివలన సంతోషం లేకపోయేది. కామసూత్రం మొదలు స్మరదీపిక వరకూ ఎన్నో కామశాస్త్రాలు చదివి, కొన్నిటికి వ్యాఖ్యలు రచించిన వాడిని నేను. నా భార్యకి ఇవేవీ అక్కర్లేదు. నా చక్కదనానికీ విద్యకీ సార్ధకత ఏమిటని ఎప్పుడూ విచారించేవాడిని.

నా మిత్రులు కొందరు నన్ను వేశ్యాలంపటుడివి అవమని బోధించారు. కాని వేశ్యల వలపులు సహజములు కావని నా బుద్ధి అందుకంగీకరించలేదు. ఊహలలో సుందరస్త్రీలతో భోగిస్తూ కొన్నాళ్ళు వెళ్ళబుచ్చాను.

మా పక్కనే ఒక శ్రోత్రియ బ్రాహ్మణుడు కాపరం చేసేవాడు. అతని కుమారుడికి ఇతర విద్యలు రాక పోయినా వేదమంతా గట్టిగా వల్లించాడు. అతని భార్య చంద్రముఖి కొత్తగా కాపరానికి వచ్చింది. ఆమె అన్నివిధాలా అతి చక్కనిది. ఆమెను చూస్తూ ఉవ్విళ్ళూరేవాడిని. జడునికి చక్కని భార్యని ఇచ్చి నాకు వొట్టి ఎడ్డిదాన్ని కట్టి పెట్టిన భగవంతుడి మీద నేను విసుక్కున్నాను. చంద్రముఖి లాంటి సుందరి నాభార్య ఐతే సంత్సరమొక గడియలా గడిపేసే వాడిని – అనుకునేవాణ్ణి. కొత్తగా కాపరానికి వచ్చింది ... అత్తమామల చాటునా, ఆడబిడ్డల సందునా మెలగాలి. ఇల్లు కదలడానికి వీలుండదు. అలాటి చంద్రముఖి నాకెలా లభిస్తుందనిపించినా నా అభిలాష వదలక నేను చదివిన గ్రంథాలలోని అనేక తంత్రా లుపయోగించాను.

కొన్ని రోజులకి ఆమె మామగారు మరణించారు. అత్తగారు మూలపడ్డారు. ఆడపడుచులు అత్తారింటికి వెళ్ళిపోయారు. చంద్రముఖే ఇంటి యజమాను రా లయింది. స్వతంత్రం వచ్చాక ఆమె ఏదో పనిమీద మా యింటికి తరచుగా వచ్చేది. మొదట్లో నన్ను చూసి తొలగినా క్రమంగా నేను చనువుగా పలకరించేవాడిని. ఒకనా డామె నా భార్యతో మాట్లాడుతూంటే –

"చంద్రముఖిని చూడు. దాని ముఖం కలకలలాడుతూంటే లక్ష్మి తాండవం ఆడుతున్నట్లే. ఆమె వయ్యారం వంపులూ నీకొకటీ లేవు. దాని మగడి అదృష్టం!" అని పొగిడేసరికి ముసిముసి నవ్వులు నవ్వుతూ వెళ్ళింది. దాని మగని వేదములో తెలియని వాడిలా అడుగుతున్నట్లు నేను వాళ్ళింటికి వెళ్తే చంద్రముఖి ఏదో పని కల్పించుకుని పదిసార్లు నా కంటపడేది.

ఒకనాడు ఆమె భర్తకి సొమ్ము అవసరంపడి తొట్రుపాటు పడుతూంటే – "దేవభూతికి మీరు మిత్రులే కదా. వెళ్ళి అడగండి. ఈ మాత్రం సాయం చేయడా?" అని ప్రోత్సహించి పంపింది.

"రెండు గడియలలో ఒకడు సొమ్ము తీసుకొస్తాడు. నేనొక చోటుకి పోవాలి. నాభార్యతో చెప్పి వెళ్తాను. గడియపోయాక నీభార్యను

పంపు." అన్నాను నేను. అతను అలాగే ఆమెను పంపాడు. నేను ఇంట్లోనే ఉన్నాను. నా భార్య పెరటిలో నీళ్ళు తోడుతూంది. చంద్రముఖి వచ్చి మెల్లగా – " అక్కా! అక్కా! అని పిలిచింది. నేను తలుపుతీశాను.

"మా అక్క ఎక్కడుంది?"

"దొడ్డిలో ఉంది. అపనేమిటో నాకు చెప్పరాదా?" "మీరెరుగనిది కాదు. మీ తమ్ముడికి సొమ్మిస్తానని నన్ను పంపమన్నారట. తెలియనట్లడుగుతారేం?" ఎత్తిపొడిచింది నాలో మోహం పెరిగిపోయింది. "చంద్రముఖీ! నీకు అప్పు ఏమిటి? కావలసినంత తీసుకో." అని వెయ్యిరూపాయల సంచి ఆమె ముందు వేశాను.

"నేనంత ఆశపోతునుకాను మీరిస్తానన్నదే లెక్కపెట్టి ఇవ్వండి." అంటూ చిరునవ్వుతో క్రీగంట నన్ను చూసింది. ఆచూపులకి తాళలేక నేను ఆమెను గట్టిగా కౌగలించుకున్నాను. నా జీవితంలో అనుభవించిన మొదటి సుఖం అదే! ఆమె లజ్జ కూడా నాకు ఇంపుగానే అనిపించింది.

"నా భర్త వాకిట్లో ఉన్నాడు. ఆలస్యమైతే అనుమానం వస్తుంది. తొందరగా సొమ్మిచ్చి పంపండి." అని ఆమె బతిమాలగా సొమ్మిచ్చి పంపాను. ఆమె కోసం ఎదురు చూస్తున్న భర్తకి అది దీర్ఘకాలం అనిపించింది. "ఇంత ఆలస్యం చేశావేం?" అని అతను అలుగగా – "బాగుంది ఒకరి చేతిలో నుంచి సొమ్ము సులభంగా వొస్తుందా? మనకున్న తొందర వారి కుంటుందా? ఆయన భార్య మడికట్టుకుని నీళ్ళు తోడుతుంది. చెయ్యి ఊరుకునే వరకూ నిలబడ్డాను." అని బొంకింది.

మా ఇద్దరి మనసులూ కలిశాయి. సాంకేతికములు ఏర్పరచుకుని నిత్యమూ కలుసుకోసాగాం. ఆహా! ఆమె శృంగారలీలా చాతుర్యం ఏమని చెప్పేది? ప్రౌఢ. క్రమంగా సిగ్గు, మర్యాద వదిలేశాం. లోకానికి జంకడం మానేశాం. ప్రజలు కొన్నాళ్ళు చాటుగా తరవాత బాహాటంగానే నిందిచారు. ఎవరి నీతులూ మేము వినలేదు. చంద్రముఖి భర్త దానిని మా యింటికి రావొద్దన్నా ధిక్కరించి వస్తూనే ఉండేది. అతని మాట లక్ష్యపెట్టకుండా మేము స్వేచ్ఛగా విహరించసాగాం.

ఒకనాడు రాత్రి వచ్చిన చంద్రముఖి మరి ఇంటికి పోలేదు. "నా మగడు వేద జడుడు. నా అత్తగారూ బంధువులూ రట్టు పెడుతున్నారు. వ్రతం చెడినా సుఖం దక్కాలి కద? పగలు మాత్రం ఇంటికి పోవడం ఎందుకు? ఇక్కడే ఉండిపోతాను ' అంది. ఉండిపోయింది.

జాము పొద్దెక్కాక, వంట వేళకి దాని అత్తగారు "చంద్రముఖి మీ యింట్లో ఉందా?" అంటూ వచ్చింది. లోపలగదిలో ఉందని నా భార్య సంజ్ఞ చేసింది. ఆవిడ లోపలికి వచ్చి - చంద్రముఖిని చూసి - "ఏమే రండా! ఇంతసిగ్గువొదిలి ప్రవర్తిస్తున్నావు? కాపరం వొదులుకున్నావా?" అంటూ ఏమేమో దుర్భాషలాడింది.

"నాకు కాపరం అక్కర్లేదు. ఇక మీ యింటికి రాను. మరో కోడలిని తెచ్చుకో." మూడే మాటలు అంది చంద్రముఖి ఆవిడపోయి కాపునీ కరణాన్నీ, వెంట బెట్టుకు వచ్చి నీతి చెప్పించింది. పదిమందీ ఏకమై రావడంతో నేనేమీ చెయ్యలేక బలవంతంగా దానిని దానింటికి పంపాను. మర్నాడు.అది వొచ్చి - "గ్రామస్తు లందరూ ఆలోచించుకుని మనని శిక్షించాలనుకుంటున్నారట మనం ఇక్కడుంటే మాట దక్కదు. విదేశానికి పోతే సుఖంగా ఉండొచ్చు." అని బోధించింది నేనూ అంగీకరించాను.

"నాభర్త బ్రతికుంటే గ్రామస్తులను తీసుకుని మనని వెంట తరమక మానడు. వాడిని చంపేస్తే మనకి ఏ ఆటంకమూ ఉండదు." అంది "ఎలా?" అని నేనడిగాను. "నేను చెబుతానుకదా." అంది.

ఒకనాటి రాత్రి భర్తను నిద్రపుచ్చి నన్ను కత్తి తీసుకుని రమ్మంది కామాంధులకి యుక్తాయుక విచక్షణ ఉండదుకదా? నూరిన కత్తిని పట్టుకుని వెళ్ళి ఆ బ్రాహ్మణుడి కంఠం మీద ఒక్కవేటు వేసి ప్రాణాలు ఎగర గొట్టేశాను. మేమిద్దరమూ ఎవరికి తెలియకుండా నగల మూటలతో ఆ చీకటి లోనే ఊరుదాటి ఉత్తరంగా పోసాగాము. చేసిన పాపం ఊరికే పోదుకదా? కొందరు దొంగలు మమ్మల్ని అడ్డుకున్నారు. నేను బెదిరిపోకుండా, మూట లివ్వకుండా వారిని ఎదిరించాను. ఒకడు

దుద్దుకర్రతో నా నెత్తి బద్దలు కొట్టి చంపి చంద్రముఖిని చేరదీసుకు పోయాడు. నన్ను బ్రహ్మహత్యా పాతకం ఆవహించి నన్ను బ్రహ్మరాక్షసుణ్ణి చేసింది. నేను చంద్రముఖితో అనుభవించిన సుఖం అతి స్వల్పం. నర, మృగ, పశు, పక్షి, జలములు లేని ఈ అడవిలో ఆకలిదాహాలు బాధిస్తూంటే చాలాకాలం గడిపాను. నా కష్టాలు ఇన్ని అని చెప్పడానికి వీలు లేదు.

మహాత్మా! నీ దర్శనంతో నాకీ పూర్వ వృత్తాంత మంతా జ్ఞాపకం వచ్చింది." అన్నాడు బ్రహ్మరాక్షసుడు.

"నువ్వేకాదు, ఎవరేనా అలాగే చేస్తారు. వ్యభిచారంలో అలాటి శక్తి ఉంది." అన్నాను నేను.

అప్పుడతను – "నువ్వు నా నుంచి విద్యలు గ్రహించాలని కదా వచ్చావు? నీకేది రాదో ... ఒకవిద్య చెప్పు." అన్నాడు.

"మహాత్మా! అది మీరే చెప్పాలి." అంటూ నేను చదివిన విద్యల జాబితా చెప్పాను. అతను ఆశ్చర్యపోయి "ఔరా! నువ్వెంతటి వాడివి! నయమే. నిన్ను కూడా భక్షిస్తే ఇంకా మహాపాపం అనుభవించేవాడిని. నీకు వచ్చిన విద్యలలో సగమేనా రావు నాకు. నేను నీకేం చెప్పగలను?" అని మెచ్చుకుని – "నీకొక ఉపకారం చేసి కృతార్థుడినౌతాను. నీ దర్శనం వల్ల ఈ అరణ్యం దాటి దేశసంచారం చేయగలిగే సామర్థ్యం వచ్చింది. నీకు ఉపకారం చేస్తే పాపం నుంచి విముక్తుడి నవుతాను." అంటూ చెవిలో రహస్యం చెప్పి – "ఇలా నీకు రాజ్యవైభవం కలిగేటట్లు చేస్తాను." అన్నాడు.

'రాజ్యం మాట దేముడెరుగు. నేటికి బతికాను' – అని సంతోషంతో అతన్ని స్తుతించాను. అంతలో తెల్లవారే వేళయింది. రావి చెట్టు కొమ్మలు గలగల లాడేలా చప్పుడు చేస్తూ అతను ఎక్కడికో ఎగిరిపోయాడు. నేను బతుకు జీవుడా అనుకుంటూ దక్షిణంగా ఆ అడవిలో కొన్ని రోజులు నడిచాను.

# కాశీ మజిలీ కథలు

## 154 వ మజిలీ

### మదయంతి కథ

కాలంమూడనివాడు నూరుబాణాలతో కొట్టినా చావడు. కాలం చెల్లిన వాడు దర్భ గుచ్చుకున్నా చస్తాడు. బ్రహ్మరాక్షసుడు చెప్పిన విషయం పరిశీలించడానికి కొన్నాళ్ళు ఆ ప్రాంతంలో తిరిగాను. ఒకనాడు ఒక అగ్రహారంలో బ్రాహ్మణుని యింట్లో భోంచేస్తూంటే - మరో బ్రాహ్మణుడు వచ్చి యజమానిని చూసి – "మీ తండ్రిగారు జయపురం నుంచి వచ్చారా? భూతాన్ని వదలగొట్టారా? కానుక లందాయా?" అని అడిగాడు.

"కానుకల లాగే ఉంది. చావు తప్పించుకు వచ్చి మా కంటపడ్డారు. అదే చాలు. నేటికి మూడు లంఖణాలు. ఆ గదిలో పడుకున్నారు చూడు." అన్నా డతను.

"అయ్యో! భూతం వదలగొట్టడం అంటున్నారు ఏమిటి?" అతను ఇలా చెప్పాడు "ఈ దేశానికి రాజధాని జయపురం. ఆ రాజుకి మదయంతి అని ఒక్కతే కూతురు. చాలా చక్కనిది. విద్యా, గుణ సంపన్నురాలు. ఆమెకు వివాహం చేయాలని వివిధ దేశాల రాకుమారుల చిత్ర పటాలూ తెప్పిస్తున్నాడు. అది అలా ఉండగా –

రెండు నెలలకిందట ఆమె నిద్రపోతూంటే భూతమో, బ్రహ్మ రాక్షసుడో ఆమె నావహించాడట. ఇక ఆమె నిద్రపోదు. అన్నం తినదు. ఊరికే కేకలు పెడుతూ కనిపించిన వారిని కుక్కలా కరిచి బాధిస్తూంది. ఆమెను గదిలో పెట్టి తలుపులు వేసి కాపలా కాస్తున్నారు. ఆ భూతం ఎంత గట్టిదో కాని భూమి మీద భూత వైద్యు లెవరూ ఏమీ చెయ్యలేక

పోయారు. మా తండ్రిగారు భూతవైద్యంలో పేరు పొందినవారు. మాంత్రికు లందరూ కలసి నలభై రోజులు నారసింహం, జ్వాలాముఖి, ఉగ్రభైరవం, బాలా బగళాముఖీ మంత్రాలు జపిస్తూ, పద్మాలూ, ముగ్గులూ పెట్టి హోమం చేశారు. ఒకరోజు భూతాన్ని వెళ్ళగొట్టడానికి నిశ్చయించుకుని మదయంతికి జట వెయ్యడానికి పదిమంది మాంత్రికులు సాహసించి తలుపు తీసుకుని హుం పటుస్వాహా...మారయ... మారయ...ఛింది ..ఛింది..అని ఉచ్చరిస్తూ గదిలోకి వెళ్ళారట. వారిలో మా తండ్రి మొదటివాడు. ఆ భూతం వాళ్ళని కరిచి, గీరి, కొరికి హింసలు పెట్టగా వాళ్ళు రక్తాలు కారుతూ..మొర్రో అంటూ ఇవతల పడ్డారు. మా తండ్రిగారి తొడ కరిచింది. పెద్దగాయమై రక్తం కారుతూ జ్వరం వచ్చింది. మిగిలిన మాంత్రికుల గతీ అంతే అయింది. మా తండ్రి గారి బాధ ఎక్కువ కావడం వల్ల సవారి కట్టించి ఇంటికి పంపేశారు. వారి అవస్థ చూసి అంతా నవ్వసాగారట. పెద్ద పులి అయినా అంత లోతుగా కరవలేదేమో.

ఆ భూత వృత్తాంతం విని..భూతవైద్యుణ్ని చూశాను. అతను మూలుగుతున్నాడు. అతన్ని అక్కడి విశేషాలేమిటని అడగ్గా ఆ భూతం తమ మాంత్రికుల మీద చేసిన భీభత్సాన్ని వర్ణించి చెప్పాడు. అది విని నేను ఆనందిస్తూ కదిలి కొన్నాళ్ళకి జయపురం చేరాను. ఎవరికివారే ఆపద చెందినట్లు పట్నమంతా పాడుపడి ఉంది. పౌరులందరూ లేవడంతోటే కోటలోకి పోయి విచారిస్తూ సాయంకాలానికి ఇంటికి వస్తున్నారట. రాజు రాచకార్యాలు చెయ్యకుండా కుమార్తె రోగం ఎలా నివారించబడుతుందా అన్న ఆలోచనలోనే మునిగిపోయాడట.

నేను తిరిగితిరిగి కోటద్వారం వద్దకు పోగా అక్కడ - రాకుమార్తెను ఆవహించిన భూతం చేసిన చేష్టలు వివరించి, ఆ భూతాన్ని వదలగొట్టిన వాడికి రాజ్యాన్నీ, తన పుత్రికనీ ఇవ్వగలను - అని రాజు రాయించిన ప్రకటన పత్రిక కనిపించింది. నేనది చదివి చిరునవ్వు నవ్వుతూ అక్కడున్న రాజపురుషులతో "నేను భూతాన్ని వదలగొడతాను." అనడంతోనే వాళ్ళు నన్ను చుట్టుముట్టి నా వివరాలడిగారు. నేను భూతాన్ని

వదలగొడతానని గట్టిగా ప్రతిజ్ఞ చేయడంతో వాళ్ళు రాజుముందరికి తీసుకుపోయారు.

రాజు నా వివరాలు విని – "ఈ భూతం విద్యలకు సాధ్యం కాదు. ఊరికే కాలసర్పం నోట్లో చెయ్యిపెట్టకండి. బ్రాహ్మణులు, చిన్నవారు. పైగా ఇదే మొదటి ప్రయత్నం అంటున్నారు." అని పెదవి విరిచాడు. "నేను అన్నీ ఆలోచించుకునే వచ్చాను. ప్రకటన చదివాను. ఐదు నిముషాలు మహా ఐతే రెండు గడియలు నేనా భూతాన్ని వెళ్ళ గొడతాను. రాకుమార్తె చేత మాట్లాడిస్తాను. ఆమె ఎక్కడుందో చూపించండి." అన్నాను ధైర్యంగా.

"అయ్యో! లోపలికే పోతారా! అమాంతం మీదపడి చంపుతుంది."

"నాకు లేని భయం మీ కెందుకు? ఆ గది చూపించండి." అన్నాను.

"ఆర్యా! రెండు గడియలలో నా కూతురిని సవ్య పరచి మాట్లాడిస్తే నిన్ను ఇప్పుడే రాజ్యాభిషిక్తుణ్ని చేసి నా అల్లుడిగా చేసుకుంటాను." అని రాజు నా పాదాలకి నమస్కరించాడు. ఈ రాజ్యం నాకు దక్కాలనే ఆ భూతం నీకూతురిని పట్టిందని మనసులో అనుకుని – "రాజా! లే. ఆలస్యం చెయ్యకు." అన్నాను. అప్పు డతను రక్షకభటులను కాపలా చేసి నన్ను ఆ గదికి తీసుకు వచ్చి తాళం తీయించి జడుస్తూ దూరంగా పోయి నిలుచున్నాడు. తొంగితొంగి చూడసాగాడు.

నేను కొంచెం అట్టహాసం చేసి ...స్నానం చేసి విభూతి రుద్రాక్షమాలలు అలంకరించుకుని చేతిలో బెత్తం పట్టుకుని హుంకరిస్తూ గొళ్ళెం తీసి లోపలికి పోయాను.

ఆమె తల విరబోసుకునిచిక్కిపోయి...మంచంమీద పడి ఉంది. నన్ను చూడగానే పులిలా అరిచింది. శరీరం కంపించినా ధైర్యం తెచ్చుకుని గోడకి చేరబడి చూడసాగాను. ఆమె పిడికిలి బిగించి నా మీదకు వస్తూంటే నేను చేతులు జోడించి నమస్కరిస్తూ – "భూతేంద్రా! నేను నీ శిష్యుణ్ని, గోనర్దీయుడిని. పూర్వం చెప్పిన వరమివ్వు. దేవభూతీ! నమస్కారం."

అని శ్లోక రూపంలో చదివాను. దేవభూతి - అని నేననేసరికి ఆమె నన్ను ఎగాదిగా చూసి, నిలబడి నమస్కరిస్తూ - "మహాత్మా! ఇంత ఆలస్యం చేశావా? నీకోసమే ఇంత హడావిడి చేశాను. ఇకనువ్వు ఈ రాజ్యంతో కూడా ఈమెను పెళ్ళాడి సుఖించు. నీకు ఉపకారం చేయడం వల్ల నేనూ పాపవిముక్తి చెందుతాను." అంటూ ఆ బ్రహ్మరాక్షసుడు ఆమెను వదిలి.. ఇంటి పైకప్పు పగలదీసి పెంకులు జలజలరాలుతూంటే ఆకాశంలోకి పోయాడు.

రాజపుత్రిక వాళ్ళెరగకుండా నేలమీద పడిపోయింది. నేను తలుపులు తీసి బయటకు రాగానే రాజు నావద్దకు వచ్చి - "మహాత్మా! ఏం జరిగింది?" అని అడిగాడు. "భూతం వదిలింది. నీ పుత్రికని చూసుకో." అన్నాను.

అత నామెను చూసి - "అమ్మా! మదయంతీ!" అని పిలవగా ఆమె కళ్ళు తెరచి దాహం ఇమ్మని సంజ్ఞ చేసింది. ఆ రాజు నన్ను కౌగలించుకుని "మహాత్మా! నువ్వు మానవ మాత్రుడివి కావు. నన్ను రక్షించడానికి వచ్చిన భగవంతుడిని. కాకపోతే ఈ బ్రహ్మరాక్షసిని వదలగొట్టగలవా? ఈమె దాహం అడుగుతూంది. ఇవ్వ వచ్చునా?" అన్నాడు.

"వేడినీటితో స్నానం చేయించి పథ్యపానాలు తగినట్లు జరిపించండి." అన్నాను. అంతలో అశుభవార్త తెలిసి తల్లి, బంధువులు ఆమె వద్దకు వచ్చి విలపించడం మొదలు పెట్టారు. ఆమె చిరాకు పడి గోలచెయ్యొద్దని సూచించింది. ఆమెకు స్నానం చేయించి అలంకరించాక కొంచెం ఆహారం ఇచ్చారు. కొంచెం స్మృతి కలిగి మాట్లాడడం మొదలుపెట్టాక - "నువ్వు చేసిన పనులు అతి దారుణాలు నీకంత బలం ఎక్కడినుంచి వచ్చిందీ? ఆవిషయాలు నీకేమైనా తెలుసా?" అని అడిగితే -

"నాకేమీ తెలియదు. ఆ రాత్రి మంచం మీద పడుకుని ఉండగా గభీలున ఎవరో మీద పడ్డట్లయింది. నా శరీరం బ్రహ్మాండమంత లావై నట్లనిపించింది. నాకు అంతే తెలుసు. తరవాతే ఏం జరిగింది? ఏం చేశాను?" అని సిగ్గుపడుతూ అడిగింది మదయంతి. తల్లి ఆ చేష్టలన్నీ

చెప్పింది. "గోనర్దీయుడనే మహానుభావుడి వల్ల భూత బారి నుంచి బయట పడ్డావు. అతనే నీకు భర్త." అంది.

"అయ్యో! మాంత్రికులైన బ్రాహ్మణులకు సంకటం కలిగించానా! వారెంత బాధపడుతున్నారో.." అని విచారిస్తున్న కూతురికి –"ఎరగక చేసినదానికి ఎవరికి కోపమూ, పాపమూ ఉంటాయి? మీ తండ్రి వారికి సాయం చేస్తున్నాడులే." అని ఓదార్చింది. కొద్ది రోజులకే మదయంతి మునుపటిలా మన్మథ బాలలా మెరవసాగింది. వాళ్ళు నాకు చేసే ఉపచారాలు ఇన్నీ అన్నీ కాదు. ప్రజలకి నేను భగవంతుడిలాగే కనిపించసాగాను. రాజుకి అల్లుడినీ, రాజ్యానికి అధిపతినీ అయినంధు వల్లనే కాక సహజంగా కూడా వాళ్ళు నన్ను అభిమానించ సాగారు.

ఒక శుభముహూర్తంలో మహారాజు మదయంతిని నాకిచ్చి మహా వైభవంగా వివాహం చేశాడు. ఆమెతో నేను అనంతసుఖాలే అనుభవించాను. తరవాత నాకు పట్టాభిషేకం చేశాడు. రెండు నెలలు పాలించాను. అంతలో కుచుమారుడనే మహా విద్వాంసుడు పురందరాధిపతి కూతురు సరస్వతిని వివాహమాడుతున్నాడని పండితుల వల్ల విని... అలాటి కళా ప్రవీణుడివి నువ్వే అని నిశ్చయించుకుని ఆ వివాహం చూడడానికి బయలుదేరాను. నువ్వు కనపడ్డావు." అని గోనర్దీయుడు తన వృత్తాంతం చెప్పి – "మిత్రమా! ఈ రాజ్యం నా ఒక్కడిదే కాదు. మనం ఏడుగురమూ పంచుకోవలసిందే. మన మిత్రులు ఈ పాటికి ధారానగరం పోయి ఉంటారేమో. మనం అక్కడికి వెళ్ళాలా? కర్తవ్యమేమిటి?" అన్నాడు. కుచుమారుడు – "మిత్రమా! ముందు పురందరపురం వెళ్ళి అక్కడి విశేషాలు చూసి తరవాత ధారాగరం వెళ్దాం." అనగా.. అతనంగీకరించి...రేవు గుత్త తీసుకున్న వర్తకుడికి పదిరెట్లు ధనమిచ్చి, బెస్తలున్న పల్లెకు వెళ్ళి కుచుమారుడు వారి గురించి చెబుతూంటే వారిని కౌగలించుకుని చాలా ధనంఇచ్చి అతను పడుకున్న నులక మంచం, నెత్తుటి గుడ్డలు చూసి దుఃఖించి అతని కాశ్రయం ఇచ్చిన పురోహితుణ్ని పురోహితుడిగా చేసుకుని సపరివారంగా పురందరపురానికి బయలుదేరాడు.

# కాశీ మజిలీ కథలు

## 155 వ మజిలీ

### భైరవుడి కథ

గిరితటం అనే అగ్రహారంలో గౌతముడనే బ్రాహ్మణు డుండేవాడు. అతను పవిత్రమయిన వంశంలో పుట్టినా జనకంటకాలయిన పనులు చేస్తూండడంతో అందరూ అతన్ని భైరవుడని పిలిచేవారు. భైరవుడు దేవాలయాలలోని దీపం ఆర్పేసేవాడు. భారతం నెత్తిన పెట్టుకుని అబద్ధమాడేవాడు. బ్రహ్మహత్య చెయ్యడానికేనా వెనకాడడు. కాసుకోసం వాడు దొంగతనాలు చేస్తూంటే రాజభటులు పట్టుకుని చెరసాలలో పెట్టారు. ఎలాగో తప్పించుకుని పారిపోయి ... గ్రామాలు వదలి ... జుత్తు పెంచుకుని అరణ్యాలలో తిరుగుతూ ఒకనాడు అడవిలో పొద్దు కుంకుతూంటే రాత్రికి ఎక్కడ తలదాచుకోవాలా అని ఆలోచించసాగాడు.

అప్పుడు పెద్ద పెద్ద కొమ్మలతో నాలుగు దిశలా వ్యాపించిన చెట్టు దేవుడిలా కనిపించింది. దాని దగ్గర నేలంతా చక్కగా బాగుచెయ్యబడి ఉంది. అక్కడక్కడ మెత్తని చిగుళ్ళు శయ్యల్లా పరచబడి ఉన్నాయి. ఆ వింత చూసి 'ఇది మనుషులు సంచరించే ప్రదేశంలా ఉంది. రాత్రులు గొప్ప వారు ఈ చెట్టు కిందకి వచ్చి చల్లగాలి పీలుస్తూంటారు కాబోలు. ఎలాగేనా దీనికింద నివసించడం క్షేమం కాదు. ఈ చెట్టు కొమ్మలలో ఉంటే దేముడికి కూడా కనపడను. ఒక తొర్రలో ఉండి ఇక్కడి వింతలు చూద్దాం – అనుకుని ఒక తొర్రని శుభ్రం చేసుకుని దానిలో ఉన్నాడు. అంతలో పొద్దు కుంకింది. వెన్నెల వచ్చింది.

# తిర్యగ్జంతు మహాసభ

పండువెన్నెలలో సింహాలు, పులులు, అడవిపందులు, ఎలుగుబంట్లు మొదలయిన క్రూరజంతువులూ, గుర్రాలు, మేకలు, కుక్కలు, ఎలకలు, పిల్లులు, ఎద్దులు మొదలయిన గ్రామ జంతువులూ గుంపులు గుంపులుగా ఆ చెట్టు కిందకి రాసాగాయి. ముందుగా నక్కలు వచ్చాయి. అవి - వొస్తున్న జంతువులకి ఎదురుగా వెళ్ళి తీసుకువొస్తూ ఉచిత స్థానాలలో కూర్చోబెడుతున్నాయి. సింహం తనకి ఏర్పాటు చేయబడిన పెద్ద గద్దెమీద కూర్చుంది. జంతువులన్నీ సంతోషం ప్రకటించాయి. నక్కలు నిలబడి - "మహాత్మా! భూమండలం అంతా తిరిగి తమ శాసనం తెలియజేశాం. ఆయా దేశాల జంతువులు ఎంతో సంతోషించి ఇప్పుడిక్కడకి తమ ప్రతినిధులని పంపాయి. కాని సిద్ధాశ్రమంలో ఉన్న ఒక్క మృగమూ రాలేదు. మేము పిలవడానికి వెళ్ళినప్పుడే - "సిద్ధుడి ఆనలేనిదే అడవి దాటడానికి వశం" కాదన్నాయి. తక్కిన దేశాల నుంచి మృగాలు వచ్చాయి." అని చెప్పి కూర్చున్నాయి.

అప్పుడు మృగరాజు లేచింది. "మిత్రులారా! మనం అందరమూ యిక్కడ సమావేశం అవడానికి ప్రోత్సాహం చేసిన జంబుకాలని అభినందిస్తున్నాను. సృష్టికర్త ఒక్కడే సర్వాధికుడు. సృష్టించబడిన వన్నీ వాటివాటి బుద్ధిబలం వల్ల ఎక్కువ తక్కువలు సంతరించుకుంటున్నాయి. మనుషులలాగే మనమూ సృష్టించబడ్డాం. వాళ్ళకి బుద్ధిబలం ఎక్కువకనక సృష్టిలో వాళ్ళే ప్రధానం అనిపించుకుంటూ మనలో లొంగిన జంతువుల చేత సేవలు చేయించుకుంటూ లొంగనివాటిని చంపుతున్నారు. కాని మనలో మామూలు జంతువుకున్న శక్తి వాళ్ళులో నూరుమందికి లేదు. వాళ్ళని కాళ్ళకింద చీమల్లా నలిపెయ్యగలిగేశక్తి ఉన్న ఏనుగులు కూడా లొంగి మనుషులకి తొత్తుల్లా పనిచెయ్యడంకంటె చిత్రం ఇంకేమిటి? గుర్రాలు, ఎద్దులు, మేకలు మొదలయిన వాటి మాట చెప్పనే అక్కర్లేదు. ఇందుకు కారణం మన బుద్ధిమాంద్యం, పరస్పర వైరమూ. మనుషులని చూసి మనం నేర్చు

కోవలసింది పరస్పరమైత్రి. ఒక మనిషి మరోమనిషిని చంపితే నేరం. మనలో ఎలకని పిల్లి, పిల్లిని కుక్క, లేళ్ళని తోడేళ్ళు, ఆవులని పులులు, భక్షించాలనే చూస్తాయి. జాతివైషమ్యం మాని మనం ఐకమత్యంగా పెరిగితే ఒకరికి లొంగవలసిన పనే ఉండదు. అరణ్యమృగాలు మనుషులని ప్రేమించవు. గ్రామ మృగాలు మనుషులకు లొంగి వారిని ప్రేమిస్తున్నాయి. వాటి అభిప్రాయం తెలుకోవలసి ఉంది." అని వాటిని చెప్పమన్నట్లు చూసి కూర్చుంది." మా కష్టాలు వేటికీ ఉండవు. మనుషులు మాచేత భూమిని దున్నిస్తారు, ధాన్యం నూర్పిస్తారు, బళ్ళకి కట్టి తోలుతారు. ఇంకాఎన్నెన్నో చేయిస్తారు. అయినా మాకు గడ్డి, పొల్లు తప్ప చారెడు ధాన్యం పెట్టరు. పైగా చావబాదుతారు, కదలమంటూ. మమ్మల్ని స్వేచ్ఛగా తిరగనిస్తే మేము ఆబోతుల్లా బలిసే వాళ్ళమే. మమ్మల్ని ఇన్ని బాధలు పెడుతున్న మనుషులని తప్పకుండా శిక్షించాలి." అన్నాయి ఎద్దులు. దున్నలూ అలాగే అన్నాయి.

అప్పుడు మేకలు నిలబడి – "మాలాటి మెత్తని జాతి మరొకటిలేదు. ఉండేది ఊళ్ళోనూ మేసేది అడవిలోనూ. ఎంత సాధువులుగా ఉన్నా మనుషులు మమ్మల్ని బలవంతంగా చంపుతూనే ఉంటారు. వాళ్ళ పండగలు మాకు గండాలు. మనుషులకే కాక మెకాలకూ మేము లోకువే. మాకు రోగాల భయం ఉండదు. బలవన్మరణమే. భూమిమీద మనుషులు లేకుండా చేస్తే మేము హాయిగా ఉంటాం." అన్నాయి.

ఏనుగులు లేచి – "నీరూపం కలలో చూస్తేనే చాలు ప్రాణాలు వదులుతాం. అలాటిది నువ్వు దయతో రప్పించి మా పక్షం అడిగితే మేము ప్రతిపక్షం చేరతామా? మాకెంత పెద్ద శరీరం ఉన్నా బుద్ధిమాంద్యం వల్ల మనుషులకి లొంగి ఉన్నాం. మాకు వాళ్ళ ఆహారం అక్కరలేదు. అడవిరొట్టచాలు. నల్లమందు వేసి మా బుద్ధిని మందపరుస్తున్నారు. మనుషులు మాకు శత్రువులే కాని మిత్రులు కారు". అన్నాయి. "వాళ్ళుతోమి ... కాళ్ళు వొంచి, పిసికి ... జూలు దువ్వి ... మనుషులు ఉపచారాలు చేస్తారు కనక గుర్రాలు మనలో చేరవేమో?" అని సందేహం వెలిబుచ్చింది సింహం.

ఆ మాటలకు గుర్రాలు నిలబడి – "మృగప్రభూ! మనుషులు మాకు చేసే ఉపచారాలన్నీ వారి పనులు మాచేత చేయించుకుందుకే. బళ్ళకి కట్టి, బరువులు మోయించి, ఎద్దులను కన్న మమ్మల్ని ఎక్కువ బాధిస్తున్నారు మనుషులు. ఆడ గుర్రం మొహమే చూడనివ్వకుండా కట్టి పెట్టి మాచేత బ్రహ్మచర్యవ్రతం చేయిస్తున్నారు. మాకు మనుషులమీద జాలిలేదు. మేము అడవిలో గడ్డి తిని బతకగలం." అన్నాయి. గాడిదలు, ఒంటెలు కూడా అలాగే అన్నాయి.

అప్పుడు సింహం కుక్కల వేపు చూసింది. అవి లేచి – "దేవా! అల్పులమని భావింపక మృగాలతోపాటు మాకు ప్రాతినిధ్యం యిప్పించి యీ సభకి రప్పించినందుకు సంతోషం. జాతి ధర్మంతో మీ పక్క చేరక తీరదు. మాకు మనుషులేమీ అపకారం చెయ్యరు. మేము వాళ్ళు తినే ఆహారమే తింటాం. వారిని వదిలి అడవికొస్తే మాకు తిండి 'ఏది? కొత్తశాసనం ప్రకారం ఒక జంతువు మరొక జంతువుని భక్షించకూడదు కదా? అన్నమో, మాంసమో మాకు కావాలి. అడవిలో రెండూ దొరకవు. మనుషులని మేము ఎలా ద్వేషిస్తాం? ఈ గుర్రాలకయినా మనుషులు పెట్టే తిండి అడవిలో దొరకదు. తమ పిల్లాల్లా చూసుకుంటూ తిండిపెడుతున్న మనుషులని విడచి అడవికి పోవడం మంచి బుద్ధి కాదు. ఇలా చెప్పానని దేవర వారు మాపై శత్రుత్వం పూనరుగాక. క్షమించండి." అన్నాయి వినయంగా. పిల్లులు – "మానవుల ఇళ్ళల్లో ప్రవేశించడానికి కుక్కలకు నిషేధముంది కాని మాకు లేదు. రాజుల అంతఃపురాలు కూడా మా పురుటిగదులే. స్వేచ్ఛగా తిరుగుతూ వారిపాలు పెరుగూ తాగుతాం. వాళ్ళమీద కత్తి కట్టి మీతో అడవికి వచ్చి మేమేం చెయ్యాలి? క్షమించండి." అన్నాయి.

అప్పుడు పులులు తోక తిప్పుతూ "మహారాజా! కుక్కలూ, పిల్లులూ తప్ప తక్కిన గ్రామమృగాలన్నీ మనుషులని ద్వేషించడానికి అంగీకరించాయి. వాళ్ళు ఎంగిళ్ళు తినే అవి అలా అనడంలో ఆశ్చర్యమూ లేదు. గుర్రాలూ, ఎడ్లూ మనలో కలవడానికి అంగీకరించాయి కదా. అరణ్యాల అంచులలో ఉండే గ్రామాలకు మనం వెళ్తే మనుషులని

జయించడం సులభమౌతుంది." అన్నాయి. ఇతర మృగాలు ఆ మాట లంగీకరించాయి.

సింహం లేచి – "తొందర పడకండి. మనుషులు మహా నేర్పరులు. వాళ్ళను ఓడించడం సామాన్యం కాదు. మనలో ఇంకా ఐకమత్యం కలగలేదు. సరీసృపాలు (పాములు మొదలైనవి) కీటకాలు కూడా మనలో చేరాలి. అప్పుడు కాని మనం ప్రయత్నించకూడదు. మరో సభకి వాటిని కూడా రప్పిస్తాను. దీనికి అందరూ ఆమెదించండి." అంది. అన్నీ ఆమోదించాయి. పిల్లులూ, కుక్కలూ పరిహాసం చేస్తూపోయాయి. తెల్లవారే సమయం కావడంతో మృగాలు తమ నివాసాలకి పోయాయి.

భైరవుడు ఆ మృగసభ విశేషాలు చూశాడు కానీ వాటి మాటలు ఏమీ అర్థం కాలేదు. ఏమృగం ఎప్పుడొచ్చి మీద పడుతుందో అని భయంగా తొర్ర నే అంటిపెట్టుకుని కూర్చున్నాడు. తెల్లవారి, మృగాలు దూరంగా పోయాయని నమ్మకం కలిగాక చెట్టుదిగి ఒకదారిన నడవసాగాడు. చిన్న శబ్దమైనా ఉలిక్కిపడి పరుగెత్తేవాడు అలా తిరుగుతూ ఒక నాటి సాయంకాలానికి దైవికంగా సిద్ధకూటానికి చేరి అక్కడ ఒక చెట్టుమీద ఆరాత్రి గడిపాడు.

## సిద్ధుడి కథ

సూర్యోదయ సమయంలో భైరవుడికి గంటానాదం వినిపించింది. 'ఓహో! ఇక్కడ మనుషులు ఉన్నారన్నమాట? లేకపోతే ఈ ధ్వని ఎలా వొస్తుంది? నాకు ఆయువుంది కాబోలు.' అనుకుంటూ నాలుగువేపులా చూశాడు. కొంతదూరంలో విశాలమయిన మర్రిచెట్టు కనిపించింది. దానికి దగ్గరలో మనోహరమైన పర్ణశాల గోచరించింది. ఆ చెట్టు కొమ్మ చివరన కట్టిన గంటను ఒక ఎలుగుబంటి వాయిస్తుంది. అది చూసి అతను. 'అయ్యో! ఆ మృగాలు మళ్ళీ వొస్తాయి కాబోలు రాత్రి కనుక చంపలేదు ఇప్పుడు చంపుతాయి. అదిగో మృగాల రొద

వినపడుతూంది. ఎలుగుబంటి ఈ గంటని ఎక్కడ సంపాదించిందో? అనుకున్నాడు.

అంతలో చమరీమృగాలు వొచ్చి నేలశుభ్రం చేయగా, కొన్ని జంతువులు నీళ్ళు చల్లగా, మరికొన్ని కస్తూరితో ముగ్గులు పెట్టగా - చిలకలు గీతాలు పాడాయి. నెమళ్ళు పురి విప్పి ఆడాయి. భక్తితో కందమూలాలూ, పువ్వులూ తెచ్చి ఆ పర్ణశాలలో జపం చేసుకుంటున్న సిద్ధుని పాదాల దగ్గర ఉంచి అతని ప్రసాదం కోరుతున్నట్లు చేతులు జోడించి అక్కడ ఉన్నాయి.

అవన్నీ చూసి భైరవుడి గుండె చెదిరిపోయింది. ఇది ఏమి మహిమ? ఏనుగులూ, సింహాలూ చెలగాటా లాడుకుంటున్నాయి! మృగాలు వైరం లేకుండా అన్యోన్యంగా ఉన్నాయి! పులి ఆవు గంగడోలు నాకుతూంది!

ఆ చిత్రాలు చూస్తూంటే సూర్యుడు నడి ఆకాశానికి వచ్చాడు. మళ్ళీ గంట మోగింది. భైరవుడు అటు చూశాడు.

విభూతి, రుద్రాక్షమాలలూ ధరించి జటలతో ఒక సిద్ధుడు జపం చాలించి కమండలం పట్టుకుని స్నానానికి బయలుదేరాడు. అతను పర్ణశాల నుంచి చెరువుకి వెళ్తూంటే మృగాల గుంపులు ముందు నడుస్తున్నాయి. ఆ వింత చూసి భైరవుడు సాహసం చేసి ఆ సిద్ధుడు తానున్న చెట్టుకిందగా పోతున్న సమయంలో తటాలున నేలకు ఉరికి పిరికితనంతో - "మహాత్మా! రక్షించు." అని పాదాలమీద పడ్డాడు.

దయామయుడైన ఆ యతి అతన్ని చూసి - "నువ్వెవడివి? ఎక్కడి నుంచి వచ్చావు? నీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగాడు.

"మహాత్మా! నా వృత్తాంతం ఆలకించండి. గిరితటం అనే అగ్రహారం నా కాపరం. నాపేరు గౌతముడు. నా తల్లితండ్రులు చిన్ననాడే గతించారు. దిక్కుమాలిన వాడినై తిరుగుతూ బ్రాహ్మణుడికి విధాయకమైన విద్యను అభ్యసించి వైరాగ్య ప్రవృత్తితో తిరుగుతూండేవాడిని. ధనవిహీనుడిని కనక నాకు ఎవరూ పిల్లనివ్వలేదు. బైరాగి అని పిలిచేవారు

ఆపేరే రూఢి అయింది. బ్రహ్మచారి నవడంవల్ల యథావిధిగా పాటిస్తూ తీర్థయాత్రలు చేస్తూ మహాత్ములని దర్శిస్తూ గడుపుతున్నాను. నా మనసు విరక్తి చెందింది. ఎప్పుడూ మీవంటి తపోధనులను ఆశ్రయించి సేవించాలని ఉంటుంది. బదరీవనంలో ఉండగా తాపసులు మీగురించి చెప్పగా ఎంతో సంతోషంగా బయలుదేరి ఆరుమాసాలకి అతికష్టంమీద మిమ్మల్ని దర్శించుకున్నాను. ఇంక నాకేమీ అక్కర్లేదు. జీవితాంతమూ మీ శుశ్రూష చేసుకుని మీపాదాల దగ్గర తనువు చాలిస్తాను. అలాటి వరం ఇవ్వండి. మీ రెంత మహానుభావులో ఈ జంతువుల సేవే చెబుతూంది. ఇలాటి వింత ఎక్కడా చూసి ఎరగను." అని పెద్దగా పొగిడాడు.

కపటం ఎరగని ఆ సిద్ధుడు అతనికి అభయమిచ్చి – "నీ ఇష్టంమేరకు తపస్సు చేసుకుంటూ కాలం గడుపు. నేను స్నానానికి వెళ్తున్నాను. నువ్వు పర్ణశాలలో కూర్చో రెండు గడియలలో వస్తాను." అన్నాడు "స్వామీ! ఎంత విరక్తుడినయినా మృగాలని చూస్తే నా మనసు బెదురుతూంది. మీరు ఉండబట్టి మాట్లాడగలుగు తున్నాను కాని లేకపోతే నోటి నుంచి మాటేరాదు. దారిలో మృగ సంఘాన్ని తప్పించుకు వచ్చాను. మీరులేకుండా పర్ణశాలకి వెళ్ళలేను."

ఆ మాటలకు నవ్వుతూ – "అడవులు తిరిగా నన్నావు? ఇంత పిరికివాడిగా ఎలా మిగిలావు? ఇక్కడ ఏమృగమూ నిన్నేమీ చెయ్యదు. నిర్భయంగా తిరుగు. నాతో తటాకానికి రా. భయంపోగొడతాను." అన్నాడు. మృగాలు చెరువు వద్దున నిలబడి పోయాయి. సిద్ధుడు స్నానంచేసి మధ్యాహ్నక్రియలు నిర్వర్తిస్తూంటే, భైరవుడు స్నానం చేసి జపం చేస్తున్నట్లు ముక్కుపట్టుకుని గొణిగాడు.

క్రియ లయ్యాక కమండలంతో నీళ్ళు పట్టుకుని సిద్ధుడు బయలు దేరగా అతనితో భైరవుడు కూడా నడిచాడు. యతీశ్వరుడు పర్ణశాలలో ప్రవేశించగానే మృగాలు కూర్చున్నాయి. అతనవి తెచ్చిన పదార్థాలు కొన్ని తాను తినిమిగిలినవి మృగాలకిపంచి పెట్టాడు అవిప్రసాదంలా స్వీకరించాయి భైరవుడు యతితో సుఖంగా కాలంగడుపుతున్నాడు.

ఒకనా డతను – "స్వామీ! నాకు భార్యాపుత్రులు లేరు. విరక్తుడిని అయినా నాకూ చావంటే భయమే. జపానికి కళ్ళు మూసుకుంటే చాలు ఏమృగం మీద పడి చంపుతుందో అనే భయమే. ఇంతకంటె అవరోధం మరేమీలేదు. మీదగ్గర దాచలేక చెప్పేశాను." అన్నాడు. "నువ్వు అందుకు చింతించకు. నీకు కూడా మృగాలు వశమై ఉండేటట్లు తంత్రం ఒకటి చెబుతాను. అప్పుడు మృగాలు నీకు తొత్తులౌతాయి." అంటూ ఆ యతి అతనికి ఆ ప్రక్రియని బోధించాడు.

ఆ విద్య తెలుసుకుని చాలా సంతోషిస్తూ నిర్భయంగా ఆపర్ణశాలలో సిద్ధుడితో నివసిస్తూ మరికొన్నాళ్ళు భైరవుడు జపం నటించాడు. సిద్ధుడికి అతనిమీద చాలాదయ కలిగింది. బాగా చనువేర్పడ్డాక భైరవుడు "మీవంటి తపశ్శాలురికి బంగారం చేసేప్రజ్ఞ ఉంటుందంటారు. అది ఎంతవరకూ నిజం?" అని అడిగాడు. " ఆ యోగం మాకు తెలుసు. కాని దానితో మాకు పనేముంటుంది? మా దృష్టిలో మట్టీ బంగారమూ ఒక్కటే." "దానితో నాకూ పనిలేదు. కాని ఎలా ఔతుందో చూడాలని అభిలాషగా ఉంది. కొత్తవిద్య వింతకదా? అందుచేత ఆ యోగం ఉపదేశించమని కోరుతున్నాను. సాహసమే. మీకు పుత్ర సమానుణ్ని మరి."

"అహంకార మమకార గ్రస్తులు ఆ విద్యను స్వీకరించడానికి అర్హులు కారు. స్వార్థపరులు అనర్హులు. నీ బుద్ధి గ్రహించాక ఉపదేశిస్తాలే."

"చిత్తం చిత్తం." అని – మరికొన్నాళ్ళు పోయాక భైరవుడు మళ్ళీ అడిగాడు.

అతని మాటలలో స్వార్థం గ్రహించి – యతి "కొన్నాళ్ళు పోతే కాని ఉపదేశించను." అన్నాడు. అతను అప్పుడప్పుడు అడుగుతూనే ఉన్నాడు. "నీ మనసు పరిపక్వం చెందలేదు. నిష్కాముడికి తప్ప దానిని ఉపదేశించకూడదు. విరక్తుడి వయ్యాక అడుగు." అనేవాడు యతి.

ఒకనాడు మధ్యాహ్నం సిద్ధుడూ, భైరవుడూ తటాకంలో స్నానం చేస్తూంటే ఒక విప్రకుమారుడు వచ్చి సిద్ధుడితో సంస్కృతంలో ఏదో అనగా అతనూ ఏదో అన్నాడు. ఆ భాష తెలియని భైరవుడు "నువ్వేవడివి?

ఎందుకు వచ్చావు? ఇది రహస్యస్థలం పామరులు ఇక్కడికి రాకూడదు." అన్నాడు అతను బెదిరిపోతూ – "అయ్యా! నేను బ్రాహ్మణుడిని. విద్వాంసుడిని. ధారానగరం వెళ్తూ దారితప్పి వచ్చి శరణు చొచ్చాను. మీ రహస్యాలకి భంగం చెయ్యను. మృగాలకు భయపడుతున్నాను. రక్షించండి." అని వేడుకున్నాడు.

సిద్ధుడు "భయంలేదు, రా" అంటూ సైగ జేశాడు. అతను తటాకం దగ్గరగాపోయి ఇద్దరికీ నమస్కరించి ఎదురు చూడసాగాడు. తరవాత సిద్ధుడు అతన్ని పర్ణశాలకి తీసుకెళ్ళి ఫలహారాలు పెట్టి, మృగాలకి కూడా ప్రసాదం ఇచ్చాడు. అది చూసి అతను చాలా ఆశ్చర్యపడి సిద్ధుడి తపోమహత్యానికి ఆశ్చర్యపోయాడు. సిద్ధుడు అడగగా అతను తన వృత్తాంతం చెప్పసాగాడు.

## చారాయణుడి కథ

"నేనొక బ్రాహ్మణ పుత్రుణ్ణి. చిన్నతనంలోనే నా తల్లితండ్రులు గతించారు. పోషించే వారు లేక కాశీనగరం వెళ్ళాను. అక్కడ దత్తకుడు మొదలయిన మిత్రులతో కలసి విద్యాభ్యాసం చేశాను. మేము ఏడుగురమూ సమస్త విద్యలలోను ఉత్తీర్ణులమై మాతో వాదించగల పండితులు భోజరాజు ఆస్థానంలో ఉన్నారని విని, వారితతో ప్రసంగించాలని తలొక దారినీ ఆ వూరు పోతున్నాం. దేశ విశేషాలు చూస్తూ సంవత్సరం నాటికి అక్కడికి చేరాలని గడువుపెట్టుకున్నాం.

నేను ఒక మార్గాన పురాలు, నదులు, అడవులూ చూసు కుంటూ ప్రయాణం చెయ్యసాగాను. 'ఈ మార్గం చాలా కష్టమైంది. దూరంలోకాని గ్రామమేది లేదు. "అని ఒక పల్లెలోని వారు ఎంతగానో చెప్పారు. యౌవనమదం గర్వం కలిగిస్తుంది కదా. నేను వారి మాటలు లెక్కచెయ్యక ఆ దారినే పోవడం మొదలుపెట్టాను. ఆ ప్రయాణంలో పడ్డబాధలు చెప్పడానికి పదిరోజులేనా చాలవు. రాళ్ళు, ముళ్ళూ, ఎంతదూరం

పోయినా నీరు దొరకదు. పశుపక్షిమృగాలు కనిపించవు. మధ్యాహ్నాం అయ్యేసరికి ఎండమావులు. వాటిని చూసి మోసపోయే వాడిని. నేను తెచ్చుకున్న ఆహారపదార్థాలు ఐపోయాయి. నాలుగు రోజులు ధైర్యంగా నడిచాను. తోవంతా ఒకలాగే ఉంది. కాళ్ళు పొక్కు లెక్కాయి. జవసత్వాలు తగ్గాయి. నాలుగో రోజు ఒకరాతి మీద పడుకున్నాను. తెల్లవారి లేవలేక లేచి నాలుగుమూలలా చూశాను. దూరంలో ఒకతోటలాటిది కన్నుల పండగగా కనిపించింది. సాయంకాలానికేనా చేరగలనా అని అధైర్యం కలిగింది. జాము పొద్దెక్కేసరికి – కేవలమూ దేవుని మహిమవల్ల నా దేహాన్ని ఎలాగో అక్కడికి చేర్చాను. అది చిన్నపల్లెలా ఉంది. ఒక్కటే బ్రాహ్మణ గృహం ఉంది. నేను ఏమీ తెలుసుకోకుండా కొబ్బరి చెట్లనీడలో ఉన్న అరుగుమీద పడుకున్నాను ఇకనాకు వొళ్ళు తెలియలేదు.

తెలివొచ్చి కళ్ళు తెరిచేసరికి నాముఖంమీద నీళ్ళు చల్లబడి ఉన్నాయి. పన్నెండేళ్ళ బాలిక నాకు గాలి విసురుతూంది. నేను రెప్పలు విప్పడం చూసి – "అయ్యా! దూరం నడవడం వల్ల అలసి పొయి నట్లున్నారు. వంటయింది. లేచి స్నానం చేసి భోంచెయ్యండి. మా తండ్రిగారు మీకోసం ఎదురు చూస్తున్నారు." అంది.

ఆ మాటలు అమృతంలా తోచాయి. లేవలేను, దాహం ఇమ్మని సూచించాను. అప్పుడామె లోపలికి పోయి తల్లితండ్రులని తీసుకు వచ్చింది. పిలిచినా పలకని నన్నా యజమాని పట్టుకు లేవనెత్తి తనకి ఆన్చుకుని నాలుగు బిందెల చన్నీటితో నన్ను స్నానం చేయించాడు. చల్లని మజ్జిగ తేట నా నోటిలో పోశాడు. నా ప్రాణాలు తిరిగివచ్చాయి. నేను ఆయనకి నమస్కరిస్తూ నన్ను బతికించినందుకు కృతజ్ఞత తెలుపుకున్నాను. అతను అడగగా నా వృత్తాంతం చెప్పాను. అతను సంతోషిస్తూ లోపలికి తీసుకుపోయి చక్కనిభోజనం పెట్టాడు. పదిరోజులు నాకు ఉపచారాలు చేశారు. నాకు మామూలు శక్తి వచ్చింది.

ఆ బ్రాహ్మణుడి పేరు బ్రహ్మదత్తుడు. చతుశ్శాస్త్రాలలో పండితుడై ఒక మహారాజు వల్ల ఆ గ్రామం అ గ్రహారంగా స్వీకరించి అక్కడ నివసిస్తూ భూమి మంచిదవడం వల్ల పంటలు పండిస్తున్నాడు. ఆ అమ్మాయి అతని

కూతురు, పేరు మల్లిక. ఆమెకు తండ్రి అన్నివిద్యలూ నేర్పాడు. అప్పటికి తర్కవ్యాకరణాలు, కవిత్వం, సంగీతాలలో పాండిత్యముంది.

ఒకనాడు అతనామె చేత నన్ను కొన్ని ప్రశ్న లడిగించాడు. నా పాండిత్యం తెలుసుకుందుకని గ్రహించి నావిద్యా పాటవం తెలిసేలా చెప్పాను. అతను ఆశ్చర్యపోయి నన్ను మల్లికని పెళ్ళి చేసుకోమన్నాడు. నేను ఆ సిరిని అంగీకరించాను. మా వివాహం వైభవంగా జరిగింది.

కొన్నాళ్ళు అక్కడ ఉండి, మిత్రుల సంగతి చెప్పి ధారాన గరానికి బయలుదేరాను. పోవొద్దని బ్రహ్మదత్తుడు బతిమాలినా – "మిత్రులని వెంటపెట్టుకుని తొందరలో వస్తాను." అని వొప్పించాను. పదిరోజులు శ్రమపడి నడిచాను. దైవికంగా ఈ ఆశ్రమం కనిపించింది. తపోవనం కనుక మృగాలమధ్య జాతివైరా లుండవని తెలిసినా సహజమైన భయం పోలేదు.

మీ దర్శనం అయింది. జన్మపావనం అయింది. నాకింకేమీ అక్కర్లేదు."

సిద్ధుడు సంతోషించి ప్రస్థానత్రయంలో అతనితో ముచ్చటించి అతని జ్ఞానానికి సంతోషిస్తూ ఎప్పుడూ అతనితోనే గోష్ఠి చెయ్యసాగాడు. కొన్ని రోజులయ్యాక అతనికి తన విద్యలు ఉపదేశించాలనిపించింది. చారాయణుడు వచ్చింది మొదలు యతి భైరవుడితో తిన్నగా మాట్లాడడం లేదు. వాడు కపటి అని గ్రహించి నప్పటినుంచే ప్రీతి తగ్గిపోయింది.

చారాయణుడి మూలంగా యిలా జరుగుతూంది. వీడినెలా వెళ్ళగొట్టాలి? ఇతనికి రెండుమూడు రోజులలో కాంచన యోగం ఉపదేశిస్తానంటున్నాడు. నేనుపడ్డ శ్రమంతా వృధా అయింది. గెద్దలా వచ్చి వీడు ఆ విద్యని తన్నుకు పోతున్నాడు. ఎలా ఆపాలి? – అని ఆలోచించసాగాడు భైరవుడు.. సిద్ధుడికీ, చారాయణుడికీ అనుబంధం క్షణక్షణానికీ వృద్ధిపొందుతూంటే భైరవుడికి వారిమీద కోపం పెరుగుతోంది. ఉపదేశానికి సిద్ధుడు రహస్యంగా ముహూర్తం పెట్టి చెప్పడం అతని చెవిన పడింది. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు.

సిద్ధుడు వాడుక ప్రకారం స్నానం చేసి వచ్చి ప్రాణాయామ యోగంలో జపం చేసుకోసాగాడు. చారాయణుడు తటాకానికి వెళ్ళాడు. ఆ అవకాశం చూసి భైరవుడు పెద్దరాయిని తెచ్చి సిద్ధుడు భూమికి మొక్కుతున్న సమయంలో ఆ పాషాణాన్ని అతని తలమీద పడేశాడు. "హా! పరమేశ్వరా!" అంటూ అతను గిలగిల తన్నుకుని మరణించాడు.

పరమదయాళువై ... తనకి ఎంతో ఉపకారం చేసి ఆదరించిన ఆ మహానుభావుణ్ణి చంపడానికి అతనికి చేతులు ఎలా వచ్చాయో? అలాటి వాడి పేరు తలవడం కూడా పాపమే. కథకోసం చెప్పవలసి వచ్చింది." అన్నాడు మణిసిద్ధుడు.

"తరవాత ఏం జరిగింది గురువుగారూ?" అడిగాడు గోపాలుడు.

మణిసిద్ధుడు చెప్పసాగాడు. "సిద్ధుడు పడిపోడం చూసి మృగాలన్నీ కన్నీరు కార్చుతూ భైరవుడికి భయపడి గుంపులుగా తటాకానికి పోయి చారాయణుడితో ఏదో మొరపెట్టుకుంటున్నట్లు ఏడిచాయి. అందుకేదో కారణం ఉంటుందని అతను తటాలున పర్ణశాలకి వచ్చి బ్రహ్మరంధ్రం పగిలి రక్తం కారుతూ దీర్ఘనిద్రలో మునిగిన ఆ యతీంద్రుడిని చూసి గుండె గుభేల్ మనగా చేతిలోని కమండలం జారవిడచి – "హా! కరుణామయా! తపోనిధానా! నిన్ను చంపిన వాడెవడు తండ్రీ?" అంటూ నేలమీద పడిపోయాడు. "నువ్వు అజాత శత్రువే. ఎవరికీ అపకారం చేయవే! నీ సన్నిధిలో మృగాలే అన్యోన్యంగా ఉంటాయి. నీమీద పగెవరికి? నిన్ను చంపిన ఆ పాపాత్ముడెవరు? నీచావు చూసిన నేనెంత పాపాత్ముడినో! నువ్వు ఇలా బలవన్మరణం పొందావా! మొన్న – 'ఇంకఎంత కాలమో బతకను. నీకు విద్యలు ఉపదేశిస్తాను.' అన్నావు. ఇంతలోనే చావు మూడుతుందనుకోలేదు తండ్రీ! నావేపు చూడు. అవసాన ఉపదేశం చెయ్యి. అయ్యో! నా దారిన నేనుపోక నీ దగ్గరకి ఎందుకు వచ్చాను? ఆ తెలిసింది. నావల్లనే నీకు ఈ మరణం సంభవించింది. నువ్వు నాతో చనువుగా ఉన్నావనే వాడికి అసూయ కలిగింది.

భైరవా! ఎక్కడికి పోయావు? నీకు అతనేం అపకారం చేశాడు? నిష్కారణంగా గురుద్రోహం ఎందుకు చేశావు? వీరిని చంపి ఏంమూట కట్టుకున్నావు? సందేహం లేదు. వీరిని నువ్వే చంపావు." అంటూంటే భైరవుడు కోపంగా అతని ఎదుటికివచ్చి – "ఏమి పేలుచుంటివిరా? ఈ సిద్ధుణ్ని నేను చంపడం నువ్వు చూశావా? నువ్వే చంపి నామీదకు తోస్తున్నావు. తారతమ్యం తెలుసుకుని మాట్లాడు. ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములువాడి అనే సామెత నిజం చేస్తున్నావు. అతను నాకంటె నీకు దగ్గర చుట్టమా? ఛో. నువ్వే చంపావు." అని గద్దించాడు.

చారాయణుడు కన్నీరు కారుస్తూ – "మనంకాక మరెవరూ లేరు. మృగాలు రాయిని ఎత్తలేవు. మొన్న నువ్వు అరాయిని తెస్తూంటే నేను చూశాను. నువ్వే చంపావు నీచా! నీముఖం చూడకూడదు. యముడు నీకు ఎలాటి నరకం ఇస్తాడో.." అని నిందించేసరికి భైరవుడు కోపంతో – "నన్ను నీచుడంటావా! యతి చావు అటుంచి నీ బతుకు మాట చూసుకో." అంటూ తన చేతిలో దాచి ఉంచిన ఓషధిని అతనినెత్తిమీద రుద్ది ఏదో తాయెత్తు కట్టాడు. చారాయణుడు ఆ క్షణంలోనే గాడిద అయిపోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 156 వ మజిలీ

చారాయణుడు ఇంటినుండి వెళ్ళిన కొన్ని నెలలలకి మల్లిక పుష్పవతి అయింది. అల్లుడు వస్తానని చెప్పిన గడువు దాటడంతో బ్రహ్మదత్తుడి భార్య చాలా ఆత్రత పడసాగింది. పరదేశులు వస్తే అల్లుడి జాడే అడిగేది. ఆమె ఒకనాడు భర్తతో – "కులశీలాదులు తెలుసుకోకుండా మనం చారాయణుడికి పిల్లనిచ్చాం. అతను పుస్తికట్టి లేచిపోయాడు. అతని గ్రామం.. బంధువులు.. ఏమీ మనకి తిన్నగా తెలియవు. మల్లిక సిగ్గుతో చెప్పదుకాని ఏదో ఆలోచిస్తూనే ఉంటుంది. ఏ పేదవాడికిచ్చినా ఇంటి పట్టున ఉండేవాడు. ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?" అంది.

అందుకు బ్రహ్మదత్తుడు – "చారాయణుడు మహా పండితుడు. ఏ రాజు ఆస్థానంలో పూజించబడుతున్నాడో? రెండు మూడు రోజుల్లో వొస్తే సరే. లేకపోతే నేనే ధారానగరానికి వెళ్ళి అతని వృత్తాంతం తెలుసుకు వస్తాను. మీరిక్కడ ఉండగలరా?" అన్నాడు. తల్లి అందుకు అంగీకరించినా, మల్లిక – "తండ్రీ! మేము మాత్రం ఒకసారి దేశవిశేషాలు చూడకూడదా? కుపస్థ మండూకాలలా ఎల్లకాలమూ ఈ అడవిలోనే ఉండిపోవాలా? మమ్మల్ని కూడా తీసుకు వెళ్ళండి." అని బతిమాలుకుంది. అతను అంగీకరించి ఒక శుభముహూర్తంలో కుటుంబంతో బయలుదేరి ధారానగరం మాళవ దేశంలో ఉందని తెలుసుకుని ఆ దిక్కుగా పోతూ కొన్నాళ్ళకి అష్టాపథ సత్రం చేరుకున్నాడు.

# అష్టాపథ సత్రం కథ

ఒక మహారణ్యం మధ్యలో ఎనిమిది దిక్కులనుంచి వచ్చిన మార్గాలు కలుసుకున్నాయి. ఒక పుణ్యాత్ముడు అక్కడ ఒక గొప్ప సత్రం కట్టించాడు. అదే అష్టాపథ సత్రం. అక్కడ జలం సమృద్ధిగా ఉండి చెట్లూ, లతలూ అవీ చక్కగా పెరుగుతాయి. ఆ సత్రానికి మూడు యోజనాల దూరం వరకూ గ్రామం ఏదీ లేదు. రాళ్ళు, ముళ్ళు నిండిన మార్గంలో చాలా దూరం నడచివచ్చిన బాటసారులు అక్కడ విశ్రాంతి తీసుకుంటారు. నాలుగు వర్ణాల వారికీ భోజన సదుపాయం జరుగుతుంది. ఏభయ్యారు దేశాల వారూ అక్కడికి వస్తారు. అన్ని దేశ భాషలూ అక్కడ వినపడుతూ ఉంటాయి.

బ్రహ్మదత్తుడు కుటుంబంతో సహా ఆ సత్రంలో ప్రవేశించాడు. సత్రం అధికారులని పొగడుతూ అతను కుటుంబంతో అక్కడుండి విశేషాలు తెలుసుకోసాగాడు.

ఒకనాటి రాత్రి పండువెన్నెల కాస్తుంది. బ్రాహ్మణులు భుజించి సత్రపు అరుగులమీద కూర్చుని వింతవిషయాలు చెప్పుకుంటున్నారు. ఒక తార్కికుడికీ, కవికీ జరుగుతున్న సంభాషణ వింటూ బ్రహ్మదత్తుడు ఒకపక్కగా కూర్చున్నాడు.

**తార్కికుడు** : కవీంద్రా! నువ్వు ధారానగరం నుంచి వచ్చానంటున్నావు కదా. భోజుడు కవుల పాలిట కల్పవృక్షం అంటారు. అతను కుశలమేనా? కవులనేనా లేక పండితులని కూడా సత్కరిస్తాడా?

**కవి** : ఆరాజు ఇప్పుడు ఊళ్లోలేడు. కోపగించి వెళ్ళిన కాళిదాసుని తీసుకురాడానికి విదేశాలకు వెళ్ళాడు. అతని కుమారుడు విద్వాంసులని ఆదరిస్తాడు కాని పరీక్షలు లేవు. మీ రేమైనా కవిత్వం చెప్పగలరా? .

**తార్కికుడు** : ప్రౌఢంగా చెప్పలేను. ఇప్పుడిప్పుడే అలవాటు చేసుకుంటున్నాను. కవిత్వం సహజంగా ఉండాలి కాని బలవంతంగా

తెచ్చి పెట్టుకుంటే బాగుండదు. ఒకశ్లోకం రచించాను వింటారా?

**కవి** : రేపు వింటాను లెండి. ఇప్పుడు మరేమయినా విశేషాలు చెప్పండి.

**తార్కికుడు** : సరే. పురందరపుర విశేషాలు ఈ మధ్య విన్నారా?

**కవి** : ఆ రాజు కూతురు సరస్వతి మాటేనా? ఆమె ముందు మీ తర్కమూ, కవిత్వమూ నిలబడవు.

**తార్కికుడు** : వినండి పూర్తిగా కుచుమారుడు అనే పండితుడు ఆమెను అన్ని విద్యలలోనూ ఓడించి పెళ్ళిచెయ్యమంటున్నాడు.

**కవి** : అందుకు అడగవలసిన అవసర మేముంది? ఆమె చేసిన ప్రకటనే అలా ఉంది కదా?

**తార్కికుడు** : అక్కడే సందిగ్ధంగా ఉంది. బ్రాహ్మణుడిని పెళ్ళాడడం యిష్టంలేకనేమో ఏవో ప్రతికూలాలు చెబుతూ ఆటంకాలు కలుగ జేస్తూం దామె. గొప్ప వివాహం జరుగుతుందని సంభావన దొరుకుతుందని వెళ్ళాను. కాని ఏమీ లేకపోయింది.

ఆ మాటలు విని బ్రహ్మదత్తుడు అతని ముందరికి వచ్చి - "ఆర్యా! మీరు ధారానగరం నుంచి వస్తున్నామని చెబుతున్నారు. అక్కడ చారాయణుడు అనే పండితుడు కనపడ్డాడా? అతని మిత్రులు దత్తకుడు మొదలయినవారు మహావిద్వాంసులు ఆరుగురు ఉండాలి. వారిపేరు ఊరంతా వ్యాపించే ఉంటుంది. విన్నారా?" అని అడిగాడు.

"వినలేదు. నేను అక్కడ మూడు రోజులే ఉన్నాను." అన్నా డతను. అప్పుడు మరోపక్క కూర్చున్న బ్రాహ్మణ కుమారుడు అతనికి దగ్గరగా వచ్చి ముఖం పరీక్షించి - "మీరెవరు? చారాయణ దత్తకాదులని అడుగుతున్నారు. వారి నెరుగుదురా?" అని అడిగాడు. బ్రహ్మదత్తుడు చారాయణుడు తమ ఇంటికి రావడం మల్లికనతనికిచ్చి పెళ్ళిచెయ్యడం.. అతను ధారానగరంలో తనకోసం ఎదురు చూసే మిత్రులను కలుసు కుందుకు వెళ్ళి గడువు దాటినా రాకపోవడం ... తాను కుటుంబంతో సహా ధారానగరం వెళ్తూండడం..అంతా చెప్పాడు.

అది విని ఆ విప్రకుమారుడు చాలా ఆనందిస్తూ – "ఓహో! మీరు మా చారాయణుడికి పిల్లనిచ్చారా! ఐతే మీరు మాకూపూజ్యులే. నేను ఆ మిత్రులలో ఒకడిని. నాపేరు ఘోటకముఖు డంటారు. నా మిత్రులు ఈ పాటికే ధారానగరం చేరుకుని ఉంటారు.

దారిలో కొన్ని విఘ్నాలు కలగడం వల్ల తిరుగుతున్నాను. ఒక మహానీయుడి భార్యని భైరవుడనే వాడు అపహరించాడు. వాడు ఇప్పుడు పురందర పురంలో ఉన్నట్లు తెలిసింది. మేము అక్కడికి పోతాం. మీరు తిన్నగా ధారానగరానికి పొండి. అక్కడ అందరూ కనపడతారు." అన్నాడు.

బ్రహ్మదత్తుడు అతన్ని కౌగలించుకుని – "ఆర్యా! నీమాట నారాయణుడు చెప్పి ఉన్నాడు. నువ్వు కనపడడంతో సగం విచారం పోయింది. నీ మిత్రుడి భార్యని చూద్దువుగాని రా. ఎప్పుడూ అతని గురించే విచారిస్తూ ఉంటుంది." అంటూ అతని చెయ్యి పట్టుకుని తనగదికి తీసుకుపోయి కూతురికి ఆ వృత్తాంతమంతా చెప్పాడు. ఆమె సిగ్గుతో ఏమీ మాట్లాడలేదు.

ఆమె ఆకార లక్షణాలని చూసి సంతోషించి ఏమైనా చదువుకుందా అని అడిగాడు. "చదువు పరీక్షించే నీ మిత్రుడు చేసుకున్నాడు." అన్నాడు బ్రహ్మదత్తుడు. అప్పుడు ఘోటకముఖుడు అతన్ని తన గదికి తీసుకు వెళ్ళి – భోజుణ్ని చూబించి – "ఈ ఉదారుడి భార్యని వెదుకుతూనే తిరుగుతున్నాం.". అని.. అతని వృత్తాంతం భోజుడికి చెప్పాడు. అతడు భోజుడని ఘోటకముఖుడికి' తెలియదు. బ్రహ్మదత్తుడి కెలా తెలుస్తుంది? అతను గొప్ప పండితుడనీ, కవి అనీ భోజుడు లేచి నమస్కరించాడు. అతని రూపలక్షణాలు చూసి ఎవరో ఒకదేశ అధికారి అని నిశ్చయించి అందుకు తగినట్లు బ్రహ్మదత్తుడు అతన్ని ఆశీర్వదించాడు.

ఆ రాత్రి వారు చాలాసేపు విద్యావిషయాలు ముచ్చటించారు. ఘోటకముఖుడు భోజుడితో – "భైరవుడనే తాంత్రికుడు పురందర పురంలో ఉన్నట్లు వర్తమానం తెలిసింది. మనం అక్కడికి పోవాలి." అని సూచించగా అతను అంగీకరించాడు.

మర్నాడు భోజుడు, ఘోటకముఖుడుతో పురందరపురానికి పోయేముందు బ్రహ్మదత్తుడి గదికి వచ్చి మల్లిక ప్రౌఢంగా కవిత్వం చెప్పగలదని విని చాలా ఆనందించి "పుత్రీ! నేను నీకు తండ్రి లాటివాడిని. నా దగ్గర సిగ్గుపడనక్కరలేదు. నాకు కవులంటే చాలాప్రేమ. ఏదీ...ఒక శ్లోకం రచించి నాకు వీనులవిందు కావించు." అని ఆదరంగా అడిగాడు.

"మీలాటి విద్వాసుల ముందు నేనెంత? అయినా మీరు అడిగారు కనుక చెబుతాను. దేనిగురించి వర్ణించమంటారో చెప్పండి. నా శక్తి కొద్దీ ప్రయత్నిస్తాను." అంది మల్లిక వినయంగా.

"మహాత్ములకి కార్యసిద్ధి తమప్రభావంచేతనే ఔతుంది. ఉపకరణాలతో పనిలేదు. (క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణైః)" అనే సమస్య నిచ్చి పూరించమన్నాడు భోజుడు.

బ్రహ్మదత్తుడు, అతని భార్య, ఘోటకముఖుడు, మల్లిక - నలుగురూ నాలుగు విధాలైన శ్లోకాలలో పూరించారు.

కుండలో పుట్టి మృగాలతో అడవిలో నివసించే అగస్త్యుడు సముద్రాన్నే త్రాగేశాడు. తాను మనుషుడైనా శ్రీరాముడు కోతులతో కూడి సముద్రంలో రాళ్ళు తేలించి లంకను ముట్టడించి రావణుడిని సంహరించాడు.

ఒకే చక్రం కలబండి నెక్కి ఆధారం లేని ఆకాశంలో ...కాళ్ళు లేని సారధితో సూర్యుడు క్రమం తప్పకుండా తిరుగుతున్నాడు. కనుక మహాత్ములకి ప్రతిభే తప్ప ఉపకరణాలు ప్రధానం కాదు.

మల్లిక - "పూలవిల్లు తుమ్మెదల నారి ... స్త్రీలచంచల దృష్టులు... బాణాలు. శరీరమా లేదు. ఐనా మన్మథుడు ముల్లోకాలనీ వ్యాకుల పెడుతున్నాడు." అని శ్లోకం చెప్పింది. నాలుగింటిలోనే అదే అత్యుత్తమంగా ఉందని అందరూ వింటూండగా పెద్దగా పొగిడి... మనసులో 'అక్షర లక్షలివ్వాలి.' అని సంకల్పించుకుని - భోజుడు - "మేము కొద్ది రోజుల్లో ధారానగరం వస్తాం. అప్పుడు మళ్ళీ మీ దర్శనం చేసుకుంటాం." అని బ్రహ్మదత్తుడివద్ద నుంచి అనుజ్ఞతీసుకుని వెళ్ళాడు. బ్రహ్మదత్తుడు కుటుంబంతో ధారానగరం పోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 157 వ మజిలీ

### పురందర పురం

పురందర నగరపు రాజు హిరణ్య గర్భుడు ధర్మసందేహం ఒకటి తీర్చదలచుకుని సుప్రసిద్ధులైన పండితులనీ, పండిత ప్రభువులనీ రమ్మని ఆహ్వాన పత్రికలు రాయించాడు. సభ నాటికి అనేక దేశాల నుంచి రాజులూ, కవిరాజులూ తమతమ,బిరుదాలతో వచ్చి పట్నం నిండిపోయారు. దానితో ఆపట్నం చాలా హడావిడిగా ఉంది.

భోజుడు ఘోటకముఖుడూకూడా దైవికంగా ఆ రోజుకే అక్కడికి చేరుకున్నారు. వీధుల్లో జనులు గుంపులు గుంపులుగా మూగి సరస్వతి మాటలనే చెప్పుకుంటున్నారు. ఒకచోట కొందరు మగవాళ్ళు సరస్వతి వివాహం గురించి ఇలా మాట్లాడుకుంటున్నారు.

ఒకడు : ఇవాళ్టితో ఏదో ఒకటి తేలిపోతుంది. అతను అల్లుడో, ప్రేతో ఔతాడు.

రెండోవాడు : అతను కుచుమారుడు కాదని ఎవరు నిర్ధారణ చెయ్యగలరు?

ఒకడు : అందుకే కదా సభ జరగబోతూంది?

ఇంకొకడు : గొప్ప గొప్ప రాజులూ, విద్వాంసులూ చాలామంది వచ్చారు. తిరిగి పరీక్షించడానికి ఒప్పుకుని జయం పొందితే జామాత. లేకపోతే ప్రేత.

ఒకడు : అరవై నాలుగు కళలలోనూ పరిచయం కలిగిన భోజమహారాజు సరస్వతీ అవతారమైన కాళిదాసు కవితో వచ్చి ఈ సభకు ఆధిపత్యం వహిస్తాడట. నిజమేనా?

మరొకడు : భోజమహారాజే అగ్రాసనాధిపతా! కాళిదాసుకూడా వస్తాడా! ఐతే ఆ మహాసభ చూడవలసిందే. చోటు దొరకదేమో ముందుగా పోవాలి.

ఇంకొకడు : సభాభవనం మనపట్నమంత ఉంది. ఎందరొచ్చినా సరిపోతుంది

మరొకడు : భోజుడూ, కాళిదాసు వొస్తే ఈ పాటికే పురమంతా తెలియాలే! ఎవరూ చెప్పుకోడం లేదేం?

ఒకడు : వారు సభాసమయానికి తిన్నగా వస్తారట. ముందుగా వొచ్చి కూర్చుంటారేమిటి?

ఇంకొకడు : ఆ మహనీయుల దర్శనం చేసుకుని తరించాలి.

మరొకడు : దీనిలో నిజమేమిటంటారు? రాజపుత్రికకి బ్రాహ్మణ్ణి పెళ్ళాడ్డం యిష్టంలేక యిలా అంటూందేమో? ఆడవాళ్ళ చేష్టలని అర్థం చేసుకోడం అసాధ్యం

ఇంకొకడు : కాళిదాసేవొస్తే నిజంబయట పడకుండా ఉండదు. ఆ మహాకవిగురించి అనేక కథలు చెప్పుకుంటారు. ఈ కుచుమారుడి మూలంగా వాళ్ళ దర్శనం కలుగుతూంది

వాళ్ళమాటలు విన్న భోజుడు – 'ఆహా! మహానుభావుడైన కాళిదాసు వల్ల నాపేరుకి కూడా ప్రసిద్ధి వొస్తూంది. అంతటివాడిని అవమాన పరచిన నాపాపానికి నిష్కృతి ఉందా? అందుకే ఇలా కష్టాలు పడుతున్నాను. ముందు – కాళిదాసు ఉండే చోటు చూడాలి. అనుకుంటూ ఘోటకముఖుడిని – "వాళ్ళతో ఏదోమాట్లాడుతున్నావు. విశేషాలేమయినా తెలిశాయా?" అని అడిగాడు "కుచుమారుడు నా మిత్రుడని మీకు చెప్పాను కదా. అరవైనాలుగు విద్యలూ వచ్చిన సరస్వతిని అతనే జయించాడు. చిలక చేత వాదన చేయించాడట. ఆ విద్యమాకు తప్ప ఎవరికీ రాదు. అతను ఏమయ్యాడో తెలియదు మరొకడు వచ్చి నేనే కుచుమారుడినని చెబుతున్నాడట. అరవైనాలుగు విద్యలు భోజుడికి వొచ్చుననీ కాళిదాసుతో కలసి రమ్మని కబురు పంపారట. వాళ్ళు వస్తారట. ఆ వింత మనమూ చూడవలసిందే. అదే వాళ్ళు మాట్లాడారు "

భోజుడు విచారమైన ముఖంతో – "వాళ్ళెక్కడవొస్తారు? వీళ్ళకంటే వాళ్ళు గొప్పవారా? అది అలా ఉంచండి. మీరు కూడా పండితులే కదా. ధర్మ నిర్ణయం చేసేటప్పుడు మీరు కూడా కొంతభారం వహించాలి. పోదాం పదండి." అన్నాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ, పట్నం విశేషాలు చూస్తూ సభ జరిగే సమయానికి సభాకార్యదర్శి వద్దకు వెళ్ళి పండితులమని చెప్పి అనుమతి పత్రాలు తీసుకుని సభలో ఒకచోట కూర్చున్నారు. ఆ సభాభవనం సోపానాలు పేర్చినట్లుంది. విద్వాంసులు, విద్వత్ప్రభువులు, పౌరులు, ప్రేక్షకులు వేలకొద్దీ వచ్చారు. ఐనా నిశ్శబ్దంగా ఉంది.

సరస్వతి తండ్రి అయిన హిరణ్యగర్భుడు విశాలమైన వేదికమీద నిలబడి అందరికీ వినపడేలా – "సభ్యులారా నాకోధర్మ సందేహం కలిగింది. దానిని తీర్చుకుందుకే మీ అందరినీ రప్పించాను. నాపై దయతో వొచ్చిన మీ అందరికీ నాకృతజ్ఞతలు. ఈ సభకు అధ్యక్షత వహించవలసిన భోజరాజుగారు గ్రామాంతరం వెళ్ళారని వార్త వచ్చింది. కాళిదాస మహాకవి ఇప్పుడు భోజుని ఆస్థానంలో లేరనీ అల్లాణభూపతి వద్ద ఉన్నారనీ తెలిసి అక్కడికి దూతలను పంపగా వారు రాజాలనని తెలియపరిచారు. సభాధ్యక్షుణ్ని సమర్థుడిని ఎన్నుకోవలసిందిగా సభాసదులనే కోరుతున్నాను" అని – పీఠంమీద కూర్చున్నారు.

అప్పుడు కొందరు విద్వాంసులు లేచి – "గోనర్దీయుడనే మహారాజు అరవదినాలుగు విద్యలూ తెలిసిన ప్రౌఢ. అతనిని సభాధ్యక్షుడిగా చేయవలసింది." అన్నారు. మరికొందరు మరొకరిని సూచించారు. భోజుడు లేచా – "ఘోటకముఖుడనే మహాపండితుడు అరవైనాలుగుకళలలోనూ పాండిత్యం కలవాడు. అతనే అధ్యక్షుడిగా అర్హుడు." అని కేకవేశాడు. హిరణ్యగర్భుడు సభాసదులు అలా సూచించిన వారినందరినీ ముందరకి రప్పించాడు. వారిలో ఒకరిని ఎన్నుకోమన్నాడు. కిరీటం, అలంకారాలలో ఉన్న గోనర్దీయుడిని ఘోటకముఖుడు గుర్తు పట్టలేదు. కాని గోనర్దీయుడు అతన్ని గుర్తుపట్టి కుచుమారుడిని గోకుతూ – "ఘోటకముఖుడు నన్ను తెలుసుకోలేదు. అతనికే సభాధిపత్యం ఇద్దాం."

అన్నాడు. కాని...ఎవరూ ఎవరినీ ఎన్నుకోలేదు. అప్పుడు రాజు - "అరవైనాలుగు విద్యలూఎరిగిన వారెందరో చేతులెత్తండి. అలాటివారే సభాధిపత్యానికి అర్హులు." అన్నారు.

గోనర్దీయుడూ, ఘోటకముఖుడు మాత్రమే చేతులెత్తారు. అప్పుడు గోనర్దీయుడే ఘోటకముఖుడిని సమర్థుడని చెప్పగా రాజు అతని మెడలో పూలమాలవేసి అగ్రపీఠం మీద కూర్చో బెట్టాడు.

రాజు జరిగినదంతా చెప్పి - "ఆ చిలుకని పిల్లి తినేసిందనీ, తానే కుచుమారుడనీ ప్రకటించిన వానిపై అనుమానాలు కలిగాయి. దాదులు కుచుమారుడు ఇతను కాదంటున్నారు. ఈ సందేహం మీరే తీర్చాలి." అన్నాడు.

సరస్వతి సఖురాలు లేచి - "అయ్యలారా! చిలక చేత ప్రసంగింపజేసిన కుచుమారుడు ఇతను కాడు. అతనిని నేను చూశాను. వాని రూపలక్షణాలు మనోహరాలు. ఇతనే అతనైతే మళ్ళీ ప్రశ్నలడిగితే ఎందుకు జవాబు చెప్పడు? మా ప్రశ్నలకు సమాధానాలు చెబితే మన్నిస్తాం. లేకపోతే శిక్షించండి. ఇదే మా రాజపుత్రిక అభిప్రాయం." అంది.

సభాపతి కపట కుచుమారుడివేపు చూసి - "నువ్వేం చెబుతావు?" అని అడిగాడు.

అతను లేచి గద్గదికస్వరంతో - "నేను చిలకకి నా విద్యలన్నీ ఉపదేశించాను. దాని ద్వారానే ఆమెను ఓడించాను. దైవికంగా అది పిల్లిచేత చంపబడింది. ఆమె - 'నీవే నాభర్తవి.' అని హారం పంపాక మాటిమాటకీ పరీక్షకు నిలబడవలసిన అవసరం నాకులేదు. వాదంలో జయమయినా, అపజయమయినా ఒకసారే కాని పలుమార్లుంటుందా? పదే పదే చెప్పక్కరలేదు. వారు ప్రకటించిన రీతిగా సరస్వతిని ఓడించాను. ఇష్టముంటే పెళ్ళిచెయ్యమనండి. లేదా నా దారిన నేను పోతాను. అంతేకాని మళ్ళీ ప్రసంగానికి ఒడంబడను. ఇదే నేను చెప్పేది." అన్నాడు.

**సభాపతి** : కుచుమారుడి చేత ఓడించబడ్డాను. కాని - ఇతను కుచుమారుడు కాదు అంటూంది రాజపుత్రిక దీనికేమంటావు?

కుచుమారుడు : అది ఇష్టం లేనిమాట. కానని ఏం నిదర్శనం చూపగలదు?

సభాపతి : నువ్వు మళ్ళీ ప్రసంగించననడంచేతనే.

కుచుమారుడు : అది నాకు అవమానకరం అని మానేశాను.

సభాపతి : ఆమాట సమంజసంగా లేదు. ప్రసంగంవల్ల విద్యలకు మెరుగే వొస్తుంది కాని తుప్పుపట్టదు. పోనీ, ఆమెకాదు. మేము అడుగుతాం. సమాధానం చెబుతావా?

కుచుమారుడు : నేను ఎవరికీ చెప్పదలచుకోలేదు. (సభాసదులు పకపకనవ్వారు)

సభాపతి : నువ్వు చదివిన విద్యలన్నీ చిలకకి చెప్పెయ్యడం వల్ల మరచిపోయావా? ఆలోచించుకుని చెప్పు.

కుచుమారుడు : ఆమాటా నిజమే.

సభాపతి : నీకు కుచుమారుడని పేరున్నట్లు మీ గ్రామస్తులచేత చెప్పించగలవా?

కుచుమారుడు : చిత్తం చెప్పించగలను.

సభాపతి : ఆగ్రామమేదో చెప్పు. ఇప్పుడే వాళ్ళని రప్పిస్తాం.

అతను ఏమీ చెప్పలేక తబ్బిబ్బు పడసాగాడు. అప్పుడు సభాపతి లేచి – "కుక్కకి కృత్రిమ కేసరాలు కట్టి సింహం వేషం వేసి సింహాసనం మీద కూర్చో బెట్టినా అది సింహంలా గర్జించగలదా? వినండి. ఇతను కుచుమారుడు కాదు. ఇతనికీ, అతనికీ కుక్కకీ, సింహానికీ ఉన్నంత తేడా. కుచుమారుడు మహాపండితుడు. అతను నా మిత్రుడు. అతని పేరు వినే నేనిక్కడికి వచ్చాను. మేము ఏడుగురం సహాధ్యాయులం. కాశీలో ఒక్కగురువు వద్దే చదువుకున్నాం. శుకశారికాప్రలాపనం అనే విద్య మాకు తప్పమరెవరికీ తెలియదు. నా మిత్రుడే రాజపుత్రికను ఓడించాడన్నది సత్యం. ఇతనికి ఈ ఔన్నత్యం కలగజెయ్యాలని అతను మరుగున పడి ఇతనికిలా చెప్పమని ప్రోత్సహించాడని భావిస్తాను. అతనికి ఈ ఐశ్వర్యం ఒక లెక్కలోది కాదు. వీడువొట్టి శుంఠ. సంస్కారంలేదని వీడిమాటలే చెబుతున్నాయి.

రాజపుత్రిక బుద్ధిమంతురాలు కనక నిజం గ్రహించి ఈ వివాహానికి ఒడంబడకుండా ఉంది. ఆ విద్వాంసురాలికి తగినవాడు అతనే తప్ప ఈ మూర్ఖుడు కాడు. అతన్ని వెదికి తెప్పించడం సమంజసం. వీడు కుచుమారుడు కాడు..కాడు..అని ముమ్మారు పలికి కూర్చున్నాడు.

గోనర్దీయుడు లేచి – “సభ్యులారా! సభాధ్యక్షుడు సత్యం చెప్పాడు. వీడు కుచుమారుడు కాదు. మిత్రద్రోహి. కృతఘ్నుడు వీడు అతనితో వంట చెయ్యడానికి వచ్చిన సేవకుడు శంబరుడు. వీడు సరస్వతి తనని పెళ్ళాడుతుందని అతను నిద్రపోతూంటే తలను రాతితో కొట్టి కందకంలో పారేశాడు....” అని కంఠరండగ్గుతిక పడగా సవరించు కుంటూంటే..

“హా! నా మిత్రుడు కుచుమారుడు మృతుడయ్యాడా! హా! మిత్రమా!” అంటూ ఘోటకముఖుడు బిగ్గరగా విలపించసాగాడు. గోనర్దీయుడు అతనిని చేతి సంజ్ఞచే వారిస్తూ – “విచారించకండి. అతను బతికే ఉన్నాడు.” అంటూ అతన్ని పల్లెవాళ్ళు రక్షించడం, నావికాదిపతి ఉద్యోగం, తనని కలుసుకుని ఇక్కడికి రావడం అంతా చెప్పి, తన పక్కనే ఉన్న కుచుమారుడిని చూబించాడు. సభ్యులందరూ కలకలం రేపుతూ లేచి నిలబడి అతన్ని చూశారు. కొంద రతని మీద పూల్చుజల్లారు. హిరణ్యగర్భుడు గోనర్దీయుడిని కౌగలించుకుని – “మహాత్మా! మీరెవరో నాకు తెలియదు అపద్బాంధవుడిలా వచ్చి చిక్కుతొలగించి నిజం తెలియజేశారు. మీకు చాలా కృతజ్ఞుణ్ని. మీ కులశీల నామాలు తెలిపి నాకు ఆనందం కలిగించండి.” అని ప్రార్థించాడు. “రాజా! మేము ఏడుగురం సహాధ్యాయులం. కాశీలో అన్ని విద్యలూ చదివాం. దిగ్విజయం కోసం తలా ఒక దారిని దేశాటనం చేస్తున్నాం. ఇక్కడికి ముగ్గురం వచ్చాం. ఈ సభాధ్యక్షుడు ఘోటకముఖు డొకరు. నేనొకడిని. ఇతను కుచుమారుడు. నీ అల్లుడు. మూడవవాడు..” అతనిని చూబిస్తూ గోనర్దీయుడు తమ వృత్తాంతం అంతా చెప్పాడు.

హిరణ్యగర్భుడు మన్మధుడిలాటి కుచుమారుడిని చూసి సంతోషం పట్టలేక అతని పాదాలమీదపడి – “మా పూర్వజన్మ పుణ్యంకొద్దీ ఇప్పుడు మాకు కనిపించారు. మేము కృత కృత్యుల మయ్యాం. నా

పుత్రిక ముందే మిమ్మల్ని వరించింది. రాజ్యలక్ష్మితో కూడా సరస్వతిని పరిగ్రహించండి." అంటూ అతని మెడలో పూల మాలవేశాడు.

అప్పుడు అగ్రాసనాధిపతిగా ఉన్న ఘోటకముఖుడు సంతోషంగా – "మిత్రులారా! వచ్చారా!" అంటూ వారిని కౌగలించుకుని ఆనంద బాష్పాలతో తడిపాడు. వారు కూడా అతన్ని గాఢంగా కౌగలించుకున్నారు.

అప్పుడు గోనర్దీయుడు – "మిత్రమా! నిన్ను మేము ముందే గుర్తు పట్టాం. ఈ సందేహం గురించి నువ్వు ఎలా చెబుతావో అని మేము నీతో మాట్లాడలేదు. నువ్వు మమ్మల్ని ఆనవాలు పట్టలేక పోయావు. నిజంగ్రహించి చెప్పావు మన కుచుమారుడు పునర్జన్మే ఎత్తాడు." అంటూ ఆ వృత్తాంతం అంతా మళ్ళీ అతనికి చెప్పాడు. తాను రాజయిన విధం కూడా క్లుప్తంగా చెప్పి – "నువ్వూ మాలాగే ఇంకా ధారానగరం వెళ్ళలేదా? దత్తకాది మిత్రులు మనకోసం ఎదురు చూస్తూ ఉంటారు. నేను సింహాసనం ఎక్కగానే అక్కడికి పోవాలని ప్రయత్నిస్తూంటే అంతలో కుచుమారుడి వివాహవార్త తెలిసింది. ఇలా వచ్చాను. కుచుమారుడి వివాహం కాగానే మనం అక్కడికి పోదాం. ఈ రాజ్యాలు మనం ఏడుగురిమీ సమానంగా పంచుకోవాలి." అన్నాడు.

ఘోటకముఖుడు ఆ మాటలకు చాలా సంతోషించి "మన చారాయణుడు ఒక పండిత పుత్రికని పెళ్ళాడి ధారానగరానికి వెళ్ళాడు. నేను ఈపాటికి అక్కడ చేరవలసిన వాడినే. కాని ఒకస్నేహితుడి భార్యని తాంత్రికుడు ఎత్తుకుపోయాడు. వాడికోసం దేశాటనం చేస్తున్నాను. ఆ మహనీయుడైన స్నేహితుడి కులశీలనామాలు నాకు తెలియవు. అతను చెప్పలేదు. ఆ కూర్చున్నవాడే అతను." అని చూపించాడు.

అంతలో భోజుడు అక్కడికి వచ్చి నమస్కరిస్తూ ఆ పాండిత్యం గురించి ప్రశంసించాడు.

వాళ్ళు నలుగురూ మాట్లాడుకుంటూంటే కొంతసేపు ఊరుకుని హిరణ్యగర్భుడు వారితో – "అయ్యలారా! కాలాతీతమయింది. చెప్పవలసినమాటలు చెప్పాను. చేయవలసిన విధి తెలిసింది. నిజం

బయట పడింది. ఇక శంబరుడికి ఏశిక్ష విధించాలో సభాధ్యక్షుడు చెప్పవలసి ఉంది అది వినడానికి సభ్యులు తొందర పడుతున్నారు." అనే సరికి ఘోటకముఖుడు మళ్ళీ పీఠంఎక్కి అందరూ వినేలా - "వీడు మిత్రద్రోహి. పాపానికి వెరిచేవాడు కాదు. ఇలాటి వాడుంటే లోకానికి అపకారమే. వీడికి ఉరిశిక్ష విధించడం ఉచితం. కుచుమారుడు మిత్రులతో ఆలోచించి ఇతనికి ఉపకారం చేస్తానని చెప్పినా విశ్వాసం లేకుండా పరమశాంతమూర్తీ, విద్యాస్వరూపుడూ ఐన కుచుమారుడిని చంపాలని ప్రయత్నించిన ఈ కృతఘ్నుడిని కరుణించకూడదు." అన్నాడు. సభ్యులు కూడా "అదే ఉచితం." అని ఏకగ్రీవంగా కేకలు వేశారు.

కాని ... కుచుమారుడు అందుకు అంగీకరింపక - "వీని తల్లి తండ్రులు చాలామంచివారు. నాకు భోజనంపెట్టి, సరస్వతి వృత్తాంతం చెప్పి, సహాయంగా వీనిని నావెంట పంపారు. నన్ను జాగ్రత్తగా కాపాడమన్నారు. వారిని చూసయినా వీనిని మన్నించాలని కోరు కుంటున్నాను. వాళ్ళింట్లో తిన్న విశ్వాసం నాచేత ఇలా చెప్పిస్తూంది. దేనికీ ుునం కర్తలం కాము. దేముడు ఒకడి వల్ల భయం కలగ జేస్తే మరొ ుడి ద్వారా ఆ భయం పోగొడతాడు." అంటూ శంబరుడికి శిక్షపడకుండా చేశాడు. అతని కృపా స్వభావాన్ని అందరూ మెచ్చుకున్నారు.

అంతటితో సభ ముగించి, హిరణ్యగర్భుడు కుచుమార, గోనర్దీయ, ఘోటకముఖులకి తనకోటలో ప్రత్యేక విడుదులలో ఉంచి గౌరవించసాగాడు. సఖురాలిద్వారా అది విన్న సరస్వతి చాలా ఆనందిస్తూ మరో చిలకికి విద్య నేర్పమని చెలికత్తె ద్వారా కుచుమారుడికి పంపింది. అతను దానిని దువ్వుతూ అస్త్రిమాల తగిలించి దానికి విద్యలు నేర్పి పంపాడు.

ఆ చిలక వెనకటి చిలకకంటే ప్రౌఢంగా సరస్వతితో ప్రసంగించి ఆశ్చర్యపరచింది. అప్పుడు ఆమె ఆనందంలో మునిగిపోతూ పత్రిక ద్వారా తన సంతోషాన్ని తెలియ జేసింది.

శుభ ముహూర్తంలో హిరణ్యగర్భుడు సరస్వతిని కుచుమారుడి కిచ్చి వివాహం చేశాడు. భోజుడు, గోనర్దీయుడు, ఘోటకముఖుడు పెళ్ళి పెద్దలై మహోత్సవాలు చేశారు. వేడుకలతో కొన్ని రోజులు గడిపాక - ఘోటకముఖుడు తన మిత్రులతో... "మిత్రులారా! మీరిద్దరూ మహారాజులయ్యారు. మీవల్ల మేమూ అలాటి వారమే ఔతాం. మనమిత్రులు ధారానగరంలో మనకోసం ఎదురు చూస్తుంటారు. మీరు అక్కడికి వెళ్ళండి. భైరవుడు ఏకశిలా నగరానికి వెళ్తున్నాడని విన్నాం. ఇతనూ, నేనూ అక్కడికి పోయి వాని వార్త తెలుసుకుని ధారానగరానికి వొస్తాం. ఇతను మనకి ఎనిమిదవ మిత్రుడు. తనుకూడా ఆ నగరానికి వచ్చి మన మిత్రులని చూస్తానంటున్నాడు. మేము వెళ్ళడానికి అంగీకరించండి." అన్నాడు.

అంతవరకూ చెప్పి ... ప్రయాణ సమయం కావడంతో కథ ఆపాడు మణిసిద్ధుడు. గోపాలుడు లేచాడు.

# కాశీ మజిలీ కథలు

## 158 వ మజిలీ

### అల్లాణు రాజు కథ

ఏకశిలా నగరాన్ని రాజధానిగా చేసుకుని అల్లాణురాజు పరిపాలించే వాడు. అతనికే భల్లానుడనే మరోపేరు కూడా ఉంది. దానధర్మాలకి అతను పేరు పొందాడు. కవి పండితులని చక్కగా ఆదరించేవాడు. నిత్యమూ పదిమందిని అర్చించి తృప్తిపరచి వారు ఏది కోరినా ఇవ్వడం వ్రతనియమంగా పెట్టుకున్నాడు.

అతని భార్య సువ్రత. అరుంధతిని మించిన పతివ్రత. రూపానికి రతి. విద్యలకు భారతి. ఆమె భర్తకి ప్రాణంలో ప్రాణమై మెలిగేది. ఆమె సుగుణాలరాశి.

ఒకనాడు పశుపతి అనే అతిధి అతనింటికి వచ్చాడు. ముప్ఫయి ఏళ్ళు లోపువాడు. రూపం సామాన్యమే అయినా తేజస్సు విద్యావంతుడని సూచిస్తూంది. విభూతి రాసుకుని, రుద్రాక్షలు ధరించి మరో మహేశ్వరుడిలా తోస్తున్నాడు. అతన్ని రాజు యధావిధిగా అర్చించి వాడుక ప్రకారం నమస్కరించి –

“మహాత్మా! నువ్వు పరమ శివుడి వలే మా యింటికి వొచ్చి మమ్మల్ని కృతార్థులని చేశావు. మీ పాదరేణువు సోకి మాగృహం పవిత్రమయింది. మీకేది ప్రియమో చెప్పండి. అది నెరవేర్చి ఫలం పొందుతాను.” అని వినయంగా ప్రార్థించాడు.

అతను కొంచెం ఆలోచించి – “రాజా! కోరిక అంటే మనసులో పుట్టేది కదా? హృదయంలో అనేక ఉద్దేశాలు కలుగుతూంటాయి. అవన్నీ బయటకి చెబితే వెర్రి వాడంటారు. ఇప్పుడు మీరు నా కోరిక అడిగారు.

మనసులో పుట్టిన అభిలాష దాచి మరొకటి అడగడం న్యాయం కాదు. ఆ అభిలాషని తీర్చితే కాని మీవ్రతం సఫలం అవదు. ఇప్పుడు నా మనసులో పుట్టిన అభిలాష ఇతరులతో చెప్పదగినది కాదు. కనుక మీకు సుఫలం ఇచ్చేస్తాను. అనుజ్ఞ ఇవ్వండి, పోయి వస్తాను. కోరిక సంగతి అడక్కండి." అన్నాడు.

"మహేశ్వరా! నేను ఒక దేశానికి అధిపతిని. మీకోరిక తీర్చలేనా? మీరు కోరినది నా దేశంలో ఎక్కడున్నా తెచ్చి ఇవ్వగలను. సందేహించక చెప్పండి." అని రాజు అనేసరికి అతిధి నిట్టూర్చుతూ – "అయ్యో! నేను నిజం ఎందుకు చెప్పాను? నా కోరిక చాలా నీచమయింది. నా ప్రారబ్ధం వల్ల ఇవాళ అలాటి అభిలాష కెలిగింది. చెప్పడానికి నోరు రావడంలేదు. తీరా నా కోరిక వింటే, ఛీ అని ముఖంమీద ఉమ్మేతారేమో. అసహ్యం. అసహ్యం.అపకీర్తి.. అపకీర్తి.. నేను చెప్పలేను." అన్నాడు.

అప్పుడు రాజు – "నువ్వు పరమోత్తముడివి. నీకోరిక తీర్చకుండా నేను భుజించలేను. ఇప్పటికే పొద్దుపోతూంది. నీకోరిక ఎంతనీచమయిన దయినా తీరుస్తాను. ఆలసింపక చెప్పు." అన్నాడు.

అతను – "రాజా! నీ బలవంతం వల్ల విధిలేక చెబుతున్నాను. ఆహారనిద్రామైధునాలు జంతువులకు సహజాలు. నేను బ్రహ్మచారిని. భార్యలేదు. సంతుష్టిగా భోజనం చేయడంతో మూడో పురుషార్థం కామం నన్ను వేధిస్తూంది. ఏంకావాలి? – అని మీరడగడం తోటే నా మనసు సంభోగం మీదకి పోయింది. అది ఎలా చెప్పగలను? అసభ్యం కదా! దానిని కప్పిపుచ్చి మరొకటి కోరితే కపటమౌతుంది. ఈ కోరిక మీరెలా తీర్చగలరు? నన్నుపోనివ్వండి.

ఇలాటి తుచ్ఛపుకోరిక కోరినందుకు మన్నించండి." అన్నాడు సిగ్గుపడుతూ.

రాజుమందహాసం చేస్తూ – "నువ్వు యదార్థవాదివి. నీ మాటలు నాకు సంతోషం కలిగించాయి. నువ్వేమీ సంశయింపకు. నీ కోరిక తప్పకుండా తీరుస్తాను. పరాశరులవంటి మహర్షులే కామానికి

దాసు లవగా ఇతరుల మాట చెప్పడాని కేముంది. దీనిలో తప్పేమీ లేదు. వేశ్యాకాంతలు వివాహమాడకుండా ఉండడం నీలాటివారికోసమే. మావూరిలో చక్కని చుక్కలయిన వారకాంత లెందరో ఉన్నారు. వారిలో అతి చక్కని దానిని రప్పించి నీ అభిష్టం తీర్పిస్తాను అంగీకారమేనా?" అని అడిగాడు.

"మహారాజా! నేను వేశ్యకాంతని కాక కులకాంతని కోరుతానా? కాని ఒక మాట గుర్తుంచుకో. విటుని అధీనంలో ఉన్నవేశ్యని తీసుకు రాకూడదు. నామూలంగా ఆ విటుడు బాధపడతాడు. ఎవరికేనా కామం సాధారణమే.

భళ్ళాణుడు తన ఇంట్లో ఒక గదిని చక్కగా అలంకరింపజేసి – హంసతూలికాతల్పంమీద అతన్ని కూర్చోబెట్టి "ఉత్తమ లక్షణాలు కలిగినదీ, ఎవరి అధీనంలోనూ లేనిదీ అయిన వారకాంతని తీసుకొచ్చి అప్పగించండి." అని మంత్రులకి నియోగించి తాను దేవతా గృహానికి పోయాడు.

మంత్రులు, శృంగారపురుషులు కొందరని వెంటపెట్టుకుని వేశ్యవాటికకి పోయి రూపయౌవన విద్యావిశేషాలచేత పేరుపొందిన వేశ్య లెవరిని అడిగారు ఒక విటప్రముఖుడు అనేకమంది పేర్లను చెప్పాడు.

"మాకు ఎందరో అక్కర్లేదు. ఒక్కరే మంచి చక్కనిది. కనపడే ఆ పెద్ద మేడ ఎవరిది?"

"చంద్రలేఖది. రూపంలోనూ ఆటపాటలలోను మేటి. తీసుకురానా?"

"తీసుకురా." అన్నాడు మంత్రి. ఆమె తీసుకురాబడింది. మంత్రి – "నువ్వు ఈ రాత్రి ఒక్క మహేశ్వరుడి అధీనంలో ఉండాలి. ఇది రాజుగారికి ప్రీతికరమైనపని " అని అడిగించాడు. ఆమె – "రాజశాసనానికి బద్ధులమే. నా విటుడు మంచంమీద ఉన్నాడు. అతనికి చెప్పి ఒప్పించి వస్తాను." అంది.

మంత్రులు - "నువ్వు పనికిరావు. విటుడి అధీనంలోలేని భోగం స్త్రీ కావాలి." అన్నారు. "తారావళి కాళీగా ఉంది. " అని చంద్రలేఖ చెప్పడంతో విటుడు వెళ్ళి మంత్రులసందేశం చెప్పి ఆమెను అక్కడికి తీసుకొచ్చాడు. ఆమెతో - " ఈ రాత్రి నువ్వు విడిగా ఉంటే మాతో రా, కానుక లిప్పిస్తాం. పనుంది." అన్నారు మంత్రులు. ఆమె - "స్వామీ! ఇంతవరకూ విడిగానే ఉన్నాను. ఇప్పుడే ఒకరు తాంబూలం ఇచ్చి పోయారు. ఈ రాత్రి తీరిక లేదు." అంది.

అప్పుడు మంత్రులు విటుడితో "విటులతో ఉన్నవారిని కాక విడిగా ఉన్నదానినే తీసుకురా. కావలసినంత ధనమిద్దాం." అన్నారు. నీలవేణి ఎవరో విటుడికి సంగీతం పాడుతూంది. పద్మగంధిని పిలవాలని ఇంటి తలపు కొట్టగా వానిని ఉంచుకున్న రంగాచార్యులు తలుపుతీసి - "ఏంపని?" అని అడిగాడు.

"ఏమీలేదు." అని మరలిపోయాడు విటుడు. ఆచార్యుడికి అనుమానం వచ్చి పద్మగంధిని చూస్తూ - "ఎంతటి దానివే! ఎవరూ యింటికి రావడం లేదని ప్రమాణం చేశావే! మరిప్పుడు ఈ తుంటరి పొద్దుపోయి యీ యింటికి ఎందుకు రావాలి? నేను లేనను కున్నాడు కాబోలు. నన్ను చూసి మాట్లాడకుండా పోయాడు. వాడెందుకు వొచ్చాడో చెప్పు." అని గద్దించాడు.

పద్మగంధి : రామ రామ మీతోడు. నాకేమీ తెలియదు. వాడెవడు?

ఆచార్యులు : వాడు పోకిరివాడు. పారుబోతు. ఈ వేశ్య వాటికలో తిరుగుతూంటాడు. కనకాచలం మూలంగా మా యిద్దరికీ ఒకసారి ముష్టి యుద్ధం జరిగింది. వాడు ఇక్కడి కెందుకు రావాలి?

పద్మగంధి : ఏమో, నాకు తెలియదు. నమ్మితే నమ్మండి. లేకపోతే నేనే చెయ్యగలను?

ఆచార్యులు : మరెవరినీ రానివ్వనని కదా నాదగ్గర భారీగా ధనం తీసుకున్నావు? ఆ తొత్తు కొడుకు నా యింటికి ఎందుకు రావాలి? ఈ

రాత్రికి నేను రాననుకుని రమ్మన్నావు. నీ సంగతి తెలిసే, వెళ్ళిన పనికాక పోయినా వేగంగా వచ్చాను. రాకపోతే ఎంత మోసం జరిగేదో.

పద్మగంధి : గొప్పవాడివి! నన్ను పట్టుకున్నావు! నువ్విచ్చే బత్తెంతోనే బతికేస్తున్నాను! ఇష్టముంటే ఉండు, లేకపోతే పో. నా యింటికి స్నేహితులూ పరిచితులూ సూస్తూంటారు. మాటిమాటికీ అనుమానిస్తే జవాబు చెప్పేవాళ్ళు లేరిక్కడ

అది అలా కసిరేసరికి, తాగి ఉన్న కోపం పట్టలేక – "ఓసి రండా! ఎంత కొవ్వెక్కావే! పుట్టెడు మాన్యం అమ్మి తెచ్చి ఇచ్చిన సొమ్ము నీ అబ్బ గడించాడనుకుంటున్నావా?" అంటూ వీపుమీద ఒక గుద్దు గుద్దాడు. అది మొర్రోమంటూ ఏడవసాగింది.

అప్పుడు రాక్షసిలాటి దాని తల్లివొచ్చి – "కుక్కా! నాకూతురిని కొడతావురా! నీ చేతులు పడిపోనూ .. దున్నపోతులా ఉన్నావు. వచ్చిన వాడెవడో చూబించు. వాడి జుత్తో గొరిగించేస్తాను." అంటూ అతన్ని జుట్టు పట్టుకొని వీధిలోనికీ ఈడ్చుకుపోయి – "ఏడీ? చూబించు." అని కేకలు పెట్టింది. "బాబోయ్! చచ్చాను." అంటూ అతనరవసాగాడు.

ఆ ప్రాంతంలో ఉన్నమంత్రులు ఆ కోలాహలం విని – "ఎందుకు కొడుతున్నావు?" అంటూ ఆ వేశ్యమాతని అడిగారు. ఆమె ఆ విషయం వివరించింది. మంత్రులు నవ్వుతూ – "తలుపు కొట్టిన వాడు మేము పంపినవాడే. మరెవడూ కాడు. తగవులాడుకోకండి." అని మందలించి వదిలేశారు.

అక్కడినుంచి విటశాఖామణి మణిమంజరి ఇంటికి వెళ్ళాడు. అది సరసుడితో ఆడుతూందని తెలిసి మంజువాణి ఇంటికి వెళ్ళారు. అది తలుపు తీసి – "దారి తప్పి వచ్చారే!" అని సరసం ఆడింది. అతను తాను వచ్చిన పని చెప్పాడు.

అప్పుడు – "ఇంతపొద్దు పోయివచ్చి చెబుతారా? ఇవాళ శివరాత్రే అనుకున్నాను. రాజుగారి చేత అర్చితుడైన లింగధారి ఒకడు ఇప్పుడే వొచ్చి తాంబూలం ఇచ్చి లోపలికి పోయాడు. గడియ అయింది. లేకపోతే మాట దక్కేది పోనీ, ఆయనని అడిగి వొచేదా?" అందామె.

"రాజశాసనం అలా లేదు. కాళీగా ఉన్నదే కావాలి." అంటూ శరచ్చంద్ర ఇంటికి వెళ్ళగా అది ఎవరితోనో సరసం ఆడుతూంది. ఆ వూళ్ళో ఉన్న వేశ్యల ఇళ్ళన్నీ చూశాడు. ఒట్టు పెట్టినట్లు ఒకతె గూడా విడిగా లేదు.

మంత్రులు – "ఔరా! ఇది వింతగా ఉందే! వేయి గడపల వేశ్యా వాటికలో ఒక్కతెకూడా ఒంటిగాలేదే! మనం ఎవరినో తీసుకొస్తామని రాజు ఎంతో ఆశతో ఎదురు చూస్తూ ఉంటాడే! మనం వెళ్ళేవరకూ భోజనం చెయ్యడే. ఏం చెయ్యాలి? అనుకుంటూ విటుడిని మళ్ళీ మళ్ళీ పంపివెదికించారు. విడి వెలయాలు దొరకలేదు. కపటం చేసి తీసుకుపోతే రాజుకి తెలిసిందంటే శిక్షిస్తాడు. నిజం చెప్పేయ్యడమే మంచిదని మంత్రులు రాజుదగ్గరకి వెళ్ళి చెప్పారు.

భార్యతో కలసి దేవ గృహంలో శివపూజ చేస్తున్న భళ్లాణుడు ఆ వార్త విని హాహాకారం చేస్తూ నేలమీద పడి మూర్ఛపోయాడు. సువ్రత భర్త అలా పడిపోడం చూసి విచారిస్తూ అతనిని లేవనెత్తి శైత్యోపచారాలు చేస్తూ – కళ్ళుతెరచి తనవేపే చూస్తున్న భర్తని – " మహాత్మా ఇలా పడిపోయా రేమిటి? మంత్రులు పంపిన పత్రికలో ఏముంది?" అని అడిగింది. " ఏం చెప్పేది అతిది కోరిక తీర్చలేక అపరాధి నయ్యాను. వారకాంతని అర్పిస్తానని శయ్యమీద కూర్చోబెట్టాను.దేహ ధర్మాలు దుర్భరాలు. నేటితో నావ్రతం భంగమయింది. ఇంక నేను తినను ప్రాయోపవేశం చేస్తాను." అంటూ జరిగినదంతా చెప్పాడు.

ఆమె కొంచెం ఆలోచించి – "ప్రాణేశ్వరా! మీ అర్ధాంగిని నేనుండగా మీకు చింతెందుకు? అతిథి కోరిక తీర్చడానికి ఇతర స్త్రీలను పంపడానికి మీకు అధికారం ఏముంది? వ్రత విఘ్నమవుతుందని విచారింపక నన్ను నియోగించండి. నేను అతని కోరిక తీరుస్తాను. పూర్వం ఇక్ష్వాకుడి భార్య, భర్త అనుమతితో అతిథి కోరిక తీర్చలేదా? నేనూ అదే అనుసరించి జన్మ సాద్గుణ్యం పొందుతాను." అని ప్రార్థించింది.

ఆమె మాటలు విని రాజు చాలా సంతోషించి - "నీ మాటలెంతో మధురంగా ఉన్నాయి. భార్యంటే నువ్వే. పూర్తిగా సంతోషించాను. వెలయాలు విడిగా దొరకలేదు. మరోయువతిని వ్యభిచారానికి నియోగించడం అధర్మం. వ్రతం విడువవలసిన సమయంలో మంచి ఉపాయం చెప్పావు. నువ్వు పోయి అతిధి కోరిక తీర్చు. నీకు తప్పులేదు. వెళ్ళు. రాజు భార్యవని చెప్పకు. వేశ్యననే చెప్పు. లేకపోతే అతను అంగీకరింపడు సుమా!" అన్నాడతను.

పాతివ్రత్య భంగం కాదనే ధృఢనమ్మకంతో సువ్రత చక్కగా అలంకరించుకుని కస్తూరి పరిమళాలు వ్యాపిస్తూంటే అతిది పడుకున్న గదిలోకి పోయి అతనికి నమస్కరించింది. "మహాత్మా! నేనొక వారకాంతని. భల్లాణ మహారాజు పంపగా మీ వద్దకు వచ్చాను. నా వలన మీ కోరిక తీర్చుకోండి." అంటు ఎదురుగా నిలబడింది.

అతనామెను ఎగాదిగా చూసి - మంచం దిగి ... ఆమె పాదాలమీద పడి నమస్కరిస్తూ ... "దేవీ! నువ్వు వారకాంతవని చెబుతావేం? పార్వతి వలె కనిపిస్తున్నావు. అదిగో ఫాలనేత్రం తెరవకుమా. భస్మమై పోతాను. అమ్మో! నువ్వెక్కిన సింహం నామీద తీక్షణమైన దృష్టి చూపుతూంది. అదిలించు తల్లీ. నీ చేతిలో త్రిశూలం చూస్తే భయమేస్తూంది. తుచ్ఛపు కోరికకోరినందుకు శిక్షించాలని వచ్చావా? లోకమాతా! నీకు నమస్కారం. నా తప్పుమన్నించు. తెలియక అలాటి కోరిక కోరాను." అని ప్రార్ధించాడు.

అతని అసందర్భపు మాటలకి రాజపత్ని ఆశ్చర్యపోతూ - "నేను పార్వతినీ కాను, లక్ష్మినీ కాను, సరస్వతినీ కాను. ఒక వేశ్య కాంతని. రాజుగారిని నువ్వు కోరావట. నాకు సొమ్మిచ్చి ఈ రాత్రికి మీ వద్దకు పంపారు. ఇది నిజం. మీరు బ్రాహ్మణులు. నేను సానిదాన్ని. మీరు నాకు నమస్కరించకూడదు. వేగంగా కోరిక తీర్చుకోండి." అంది. అతను - "బాబో! మీ మాటలు మెత్తగా ఉన్నాయి. రూపం మహాశక్తిలా ఉంది. నీ నాలుక జ్వాలలా వేలాడుతూంది నీ చూపులు శులాల్లా గుచ్చుకుంటున్నాయి. నీ భయంకర రూపాన్ని ఉపసంహరించుకో." అని ప్రార్ధిస్తూ అతనామె పాదాలమీద పడ్డాడు.

ఆమె – "అయ్యో! మహేశ్వరా! నువ్వు మహేశ్వరుడివి అవడం వల్ల పార్వతి రూపంలో వచ్చాను. నీ కోరిక తీర్చుకో. లేకపోతే కపటం చేశానని రాజుగారు నన్ను నిందించగలరు." అంది. ఐనా అతను – "తల్లీ! నీ వేడిని ఉపసంహరించుకుని శాంతురాలివి అవు. నీ కాంతికి నా కళ్ళు మిరుమిట్లు కొల్పుతున్నాయి." అని ప్రార్థించాడు.

'అయ్యో! ఇదేం కర్మ? నన్ను చూసి అనవసరంగా భయపడతాడేం? నాకు లేనిపోని రూపాలు ఆపాదిస్తున్నాడు. నేనేంచేసేది? నాకేమీ తెలియదు. భర్త నన్ను కపటాత్మురాలని నిందిస్తాడేమో. నేనితనికి వికృతరూపంలో కనిపిస్తున్నాను కాబోల్సు. ఈశ్వర మాయని తెలుసుకోడం ఎవరితరం?' అనుకుంటూనే అతన్ని మరికొంత ప్రోత్సహించింది. కాని అతను 'రక్షించు.. రక్షించు' అనేమాట తప్ప మరొకటి లేదు.

వాళ్ళిద్దరూ అలామాట్లాడు కుంటూండగానే కోడి కూసింది. వీళ్ళు ఏం చేస్తున్నారో చూద్దామని ఆగది వద్దకు వచ్చిన రాజుకి వాళ్ళమాటలు వినపడ్డాయి. 'దేవీ! నన్ను మన్నించు. నీ వేడికి నా శరీరం దహించుకుపోతూంది. శాంతించు. మహారాజా! నా అభీష్టం తీరుస్తానని ఇలాటి దారుణం చేశావేం? మహాశక్తిని ప్రయోగిస్తావా! ఇదా నీ వ్రత పరాయణత్వం? నా కోరిక తీర్చకపోతేనే సంతోషించేవాడిని. ఈ ఆపద దాటించు." అంటూ మొర పెట్టుకుంటున్నాడు.

ఆ మాటలు విని – "భయపడకు. నేను వొస్తున్నాను." అంటూ రాజు తటాలున ఆ గది తలుపు తెరుచుకుని లోపలికి పోయాడు. సువ్రత మంచం దగ్గర నిలబడి ఉండగా మహేశ్వరుడు ఆమె పాదాలదగ్గర పడి ఉన్నాడు.

"ఏమిటది? అతిధిని భయపెడుతున్నావా! అలా వేడుకుంటున్నా డేమిటి? అని భార్యని అడుగుతున్న రాజుని అతను కౌగలించుకుని – "మహారాజా! నన్ను రక్షించు. ఈమె తేజం శరీరాన్ని మండిస్తాంది. నువ్వు దగ్గరకు రాడంతో కొంచెం చల్లబడింది. నాకేమీ వద్దు. నా దారిన నన్ను పోనివ్వండి." అన్నాడు.

రాజు అతని వీపు తట్టుతూ "మహేశ్వరా! ఊరికే భయ పడతావేం? మహాశక్తి ఎక్కడ? దివ్య మంగళ స్వరూపమయిన ఆమెని చూడు. అభీష్టం ఎందుకు తీర్చుకోలేదు? ఈమె వేశ్య. కళ్ళు తెరచి చూడు." అన్నాడు. "అమ్మో! రెప్పలు బరువెక్కాయి. ఆమె తేజం కళ్ళని తెరవనివ్వలేదు. అదిగో.. త్రిశూలం కదిలిస్తుంది బాబూ! మహాశక్తిని ప్రయోగించావు ఎలా తాళగలను? రాజా! రక్షించు శరీరం దహించుకు పోతోంది."అంటూ అతను వెర్రెక్కిన వాడిలా అటూ యిటూ గంతులెయ్యసాగాడు. రాజు – "ఏమీ లేదు. భ్రమపడుతున్నావు." అన్నాడు. అతను కళ్ళెత్తిచూసి – "గుడ్డివాడినైపోయాను. చెడు కోరిక కోరినందుకు నాకు ఇలాటి శిక్ష విధించావు. బుద్ధొచ్చింది. మరెప్పుడూ ఇలాటి అభిలాష పడను." అంటూ చెంపలేసుకోసాగాడు.

"మహేశ్వరా! ఇది వేశ్య. నేను రాజుని. ఇక్కడ మనం ముగ్గురమూ తప్ప మరెవరూ లేరు. ఆదిశక్తి ఎక్కడుందో చూబించు" అని అడిగాడు రాజు "వేశ్యనని నా మంచం దగ్గరకు వచ్చి నిలబడినదే ఆదిశక్తి,.. పార్వతి..భవాని..దుర్గ. ఎదురుగా ఉండగా అడుగుతావేం రాజా? ఆమె పాదధూళి తీసి నా శరీరానికి రాయి. నా శరీర తాపం తగ్గుతుంది. లేకపోతే తాళలేను." అని బతిమాలుకున్నాడు అతిధి.

ఏం చెయ్యాలో తోచక రాజు అతను కోరినట్లే చేశాడు. అప్పుడతని శరీరం వెన్నపూసినట్లు చల్లబడింది. "అమ్మయ్య! బతికాను. తాపం తగ్గింది. చూపు వచ్చింది. ఆహా! దేవీ! నీమహాత్యం వర్ణించడం ఎవరి తరమూ కాదు. నేను మహారాజుని తుచ్ఛమయిన కోరిక కోరినందుకు నాకు బుద్ధి వచ్చేలా శిక్షించావు." అంటూ మరికొంత పాదధూళి తీసి శరీరాని కంతటికీ రాసుకుని "మహారాజా! నేను ఇప్పటికి పవిత్రుడి నయ్యాను. పోయి వస్తాను. అనుజ్ఞ ఇవ్వు. శివపుజా దురంధరుడివెన నిన్ను కోరరాని కోరిక కోరాను. అది తప్పని ఇప్పుడు నాకే తోస్తోంది. దైవం వల్లనే నాకు అలాటి సంకల్పం కలిగింది. నువ్వు ధన్యుడివి." అని స్తుతిస్తూ, రాజు బతిమాలుతున్నా అతను అక్కడ ఉండక ఎక్కడికో పోయాడు.

సుప్రవత పాతివత్ర్యానికి ఆశ్చర్యపోతూ రాజు ఆమెను ఎంతగానో పొగిడాడు.

అళ్ళాణుడిని పరీక్షించదానికి ఈశ్వరుడిచేత ప్రేరేపించబడి ఆ మహేశ్వరుడు (అతిధి) అలా కోరాడని కొందరంటే, మహాపుణ్యాత్ముడైన రాజుని అలాటి తుచ్ఛమైన కోరిక కోరినందునే ఆ విప్రుడు అలా పరాభవించబడ్డాడని కొందరంటారు.

అలాగ సుప్రవత అనే సాధ్వీమణితో కూడి ధర్మంగా ప్రజలను పాలిస్తూ, కవుల నాదరిస్తూ చాలా కీర్తి పొందాడు అల్లాణ భూపాలుడు.

భోజుడిచేత అవమానించబడిన కాళిదాసు నానా దేశాలూ తిరుగుతూ ఒకనాడు ఆ మహారాజు ఆస్థానాకి వెళ్ళాడు. అతని తేజస్సుకు ఆశ్చర్యపోయి ఆ మహారాజుని సహభ్యులందరూ చూస్తూండగా కుడి చెయ్యి ఎత్తి ఒక అద్భుతమయిన శ్లోకంతో ప్రశంసించాడు. ఆ శ్లోకం విని భళ్ళాణుడు ఆశ్చర్యమూ, ఆనందమూ పట్టలేక అతనిని కౌగలించుకుని – "మహాత్మా! నీపేరేమిటి? కులశీల నామాలు చెప్పి నన్ను ధన్యుణ్ని చెయ్యి." అని ప్రార్థించాడు.

అందుకతను – "నాపేరు కాళిదాసు. భోజుడి ఆస్థానంలో ఉండేవాడిని. ధేశాలు చూడాలని బయలుదేరాను." అన్నాడు. అల్లాణుడు – "కవీంద్రా! నీ ప్రఖ్యాతి ఇదివరకే మాకు వీనులవిందు చేసింది. నా పూర్వ పుణ్యం కొద్దీ నువ్వు నా దగ్గరకి వచ్చావు. నేను కృతార్థుడి నయ్యాను. నా సింహాసనం అధిష్టించి నువ్వు ఈ రాజ్యాన్ని పాలించుకో. నేను నీ దాసుడినై సేవలు చేసుకుంటాను." అన్నాడు నమస్కరిస్తూ. అందుకు కాళిదాసు – " బ్రాహ్మణులకి రాజ్యమెందుకు? పైగా భార్యాపుత్రులు లేని నేను రాజ్యం ఏం చేసుకుంటాను? అన్నవస్త్రాలిస్తే చాలు, ఉంటాను." అన్నాడు.

రాజు చాలా సంతోషించి అతనికి ఒక దివ్య భవనం కట్టించి ఇచ్చి తనతో సమానగౌరవంతో చూస్తూ విద్యావినోదాలతో కాలక్షేపం చెయ్యసాగాడు.

# సర్కసు కథ

ఆళ్ళాణ భూపతికి సకలవిద్యా పరీక్షకుడు అనే వాడుక ఉంది. ఒకనాడు అతను సభలో ఉండగా సింహం, పులి మొదలయిన క్రూర మృగాలు కుక్కల్లా వెనక వస్తూంటే భైరవుడనే తాంత్రికుడు రాజుకి మొక్కి – "దేవా! నేను మృగాలచేత సేవకులచేతచాలా అద్భుత వినోద కార్యాలు చేయిస్తాను. గొప్ప గొప్ప ఆస్థానాలకు వెళ్ళి నా ఆట చూబించి ఎన్నో బిరుదాలు పొందాను. మీ వలనకూడా విశేషమైన పారితోషికం పొందగలను. సెలవివ్వండి." అని ధైర్యంగా పలికాడు.

రాజు అందుకంగీకరించి ఆ రాత్రే కాళిదాసు మొదలయిన మహాకవులతో, ఊరిబయట ఉద్యానవనంలో వేసిన దేరాలోకి వెళ్ళి ఆ వినోదాలు చూడసాగాడు.

గొర్రెల వీపుమీద రెండు దూలాలు వేసి ... దానిమీద ఏనుగును ఎక్కించి దానిమీద రెండు సింహాలను నిలబెట్టి, వాటిమీద దూలంవేసి, ఆ దూలంమీద పులులనీ, ఆవులనీ నిలబెట్టి వాటిమీద వేసిన దూలం మీద కోతులనీ, ఎలుగుబంట్లనీ, దున్నపోతులనీ నిలబెట్టాడు తాంత్రికుడు. ఆవ్యూహచమత్కారం చూసి అళ్ళాణుడు ఆశ్చర్యపోతూ, పక్కనున్న కాళిదాసుతో "కవీంద్రా! గొర్రె స్వల్ప బలం కలిగినదే అయినా మేరు పర్వతం లోకాలన్నిటి బరువూ ధరించినట్లు ఈ మృగాల బరువంతా మోస్తుంది. చూశావా?" అనే సరికి కాళిదాసు నోటినుంచి "ముల్లోకాల భారమూ వహించే భోజుడికి ఈ మృగాలు భారమా?" అంటూ అప్రయత్నంగా శ్లోకం వచ్చింది.

అది విని అళ్ళాణుడు ఆశ్చర్యపోతూ – "కవీంద్రా! ఈ గొర్రెని భోజుడన్నావేం? ఆ మహారాజు శపించ బడ్డాడా ఏం? నిజం చెప్పు." అని అడిగాడు.

"నాకు అదేమీ తెలియదు. మీరడిగిన ప్రశ్నకు దైవికంగా అలాటి జవాబు నా ప్రయత్నం లేకుండానే వచ్చేసింది." అన్నాడు కాళిదాసు. రాజు ఆ మృగముల ఆట ఆపించమని ఆ తాంత్రికుణ్ణి

ఏకాంతంగా తన అంతఃపురానికి తీసుకెళ్ళి – " ఈ మృగాలన్నిటినీ ఎక్కడ సంపాదించావు? ఈ విద్య ఎలా నేర్చావు?" అని అడిగాడు.

"ఇవి పిల్లలుగా ఉన్నప్పుడు సంపాదించి ఆటనేర్పుతూ ఉంటాను." అని వాడు బొంకాడు.

"కావలసినంత డబ్బిస్తాను. ఆ గొర్రెను మా కిస్తావా?"

" నా బతుకంతా దానితోనే ఉంది ఇవ్వలేను."

అలాగే ఆ విషయం మీద వాళ్ళిద్దరికి వాదన జరిగింది. భైరవుడు రాజుని వంచించే ఉద్దేశంతో – ఇస్తాను." అని కానుక లందుకుని ఆ రాత్రి గడిచిన వేకువ జామున ఎవళ్ళకీ తెలియకుండా ప్రయాణమౌతూంటే రాజ కింకరులు చూసి అడ్డి బలవంతంగా ఆ గొర్రెను తీసుకొచ్చి రాజుకి అర్పించారు.

కాళిదాసు ఆ గొర్రె వద్దకు పోయి దువ్వుతూ – "మహారాజా! నువ్వు ఇలా గొర్రెవయ్యా వేమిటి? నిన్ను ఎవరు ఇలా చేశారు? భూభారం ఎవరిమీద పెట్టి వచ్చావు? అక్కడ కవులకి ఆధారం ఎవరు? ఏదో అన్నంతమాత్రాన చిరకాల స్నేహం లెక్కచెయ్యక, విశ్వాసం లేక వచ్చేసిన ఈ కపట మిత్రుణ్ని చూడ్డానికి వచ్చావా? అజాతశత్రువయిన నిన్ను ఎవరు ఇలా వంచించారు? నన్ను చూడకుండా రెండు గడియలు ఉండలేక పోయేవాడివే. ఇప్పు డెలా ఉంటున్నావు?" అంటూ దానిమీద పడి దుః ఖించసాగాడు. దానిమెడను కౌగలించుకుంటే ఒక తాయెత్తు కనపడింది. దానిని లాగి పారేశాడు.

అప్పుడు ఆ గొర్రె అదృశ్యమై భోజుడు ప్రత్యక్షమై – "ఆగరా, మూర్ఖా! ఎక్కడికి పోతావ్? నీపీచం అడుస్తాను." అంటూ నాలుగు వేపులా చూసి – ఎదుట కాళిదాసు కనపడగా "ఇతను నా ప్రాణమిత్రుడు కాళిదాసు! నేడు ఎంత భాగ్యం! నేనిక్కడికి ఎలా వచ్చాను? ఘోటక ముఖు దేడీ? మహాత్మా! రక్షించు. నా అపరాధం మన్నించు." అంటూ అతని పాదాలమీద పడ్డాడు.

అప్పుడు కాళిదాసు అతన్ని కౌగలించుకుని కన్నీరు కారుస్తూ – "స్నేహం కలసి విడిపోడం కంటె అసలు కలవక పోడమే మంచిది."

అంటూ శ్లోకం చదివి – "మహారాజా! నువ్వు ఈ తాంత్రికుడి చేతిలో ఎలా చిక్కావ్? నీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగాడు.

భోజుడు – "నాకు ఇదంతా దిగ్భ్రమగా ఉంది. ఇది ఏకశిలానగరం కాదా? దీనిని పాలించే వాడు అల్లాణ భూపతేనా? మహాత్మా! నువ్వు ఇక్కడున్నావని విని పురందరపురం నుంచి వస్తూంటే దారిలో మృగాలను వెంటబెట్టుకున్న భైరవుడనే తాంత్రికుడు మాకు కనపడ్డాడు. వాడు స్త్రీలని చెరపడుతున్నాడని విని వాడిని శిక్షించదలచి తిరుగుతున్న మాకు వాడు కనపడగానే కోపం ఆగింది కాదు.

"పాపాత్మా! నిలబడు. నీ పీచం అడుస్తాను. లీలావతిని ఎక్కడ దాచావ్?" అంటూ అడ్డంగా నిలుచున్నాను. ఘోటకముఖుడు నాతో నిలబడి వాడిని అదలిస్తున్నాడు. ఆయుధం కలనన్ను చూసి మృగాలు పారిపోవాలని చూశాయి. అంతలో వాడి పరిజనులు మాతో కలబడ్డానికి సిద్ధం అయ్యారు. చేతిలో కర్రనే ఆయుధంగా మేము వారిని ఆపాము.

ఆ తాంత్రికుడు ఎర్రని కళ్ళతో నావేపు చూస్తూ ఏదో పసరు నామీద జల్లి నాస్మృతి పోగొట్టాడు. అంతవరకే జ్ఞాపకం ఉంది. తరవాత ఏం జరిగిందో నాకు తెలియదు. నేను పడిపోడం చూసి నా మిత్రుడు యింకేమీ చెయ్యలేక పారిపోయి ఉంటాడు."

అని చెప్పిన భోజుడికి కాళిదాసు వాడు గొర్రెగా చేసి అక్కడికి తీసుకు వచ్చి ఆడించిన విధం, వృత్తాంతం అంతా చెప్పాడు. అప్పుడు అల్లాణుడు ఆశ్చర్య ఆనందాలతో భోజుణ్ణి కౌగలించుకుని – "మహానుభావా! నీ కీర్తి ఎప్పుడూ వింటూనే ఉంటాం. కాని దర్శన భాగ్యం లభించలేదు, తాంత్రికుడు ఇలాగ నాకు మహోపకారమే చేశాడు. నీ దర్శనంతో నేను కృతార్థుడి నయ్యాను. నీ కింకరుడిని. పనులకు నియోగించు. పట్ట భద్రుడివై ఈ రాజ్యం పాలించు. కవిసార్వభౌముడితో ఉండు." అని వినయంగా ప్రార్థించాడు. అప్పుడు భోజుడు – "వదాన్య సార్వభౌమా! నువ్వు కాక మరెవరు ఇలా అనగలరు? అందుకే ఈ

మహాకవి మీ వద్ద చేరాడు. మిమ్మల్ని రాజ్యం కంటె గొప్పదైన ఒకటి యాచిస్తున్నారు. అది నాకు దయచేయండి. పరమానందం చెందుతాను" అన్నాడు.

"రాజ్యమే మీదైనప్పుడు మీరింక అడగవలసిన దేమున్నది?"

"మరేమీ లేదు. ఈ మహాకవి నాకు ప్రాణం. ఇతన్ని నాకు దయచేయండి. మీకు ప్రాణదాన ఫలం రాగలదు." అని నవ్వాడు భోజుడు.

"దీనికి నాసెలవెందుకు? మీ కోరిక ప్రకారమే కానివ్వండి." అన్నాడు అళ్లాణుడు వినయంగా. భోజుడు దోసిలి పట్టి కాళిదాసుని -

"ఆర్యా! నడుస్తున్నప్పుడు, కూర్చున్నప్పుడు, మేల్కొన్నప్పుడు, నిద్రపోయేటప్పుడు నా మనస్సు మీవియోగం సహింపదు. నా తప్పులన్నీ మన్నించి ధారానగరం రావాలి మీరు. నువ్వు లేకుండా నేను ఆ నగరంలో ప్రవేశించను." అని ప్రార్థించాడు. ఆ ప్రేమకి కరిగిపోయిన కాళిదాసు అంగీకరించాడు.

అళ్ళాణుడు భోజుడికి గొప్ప విందు చేశాడు. శుభ ముహూర్తంలో కాళిదాసుని పల్లకి ఎక్కించి తాను పాదచారి అయి భోజుడు అక్కణ్నించి బయలుదేరాడు.

# కాశీ మజిలీ కథలు

## 159 వ మజిలీ

### యక్షుడి కథ

దత్తుడి వలన తన అక్క రత్నపదిక ఉన్న చోటు తెలిసింది మొదలు సువర్ణ పదిక ఆమెను చూడాలని ఆరాటపడుతూ భర్తతో - "మనం ఇప్పుడు యక్ష శైలానికి వెళ్ళాలి. ఆ కథ చెప్పిన మీ మిత్రుడు మళ్ళీ కనిపంచ లేదేం? అతను వచ్చి ఆ పర్వతాన్ని చూబిస్తాడేమో" అంది.

సువర్ణనాభుడు - "అతనామాట చెప్పాక ఇదుగో వస్తానని ఎక్కడికోపోయాడు. మరి కనపడలేదు. అతని కోసం పట్నం అంతా గాలించాను. మిగిలిన మిత్రులనీ చేరలేదు. గోణికాపుత్రుడు రాజకుమారుడికి మిత్రుడయ్యాడని అతనే చెప్పాడు. అతన్ని చూడాలని వెళ్ళాను. నా మిత్రులందరూ వచ్చేవరకూ మనం ఇక్కడ ఉండాలి. తరవాత మీ అక్కని చూడడానికి వెళ్దాం. గుర్తులు రాసుకున్నాను." అన్నాడు.

అందుకామె దిగులు నిండిన కంఠంతో - "మేమిద్దరమూ ఒక కడుపున పుట్టిన వాళ్ళం. చాలాకాలం కిందట విడిపోయాం. దైవికంగా దానిక్షేమం తెలిసింది. కాలవ్యవధి సహించగలనా? మీరే చెప్పండి. నన్ను అక్కడ చేర్చి మీరు రావచ్చును. మీ మిత్రులని కలుసుకున్నాక అక్కడికి తీసుకొద్దురుగాని." అని ప్రార్థించగా అతను అంగీకరించాడు.

ఒక శుభముహూర్తంలో మంచి గుర్రం మీద దత్తుడు చెప్పిన మార్గంలో గుర్తులు చూసుకుంటూ ఏరులు దాటి ..., గుట్టలు ఎక్కి ... వృక్షాలు లతలూ చూస్తూ ... తిరిగి తిరిగి ... పదిరోజులకి ఆ శిఖరాన్ని

కనుక్కున్నారు. దత్తుడికి కనిపించినట్లే వారికీ ఆ కాంతి కనిపించింది. కాని రాత్రివేళ పోలేక అక్కడ ఉండి పోయారు.

ఆ రాత్రి సువర్ణపదిక నిద్రపోకుండా ఎప్పుడు అక్కని చూస్తానా.. ఎప్పుడామెని కౌగలించుకుని మాట్లాడతానా అనుకుంటూ జాగారం చేసింది. సూర్యోదయమై చీకట్లు అంతరించి దిక్కు లెర్ర బడుతూండగా.. పక్షులు గూళ్ళు వదలిపోసాగాయి. అప్పుడు సువర్ణపదిక సువర్ణ నాభుడిని పట్టుకుని ఆ మెట్ట ఎక్కసాగింది. దారిలేక.. రాళ్ళతోనూ ముళ్ళతోనూ నిండి ఉన్నా కొమ్మలను పట్టుకునీ పొదలలో దూరీ..ఎగబాకుతూ..అతికష్టం మీద యక్షుడి నివాసం ముందుకి చేరుకున్నారు. వొళ్ళు చీరుకుపోయింది. మొహం మీద రక్తం కారుతూంది. కట్టుకున్న గుడ్డలు చిరిగి పీలికలయ్యాయి. ఒకచోట సువర్ణపదిక కాలు జారిపడి మోకాలికి గాయమై రక్తం కారుతోంది. అయినా అక్కని చూస్తానన్న ఉత్సాహంలో ఆమె వాటిని పట్టించుకోలేదు. ఆ నివాసం స్ఫటికమణి శిలచే నిర్మించబడి సూర్యకాంతులు పడడంతో కళ్ళు మిరుమిట్లు కొల్పుతున్నాయి. దేవలోకం లోని పుష్పజాతులన్నీ అక్కడ నాటబడి ఉన్నాయి. పూవులు వికసించి ఉన్నాయి. కొంచెంసేపు అక్కడ విశ్రమించే సరికి వారి ఆయాసం తీరింది. యక్షుడి గృహంలోని ద్వారాలకు అమర్చ బడిన రత్నాలలో, లోపలి విద్యుద్దీపాలు ప్రతిఫలించి రాత్రులు కాంతులను విరజిమ్మడం వల్ల కాని, లేకపోతే అక్కడ ఆ నివాసం ఉందని ఎవరూ తెలుసుకోలేరు. ఆ రత్నాల కాంతులూ, పువ్వుల సువాసనలూ సువర్ణనాభుడికి ఆశ్చర్యం కలిగించగా అతను వాటి దగ్గరగా పోయి చూడసాగాడు.

సువర్ణపదిక గుహద్వారం ముందు నిలబడి – "అక్కా! రత్నపదికా!" అని యక్ష భాషలో గట్టిగా పిలిచింది. ఆశబ్దం విని ఆమె తటాలున తలపు తెరచి – ఎవరు నువ్వు అని అడగబోయి – ఎదురుగా ఉన్న చెల్లెలిని చూసి – "ఆ! నా ముద్దుల చెల్లెలు సువర్ణపదికే! తల్లీ! ఎలా వొచ్చావు?" అని గాఢంగా కౌగలించుకుంది. సువర్ణ పదిక ఆనంద బాష్పాలు కురిపిస్తూ సంతోషంలో కంఠం పెగలక .. "అక్కా! క్షేమంగా

ఉన్నావా? బావేడీ? నిన్ను చూసి మూడేళ్ళయింది. ఇక చూపు దొరకదనే అనుకున్నాను. దైవికంగా వచ్చాను ” అంది

“చెల్లీ! నీకోసం ఎంత పరితపిస్తున్నానో! నీమాట తలుచుకున్నప్పుడల్లా మీ బావకూడా కంటతడి పెడతారు. మేమిక్కడ ఉన్నామని ఎవరు చెప్పారు? ఎక్కడినుంచి వచ్చావు? అలకాపురంలో మనవాళ్ళందరూ కుశలమేనా? ధూర్తుడైన కుబేరుడు ఎలా ఉన్నాడు? మేము ఇక్కడ హాయిగా ఉన్నాం. ఈ గుహలోపల పెద్దపట్నం అంత ఉంది. అలకాపురంలో ఉన్న వింత వస్తువులన్నీ మీ బావతీసుకొచ్చి ఇక్కడ ఉంచారు నువ్వులేదన్నదే లోటు. మేము వచ్చేశాక ఏం జరిగిందో చెప్పు.” అని అడిగింది రత్నపదిక.

“సంగీతాభ్యాసం కోసం కాని మీరులేని నగరంలో నేను ఉంటానా? కుబేరుడు మన కుటుంబంమీద కక్షకట్టి అపరాధాలను విమర్శించలేదు. అతని బానిస నన్ను నిర్బంధించబోగా ఇష్టపడక, మీరెక్కడున్నారో ఎరుగక, ఒక సిద్ధుడి ఉపదేశంతో ఒక శిఖరానికి వెళ్ళి శంకరుణ్ని ఆరాధించసాగాను. దైవవశాన అక్కడికి వచ్చిన సువర్ణ నాభుడనే మహాపండితుడిని పెళ్ళాడాను.

అతనితో దేశాలు తిరుగుతూ ధారానగరానికి వచ్చాను. అక్కడ వారి మిత్రుడు దత్తకుడనే వాడు మీ శైల వృత్తాంతం అంతా చెప్పగా విని వచ్చాం. అక్కా! వారన్నట్లే చేశాను.” మీ అక్కని చూడడంతోటే నా మాట మరిచిపోతావు.’ అన్నారు వారు. వాకిట్లో విశేషాలు చూస్తున్నారు. వచ్చి ఆతిధ్యం ఇవ్వు.” అంది సువర్ణపదిక. ఆమె అతన్ని ఆహ్వానించింది. అతను లోపలికి వచ్చి రత్నపదిక చూపుతూంటే భార్యతో అక్కడి విశేషాలన్నీ చూస్తూ విభ్రాంతి చెందుతూ కల అనుకున్నాడు. రత్నపదిక వారికి చక్కని భోజనం పెట్టింది. పగలంతా వారు మాటలతో గడిపారు. చీకటి పడుతూంటే యక్షుడు ఆకాశమార్గంలో ఒక నెమలిని పట్టుకుని ఇంటికి వచ్చాడు.

రత్నపదిక, సువర్ణపదికతో భర్తవద్దకు వచ్చి ముసిముసి నవ్వులు నవ్వుతూ – “ఇదెవరో ఎరుగుదురా?” అని అడిగింది. అతనామెను

పరికించి "ఓహో! సువర్ణపదికా! ఎప్పుడు వొచ్చింది? ఎలా వొచ్చింది? మొగుణ్ని సంపాదించిందా?" అంటూ దగ్గరకి తీసుకుని ఆప్యాయత చూపాడు. ఆమె అతనికి నమస్కరించి తన వృత్తాంతం అంతా చెప్పింది.

యక్షుడు మందహాసం చేస్తూ - "ఆ పండితు డేడీ? ఇక్కడే ఉన్నాడా?" అని అడిగాడు. "పుష్పవాటికలో ఉన్నాడు." అని రత్న పదిక చెబుతూంటే సువర్ణపదిక వెళ్ళి అతన్ని తీసుకువచ్చింది. అతను యక్షుడికి నమస్కరించాడు. యక్షుడు వారించి – "మీరు భూసురులు పండితులు. మీరు మాకు వంద్యనీయులు. మేము ఆశీర్వచన పాత్రులం." అన్నాడు.

సువర్ణనాభుడు – "భూసురులకంటె దేవతలు ఎక్కు వారు కారా? మనుషులకి దేవతలు వంద్యులు." అన్నాడు. వారి ప్రసంగంలో సువర్ణనాభుడి విద్యాపాటవం తేటతెల్లమవగా యక్షుడు చాలా సంతోషిస్తూ అతన్ని చాలా గౌరవించి అర్చించాడు.

సువర్ణ పదిక – "బావా! నువ్వు రోజూ ఎక్కడికి పోతుంటావు? నువ్వు తెచ్చిన నెమలి ఎక్కడిది? వింతలూ విశేషాలు ఏమిటి?" అని అడిగింది. "ఈ సందడిలో నేను నా మాట చెప్పడం మరిచాను. విను. నేను భూమంతా తిరిగి వస్తుంటాను. ఇవ్వాళ ఒక అరణ్య మార్గంలో వస్తూంటే మృగాలని ఆడించేవాడు ఒకడు ఈ నెమలి కాలితాడు జారిపోయి ఇది చెట్టు కొమ్మపైకెగిరి కూర్చుండగా దానిని పట్టుకోలేక విసిగి రాళ్ళు విసురుతున్నాడు. అది చూసి నేను దీనిని పట్టుకుని వచ్చాను. పెంపుడుదో అడవిదో నాకు తెలియదు. ఏమయినా దీనిని తెచ్చిన వేళమంచిది. మిమ్మల్ని చూడగలిగాను. నీకు కానుకగా ఇస్తాను. తీసుకుంటావా?" అన్నాడు. సువర్ణపదిక సంతోషిస్తూ దానిని తీసుకుని పరిశీలనగా చూస్తూ దాని సౌందర్యాన్ని పొగుడుతూ, మెదదువ్వింది. అలాదువ్వడంలో దాని మెడకున్న తాయెత్తు ఊడిపోయింది. అప్పుడు ఆ నెమలి ఒక సుందరి అయి నిలబడింది. ఆ యువతిని చూసి సువర్ణపదిక, రత్నపదిక ఆశ్చర్యపోయారు. ఆమెను సమీపించి – "తల్లీ! నువ్వు ఎవరి ఇల్లాలివి? నీపేరేమిటి? ఇలాటి రూపం ఎందుకు ధరించావు? నీ వృత్తాంతం చెప్పు." అని ప్రార్థించారు.

ఆమె నాలుగు వేపులా చూసి విభ్రాంతి పడుతూ - "అమ్మలారా! మీరెవరో నేనెరుగను. అకారణ కృపతో నన్ను బతికించారు మీముందు నిజం దాచకూడదు వినండి.

నేను ధారానగరాధీశ్వరుడైన భోజమహారాజు భార్యని. నాపేరు లీలావతి. నేను దురదృష్టవశాత్తూ భర్తకిదూరమై అడవిలో తిరుగుతూ ఘోటకుడనే విద్వాంసుడి ఆశ్రమానికి వెళ్తూంటే ఒక తాంత్రికుడి మాయామహిమచేత నెమలిని చేయబడ్డాను " అని చెప్పింది.

అది విన్న యక్షుడు గుండె మీద చెయ్యివేసుకుని - "ఓరి! రండాపుత్రా! నువ్వు ఎంతక్రూరుడివిరా! నీదగ్గరున్న మృగాలన్నీ ఇలాటివే కాబోలు! నిన్ను వెదికి పట్టుకుని శిక్షిస్తాను చూడు

తల్లీ! లీలావతీ! మహానుభావుడైన కాళిదాసుని పాలిస్తున్న భోజరాజు ఇల్లాలివా! ఆహా! మేమెంత దన్యులం! నీపాద ధూళిసోకి మా యిల్లు పవిత్రమైంది. అమ్మా! నీకు భయంలేదు. నిన్ను ప్రాణంలా తీసుకు వెళ్ళి నీ భర్త వద్ద చేరుస్తాం." అన్నాడు.

ఆమె మాటలు విన్న సువర్ణనాభుడు - ""అమ్మా! నీకు సహాయం చేసినవాడు ఘోటక ముఖుడన్నావు అతను నా మిత్రుడు. తరవాత అతనేమయ్యాడో ఎరుగుదువా?" అని ఆమెనడిగాడు.

"నాకేమీ తెలియదు. కుక్కలు తరుముకుపోయి కరిచాయి. పడిపోయాడు నేను వాళ్ళు తెలియక నెమలినైపోడంతో పూర్వస్మృతి పోయింది. మీరెవరు? కాళిదాసుని తెలిసినట్లు మాట్లాడుతున్నారు. వారితో మీకు పరిచయం ఎక్కడ కలిగింది? చెప్పి ఆనందింప జెయ్యండి." అని లీలావతి వేడుకోగా సువర్ణపదిక ఆ వృత్తాంతం చెప్పింది.

ఆ కథవిని లీలావతి వాళ్ళని కౌగలించుకుని - "మీరు దేవతలు! మీదర్శనం చేసిన మనుషులు కృతార్థులౌతారు. నేను ధన్యురాలిని." అని పొగిడి - "భోజుని వృత్తాంతం మీకేమయినా తెలుసా?" అని యక్షుడి నడిగింది.

"రేపు పోయి తెలుసుకు వొస్తాను. విచారించకు " అని చెప్పాడతను.

రత్నపదిక లీలావతికి ఆ గుహ అంతటినీ చూపించింది. అక్కడి చిత్ర విచిత్రాలకి ఆమె చాలా ఆనందించింది. రాత్రి విందు భోజనాలు అయ్యాక గుహముందరి స్ఫటిక శిలమీద కూర్చుని మాట్లాడుకుంటూ రత్నపదిక భర్తతో – "ఇక్కడి మందిరం మనుషులు తెలుసుకోలేరనీ ఏకాంత ప్రదేశం అనీ చెప్పారే. ధారానగరంలో వీరి మిత్రుడెవరో దీని గురించి చెప్పాడట. అతనికి ఎలా తెలిసింది? మీరు నాతో చెప్పింది అసత్యమా?" అని అడిగింది.

యక్షుడు – "మరచిపోయావా? ఆవేళ ఒక బ్రాహ్మణుడు దారితప్పి మనింటికి రాలేదూ? నువ్వు సిగ్గుతో లోపలికి పోయావు. తరవాత అతన్ని ఆడదానిగా శపించాం. అతను వేడుకోగా సంవత్సరమే ఆడతనం ఉంటుందని కరుణించాం. అతనే వీళ్ళకి చెప్పిఉంటాడు." అని సువర్ణ నాభుడిని – "అయ్యా! మీకు మాయింటి గురించి చెప్పిన వాడు స్త్రీగా మారిపోలేదా?" అంటు ప్రశ్నించాడు.

సువర్ణనాభుడు హాహాకారాలు చేస్తూ – "అయ్యో! నా మిత్రుడు సంతోషంలో శాపం సంగతి మరచి మీ నివాసం తెలియజేసి ఎంతో ఉపకారం చేశాడు. అతను స్త్రీ ఐనట్లు తెలియక అతని కోసం ఎంతగానో వెదికాను. అయ్యో! విధి. అఖండ పండితుడైన నా మిత్రుడు దత్తుడిప్పుడు స్త్రీ ఐ పూర్వస్మృతిలేక తిరుగుతున్నాడా! ఆ ఆపద ఎలా దాటగలడు? మహాత్మా! అతని మూలనే మనం అందరం కలుసుకున్నాం. నన్ను బట్టి అతను మీకు ఆప్తుడే. శాపవిముక్తి కావించండి." అని వేడుకున్నాడు. రత్నపదిక – "అతడా! అయ్యో! పాపం. ... స్త్రీ అయిపోయాడా? అలాటి హితుడు మరొకడులేడు మనకి అతన్ని కాపాడక తప్పదు. వేగంగా శాపనివృత్తి చెయ్యండి." అని వొత్తిడి చేసింది. అతను అంగీకరించాడు.

మర్నాడు యక్షుడు ఆ తంత్రజ్ఞుడు చేసే కపటాలు తెలుసు కుందుకు అతనున్న అరణ్యానికి పోయి రహస్యంగా మృగాలనీ పక్షులనీ, పరామర్శిస్తూ కావలివాళ్ళు చూడకుండా ఒక చిలకని ఎలాగో పట్టుకుని పెందరాళే ఇంటికి వచ్చేశాడు. సువర్ణ పదికని పిలిచి – "బాలా! ఇవాళ ఈ చిలకని తెచ్చాను. దీనిని కూడా స్త్రీని చేస్తావా?" అని పరిహాసం

ఆడాడు. ఆమె దానిని ముద్దాడుతూ... "దీనిమెడలోనూ తాయెత్తుంది.." అంటూ దానిని లాగి పారేసింది. దివ్య మంగళ స్వరూపంతో ఒక సుందరి వారిముందు నిలబడింది. ఆమెను చూసి లీలావతి – "పుత్రీ! నువ్వు కూడా నాలాగ ఆ కపటుడి చేతిలో పడ్డావా! అయ్యో! చిన్నదానివి తల్లితండ్రు లెవరు? నీపేరేమిటి? ఎవరి భార్యవి? వాడికెలా చిక్కావు? నీ వృత్తాంతం చెప్పు" అంది.

"దేవీ! ఇది నిజమా స్వప్నమా అని నా మనసు భ్రమ చెందుతూంది. ఇది ఏదేశం? నేనిక్కడికి ఎలా వచ్చాను? మా తల్లి తండ్రు లేరీ? అడవిలో క్రూరాత్ము డెవరో మమ్మల్ని భయపించాడు . అమ్మా! నాపేరు మల్లిక. బ్రహ్మదత్తుడనే విప్రుని కుమార్తెను చారాయణుడనే పండితుడి భార్యని. నన్ను వివాహమాడి నా భర్త తన మిత్రులు దత్తకాదులని చూడడానికి ధారానగరం వెళ్ళి ఎన్నాళ్ళకీ తిరిగి రాకపోడంతో నాతల్లి తండ్రులు నన్ను వెంట బెట్టుకుని ధారానగరానికి బయలు దేరారు. దారిలో ఒక క్రూరుడు మా కడ్డంపడి అదిలించారు. అంతవరకే తెలుసు. తరవాత ఏమయిందో ఎరగను "

"ఏమిటీ! నువ్వు చారాయణుడి భార్యవా! అతను నా మిత్రుడు, అయ్యో! ఎంత ఆపద వొచ్చింది నీకు. నీ తల్లితండ్రులు కూడా ఆ తాంత్రికుడి కట్టులో పడి ఉంటారు. విచారించకు. మేము దారానగరానికి వెళ్తాం. నా మిత్రుడితో చేరుస్తాం." అని సువర్ణనాభుడు ఆమెను ఊరడించి – "యక్షేంద్రా! ఆ పాపాత్ముడివద్ద ఉన్న జంతువులన్నీ ఇలాటివే. మీరు పోయి మరికొన్ని జంతువులని తేవాలి. ఈ ఉపకారం చెయ్యండి వాడిని శిక్షించే ఉపాయం ఆలోచించండి." అని యక్షుణ్ని ప్రార్థించాడు.

సువర్ణపదిక, రత్నపదిక, లీలావతులు మల్లికకు తమ బంధుత్వం తెలియజేసి ఊరడించారు. మర్నాడు ఉదయం యక్షుడు బయలుదేరి ఆ భైరవుడున్న అడవికి పోయి వాడు చేసే పనులన్నీ రహస్యంగా గమనించసాగాడు.

ధారానగరంలో కాళిదాసుని గౌరవించడానికి గొప్పసభ జరుగుతుందనీ, మృగాలతో కూడా నువ్వు వచ్చి వినోదాలు చూబించి

గొప్ప కానుక లందుకొమనీ భోజరాజు మంత్రులు భైరవుడికి పత్రిక పంపారు. అతనందుకంగీకరించాడు. ఆవేళ మధ్యాహ్నం బరువు మోసేగాడిద మెడలో మరో తాయెత్తు కట్టి మేకని చేసి – "దీనిని కూరగా వండు" అని వంటవాడి కిచ్చాడు. వాడు దానినిని కొయ్యడానికి చెట్ల చాటుకు తీసుకు వెళ్ళగా యక్షుడు వాడికి రత్నకంకణం ఆశచూపి రహస్యంగా ఆ మేక నెత్తుకుని ఆకాశ మార్గంలో ఇల్లు చేరాడు. వంటవాడు కొంచెం ధరకు మరో మేకని కోసి యజమానికి వండి పెట్టాడు.

ఆ మేక మెడలోని తాయెత్తుని లాగి పారెయ్యగానే ఒక చక్కని పురుషుడు నిలబడి – "గురుద్రోహీ! దయామయుడైన గురువుని చంపావు! కృతఘ్నుడా! పాపీ! కనపడ వేమిరా? అయ్యో . నా గురువు బలవన్మరణం చెందాడు. అతనికళేబరం ఏం చేశావురా దుష్టుడా!" అంటూ విలపించసాగాడు.

సువర్ణనాభుడు అతన్ని పరీక్షగా చూసి – "ఓహో! ఇతను నా మిత్రుడు చారాయణుడు. మల్లిక ఇతను ధారానగరానికి వెళ్ళాడని చెప్పింది. ఇతను కూడా తాంత్రికుడి బారిన పడ్డాడన్నమాట! మల్లికకి ఈ అంతరాయం తెలియదు.' అనుకుని – "చారాయణా! నన్ను చూడు. నేనెవరినో ఎరుగుదువా? నేను నీ మిత్రుడుని...సువర్ణనాభుణ్ని. ఎవరినో నిందిస్తున్నావే. అతనెవరు?" అన్నాడు.

చారాయణుడు అతన్ని చూసి –"ఔరా! ఏమి విచిత్రం. నువ్వెక్కడనుంచి వచ్చావు? తక్కిన మిత్రులు ఇక్కడ ఉన్నారా?" అంటూ కౌగలించుకున్నాడు. సువర్ణనాభుడు – "మిత్రమా! నీ వృత్తాంతం కొంత నీ భార్య మల్లిక వలన విని ఉన్నాం. ఆమె ఇక్కడే ఉంది." మీరిద్దరూ ఒకరి చేతిలోనే చిక్కి ఒక చోటే ఉన్నారు. అంటూ యక్షుడి వల్ల రక్షించబడిన విధం చెప్పాడు. చారాయణుడు తన భార్యని చూడడానికి ఆత్రత పడ్డాడు. ఆమె అంతలోనే ఆ వార్త విని గుహాముఖానికి వచ్చి భర్తని చూసి సిగ్గుతో దగ్గరకి పోలేక కన్నీరు కార్చసాగింది.

చారాయణుడు తటాలున ఆమెని కౌగలించుకొని కన్నీరు తుడుస్తూ – "జరిగింది విన్నాను నన్నువాడు గాడిదని చేసి బరువులు మోయిస్తూ ఇవాళ మేకను చేసి, చంపి కూరొండమని వంటవాడి కిచ్చాడు. యక్షుడు నన్ను రక్షించాడు. క్షణం ఆలస్యమయినా నేను చనిపోయేవాడినే. మననిద్దరినీ రక్షించిన యక్షుడే నీకూ నాకూ కూడా తండ్రి. దుఃఖించకు. అతను మీ తల్లితండ్రులని కూడా తీసుకొస్తాడు." అని ఓదార్చి యక్షకాంతల బంధుత్వమూ, లీలావతి వృత్తాంతమూ విని పరమానందం పొంది, ఆ భైరవుడి కథంతా చెప్పి వాడిని సంహరించడానికి తోడు రమ్మని యక్షుణ్ని ప్రార్థించాడు.

యక్షు డతని మాటలకు – "బాబూ! వాడు మంత్ర తంత్రాలు తెలిసినవాడు. వాడిచేతికి చిక్కితే నా పనికూడా సరే. వాడిని పరాభవించే ఉపాయం మరొకటుంది. కాళిదాసును గౌరవించే మహాసభకు వీడు పదిరోజుల్లో ధారాగనరం వెళ్తున్నాడు. మనం కూడా వెళ్ళి, రాజుకి వీడి దుర్మార్గం అంతా చెప్పి శిక్షింపజేద్దాం. మీరు కూడా ఆలోచించండి." అన్నాడు. అందరూ అందుకు ఒప్పుకున్నారు.

మర్నాడు భైరవుడు ఎక్కడున్నాడో, ధారానగరం వెళ్తున్నాడో లేదో చూసివస్తానని యక్షుడు అడవికి వెళ్ళాడు. వాడి పరివారం అంతా మధ్యమధ్య ఆగుతూ ధారానగరం పోతున్నారు.

ఆ మేకను రత్నకకంకణానికి అమ్మేసి మరోమేకని కొని వండి పెట్టాడని మరొక పరిచారకుడు ఆ వంటవాడిని భైరవుడికి అప్పగించాడు. భైరవుడు వాడిని శిక్షించి – 'ఎవడో రహస్యం తెలుసుకుని నా మృగాలనీ, పక్షులనీ పట్టుకు పోతున్నాడు. తెలుసుకోలేకపోయాను. ఆ బ్రాహ్మణుడి మాంసం తిని కసి తీర్చుకున్నాను అనుకున్నాను. తప్పిపోయింది' ... అని ఆ దొంగని పట్టుకుందుకు రహస్యంగా చాలామంది గూఢచారులని నియమించి గొప్ప పారితోషికం ఇస్తానన్నాడు.

ఆ రహస్యం తెలియని యక్షుడు భైరవుడు మృగాలతో నడుస్తున్న సమయంలో అతని వెనక నడవసాగాడు. గూఢచారి ఒకడు అతన్ని

పట్టుకుని భైరవుడికి అప్పగించగా వాడు కోపంగా తిట్టి. నీ పనిచూసుకో.. అంటూ నెత్తిమీద మందురుద్ది మెడలో తాయెత్తు కట్టి పెద్ద గాడిదను చేసేశాడు. యక్షుడైనా, ఇంద్రుడైనా ప్రారంబ్ధం అనుభవించవలసిదే కదా.

భైరవుడు ఎందరినో మృగాలని చేసి పెద్ద కానుక దొరుకుతుందనే ఆశతో మృగసమూహాన్ని వెంటపెట్టుకుని ధారానగరానికి వెళ్ళాడు.

ఆనాడూ - మర్నాడూ ... మూడోనాడూ కూడా యక్షుడు ఇంటికి రాకపోడంతో అతని భార్య సువర్ణనాభుడితో - "అయ్యా! నాభర్త ఎంత పని ఉన్నా వరసగా రెండు రాత్రులకంటె ఎక్కడా ఉండరు. ఏదో ఆటంకం కలిగింది. ఆ పాపాత్ముడు వారిని బంధించాడేమో. దైవమా! ఏం చేసేది? మహాత్మా! ఉపాయం ఆలోచించావా?" అంటూ శోకించింది.

"తల్లీ! విచారించకు. యక్షుడు ఎక్కడ ఉన్నా వెదికి తీసుకు వస్తాను భైరవుడు సభాదినానికి ధారానగరం వెళ్తాడని నీ భర్తచెప్పాడు. మనం అందరమూ ఆనాటికి అక్కడికి పోదాం. అన్ని పనులూ నెరవేరతాయి." అన్నాడు సువర్ణనాభుడు. అతనిమాటకు అందరూ అంగీకరించారు. మంచిముహూర్తం చూసివాళ్ళు ధారానగరం బయలుదేరారు."

అని చెప్పి మణిసిద్ధుడు కథ చెప్పడం ఆపాడు. తరవాత మజిలీ చేరుకున్నాక మళ్ళీ చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 160 వ మజిలీ

భోజరాజు పుత్రుడయిన చిత్రసేనుడొకనాడు గోణికా పుత్రుడితో ఏకాంతంలో – "మిత్రమా! పూర్వజన్మ కర్మ ఫలాలు కదు విచిత్రాలు. సుఖాలూ స్థిరం కావు. దుఃఖాలూ స్థిరం కావు. చారుమతి సంయోగంలోని సంతోషాన్ని అనుభవిస్తూండగా ఒకదుర్వార్త చెవినపడింది. నా చెల్లులు గర్భవతి ఐనట్లు తెలిసింది. పూర్వం గుర్రమెక్కి ఉద్యానవనంలోకి వచ్చినది పురుషుడే. స్త్రీ అని రుక్మిణి బొంకింది. స్త్రీల మాయలు దేవుడికేనా తెలియవు. మాతండ్రి ఇక్కడ లేకపోడం వలన ఈ భారం నామీద పడింది. చారుమతి మోహంలో నేనేమీ గమనించలేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఈ అల్లర్లు వింటే తండ్రిగారు చాలా కోపగిస్తారు. కర్తవ్యమేమిటి?" అని అడిగాడు.

అందుకు అతను – "రాజపుత్రా! నీ సోదరి గర్భానికి కారణం ఎవరో తెలుసుకుని అతనికే ఆమె నిచ్చి వివాహం చెయ్యాలి. రుక్మిణి సామన్యుణ్ని వరింపదు. రాజకన్యలకు గాంధర్వ వివాహం ఉత్తమమే. మీ తండ్రి గారు చాలా దగ్గరగా వచ్చామని జాబు రాశారు కదా. కాళిదాసుని పల్లకీలో ఎక్కించి తాను ఆ పల్లకితో నడిచి వస్తున్నారట కదా. తరవాత విశేషాలేమిటి?" అన్నాడు.

"అంతకు మించి కొత్తవార్తలు తెలియవు. నేడో రేపో రాగలరు. వస్తారంటే నా గుండె కొట్టుకుంటూంది. వాళ్ళు అలా మాట్లాడు కుంటూంటే ప్రధానమంత్రి వచ్చాడు. రాజపుత్రుణ్ణి ఆశీర్వదించి – "మహారాజుగారు రేపు సూర్యోదయానికి వస్తామని ఇప్పుడే వార్త పంపారు – ముందు వారు వ్రాసిన ప్రకారం పట్టణం అంతా అలంకరించి అందరూ రాజులకీ, ఆహ్వానాలు పంపాం విద్వాంసులు వేలకొద్దీ వస్తున్నారు.

భైరవుడనే తాంత్రికుణ్ని, మృగవినోదకారుణ్ని రప్పించమని రాశారు. వాడు తోటలో విడిది చేసి ఉన్నాడు. నాటకులు, పాటకులు లక్షలకొద్దీ వచ్చారు. మునుపు సంగీతం పాడిన ఆమె పరివారంగా వచ్చింది. మహాసభలో సంగీతం పాడి కాళిదాసు ఆశీర్వచనం తీసుకుంటుందట. గోనర్దీయుడు, కుచుమారుడు మొదలయిన విద్వత్ప్రభువులు వచ్చారు. వాళ్ళందరికీ తగిన బసలు ఇచ్చాము. పట్నంనిండా కొత్తవారే. రేపు పొద్దున్న మేళతాళాలతో రాజుగారికి మనం ఎదురేగాలి. మీరు కూడా రావాలి." అన్నాడు. రాజపుత్రుడు అంగీకారం తెలిపాడు. మంత్రిని అభినందిచాడు.

గోణికాపుత్రుడు, "గోనర్దీయుడు, కుచుమారుడు రాజు లన్నారు. మీరు వారి నెరుగుదురా?" అని మంత్రిని అడిగాడు. మంత్రి గోణికాపుత్రుడి ప్రశ్నకు "తెలియదు." అన్నాడు. అతను వెళ్ళిపోయాక చిత్రసేనుడు ఆ రాత్రంతా రుక్మిణి గర్భంగురించీ, చారుమతి సంబంధం గురించీ రాజువిని ఏమంటాడో అని భయంతో నిద్రపోలేక పోయాడు.

మర్నాడు అరుణోదయం కాకముందే మంత్రి, సామంతులు, పురోహితులూ మంగళవాద్యాలతో భద్రగజాన్ని అలంకరించి రాజకుమారుడి వద్దకు తీసుకువచ్చి, అతనిని అలంకరించి మిత్రుడితో సహా బయలుదేరి ఊరిబయట ఉద్యానవనంలో ఉన్న రాజుని కలుసుకున్నారు. కాళిదాసుని పూజిస్తూ పల్లకీ ఎక్కించి తనకోసం వచ్చిన వారందరినీ అభినందించి, కొడుకుని కౌగలించుకుని క్షేమం అడిగి, బ్రాహ్మణులకు నమస్కరించి ఆశీర్వచనాలు పొంది మంత్రులకు తన అభిలాష చెప్పాడు.

కాళిదాసు పల్లకీ దిగి కొందరకు నమస్కరిస్తూ... కొందరినుంచి నమస్కారాలు అందుకుంటూ ... కొందరిని దీవించి భోజుడు తనకి చేసిన అపూర్వ సపర్యలను గురించి పెద్దగా చెప్పాడు.

సభాభవన ద్వారంలో గజం మీదనుంచి దింపి, జయ జయధ్వానాలతో రత్నసింహాసనంలో కాళిదాసుని కూరో బెట్టి భోజుడూ

పుత్రుడూ పక్కగా నిలబడ్డారు. కాళిదాసుకి ప్రశంసా శ్లోకాలు చదవడమూ, హారతులివ్వడమూ మొదలయిన కార్యక్రమాలు ముగిశాక, భోజుడు సభ్యులవేపు తిరిగి – "ఆర్యులారా! నాదేశం అంతటినీ ఈ మహాకవికి ఇచ్చేశాను. ఇది మొదలు ఇతనే దేశాదిపతి. ఇకనుంచి ఇతని ఆదేశాలలో ప్రజలు వర్ధిల్లుతారు." అని ప్రకటించాడు. సభ్యులు అతని వితరణకు ఎంతగానో ప్రశంసిస్తూ జయధ్వానాలు చేశారు

అప్పుడు కాళిదాసులేచి నిలబడి ... "రాజా! నేను ఈ భూభారం వహించి ప్రజలను పాలించలేను నీకే దీనిని తిరిగి ఇచ్చేస్తున్నాను." అన్నాడు. సభ్యులు మళ్ళీ సెభాషన్నారు. భోజుడు ప్రజాభిప్రాయాన్ని మన్నించాడు. అప్పటికే కాలాతీతం అవడంతో సభ ముగిస్తూ – ప్రతిరోజూ ఒక్కొక్క వినోదం ప్రదర్శించేలా నిశ్చయించి నివాసాలకు వెళ్ళిపోయారు.

# కాశీ మజిలీ కథలు

## 161 వ మజిలీ

సువర్ణనాభుడు, చారాయణుడు, మల్లిక, సువర్ణపదిక, రత్నపదిక, లీలావతి మొదలైన వారు సఖులతో ధారానగరం వచ్చి నివసిస్తున్నారు. మగవాళ్ళు సభకి పోయి విశేషాలు చేసి ఇంటికి రావడంతోనే - మల్లిక, సువర్ణపదిక వారి ద్దరకు వెళ్ళి "సభ ఎలా జరిగింది. కాళిదాసుని గౌరవించారా? భైరవుడి వార్త తెలిసిందా?" అని అడిగారు. లీలావతీ, రత్నపదికా దూరంగా ఉండి విచారంగా చూస్తున్నారు.

"భోజుడు చాలా తేజశ్శాలి. మంచివక్త. శౌర్యవంతుడు." అంటూ అతను కాళిదాసుకి రాజ్యం ఇచ్చెయ్యడం అతనంగీకరింపక తిరిగి యివ్వడం - సభ్యులు సంతోషించడం... అంతా చెప్పాడు చారాయణుడు. "గోణికాపుత్రుడు రాజకుమారుడికి మిత్రుడిగా పెద్దలా తిరుగుతున్నాడు. గోనర్దీయుడు, కుచుమారుడు ప్రభువుల వేషాలతో సభను అలంకరించారు. మేము ఒకరికొకరం పలరించుకుందుకు అవకాశమే రాలేదు. రోజుకొక వినోదం చూడడానికి ఏర్పాటు చేశారు. గురువారం భైరవుడి మృగముల ఆట జరుగుతుంది. రేపు మా మిత్రులని కలుసుకుని భైరవుడి దుష్టత్వం గురించి రాజుకి తెలియపరచి శిక్షింప చేస్తాం. భైరవుడు ఉన్న తోటలోకి పోయి చూశాం. మృగాలూ, పక్షులూ చాలా ఉన్నాయి. వాటిలో మనవాళ్ళు ఉండి ఉంటారు. మీరు విచారించకండి."

"మాబావ యక్షుడు పక్షో, మృగమో అయి ఉండగా పాడడానికి నీకు నోరెలా వొస్తుంది? రేపటిగాన సభకి నేను రాలేదు. వారిని తీసుకు వచ్చేవరకూ ఏ వినోదాలకీ పోగూడదు. మరి ... లీలావతి గురించి ఏం

ఆలోచించారు? ఈమె భోజుని వార్తలు వింటూ ఎంతో దుఃఖిస్తూంది. ఆ వినోదాలలో ఈమె కూడా పాల్గొనవలసిందే కదా? అన్నిటికంటే ముందు ఈమెకి ఉపకారం చెయ్యాలి." అంది రత్నపదిక

ఆ మాటలకు లీలావతి కన్నీరు కారుస్తూ – "బిడ్డలారా! నేను పాపాత్మురాలిని. నాకు మీరేమీ ఉపకారం చేయలేరు. నాభర్త నన్ను ఎందుకో అనుమానించి అడవిలో వొదిలి పెట్టించాడు మొండిదాన్ని కనక బతికి ఉన్నాను. ఇప్పుడు నా సుగుణం ఏం పరీక్షించి నా భర్త నన్ను అంగీకరిస్తాడు. బతికున్నానని చెబితే వారిమీద కోపగిస్తారేమో. నా మాట అటుంచి యక్షుడి విముక్తి కోసం ప్రయత్నించండి." అంది.

చారాయణుడు – "తల్లీ! నీ భర్త నీ వియోగానికి ఎప్పుడూ దుఃఖిస్తున్నాడని ప్రజలు చెప్పుకుంటున్నారు. ఉత్సవ సమయంలో కూడా అతని ముఖం చిన్నబోయే ఉంది. నీ విషయంలో పశ్చాత్తాప పడుతున్నట్లున్నాడు. నీకు తప్పకుండా భర్తతో సమావేశం కలుగుతుంది." అన్నాడు. ఆమె మనసు పొంగిపోగా – "నాకలాటి భాగ్యం పడుతుందా? నేనంత పుణ్యాత్మురాలినా?" అనగా అతను –

"తల్లీ! ఊళ్ళో నీకు నమ్మకమైన వారెవరో చెబితే వారితో స్నేహం చేసి రాజుగారి హృదయం తెలుసుకుందాం " అన్నాడు

"రాజపత్ని సవతి కూతురు రుక్మిణి తనకి హృదయమే అనీ తన గురించి విచారిస్తుందనీ, తన రాకను ఆమెకు చెప్పవచ్చుననీ అంది. రుక్మిణి సఖీరేవతి వద్దకు పోయి మాట్లాడి నగరంలోని విశేషాలు తెలుసు కోవచ్చు" అంది.

చారాయణుడు రేవతి ఇంటికి వెళ్ళాడు. "రేవతీ! నీతో ఒకపనిపడి వెదుక్కుంటూ వచ్చాను. నిన్ను చూడగానే నా పనినెరవేరుతుందనిపిస్తూంది." అన్నాడు.

**రేవతి** : అయ్యా! తమ రెవరు? మీది ఏవూరు? నావలన మీకు జరగవలసిన పని ఏమిటి?

చారాయణుడు : నేనొక బ్రాహ్మణుడిని. పండితుడిని. మా నివాసం కాశీనగరం. ఈ వూళ్ళో విద్వత్సభలు జరుగుతున్నాయని విని ప్రసంగించాలని వచ్చాను. నిన్ను ఒకమాట అడగాలని తలుస్తున్నాను.

రేవతి : (లేచినమస్కరిస్తూ) : పండితోత్తమా! మీకు నన్నడగవలసిన దేముంది? నాకు తెలిసినదయితే తప్పకుండా చెప్పి కృతార్థురాలి నౌతాను.

చారాయణుడు : నీసుగుణాలు నేను విన్నదానికంటె ఎక్కువగా ఉన్నాయి. రాజపుత్రిక నీకు ప్రాణస్నేహితురాలట. నిజమేనా.

రేవతి : నిజమే. ఆమెకు నామీద అనుగ్రహమే. నన్ను మీరింతగా పొగడక్కరలేదు. సేవకురాలిని. కర్తవ్యం చెప్పండి.

చారాయణుడు : మరేమీ లేదు. రాజుగారికి నలుగురు భార్యలట. పెద్ద భార్య లీలావతి ఎక్కడుందో తెలునా?

రేవతి : (మెల్లగా) రాజుగారికి ఎందుకో కోపం వచ్చి ఆమె నడవికి పంపి చంపించారట. ఇది పరమరహస్యం.

చారాయణుడు : అయ్యో! పతివ్రతా శిరోమణి అయిన ఆమెలోనూ తప్పు పట్టారా! ఆ తప్పేమిటో నీకు తెలుసా?

రేవతి : ఏమీలేదు. వెర్రి అనుమానం, ఆమె ప్రారబ్ధం.

చారాయణుడు : ఆమెను చంపించాక అతని హృదయం ఎలా ఉంది?

రేవతి : చచ్చిన తరవాత అనురాగం పెరుగుతుందికదా. ఆయన ఏ భార్య వద్దకూపోక లీలావతి అంతపురంలోనే ఉంటూ ఆమెకోసం దుఃఖిస్తూన్నాడని తెలిసింది.

చారాయణుడు : ఇప్పు డామె బతికి వొస్తే రాజు అంగీకరిస్తాడా?

రేవతి : చనిపోయిన వారు బతకడం ఎలా? మీరింతగా గుచ్చి గుచ్చి అడుగుతున్నారు, ఆమె బతికేఉందా ఏం? బతికుంటే – రాజుగారి మాట చెప్పలేను కాని రుక్మిణి మాత్రం సంతోషసాగరంలో మునుగుతుంది.

చారాయణుడు : నేను అలాగేవిన్నాను. ఆమె కూడా అలాగే చెప్పింది. అందుకే యీపని కోసం నీదగ్గరకు వచ్చాను

రేవతి · (ఆశ్చర్యంగా) ఏమిటీ! ఆమెఉందా! ఎక్కడుంది? ఎలా బతికింది? చెప్పండి మీకు పదివేలనమస్కారాలు. అతను మెల్లగా.. "ఆమె బతికే ఉంది. ఈ వూళ్ళోనే ఉంది. ఈ రహస్యం నీకు చెప్పి రమ్మంది." అన్నాడు "రుక్మిణికి ఈ శుభవార్త చెప్పి వస్తాను. మీరిక్కడే ఉండండి." అని అంతఃపురానికి వెళ్ళి ఆమెకు చెప్పింది. రుక్మిణి ఆశ్చర్యమూ, సంతోషమూ పట్టలేక తనచేతి రత్నకంకణం దానికి కానుకగా ఇచ్చి – "ఆమె ఎక్కడుందో నువ్వు స్వయంగా పోయి చూసివచ్చి చెప్పు. అంతవరకూ నాకు నమ్మకం కుదరదు." అని తొందరపెట్టింది.

రేవతి చారాయణుడి వద్దకు వచ్చి – "పదండి నాకు ఆమెను చూపించండి." అనే సరికి అతను ఆమెను ఇంటికి తీసుకుపోయి లీలావతి ముందు నిలబెట్టాడు. ఆమెను చూసి రేవతి గొల్లున ఏడుస్తూ ఆమె పాదాల మీద పడింది. లీలావతి దానిని లేవనెత్తి – "అమ్మాయి రుక్మిణి క్షేమంగా ఉందా? రాజుగారి భార్యలు సుఖంగా ఉన్నారా? విశేషా లేమిటి? రాజుగారి వార్త లేమిటి?" అంటూ అడిగింది

"అమ్మా! రుక్మిణి ఎప్పుడూ నీ గురించే విచారిస్తూ ఉంటుంది. నిన్ను తొందరపడి చంపించినందుకు రాజుగారు పశ్చాత్తాపపడుతున్నట్లు ప్రజలు చెప్పుకుంటున్నారు. నిన్ను పంపిన తరవాత వారు నీ అంతః పురం వదలలేదు. ఇంతవరకూ రాజుగారి భార్యలు ఎవరూ అతని వద్దకు పోలేదు భయపడుతున్నారు. కాళిదాసకవిని తీసుకువచ్చేనెపంతో దేశాలు తిరిగివచ్చారు రాజుగారు."

"రాజు పశ్చాత్తాపం చెందాడని చెప్పావు. అది ఎంత వరకూ నిజమో అతని వద్దకు ఏకాంతంగా వెళ్ళి తెలుసుకు రావాలి. ఇందుకు నీకంటె ఆప్తులు మరొకరు నాకు లేరు. తరవాత కర్తవ్యం ఆలోచిద్దాం." అని లీలావతి ఆమెను కౌగలించుకుంది.

రేవతి రుక్మిణి అంతఃపురానికి వెళ్ళి ఆవార్త చెప్పింది. రుక్మిణి ఆనందానికి అవధులు లేవు రేవతి సమయంచూసి భోజుడు అంతః

పురానికి వెళ్ళి రహస్యంగా అక్కడి విశేషాలు తెలుసుకుని లీలావతి వద్దకు వచ్చి - "అమ్మా! నీక్షేమ వార్త విన్న రుక్మిణి నిన్ను చూడడానికి రావాలని తొందర పడింది. రాజుగారి శయ్యా గృహానికి వెళ్ళాను. అతను అక్కడ కాక నీ పడకగదిలో శయ్యమీద పడుకుని నీ చిత్రఫలకం చూస్తూ - "హా. ప్రేయసీ! హా! లీలావతీ! నిరపరాధివైన నిన్ను పరాభవించిన నేను పాపాత్ముడిని. నేను ఏ నరకానికి పోతానో. నిన్ను పెళ్ళి చేసుకుందుకు అడవులలో కష్టాలు పడ్డాను. తరవాత ఏం సుఖించానో. మళ్ళీ నిన్ను అడవుల పాలు చేశాను. ఈ శయ్యమీద నీతో ఎప్పుడు సుఖపడతానో? ఒరే ... భైరవా! నా ప్రియురాల్ని ఏం చేశావు రా? నీ పని పడతాను. చూడు. ఈ సందడిలో నీ మాట మరిచాను. నీ ఆటకి ఇంకా వ్యవధి ఉంది కాబోలు. అంతవరకూ ఆగను - అంటూ కత్తిదూసి...మళ్ళీ అంతలోనే వరలో పెట్టి - వాడు తాంత్రికుడు. తొందరపడకూడదు. ఆలోచించకుండా చేస్తే ప్రమాదం - అంటూ మళ్ళీ శయ్యమీద పడుకున్నారు.

అమ్మా! ఈ భైరవుడు ఎవడు? ఆ సంగతి నాకేమీ అర్థం కాలేదు." అంది.

"ఏమీ! ఆ భైరవుడి దుర్మార్గం వారికి తెలిసిందా? ఔను. బ్రాహ్మణకుమారుడు చెప్పి ఉంటాడు. రేవతీ! నీ మాటలను బట్టి చూస్తే నానోములు ఫలించేటట్లే ఉన్నాయి." అంది లీలావతి. తరవాత రేవతి రుక్మిణి వద్దకు వెళ్ళి ఆ విషయం అంతా ఆమెకు తెలియపరచింది. ఆమెను చూడకుండా నిలవలేను - అని రుక్మిణి తొందర చేసేసరికి, రేవతి రుక్మిణి ఉద్యాన వనానికి వెళ్ళే సమయానికి మరోశకటం తెచ్చి ఆమెను అందులో కూర్చోబెట్టి ఎవరికీ తెలియకుండా లీలావతి భవనానికి తీసుకు వెళ్ళింది.

రుక్మిణి రాక విని లీలావతి, యక్షకాంతలు, మల్లిక ఎంతో సంతోషిస్తూ ఆమెను చూశారు. ఆమె లీలావతి పాదాలమీద పడి దుఃఖించగా లీలావతి - "రుక్మిణీ! నాకోసం పరితపించేదానివి నువ్వొక్కతివే. దైవం ప్రతికూలిస్తే మనం ఏం చేయగలం? ఎప్పటి కేనా

మంచి రోజులు రాకపోతాయా? వీరు యక్షకాంతలు నాతో కూడా కష్టాలు పడుతున్నారు. ఈ రత్నపదిక భర్తే నన్ను భైరవుడి నుంచి విడిపించి రక్షించాడు. మా నిమిత్తం అతను చిక్కులో పడ్డాడు. వీరి వల్లనే నేను ఈ వూరు చేరగలిగాను." అని కొంచెం వివరించింది. యక్షకాంతల సౌందర్యం మల్లిక చక్కదనాలకు రుక్మిణి ఆశ్చర్యపడుతూ వారితోస్నేహం కలుపుకుంది. లీలావతి, రేవతిని పక్కకి పిలిచి – 'మోహం మారిందేం? పెళ్ళి కాని అయిందా? గర్భచిహ్నాలు కనిపిస్తున్నాయి." అంది.

అందుకు రేవతి – "తల్లీ! నీతో ఏమని చెప్పేది? నాటకంలో ఇదొక అంతర్నాటకం. నీకూతురు ఒక దివ్య పురుషుణ్ని గాంధర్వ వివాహం చేసుకుంది. అతను మరికనపడలేదు." అంటూ ఆ వృత్తాంతం చెప్పింది.

"అయ్యో! అతనెవరో, కులశీలనామాదులు ఏమిటో తెలుసుకోలేదా? విన్నవారు నవ్వరా? కాని రుక్మిణిలో తప్పులేదు. దైవికంగా సంపర్కం కలిగినవాడిని పరిగ్రహించడం దూష్యంకాదు. అతను కొడుకుని చూసుకుందుకేనా రాడా?" అంది లీలావతి.

"అమ్మా! అతని చిత్రఫలకం రాసుకున్నాం ఇదిగో చూడు." అని ఆమె కందించగా లీలావతి చాలా మెచ్చుకుంది అంతలో పొద్దుపోతూంటే వాళ్ళందరి దగ్గరా శలవు తీసుకుని రుక్మిణి బండి ఎక్కి వెళ్ళిపోయింది. లీలావతి చేతిలోని చిత్రపలకాన్ని మల్లిక అందుకుని చూసి యక్షకాంతలవద్ద వదిలింది అప్పుడు సువర్ణనాభుడు వానిని చూసి – "మా దత్తుడు. మా దత్తుడు" అని అరిచాడు. చారాయణుడు కూడా చూసి – "ఇది దత్తుడి రూపమే ఎవరు దీనిని తెచ్చారు?" అని అడగగా మల్లిక "రాజపుత్రిక సఖురాలు రేవతి లీలావతి కిచ్చింది." అని చెప్పింది.

ఆ మాటవిని సువర్ణనాభుడు – "దత్తుడంటే మనకి మీ అక్కబావల నివాసం చెప్పినవాడు నా ప్రాణమిత్రుడు. వాడు ఇక్కడెక్కడో స్త్రీ రూపంలో శాపం అనుభవిస్తున్నాడు. వాడిని తెలుసుకోవాలి." అన్నాడు.

ఆ మాటకు రత్నపదిక - విచారిస్తూ... "అయ్యో! పాపం... అతనా! అతనిశాపం గురించి నా భర్త ఎంతో విచారించాడు. చెల్లీ! సువర్ణపదికా! వారివిముక్తి గురించి నీభర్త ఏమంటున్నాడు? ఇంకా ఎన్నాళ్ళుండాలి?" అంది. సువర్ణపదిక - " నాలుగురోజుల్లో అన్నీ చక్కబతాయన్నారు." అని ఓదార్చింది.

వారందరి మాటలూ విన్న లీలావతి - దత్తుడి వృత్తాంతం ముందే కొంత విని ఉండడంచేత రుక్మిణి వరించిన వాడు అతనే అని నిశ్చయించుకుంది. కాని ఎవరికీ చెప్పలేదు.

మర్నాడు సువర్ణనాభుడూ చారాయణుడూ పురంలోని ప్రధాన దేవాలయాలకు వెళ్ళి అక్కడి గోడలమీద రాసిన రాతల బట్టి గోనర్దీయుడు, కుచుమారుడు అక్కడికి వచ్చినట్లు తెలుసుకుని, రాజచిహ్నాలతో ఉన్నది వారే అని నిశ్చయించుకుని తిన్నగా వారి విడిదికి వెళ్ళారు. అక్కడ కత్తులు పట్టుకుని పొరాయిస్తున్న భటులతో తమరాకను ప్రభువులకు తెలియ జెయ్యమన్నారు. ఆ బ్రాహ్మణ విద్వాంసులని ప్రవేశపెట్టమని అనుమతిరాగా కింకరులు వారిని ప్రభువుల ఎదుటకు తీసుకు వెళ్ళారు.

మిత్రులని కలుసుకున్న ఆనందం పట్టలేక కొంతసేపు గడిపాక - కుచుమారుడు "సువర్ణనాభా! నువ్వు ఉత్తరదేశ అరణ్యాల అంతు చూశావా? విశేషాలేమయినా కనిపించాయా! చారాయణుడిని ఎక్కడ కలుసుకున్నావు? చెప్పు." అన్నాడు. అతను తమ వృత్తాంతం సంక్షిప్తంగా చెప్పాడు. అప్పుడు సువర్ణనాభుడు - "మిత్రులారా! మన స్నేహితులలో దత్తుడు, ఘోటకముఖుడు తప్ప తక్కిన వాళ్ళం అందరమూ ఇక్కడ చేరుకున్నాం. గోణికాపుత్రుడు రాజకుమారుడి మిత్రుడని నిన్న సభలో మీరు గమనించే ఉంటారు. దత్తుడు మనందరి కంటే ముందే ఇక్కడికి వచ్చాడు. మునుపు నేనతనితో మాట్లాడాను. యక్షుడిశాపం వల్ల స్త్రీ అయి అతను తిరుగుతూ ఉంటాడు. వాళ్ళిద్దరి జాడా మనం తెలుసు కోవాలి. మనకి పరమ ఉపకారి అయిన యక్షుడు భైరవుడి చేత శిక్షించబడ్డాడని తలుస్తున్నాను. మనుషులని మృగాలుగానూ, పక్షులుగాను చేసే తంత్రం ఎరిగివాడు తపోనిధి అయిన సిద్ధుణ్ని చంపేశాడు మన

చారాయణుడిని గార్దభంగా మార్చిన క్రూరుడు. చారాయణుడి అత్తమామలు కూడా కనిపించడం లేదు. వీళ్ళందరూ వాడికి చిక్కారనుకుంటున్నాను. మనందరూ ఈ దుర్మార్గుడి గురించి భోజరాజుకి చెప్పి శిక్షింపజెయ్యాలి." అన్నాడు.

అప్పుడు కుచుమారుడు – "అయ్యో! ఆ సిద్ధుణ్ణి పరిమార్చిన వాడు వీడా! ఆ మహానుభావుడి చరిత్ర నేను చదివాను. ఈ అస్థిమాల అతని ఎముకలతో కట్టబడిందే. ధీనివల్లనే వశిత్వవిద్య గ్రహించాను. ఆ భైరవుణ్ణి బంధించడం చిటికెలో పని. అందుకుఎవరి వద్దకూ వెళ్ళక్కర లేదు. అదలా ఉంచండి.

పురందరపురంలో ఘోటకముఖుడు మమ్మల్ని కలుసు కున్నాడు. ఒక స్నేహితుడి పనిమీద తిరుగుతున్నానని చెప్పాడు. ఆ స్నేహితుడు భోజుడని మాకు ఇప్పటికి తెలిసింది. ఇది ఘోటక ముఖుడికీ తెలియదు. అతని వృత్తాంతం భోజుడికి తెలిసి ఉంటుంది. అతనినడిగితే అంతా చెప్పగలడు." అన్నాడు.

గోనర్దీయుడు మల్లికమొదలైన స్త్రీలందరినీ అక్కడికి తీసుకురావడానికి బళ్ళు మొదలైన వాటితో భటులని పంపాడు వాళ్ళందరినీ తమ నివాసానికి రప్పించుకున్నాడు.

అని చెప్పి మణిసిద్ధుడు కథ ఆపాడు. ప్రయాణానికి వేళవుతూందని గ్రహించిన గోపాలుడు లేచాడు.

# కాశీ మజిలీ కథలు

## 162 వ మజిలీ

లీలావతి మందిరంలోనే ఉంటూ ఆమెను తలుచుకుని దుఃఖిస్తున్న భోజుడికి తనవిచారం చెప్పుకోదగిన అంతరంగికు లెవరూ లేరు. కాళిదాసుని అవమానించాడు కనుక మునపటలా అతనితో చనువుగా ఉండడానికి సిగ్గుపడుతున్నాడు. శయ్యమీద వాలబోతూంటే అతనికంట ఒక పత్రిక పడింది.

"రాజా! నువ్వు దేశం వదిలి వెళ్ళాక - నీ కుమారుడు ఒక వారకాంతతో అంతఃపురంలోనే ఉండిపోయి రాచకార్యాలు చూడలేదు నీ కూతురు రుక్మిణికి నెల తప్పిందని చెప్పుకుంటున్నారు. పరీక్షిస్తే నీకే తెలియగలదు. ఆప్తులం కనుక చెబుతున్నాం. మాకూ విచారంగానే ఉంది." అని ఉంది అందులో.

అది చదివి భోజుడు చికాకు పడ్డాడు. 'ఇంటికివస్తే అన్నీ దుఃఖాలే. అందుకే సంసారం దుఃఖం - అన్నారు పెద్దలు. నా సంస్థానంలో దుర్మార్గులు చాలామంది ఉన్నట్లున్నారు. మునుపు లీలావతి గురించీ ఇలాగే అసత్యం రాశారు.' అనుకుంటూంటే ప్రతీహారివచ్చి ముఖ్యమంత్రిని ప్రవేశపెట్టేదా అని అడిగాడు.

అతనువచ్చి - నమస్కరించి - "దేవరవారు ప్రయాణపు బడలిక వల్ల కాబోలు అస్వస్థులుగా కనిపిస్తున్నారు." అన్నాడు. అందుకు భోజుడు - "ప్రయాణం కాదు. జన్మే బడలిక సరే. నేను లేనప్పుడు చిత్రసేనుడు రాచకార్యలు చేపట్టాడా? పండితులని అదరించాడా? ఎలా ప్రవర్తించాడో నిజం చెప్పండి" అన్నాడు.

"మీరు వెళ్ళింది మొదలు వారికి శరీరంలో అస్వస్థత కొ ఎప్పుడూ అంతఃపురంలోనే ఉండేవారు. రాచకార్యాలు పరిష్కరించడానికి

వారికంతగా అవకాశంలేక మేమే పరిష్కరించాం దేవరలా పండితులని మరెవరు సత్కరించగలరు? అది అలా ఉంచండి

ఒకనాడు ఒకపురుషుడు గుఱ్ఱంమీద వస్తూ తెలిసో తెలియకో రాజపుత్రిక ఉద్యానవనంలోకి పోయాడు. ఆమె – గుఱ్ఱంమీద వచ్చింది స్త్రీకాని పురుషుడు కాదని ద్వారపాలకులను గద్దించి అంతఃపురంలోకి తీసుకుపోయిందని వారు చెప్పగా రాజకుమారులను మేము ప్రార్థించాం. వారు వెళ్ళి చూసి స్త్రీయే అని నిర్ధారించారు. ప్రతీహారులు కొందరు పురుషుడే అని వాదిస్తున్నారు. ఇదే మీరు వెళ్ళాక జరిగిన విశేషం." అన్నాడు మంత్రి.

అది విన్న భోజుడికి ఆపత్రిక నిజమే ఏమో అనిపించింది. "సరే. మీరిప్పుడు వచ్చిన పనేమిటి?" "ఇవాళ విద్వత్సభ జరుగుతుంది. ఎందరో పండితులు వచ్చారు కొందరు కాళిదాసుతో ప్రసంగించాలని కోరుతున్నారు. కాళిదాసుకి కవిత్వమే తప్ప శాస్త్రాలు తెలియవంటున్నారు. మీరు సభకు వచ్చి వాదిప్రతివాదులను నిరూపించి మధ్యస్థులని ఏర్పరచాలి." అన్నాడతను.

"అయ్యో! ఇవాళే ప్రసంగం పెట్టారా! నామనసు బాగులేదే. భైరవుడి విషయం ఏమైంది?" అడిగాడు రాజు. మంత్రి మరీమరీ చెప్పగా సభకు రావడానికి అంగీకరించాడు.

సభకు కుచుమారుడు మొదలయినవారు, దండి, భవభూతి మొదలైనవారు, ఇంకాఎందరో వచ్చారు. భోజుడి పక్క పీఠంమీద కాళిదాసు కూర్చున్నాడు. భోజుడు – "మహావిద్వాసు లందరూ నా భాగ్యంకొద్దీ వచ్చారు. మీప్రసంగాలు విని ఆనందిస్తాము. మీ విద్యావైభవాలు ఉట్టిపడేలా ప్రసంగించడి. మత్సరగ్రస్తులు కాక ఎవరు ఎవరితో ప్రసంగిస్తారో చెబితే మధ్యస్తంని నియమిస్తాం." అని నమస్కరించాడు. అప్పుడు కుచుమారుడు లేచి – "మహారాజా! మేము కాశీపురంలో చదువుకున్నాం ఏడుగురిలోనూ ఆరుగురం ఇక్కడున్నాం. అన్నివిద్యలలోనూ పాండిత్యముంది. మీసంస్థాన పండితుల ప్రఖ్యాతి

విని వారితో వాదించాలని వచ్చాం" అన్నాడు. శంకరకవి లేచి – "అయ్యా! వీరి మాటలు గర్వంగా ఉన్నాయి. కాళిదాస కవి ప్రతిభ విని ఉంటే వారు ఇంత దూరం రాకపోయి ఉందురు. ఈ సంస్థాన పండితులలో అతనే ముఖ్యుడు. అతనే మీకు ప్రతివాదిగా ఉంటాడు. మధ్యస్తుణ్ని కోరుకోండి." అన్నాడు.

గోనర్దీయుడు లేచి – "కాళిదాసకవి గురించి మేము ఇదివరకే విన్నాం. వారిని గెలవడం దేముడికేనా తరం కాదు. మేము ఆయనకు మా విద్యా పాటవం చూపాలని వచ్చాము తప్ప వారిమీద గెలుచుకుందుకు కాదు. అందుకే అనుజ్ఞ ఇమ్మని ప్రార్థిస్తున్నాం." అన్నాడు. భోజుడు లేచి – "కుచుమార, గోనర్దీయుడు మొదలయిన పండితుల చరిత్రం లోకాతీతం. కాళిదాస మహాకవి ముల్లోకాలకీ ప్రభావ సంపన్నుడు. వీరు ప్రసంగిస్తే మధ్యస్తుడు సరస్వతో, ఆమె పతో ఉండాలి. అలాటి సమర్థులు దొరికే వరకూ వీరివాదం నిలుపుదాం. తక్కిన పండితులు ప్రసంగించ వచ్చు." అన్నాడు. మిగిలిన వారి ప్రసంగాలు ముగిశాక సభ ముగిసింది. భోజుడు గోనర్దీయ కుచుమారులని ప్రత్యేకంగా ప్రశంసిస్తూ – "మిమ్మల్ని చూడగానే తెలుసుకున్నాం. మీరప్పుడు మిమ్మల్ని మరుగుపరుచుకున్నారు. మీతో మీ మిత్రుడు ఘోటకముఖుడు ఇక్కడికి రాలేదేం? ఎక్కడికేనా పంపారా? అతనూ దత్తుడు తప్ప తక్కినవాళ్ళం ఐదుగురమూ కలుసుకున్నాం. అతని వృత్తాంతం చెప్పండి." అని ప్రార్థించాడు.

"ఒక పాపాత్ముడి మూలంగా నేను స్మృతి పోగొట్టుకుని అతను ఎక్కడికి పోయాడో తెలుసుకోలేకపోయాను. ఆపుణ్యాత్ముడు ఎక్కడ చిక్కుపడ్డాడో! ఈ పాటికి ఇక్కడికి రావలసిందే." అన్నాడు భోజుడు విచారంగా. అప్పుడు సువర్ణ నాభుడు భోజుడికి భైరవుడి దుర్మార్గం గురించి చెప్పి – "వాడు గురుద్రోహి. మనుషులని మృగాలుగానూ, పక్షులుగానూ చేసి వంచిస్తాడు. వాడిదగ్గరున్న జంతువులూ, పక్షులూ అలాటివే, మా కుచుమారుడు అతన్ని పరాభవించగలడు. మీరు వాడి మృగ వినోదం చూడడానికి ప్రత్యేకంగా రప్పించారు. కనుక వాడి పరాభవం మీకు

అసమ్మతమేమో అని ఆలోచిస్తున్నాం. మావాళ్ళెందరినో వాడు మృగాలనీ, పక్షులనీ చేసి తిప్పుతున్నాడు. వాడిని శిక్షించి వాడి దగ్గరున్న మృగాలనీ పక్షులనీ వశపరుచుకోవాలి." అన్నాడు. "వాడి చరిత్ర మీకూ తెలుసా! అందరికంటే నన్ను ఎక్కువ పరాభవించేదని, వాడిని శిక్షించడానికే రప్పించాను. వాడి ఆటనాడు మనం ప్రతీకారం చేద్దాం. ఇప్పుడేమీ వెల్లడించకండి." అని భోజుడు వాళ్ళని విడిదికి పంపి తను అంతః పురానికి పోయాడు. అతన్ని మళ్ళీ లీలావతీ వియోగం బాధించసాగింది. రుక్మిణి, చిత్రసేనుల కళంకాలు తలుచుకుని చికాకు పడసాగాడు.

గోనర్దీయుడు మొదలయిన మిత్రులు గోణికాపుత్రుడితో తమ విడిదులకు పోయారు. గోణికాపుత్రుడు వారి చరిత్రలు విని ఆశ్చర్యపోయి దత్తుడి గురించి తనకి తెలిసిన దంతా చెప్పి – "అతను యక్షుడి శాపం వల్ల స్త్రీరూపంలో ఇక్కడే ఎక్కడో ఉన్నాడు. అతన్ని వెదికి పట్టుకుంటే యక్షుడు శాపం ఉపసంహరించుకుంటాడు." అన్నాడు.

"యక్షుడు భైరవుడి చేత పరాభవించబ డన్నావు కదా. అదే నిజమయితే ఇప్పుడే పోయి భైరవుణ్ని పరాభవిద్దాం రండి. రేపటివరకూ ఎందుకు? నిముషంలో వాడిని బంధిస్తాను." అన్నాడు కుచుమారుడు. గోనర్దీయుడు – "తొందరపడకు. వాడి ఆట చూసి సమయోచితంగా చేద్దాం. ఘోటకముఖుడి విషయం రాజు తనకేమీ తెలియదంటున్నాడే! వాడు కూడా వీడికి చిక్కలేదుకద?" అన్నాడు.

"రేపు అన్నీ తెలుస్తాయి కదా." అన్నాడు గోణికాపుత్రుడు.

వాళ్ళు మాట్లాడుకుంటుంటే చిత్రసేనుడు అక్కడికి వచ్చాడని కబురు వచ్చింది. గోణికాపుత్రుడు అతనికి ఎదురువెళ్ళి తీసుకొచ్చి కూర్చోబెట్టి తమ మిత్రుల కథలన్నీ చెప్పాడు. అప్పుడు – "నేను దత్తుడినీ, గోణికాపుత్రుడినీ ఎరుగుదును. మీ చరిత్రలు విన్నాను. దత్తుడు కొన్నాళ్ళు నా దగ్గరుండి మరి కనపడలేదు. ఎక్కడికి పోయాడో?" అన్నాడు.

గోణికాపుత్రుడు – "మిత్రమా! విపులుడి వద్ద నుంచి జబాబు వొచ్చిందా? వేశ్యాపుత్రికల వార్త లేమయినా తెలిశాయా? అతను చేసిన

దుర్మార్గానికి ప్రతిక్రియ చెయ్యాలి. నామిత్రులు గోనర్దీయ కుచుమారులు చెరొక దేశానికి అధిపతులు. బలాలతో వెళ్ళి వాడిని బంధించి తేగలరు." అన్నాడు.

"ఔను ఈ సందడిలో నీకు చెప్పలేదుకాబోలు. జవాబు వచ్చింది. ఆ వెశ్యాపుత్రికలను తానెరుగననీ, వారిని తమ దేశంలో చూబిస్తే మనం వేసే శిక్షకు పాత్రుడౌతాడనీ, వచ్చి వెదకమనీ రాశాడు. వెంటనే కొందరు దూతలని పంపాను." అన్నాడు. ప్రసంగవశంలో – "మీ తల్లి లీలావతి ఇక్కడుంది.." అని అతను అనేసరికి – "మాతల్లి..లీలావతి! బతికుందా? ఇక్కడికి ఎలా వచ్చింది? చూబించు –" అని కోరాడు చిత్రసేనుడు.

"ఆడవాళ్ళతో ఉన్నారు. ఇప్పుడు సమయం కాదు."

"రేపు తప్పక చూబించాలి." అని బతిమాలుకుని రాజపుత్రుడు ఇంటికి పోయాడు.

# కాశీ మజిలీ కథలు

## 163 వ మజిలీ

### ఘోటకముఖుడి కథ

మర్నాడు పొద్దుట మిత్రులైదుగురూ ఇంటి చావడిలో కూర్చుని దత్తక ఘోటకముఖుల గురించి ముచ్చటించుకుంటూంటే ప్రతీహారి వచ్చి – "అయ్యా! ఘోటకముఖుడనే బ్రాహ్మణుడు బండిమీద ఇద్దరు స్త్రీలతో వచ్చి మీ దర్శనం కోరుతూ ద్వారం వద్ద ఉన్నాడు." అనగానే, "మా ప్రాణమిత్రు డేడీ?" అంటూ ఐదుగురూ తటాలున లేచి గుమ్మందగ్గరకి పరుగెత్తారు.

అతను వారినిచూసి ముఖం వికసించగా – "ఓహో! నేటికి కృతార్థుడి నయ్యాను." అంటూ కౌగలించుకున్నాడు. వారు అతన్ని లోపలికి తీసుకెళ్ళి – "బండిమీద ఉన్న స్త్రీలెవరు?" అని అడిగాడు గోణికాపుత్రుడు.

"అయ్యో! వాళ్ళమాట మరచిపోయాను. వాళ్ళు రతిమంజరి, చిత్రసేన అనే వేశ్యాపుత్రికలు. అయ్యో! నీకు కొత్తగా చెబుతున్నావే! వారిలో ఒకరు దత్తుడిభార్య రెండవది నీ భార్య. వాళ్ళు మనమూలంగా చాలా కష్టాలు పడ్డారు."

"ఆ! రతిమంజరీ, చిత్రసేనలే?" అంటూ బండిలోని వాళ్ళిద్దరి దగ్గరకీ పోయి – "వచ్చారా! మీకోసం భూమిని తలకిందులు చేయదలచుకున్నాము. లోపలికి రండి మనవాళ్ళందరూ ఇక్కడే ఉన్నారు" అంటూ లోపలికి తీసుకెళ్ళి స్త్రీలందరికీ వారిని పరిచయం చేశాడు

ఆ అంతఃపురకాంతలు వాళ్ళ సౌందర్యాన్ని వింతగా చూస్తూ వాళ్ళ వృత్తాంతం తెలుసుకుని వాళ్ళమనస్థైర్యానికి ఆశ్చర్యపోయారు.

కుచుమారుడు – "ఘోటకముఖా! ఆ వేళ స్నేహితుడితో పురందర పురంనుంచి వెళ్ళావుకదా? ఎక్కడెక్కడ తిరిగావు? ఏం విశేషాలు చూశావ్? నీతో వచ్చిన స్నేహితుడు ఎవరో తెలుసా?" అని అడిగి ఆ వృత్తాంతం చెప్పమన్నాడు. అప్పుడు ఘోటకముఖుడు – "మిత్రులారా! నాతోవచ్చిన వాడెవరో నాకు ఇప్పటికీ తెలియదు. ఏకశిలానగరానికి వెళ్తూంటే అరణ్యంలో భైరవుడనే తాంత్రికుడు ఎదురయ్యాడు. నా మిత్రుడి భార్యని అపహరించిన మాయవి వాడే అని తెలుసుకుని వాడిని ఆపాం. వాడు తన పరివారాన్ని పిలిచాడు. అతన్ని పట్టుకుని నెత్తిమీద ఏదో పసరు రుద్దాడు. మరి అతను కనపడలేదు. వాడు నా మీదకు వొస్తాడని – డొంకలోకి పోయి దాగున్నాను. అక్కడ – వాడి మృగాల గుంపులోంచి తప్పించుకున్న గుర్రం మేస్తూంటే, వేరొక ఉపాయం తోచక కళ్ళేమూ జీనూ లేకపోయినా తటాలున దానిమీదకు ఎగిరాను. అది కనపడిన మార్గం వెంట వేగంగా పరుగెత్తింది. వాడు తరుము తాడేమో అని భయంతో చాలా వేగంగా పరుగెత్తించాను.

అది అడవిలో పోయి పోయి ఒక గుడిసె దగ్గర నిలబడింది. నాకు దాహమౌతుంది. ఆ గుడిసెలో ఎవరేనా ఉంటారనుకుని "లోపలెవరు?" అని అరిచాను. జవాబు రాలేదు. తొయ్యడంతోటే తలుపు తెరచుకుంది. లోపల ఎవరూ లేరు. స్వల్పంగా సామానుంది. పెరటిలో నుయ్యి, దానిదగ్గర చేదుకుందుకు చేద ఉన్నాయి. నీళ్ళు తాగి వచ్చి చూడగా ఒక గదికి తాళం వేయబడి ఉంది. వాళ్ళెక్కడికి వెళ్ళారో అనుకుంటూ బయటకు రాగా గుర్రం అక్కడే ఉంది. నన్ను చూసి సకిలించింది.

నేను దాని దగ్గరకు పోయి జూలు దువ్వుతూ ముఖ లక్షణాలు చూస్తూంటే మెడలో తాయెత్తు కనపడింది. దానిని తెంపి పారేసేసరికి ఆ గుర్రం స్థానంలో ఒక ముసలమ్మ నిలబడింది. నేను ఆశ్చర్యపోతూ – "అవ్వా! నువ్వెవరివి? గుర్రానివయ్యావేం?" అనిఅడిగాను. అప్పుడా అవ్వ – 'బాబూ! ఈ కుటీరంనాదే. మేము సారస్వత బ్రహ్మణులం. ఈ ప్రాంతంలో నీరుంది. మొక్కలు ఔతాయి. నేను నాభర్తతో ఈ కుటీరంలో

చాలాకాలం కాపరం చేశాను. పశువులు మేపుకుంటూ వ్యవసాయం చేసి బతికేవాళ్ళం. నా భర్త చనిపోయేసరికి నాకు మూడేళ్ళ కూతురుండేది. నాపేరు రాధ. నా కూతురి పేరు మిత్రవింద దానికి పన్నెండేళ్ళు వచ్చేసరికి చక్కని లావణ్యవతి అయింది. మిత్రవిందకి యౌవనం రావడం మొదలు తగిన భర్త ఎవడు దొరుకుతాడా అని ఆలోచించసాగాను వరాహద్వీపం అధిపతి ఒకనాడు ఈ అడవికి వచ్చాడు. గాలివానపట్టి అతని బలాలు చెదిరిపోయాయి. చీకటిపడి మెరుపులు మెరుస్తూ వర్షం కురుస్తూంటే అతనెలాగో ఈ కుటీరానికి చేకుకుని - "లోపల ఎవరు?" అని పిలిచాడు. నేను తలుపు తీయగా ఈ రాత్రికి కొంచెం తావిస్తావా? అని అడిగాడు, తడిసిన బట్టలలో వజవజ వణుకుతూ అతనిని లోపలికి రమ్మని కట్టుకుందుకు పొడి గుడ్డలిచ్చి నిప్పురాజేసి వంటచేసి పెట్టాను. పడుకుందుకు మంచమిచ్చాను. అతను చాలా సంతోసించి - "అవ్వా! నాకు మంచి ఉపకారం చేశావు. జీవితంలో నిన్ను మరచిపోలేను. నువ్వు ఒంటరిగా ఇక్కడ ఉండడం ఎందుకు? నీకు పిల్ల లెందరు?" అంటూ నావృత్తాంతం అడిగాడు. "ఇది నాజన్మభూమి. అందుచేత స్వర్గంలా ఉంది. మాకు పశువులూ, పచ్చికా, వ్యవసాయమూ ఉంది. నాకూతురు మిత్రవింద పెళ్ళి మాత్రమే నా సమస్య. అందుకు మీరు సాయం చేయండి." అన్నాను నేను.

అతను దానిని చూపమన్నాడు. దీపం వెలుగులో దాని అందం చూసి ఆశ్చర్యపడ్డాడని గమనించాను. "నువ్వు పోయి పడుకో. రేపు చూస్తాలే." అని దానిని పంపి, "నీకూతురు మిత్రవింద అతిచక్కనిది. ఏ కృష్ణుడో వచ్చి చేసుకుంటాడు. నీకు చింత అక్కర్లేదు." అన్నాడు.

మర్నాడు అతనిని వెదుక్కుంటూ బలగాలు వచ్చాక తెలిసింది అతను రాజు అని. చక్రధర భూపాలుడని. అతను లేచాక మిత్రవింద చేతనే అతనికి ఉపచారాలు చేయించాను. నాకూతురు చక్కదనానికి వలచిన అతను మూడు రోజులయినా కదలలేదు. దానితో సరససల్లాపా లాడుతూ చిరవకామెను తనకిచ్చి వివాహం చేయమని సూచించాడు. నేను సంతోషంగా దానినతని తొడమీద కూర్చో బెట్టాను. అతను దానిని

గాంధర్వ వివాహం చేసుకున్నాడు. దానిని తన గ్రామానికి తీసుకుపోగా నేను కొన్నాళ్ళు అక్కడుండి వచ్చాను.

మిత్రవింద భర్తతో స్వర్గసుఖా లనుభవిస్తూ జాంబవతి అనే కూతురిని కన్నది. అది నన్ను అక్కడికి రమ్మని ఎంతో నిర్బంధిస్తుంది. కాని నాకీ చోటువదిలిపోడం ఇష్టంలేదు. అప్పుడప్పుడు పోయి వస్తుంటాను.

ఆ మధ్య గడ్డమూ తలాపెంచుకుని - జటలతో .. మహర్షిలా కనిపిస్తూ ... మృగాలనీ పక్షులనీ వెంట బెట్టుకున్నవాడు ఈ అడవిలో బసచెయ్యగా నేనతని వద్దకు పోయి నమస్కరించి - "ఈ అరణ్యం నాది. నేను గుత్తకి తీసుకున్నాను. నాకు చాలా పశువులున్నాయి. మా పచ్చికంతటినీ మీ పశువులు మేసేస్తున్నాయి. అందుచేత మీరిక్కడ ఒకటి రెండు రోజులకంటె ఉండవద్దు." అని వినయంగా ప్రార్థించాను. అతను కళ్ళెర్రజేస్తూ - "ఈ అడవి ఒకరు పెంచింది కాదు. దీనిమీద అందరికీ సమాన అధికారమే నా శక్తి నీకు తెలియదు. నాయిష్టం వచ్చి నన్నాళ్ళుంటాను. వొద్దనడానికి నువ్వెవరివి?" అని గద్దించాడు. "ఈ అరణ్యం మీద మీకు అధికారముంటే మీ పశువులు, మృగాలు, పక్షులమీద నాకు అధికారం ఉందంటే మీకు కోపం వొస్తుందేమో. దేముడి సృష్టి అందరికీ సమానమేకదా." అన్నాను. దానితో అతనికి కోపం వచ్చి ఏదో పసరు నానెత్తిమీద రుద్ది నన్నొక గుఱ్ఱంగా చేశాడు. తరవాత జరిగినవన్నీ కలలా ఉన్నాయి. తప్పించుకు పోదామను కుంటూంటే మీరు వచ్చి నన్నిక్కడికి తీసుకొచ్చారు. మీ దయవల్ల నా రూపం వొచ్చింది." అందా అవ్వ.

నేను ఆశ్చర్యపోతూ - "అవ్వా! వాడు మహాపాపాత్ముడు. ఒక పతివ్రతను చెరపట్టాడని వాడికోసం తిరుగుతున్నాను. నా మిత్రుణ్నీ అలాగే చూశాడు. నన్ను అవమానిస్తాడని మాటుకి పోయాను. నీవలన అతనికి చిక్కకుండా రాగలిగాను. వాడి గురించి బాగా తెలిసింది. కనుక శిక్షింపజేస్తాను. అవ్వా! నీ అల్లుడు రాజు కదా. నువ్వు వరాహపురంలో సుఖంగా ఉండొచ్చుకదా?" అంటే ."పశువులమీద వ్యామోహం నన్ను

కదలనివ్వదు –" అంటూ పెరడు చూబించింది. అక్కడ అనేక పశువులున్నాయి. ఆమె గుడిసెలో ఒక మూల చాటుగా అమర్చబడిన చిన్న తలుపు తీసి నేలసొరంగం చూబించింది. అక్కడ ఎన్నో వింత వస్తువులు ఉన్నాయి. విశాలంగా ఇంద్రభవనంలా ఉంది.

"ఇది మహారణ్యం కావడం ... ఒంటరిగా ఉండడంవల్ల పేదదానిలా కనిస్తాను. ఈ గుడిసె చూచి నా జోలికి ఎవరూ రారు. నా పశువులు బలవంతంగా ఎవరేనా తోలుకు పోయినా అక్కడ ఉండక వెంటనేవచ్చి మందలో కలుస్తాయి. నా ఇంట్లో ఉండే వస్తువులు కుబేరుడిదగ్గర కూడా ఉండవు. నా అల్లుడు ఇవి చూసే నాపిల్లని చేసుకుని చాలా వస్తువులు తన వూరు తీసుకు పోయాడు."

"అవ్వా! ఈ గుట్టూ, వైభవమూ ఇతరులకు చెప్పకుసుమీ. బాధిస్తారు." అన్నాను నేను నవ్వుతూ.

"నీ మంచితనం గ్రహించికాని అందరికీ ఎందుకు చూపుతాను! ఆవేళ చక్రధరుడికి చూపాను, మళ్ళీ నీకు చూపుతున్నాను నాకూతురికే బాగా తెలియదు. విద్యాంసుడివీ, నన్ను రక్షించిన వాడివీ అని నీకొక ఉపకారం చేయదలుచుకున్నాను. అందుకే రహస్యం చెప్పాను."అంటూ తలుపు మూసి – తృప్తిగా భోజనం పెట్టింది. " నేను రెండు మూడు దినాలలో ధారానగరం పోవాలి. ఆ తాంత్రికుణ్ని శిక్షింపజెయ్యాలి. మిత్రులని కలుసుకుని ఉపాయం ఆలోచిస్తాను. నాకు ఉపకారం చేస్తానన్నావు. నాకు ధనంతో నిమిత్తం లేదు. నామిత్రులు ఇద్దరు మహారాజులు." అని నేనంటూంటే ఆ అవ్వ – "మీరు మహా విద్యాంసులు. మీ విద్యే మీ ధనం. వరాహపురం తీసుకెళ్ళి మీకు మా అల్లుడితో మైత్రి ఏర్పరచాలని నా ఉద్దేశం. రెండు రోజుల్లో బయలుదేరుదాం." అంది.

నేనక్కడి విశేషాలు చూస్తూ గడిపాను.

అవ్వ పెరట్లోని రెండు దున్నపోతులవీపు మీద మెత్తని చిగుళ్ళు చాపలాపరచి జీనులా కట్టింది. నాకు నవ్వొచ్చింది. కాని అంతకంటె మరోసాధనం లేదు. ఒక దానిమీద అవ్వ మరోదానిమీద నేను. కుదుపు లేదు. వేగంగా నడవసాగాయి. మూడురోజులకి సముద్ర తీరంలోని

ఒక పల్లె చేరాం. అక్కడ ఒక పల్లెవాడిని పడవ కట్టమని దానిమీద అవతలివొడ్డు చేరాం. అక్కడి నుంచి బండిలో వరాహపురం పోయాం. ఆ నగరం వైభవంగా ఉంది. తల్లి వొస్తూందని కూతురు ఎదురొచ్చింది. నన్ను ఆంతరంగికుడిగా పరిచయం చేసి ఉపచారాలు చేయించింది. భైరవుడి వల్ల తనకి కలిగిన ముప్పు ... నేను రక్షించిన విధమూ చెప్పింది. అక్కడికి రమ్మని కూతురు మందలిస్తున్నా వినకుండా – "నీ భర్త ఊళ్ళో ఉన్నాడా?" అని అడిగింది.

వారిమిత్రుడు విపులుడు వర్తమానం పంపగా మహాపురానికి వెళ్ళారు. రేపు వస్తారు." అంది.

భోజనం చేసి ...రాత్రిహాయిగా నిద్రపోయాను. ఉదయం లేచాక అవ్వ తన మనవరాలు జాంబవతిని చూపించింది. అతి చక్కగా ఉండి నాలో మోహావేశం కలిగించింది. ఆ బాలిక చేత నాకు నమస్కరింపజేయగా "అనుకూలుడయిన భర్త లభించాలి." అని ఆశీర్వదించాను. ఆమె ముసిముసినవ్వులు నవ్వింది. గ్రామాంతరం నుండి వచ్చిన భర్తకి తనతల్లి వచ్చిందని చెప్పగా – "పశువులేమౌతాయో.." అని పరిహాసం చేశాడు. ఆమె తన తల్లికి కలిగిన అవస్థ చెప్పింది. " ఈ పుణ్యాత్ముడే ఆమెను రక్షించాడు." అంటూ నన్ను పరిచయం చేసింది. అతనడగగా నేను నా వృత్తాంతం అంతా చెప్పాను. భైరవుడి వృత్తాంతం కూడా వివరించాను. అతను నన్ను చాలా గౌరవిస్తూ విద్యలలో కొంత ముచ్చటించి నేనిచ్చిన ప్రత్యుత్తరాలకి ఆశ్చర్యపోయాడు. తరవాత మేమిద్దరమూ ఒకేపంక్తిలో కూర్చుని భోజనం చేశాము. అప్పుడతని భార్య వడ్డిస్తూ ... "విపులుడు మీకంత అవశ్యంగా రమ్మని ఎందుకు కబురంపాడు?" అని అడిగింది.

అందు కతను – "లోకమంతా స్త్రీ ప్రభావంతో కూడుకుని ఉంది. విపులుడు మతంగయోగిని ప్రోత్సాహంతో ఇద్దరు వారకాంతలను వరించి వాళ్ళని బలవంతంగా రప్పించుకున్నాడు. వాళ్ళు అల్లరి చేసి ఎలాగో భోజుడికి తెలియజేసినట్లుంది. భోజుని పుత్రుడు చిత్రసేనుడు – "రాజా! ప్రజల న్యాయాన్యాయాలు విచారించి రాజు దుర్జనులను శిక్షించి, సజ్జనులని రక్షించాలి. నువ్వు ఆ మాట మరచి ఇద్దరు

వారవనితలను బలవంతంగా చెరపెట్టావట. అది చాలా పాపం. ఈ జాబు చూసిన తక్షణం నువ్వు వాళ్ళిద్దరినీ వదిలివేసి ఆ విషయం మాకు తెలియపరచు. అలా పత్రిక రాకపోతే ఆక్షణంలోనే నీమీద యుద్ధం ప్రకటిస్తున్నాం. నీరాజ్యం అన్యాక్రాంతం చేస్తాం."– అని రాసి విపులుడికి పంపాడట. విపులుడు భోజుడికంటె దుర్బలు డవడంవల్ల ఆ పత్రికకి జడుసుకుని – 'మహారాజా! నాశత్రువులెవరో మీకలా వార్త పంపారు. వేశ్యాపుత్రికలు ఇద్దరిని నేనెన్నడూ తీసుకురాలేదు. వారు నా దేశంలో లేరు. మీకు నా మాటలో విశ్వాసం లేకపోతే దూతలను పంపి వెతికించండి. ఆ వేశ్యలు ఉంటే మీరు వేసిన శిక్షకు పాత్రుడినౌతాను. అని భోజుడికి తెలియజేసి నాకు వర్తమానం చేశాడు.

నేను వెళ్ళి అడిగితే అదంతా చెప్పి – మతంగయోగిని మూలంగా బలవంతంగా ఇద్దరు గణిక పుత్రికలని తెచ్చినే మాట వాస్తవమే. ఇప్పుడు వీళ్ళని వదిలితే నా అక్రమం బయటపడుతుంది. వెలయాళ్ళని నేను తెప్పిస్తే కులస్త్రీలకంటె ఎక్కువ కుమిలిపోతున్నారు. కనుక మీరు వారిని మీదేశానికి తీసుకుపోయి కొన్నాళ్ళు కాపాడండి. ఈ ఉపద్రవం దాటాక కర్తవ్యం ఆలోచిద్దాం. నువ్వు నాకు మిత్రుడివి కనక ఈ ఉపకారం చెయ్యి. నీ దగ్గరుంటే ఈశ్వరుడు కూడా తెలుసుకోలేడు. అని ప్రార్థించాడు.

అక్రమమే అయినా మిత్రుడి కార్యం కనుక చేయగలిగినదే అని అంగీకరించి వారకాంత లిద్దరినీ ఇక్కడికి తీసుకు వచ్చాను. చావడి గదిలో ఉన్నారు." అని భార్యకు చెప్పాడు "ఓహో! మీ సాధుత్వం గొప్పదే! విపులుడు చేసిన పనికి మందలించక ఆమోదించి వాళ్ళనిక్కడికి తీసుకువచ్చారా! చాలుచాలు – ఇది కాని భోజుడు వింటే మిమ్మల్ని కూడా అపరాధిగా తలచి మీమీద కత్తి కట్టిక మానడు. అదీకాక పాపపుణ్యాలు చేసినవాడూ, చేయించినవాడూ, ప్రేరేపించినవాడూ, ఆమోదించిన వాడూ నలుగురూ ఆ ఫలాన్ని సమంగా పంచుకుంటారని పెద్దలు చెబుతారు. కేవలము మాట వల్లనే ఓ బ్రాహ్మణుడు యతిహత్యాపాపం అనుభవించిన కథ నాకు ఒక పండితుడు చెప్పాడు వినండి " అంటూ ఆమె చెప్పసాగింది

# కౌశికుడి కథ

కౌశికుడనే బ్రాహ్మణుడు ఒకనా డొక సన్యాసిని భిక్షకు పిలిచాడు. తనకి వాడుకగా పాలు, పెరుగు పోసే గొల్లదానితో – "రేపు మా యింట యతిభిక్ష జరుగుతుంది. నీకు ఎక్కువ సొమ్మిస్తాను, నీళ్ళు కలప కుండా గట్టిపెరుగు తోడుపెట్టి తీసుకురా." అన్నాడు.

అది అలాగే అని మంచి పెరుగుతోడు పెట్టి ఆ పెరుగు ముంతని గంపలో పెట్టి పైన గుడ్డ మూత వేసి తెస్తూంటే – గాలికి గుడ్డ తొలగింది. అదే సమయంలో ఆకాశంలో ఒక గరుడపక్షి తెల్లతాచుని పట్టుకుని పోతూంటే అది గరళం కక్కింది. ఆ విషం దైవికంగా గొల్లది తెస్తున్న పెరుగు ముంతలో పడింది. కాని ఆ విషయం దానికి తెలియదు. ఆ పెరుగు నందుకుని కౌశికుడు చాలా సంతోషించి గట్టిపెరుగు తెచ్చినందుకు దానికి ఎక్కువ సొమ్మిచ్చి సన్యాసికి పిండివంటలతో భోజనం పెట్టి పెరుగు వడ్డించాడు. రుచిబాగుందని యతి కొంచెం ఎక్కువగా ఆ పెరుగు పుచ్చుకున్నాడు. నాలుక పూతలో పుండుపడి ఉండడంతో భోజనం చేసిన కొంచెం సేపటికే అతను విషం ఘాటు తగిలి మరణించాడు.

అది చూసి గృహస్తుడు చాలా దుఃఖిస్తూ అతని మరణానికి కారణం తెలియక గ్రామస్తుల సహాయంతో అతని దేహాన్ని గంగకు అర్పించాడు. ఆ యతిహత్యాపాతకం ఎవరు అనుభవించాలని రాయాలో సందేహం వచ్చి చిత్రగుప్తుడు యమధర్మరాజుని అడిగాడు. అతనికీ సందేహం వచ్చి ధర్మకర్తలతో ఆలోచించాడు.

"గొల్లది తెచ్చిన పెరుగులో విషముందని కౌశికుడికి తెలియదు కనుక అతనికి ఈ పాపాన్నీ అంటకట్టకూడదు. గుడ్డ గాలికి తొలిగిందనీ విషంపడిందనీ గొల్లదానికి తెలియదు కనుక ఈ పాపం దానికి చెందదు. కదలించడం వాయువు స్వభావం. విషం కక్కడం సర్పం స్వభావం అది గరుడపక్షి చేత నొక్కబడి అలా కక్కింది– అస్వతంత్రుడు పాపభారం పొంధడు. సర్పాలను తినడం గరుడపక్షి నేరంకాదు. అందుచేత ఈ పాపం ఎవరి పేర రాయాలో మాకూ తెలియడంలేదు." అన్నారు ధర్మకర్తలు.

వారవనితలను బలవంతంగా చెరపెట్టావట. అది చాలా పాపం. ఈ జాబు చూసిన తక్షణం నువ్వు వాళ్ళిద్దరినీ వదిలివేసి ఆ విషయం మాకు తెలియపరచు. అలా పత్రిక రాకపోతే ఆక్షణంలోనే నీమీద యుద్ధం ప్రకటిస్తున్నాం. నీరాజ్యం అన్యాక్రాంతం చేస్తాం."– అని రాసి విపులుడికి పంపాడట. విపులుడు భోజుడికంటె దుర్బలు డవడంవల్ల ఆ పత్రికకి జడుసుకుని – 'మహారాజా! నాశత్రువులెవరో మీకలా వార్త పంపారు. వేశ్యాపుత్రికలు ఇద్దరిని నేనెన్నడూ తీసుకురాలేదు. వారు నా దేశంలో లేరు. మీకు నా మాటలో విశ్వాసం లేకపోతే దూతలను పంపి వెతికించండి ఆ వేశ్యలు ఉంటే మీరు వేసిన శిక్షకు పాత్రుడినౌతాను. అని భోజుడికి తెలియజేసి నాకు వర్తమానం చేశాడు

నేను వెళ్ళి అడిగితే అదంతా చెప్పి – మతంగయోగిని మూలంగా బలవంతంగా ఇద్దరు గణిక పుత్రికలని తెచ్చినే మాట వాస్తవమే. ఇప్పుడు వీళ్ళని వదిలితే నా అక్రమం బయటపడుతుంది. వెలయాళ్ళని నేను తెప్పిస్తే కులస్త్రీలకంటె ఎక్కువ కుమిలిపోతున్నారు. కనుక మీరు వారిని మీదేశానికి తీసుకుపోయి కొన్నాళ్ళు కాపాడండి. ఈ ఉపద్రవం దాటాక కర్తవ్యం ఆలోచిద్దాం. నువ్వు నాకు మిత్రుడివి కనక ఈ ఉపకారం చెయ్యి. నీ దగ్గరుంటే ఈశ్వరుడు కూడా తెలుసుకోలేడు. అని ప్రార్థించాడు.

అక్రమమే అయినా మిత్రుడి కార్యం కనుక చేయగలిగినదే అని అంగీకరించి వారకాంత లిద్దరినీ ఇక్కడికి తీసుకు వచ్చాను. చావడి గదిలో ఉన్నారు." అని భార్యకు చెప్పాడు "ఓహో! మీ సాధుత్వం గొప్పదే! విపులుడు చేసిన పనికి మందలించక ఆమోదించి వాళ్ళనిక్కడికి తీసుకువచ్చారా! చాలుచాలు – ఇది కాని భోజుడు వింటే మిమ్మల్ని కూడా అపరాధిగా తలచి మీమీద కత్తి కట్టిక మానడు. అదీకాక పాపపుణ్యాలు చేసినవాడూ, చేయించినవాడూ, ప్రేరేపించినవాడూ, ఆమోదించిన వాడూ నలుగురూ ఆ ఫలాన్ని సమంగా పంచుకుంటారని పెద్దలు చెబుతారు. కేవలము మాట వల్లనే ఓ బ్రాహ్మణుడు యతిహత్యాపాపం అనుభవించిన కథ నాకు ఒక పండితుడు చెప్పాడు వినండి." అంటూ ఆమె చెప్పసాగింది.

## కౌశికుడి కథ

కౌశికుడనే బ్రాహ్మణుడు ఒకనా డొక సన్యాసిని భిక్షకు పిలిచాడు. తనకి వాడుకగా పాలు, పెరుగు పోసే గొల్లదానితో – "రేపు మా యింట యతిభిక్ష జరుగుతుంది. నీకు ఎక్కువ సొమ్మిస్తాను, నీళ్ళు కలప కుండా గట్టిపెరుగు తోడుపెట్టి తీసుకురా." అన్నాడు.

అది అలాగే అని మంచి పెరుగుతోడు పెట్టి ఆ పెరుగు ముంతని గంపలో పెట్టి పైన గుడ్డ మూత వేసి తెస్తూంటే – గాలికి గుడ్డ తొలగింది. అదే సమయంలో ఆకాశంలో ఒక గరుడపక్షి తెల్లతాచుని పట్టుకుని పోతూంటే అది గరళం కక్కింది. ఆ విషం దైవికంగా గొల్లది తెస్తున్న పెరుగు ముంతలో పడింది. కాని ఆ విషయం దానికి తెలియదు. ఆ పెరుగు నందుకుని కౌశికుడు చాలా సంతోషించి గట్టిపెరుగు తెచ్చినందుకు దానికి ఎక్కువ సొమ్మిచ్చి సన్యాసికి పిండివంటలతో భోజనం పెట్టి పెరుగు వడ్డించాడు. రుచిబాగుందని యతి కొంచెం ఎక్కువగా ఆ పెరుగు పుచ్చుకున్నాడు. నాలుక పూతలో పుండుపడి ఉండడంతో భోజనం చేసిన కొంచెం సేపటికే అతను విషం ఘాటు తగిలి మరణించాడు.

అది చూసి గృహస్తుడు చాలా దుఃఖిస్తూ అతని మరణానికి కారణం తెలియక గ్రామస్తుల సహాయంతో అతని దేహాన్ని గంగకు అర్పించాడు. ఆ యతిహత్యాపాతకం ఎవరు అనుభవించాలని రాయాలో సందేహం వచ్చి చిత్రగుప్తుడు యమధర్మరాజుని అడిగాడు. అతనికీ సందేహం వచ్చి ధర్మకర్తలతో ఆలోచించాడు

"గొల్లది తెచ్చిన పెరుగులో విషముందని కౌశికుడికి తెలియదు కనుక అతనికి ఈ పాపాన్నీ అంటకట్టకూడదు. గుడ్డ గాలికి తొలిగిందనీ విషంపడిందనీ గొల్లదానికి తెలియదు కనుక ఈ పాపం దానికి చెందదు. కదలించడం వాయువు స్వభావం. విషం కక్కడం సర్పం స్వభావం అది గరుడపక్షి చేత నొక్కబడి అలా కక్కింది– అస్వతంత్రుడు పాపభారం పొందడు. సర్పాలను తినడం గరుడపక్షి నేరంకాదు. అందుచేత ఈ పాపం ఎవరి పేర రాయాలో మాకూ తెలియడంలేదు." అన్నారు ధర్మకర్తలు.

యముడు వైకుంఠానికి పోయి విష్ణువుని అడగగా అతను గొప్పసభచేసి దానిలో అడిగాడట. మహర్షులూ దేవతలూ కూడా ధర్మసూక్ష్మం చెప్పలేక పోయారట దూతలను ముల్లోకాలకీ పంపి ధర్మసూక్ష్మం తెలుసుకునేవరకూ ఆపాపం ఎవరి చిట్టాలోనూ రాయొద్దన్నాడట విష్ణుమూర్తి. సభ జరుగుతున్నప్పుడు విన్న గరుత్మంతుడు ఆ దోషం తమజాతికి వర్తింప జేస్తారేమో అని భయపడ్డాడు. ఆ వార్త గరుడపక్షి జాతి అంతటికీ తెలిసింది భూలోకంలో ఒకచెట్టు కొమ్మమీద నివసించే గరుడపక్షులు రెండు ఆ తప్పుతమ మీదకేతోసి శిక్ష విధిస్తారేమో అని విచారిస్తూంటే – దైవికంగా ఆ చెట్టు కిందే పడుకున్న బ్రాహ్మణుడు వాటి మాటలువిని పక్షిభాష వచ్చిన వాడవడం వల్ల రెండో బ్రాహ్మణుడికి ఆకదంతా చెప్పి – "దేవతలూ, మహర్షులూ చెప్పలేక పోయారట. నన్నడిగితే నేను చెప్పేవాడినికదా!" అన్నాడు "ఆ పాపం ఎవరిదని చెబుతావు నువ్వు?" అడిగాడతను.

"విషం కలిసిన పెరుగును పరీక్షించకుండా పోసిన గృహస్తుడిదే ఆతప్పూ, పాపమూ. వస్తు పరీక్ష చెయ్యొద్దా?" అదేసమయంలో ఆకాశంలో ఆ ప్రాంతం మీదుగా పోతున్న యమదూతలు ఆమాటవిని అతణ్ని యముడి దగ్గరకు తీసుకుపోయి జరిగింది చెప్పారు "నువ్వు అలా చెప్పావా?" అని అడిగిన యముడితో – "ఔను." అన్నాడా బ్రాహ్మణుడు అప్పుడు యముడు పెరుగుకుండలు రెండు తెప్పించి ఒకదానిలో విషం కలిపి, అతడిని పిలిచి – "వీటిలో దేనిలో విషం కలిపామో చెప్పు " అన్నాడు ఆ బ్రాహ్మణుడు తెల్లబోయి చూశాడే కాని చెప్పలేకపోయాడు.

అప్పుడు యముడు "ధర్మసూక్ష్మం గ్రహించడం కష్టం. తెలియనప్పుడు చెప్పకూడదు అసత్యంగా దోషం ఆరోపించిన వాడు ఆ ఫలం అనుభవించాలి. నువ్వు చెప్పింది. అసత్యం. కనుక ఓ బ్రాహ్మణుడా! ఆ పాపఫలాన్ని నీకు విధిస్తున్నాను." అని అనడంతో యమదూతలు అతనిచేత ఆఫలం అనుభవింపజేశారట.

ప్రాణేశ్వరా! ధర్మం ఇంత సూక్ష్మంగా ఉంటుంది. ఆ ఆడవాళ్ళని నిష్కారణంగా బాధించిన పాపాన్ని మీరు కూడా

పంచుకుంటారేమో అని విచారిస్తున్నాను." అన్నాడు. నేను వాళ్ళ మాటలు వింటూ భోజనంచేయ సాగాను. ఆ అవ్వ అల్లునితో – "మీరెందుకు ఈ విషయంలో తగవులాడుకోడం? ఘోటకముఖుడు మహాపండితుడు. అతను చెప్పిన న్యాయాన్ని పాటించండి." అంది. రాజు నా మొహం చూశాడు. "మీరు చెప్పింది సమంజసంగానే ఉంది. ఈ గణికల వృత్తాంతం తెలుసుకుని వారి ఆప్తుల వద్దకు చేర్చడం ఉచితం." అన్నాను నేను.

విశ్రమించిన తరవాత నన్ను వారిదగ్గరకి తీసుకువెళ్ళాడు. అప్పటికే మిత్రవింద, ఆమెతల్లీ అక్కడున్నారు. రాజువారిని వృత్తాంతం అడగగా చిత్రసేన – "అయ్యా! మాది పాటలీపుత్రం. మేము రతినూపుర అనే వేశ్య పుత్రికలం. నాపేరు చిత్రసేన. దీనిపేరు రతిమంజరి. నాభర్త దత్తుడనే విద్వాంసుడు. దీని భర్త గోణికాపుత్రుడు. తల్లినీ సంపదలని వదిలి మేము గోణికాపుత్రుని వెంట ధారానగరం వస్తూంటే మతంగ యోగిని దుర్బోధలవల్ల విపులుడనే రాజు మమ్మల్ని గోణికాపుత్రుడికి తెలియకుండా బలవంతంగా రప్పించుకుని తనని వరించమని నిర్బంధించాడు.

మేము బ్రాహ్మణుల సొత్తు అయ్యాం. మగనాలులం. వేశ్య ధర్మాలు విసర్జించాం. మమ్ము వరించడం తగదని ఎంత చెప్పినా వినక వెలయాండ్రకు నీతేమిటని ఆక్షేపిస్తూ కారాగారంలాటి గృహంలో నిర్బంధించాడు. మేము ఒప్పుకోలేదు. తరవాత ఎందుకో మీరిక్కడికి తీసుకువచ్చారు." అంది.

నా శరీరం ఝల్లుమనగా – "వీరు నామిత్రుల భార్యలు." అంటూ మన వృత్తాంతం అంతా అతనికి చెప్పాను. నాపేరు ఘోటకముఖుడని వినగానే వాళ్ళు పొంగిపోయారు. "నేడెంత సుదినం! మీపేరు గోణికాపుత్రుడి నోట చాలాసార్లు విన్నాం. "మహాత్మా! మీరిక్కడికి ఎలా వచ్చారు?" అని వాళ్ళు అడిగేసరికి మళ్ళీ నాకథ వారికి చెప్పాను. రాజపత్ని వారి వృత్తాంతం విని జాలిపడుతూ – "మిమ్మల్ని భర్త వద్దకు పంపుతాను. విచారించకండి." అని ఓదార్చింది. ఆవేళకి ఇష్టాగోష్ఠి వినోదాలతో కాలక్షేపం చేశాం.

# కాశీ మజిలీ కథలు

## 164 వ మజిలీ

### మదాలస కథ

చక్రధర నాయకుడు పత్ని మిత్రవింద చాలా గుణవంతురాలు. నేను మర్నాడే ఇక్కడికి రావడానికి ప్రయాణ మయ్యాను. కాని తనతల్లికి ఉపకారం చేశానని నన్నెంతగానో పొగుడుతూ ఆమె నన్ను కదలనిచ్చిందికాదు. విందులు చేస్తూ నన్నెంతగానో గౌరవించింది.

"అవ్వా! నీకూతురు మదాలస వంటి గుణవంతురాలు" అని నేననేసరికి ఆమెకథ చెప్పమని కోరింది. నేను ఇలా చెప్పాను."

పూర్వం శత్రుజిత్తు అనే రాజు పరాక్రమశాలిఐ. పరిపాలించేవాడు. అతనికి ఋతుధ్వజుడు అనే కుమారుడు కలిగాడు. ఆ రాజపుత్రుడు రూపంలోను బుద్ధిలోనూ పరాక్రమంలోనూ రసికత లోనూ అసామాన్యుడు. వీణ మీదగానం చేస్తాడు. మధురమైన ప్రబంధాలు రచిస్తాడు. తపోధనులను సేవిస్తాడు. సకల శాస్త్రాలలోనూ చర్చలు చేస్తాడు. వేటాడతాడు. రసికత ప్రదర్శిస్తాడు. అతని ఖ్యాతి తెలిసి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యపుత్రులు దూరదేశాలనుంచి వచ్చి అతన్ని ఆశ్రయించి తిరుగుతూంటారు. అతను వారిచేత కొత్త కొత్త క్రీడలు ఆడిస్తూంటాడు.

అశ్వతరుడు అనే నాగేంద్రుడి కుమారు లిద్దరూ చాలా చక్కనివారు. అతని గురించి విని బ్రాహ్మణ పుత్రుల వేషాల్లో అతన్ని ఆశ్రయించారు. ఋతుధ్వజుడు వారిని తన మిత్రులలో చేర్చుకున్నాడు. ఆ నాగకుమారులు ప్రతీరోజు రాత్రి పాతాళలోకానికి వెళ్తూ పొద్దున్నే అతని వద్దకు వచ్చేవారు.

రాజపుత్రుడు వాళ్ళు లేకుండా భోజనం, స్నానం, శుభ్ర వస్త్రాలు ధరించడం - ఏమీ చెయ్యడు. అంత స్నేహంగా ఉండేవాడు.

ఒకరోజు అశ్వతరుడు తన కుమారులని – "నిత్యమూ మీరు ఎక్కడికి పోతున్నారు? రాత్రులు తప్ప పగలు ఇక్కడ ఉండరేం?" అని అడగగా వారు అతనికి నమస్కరించి – ఋతుధ్వజుడి సుగుణాలగురించీ అతను తమకు మిత్రుడైన విధం గురించీ చెప్పి అతనిని విడచి ఉండలేమన్నారు.

అలాటి కొడుకుని కన్న తండ్రిదే అదృష్టమంటూ పొగిడి – "అంత సుగుణ వంతుడికి ఏదేనా ఉపకారం చెయ్యాలనిపిస్తూంది. మీకోసం అతని కోరిక తీరుస్తాను. మన ఇంటిలో ఉన్న దేనినయినా ఇస్తాను." అన్నాడు.

"అతనివద్ద లేనిదేమీ లేదు. రోజూ అతనింటికి వచ్చి ఏంకావాలంటే అది ఇచ్చి పోతారు. కాని..అతని మనస్సు కోరుకునేది ఒకటుంది. అది త్రిమూర్తులకి తప్ప ఇతరులకి సాధ్యంకాదు." అన్నారువారు.

"అదేమిటో చెప్పండి సాధ్యాసాధ్యాల సంగతి తరవాత చూద్దాం. విద్వాంసులకు అసాధ్యం ఉండదు. ధృడసంకల్పం, పరిశ్రమ సాధించ లేనివి ఉండవు. నేనతని అభీష్టం తీరుస్తాను. చెప్పండి." అన్నాడు అశ్వతరుడు. అప్పుడు వారు "తండ్రీ! అతను మాకు చెప్పినది మేము చెబుతున్నాం. ఋతధ్వజుడి తండ్రి శత్రుజిత్తు రాజ్యం చేస్తూంటే అతని చిన్నతనంలో కాలవుడు అనే మహర్షి గుర్రంతో వచ్చాడు. రాజు అతణ్ని అర్చించాడు అప్పుడతను – "మహారాజా! నేను తపస్సు చేసుకుంటూంటే ఒక రాక్షసుడు నా ఆశ్రమానికి వచ్చి మాయా ప్రభావంతో అనేక రూపాలు ధరించి నన్ను భయపెడుతున్నాడు. ఏదో అల్లరి చేసి తపోభంగం చేస్తున్నాడు. వాడిని భస్మం చేస్తే తపస్సు వ్యయమై పోతుంది.

ఒకనాడు ఆకాశం వేపు చూస్తూ వాడి అల్లరి తలుచుకుంటూ నేను నిట్టూర్పగా ఈ గుర్రం పుట్టి నేలమీద పడింది. వెంటనే ఆకాశవాణి – "మునీంద్రా! ఈ సైంధవం పాతాళంలోనూ నీటిలోనూ నేలమీదా నిరాటంకంగా తిరగ గలదు. భూవలయం అంతా తిరగ గలదు. కనుకనే దీనికి కువలయం అని పేరు. దీనిని తీసుకుపోయి శత్రుజిత్తు కుమారుడి

కివ్వు. అతనా రాక్షసుణ్ని సంహరించగలడు." అని చెప్పగా దానిని తీసుకుని మీ వద్దకు వచ్చాను. దీనిపై నీ కొడుకును ఎక్కించి మా ఆశ్రమానికి పంపు, శత్రుసంహారం చేస్తాడు." అన్నాడు. ఋతుధ్వజుడు ఆ గుర్రానెక్కి కాలవుడి వెంట ఆశ్రమానికి వెళ్ళి ఆ రాక్షసుడి రాకకోసం ఎదురు చూడసాగాడు. కువలయం ఎక్కి తిరగడంతో కువలయాశ్వుడు అనే పేరుపొందిన అతను ఉన్నాడని తెలియక రాక్షసుడు సంధ్యవేళ అగ్నినారాధిస్తున్న కాలవుని వద్దకు వరాహరూపంలో వొచ్చి అగ్ని గృహంలో చొరబడి భయ పెడుతూంటే ముని బాలకులు వెళ్ళి ఋతుధ్వజుడికి చెప్పారు.

రాజపుత్రుడు గుర్రమెక్కి శరాసనం ఎక్కుపెట్టి అతివేగంగా ఆ వరాహాన్ని అర్ధచంద్రాస్త్రంతో కొట్టాడు. అది మొర్రో మంటూ పారిపోతున్నా వదలక కువలయాశ్వుడు తరుముకుపోగా పాతాళానికి వోయింది. రాజపుత్రుడు వరాహం వెళ్ళిన గోతిలోంచి గుర్రాన్ని నడిపిస్తూంటే చీకటంతా వోయి వెలిగిపోతున్న ఒక నగరం కనిపించింది. అక్కడ వరాహంకాని, మరెవవరూకాని కనపడలేదు. రాజసౌధం దగ్గర ఒక స్త్రీ నిలబడి ఉండడం చూసి - "నువ్వెవరివి? ఈ పురం ఎవరిది? నీ పేరేమిటి? అంటూ అడిగాడు ఆమె ఏమీ మాట్లాడకుండా మేడలోకి వోయింది.

అతను గుర్రం దిగి ఆ మేడలోకి వోగా రత్న ఖచితమైన శయ్యమీద పడుకున్న ఒక చిన్నది కనిపించింది. దేవతా సుందరిలా ఉన్న ఆమెని చూసి అతను పరవశం చెందాడు. ఆ సుందరుడిని చూసి ఆమె మన్మథుడే అనుకుంది. మోహంలో పడి నిట్టూర్చుతూ మూర్ఛ వోయింది. "భయపడకు బాలా!" అంటూ అతనామెకు గాలి విసరసాగాడు. అంతలో ముందర చూసిన స్త్రీ వచ్చింది. ఆమెను - "మీరెవరు? ఈ నగరం ఎవరిది? మీరు ఒంటరిగా ఎందుకున్నారు?" అని అడిగాడు. అందుకామె - "ఈమె విశ్వావసుడనే గంధర్వరాజు కూతురు. దీనిపేరు మదాలస. ఈమె ఉద్యాన వనంలో విహరిస్తూంటే పాతాళకేతుడు అనే రాక్షసుడు ఎత్తుకొచ్చి ఇక్కడ దాచాడు. రాబోయే

త్రయోదశినాడు దీనిని పెళ్ళాడాలని ముహూర్తం పెట్టుకున్నాడు. అందుకని ఈమె మరణ ప్రయత్నం చేస్తూంటే సురభి వచ్చి వారించి కొన్ని రహస్యాలు చెప్పింది. నేను ఈమె సఖురాలిని నాపేరు కుండలి. ఈమె నిన్ను చూసి మోహపరవశం చెందింది. నువ్వెవరు? నీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగింది. అతను తన వృత్తాంతం చెప్పాడు.

అది విని ఆమె - "ఓహో! భూమండలాధిపతి కువలయాశ్వుడివా! అందుకే మదాలస మనసు చెదిరింది. నిన్నే పెళ్ళాడుతుందని సురభి చెప్పింది. నువ్వు దీనిని పరిగ్రహించాలని దైవమే చెప్పాడు." అంటూ ఆమె వారిద్దరికీ గాంధర్వ విధానంలో పాణిగ్రహణ మహోత్సవం జరిపించింది. తాను తపోవనానికి వెళ్తూ కుండలి మందాలస చేతిని అతని చేతిలో ఉంచి వైవాహిక ధర్మాలు చెప్పి - "ఈ ముద్దరాలిని ప్రేమగా చూసుకో." అని చెప్పి వెళ్ళిపోయింది.

అతనామెను గుర్రం మీద ఎక్కించుకుని భూలోకం వెళ్తూంటే పాతాళకేతుడు చతురంగ బలాలతో అతనిని ఎదుర్కొని బాణాల వర్షం కురిపించాడు. రాజపుత్రుడు నవ్వుతూ వారిపై ఒక అస్త్రం ప్రయోగించాడు. దానితో వారందరూ భస్మమయ్యారు. అతను తన నగరానికి వెళ్ళి మదాలసను చూపించాడు. శత్రుజిత్తు కొడుకుని కౌగలించుకుని చాలా సంతోషించాడు. భార్యభర్తలు సుఖంగా గడపసాగారు. కొన్ని రోజులయ్యాక శత్రుజిత్తు - "కుమారా! ప్రతిదినమూ నువ్వు ఈ గుర్రమెక్కి తిరుగుతూ బ్రాహ్మణులని రక్షించాలి. దుర్బుద్ధులైన రాక్షసులనుండి తపసులకు బాధలేకుండా చెయ్యాలి." అన్నాడు. కువలయాశ్వుడు ప్రతిరోజు భూమిచుట్టి వచ్చి మిగిలిన సమయం భార్యతో గడపసాగాడు.

పాతాళకేతుడి తమ్ముడు తాళకేతుడు కడుమాయావి. యమునాతీరంలో ఒక ఆశ్రమం కట్టుకుని ముని వేషం వేసుకుని తపస్సు చేస్తున్నట్లు నటించసాగాడు. ఒకనాడు రాజపుత్రుడు వెళ్ళి మహర్షి అనుకుని నమస్కరించి - "మహాత్మా! రాక్షస బాధ లేకుండా తపస్సు నిర్విఘ్నంగా జరుగుతూందా?" అని అడిగాడు.

"రాజపుత్రా! నీలాటి శూరుడు రక్షకుడయి ఉండగా తపస్సుకు విఘ్నమెందుకు జరుగుతుంది? నేను నిన్నొకటి యాచిస్తున్నాను. లేదనకుండా ఇస్తావని తలుస్తాను. విను. నేనొక యజ్ఞం తలపెట్టాను. అందుకు ధనం కావాలి. ఎందరికో దక్షిణలివ్వాలి. నీమెడలోని కంఠాభరణం నాకివ్వు. దానితో యజ్ఞం పూర్తవుతుంది. అంతేకాదు. నేను నీటిలో మునిగి కార్యక్రమాలు చేస్తాను. నువ్వు వద్దన ఉండి రాక్షస బాధలేకుండా కాపాడాలి." అన్నాడు తాళకేతుడు.

"అలాగే. దీనికి ఇంతగా ప్రాధేయపడాలా? ఇదిగో కంఠభూషణం. నేను కాపలాగా ఉంటాను. నువ్వు నిశ్చింతగా వరుణుడిని ఆరాధించుకో." అన్నాడు. ఆ మాయావి అతను చూస్తూండగానే నీళ్ళల్లో మునిగి .. తిన్నగా శత్రుజిత్తు వద్దకు పోయి, మదాలస ఉండగా – "నువ్వు కువలయాశ్వుడి తండ్రివేనా? పాపం ... అతను గుర్రం మీద తపోవనాలలో తిరుగుతూంటే ఒక రాక్షసుడు అతనితో ఘోరయుద్ధం చేసి నా ఆశ్రమం ముందు కడుపులో శూలం గుచ్చి చంపేశాడు. మీకింత దారుణమైన వార్త చెప్పవలసి వచ్చినందుకు బాధగా ఉంది. ప్రాణం పోతున్నప్పుడు అతను నాకు ఈ కంఠాభరనం ఇచ్చాడు. గుర్రాన్ని ఆ రాక్షసుడు పట్టుకుపోయాడు. అక్కడి తాపసులు దహన సంస్కారం చేశారు." అంటూ ఆ ఆభరణాన్ని అక్కడ పారేసి వెళ్ళిపోయాడు.

అక్కడున్న వారంతా ఆ వార్తకి హాహాకారాలు చేశారు. భర్త మరణ వార్త వినడంతోనే మదాలస మొదలు నరికిన చెట్టులా కూలిపోయి మరణించింది. భార్యని ఓదార్చుతూ శత్రుజిత్తు – "భూతలం యొక్క అనిత్యత తెలుసుకుంటే కుమారుడి కోసమూ, కోడలు కోసము మనం విచారించడం తగదు." అని ధైర్యం చెప్పి సద్గోష్టిలో కాలక్షేపం చెయ్యసాగాడు. తాళకేతుడు యమునా నదీ తీరంలో కావలి కాస్తున్న కువలయాశ్వుడితో – "రాజపుత్రా! నా చిరకాల వాంఛ నెరవేరింది. నీవిక ఇంటికి పోవచ్చు." అన్నాడు. మహాప్రసాదం అంటూ కువలయాశ్వుడు గుర్రం ఎక్కి ఇంటికి వెళ్ళాడు. అతన్ని చూసి కొందరు మనసులో దుఃఖిస్తూ తలవంచుకున్నారు. కొందరు సంతోషంగా

కౌగలించుకున్నారు. కొందరు ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొందరు అతని చుట్టూ మూగి వెనక నడవసాగారు. అదేమీ అర్థం కాని అతను తిన్నగా తండ్రిగారి వద్దకు వెళ్ళి పాదాలకు నమస్కరించాడు.

తండ్రి అతన్ని కౌగలించుకుని కన్నీటితో అతని శిరస్సు తడిపాడు. తల్లి, బంధువులు శోకించారు. అదంతా చూసి – "ఇవాళ మీరందరూ నన్ను వింతగా చూస్తున్నారేం?" అని అడిగాడు. "మదాలస కనిపించదేం?" అన్నాడు. అప్పుడు తండ్రి జరిగిందంతా అతనికి చెప్పాడు. 'ఆహా! నా మరణం వినడంతోనే మృతి చెందినది మదాలస. నేను మాత్రం ఆమె మరణవార్త విని కూడా బతికున్నాను. ఎంత కృతఘ్నుడిని!' అని చింతించి అంతలోనే – 'ఆమెనాకోసం చనిపోయిందని నేనూ ఆమెకోసం చనిపోతే ఆమెకు లాభం ఏమిటి? సహగమనం స్త్రీలకి యశస్కరంకాని పురుషులకి కాదు. ఆమెకోసం బిగ్గరగా ఏడిస్తే జనులు నవ్వుతారు. ఆమె మీది ప్రేమతో వెర్రి వాడిలా తిరగబోయినా శత్రువులు లోకువ చేసి పరాభవిస్తారు. శత్రువధ, పితృసేవ నా ముఖ్యవిధులు. కనుక నేను ఇప్పటినుంచి స్త్రీ భోగం వదిలేస్తాను. దీనివలన మదాలసకు లాభముండదు కాని నాకోసం ప్రాణాలు వదలిన ఆమెకు ఈ పాటి కృతజ్ఞతయినా చూపవొద్దా?' – అనుకుని ఆమెకు తిలోదకాలు ఇస్తూనే ఇలా ప్రతిజ్ఞ చేశాడు.

"నేనిక జన్మలో మరోస్త్రీని వివాహం ఆడను. సత్యంగా చెబుతున్నాను."

అది మొదలు కువలయాశ్వుడు స్త్రీ భోగాలకి దూరంగా ఉండిపోయాడు.

తండ్రీ! అతనికి మనం ఏమిచ్చినా సంతోషం కలగదు. మదాలసను తీసుకొచ్చి ఇవ్వగలిగితేనే అతను సంతోషిస్తాడు. అది మనకు శక్యం కాదుకదా." అన్నారు కొడుకులు.

"పుత్రులారా! అశక్యమని ప్రయత్నింపకుండా వదిలెయ్య కూడదు. తపస్సుకు సాధ్యం కాని దేమీ కాదు. నేను అందుకు

ప్రయత్నిస్తాను." అంటూ అప్పుడే బయలుదేరి హిమవత్పర్వత ప్రాంతంలో సరస్వతీదేవి గురించి తపస్సు చేశాడు.

సరస్వతీదేవి అతని భక్తి విశ్వాసాలకి సంతోషించి – "ఏం వరం కావాలి? కోరుకో." అంది.

అప్పుడతను – "దేవీ! నాకు కంబళుడనే మిత్రుడు ఉన్నాడు. మా ఇద్దరికీ సంగీతం విద్య అంతా వచ్చేటట్లు అనుగ్రహించు." అని కోరాడు.

అతని స్తోత్రానికి సంతోషించిన సరస్వతి "గానకళలో మిమ్మల్ని మించిన వారు ఉండరు. మీ గానం వీనులవిందుగా ఉంటుంది." అని వరమిచ్చింది.

సరస్వతీదేవి అనుగ్రహంతో అశ్వతరుడూ, కంబళుడూ మనోహరంగా పాడుకుంటూ ఒకనాడు కైలాసానికి వెళ్ళి భవానీ శంకరులు వనవిహారం చేస్తున్న సమయంలో వారికి అత్యంత సంతోషం కలిగించేలా పాడారు. శంకరుడు వారి సంగీతం మెచ్చుకుని – "మీకేం కావాలో కోరుకోండి." అన్నాడు. అశ్వతరుడు అతనికి మొక్కుతూ – "మహాత్మా! మదాలస అనే గంధర్వపుత్రిక భర్త అసత్య మరణవార్త విని మరణించింది. ఆమెను నాకు పుత్రికగా దయచెయ్యి. ఆమె మృతిచెందేటప్పటికి ఏ రూపంలో ఎలా ఉందో అలాగే ఉంటూ జాతిస్మరణ కలిగి ఉండాలి. ఇదే నా కోరిక." అన్నాడు. "అలాగే నువ్వు పితృపూజ చేసేటప్పుడు శుచిగా మధ్యపిండాన్ని భక్షించు. నీ పడగమధ్యనుంచి ఆమె యథారూపంలో ఉదయిస్తుంది." అన్నాడు శంకరుడు. మిత్రులిద్దరూ పాతాళ లోకానికి వెళ్ళిపోయారు.

ఆ రహస్యం ఎవరికీ చెప్పక పితరుల నారాధించి, మధ్యపిండం తిన్నాడు. అతని ఊపిరినుంచి మదాలస ఉద్భవించింది. అది చెప్పకుండా – "పుత్రులారా! ఆ రాజపుత్రుడి నొకసారి మననగరానికి తీసుకురండి. అతని అభీష్టం నెరవేర్చుతాను." అన్నాడు అశ్వతరుడు.

మర్నాడు వాళ్ళు రాజధానికి వెళ్ళి కువలయాశ్వుడితో ఆటలాడి మిత్రమా! ఎన్నాళ్ళ నుంచో మేము మీ యింటికి వచ్చి ఆడుతున్నాం.

నువ్వు ఒక్కసారీ మా యింటికి రాలేదు. ఇవాళ తప్పకుండా రావాలి." అని కోరగా -

అతను - "మిత్రులారా! నా ఇల్లు మీ యిల్లు కాదా! నావన్నీ మీవే. నన్ను మీ యింటికి తీసుకుపోయి ఏమివ్వాలనుకుంటున్నారో అవి ఇక్కడే యివ్వండి. తీసుకుంటాను. మీరు నన్ను వేరుగా తలచవొద్దు." అన్నాడు.

వాళ్ళు కోపం నటిస్తూ - "రాజపుత్రా! నీపట్ల మాకు వేరు బుద్ధిలేదు. మా తండ్రి కువలయాశ్వుడిని తీసుకు వొస్తే చూడాలని ఉంది - అన్నాడు. అందుకే రమ్మంటున్నాం." అన్నారు.

"ఆమహాత్ముడే నన్ను చూడాలని కోరారా? ఆ మాట చెప్పారు కారేం? పదండి." అంటూ వారితో బయలు దేరాడు. వాళ్ళు అతని చెయ్యి పట్టుకుని గోతిలో మునిగి పాతాళలోకానికి తీసుకెళ్ళారు. అక్కడ వారివేషాలు మారాయి. పడగలలో మణులతో ప్రకాశిస్తున్న వారిని చూసి - "మీరూపాలు ఇలా మారాయేం? మీరు నాగకుమారులా? బ్రాహ్మణులు కారా?" అని అతను ఆశ్చర్యపోయాడు. అప్పుడు వారు తమ వృత్తాంతం చెప్పారు. కువలయాశ్వుడు సంతోషించి పాతాళ లోకవిశేషాలన్నీ చూస్తూ నడవసాగాడు. వివిధ వయసులలోని నాగకన్యలు క్రీడిస్తున్నారు. మనోజ్ఞమైనగానం వినవస్తూంది. అవన్నీ చూస్తూ వారు అశ్వతరుడు ఉండే ఇంటికి వెళ్ళారు. వాళ్ళు అతనికి తమ తండ్రిని పరిచయం చేశారు.

ఆ ఐశ్వర్య విశేషాలన్నీ చూస్తూ రాజపుత్రుడు ఆశ్చర్యంలో మునిగిపోయి ఎందుకు వచ్చాడో మరచిపోయి ఆ నాగేంద్రుడి పాదాలకు నమస్కరించాడు. అశ్వతరుడు అతన్ని కౌగలించుకుని ఆశీర్వదించి - "వత్సా! రాజపుత్రా! నా పుత్రుల ద్వారా నీ చరిత్ర విన్నాను నీ సుగుణాలని వాళ్ళు ఎంతగానో పొగుడుతూంటారు. గుణవంతులు జన్మవైరులను కూడా మిత్రులుగా చూడగలరు." అంటూ అతనికి ఇష్టమైన సత్కారం చెయ్యవలసిందిగా కొడుకులకి చెప్పాడు.

రాజపుత్రుడు వద్దంటున్నా మానవ లోకంలో దొరకని వస్తువులని తెచ్చి అతనికి విందులు చేశారు. తనకి ఇష్టంలేకపోయినా అతను అవన్నీ అంగీకరించాడు.

ఒకనాడు వినోదాలతో కాలక్షేపం చేస్తుంటే -

**అశ్వతరుడు** : రాజపుత్రా! నేను నీకు తండ్రివంటి వాడిని. చాలా కాలానికి ఇంటికి వచ్చావు. మా ఇంట్లో ఉన్న ధన, కనక, వస్తు వాహనాలలో నీకేది కావాలో తీసుకో.

**రాజపుత్రుడు** : మహాత్మా! నేను తండ్రి చాటువాడిని. మీరు ఈ పాతాళాన్ని పాలిస్తున్నట్లే మా తండ్రి భూలోకాన్ని వెయ్యేళ్ళ నుంచీ పాలిస్తున్నాడు. మా ఇంట్లో అన్నీ ఉన్నాయి. ఉన్నప్పుడు ఇమ్మని అడగడానికి నోరెలా వొస్తుంది? మీపాద దర్శనం అయ్యింది. అంతకంటే నాకు కావలసిందేమీలేదు.

**అశ్వతరుడు** : రత్నాలూ మొదలైనవి ఇష్టం లేకపోతే పోనీ. నీకు అత్యంత ప్రియమైనది అడుగు. ఇస్తాను

**రాజపుత్రుడు** : పన్నగేంద్రా! నాకు ఏ కోరికా లేదు. పుణ్యకర్మ సంస్కారం నన్ను వదలకుండా ఆశీర్వదించండి.

**అశ్వతరుడు** : నిజమే. సంపదలు పుణ్యఫలాలే. నీ బుద్ధి ఎప్పుడూ ధర్మాన్ని ఆశ్రయించి ఉండాలని అనుగ్రహించాను. ఐనా నువ్వు మా యింటికి వచ్చి మానవలోకంలో దుర్లభమైనదే అయినా తీసుకువెళ్ళకుండా వెళ్ళడం బాగుండదు. నువ్వు పొందలేనిది ఏదయినా అడుగు. ఇస్తాను.

**రాజపుత్రుడు** : (వినమ్రంగా నాగపుత్రుల ముఖం చూశాడు)

**నాగకుమారులు** : తండ్రీ! ఇతని కోరిక మీరు తీర్చదలచుకుంటే మేము చెబుతాము వినండి. ఇతని ప్రియురాలు మదాలస. ఇతని అసత్య మరణవార్త విని ప్రాణాలు వదిలింది. ఆమెను తీసుకువస్తే ఇతనికి సంతోషం. మరేదీ ఇతనికి ఆనందం కలిగించదు.

**అశ్వతరుడు** : బిడ్డలారా! చనిపోయిన వారిని ఎవరేనా తీసుకు రాగలరా? స్వప్నంలో కనపడేటట్లు చేయగలను. మాయామదాలసని చూపమంటే చూపుతాను. నాకు అలాటి ప్రజ్ఞ ఉంది.

**రాజపుత్రుడు** : (సిగ్గుపడుతూ, నా మదాలసని అలా చూడగలిగినా నాకు సంతోషమే చూపండి.

అశ్వతరుడు : సరే. వత్సా! నీ కోరిక తీరుస్తాను. మాయామదాలసని చూబిస్తాను. (అంటూ ఏవో మంత్రాలు చదివి) పుత్రులారా! లోపలికి వెళ్ళి మదాలసని తీసుకురండి (వాళ్ళు వెళ్ళి తీసుకు వచ్చారు.) ఈమె నీ భార్య మదాలస ఔనా, కాదా? రాజకుమారుడు ఆమెను చూసి మోహం ఆపుకోలేక సిగ్గు విడచి – "హా! ప్రేయసీ!" అంటూ దుఃఖిస్తూ ఆమెను కౌగలించుకో బోయాడు. నాగేంద్రుడు – "ఆ..రాజపుత్రా! ముట్టుకోకు. ఇది మాయామదాలస అని చెప్పలేదా? ముట్టుకుంటే మాయమై పోతుంది?" అని వారించాడు. కువలయాశ్వుడు ఆమెని చూస్తూ ఏడవసాగాడు.

'ఆహా! ఈ రాజపుత్రుడికి నాయందే మోహం ఉంది. ఈ పన్నగేంద్రుడు నన్ను మాయామదాలస అని చూపాడు. లోకం అంతా మాయకాక మరేముంది?' అనుకుంటుంది మదాలస.

నాగేంద్రుడు అతన్ని లేవనెత్తి – "రాజపుత్రా! ఈమె మాయా మదాలస అని తెలిసికూడా ఇంత మోహం చెందుతున్నా వేమిటి? నిజమైన మదాలస వస్తే మరెంత సంతోషిస్తావో." అన్నాడు.

"నాకు అంత భాగ్యమా! ఈ జన్మకి ఇక లేదు." అంటూ ఆమె ముఖమే చూడసాగాడు

"మాయని ఉపసంహరించేదా?" అడిగాడు అశ్వతరుడు.

"నా మోహం తీరడంలేదు. మరికొంత సేపు నిలుపవా?" అని ప్రార్థించాడు రాజపుత్రుడు.

"చూడు చూడు. రెండు గడియలు ఆపగలను."

"మహాత్మా! నీ ఆతిథ్యానికి ఎంతో సంతోషిస్తున్నాను. ఈమే చేత ఒక్కమాట మాట్లాడించవా, నీ పాదాలు పట్టుకుంటాను." బతిమాలాడు రాజపుత్రుడు.

నాగేంద్రుడు నవ్వుతూ– "ముట్టుకోకుండా మాట్లాడు. అనుమతి ఇస్తున్నాను" అన్నాడు

అతనామె దగ్గరగా వెళ్ళి – "ప్రేయసీ! ఒక్కమాట ఆడు. నా వేపు చూడక కళ్ళు మూసుకుంటా వేం? ఆ..తెలిసింది. నన్ను కృతఘ్నుడిగా

తలుస్తున్నావు కదూ? నా అసత్య మరణం విని నువ్వు మృతి చెందావు. నీ సత్యమరణం వినికూడా నేను దేహం వదలలేదు. కృతఘ్నుడినే మరి." అని – "నాగేంద్రా! నా ప్రియురాలు నాతో మాట్లాడింది కాదు. నేనేం చేసేది. ఇక మాయని ఉపసంహరిస్తావు కాబోలు. అయ్యో! విరహం ఎలా భరించేది. మాయామదాలసని చూశాక నా విచారం పెరిగింది కాని తగ్గలేదు –" అంటూ విచారించసాగాడు.

నాగేంద్రుడు అతన్ని లేవనెత్తి – "రాజపుత్రా! అన్నీ తెలిసిన నువ్వే ఇలా పరితపిస్తావేం? విను. నీ పరితాపం నాపుత్రులద్వారా విని తపస్సు చేసి మహేశ్వరుడి వరం వలన ఈమెను పుత్రికగా పొందాను. నువ్వింక చింతింపకు. ఇది మాయామదాలస కాదు. నీ భార్యే." అంటూ ఆ వృత్తాంతం అంతా చెప్పాడు.

అది విని అతను అమృతం తాగినంత ఆనందంతో ఆమె చెయ్యి పట్టుకుని – "నేను ఇంత పరితపిస్తూంటే నిజం చెప్పకుండా ఊరుకుంటావా!" అంటూ ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాడు. నాగకాంతలు వచ్చి ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపోయారు. అతను – "నాగేంద్రా! పరోపకారి అని నిన్నే అనాలి. నా ముఖం చూడలేదు. మీ పుత్రులు చెప్పడంతోటే పెద్దప్రయత్నం చేసి నా దుఃఖం అంతా పోగొట్టావు. ఎన్ని జన్మలెత్తినా నీరుణం తీర్చుకోలేను." అని స్తుతించి అతని అనుమతిపొంది, భార్యతో భూలోకానికి వచ్చి తల్లితండ్రులకి మొక్కి జరిగినదంతా చెప్పాడు.

అతని తల్లితండ్రులు కోడలిని కౌగలించుకుని చాలా సంతోషించి కొడుకును అభినందించి ఉత్సవాలు జరిపారు. కువలయాశ్వుడు భార్యతో సుఖంగా గడపసాగాడు.

కొంతకాలానికి శత్రుజిత్తు పరమపదించగా ప్రధానులు కువలయాశ్వుడిని రాజుగా చేశారు. మదాలస మగబిడ్డను కనగా అతనికి విక్రాంతు అని పేరు పెట్టారు. మదాలస వాడిని బంగారు ఊయలలో పడుకోబెట్టి "తాతా! నువ్వు కేవలం పరమాత్మవి. కల్పనగా నీకీపేరు పెట్టబడింది. పంచభూతాల ఈ దేహం నువ్వుకావు. ఎందుకు ఏడుస్తావు. నీ గుణాలన్నీ వికల్పాలు. అన్నపానాలతో ఇంద్రియాలు ఎదుగుతాయి

కాని నీకు వృద్ధి క్షయాలు లేవు –" అంటూ నిత్యమూ వాడికి బోధిస్తూండేది. మరికొంత కాలాని కామె సుబాహుడిని కంది. అప్పుడూ ఆమె నవ్వింది. వాడికి కూడా తత్వోపదేశం చేసి వయసు రాగానే తపోవనానికి పంపింది.

మూడో సంతానానికి అరిమర్దనుడనీ పేరు పెట్టగా మళ్ళీ ఆమె నవ్వింది. నాలుగోకుమారుడికి పేరు పెట్టబోతూ – "ప్రేయసీ! నేను పేరు పెట్టిప్పుడల్లా నవ్వుతున్నావు. క్షత్రియులకి తగిన పేరులే పెట్టాను. దీనిగురించి ఎందుకు నవ్వావో చెప్పు. ఈ నాలుగోవాడికి ఏంపేరు పెడతావో చెప్పు. నేను కూడా నవ్వి పరిహాసం చేస్తాను." అన్నాడు కువలయాశ్వుడు. "మహారాజా! మీ ఆజ్ఞను శిరసావహిస్తాను. వీడికి అలర్కుడని పేరు పెడతాను." అంది మదాలస. అతను నవ్వుతూ – "అలర్కుడు అంటే అర్థమేమిటో చెప్పు." అన్నాడు. "నేను పెట్టిన పేరు సార్ధకమైనది కాదు. వ్యవహారిక నామానికి అర్థమేముంటుంది? మీరు పెట్టిన పేర్లు అపార్థాలు. క్రాంతి అంటే ఒక దేశం నుంచి మరోదేశం వెళ్ళడం అంతటానిండి ఉన్న మహేశ్వరుడు ఒక దేశంనుంచి మరోదేశం వెళ్ళడం ఏమిటి? ఆకారమేలేని మూర్తికి సుబాహుడనే పేరెలా సరిపోతుంది? మణులను గుచ్చిన సూత్రంలా అన్ని శరీరాలలో ఉండేదీ ఆ ఒక్కడే. అలాటప్పుడు శత్రువు లెవరు? మిత్రు లెవరు? కాబట్టి మీరుపెట్టిన మూడుపేర్లూ అర్థరహితాలయి వున్నాయి" అందామె. అతనామె వైదుష్యాన్ని ప్రశంసించాడు.

ఆమె జోలపాడుతూ తత్వంబోధించడం విని – 'వీడిని కూడా ముందరి ముగ్గురిలాగే సన్యాసిని చేస్తావేమిటి? ఒక్కడినయినా ఉండనివ్వవా? నా మాట వినాలనుకుంటే వీడికి రాజనీతి ఉపదేశించి కర్మమార్గం అనుసరించేలా చెయ్యి. గృహస్థుడు సర్వజనులకూ ఉపకారి. కాబట్టి నీకు ప్రీతి కలిగేటట్లు వీడికయినా రాజధర్మం చెప్పు." అన్నాడు కువలయాశ్వుడు. అప్పుడామె – "పుత్రా! నీ తండ్రికి సంతోషం కలగ చేసే కర్మల నాచరించు. మిత్రులకి ఉపకారం చెయ్యి. శత్రువుల పీచం అణచు. శత్రువులులేకుండా ఏకఛత్రంగా భూమిని పాలించు." అంటూ ఆ బిడ్డకి రోజూ బోధించసాగింది.

వాడు ఉపనయం అయ్యాక - "అమ్మా! ఆ ముష్మిక సుఖంకోసం నేనిప్పుడు ఏంచేయాలి?" అని అడిగాడు. అందుకామె - "పట్టాభిషిక్తుడివయింది మొదలు ప్రజలను ఆనందపరచాలి. వ్యసనాలకు దూరంగా ఉండాలి. శత్రుమర్మాలు తెలుసుకుంటూ ఉండాలి. బంధువులనయినా, రాజమిత్రులనయినా గుడ్డిగా నమ్మకూడదు." అంటూ రాజనీతి చెప్పింది.

తల్లి దగ్గర శిక్షణ పొందిన అల్కరుడు యౌవనంలో వివాహం చేసుకుని పుత్రులను కని యాగాలు చేసి పితృసేవ చేసేవాడు. ఋతుధ్వజుడు చాలాకాలం రాజ్యం చేసి వార్ధక్యంలో అతన్ని పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. మదాలస భర్తతో కలసి తపోవనం వెళ్తూ చివరిమాటగా - "వత్సా! ఈ ఉంగరం వేలిని ఉంచుకో. యుద్ధవల్లకాని, బంధువులవల్లకాని సమస్తమైన విత్తమూ నాశనమయ్యే విపత్తు సంభవించినప్పుడు ఉంగరాన్ని చితక్కొట్టి దానిలోని పత్రికలో ఉన్న సన్నని లిపితో ఉన్న శాసనం చదువుకుని దానిని అనుసరించు" అని వెళ్ళిపోయింది.

అలర్కుడు చాలాకాలం రాజ్యం చేశాడు. ధర్మార్థ కామాసక్తుడై విషయసుఖాలు అనుభవిస్తున్న అతనికి వాటిలో తృప్తీ తీరలేదు, వైరాగ్యమూ కలగలేదు. తపోవనంలో గడుపుతున్న సుబాహుడు సోదరుడి రాజ్యపాలన విధానం తెలుసుకుని అతను విషయ వాంఛలలో మునిగినందుకు చింతించి కాశీరాజు వద్దకు వెళ్ళి -

"దేవా! నేను కువలయాశ్వుడి పెద్ద కుమారుణ్ని. చిన్నతనంలోనే మతి చెడి దేశాంతరం వెళ్ళిపోయాను. నాకు రావలసిన రాజ్యం నాతమ్ముడు అలర్కుడు అనుభవిస్తున్నాడు. న్యాయంగా నాకు రావలసిన రాజ్యాన్ని నాకిప్పించండి." అని ప్రార్థించాడు. కాశీరాజు అతని వద్దకు దూతను పంపగా అల్కరుడు చిరునవ్వు నువ్వుతూ - "కాశీరాజుకి నేనంత తేలికగా కనిపిస్తున్నానా? నా అన్న వచ్చి మంచిగా అడిగితే నేను రాజ్యం ఇవ్వకపోయినా? అతనివద్ద కెందుకు వెళ్ళాలి? కాశీరాజుకి భయపడి రాజ్యం ఇచ్చే వాడికి కానని చెప్పు." అన్నాడు.

అది విని సుబాహుడు - "అభిమానం కల క్షత్రియుడు ఇతరులను దేహీ అని యాచించడు." అన్నాడు. కాశీ రాజు అలర్కుడి

మీద దండెత్తి అతన్ని ఓడించాడు-ఓటమికి చికాకు పడుతూ ...తల్లి మాటలు జ్ఞాపకం రావడంతో ఉంగరాన్ని చితక గొట్టి పత్రిక చదివాడు. దానిలో - "సర్వవిధాలా సంగము (జనులతో కలసి ఉండడం) విడవదగినది. అది వీలవకపోతే సత్పురుషులతో సంగం చేయడమే మందు ముక్తి. గురించి ప్రయత్నించు." అని ఉంది.

అది చూసి అల్కరుడు తిన్నగా దత్తాత్రేయుని ఆశ్రమానికి వెళ్ళి అతని పాదాలమీద పడి తన దుఃఖాన్ని పోగొట్టమని ప్రార్థించాడు. "నిముషంలో పోగొడతాను. అసలు ఆ దుఃఖం ఎందుకు కలిగిందో బాగా ఆలోచించి చెప్పు." అని నవ్వాడు. "నువ్వెవరివి? దుఃఖం ఎవరికి?" అని ప్రశ్నించిన దత్తాత్రేయుడి వలన అల్కరుడు ఆత్మవిచారంలో పడి ... తన అజ్ఞానానికి చింతించి ... సత్యం తెలుసుకుని - సంసారం మమత్వానికి మూలమని గ్రహించాడు. అతని మాటలతో వివేకమూ వైరాగ్యమూ కలిగి కాశీరాజువద్దకు వెళ్ళి - నేను రాజ్యాన్ని వదిలాను. నువ్వనుభవించినా సుబాహుడి కిచ్చినా నీ ఇష్టం." అన్నాడు.

"యుద్ధం చేయకుండానే రాజ్యం విడవడం క్షాత్ర ధర్మం కాదు కదా? పారిపోవడం తగునా?" అని అతను ఎత్తిపొడిచాడు. అల్కరుడు తనకి కలిగిన తత్వజ్ఞానాన్ని చెప్పాడు. తనకి శత్రువులే లేరన్నాడు.

కాశీరాజు సుబాహుడికి రాజ్యం ఇవ్వబోగా - అతను - "నరేంద్రా! నేనెందుకు నిన్ను శరణు వేడావో ఆ పని నెరవేరింది. మా తమ్ముడికి వైరాగ్యం కలగ జెయ్యాలనే నిన్ను ఆశ్రయించాను. అతను ఉత్తమమార్గం అవలంబించాడు." అనేసరికి కాశీరాజు అతన్ని ఎంగానో ప్రశంసించాడు. అలర్కుడు తపోవనానికి వెళ్ళిపోయాడు అని ఆ వృత్తాంతం అంతా వివరించి "మిత్రవింద మదాలస లాటిది." అనగా "ఆమె సుగుణంలో వెయ్యోవంతయినా నాకు లేదు." అందామె.

కొన్నాళ్ళుండి ఇక్కడికి ప్రయాణమయ్యాను. ఒకనాడు అవ్వ నాదగ్గరకు వచ్చి - "ఘోటకముఖా! నీ ముఖం చూసినప్పుడే నా మనవరాలిని నీకిప్పించాలని బుద్ధి పుట్టింది. అందుకే నీకు నా గుట్టు చూపాను. ఇక్కడికి తీసుకొచ్చాను. నా కూతురూ, అల్లుడూ కూడా ఇష్టంగా

ఉన్నారు పెళ్ళికూతురు నీ విద్యావైభవానికి ముచ్చట పడుతుంది. కనుక జాంబవతిని ధర్మపత్నిగా గ్రహించు. ఈ దీవికి అధిపతి వవుతావు. నీ అభిప్రాయం తెలుసుకురమ్మన్నాడు నా అల్లుడు " అంది.

జాంబవతిని చూసినప్పటినుంచీ నాహృదయం దానిమీదే లగ్నమయింది. మనసులోని ఆనందం బయట పడనివ్వకుండా - "అవ్వా! నువ్వు పెద్దదానివి. నా శ్రేయస్సు కోరుతున్నావు. నీమాట కాదనగలనా? నీ ఇష్టమే కానియ్" అనిశాను. ఆమె అల్లుడికి తెలియపరచగా అతను చాలా సంతోషించి శుభముహూర్తంలో ఆమెను నాకిచ్చి వివాహం జరిపించాడు. దివ్యభోగాలు అనుభవిస్తూ నేను కొన్ని రోజులు అక్కడున్నాను. మధ్యమధ్య చిత్రసేనా, రతిమంజరులని చూసి వచ్చేవాడిని. తమని మీవద్దకు తీసుకు పొమ్మని బతిమాలుతూండేవారు. వాళ్ళు అక్కడ ఉండగా జాంబవతికి సంగీత విశేషాలన్నీ చెప్పారు.

నేనొకనాడు రాజుతో చెప్పి వారిని వెంట బెట్టుకుని బయలు దేరాను. దేశవిశేషాలు చూస్తూ నిన్న రాత్రికి ఈ నగరంచేరుకుని సత్రంలో బస చేశాం. రాత్రే సత్రంలో మీపేర్లు వినపడ్డాయి ఉదయం బండి ఎక్కించి మీబస తెలుసుకుని వచ్చాం. ఇదే నా వృత్తాంతం." అని ముగించాడు ఘోటకముఖుడు.

"ఘోటకముఖుడు కూడా ప్రభువు స్థానం అలంకరిస్తాడు." అని మిత్రులు ఎంతగానో సంతోషించారు.

అప్పుడు కుచుమారుడు - "అవేళ నీతో వచ్చిన పురుషుడు భోజరాజు. భైరవుడి తంత్రంలో చిక్కుకున్నాడట. ఎలా బయటపడ్డాడో తెలియదు. వాడివల్ల కష్టాలు పడ్డానని మాత్రం చెప్పాడు. నారాయణుడిని కూడా మృగాన్ని చేసిన భైరవుడిప్పుడు ఇక్కడే ఉన్నాడు. రేపు వాడి మృగాల ఆట. వాడిని పరాభవిస్తాం." అన్నాడు.

అతను భోజుడనీ, అతని భార్యలీలావతి అక్కడే ఉందని విన్న ఘోటకముఖుడి ఆశ్చర్యానికీ, ఆనందానికీ హద్దులేదు వాళ్ళు ఒకరి కథలు ఒకరు చెప్పుకుంటూ ఆ రోజంతా ఆనందంగా గడిపారు.

అని చెప్పి ప్రయాణానికి బయలు దేరాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 165 వ మజిలీ

### మిత్ర సమ్మేళనం

విశాలమయిన పురమందిరం – భైరవుడి మృగాల ఆటకు నియమించబడింది. స్త్రీలు కోసం ప్రత్యేకంగా కట్టబడిన గదులలో మల్లిక, రత్నపదిక, సువర్ణపదిక మొదలయిన వారందరినీ కుచుమారుడు తీసుకు వచ్చాడు. రాజుభార్యలు, రుక్మిణి మొదలయిన అంతఃపుర స్త్రీలు కూడా వెళ్తారని విని చారుమతి తనుకూడా వస్తానని చిత్రసేనుణ్ని కోరింది. స్త్రీవేషంతో వాస్తే తండ్రికి తెలుస్తుందని, పురుషవేషం వేయించి ఆమెను ఆటకు తీసుకెళ్ళి ఒకమూలన కూర్చోబెట్టాడు.

సమయానికి భోజుడు కాళిదాసుతో రధం మీద వచ్చాడు. తనని చూసి చిరునవ్వు నవ్వుతున్న ఘోటకముఖుణ్ని చూసి – "ఓహో! వీ రెవరు? నా వెంట చిక్కులు పడుతూ దేశం తిరిగిన పరోపకారి ఘోటక ముఖులా! ఎప్పు డొచ్చారు? అంటూ అతన్ని కౌగలించుకున్నాడు.

"మీరు ఆపదలో ఉండగా వచ్చేసిన కృతఘ్నుడిని. ఆ పాపాత్ముడి చేతిలో నుంచి మీరు ఎలా తప్పించుకున్నారు?" అని అతనడిగాడు.

"ఇప్పుడేమీ మాట్లాడవద్దు. ఆ పాపాత్ముడు వీడే. వీడిని బంధించడం కోసమే ఈ ఆటపెట్టాం. అంతా తరవాత చెబుతాను. చూస్తూ ఉండండి." అన్నాడు భోజుడు.

రాజు భార్యలు ఎవరూ రాలేదు. రుక్మిణి రేవతితో వచ్చి లీలావతి పక్కన కూర్చుంది. చారుమతి వారికి కొంచెం దూరంలో కూర్చుంది. స్త్రీలకు, పురుషులు కనపడతారుకానీ, పురుషులకి స్త్రీలు

కనిపించని విధంగా ఉంది సభలోని ఆసనాల ఏర్పాటు. లీలావతి భర్తనీ, కాళిదాసునీ చూసి నమస్కరిస్తూ - "ఆ మహానుభావుల సేవచేసి ఎంతకాలం అయిందో! మళ్ళీ నాకు ఆభాగ్యం పడుతుందా?"

*సరస్వతి* : దేవీ! ఘోటకముఖుడు మిమ్మల్ని ఇవాళ తప్పకుండా భర్తతో కూర్చుతానని చెప్పాడు, మరచి పోయానా? మీ కోసం వారు పడిన శ్రమ మరచిపోయావా? విచారించకు ఇవాళ మీరు భర్తని కలుస్తారు.

*మదయంతి* : అక్కా! సరస్వతీ! అతనే కాళిదాస మహాకవి. వారి దర్శనంతో ధన్యులం అయ్యాం.

*సరస్వతి* : భోజరాజు, కాళిదాసులు ఇద్దరూ దైవసమానులు. నా వివాహం తగవులో రాజుగారుకూడా ఉన్నారట.

*రత్నపదిక* : మమ్మల్ని చూడకుండానే మా చరిత్ర అంతటినీ రచించిన రహస్యవేది కాళిదాసు అతడే! అయ్యో! నా భర్త వారి దర్శనం చెయ్యాలని ఎంతో కుతూహలపడేవారు. వారెక్కడున్నారో? ఏం జరుగుతుందో?

*సువర్ణపదిక* : ఈ ప్రయత్నం అంతా అందుకే కదా? సంతోష సమయం వస్తుంది. విచారించకండి.

*సరస్వతి* : మన పండితుల దండితనం విన్నారా? మొన్నటి సభలో కాళిదాసుతో ప్రసంగిస్తామని కాలు దువ్వారట.

*మదయంతి* : అది 'యౌవన మదం.

*మల్లిక* : ప్రసంగిస్తే ఎవరు గెలుస్తారో?

*లీలావతి* : మీభర్త లెంత దిట్టలయినా విద్యామహిమలో అతనికి సాటిరా రనుకుంటాను.

*రత్నపదిక* : ముల్లోకాలలోనూ అతనికి సాటిరాగలవారు ఉండరు. ఎంత రహస్యమైన విషయమిచ్చినా యధార్థం తెలిసేటట్లు పూర్తి చేస్తారు. మా మనసులలోని అభిప్రాయాలు లోని కూడా చూసినట్లు వర్ణించారు.

*రుక్మిణి* : అదే ఆ కవీంద్రుడిలోని విశేషం.

*సరస్వతి* : అది దైవశక్తి. పాండిత్య ప్రగల్భం కాదు.

రుక్మిణి : రేవతీ! మా అన్న పండితులతో కలసి కూర్చోక మూలగా కూర్చున్నాడేం?

రేవతి : ఏమో మీ తండ్రిగారంటే భయం కదా

రుక్మిణి : అతని పక్కన కూర్చున్న పురుషుడు మనం ఎరిగిన వాడిలా అనిపిస్తున్నాడు చూడు.

రేవతి : ఔను. అతనే నీ హృదయ చోరుడు.

రుక్మిణి : ఈ ఆటముగిసేలోగా అతనివద్దకు వెళ్ళి అతని వృత్తాంతం తెలుసుకు రావాలి.

రేవతి : అలాగే, గంట మోగుతోంది. మృగముల వాడు ప్రవేశిస్తాడు కాబోలు.

మల్లిక : అడుగో! చేతులకి గంటలు కట్టుకొస్తున్నాడు! వాడిని నేను ఆనాడు చూశాను. క్రూరాత్ముడా! నా తల్లితండ్రులని ఏ మృగాలు గాచేశావో చెప్పరా ...

రత్నపదిక : ఆ మృగాలు వాడివెంట ఆవుదూడల్లా వస్తున్నాయి. అవి వాడిని కరవవు కాబోలు. చంపవు కాబోలు.

మల్లిక : చంపితే వాడి గొప్పేముంది? చూడు ... బెత్తం పట్టుకుని వాటిని ఎలా ఆడిస్తున్నాడో.

సరస్వతి : కుచుమారుడి ముందు వీడి ఆటలు సాగవు.

రత్నపదిక : నీ భర్తదయవల్ల మావారు బంధవిముక్తులైతే చాలా సంతోషిస్తాం.

మదయంతి : అక్కా! నీ భర్తగారి మెడలో తెల్లగా మెరుస్తూందే.. అదేమిటి?

సరస్వతి : అదే ఆ సిద్ధుడి అస్తిమాల. దానివల్లనే ఎన్నో చమత్కారాలు జరుగుతాయి చూడండి.

మదయంతి : ఆ సింహం చూడండి. ఏనుగు మీద ఎక్కి ఎలా ఆడుతూందో! ఎంత చిత్రం.

సరస్వతి : అదిగో! కుచుమారులు లేస్తున్నారు. ఇక భైరవుడి పని సరి.

ఆట కొంత సాగాక కుచుమారుడు లేచి ఆ మృగాల దగ్గరకి వెళ్ళి అస్థిమాలని చేతిలో పట్టుకుని – హుంకరించాడు. అప్పుడు అవన్నీ వినయంగా అతనివద్దకు వచ్చి నిలబడ్డాయి. భైరవుడు చేతిలోని బెత్తం చూపిస్తూ ఒక భల్లూకాన్ని పిలిచినా అది వెళ్ళింది కాదు. దానిని వాడు ఒకదెబ్బ కొట్టేసరికి అది వాడిమీదపడి రక్కింది. అంతలో కుచుమారుడు పిలిచేసరికి అతని దగ్గరకి పోయి నిలుచుంది. భైరవుడు పులిని బెదిరించబోతే అది కూడా గాండ్రు మంటూ వాడిని కరవ బోయింది. అలాగ మృగాలన్నీ తిరగబడే సరికి వాడు భయపడుతూ పారిపోబోయాడు కాని మృగాలే చుట్టు ముట్టడం వల్ల తప్పించుకునే దారి లేకపోయింది క్రూరమృగాలే కాక గుర్రాలు కూడా వాడిని తన్నసాగాయి.

వాడు చెయ్యెత్తి "మహారాజా! ఇతనెవరో ప్రయోగం చేశాడు. మృగాలు మాట వినడంలేదు. నేనేం చేయగలను? నన్ను ఇవే భక్షించేటట్లున్నాయి. రక్షించండి." అని ప్రార్థించాడు.

చారాయణుడు వాడి దగ్గరకి పోయి – "ఓరీ! భైరవా! నన్ను ఎప్పుడేనా చూశావా? ముఖం చూసి చెప్పు." అని అడిగాడు. వాడు వొణుకుతూ – "నాకేమీ జ్ఞాపకం లేదు." అన్నాడు.

"అనాడు సిద్ధుడి తలని రాయితో పగల గొట్టడం అయినా జ్ఞాపకం ఉందా?"

"చాలుచాలు నన్నెవరో అనుకుని భ్రమపడుతున్నావు." అని గద్దించాడు.

"నిన్ను నే నెరుగుదును. నువ్వు గురువుని చంపిన మహాపాపాత్ముడు భైరవుడివి. నీ ముఖం చూస్తేనే మహాపాపం." అని అతను నిందిస్తూంటే, ఘోటకముఖుడు వచ్చి – "ద్రోహీ! ఆవేళ స్త్రీని చెరపట్టావు. అది జ్ఞాపకం ఉందా?" అని నిందించాడు.

అలా తలొకరూ తలోమాటా ఆడుతూ తిడుతూంటే వాడికి ఏం చెయ్యాలో తోచక – "ఇదుగో వస్తున్నాను." అంటూ ఒక మూలకి పోబోతే కోతులు అడ్డం పడ్డాయి. కుక్కలు తరిమాయి. గుర్రాలు తన్నాయి. వాడు అటూ యిటూ పరుగెడుతూంటే ప్రేక్షకులు నవ్వసాగారు.

కుచుమారుడు వాడి తలని కాలితో తంతూ – "గురుద్రోహీ! పరమతపోనిధి అయిన సిద్ధుడిని పరిమార్చి ఏం మూటకట్టుకున్నావ్? యముడు నీకోసం కొత్తనరకం కట్టిస్తున్నాడు. పద. నువ్వింక ఈ భూమి మీద ఉండతగిన వాడివి కావు. ఈ మృగాలన్నీ ఎవరో నిజం చెప్పావో సరే, లేకపోతే వీటిచేతనే నీ పని పట్టిస్తాను." అంటూంటే వాడు జీవచ్ఛవంలా పడుండి పోయాడు. అప్పుడు వాడి చేతులకీ, కాళ్ళకీ సంకెళ్ళు వేయించి మృగాలన్నిటినీ పరిశీలిస్తూ వాటి మెడలలో కట్టబడిన తాయెత్తులని లాగిపారేస్తూంటే వాటిలో కొన్ని పురుషులూ..కొన్ని స్త్రీలూ ఐ నిలుచని – "అంబా! తాతా! అక్కా! అన్నా!" అంటూ ఆక్రోశించి సాగారు.

వారిలో ఉన్న యక్షుడు నాలుగు మూలలా చూసి దీపాలకు ఆశ్చర్యపోతూ మాయ అనుకుంటూంటే సువర్ణనాభుడు అతన్ని సమీపించి– "మహాత్మా! నన్నెరుగుదువా? సువర్ణపదిక భర్తని. మావదిన కూడా ఇక్కడే ఉంది." అంటూ కౌగలించుకున్నాడు. "ఇది భోజరాజుగారి సభ. అతనే కాళిదాసు ... మహారాజు. వీడు భైరవుడు. బంధించబడ్డాడు." అని చెప్పాడు. యక్షుడు, భోజరాజు కాళిదాసులకి చేతులెత్తి నమస్కరించాడు. భైరవుడిని బంధించడం లోకోపకారం. మల్లిక తల్లి తండ్రులు వచ్చారా?" అని అతనడిగేసరికి బ్రహ్మదత్తుడూ అతని భార్యావచ్చి తమ కథ చెప్పారు. "మల్లిక కూడా ఇక్కడే ఉంది" అని చెప్పేసరికి వాళ్ళు చాలా సంతోషించి తమను భోజుడికి ఎరిగించి భైరవుడు చేసిన అపకారం చెప్పారు.

భైరవుడి చేత వంచించబడిన వారందరినీ భోజుడు ఆదరించి పీఠాలమీద కూర్చోబెట్టి వారి వృత్తాంతాలు తెలుసుకున్నాడు. మృగాల ఆటకంటే వారి మాటలే సభ్యులకి ఎక్కువ సంతోషం కలగజేశాయి. సువర్ణనాభుడు యక్షుడిని చూపించి – "ఇతడే మనకు పరమ ఉపకారి. మనందరికీ గౌరవనీయుడు. కాళిదాసకవి ఈ దంపతుల కథనే మేఘసందేశంగా రచించాడు." అని తెలియజేశాడు. భోజుడు అతనిని ఎంతో గౌరవించి – ఘోటకముఖుడితో – "వీరిలో లీలావతి లేదేం?" అని అడిగాడు. అతను నవ్వుతూ – "యక్షుఢు లీలావతిని ముందే

రక్షించాడు. ఆమె మా యింట్లో మిత్రులదగ్గర ఉంది. మీ అభిమతం తెలుసుకోవాలని ఎదురు చూస్తున్నారు." అంటూ ఆ కథ చెప్పాడు.

అప్పుడు భోజుడు యక్షుణ్ని కౌగలించుకుని – "మహాత్మా! నువ్వు మానవాతీతుడివి. మాతో కలసి మెలసి తిరుగుతూ మహోపకారం చేశావు. నీకు ఎప్పుడూ కృతజ్ఞులమై ఉంటాము. నీదయే లేకపోతే చారాయణుడు భైరవుడికి భోజనం అయ్యేవాడే." అని పొగిడాడు.

అందుకు యక్షుడు – "మహారాజా! మిమ్మల్ని చూడాలని మేమెంతో ఉత్సాహపడే వాళ్ళం. కాళిదాసు రచించిన మేఘసందేశం విన్నప్పటినుంచీ నాకు వారియందు అత్యంత భక్తివిశ్వాసాలు కలిగాయి. దైవికంగా దత్తుడు మా యింటికి రాబట్టి ఇందరిని చూసే భాగ్యం కలిగింది." అనగా – భోజుడు "అతనే కాళిదాస మహాకవి. ఏమీ ఎరగనట్లు అక్కడ కూర్చున్నాడు." అన్నాడు. యక్షుడు వెళ్ళి అతని పాదాలమీద పడి స్తుతించాడు.

ఆ సందడిలో గోణికాపుత్రుడు చిత్రసేనుడి వద్ద పురుషవేషంలో ఉన్న చారుమతిని చూసి – "ఇదిగో మనదత్తుడు. అనికేక పెట్టాడు. అందరూ అక్కడికి వచ్చి – "మిత్రమా! మాట్లాడవేం! రహస్యంగా ఇక్కడ కూర్చున్నావేం?" అని అడుగుతూంటే అతను ఎవరికీ ఏమీ చెప్పక రాజపుత్రుడి మరుగున చేరాడు.

అప్పుడు సువర్ణనాభుడు – "పోలిక అలా ఉన్న వీడు దత్తుడు కాదు. దత్తుడు స్త్రీ రూపంలో ఉంటాడు. యక్షుని శాపం మరచిపోయాను. అతన్ని పట్టుకోవాలి " అంటూ యక్షుడి దగ్గరకు వెళ్ళి – "మహాత్మా! నీవల్ల మాకు అనేక ఉపకారాలు జరిగాయి. దత్తుణ్ని పురుషుడిగా చెయ్యవా? ఎక్కడున్నాడో చెప్పవా?" అంటూ అడిగాడు.

యక్షుడు – "మమ్మల్ని చూడకుండానే మా చరిత్ర రాసిన మహానుభావుడు కాళిదాసు చెంతనుండగా దత్తుడు ఎక్కడున్నాడో నేను చెప్పాలా? అతనే చెబుతాడు." అని ప్రార్థించడంతో కాళిదాసు ముసి ముసి నవ్వులు నవ్వుతూ – "మన్మధుడిని పోలిన దత్తకుడు భోజరాజ

పుత్రికకు గర్భం చేసి, యక్షుడి శాపంవల్ల స్త్రీ అయి చిత్రసేనుడికి భార్యగా ఉన్నాడు." అని అర్థం వచ్చే ఈ శ్లోకం చదివాడు.

శ్లో॥ దత్తకో పుత్రికా గర్భదత్తకో చిత్తజోపమః
యక్షశాపాభి భూతస్తే జామతైవ స్నుషాభవత్

"అందువల్ల అల్లుడే కోడలయ్యాడు అని సమస్య పూర్తిచేశాడు.

ఆ శ్లోకం భోజుడితో సహా అందరూ అర్థంకానట్లు చూస్తూంటే గోణికాపుత్రుడు ఆనందంగా, పెద్ద కంఠంతో – "తెలిసింది. రహస్యం తెలిసింది. మనం చూసినవాడు దత్తుడే. స్త్రీరూపంలో ఉన్నా పురుష వేషం ధరించి చిత్రసేనుడితో వచ్చాడు. శాపగ్రస్తుడవడం వల్ల పూర్వస్మృతిలేదు." అన్నాడు. రాజపుత్రుడి వెనుకనున్న చారుమతిని పట్టుకుని యక్షుడి వద్దకు తీసుకొచ్చి – "వీడే మా మిత్రుడు. నీశాపం వల్ల ఇలా ఉన్నాడు. శాపవిమోచనం కావించు." అని ప్రార్థించాడు.

యక్షుడు ఒక శ్లోకం చదవగా – అదేవేషమూ, అదే రూపంలో భ్రమనుండి బయటపడి నిజరూపమూ, విద్యాపాటవాలూ బయటపడగా – "ఓహో! నా మిత్రులంతా ఇక్కడే ఉన్నారు! ఎప్పుడొచ్చారు? నేను ఇంతవరకూ నిద్ర పోతున్నాను కాబోలు. ఏమీ జ్ఞాపకం లేదే!" అన్నాడు దత్తుడు. మిత్రులందరూ అతన్ని కౌగలించుకుని – "నీ వృత్తాంతం చాలా ఉంది. తరువాత చెబుతాం. ఈ యక్షుడూ, కాళిదాసు వల్ల ఆపద దాటావు." అన్నారు.

తెరలోనుంచి తల్లితండ్రులని చూసిన మల్లిక నిలవలేక – "అమ్మా! తండ్రీ!" అంటూ బయటకు రాబోయింది. యక్షపత్ని భర్తని చూసి ఆగలేక పోయింది. కాని – సరస్వతి వారిని వారించింది.

రుక్మిణి లీలావతితో – "అమ్మా! అతడే నాభర్త. ఎంత వెదికించానో! ఇక్కడికి ఎలా వచ్చారో తెలియదు." అంది. ఆ విశేషాలన్నీ చూస్తూండ బట్టి లీలావతి – "పుత్రీ! నీ అదృష్టం ఫలించింది. నీ భర్త దత్తకుడు యక్షుడి శాపంతో ఆడదై నీతో స్నేహంచేశాడు. సంవత్సరం తరవాత పురుషుడయ్యాడు. యక్షుల వృత్తాంతం సువర్ణపదికకి చెప్పడంతో

మళ్ళీ స్త్రీ ఐపోయాడు. మీ అన్న ఆమెని స్వీకరించాడు. ఇప్పుడు కాళిదాసు అదే శ్లోకం చదివాడు. నువ్వు వినలేదు. నీ దృష్టి ఈ దత్తుడి మీద ఉంది. గోణికాపుత్రుడు కపటదత్తుణ్ని తీసుకెళ్ళి యక్షుడిచేత శాపవిమోచనం చేయించగా దత్తుడయ్యాడు. ఇదే వీని రహస్యం." అంది.

"అమ్మో! నా రహస్యం సభలో వెల్లడయిందా! తండ్రిగారు ఏమన్నారు? సభ్యులు పరిహసించారా?" అని రుక్మిణి భయపడగా - "నువ్వు చేసిన తప్పేమీ లేదు. నిజం తెలిసి వారే సమాధానపడతారు." అని లీలావతి ఆమెను ఓదార్చింది. భోజుడు వారి చరిత్రలన్నీ గౌరవించి విడిమలకి పంపి తాను కాళిదాసుతో పండితకవుల వెంట వారినివాసానికి వెళ్ళాడు. భైరవుణ్ని రాజభటులు కారాగారంలో పెట్టారు.

భోజరాజు ఆ చావడిలో పండితులతో అంతరంగిక సభ చేసి - "మహాత్ములారా! ఇక్కడున్నవారు జగత్పండితులు. యక్షుడు దేవతామూర్తి. ఇలాటి వారి ముందు నిజం చెబితే నేను చేసి పాపం పోతుంది. వినండి. ఈ కవి సార్వభౌముడు కాళిదాసు నా ప్రాణం అయినా దుర్మార్గులు పన్నిన కపటవ్యూహంలో చిక్కి నిష్కారణంగా పొమ్మన్నాను. ఆ అనుమానం వల్లనే మహాసాధ్వి లీలావతిని అడవులపాలు చేశాను. ఆ పాపం అనుభవిస్తూ, స్థానభ్రష్టుడినై దేశాలు పట్టాను. భైరవుడి చేత మేకగా చేయబడ్డాను. చివరకు ఈ మహాత్ముడి వల్లే విముక్తి చెందాను. నా ప్రార్థనలు అంగీకరించి మళ్ళీ కాళిదాసు నా యింటికి వచ్చారు. నాకు లీలావతీ వియోగంతో పాటు రుక్మిణీ చిత్రసేనుల అసభ్యప్రవర్తనలు కూడా విచారం కల్గించాయి. ఆ చింతని కూడా ఇతనే తీర్చాడు. దత్తకుడు నాకు అల్లుడూ, కోడలూ అయ్యాడు, కదా. ఈ నాటకానికి యక్షుడే సూత్రధారుడు. దత్తుడు నాకు అల్లుడు. ఘోటకముఖుడు ప్రాణస్నేహితుడు. గోణిక్షాపుత్రుడు నా కొడుకు స్నేహితుడు. గోనర్దనీయ కుచుమారులు రాజ బంధువులు. సువర్ణనాభుడు దేవతుల్యుడు ఇంతకంటె ఏంభాగ్యం కావాలి? నా ప్రాణనాయికి లీలావతిని కూడా చూడగలిగితే ఇలాటి సుదినం మరొకటి ఉండదు నాకు." అంటూంటే -

"హా! ప్రాణనాథా! నేను ధన్యురాలిని." అంటూ ఆమె వచ్చి అతని పాదాలమీద పడింది. భోజు డామెను ఆదరించి తనతప్పు మన్నించమన్నాడు. అప్పుడు లీలావతి – ఒక పద్యం చదివింది."మీరు నన్ను ఇందరిలో మెచ్చుకోడం వల్ల ధన్యురాలినయ్యాను. ఈ పండితులు నాకు సోదరులై ఆదరించారు. యక్షకాంతలు తల్లులై మన్నించారు." అంటూ తన వృత్తాంతం తెలిపింది.

అంతలో రుక్మిణి వచ్చి తల్లి వెనక వారియింటికి పోయి భర్తకి మొక్కి, తండ్రికీ, పండితులకీ నమస్కరించి – ఏదో చెప్పబోయింది కాని సిగ్గుతో కంఠం పెగలలేదు. దత్తకుడి మొహం చూసింది. అతను లేచి – "మహారాజా! భగవంతుడి అఘటితఘటనా సామర్థ్యం వేరే చెప్పక్కర్లేదు. యక్షుడి శాపానికి దుఃఖిస్తూ పోతున్న నాకు ఈమె గుఱ్ఱం కళ్ళెం తెంచుకుని నా దగ్గరకు రావడం భగవంతుని ప్రేరణ. ఆ గుఱ్ఱం నన్ను ఈమె ఉద్యాన వనానికి తీసుకెళ్ళమని తోలేనా? నా విద్య విని ఈమె నన్ను తన అంతఃపురానికి తీసుకెళ్ళడం తప్పుకాదు. నీకుమారుడు నన్ను పరీక్షించాలని రావడమూ, నన్నతను మోహించడంతో అతన్ని మందలించడమూ, శాపాంతంలో నేను పురుషుడినికాగా నాశయ్యమీదే పురుండిన రుక్మిణి నన్ను వరించడమూ సమంజసమే." అంటూ రుక్మిణి నిరపరాధి అని వాళ్ళు అంగీకరించేలా ఉపన్యసించాడు.

భోజుడు పుత్రికని చేరదీసి – "నువ్వు ఇందుకు విచారించ క్కర్లేదు. అప్రయత్నంగానే జగత్తుచేత పూజించబడే పండితుడు నీకు భర్తగా లభించాడు. ఇది నీ అదృష్టం." అన్నాడు ప్రేమగా. రత్నపదిక వచ్చి యక్షుడికి మొక్కింది. మల్లిక వచ్చి తల్లితండ్రులని కౌగలించుకుని తనకి యక్షదంపతులు చేసిన ఆదరాన్ని చెప్పింది

అప్పుడు రతిమంజరి, చిత్రసేనా వచ్చారు. గోణికాపుత్రుడు వాళ్ళ పడిన కష్టాలు వివరంగా చెప్పాడు. దత్తుడు – "ఓహో! నా బాల్యస్నేహితురాలు చిత్రసేన! నాకోసం ఎన్ని కష్టాలు పడ్డావు! ఎంత ఐశ్వర్యం వదిలివచ్చావు!" అంటూ ఆమెకు సంతోషం కలగజేశాడు.

భోజుడు వారందరి వృత్తాంతాలూ కనుక్కుని – "నేడు మహోత్సవదినం! వియోగం పొందిన వాళ్ళందరమూ కలుసుకున్నాం. ఇంతమంచి రోజు నాకు మరొకటి ఉండదు. మీరందరూ ఇక్కడుండి నాకు ఆనందం కలగ జెయ్యండి. గోనర్దీయ కుచుమారులు రాజ్యభారం వహిస్తున్నారు కనక వస్తూపోతూ ఉంటారు." అన్నాడు.

"మారాజ్యాలు మా ఒక్కరివే కావు. మేమేడుగురమూ పంచుకోవలసినవారమే. మీమూలంగానే మాకు ఈ ఐశ్వర్యం కలిగింది. మీరు మాకు ప్రభువు. మిత్రులు, దైవం." అన్నారు.

సభ ముగించి భోజుడు లీలావతిని అప్పుడే తన అంతఃపురానికి తీసుకువెళ్ళిపోయాడు. మర్నాడే దత్తకుడిని తన అల్లుడని ప్రకటించి భోజుడు వివాహ మహోత్సవం జరిపాడు. దత్తుడు చిత్రసేనని రెండో భార్యగా గ్రహించాడు. యక్షుడు రత్నపదికతో కొన్నాళ్ళక్కడ ఉండి వెళ్ళాడు.

భైరవుడి కేం శిక్ష విధించాలి? అని సభచేసి – అటువంటి పాపాత్ముడికి ఉరిశిక్షే తగినదని ఒకనాడు అతనిని ఊరేగించి ఉరితీశారు.

ఈ ఏడుగురు మిత్రులూ పాంచాలుడి చేత రచించబడిన కామశాస్త్రంలోని ఏడు అధ్యాయాలూ ఒకొక్కరు ఒక్కక్కటి ప్రత్యేకంగా రచించారు.

గోపాలా! అల్లుడే కోడలయ్యాడు – అని నువ్వు అడిగిన ప్రశ్నకు ఈ కథే సమాధానం." అన్నాడు మణిసిద్ధుడు.

గోపాలు డతనికి నమస్కరించి – "మంచికధ విన్నాను. తలవని తలంపుగా భోజకాళిదాసుల కథలు కూడా వచ్చాయి." అంటూ ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

8వ భాగం సమాప్తం

